# తెలుగు వ్యుత్పత్తికోశం

ఎనిమిదవ సంపుటం (శ-హ)

అనుబంధ సహితం


ప్రధాన సంపాదకుడు

ఆచార్య లకంసాని చక్రధరరావు

ఎమ్.ఏ., పిఎచ్.డి.





ఆంధ్ర విశ్వకళా పరిషన్ముద్రణం

వాల్తేరు, విశాఖపట్నం 530 003

# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (శ - హ)

అనుబంధ సహితం

## ఎనిమిదో సంపుటం

ప్రధాన సంపాదకులు

ఆచార్య లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

డాక్టర్ బాల అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ కందాళ కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ శ్రీపాద సీతామహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ సజ్జా మోహనరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ షేక్ విజయకుమార్, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ పాలడుగు సుమతీదేవి, ఎమ్.ఏ., పిఎచ్.డి.




1995

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్నం 530 003

1A

కాపీలు : 1,500 ఫిబ్రవరి, 1995



సిరీస్ నెం. 197

వెల : రూ. 150

ప్రతులకు :
డైరెక్టరు
ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్నం 530 003



ముద్రణ-ప్రచురణ : డైరెక్టరు, ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు, విశాఖపట్నం

విజ్ఞానఖని

బహుభాషాకోవిదులు



## డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి

ఎమ్.ఏ. (ఆనర్సు), బి.ఎల్., పిఎచ్.డి.

తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘాధ్యక్షులు

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# ప్రవచనం

అనుశాసనం, అభిధానం, కోశం, నిఘంటువు అనే పేర్లతో భారతీయభాషలలో పదాల అర్థాలను వివరించే గ్రంథాలు క్రీ.పూ. 8వ శతాబ్దినుండి వెలుగొందాయి. యాస్కాది మహర్షుల నిఘంటువులు మనకు పరిచయమైనవే. జ్యోతిర్న్యాయ తత్త్వ వైద్యాది భారతీయుల శాస్త్రాలను పాశ్చాత్యులు బహుధా ప్రశంసించారు. అదేవిధంగా మన కోశపరిజ్ఞానాన్ని కూడా వారు వేనోళ్ళ కీర్తించారు. నిఘంటువులలో వ్యుత్పత్తి కోశాలకు ఒక విశిష్ట ప్రయోజనం ఉంది. పదాల యథార్థ స్వరూపనిరూపణం చేయటం ఈ వ్యుత్పత్తి కోశాల వల్లనే సాధ్యం. ఈ విధమైన నిఘంటు నిర్మాణం ఆంగ్లభాషలో సంపూర్ణతను సంతరించుకోగా మిగిలిన సుమారు 5,000 ప్రపంచ భాషలలోను ఈ విధమైన కృషి అంతగా జరగలేదు. మన భారతదేశంలో సంస్కృత పండితులు గీర్వాణ భాషాపదాలకు వ్యుత్పత్తులు చెప్పి తెలుగు, కన్నడం, తమిళం, మలయాళం మొదలయిన దేశభాషలకు వ్యుత్పత్తులు లేవనటమో సంస్కృత పదాలతో ఏదోవిధంగా ముడిపెట్టి కృత్రిమ వ్యుత్పత్తులను పరికల్పించటమో చేసేవారు. తెలుగు భాష సంస్కృత భాషాజన్యంకాదని, ద్రావిడ భాషాకుటుంబానికి చెందిందని ఆచార్య గంటిజోగి సోమయాజిగారు, కోరాడ రామకృష్ణయ్యగారు, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి మొదలయినవారు నిరూపించారు. తెలుగు భాషాపదాలకు వ్యుత్పత్తులు తెలపాలనే ఆకాంక్షతో ఆచార్య గంటిజోగి సోమయాజిగారు, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి 1957లో శ్రీకారం చుట్టారు. ఈ పథకం 1962 వరకు కొనసాగి అనివార్య పరిస్థితుల వల్ల అనుకొన్న కార్యక్రమం పూర్తికాలేదు. ప్రథమంగా (1957-62) ఈ కోశం రూపొందిచటంలో తెలుగు పదాల ప్రధానారోపాలు, ఉపారోపాలు రోమన్ లిపిలోను, వాటి అర్థాలు ఆంగ్లంలోను ఇవ్వబడ్డాయి. కొంతకాలం (ఏప్రిల్ 1962 నుంచి మే 1970 వరకు) ఆపివేయబడ్డ ఈ నిఘంటు నిర్మాణ కార్యక్రమం డాక్టర్ లంకపల్లి బుల్లయ్య (ఉపాధ్యక్షులు 1968-74) గారి ప్రోత్సాహంవల్ల ఆచార్య తూమాటి దొణప్పగారి ఆధ్వర్యవంలో జూన్ 1970 లో పునఃప్రారంభించబడి 30 ఏప్రిల్ 1976 వరకు కొనసాగింది. తెలుగు వ్యుత్పత్తి కోశంలోని ఆరోపాలు తెలుగు లిపిలోను వాటి అర్థాలు శిష్ట వ్యావహారిక భాషలోను ఇవ్వబడాలని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి కమిటీ నివేదిక మేరకు నిర్ణయించబడింది.

ఆచార్య తూమాటి దొణప్పగారు గుంటూరు బదిలీకాగా తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి డైరెక్టర్‌గాను, ప్రధాన సంపాదకులుగాను మన ఆంధ్రవిశ్వకళా పరిషదాంధ్రశాఖలో ఉపన్యాసకులుగా ఉన్న డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి. గారిని శ్రీ ఎమ్.ఆర్. అప్పారావుగారు (ఉపాధ్యక్షులు 1974-80) నియమించగా వారు 1-6-1976న పదవీ బాధ్యతల్ని స్వీకరించారు. ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు అధ్యక్షులుగా డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఆచార్య జి.ఎన్. రెడ్డి ప్రభృతులు సభ్యులుగా నాడే తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘం ఏర్పాటయింది. సలహా సంఘ సభ్యుల విలువయిన సలహాల వల్ల, తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం సిబ్బంది సహకారంవల్ల, తెలుగు వ్యుత్పత్తికోశ పథక ప్రధాన సంపాదకులు ఆచార్య ఎల్. చక్రధర

రావుగారి నిరంతర కృషివల్ల 8 సంపుటాలలో 1,08,330 ఆరోపాలతో తెలుగు వ్యుత్పత్తికోశ నిర్మాణం నేటికి సంపూర్ణమైంది. నా హయాంలో ఈ సంపూర్తికావటం, అనుబంధంతో పాటు తెలుగు వ్యుత్పత్తికోశాష్టమ సంపుటం ప్రకటించబడటం నాకు సంతృప్తిని, ఆనందాన్ని కల్గిస్తోంది.

ఏ భాషలోనైనా శబ్దరాశిని దేశ్యపదాలని అన్యదేశ్య పదాలని రెండు రకాలుగా విభజించవచ్చు. ఏకోశంలోనైనా సమస్త శబ్దజాలం ఉండాలి. మన తెలుగు వ్యుత్పత్తికోశం 8 సంపుటాలలోను దేశిపదాలతోపాటు అన్యదేశ్య పదాలలో భాగమైన అర్థవిపరిణామం పొందిన సంస్కృత సమాలు, వైకృత శబ్దాలు, ఆంగ్లం, ఉర్దూ, ఒరియా, మరాఠీ, హిందీ మొదలయిన భాషల నుండి ఆంధ్రంలో ప్రవేశించిన పదాలు, కన్నడం, తమిళం మొదలైన సజాతీయ ద్రావిడ భాషల నుండి మన భాషలోకి వచ్చిన శబ్దాలు ఉన్నాయి. అర్థవిపరిణామం పొందని సుమారు 50,000 సంస్కృతసమశబ్దాలు ఇందులో లేవు. ఏతత్పథక కర్తలు వీటిని తీసుకోవాలని నిర్దేశించకపోవటమే దీనికి కారణం. ద్రావిడ భాషలపై సంస్కృత భాషా ప్రభావం గణనీయమైంది. తెలుగులో ప్రవేశించిన సంస్కృత సమాల సంఖ్యనుబట్టి ఈ విషయం స్పష్టమౌతోంది. ఈ శబ్దరాశి కావ్యభాషకే పరిమితం కాకుండా సామాన్య జనాలలో కూడా ఆత్మ, దైవం, వివాహం, వైద్యుడు, సూర్యుడు, చంద్రుడు మొదలైన పదాలు నిత్య వ్యవహారంలో ఉండటం ద్వారా ఆంధ్ర భాషలో ప్రధానాంగంగా భాసించింది. సమగ్ర తెలుగు వ్యుత్పత్తికోశంలో ఈ 50,000 పదాలు చేర్చవలసిన ఆవశ్యకతను గురించి ఆచార్య చక్రధరరావుగారు వివరించగా వెంటనే నా ఆమోదాన్ని తెలియజేసి అందుకు ఉపక్రమించవలసిందిగా నిర్దేశించాను. 4 సంవత్సరాల కాలంలో రెండు సంపుటాలలో 50,000 సంస్కృతసమ పదాలు వెలుగులోకి రాగలవని విశ్వసిస్తున్నాను.

ఆంధ్ర విశ్వకళా పరిషత్ మాజీ ఉపాధ్యక్షులు, శాస్త్రవేత్తలు, రాష్ట్రప్రణాళికాభివృద్ధి మండలి ఉపాధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్. గారికి ఈ ఎనిమిదో సంపుటాన్ని అంకితమిస్తున్నందుకు సంతోషిస్తున్నాను.

తెలుగు వ్యుత్పత్తికోశ నిర్వహణార్థం పలువిలువైన సలహాలనిచ్చి తోడ్పడిన సలహా సంఘ సభ్యులకు కృతజ్ఞతలు. ఏతత్పథక ప్రధాన సంపాదకులు, డైరెక్టర్ ఆచార్య ఎల్. చక్రధరరావుగారిని, వారి సిబ్బందిని, ఎనిమిదో సంపుటాన్ని చక్కగా తీర్చిదిద్దిన ఆంధ్ర విశ్వకళా పరిషన్ముద్రణాలయం ఆనరరీ డైరెక్టర్ ఆచార్య పి. రాజేంద్ర ప్రసాద్ గారిని అభినందిస్తున్నాను.

మద్ది గోపాలకృష్ణారెడ్డి

(మద్ది గోపాలకృష్ణారెడ్డి)

విశాఖపట్నం, ఉపాధ్యక్షులు

తే. 1-2-1995 ఆంధ్ర విశ్వకళా పరిషత్

తెలుగు వ్యుత్పత్తి కోశం

ప్రధాన సంపాదకులు




ఆచార్య లకంసాని చక్రధరరావు

ఎమ్.ఏ., పిఎచ్.డి.

డైరెక్టరు, తెలుగు వ్యుత్పత్తికోశ పథకం

కార్యదర్శి & సభ్యులు, తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహాసంఘం

ఆంధ్ర విశ్వకళాపరిషత్

# పీఠిక

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్వింబురాణావళుల్
తెనుంగుల్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుంగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు చేసెదఁ బునర్జన్మంబు లేకుండఁ గన్"

- శ్రీ మహాభాగవతము, ప్రథమస్కంధము 19

అని మహాకవి బమ్మెర పోతనామాత్యులు భాగవత గ్రంథంలో పురాణాలు తెలిగించే టప్పుడు తమ పురాకృత శుభాధిక్యంవల్ల నన్నయ తిక్కనాది పూర్వకవులు భాగవతాన్ని తెలిగించలేదని తాము తన్మహాగ్రంథరాజాన్ని ఆంధ్రీకరించి 'జననాన్ని పునర్జన్మ లేకుండా సార్థకం చేసుకుంటా' ననీ వ్రాక్రుచ్చారు. నన్నయాదులు తలుచుకుంటే శ్రీ మహాభాగవతం పోతనగారికి కొన్ని వందల ఏళ్ళకు పూర్వమే ఆంధ్రీకృతమైఉండేది. పోతనగారి అదృష్టంవల్ల భాగవతాంధ్రీకరణ వారివరకు ఆగింది. ఆచార్య గంటి జోగిసోమయాజిగారు 1957లో తెలుగువ్యుత్పత్తి కోశ పథకాన్ని ప్రారంభించి 1962 మార్చి 31 వరకు కొంతవరకు నిర్వహించి పదవీ విరమణ చేయటమూ, ఆచార్య తూమాటి దొణప్పగారు 1970లో దీన్ని పునఃప్రారంభించి 1976 ఏప్రిల్ వరకు మరికొంతవరకు కొనసాగించి కారణాంతరాలవల్ల గుంటూరు స్నాతకోత్తర కేంద్రానికి బదిలీ కావటమూ, అప్పుడు ఆంధ్ర విశ్వకళాపరిషదాంధ్ర శాఖలో ఉపన్యాసకుడుగా ఉన్న నన్ను తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి డైరెక్టరుగాను, ప్రధాన సంపాదకుడుగాను డాక్టర్ ఎమ్.ఆర్. అప్పారావుగారు నియమించగా 1-6-1976న నిఘంటు నిర్మాణ పదవీబాధ్యతల్ని స్వీకరించి పూర్తికావించడమూ నా అదృష్టంగాను పురాకృత సుకృత విశేషఫల పరిపాకంగాను భావిస్తున్నాను. ఆచార్య గంటి జోగిసోమయాజి, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి (హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు), ఆచార్య తూమాటి దొణప్పగార్లు వేసిన స్థిరమయిన పునాదులపై తెలుగు వ్యుత్పత్తికోశ భవనాన్ని నిర్మించగలిగాను.

తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి విశ్వవిద్యాలయాల విరాళసంఘంవారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికాకాలంలో రు. 1,10,000 లు. చతుర్థ పంచవర్ష ప్రణాళికా కాలంలో రు. 2,50,000 లు ఇచ్చారు. పంచమ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ పథకానికి ఏవిధమయిన విరాళాన్ని యు.జి.సి. వారు ఇవ్వని కారణంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు రు. 2,00,000 లు విరాళాన్ని ఇచ్చి ఆదుకొన్నారు. ఈ తెలుగు వ్యుత్పత్తికోశ పథకానికి ఈ విధమయిన ఆర్థికసహాయాన్ని అందజేసిన యు.జి.సి. వారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి కృతజ్ఞతలు. 1976 నుంచి నేటివరకు ఏవిధమయిన చెప్పుకోదగ్గడబ్బు సాయం ఈ పథకానికి వేరేచోట్లనుంచి రాని కారణంగా ఆంధ్ర విశ్వకళా పరిషత్ రమారమి రు. 10,00,000 లు అందించింది. పథక పరిసమాప్తికై ఈ విధమయిన పరిపూర్ణసహకారాన్ని అందించినందుకు ఆంధ్ర విశ్వకళా పరిషదధికారులకు హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు డాక్టర్ వి.ఎస్. కృష్ణ, బి. ఏ. (ఆక్స్‌ఫర్డ్), పిఎచ్.డి. (వియన్నా) (1949-61) ; డాక్టర్ ఎల్. బుల్లయ్య, ఎమ్.ఏ., బి.ఇడి., డి.లిట్.

(ఆనరరీ) (1968-74) ; డాక్టర్ ఎమ్. ఆర్. అప్పారావు, ఎమ్.ఏ., డి.లిట్. (ఆనరరీ) (1974-1980) ; డాక్టర్ ఆవుల సాంబశివరావు, బి.ఏ., బి.ఎల్. ; ఎల్.ఎల్.డి. (ఆనరరీ) (1980-1983) ; ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), డి. ఎస్‌సి. (ఆనరరీ) (నాగార్జున విశ్వవిద్యాలయం) (1984-87) ; ఆచార్య కనిశెట్టి వెంకట రమణ, ఎమ్.ఏ., ఎమ్.ఎస్.డబ్ల్యు (ఆంధ్ర విశ్వకళాపరిషత్), ఎమ్.ఏ., పిఎచ్.డి. (ఇలినాయ్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు) (1988-91) ; డాక్టర్ మద్దీ గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.ఎల్., పిఎచ్.డి. (1991 .....) గార్ల ఆధ్వర్యవంలో తెలుగు వ్యుత్పత్తికోశ పథకయజ్ఞం జరగటం ముదావహం. సహృదయులు తెలుగు భాషాభిమానులు, మాన్యులు ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డిగారి ఆశీస్సులతో మన విశ్వవిద్యాలయ తెలుగు వ్యుత్పత్తికోశావిష్కరణ యజ్ఞావభృథస్నానం జరగటం ప్రమోదదాయకం.

6,651 పదాలతో కూడిన ఈ తెలుగు వ్యుత్పత్తికోశం ఎనిమిదో సంపుటా (శ - హ) నికి 3,904 పదాలతో కూడిన పరిశిష్టభాగా (అ - హ) న్ని చేర్చి ప్రచురించాము. ఎనిమిది సంపుటాలలో వెలువడిన తెలుగు వ్యుత్పత్తికోశంలోని ఆరోపాల సంఖ్య 1,08,330. "క్లేశః ఫలేనహిపునర్నవతాం విధత్తే" అని కుమారసంభవ మాహాకావ్యం (5-76) లో కవికుల గురువు కాళిదాస మహాకవి పేర్కొన్నట్లుగా, తెలుగు వ్యుత్పత్తికోశావిష్కరణ ఫలప్రాప్తి కలిగి ఏతత్కార్యనిర్వహణభార సంజాత క్లేశనాశమై నాకు నవత్వం లభిస్తోంది.

ప్రపంచంలో రమారమి 5,000 భాషలున్నాయి. అన్యభాషా సంసర్గం పొందని భాష జగత్తులోలేదు. రెండు భాషలకు సంసర్గ సంబంధం ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని ఉన్నప్పుడు ఆ భాషలలోని పదాల వినిమయం జరగటం సర్వసాధారణ విషయం. ఈ కారణంగా ప్రతి భాషలోను నిసర్గాలయిన దేశ్యపదావళి ఉండటమే కాకుండా ప్రతిదేయ పదాలు (Loan - words) కూడా ఉంటాయి. ప్రతిదేయపదాలు లేకుండా కేవలం దేశ్యపదాలతో కూడిన భాష లోకంలో లేదు. పైతృకంగా మూలభాషనుండి సంక్రమించిన పదాలు దేశీయాలు (దేశ్యాలు) ; ఇతర భాషల నుండి రాజకీయ వాణిజ్యాద్యనేక కారణాలవల్ల ఎరవుతెచ్చికొన్న పదజాలం అన్యదేశీయం (అన్యదేశ్యం). "ఒక భాషకు నిసర్గంగా ఉన్న పదాలు కాకుండా సోదరభాషలనుండికాని మరే ఇతర భాషాకుటుంబ భాషల నుండికాని ఎరవుగా ఆభాషలోకి వచ్చి చేరిన పదాలు అన్యదేశ్య శబ్దాలు" అని అన్యదేశ్య శబ్ద నిర్వచనం. తెలుగుభాషలో అన్యదేశ్యపదాలు అనేకం ఉన్నాయి. మూలద్రావిడభాష (Proto - Dravidian language) నుండి తెనుగుకు నిసర్గం (indigenous) గా వచ్చిన పదాలు దేశ్యాలనీ తమిళ కర్ణాటాది సోదర భాషల నుండి కాని ఇండో యూరోపియన్ మొదలైన ఇతర భాషా కుటుంబాలకు చెందిన సంస్కృతం, ప్రాకృతం, ఒరియా, హిందీ, ఉర్దూ, పోర్చుగీసు, ఫ్రెంచి, అరబీ మొదలైన భాషల నుండి కాని తెలుగుభాషలో ప్రవేశించిన శబ్దాలను ఆంధ్రంలోని అన్యదేశ్యాలుగా మనం భావించవచ్చు. సంస్కృత భాషకు తెలుగుభాషకు జన్యజనకభావ సంబంధంకాని సోదరభావ సంబంధంకాని లేకపోయినప్పటికి పోష్యపోషక భావ సంబంధముంది. సంస్కృత భాషా ప్రభావం పడని భారతీయ భాషలు లేవు. సంస్కృత భాష నుండి తెలుగులో ప్రవేశించిన పదాలను అన్యదేశ్యాలుగానే మనం భావించాలి. ఆంధ్ర వైయాకరణులచే పేర్కోబడ్డ తత్సమ తద్భవ శబ్దాలు అన్యదేశ్యాలుగా భాషాశాస్త్రవేత్తలు పరిగణించారు.

తిక్కన సోమయాజి శిష్యుడైన మూలఘటిక కేతన తన 'ఆంధ్ర భాషా భూషణము'లో "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును దానివలనఁ గొంతగానఁబడియెఁ గొంత తానకలిగె నంతయు నేకమై తెనుఁగు బాసనాఁగ వినుతికెక్కె" (14) అని తెలిపాడు. ఆంధ్ర భాషాభూషణ కర్త తెలుగుభాష "దానివలనఁ (సంస్కృతంవల్ల) గొంత గానఁబడియెఁ గొంత తానకలిగె" అని తెలిపిన కారణంగా తెలుగు సంస్కృతంనుంచి ఉద్భవించినట్లుగా కేతన తలచినట్లు మనం భావించకూడదు. "దానివలనఁ గొంత గానఁ బడియెఁ గొంత తాన కలిగె" అని కేతన తెలియజేయటం ద్వారా, తెలుగు భాషా ప్రత్యేక ప్రతిపత్తిని, స్వతంత్రతను స్పష్టంచేశాడు. తర్వాత తెలుగులోని పదజాలాన్ని కేతన ఐదు విధాలుగా విభజించాడు. "తత్సమంబు నాఁగఁ దద్భవంబన నచ్చ తెనుఁగు నాఁగ మఱియు దేశ్యమనఁగ, గ్రామ్యభాషనాఁగఁ గలవైదు తెలుఁగులు వేఱవేఱ వాని విస్తరింతు (ఆం.భా.భూ. 19) అని తత్సమం, తద్భవం, అచ్చతెనుగు, దేశ్యం, గ్రామ్యం అని తెలుగు పదాలను అయిదురకాలుగా కేతన విభజించాడు. తెలుగులోకి సంస్కృతంనుంచి తత్సమపదాలుగా వచ్చిన శబ్దాలుకాక మిగిలిన మాటలన్నీ 'అచ్చతెలుఁగు' పేర వ్యవహరించవచ్చు అని కేతన "తత్సమంబు ధక్కఁ దక్కిన నాలుగు నచ్చ తెలుఁగులందు రఖిలజనులు, నందులో గ్రామ్యమనఁగ నెవ్వరు నొప్ప రొరులఁ దెగడుచోట నొప్పనదియు" (27) అనే పద్యంలో స్పష్టంచేశాడు. ఈనాడు మనం సంస్కృత సమశబ్దాలుగా భావిస్తున్నవాటిని కేతన తత్సమ పదాలుగా తలచినట్లుగా "మును సంస్కృత పదములపైఁ దెనుఁగు విభక్తులు ఘటించి తేట పడఁగఁ జెప్పిననది తత్సమమనఁ జనువనము. ధనము, పురుషుఁ డబల వసుమతి యనఁగన్" (ఆం.భా.భూ. 20) అనే పద్యం విశదీకరిస్తోంది. ఆంధ్రశబ్ద చింతామణిలో తజ్జాసమాచ దేశ్యాగ్రామ్యాచేయం చతుర్విధాభవతి ప్రకృతిద్వయజాతజ్జాతుల్యాథు సమా ప్రవాహిసీదేశ్యా" (సంజ్ఞా పరిచ్ఛేదః 42 సూ.) అనే సూత్రంవల్ల శ్రీ పరవస్తు చిన్నయసూరిగారి బాలవ్యాకరణములోని "సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు" (19 సూ.) అనే సూత్రంవల్ల ప్రాకృత సమాలనుకూడా తత్సమాలుగా పేర్కొవటంద్వారా తత్సమ పదం విపులార్థాన్ని సంతరించుకుంది. కాబట్టి మేము "ధనము, వనము, వృక్షము, హలము" మొదలైన పదాలను స్పష్టార్థ ప్రతిప్రత్తికిగాను సంస్కృత సమాలుగానే పేర్కొంటున్నాం. ఇటువంటి సంస్కృత సమపదాలు రమారమి 50,000 తెలుగుభాషలో ప్రవేశించాయి. తెలుగువారి నిత్యవ్యవహారంలోను ప్రాచీనాధునిక గ్రంథాలలోను ఉన్న ఈ పదాలు మన తెలుగు వ్యుత్పత్తికోశంలో చోటుచేసుకోవాలని 1976లోనే నేను ప్రతిపాదించాను. సంస్కృత సమాలు తెలుగు వ్యుత్పత్తికోశంలో లేనిలోటు స్పష్టంగా కనిపిస్తోంది. "తెలుగు వ్యుత్పత్తి కోశం - సంస్కృత సమాలు" అనే పేరుతో రెండు సంపుటాలలో వెలువరించవలసిన ఆవశ్యకతనుగూర్చి బహుముఖ ప్రజ్ఞావంతులు, పరిపాలనాదక్షులు, విద్యాసాగరులు, తెలుగు వ్యుత్పత్తికోశపథక సలహాసంఘఅధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు డాక్టరు మద్ది గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.ఎల్., పిఎచ్.డి. గారికి విన్నవించగా వారు సహృదయతతో తత్కార్యక్రమానికి శ్రీకారంచుట్టవలసిందిగా ఆశీర్వదించి తమ అంగీకారాన్ని తెలిపారు. ఇందుకుగాను తెలుగుభాష వారికి సర్వాదా ఋణపడి ఉంది. దీనితో తెలుగు వ్యుత్పత్తికోశం సమగ్రతను సంతరించుకొంటుంది.

శ్రీ కోనేరు నాగభూషణం శ్రీమతి అన్నపూర్ణ దంపతులకు 1932 అక్టోబరు 4న శ్రీ రామకృష్ణారావుగారు కృష్ణాజిల్లాలోని ఎనికేపాడు గ్రామంలో జన్మించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తత్త్వశాఖలో విద్యాభ్యాసం కావించి 1953లో బి.ఏ. (ఆనర్స్) పట్టాన్ని

తదనంతరం ఎమ్.ఏ. పట్టాన్ని పొంది వెంటనే (1953లోనే) తమశాఖలోనే ఉపన్యాసకులుగా చేరి తత్త్వ మనస్తత్త్వశాస్త్రాల్ని బి.ఏ. (ఆనర్స్) తత్త్వశాఖావిద్యార్థులకు బోధించారు. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంనుంచి మనస్తత్త్వశాస్త్రంలో పరిశోధనచేసి ఎమ్.ఏ. (ఆనర్స్) పట్టాన్ని పొందారు. గాంధీ-వ్యావహారికత (Gandhi and Pragmatism) అనే అమూల్య సిద్ధాంతవ్యాసానికి పిఎచ్.డి. పట్టాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారికి బహూకరించింది. వీరు గ్రంథాలయ శాస్త్రంలో ఆంధ్రా యూనివర్సిటీనుంచి డిప్లొమాను, చికాగో యూనివర్సిటీనుంచి ఎమ్.ఏ. పట్టాన్ని పొందారు. 1987లో డి.ఎస్‌సి. గౌరవ పట్టానిచ్చి నాగార్జున విశ్వవిద్యాలయం వీరిని సన్మానించింది.

డాక్టరు వి.ఎస్. కృష్ణా స్మారక గ్రంథాలయాధికారులుగా ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారు గ్రంథాలయాభివృద్ధికి విశేషకృషిచేశారు. 1965లోను, 1978లోను, 1989లోను ప్రపంచ ప్రఖ్యాతమైన పరామనస్తత్త్వ సంఘాధ్యక్షులు (President of the Parapsychological Association)గా వీరు ఎన్నుకోబడ్డారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని విశ్వవిఖ్యాత పరాతత్త్వశాస్త్ర సంస్థ (Institute for Parapsychology)కు డైరెక్టరుగా 1977 నుండి 94 వరకు ఉండి విజ్ఞాన వికాసానికి విశేషకృషి చేశారు. అత్యుత్తమ గ్రంథాలను ఎనిమిదింటిని అత్యున్నత ప్రమాణాలతో విలసిల్లే శతాధిక పరిశోధన వ్యాసాలను ఆచార్య రామకృష్ణారావుగారు ప్రచురించారు. వీరి రచనలు ఇటాలియన్, జర్మన్, జపనీస్ మొదలయిన వివిధ భాషలలోకి అనువదించబడి విజ్ఞుల మన్ననల్ని పొందాయి. వీరు ఆంధ్రాయూనివర్సిటీలో 1967లో మనస్తత్త్వశాఖను స్థాపించి ఆచార్యులై శాఖాధిపత్యాన్ని సమర్థవంతంగా నిర్వహించి తమశాఖకు ఆంధ్రాయూనివర్సిటీకి దేశ విదేశాలలో పేరుప్రఖ్యాతులు పెంపొందేటట్లు చేశారు. దేశంలోనే మొట్టమొదటిదయిన స్వప్న ప్రయోగశాల (Dream Laboratory)ను 1973లోనే మన విశ్వవిద్యాలయంలో వీరు నేలకొల్పారు. వీరు స్థాపించిన యోగచైతన్య సంస్థ (Institute of Yoga and Consciousness)ను 1985లో అప్పటి భారత రాష్ట్రపతి జ్ఞానీ జైల్ సింగ్ ప్రారంభించారు. నేడు వీరు ఈ మహాసంస్థకు గౌరవ డైరెక్టరుగా ఉన్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్‌లో సిండికేట్ సభ్యులు (1973-75)గా, ఆర్ట్స్ ఫేకల్టీ చైర్మన్ (1975-76)గా, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు (1984-87)గా వివిధ పదవులను నిర్వహించి విశ్వవిద్యాలయాభివృద్ధికి వీరు అధికంగా దోహదంచేశారు. మన విశ్వవిద్యాలయంలోని కంప్యూటర్ విద్యకు స్వతంత్రశాఖల స్థాపనకు పరిపాలన విద్యారంగాలలోని నూతనరీతులకు వీరు కారకులు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు వీరిని ఉత్తమోపాధ్యాయులుగా గుర్తించి 1982లో సన్మానించారు. 1987లో ఉన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులుగా నియమించబడి పదవీ బాధ్యతలను స్వీకరించి తత్ సంస్థాస్థిరీకరణకు వీరు కారకులయ్యారు. విద్యావిధానంలో వీరి సిద్ధాంతాలు అనుసరణీయాలు.

ఏవంవిధ వివిధ గుణగణగరిష్ఠులు, అంతర్బహిస్సుందరమూర్తులు, ఆంధ్రాంగ్ల భాషా భూషాలంకృతులు, సహృదయ సార్వభౌములు, మనస్తత్త్వశాస్త్ర పారావారపారంగతులు, భూతపూర్వాంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు, భూత పూర్వోన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులు, రాష్ట్ర ప్రణాళికాభివృద్ధిమండలి ఉపాధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్., డి.ఎస్‌సి. (ఆనరరీ) గారికి ఈ సంపుటాన్ని అంకితం కావించటానికి అనుమతించిన ఆంధ్రవిశ్వకళా పరిషదధికారులకు అభినందనలు, కృతజ్ఞతలు.

శ్రీ మద్ది పట్టాభిరామరెడ్డి సన్నమ్మదు పుణ్యదంపతులకు 30 నవంబరు 1933వ సంవత్సరంలో డాక్టరు మద్ది గోపాలకృష్ణారెడ్డిగారు జన్మించారు. వీరు ఫోర్ట్ కేథలిక్ పాఠశాలలోను (1938-43), ఏ.వి.ఎన్. ఉన్నతపాఠశాలలోను (1943-48), ఏ.వి.ఎన్. కళాశాలలోను (1948-50) విద్యాభ్యాసం కావించారు. వీరు ఆర్థికశాస్త్రంలో బి.ఏ. (ఆనర్స్) పట్టాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుంచి 1953లోను, బి.ఎల్. పట్టాన్ని 1955లోను, ఎమ్.ఏ. (ఆనర్స్) పట్టాన్ని 1961లోను పొందారు. ఆర్థికశాస్త్ర పరిజ్ఞానం న్యాయశాస్త్రపారావార పారంగత తతదనంతరకాలంలో డాక్టరు గోపాలకృష్ణారెడ్డిగారు ఆంధ్ర విశ్వకళాపరిషత్కుల సచివులుగాను ఉపాధ్యక్షులుగాను ఉంటున్నకాలంలో తత్కార్య నిర్వహణ దక్షతకు దోహద పడ్డాయి. పిఎచ్.డి. పట్టాన్ని 1983లో భగల్పూర్ యూనివర్సిటీనుంచి తీసుకోవటంద్వారా వీరి నిరంతర విద్యాధ్యయన తత్పరత మనకు బోధపడుతుంది. ఆంధ్ర విశ్వకళాపరిషదార్థికశాఖలో 1957 నుంచి 1966 వరకు ఉపన్యాసకులుగాను 1966నుండి 1967 వరకు రీడర్‌గాను ఉన్న వీరు 34 సంవత్సరాల పిన్నవయస్సులోనే 1967నుంచి 1991 వరకు 24 సంవత్సరాల సుదీర్ఘకాలం ఆంధ్రాయూనివర్సిటీ రిజిస్ట్రారుగా ఉండి నిష్పక్షపాతబుద్ధితో అజాతశత్రువుగా పరిపాలనాదక్షులుగా కార్యనిర్వహణ భారాన్ని వహించి 24 మార్చి 1991లో ఇన్‌చార్జ్ ఉపాధ్యక్షులుగాను, 18 సెప్టెంబరు 1991 నుంచి ఉపాధ్యక్షులుగాను ఉండి విద్యార్థుల పరిశోధకవిద్యార్థుల ఉపాధ్యాయుల ఉపాధ్యాయేతరోద్యోగుల హృదయాలను చూరగొని శాంతియుత వాతావరణంలో విశ్వవిద్యాలయ కార్యకలాపాల్ని నడిపారు. విద్యాసంవత్సరాన్ని క్రమబద్ధీకరించటం, ఘర్షణలకు తావులేని రీతిలో పరిపాలన కావించటం, నిజాయితీతో చిత్తశుద్ధితో నిష్పక్షపాతరీతితో వ్యవహరించటం ద్వారా వీరు అందరి మన్ననల్ని గౌరవాదరాల్ని పొందటం గమనించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, ఆంధ్రవిశ్వకళా పరిషదధ్యక్షులు శ్రీ కృష్ణకాంత్ మహోదయులు 15 సెప్టెంబరు 1994న డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డిగారిని 3 సంవత్సరాల కాలం రెండోసారి ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులుగా నియమించారు. డాక్టర్ గోపాలకృష్ణారెడ్డిగారి హయాములో ఆంధ్ర విశ్వవిద్యాలయం విశేష పురోగతిని సాధిస్తుందనటం స్వభావోక్తి. తెలుగు వ్యుత్పత్తికోశావిర్భావ వికాసాలకు డాక్టర్ రెడ్డిగారు కారకులు, ప్రేరకులు.

తెలుగు వ్యుత్పత్తికోశానికి శ్రీవజ్రాంగి, ఆంధ్రావళిని అలరించే ప్రవచనాన్ని ప్రసాదించిన సంస్కృతాంధ్రాంగ్ల భాషా విశారదులు, సహృదయ సార్వభౌములు, ధర్మనిష్ఠాగరిష్ఠులు, బహుముఖప్రజ్ఞాశాలులు, అజాతశత్రులు, శాంతిదూతలు, తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులు డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.ఎల్., పిఎచ్.డి. గారికి తెలుగు వ్యుత్పత్తికోశ సంపూర్ణ సమాప్తికి సర్వదా సర్వథా ప్రోత్సహించి ఆశీరక్షతలను అందించినందుకు కృతజ్ఞతా నమస్సుమనస్సులు.

తెలుగు వ్యుత్పత్తికోశ పథక సర్వతోముఖాభివృద్ధిని సదా ఆకాంక్షించే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమోపాధ్యాయ పురస్కారగ్రహీతలు, భట్నగర్ బహుమతిస్వీకర్తలు, రసాయనశాస్త్ర శతపత్రభాస్కరులు, ఆంధ్రాంగ్లసంస్కృత భాషాభూషాసమాలంకృతులు, భగవద్గీతాద్యనేకాంధ్ర సద్గ్రంథకర్తలు, బ్రాహ్మీదత్త వరప్రసాదలబ్ధ కవితావధూటులు, ఆంధ్రవిశ్వకళా పరిషద్విజ్ఞాన శాస్త్ర కళాశాలా పూర్వప్రాచార్యులు, ఆంధ్రవిశ్వకళా పరిషత్పాలకమండలి సభ్యులు, ఆంధ్రా యూనివర్సిటీ రెక్టార్ పదవీవిరాజమానులు, ప్రొఫెసర్ ఎస్.ఆర్. సాగిగా సుప్రసిద్ధులయిన ఆచార్య సాగి సీతారామరాజు, ఎమ్.ఎస్‌సి., డి.ఎస్‌సి. గారికి నమస్సుమాంజలులు.

తెలుగు వ్యుత్పత్తికోశపథక కార్యక్రమానికి సంపూర్ణ సహకారాన్ని సదా అందిస్తున్న మాన్యులు, సహృదయ సమ్రాట్టులు, తెలుగు కథారచయితలు, వాణిజ్యశాస్త్ర పారావార పారంగతులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్కార్యనిర్వహణధుర్వహులు, ఆంధ్రాయూనివర్సిటీ రిజిస్ట్రార్ ఆచార్య గోపాలం సుబ్రహ్మణ్యం, ఎమ్.కామ్., పిఎచ్.డి. గారికి హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

తమ అమూల్యాలయిన సలహాలద్వారా, శుభాశంసనల ద్వారా తెలుగు వ్యుత్పత్తికోశ పథక పరిసమాప్తికి కృషిచేసిన అనుభవజ్ఞులు, పండితులు, మేధావులు తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహాసంఘ సభ్యులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, కీ.శే. ఆచార్య జి.ఎన్. రెడ్డి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి, ఆచార్య చేకూరి రామారావు గార్లకు --

తెలుగు వ్యుత్పత్తికోశం ఎనిమిదో సంపుటాన్ని సర్వాంగసుందరంగా రూపొందించటంలో సహకరించిన సహృదయులు భూభౌతిక శాస్త్రాచార్యవర్యులు, ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయం ఆనరరీ డైరెక్టర్ ఆచార్య పి. రాజేంద్రప్రసాద్, ఎమ్.ఎస్‌సి., పిఎచ్.డి. గారికి -

హృదయపూర్వక కృతజ్ఞతలు

తమ నిరంతరకృషివల్ల తెలుగు వ్యుత్పత్తికోశసంపూర్తికి కారకులైన మా తెలుగు వ్యుత్పత్తికోశ పథక సిబ్బందికి -

మనఃపూర్వకాభినందనలు

విశాఖపట్నం
తే. 2-2-1995

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తికోశ పథకం
కార్యదర్శి, సభ్యులు
తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘం
ఆచార్యులు, తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు
అకడమిక్ సెనెట్ సభ్యులు
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు
పాఠ్యప్రణాళికానిర్ణాయక మండలి సభ్యులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

ఆంధ్రరాష్ట్ర అవతరణకు

అసువులు అర్పించిన



అమరజీవి

శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తికోశ పథక ప్రారంభకులు



ఆచార్య గంటిజోగి సోమయాజి
(1900-87)



ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి

# తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘం

అధ్యక్షులు:

**డాక్టర్ మద్ది గోపాలకృష్ణా రెడ్డి**

ఎమ్.ఏ.(ఆనర్సు), బి.ఎల్., పిఎచ్.డి.

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

సభ్యులు:

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి**, డి.లిట్.
గౌరవాచార్యులు, రవీంద్రసాహిత్యం
ఆంధ్రవిశ్వకళాపరిషత్

**కీ.శే.. ఆచార్య జీ.ఎన్. రెడ్డి**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
మాజీ ఉపాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

వాఙ్మయమహాధ్యక్ష
**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
హైదరాబాదు

**డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ, పద్మభూషణ్
సత్తెనపల్లి

**శ్రీమతి టి. ఎన్. అనసూయాదేవి**
మదనపల్లి

**ఆచార్య చేకూరి రామారావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
హైదరాబాదు

**ఆచార్య లకంసాని చక్రధరరావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
కార్యదర్శి, సభ్యులు
డైరెక్టర్, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తి కోశపథకం
ఆంధ్రవిశ్వకళాపరిషత్

# తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహాసంఘ సభ్యులు



డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి
డి.లిట్



కీ.శే. ఆచార్య జి.ఎన్. రెడ్డి
ఎమ్.ఏ., పిఎచ్.డి.



డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య



డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య



శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి



ఆచార్య చేకూరి రామారావు
ఎమ్.ఏ., పిఎచ్.డి.

## అంకితం

బహుముఖ ప్రజ్ఞాశాలి



ఆచార్య కోనేరు రామకృష్ణారావు

పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్)

డి.ఎస్‌సి. (ఆనరరీ) (నాగార్జున విశ్వవిద్యాలయం)

ఆంధ్ర విశ్వకళాపరిషత్ మాజీ ఉపాధ్యక్షులు

రాష్ట్ర ప్రణాళికాభివృద్ధి మండలి ఉపాధ్యక్షులు

# శ

**శ** వి. తాలవ్యశ్వాసవివృత మహాప్రాణవర్ణం. అన్యదేశ్యపదాలలో మాత్రం ఈవర్ణం కన్పిస్తోంది. ద్రావిడభాషలలో ఈవర్ణం స్వతహాగాలేదు.

**శంషేరు** రూ. షంషేరు. వి. ఖడ్గం, కత్తి. రంగా.చ. 2.60.

హిం. శమ్‌శేర్. ఖడ్గం : ఉ. షమ్మీర్. ఖడ్గం ; పార. షమ్. సుఖం, షేర్, సింహం, షమ్‌షీర్. కృపాణం.

<ఉ. షమ్‌షీర్.

**శకటము** వి. చదరంగం ఆటలోనిపావు(రథం).

సం. శకట -. బండి, శకటవ్యూహం, ఒకవిధమైన యాగం బండి.

<సం. శకట-(అర్థవిపరి.).

**శకటాలాడు** అ.క్రి. చదరంగమాడు. <శకటము + -లు + ఆడు.

**శకటాబండి** రూ.చూ. చెకటాబండి. వి. కచ్చరం, గూడుబండి.

**శకటాలాడు** చూ. శకటము.

**శకటు** వి. చదరంగం ఆటలోనిపావు (రథం).

సం. శకట -. బండి, శకటవ్యూహం, ఒకరకం యాగం బండి.

<సం. శకట-.

**శకణ్ణము** రూ.చూ. శక్కండము. వి. వేళాకోళం, శాటి.

**శకముకల్లువేసుకొను** రూ.చూ. సకలముకవేసుకొను. అ.క్రి. సకలం కలం పెట్టుకొను. కుండల్ని సర్వేటప్పుడు కమిదిపై కుమ్మరి ఎడమకాలిపాదం కుడితొడ దగ్గరికి కుడికాలుపాదం ఎడమకాలివేళ్ళ దగ్గరికి వచ్చేలాగా కాళ్ళు మడుచుకొని కూర్చొను.

**శకరాలు** చూ. చక్కెర. వి.బ.వ. చెక్కెరలు, ఒకరకం వడ్లు.

**శకలాత్తు** రూ.చూ. సకలాతు. విణ. ఉల్లనుతో చేసిన.

**శకలుబడు(-పడు)** అ.క్రి. **1**. మితిమీరు ; **2**. వెర్రిచేష్టలు చేయు.

**శకస్తు** రూ.చూ. శికస్తు. విణ. **1**. శిథిలమైన ; **2**. విరిగిన.

**శకునగీసిగాడు** వి. ప్రతిదానికి అడ్డుపడేవాడు.

సం. శకున -. పక్షి, రాబందు. శుభాశుభాల్ని సూచించేకారణం.

**శకునపక్షి** వి అభ్యంతరాలు చెప్పేవాడు.

సం. శకున - పక్షి, రాబందు, శుభాశుభాల్ని సూచించే కారణం, పక్షిన్. పిట్ట.

<సం. శకునపక్షిన్ (అర్థవిపరి.).

**శకునాలపక్షి** వి. **1**. ప్రతిదానికి ఏదో ఒక అభ్యంతరం చెప్పే వ్యక్తి ; **2**. చెడ్డగా శకునం చెప్పేవాడు, అనిష్టసూచకుడు.

సం. శకున -. పక్షి, రాబందు, శుభాశుభాల్ని సూచించే కారణం, పక్షిన్. పిట్ట.

<సం. శకున- + -ము + -లు + -అ[11] + సం. పక్షిన్.

**శకునేండ్లు** వి.బ.వ. శకసంవత్సరాలు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 624. క్రీ.శ. 1142.

సం. శక -. శాలివాహనుడు, శాలివాహనశకం.

<సం. శక- + ఏండ్లు.

**శకుంతల** వి. **1**. ఒకరకం లేత ఆకుపచ్చరంగు ; **2**. రామ పచ్చలో లేతరంగు ; **3**. తెలుపు పసుప్పచ్చ ; **4**. పచ్చలో నలుపు, తెలుపు కలిసినవన్నె ; **5**. ముదురు పచ్చలో నలుపుచాయ.

సం. శకుంతలా. దుష్యంతునిభార్య.

<సం. శకుంతలా. (అర్థవిపరి.).

**శకుంతలచీర** వి. ఒకరకం అకుపచ్చరంగులో నేసినచీర. సం. శకుంతలా. దుష్యంతునిభార్య.

**శక్కండము** రూ. శకణ్ణము. వి. వేళాకోళం.

**శఖునస్థితి** వి. శుభాశుభాల్ని సూచించే నిమిత్తపు పరిస్థితి.

సం. శకున -. శుభాశుభాల్ని సూచించే నిమిత్తం, స్థితి.- ఉనికి.

<సం. శకునస్థితి-.

**శంక** పూజకొయ్య, మూలస్తంబం, శాస్త్రపద్ధతిలోగృహనిర్మాణానికి ఓంప్రథమంలో ఈశాన్యమూల పాతేకొయ్య.

సం. శంకు-. స్తంభం.

<సం. శంకు-.

**శంకనినాదమృదంగు(డు** వి. విష్ణువు, వేంకటేశ్వరస్వామి. తాళ్ల. సం. 5.83.

సం. శంఖ -. సంకువు, నినాద -, ధ్వని, మృదంగ-. మద్దెల.

<సం. శంఖనినాదమృదంగ-.

**శంకులుడు** వి. సేవకుడు. నె.శా. ఆత్మకూరు 51. క్రీ.శ. 1274.

సం. సంకల -. కూడబెట్టటం, కలపటం, సమకూర్చటం.

<సం. సంకల-.

**శంకాతంకములు** వి.బ.వ. అడ్డంకులు, సంకోచాలు. కాశ. 1.121.

సం. శంకా. సందేహం, భయం, అనుమానం, ఆశ, భ్రాంతి. అతంక -. రోగం, సంతాపం. సందేహం, భయం.

<సం. శంకాతంక- + -ము + -లు (అర్థవిపరి.).

**శంకలుసేయు** స.క్రి. తప్పుపట్టు. విజయ. 2.16.

సం. శంకా. సందేహం, అనుమానం.

<సం. శంకా + -లు + చేయు.

**శంకించు** అ.క్రి. తలచు, ఊహించు. హరి.పూ. 3.190.

నం. శంక్. సందేహించు, భయపడు.

<నం. శంక్ + -ఇంచు[3].

**శంకు** రూ. చెంకు, సెంకు, సెంఖు, సంకు[4]. వి. పూజకొయ్య, మూలస్తంభం, శాస్త్రపద్ధతిలో చెక్కి గృహనిర్మాణానికి ఓం ప్రథమంలో ఈశాన్యమూలను పాతేకొయ్య.

నం. శంకు -. స్తంభం.

<నం. శంకు-. (అర్థవిపరి.).

**శంకుమూర్తం** వి. శంకునుపాతే శుభసమయం. <శంకు + మూరుతము.

**శంఖధారవాడు** విశ. శంఖం ఊదేవాడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 663.

నం. శంఖ-. సంకువు.

**శంకులవారు** విశ. బ.వ. శంఖం ఊదేవారు. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 144. క్రీ.శ. 1158.

నం. శంఖ-. సంకువు.

<నం. శంఖ- + లు + -అ[11] + వారు.

**శంకుస్తాపం** రూ. సెంకుస్థాపం, సంకుస్థాపం. వి. గృహనిర్మాణానికి ముమ్మందు కట్టిన వేదికలో శంకుకర్రను మంత్రపూర్వకంగా పాతటం.

నం. శంకుస్థాపన-. ఇల్లు కట్టటం ప్రారంభించేముందు భూమిలో శంకువును స్థాపించటం.

<నం. శంకుస్థాపన-.

**శంకుస్థాపితం** వి. గృహనిర్మాణానికి ముమ్మందు కట్టిన వేదికలో శంకుకర్రను మంత్రపూర్వకంగా పాతటం.

నం. శంకుస్థాపిత-. శంకుస్థాపింపబడిన.

<నం. శంకుస్థాపిత-.

**శంఖంమెట్టు** వి. నత్తగుల్లమెట్టు, కిందపళాలంగా పైకి పోను పోను సన్నగా సుడి తిరిగి ఉండేమెట్టు.

నం. శంఖ-. సంకువు

<నం. శంఖ- + -ము + మెట్టు.

**శటము** వి. పిపాస, క్షుధ, పిచ్చి, అదికేచ్ఛ.

నం. శఠ-. మోసం, నీచుడు, నిజాయితీలేని.

<నం. శఠ-.

**శటాకు** రూ.చూ. చటాకు. వి. చెటాకు, ఒకకొలత, సేరులో పదహారోవంతు తూకం.

**శటాయింపు** రూ.చూ. చటాయింపు. వి. కోపం ; 2. విరక్తి.

**శఠకోపము** రూ. శఠగోపము. వి. 1. విష్ణ్వాలయంలో భక్తుల తలమీద ఉంచే విష్ణుపాదాలున్న పాత్రవిశేషం. సిం, నార. 26 ; 2. శివాలయాది దేవాలయాల్లో కూడా ఆయా దేవతల పాదాలున్న పాత్రవిశేషం.

**శఠకోపముపెట్టు** రూ. శఠగోపం పెట్టు. అ.క్రి. వంచించు.

**శఠగోపము** రూ.చూ. శఠకోపము. వి. 1. విష్ణ్వాలయంలో భక్తుల తలమీద ఉంచే విష్ణుపాదాలున్న పాత్రవిశేషం ; 2. శివాలయాది దేవాలయాల్లో కూడా ఆయాదేవతల పాదాలున్న పాత్రవిశేషం.

**శఠగోపంపెట్టు** రూ.చూ. శఠకోపముపెట్టు. అ.క్రి. 1. మోసం చేయు ; 2. మేలుచేయు.

**శఠగోపంపెట్టు** చూ. శఠగోపము.

**శఠము** వి. కోపం. ద్వి. పరమ. వి. 3.206వ.

నం. శఠ-. మోసం, నీచుడు, నిజాయితీలేని.

<నం. శఠ- (అర్థవిపరి.).

**శఠాయింపు** రూ చూ. చటాయింపు. వి. విరక్తి, కోపం.

**శడ్డులు** వి.బ.వ. తొడల్లుడు.

నం. షడ్డక-. తోడల్లుడు.

<నం. షడ్డక-.

**శతపోరు** అ.క్రి. ఎన్నోసార్లు చెప్పు.

నం. శత-. వంద.

<నం. శత- + పోరు (మిశ్రన.).

**శతమానము** వి. 1. మంగళసూత్రం ; 2. ఎక్కువగా తిట్టటం.

నం. శతమాన-. పలమెత్తువెండి, పరిమాణవిశేషం.

<నం శతమాన- (అర్థవిపరి.).

**శతమానం భవతిఅగు** అ.క్రి. తిట్లకు పాత్రమగు.

**శతమానం భవతిఅగు** చూ. శతమానము.

**శతరంజి** వి. లావుపాటినూలుతో నేసిన ఒకరకం దుప్పటి.

హిం. శత్‌రంజీ. అనేకరంగుల దారాలతో నేయబడ్డ వస్త్రం.

<హిం. శత్‌రంజీ.

**శతరుద్రియము** వి. యజుర్వేదాంతర్గతమైన 'నమక' మనే వేద భాగం. నిరంకు. 4.72.

నం. శతరుద్రీయ-. యజుర్వేదాంతర్గత నమకం.

<నం. శతరుద్రీయ-.

**శతాయించు** రూ.చూ. సతాయించు. అ.క్రి. మొండితనం చేయు ; స.క్రి. పీడించు. బాధించు.

**శనగలు** రూ.చూ. సెనగలు. వి.బ.వ. సెనగలు (Cicerarietinum).

**శనామణి** రూ. శనీమణి. వి. సినిమా.

ఇం. *Cinema*. చలనచిత్రం.

<ఇం. Cinema.

**శనిటరిఇన్స్పెక్టరు** వి. పారిశుద్ధ్య పరిశీలనాధికారి.

ఇం. *Sanitary Inspector*. పారిశుద్ధ్య పరిశీలనాధికారి.

<ఇం. Sanitary Inspector.

**శనివారవుజడి** వి. 1. ఎడతెగక కురిసేవాన ; 2. ఎడతెగక ఉండేనది.

నం. శనివార-. స్థిరవాసరం.

**శనిశరము** వి. ఒకజాతి డేగ. ఇందు. 2 60.

**శనీమణి** రూ.చూ. శనామణి. వి. చలనచిత్రం.

**శపిని** వి. అంచులోపలికి ఉండేమూత.

**శప్పాతు** రూ.చూ. చపాతి. వి. గోధుమపిండితో తయారు చేసేరొట్టె.

**శబరి** వి. ఒకరకం ఆకుపచ్చ రంగు.

సం. శబరీ. శబరస్త్రీ, రామభక్తురాలయిన ఒక కోయస్త్రీ.

<నం. శబరీ (అర్థవిపరి.).

**శబరిచీర** వి. ఒకరకం ఆకుపచ్చ రంగు చీర.

**శబాసు** రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసా సూచకశబ్దం. కృష్ణరా. 3.93.

**శమేనా** రూ. శామియానా, శామ్యానా, షామియానా షామ్యానా. వి. గుడ్డతో నిర్మింపబడిన కుటీరం. రంగా. చ. 2.55.

హిం. శామియానా. పెద్దగుడారం; మరా. శామియానా. పెద్దడేరా; ఉ. షామియానా. వితానం, పెద్దడేరా; పార. షామ్యాన. పత్రం. చాందిని.

< ఉ. షామియానా.

**శంబళి** రూ. సెంబళి. వి. ఒక జాతిచెట్టు (Vifexneyundo.

సం. శంబల-. ఒడ్డు.

< సం. శంబల-.

**శంబళిక** చూ. సంచెల వి. తాంబూలాదిక సత్కారం. హంస, 1.207.

**శమ్మి** వి. జమ్మిచెట్టు.

సం. శమి. జమ్మిచెట్టు.

< సం. శమీ.

శమ్మిమ్రాను వి. జమ్మిచెట్టు.

**శయము** వి. 1. పరుపు, శయ్య, సెజ్జ. భాగ. 10.604; 2. చేయి. ఆము. 1.56; 3. నిద్ర; 4. పాము, కొండచిలువ; 5. తిట్టు, శాపం; 6. నేలలో నాటిన వాడి కొయ్య; 7. పందెం.

సం. శయన-. నిద్ర, పరుపు.

< సం. శయన-.

**శరణు** వి. నమస్కారం, వందనం. ఆము. 6.99.

సం. శరణ-. రక్షణం, ఆశ్రయం. గృహం, గుహ, వధ.

< సం. శరణ-.

శరణుచేయు అ.క్రి. 1. కుమ్మర్లను మాత్రమే యాచించే పెక్కరోళ్ళు కుమ్మర్ల కాళ్ళకు దండం పెట్టు; 2. తద్దినం మొ. వాటిలో భోక్తలకు నమస్కరించు. శరణుచొచ్చు రూ.చూ. శరణు సొచ్చు. స.క్రి. శరణాగతిని పొందు. విష్ణు. 5.239; అ.క్రి. రక్షకుడు కాగోరు. శరణువేఁడు స.క్రి. శరణాగతి కొరకు ప్రార్థించు. భార. ఆను. 3.262. శరణుసొచ్చు (-చొచ్చు) రూ. శరణు చొచ్చు. అ.క్రి. రక్షకుడు కాగోరు. రాఘవ. 4.71; స.క్రి. శరణాగతినిపొందు. శరణొందు స.క్రి. శరణాగతిని కోరి సమీపించు. జాహ్నవీ. 1.83. < శరణు + ఒందు.

**శరణొందు** చూ. శరణు.

**శరత్తు** రూ.చూ. షరతు. వి. 1. నిబంధన; 2. అగ్రిమెంటు.

**శరంపశరాలు** వి.బ.వ. తిట్టటం, జ్వరం వగైరాల వల్ల ఉక్కిరిబిక్కిరిగా ఉండటం.

సం. శర-. బాణం, అమ్ము.

**శరవ** వి. మూతిసన్నగా ఉన్న పాత్ర, కూజా.

సం. శరావ-. మూకుడు, పళ్ళెం, మట్టి పాత్ర.

< సం. శరావ-.

**శరామని** వి. కొంచెం కూడా తీరికలేనిపని.

**శరారతు** రూ. షరారతు, షరారత్తు. వి. 1. పాడుచేయటం 2. దుర్మార్గం.

హిం. శరారత్. ఉపద్రవం, దుష్కృత్యం; మరా. శరారత్. ద్వేషం, మత్సరం; ఉ. షరారత్. దుష్కృత్యం, చెడు, ఉపద్రవం; పార. షరారత్. క్రౌర్యం, చెడు చేయటం, పాడుచేయటం; అర. షరారత్. చెడుచేయటం, పాడుచేయటం;

క. శరారత్.

< ఉ. షరారత్.

**శరీరయాత్ర** వి. భోజనం. వసు. 3 128.

సం. శరీరయాత్రా. జీవిక, జీవనాధారం.

< సం. శరీరయాత్రా (అర్థవిపరి.).

**శరీత్రౌతు** (-రౌతు[2]) వి. అఖండంరాయి, గోడలుకట్టేటప్పుడు చిన్నవైన ఇటికల్ని రాళ్ళను మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి.

**శర్క** వి. పటిక పంచదార. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 1021.

సం. శర్కరా. పంచదార, పటికబెల్లం;

క. శర్కరె.

< సం. శర్కరా.

**శర్నపేర్పు** వి. 33 ప్రమిదలు పేర్చిన వరస.

**శర్లు** చూ. చేరు[3]. వి. తలపాగ కట్టే పెద్దరుమాలు.

**శలగ** వి. 1. నూరు, లెక్కపెడుతున్నప్పుడు ఆఖరుసంఖ్య ఎంతయితే అదేసెలగ; 2. కాయలు కొన్నప్పుడు పైనవేసే కొసరు.

**శలవు** రూ.చూ. సెలవు[1]. వి. విరామం. తాళ్ల.సం. 14.217.

**శలాకు** వి. చెవాల, పొడుగాటి కామగల ఒకరకం పార, మట్టి తవ్వకానికి గుల్లగా ఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

సం. శలాక -. కొయ్యచీల, శస్త్రవైద్యసాధనం.

< సం. శలాక-.

**శలాపు** రూ.చూ. శ్లాబు. వి. పడతరం, సిమెంటు పోతపోసి తయారు చేసిన కప్పు.

**శల్యసారథ్యము** వి. హితవంచన, మంచిమాటలు చెప్తూ వంచించటం.

సం. శల్యసారథ్య-. శల్యుడు రథం నడపటం.

< సం. శల్యసారథ్య - (అర్థవిపరి ).

**శల్ల** రూ.చూ. శెల్లా. వి. పట్టుబట్ట.

**శల్లా** రూ.చూ. శెల్లా. వి. అంచులేనిబట్ట, పట్టుబట్ట.

**శల్వు** రూ.చూ. సెలవు[1]. వి. 1. సెలవు; 2. ఆజ్ఞ. ద. హిం.శా. సంపు. 5. శా.సం. 117.

**శవాలు** రూ.చూ. సవాలు. వి. ప్రశ్న.

**శవోఁశవోఁ** అవ్య. అటోఇటో.

**శశిపూల చందురులు** వి.బ.వ. భూషణ విశేషం.

సం. శశిన్. చంద్రుడు.

**శశిబడాలు** వి.బ.వ. భక్ష్య విశేషం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1216. క్రీ.శ. 1207.

సం. శశిన్. చంద్రుడు.

**శశ్చోటిగాండ్రు** వి.బ.వ. పెధవలు.

సం. శశ్ఛోటి. 8-4-63. (పాణినీయసూత్రం). పదాన్తాత్ ఝయః పరస్య శస్య ఛోవాస్యాదటి అని వైయాకరణ సిద్ధాంత కౌముది. పదాంతమైనఝయ్యకంటె పరమైన శవర్ణానికి ఛకారాదేశం వికల్పంగా వస్తుంది. 'తద్ + శివః' అనేచోట శకారానికి ఛకారం వస్తుంది. 'తద్ + ఛివః' తర్వాత 'ఖరిచ" (8-4-55) సూత్రంచే 'తచ్ఛివః', అనే రూపం నిష్పన్నమవుతుంది. ఇది వైయాకరణుల్ని నిందించటంలోని పలుకుబడి.

<సం. శశ్చోటి + కాండ్రు. (మిశ్రస.).

**శషబిషలు** వి.బ.వ. ధూంధాం అనటం. "స్వౌజసమౌట్ఛస్టాభ్యాంభిస్ జేభ్యాంభ్యస్ జసిభ్యాంభ్యస్ ఙసోసాం జ్యోస్సుప్" జ్యన్తం, ఆబంతం, ప్రాతిపదికం వీటికంటె పరాలై ప్రత్యయసంజ్ఞ కల స్వాదులు వస్తాయి. వైయాకరణులు ద్వితీయావిభక్తి బహువచన ప్రత్యయమైన 'శస్'ను తృతీయా విభక్తి బహువచన ప్రత్యయమైన 'భిస్' ను పలికి వ్యాకరణ శాస్త్రానభిజ్ఞుల్ని కంగారు పెట్టి గర్వంగా ఉండేవారు. ఇది వారిని బట్టి వచ్చిన పలుకుబడి.

<సం. శస్భిస్ (అర్థవిపరి.).

**శహ** రూ.చూ. శాహ. వి. ప్రభువు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 748. క్రీ.శ. 1577.

**శహంమ్మతు** రూ. శాహమత్తు. వి. వీరత, ధైర్యం. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 759.13. క్రీ.శ. 1663.

మరా. శహామత్. ధైర్యం, చాతుర్యం ; ఉ. షహామత్. ధైర్యం, శూరత, శక్తి ; పార. షహామత్. ధైర్యం. శౌర్యం.

<ఉ. షహామత్.

**శహరు** రూ.చూ. షహరు. వి. పట్టణం.

**శహవాసు** రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసావాచకం.

**శా** రూ.చూ. శాహ. వి. పాదుషా, వజీరు. విశ్వే.శ. 54.

**శాక[1]** రూ. శాకము, శాఖ[1], శేకం. వి. **1**. సెగ, వేడి, వేడిమి ; **2**. ఆముకాల్పు యొక్క వేడి.

సం. శిఖా. జ్వాల.

<సం. శిఖా.

**శాక[2]** వి. **1**. భాగం ; **2**. గుర్తు.

సం. శాఖా. భాగం, గ్రంథభాగం. తెగ, వేదభాగం.

<సం. శాఖా.

**శాకండాలు** వి బ వ. బడాయిలు.

**శాకతుంగ** వి. తుంగలో ఒకరకం. ఆకులు 2,3 అడుగులపొడవు ఉండి సుమారు ఆరు అడుగుల ఎత్తు పెరిగే తుంగ (Cypres unbellafus).

**శాకము** రూ.చూ. శాక[1]. వి. సెగ, వేడిమి.

**శాకరము** రూ. శాకారము. వి. శోభ.

సం. సాకార -."ఆకారంతో కూడినది ; హిం. ఉ. శకల్. ఆకృతి.

**శాకారము** రూ.చూ. శాకరము. వి. శోభ.

**శాఖ[1]** రూ.చూ. శాక[1]. వి. సెగ, వేడిమి.

**శాఖ[2]** వి. కమ్మి, రాతిదూలం. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 487. క్రీ.శ. 1299.

సం. శాఖా. కొమ్మ.

<సం. శాఖా (అర్థవిపరి.).

**శాఖము** వి. మాంసం.

సం. శాక -. కూరగాయలు.

<సం. శాక - (మహాప్రాణత వల్ల అర్థభేదం).

**శాగడా** వి. మందబయలు. గ్రామంలోని పశువులు నిలవటానికి, మేయటానికి ప్రభుత్వం వారు వదలిన భూమి, బీడు.

**శాగమట్ట** వి. కలబంద.

శాగమట్టచీర వి. నారచీర.

**శాగ్గూన** వి. చాకళ్ళు ఉబ్బలో బట్టల్ని ఉడికించటానికి వాడే పెద్ద మట్టిపాత్ర.

<చాకి + గూన.

**శాణ** రూ.చూ. జాణ[1]. వి. తెలివి గలవాడు.

శాణతనము రూ.చూ. జాణతనము. వి. జాణతనం.

**శాణం** రూ.చూ. సేనం. వి. గ్రావణం. రాతిముక్కలు కొట్టటానికి పనికివచ్చే పరికరం. ఒకఅంచు పదునుగా ఉండే ఉక్కుముక్క.

**శాణా** రూ.చూ. జాణ[1]. వి. **1**. సమర్థుడు. రంగా.చ. 2 242 ; **2**. అన్నీ నేర్చిన నాగరికుడు.

శాణాతనము రూ.చూ. జాణతనము. వి. నాగరీకం.

**శాణీ** రూ.చూ. జాణ. వి. **1**. నేర్పరి, నేర్పరితనం ; **2**. కోడిగం.

శాణీతనము రూ.చూ. జాణతనము. వి, నాగరీకం.

**శాండో** వి. **1**. సర్కసులో భీముడిలా బలప్రదర్శన చేసేవాడు ; **2**. ఎక్కువ శారీరక బలం కలవాడు.

ఇం. *Sando*. ఇంగ్లండులో ఒక బలశాలి పేరు.

< ఇం. Sando.

**శాతతుంగ** వి. తుంగలో ఒకరకం, మాగాణిలో పెరిగే సన్న తుంగ (Cyprerus species).

సం. శాత -. వాడి అయినది, ఉమ్మెత్త.

<సం. శాత + తుంగ. (మిశ్రస.).

**శాతబడి** రూ.చూ. చేతబడి. వి. చిల్లంగి. చేతబడి.

**శాతాళము** రూ. చేతబడి. వి. చేతబడి.

**శాతువ** రూ.చూ. శాదవ. వి. **1**. పని ; **2**. సేద్యం.

**శాద** వి. అలసట.

సం. శాద -. లేతగడ్డి, బురద.

శాదతొట్టి వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన నీళ్ళుపెట్టుకొనే చిన్నతొట్టి.

**శాదత** వి. సయ్యదువంశపు రాజులు.

**శాదవ** రూ. శాతువ. వి. **1**. పని ; **2**. సేద్యం.

సం. శాద-. లేతగడ్డి, బురద.

**శాదానము** వి. చేసినపనికి వ్యంగ్య పదం.

సం. శ్రమదాన-. కష్టపడటం.

<సం శ్రమదాన-.

**శాదారము** వి. **1**. నష్టం ; **2**. కీడు.

**శాన** రూ.చూ. చాల. విశే. ఎక్కువ.

శానక్రొ వి. అయిదు నెలలపంట.

శానం రూ.చూ. సేనం. వి. శ్రావణం, రాతిముక్కలు కొట్ట టానికి పనికివచ్చే పరికరం, ఒకఅంచుపదునుగాఉండే ఉక్కుముక్క.

శానభోగు చూ. శాన. వి. కరణం, కులకర్ణి.

శానా రూ.చూ. చాల. విణ. 1 చాలా ; 2. నిండా ; 3. బహు, విస్తారంగా.

శాని రూ.చూ. సాని[1]. వి. యజమానురాలు. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 1117. క్రీ.శ. 1082.

శానిక రూ.చూ. సానిక[2]. వి. 1. వెలుపాటితట్ట ; 2. మట్టి కంచం ; 3. అన్నంతినేకంచం ; 4. నూలు కండెలు వేసు కొనే వెడల్పుమూతిగల తొట్టి లేక మూకుడు.

శాంతమూకుడు రూ. సేంతమూకుడు. వి. రజస్వలఅయిన ప్పుడు ఆడపిల్లలు అన్నం తినటానికి పెళ్ళిలోనవధాన్యాలు పెట్టటానికి వాడే మట్టిమూకుడు.

నం. శాంత-. ఉపశమించినది, తగ్గినది.

<నం. శాంత-+మూకుడు (మిశ్రమ.)

శాంతోమ వి. 1. చెన్నపట్టణంలో ఒకపేట ; 2. పరంగి కొండ పరిసర ప్రాంతం ; 3. జువోన్‌దీక్రాస్త్రు (1545-48) గోవాలో బురతకేచు గవర్నరుగా ఉన్నకాలంలో పోర్తు గాలు చక్రవర్తి మూడవజాన్ వేయించిన బంగారునాణెం.

పో. సాంతోమి ; ఇం. సెయింట్‌థామస్‌మౌంట్.

<పో. సాంతోమి.

శాపన వి. శాపం తిట్టు.

సం. శపన-. తిట్టు, నింద, శాప-.

<నం. శపన-.

శాపనగొట్టు(-కొట్టు[1]) విణ. శాపంతగిలిన. శాపనాకారము వి. తిట్టు, శాపం. నం. ఆకార-. ఆకృతి. <శాపన+ నం. ఆకార-. శాపనాలు వి.బ.వ. తిట్లు, శాపనార్థాలు.

శాపనాకారము చూ. శాపన.

శాపనార్థాలు చూ. శాపన. వి.బ.వ. తిట్లు.

నం. శపన-, శాప-. తిట్టు, అర్థ-. ప్రయోజనం, పేరు. వస్తువు.

<నం. శపనార్థ-+-ము+-లు.

శాపనాలు చూ. శాపన.

శాపరమంత్రాలు వి.బ.వ. శబరమంత్రాలు.

నం. శాబర-. శబరసంబంధమైన, మంత్ర-. మంత్రం.

<సం. శాబరమంత్ర-+-ము+-లు.

శాపించు స.క్రి. శాపాలుపెట్టు. బసవ. 7.193.

నం. శప్. తిట్టు.

<నం. శప్-+-ఇంచు.[3]

శాబాత్‌రౌతు రూ.చూ. శాబాదిరౌతు. వి. తెలంగాణాలోని శాబాద్ గ్రామప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవ రాయి.

శాబాదిరౌతు రూ. చాపాతిరౌతు, చాపాదిరౌతు, చాబాచెరౌతు, చాబాతిరౌతు, చాబాతురౌతు, చాబాదురౌతు, చాబాసి రౌతు, చావాతిరౌతు, శాబాత్‌రౌతు, శాబాదురౌతు, షాబాదు రౌతు. వి. తెలంగాణా శాబాద్ గ్రామప్రాంతం నుంచి వచ్చేప్రసిద్ధమైన చలవరాయి.

శాబాదురాయి రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణా లోని శాబాద్ ప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవరాయి.

శాబాదురౌతు రూ.చూ. శాబాదిరౌతు. వి. తెలంగాణాలోని శాబాద్‌గ్రామప్రాంతంనుంచి వచ్చేప్రసిద్ధమైన చలవరాయి.

శాబాద్‌రాయి రూ. చాపాదురాయి, చావాదరాయి, శాబాదు రాయి, శావాత్‌రాయి, శావాదురాయి, షాబాదురాయి షేబాదురాయి, సాబాతురాయి. వి. తెలంగాణాలోని శాబాద్‌గ్రామప్రాంతం నుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవ రాయి.

శాబాస రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసార్థకం.

శాబాసి రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసార్థకం. రంగా. ద. 2.172.

శాబాసు రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసార్థకం. చంద్రరే. 1.127.

శాబాసె రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసార్థకం.

శాబ్ది వి. ప్రతిజ్ఞ.

నం. శాబ్దీ. సరస్వతి.

<నం. శాబ్ది (అర్థవిపరి).

శామ[1] రూ.చూ. చేమంత. వి. చేమంతి, ఇంటిఆవరణలో పెంచే పూలమొక్క (Chrysantheum indicum).

శామ[2] రూ.చూ. చేమ. వి. శాకభేదం, ఒకరకం దుంపపైరు.

శామసుందరంచు రూ.చూ. శ్యామసుందరంచు. వి. ఒకరకం రంగులో నేసిన చీరఅంచు.

శామాకు రూ. చెవాకు, చేమాకు, చైమాకు. వి. గిలాబా, గోడ మీది సున్నం మొదలైన వాటిపూత.

శామియానా రూ.చూ. శమేనా. వి. గుడ్డతో నిర్మింపబడిన కుటీరం.

శామీ వి. 1. రాజ్యసంబంధమైన. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759. క్రీ.శ. 1663.

హిం. శామీ. సిరియాసంబంధమైన ; ఉ. షామీ. సిరియా సంబంధమైన, సిరియాదేశస్థులు ; పార. షామీ. సిరియా దేశీయుడు.

<ఉ. షామీ.

శామ్యానా రూ.చూ. శమేనా. వి.గుడ్డతో నిర్మింపబడిన కుటీరం.

శాయి రూ. షాయి. వి. సిరా, మషీరసం. హంస. 1.141.

ఒ. శాయి ; హిం. స్యాహీ. సిరా, మసి ; ఉ. స్యాహీ, సియాహీ. సిరా, మసి ; పార. సియాహీ. నలుపు, చీకటి, ఛాయ, సిరా, నల్లగా ఉన్నచోకరు.

<ఉ. స్యాహీ.

శాయిగొడుసు వి. నిటారుగా వంపు లేకుండా ఉండేగొలుసు.

శాయిచీల రూ.చూ. సాయచీల. వి. సాయి మేకు, బండిచక్రం ఉండకుండా ఇరుసుకు వేసిన మేకు.

శాయిపోగు వి. 1. పొలంలో చాలుగా పోసిన ఎరువుకుప్ప ; 2. ఎరువుకుప్ప.

శాయిబాన్ రూ.చూ. సాయిబాన్. వి. 1. వారపాక, వాలుకప్పు గల పాక ; 2. పంచ, ఇంటిముందున్న కప్పువేసినఅరుగు.

శాయిమొల వి. సాయిమేకు, బండిచక్రం ఊపకుండా ఇరుసుకు వేసినమేకు.

శాయిమేకు రూ.చూ. సాయిమేకు. వి. కడిచీల, బండిచక్రం జారిపోకుండా కుండ పక్కన ఇరుసులోకి దించినమేకు.

శాయిరు రూ చూ. సాయర్. వి. సుంకం, ఒకరకంపన్ను.

శాయిశీల రూ.చూ. సాయచీల. వి. కడిసీల. బండిచక్రం జారిపోకుండా కుండపక్కన ఇరువిలోకి దించిన మేకు.

శారదగాడు వి. హాస్యగాడు.

నం. శారద-. శరత్కాలసంబంధమైన, శారదా. సరస్వతి.

<నం. శారదా + -కాఁడు.

శారుకావిఏన్నె రూ.చూ. శారుకావివన్నె. వి. ఒకకొలికితెలుపు, రెండు కొలుకులు నీలిరంగు, ఇలా మూడువరసలు నేసి తరవాత రెండు కొలుకులు తెలుపు, రెండుకొలుకులు నీలి రంగు చొప్పున పెట్టి నేసిన చీర.

శారుకావిపన్నె రూ. శారుకావిఎన్నె. వి. ఒక కొలికి తలుపు, రెండు కొలుకులు నీలిరంగు, ఇలా మూడు వరుసలు నేసి తర్వాత రెండు కొలుకులు తెలువు, రెండు కొలుకులు నీలి రంగు చొప్పున పెట్టి నేసిన చిర.

<నం. చారు-. మనోహరమైన + కావివన్నె.

శాల్ రూ.చూ. సాలువ. వి. ఉత్తరీయంలా భుజాలమీద కప్పు కొనేవస్త్రం.

శాలవ రూ.చూ. సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే ఒకరకం బట్ట.

శాలు రూ చూ సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే వస్త్రవిశేషం. తాళ్ల. సం. 13.108.

శాలువ రూ.చూ. సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే వస్త్రవిశేషం.

శాలువు రూ.చూ. సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే వస్త్రవిశేషం.

శాలూ రూ.చూ. సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే వస్త్రవిశేషం.

శాల్తి రూ.చూ. శాల్తీ. వి. 1. నేసిన ఒకబట్ట; 2. వస్తువు; 3. రూపం.

శాల్తీ రూ. శాల్తి. వి. 1. రూపం; 2. వస్తువు, ఉరువు; 3. వస్త్రం.

శాల్‌నామా రూ.చూ. షాలునామా. వి. అక్షరాలు దిద్దిన గుడ్డ.

శాల్వ రూ.చూ. సాలువ. వి. భుజాలమీద ఉత్తరీయంలా కప్పుకొనే వస్త్రవిశేషం.

శావ వి. సేవ.

నం. సేవా. పరిచర్య, పూజ.

<నం. సేవా.

శావా చూ. చేవ. వి. రాళ్ళులేనిమట్టి.

శావాత్‌రాయి రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణాలోని శాబాద్‌గ్రామ ప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవ రాయి.

శావాదురాయి రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణాలోని శాబాద్ గ్రామప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవ రాయి.

శావి రూ.చూ. చెవి.[2] వి. తాళంచెవి, చెవికంటె శావియే బుడతకీచు పలుకుబడికి చేరువ.

శాసనంరాయి వి. శాసన్రాయి, సాసనంరాయి, పొలిమేరరాయి, ఊరిసరిహద్దును సూచించేరాయి.

శాసనగంభము వి. శాసనశిలాస్తంభం. ద.హిం శా. సంపు. 10. శా.నం. 509. క్రీ.శ. 1314.

సం. శాసన-.వ్రాతమూలకమైన ఒప్పుదల.

<నం. శాసన + కంబము. (మిశ్రమ.)

శాస్తి వి. ప్రతీకారం.

నం. శాస్తి-.ఆజ్ఞ, శిక్ష, రాజదండం, పాలనం; హిం. శాస్తి. శిక్ష, దండన.

<నం. శాస్తి (అర్థవిపరి.).

శాస్త్రం వి. సామెత.

నం. శాస్త్ర-. ఆజ్ఞ, వేదవిహితవాక్యం, నియమగ్రం థం, వేదం. తెలివి. గ్రంథం.

< నం. శాస్త్ర- (అర్థవిపరి.).

శాహ రూ. శహ, శా, శాహ,షహ, శాహి, షా.షాహ, సాహు. వి. పాదుషా, ప్రభువు. రామ. వి. 1.

హిం. శాహ్. పాదుషా; మరా. శహ్. రాజు; ఉ. షాహ్. దేవుడు, ప్రభువు, పాదుషా, చక్రవర్తి.

< ఉ. షాహ్.

శాహమత్తు రూ.చూ. శహంమత్తు. వి. ధైర్యం.ద.హిం. శా. శా.నం. 759. క్రీ.శ. 1663.

శాహి రూ.చూ. శాహ. వి. రాజు, ప్రభువు.

శిక రూ.చూ. సిగ. వి. జుట్టు.

శికతరుగు రూ.చూ. సికతరుగు. అ.క్రి. (శిక్షార్థం). తల గొరుగు.

శికందర్ వి. కత్తిపేరు. ఖడ్గ. 13.

హిం.ఉ. పార. సికందర్. అలగ్జాండరు; మరా. శికం దర్.

< ఉ. సికందర్.

శికస్తు రూ. శకస్తు, శిఖస్తు, శిఖస్తు, షికస్తు, సికస్తు. విశ. 1. శిథిలమైనది. రంగా. చ. 3.127; 2. విరిగినది.

హిం. శికస్త్. నాశనం; మరా. శికస్త. పరాజయం; ఉ. షికస్త్. చెల్లాచెదరవటం, సికఫ్త్. పరాజయం, చెల్లాచెదురు కావటం; పార. షికస్త్. నష్టం;

క. శికస్తు. సికస్తు. విరిగిన, ముడిచిన, శిథిలమైన, నాశనమైన, రిపేరులో ఉన్న; త. చికస్తు.

< ఉ. షికస్త్.

శికారి రూ. శిఖారి. వి. వేట.

హిం. శికార్. ప్రమాదానికి గురి అవటం; మరా. శికార్. ఉ. షికార్. ఆఖేటం; పార. షికార్.

< ఉ. షికార్.

శికు చూ.సికా. వి. ప్రభుత్వం జారీచేసిన దానపట్టా. ద.హిం. శా.సంపు. 10. శా.నం. 748. క్రీ.శ. 1530.

శిక్కా రూ.చూ. సికా. వి. ముద్ర.

**శిక్సా** వి. ఒకతరహా గంధం పొడి.

హిం. చిక్స, చిక్సా. ఒకరకమైన కదంబపొడి, ఎన్నోదినుసులు కలిసిన ఒకతరహా గంధం పొడి

<హిం. చిక్స, చిక్సా.

**శిఖండి** వి. **1**. మొండివాడు ; **2**. మొండిది.

సం. శిఖండిన్. ద్రుపదరాజుకొడుకు.

<సం. శిఖండిన్ (అర్థవిపరి.).

**శిఖత్తు** రూ.చూ. శికస్తు. విణ. **1**. శిథిలమైన ; **2**. విరిగిన.

**శిఖస్తు** రూ.చూ. శికస్తు. విణ. **1**. శిథిలమైన ; **2**. విరిగిన.

**శిఖా** రూ.చూ. సికా. వి. ముద్ర.

**శిఖాచేయు** అ.క్రి. ముద్రవేయు, అచ్చుగుద్దు.

**శిఖారి** రూ.చూ. శికారి. వి. వేట.

**శిగినపువక్క** వి. మేలైన వక్క.

**శిగిలం** వి. శిఖరం.

సం. శిఖర-.కొండకొన.

<సం. శిఖర-.

**శిగ్గు** రూ.చూ. సిగ్గు. వి. బిడియం, లజ్జ. తాళ్ల. సం. 5.285.

**శిజారు** అ.క్రి. ఎదుర్కొను. ద.హిం.గా. సంపు. 10. కా.సం. 759.

ఉ. శిజార్. ఎదిరించటం ; పార. సిజార్. ఎదిరించటం, అడ్డుకొనటం

<ఉ. శిజార్.

**శిండ** రూ.చూ. చిండ. వి. ఆడుగురి.

**శిన్నెక్క** వి. చిన్నక్క. తాళ్ల. సం. 12.260.

<చిన్న+అక్క.

**శిపాయి** రూ.చూ. సిపాయీ. వి. సైనికుడు.

**శిపాయీ** రూ.చూ. సిపాయీ. వి. సైనికుడు.

**శిఫారసు** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిఫార్శు** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిఫార్సు** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిఫాయీ** రూ.చూ. సిఫాయీ. వి. కాలిబంటు ; **2**. భటుడు.

**శిఫారసు** రూ.చూ. శిఫారుసు. వి. వాక్సహాయం.

**శిఫారస్సు** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిఫారుసు** రూ. శిపారసు, శిపార్శు, శిపార్సు, శిఫారసు, శిఫారస్సు, శిఫార్స్, శిఫార్సు, సిపారసు, సిపారుసు, సిఫారసు, సిఫారుసు సిఫారుస్సు, సీఫార్సు, సీపారసు. వి. రెకమెండేషను.

ఒ. బెం. శిఫార్స్ ; హిం. సిఫారిశ్ : ఉ. పార. సిఫారిష్, సుఫారిష్. రెకమెండేషను, పరిచయం, మధ్యవర్తిత్వం ;

క. శిపారసు ; త. చిపార్పు, సిపారిసు ; మ. శిపారిసి, శిపార్శి.

<ఉ. సిఫారిష్.

**శిఫార్స్** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిఫార్సు** రూ.చూ. శిఫారుసు. వి. రెకమెండేషను.

**శిబంది** రూ.చూ. శిబ్బంది. వి. పనివాళ్ళు, ఉద్యోగులు.

**శిబందీ** రూ.చూ. శిబ్బంది. వి. పనివాళ్ళు, ఉద్యోగులు.

**శిబ్బంది** రూ. శిబంది, శిబందీ, శిబ్బందీ, సిబ్బంది. వి. పనివాళ్ళు, ఉద్యోగులు.

ఉ. పార. సి-బందీ. ఎస్టాబ్లిష్‌మెంటు ;

క. శిబ్బంది, సిబంది, సిబ్బంది. సాయుధులైన జవాన్లు, క్లర్కులు, ప్యూన్లు. పనివాళ్ళు మొ. ఉద్యోగులు క్రమరహితమైన సిపాయీలు ; త. చిప్పంతి. సాయుధులైన పోలీసులు, సిబ్బంది.

<ఉ. సి-బందీ.

**శిబ్బందీ** రూ.చూ. శిబ్బంది. వి. పనివాళ్ళు, ఉద్యోగులు.

**శియ్యం** విణ. మూడవ.

ఉ.పార. సియమ్ ;

క. శెయ్యమ్.

<ఉ. సీయమ్.

**శిరంజిపూలు** వి.బ.వ. ఒకరకంపువ్వు నమూనాలో నేసిన డిజైను.

**శిరదూలం** వి. నరం, పంచస్తంభాలమీద వేసే అడ్డవాసం.

సం. శిరస్. తల.

<సం. శిరస్+దూలము.

**శిరవేజు** వి. తలపాగాపైభాగంలో ధరించే ఒక అలంకారం.

హిం. సర్ పేంచ్. తలనుచుట్టేది, తలపాగ ; ఉ. పార. సర్-పెచ్. కిరీటం, టర్బను, టర్బనుపైన ధరించే ఒక ఆభరణం.

<ఉ. సర్-పెచ్.

**శిరసంటు** చూ. శిరసు.

**శిరసు** వి. జుట్టు, తల. తాళ్ల. సం. 5 14.

సం. శిరస్. తల.

<సం. శిరస్-.(అర్థవిపరి.).

**శిరసంటు** మి. అ.క్రి. తలంటు, తలకు నూనె మర్దనా చేయు. ఇందు. 2.15. <శిరసు+అంటు.

**శిరస్తదారు** రూ.చూ. శిరస్తాదారు వి. కలెక్టరు ఆఫీసులో ఉండే ప్రధాన గుమస్తా.

**శిరస్తా** వి. శిరస్తాదారుపని. వేణు.శ. 16.

హిం. సరిష్తా. ఒకన్యాయస్థానం, ఒకకార్యాలయం, ఒకశాఖ ; ఉ. పార. సరిస్త, సర్-రిష్త. శిరిస్తాదారు కార్యాలయం ;

క. శిరస్తె.

<ఉ. సరిస్త, సర్-రిష్త.

**శిరస్తాదార్** రూ.చూ. శిరస్తాదారు. వి. కలెక్టరు అఫీసులోఉండే ప్రధాన గుమాస్తా.

**శిరస్తాదారు** రూ. శిరస్తదారు, శిరస్తాదార్, శిరస్తాదారుడు, శిరస్తెదారు, సిరస్తాదారు. వి. కలెక్టరుఆఫీసులో ఉండే ప్రధాన గుమాస్తా.

హిం. సరిష్తేదార్. భారతీయన్యాయస్థానంలోని స్వదేశకార్యాలయంలో ఉండే సూపరింటెండెంటు ; ఉ. పార. సరిస్తదార్, సర్-రిష్త-దార్. రెవెన్యూ విషయాలను తనిఖీ చేసేవాడు, జిల్లాలోని ప్రధాన రెవెన్యూ ఆఫీసరు ;

క. శిరతి-దార, శిరస్తె-దార ; త. సరిస్తాతార్ ; మ. శిరస్తాదార్.

<ఉ. సర్‌రిష్త-దార్.

**శిరస్తాదారుడు** రూ.చూ. శిరస్తాదారు. వి. రెవెన్యూ ఆఫీసు మేనేజరు.

**శిరా** రూ.చూ. సిరా. వి. ఇంక్.

**శిరామరక్ష** వి. పిల్లలకు స్నానం చేయించిన తరువాత నీళ్ళు కొంచెం చేతిలోకి తీసుకొని తలచుట్టూ తిప్పి శ్రీరామ రక్ష అని దీవించటం.

సం. శ్రీరామరక్షా. శ్రీరామచంద్రుని రక్ష.

<సం. శ్రీరామరక్షా.

**శిరోమాణికము** వి. శిరోరత్నం. తాళ్ల. సం. 15.201.

సం. శిరోమాణిక్య -. తలమీదపెట్టుకొనే మాణిక్యం.

<సం. శిరోమాణిక్య-.

**శిల్లులు** వి.బ.వ. ఎడ్లమెడలపై కాడిపెట్టి దానిపైన బిగించే కొయ్యలు.

సం. శిరస్. తల.

**శిలకడకుండ** వి. ఆము. కాలేటప్పుడు కుండలు కదలకుండా ఉంచడానికి వాటిమధ్య దాపుగా పెట్టే ఓటికుండ.

**శిలశిలా** వి. వరుస, పరంపర.

హిం. సిల్ సిలా. క్రమం ; మరా. సిల్ సిలా. సంబంధం, వ్యవస్థ, ఏర్పాటు ; ఉ. సిల్ సిలహ్. శృంఖలం, పంక్తి ; పార. సిల్ సలత్, సిల్ సిలహ్. వారసత్వం : అర. సిల్ సిలహ్. వరుస, వారసత్వం.

<ఉ. సిల్ సిలహ్.

**శిలాన్యాసం** వి. పునాదిపాతటం, శిలాస్థాపన

సం. శిలాన్యాస-. రాతిని ఉంచటం.

<సం. శిలాన్యాస -(అర్థవిపరి.).

**శిలారాయి** వి. రాతిగోడల పగుళ్ళను సరిచేస్తూ బిగించే రాయి.

సం. శిలా. రాయి.

<సం. శిలా+రాయి. (మిశ్రస.).

**శిలాస్థాపం** వి. శిలాన్యాసం. పునాదిరాయి పాతటం.

సం. శిలాస్థాప -. రాతినిపాతటం.

<సం. శిలాస్థాప-. (అర్థవిపరి.).

**శిలాస్థాపన** వి. శిలాన్యాసం, పునాదిరాయిపాతటం.

సం. శిలాస్థాపన - రాతినిపాతటం.

<సం. శిలాస్థాపన-. (అర్థవిపరి.).

**శిలుకు** రూ. చిలుకు, శిల్కు, సిలుకు[3], సిల్కు[2]. విశ. 1. అనిశ్చితమైన, తీర్పుచెప్పని ; 2. నిలవయిన.

మరా. షిలక్ ; ఉ. అర. సిలక్. వరస, బ్యాలెన్సు. ఖర్చుపెట్టిన తరువాత మిగిలినది ;

క. శిలుకు; శిల్కు ; త. చిలక్కు,

<ఉ. సిలక్.

**శిలుగు** రూ.చూ. సిలుగు. వి. ఉపద్రవం. తాళ్ల. సం. 16.1.45.

**శిల్కు** రూ.చూ. శిలుకు. వి. 1. పెండింగు ; 2. నిలవ.

**శివ** వి. 1. వెదురువాసం ; 2. తారాజువ్వ ; 3. వెదురుజువ్వ,

సం. శివా. పార్వతి, కరక. జమ్మి, ఉసలిక, గరిక,శివ-. శివుడు.

<సం. శివా (అర్థవిపరి.).

**శివద్వారం** రూ.చూ. సిమద్వారం. వి. తలవాకిలి, ఇంటిలోని మొట్టమొదటి పెద్దదైనముఖ్యమైనద్వారం.

**శివపాడు** వి. శ్మశానం. పరమ. 2.115.

సం. శివ-. శివునికి సంబంధించిన.

<సం. శివ-+పాడు[2].

**శివపూజ** వి. భోజనం.

సం. శివపూజా. శివునియొక్కపూజ.

<సం శివపూజా (అర్థవిపరి.).

**శివపూజచెట్టు** వి. ఒంటిరెక్కపూలుపూసే ఒకరకంచెట్టు, శైవులు తులసికి బదులు దీన్ని పూజిస్తారు.

సం. శివపూజా. శివునిపూజ.

<సం. శివపూజా+చెట్టు.

**శివమంతులు** వి.బ.వ. శైవమతస్థులైన కుమ్మర్లు.

సం. శివవత్. శివుడు కలవాడు.

<సం. శివవత్+-లు.

**శివమాడు** చూ. శివము.

**శివము** వి. పూనకం, ఊరేగింపు మొ. సందర్భాల్లో దేవత పూనటం.

సం. శివ- శివునికి సంబంధించినది.

<సం. శివ-(అర్థవిపరి.).

**శివమాడు** అ.క్రి. పూనకం వచ్చి ఊగు. తాళ్ల. సం. 6.37. <శివము+ఆడు. **శివముదూలు** (-తూలు) స.క్రి. దేవుడు పూనటంతో తూలు. **శివముపూను** అ.క్రి. పూనకం వచ్చు. **శివములెత్తు** అ.క్రి. ఆవేశపడు. కవిక. 2.169. <శివము+-లు+ఎత్తు[1]. **శివమెత్తు** అ.క్రి. ఆవేశపడు. తాళ్ల. సం. 11.40. <శివము+ఎత్తు[1]. **శివాలాడు** అ.క్రి. 1. ప్రాథేయపడు ; 2. వీగడీయు ; 3. దేవుని పూనికవల్ల మైకం కమ్మి ఊగులాడు. <శివము+-లు+ఆడు.

**శివమెత్తు** చూ. శివము.

**శివరాయలవరాలు** వి.బ.వ. శివరాయముద్ర ఉన్న వరహాలు. రామలిం. శ. 5.13.

**శివసత్తులు** వి బ.వ. శివభక్తులు. తాళ్ల. సం. 7.12.

సం. శివ-శివుడు.

<సం. శివ-+సత్తి+-లు (మిశ్రస.).

**శివాఅంటూ** అవ్య. ప్రారంభిస్తూ.

సం. శివ-శివుడు.

**శివాజ** రూ.చూ. శివాయిజమా. వి. శివాయిజమా, పక్కపొలం రేటు ప్రకారం శిస్తుకడుతూ ప్రభుత్వానుమతి మీద సాగు చేసుకొనే పొలం.

**శివామని** అవ్య. ప్రప్రథమంగా.

సం. శివ-శివుడు, ఓమ్. ప్రణవాక్షరం.

<సం. శివ-+సం. ఓమ్+అను+-ఇ[13].

**శివాయి[1]** రూ.చూ. సివాయి. క్రి. విశ. 1. తప్ప ; 2. వేరుగా ; 3. మించి, పైన ; 4. లేకుండా.

**శివాయి[2]** వి. తెంపూరిభూమి, పక్కనఉన్న పొలంరేటు ప్రకారం శిస్తుకడుతూ ప్రభుత్వం అనుమతిమీద సాగు చేసుకొనే పొలం. అవసరం లేనప్పుడు వదులుకోవచ్చు.

సాగుకు లాయకైన గవర్నమెంటు బంజరు, దీనిపైరైతుకు విక్రయహక్కులుండవు.

శివాయిజమా రూ. శివాజ. వి. తెంపూరిభూమి, జగర్ సాగు. పక్కనఉన్న పొలంరేటు ప్రకారం శిస్తుకడుతూ ప్రభుత్వం అనుమతిమీద సాగుచేసుకొనే పొలం. సాగుకు లాయకైన గవర్నమెంటు బంజరు. దీనిపైరైతుకు విక్రయ హక్కులుండవు.

శివార రూ. చవర, చివర2, శివారా, సివారు1. వి. **1.** మెరిసేపూత ; **2.** సున్నపు పూతమీది మెరుగు.

శివారా రూ.చూ. శివార. వి. **1**. మెరిసేపూత ; **2**. సున్నపు పూత మీది మెరుగు.

శివారు రూ. సివారు2. వి. **1**. పట్టణ పరిసర ప్రాంతం. దహిం. శా. నంపు. 10. శా. సం. 767. 30. క్రీ.శ. 1680 ; **2.** కంద్రిగ, మజారా, గ్రామంలోని చిన్నవిభాగం; **3.** పొలిమేర.

ఉ. అస్వార్. నగరకుడ్యాలు ; పార. అస్వార్. పట్టణపుగోడలు.

<ఉ. అస్వార్.

శివారుగుంజ వి. నేతబయలులో చివర పాతినకొయ్య. శివారుపల్లె వి. కసబా, పెద్దగ్రామపు సరిహద్దుల్లో ఉన్న చిన్నపల్లె.

శివాలాడు చూ. శివము.

శివార్చనచేయు అ.క్రి. భుజించు. హర. 2.48.

సం. శివార్చన-. శివపూజ.

<సం. శివార్చన- + చేయు.

శివుడితలంబ్రాలు వి.బ.వ. గింజ సన్నంగా తెల్లగా ఉండే ఒక రకంజొన్న.

శిష్తు రూ.చూ. శిస్తు. వి. భూమిపన్ను.

శిసల్ అవ్య. నిర్ధారణమైన.

ఉ. సిసల్. నిర్ధారించబడిన, సెటిల్ చేయబడిన.

<ఉ. సిసల్.

శిస్తు రూ. శిష్తు, సిస్తు2. వి. పన్ను. నె.శా. ఒంగోలు. 5 ; విశ్వే. శ. 41.

హిం. శిస్త్, శిస్. గుర్తు, లక్ష్యం ; మరా. శిస్త. పద్ధతి. రీతి, లక్ష్యం ; ఉ. శిస్త్, శస్. గుర్తు, లక్ష్యం ; పార. షిస్త్. కార్యనిర్వాహకాలం.

<ఉ. షిస్త్.

శిస్తుకౌలు వి. సాగుచేసిన రైతు భూకామందుకు నగదు రూపంలో చెల్లించే కౌలు. శిస్తుసాగు వి. కౌలు, భూకామందుకు డబ్బుగాని పంటగాని ఇంత ఇచ్చేట్టు అనిముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం.

శిస్తుదార్ రూ. శిస్తుదారు. వి. కౌలుదారు, కౌలుకు సేద్యం చేసేవాడు.

ఉ. శిస్త్‌దార్. కార్యనిర్వాహకుడు

<ఉ. శిస్త్‌దార్.

శిస్తుదారు రూ.చూ. శిస్తుదార్. వి. కౌలుకు సేద్యం చేసేవాడు.

శిస్సాల విణ. మూడేళ్ళకోసారి అయ్యేది.

శీకారి రూ.చూ. షికారీ. వి. వేటగాడు, యోధుడు.

శీతకట్టు వి. చలికాలం.

సం. శీత-శీతకాల సంబంధమైన, చల్లని.

<సం. శీత- + కట్టు. (మిశ్రన.).

శీతకన్నువేయు అ.క్రి. అనాదరం చేయు.

సం. శీత-చల్లని.

<సం. శీత- + కన్ను. (మిశ్రన.) + వేయు.

శీతకారు వి. చలికాలం, హేమంతర్తువు.

సం. శీత-చల్లని.

<సం. శీత- + కారు1 (మిశ్రన.).

శీతగాలి వి. చలిగాలి, నవంబరు డిశంబరు నెలల్లో వీచే చల్లగాలి.

సం. శీత-చల్లని.

<సం. శీత- + గాలి (మిశ్రన.).

శీతాకాలము వి. చలికాలం, హేమంతర్తువు.

సం. శీత-చల్లని, కాల-సమయం.

<సం. శీతకాల-.

శీతకుండ రూ.చూ. సీతకుండ. వి. దిష్టికుండ, పంటకు దిష్టితగల కుండా సున్నంతో గాని, మసితోకాని బొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ.

శీదా1 విణ. సరళంగా, తిన్నని.

సం. సిద్ధ- నెరవేర్చబడిన ; ప్రా. సిద్ధ- ; ఒ. సిధా. సరళం ; హిం. ఉ. సీధా. ఋజుమార్గం, సరళం ; గు. సీధుᴄ. తిన్నగా, సరళంగా ; మరా. సిధా. సరళం.

<ఉ. సీదా.

శీదా2 వి. బియ్యం భిక్షం పెట్టటం.

శీధువు వి. చెరుకురసంతో చేసినకల్లు. భార. మౌసల. 28.

సం. శీధు- మద్యం, ద్రాక్షసారాయి.

<సం. శీధు (అర్థవిపరి ).

శీపాయీ రూ.చూ. సిపాయీ. వి. సైనికుడు.

శీరస్తెదారు రూ.చూ. శిరస్తాదారు. వి. కలెక్టరు ఆఫీసులో ఉండే ప్రధానగుమాస్తా.

శీర్ణము వి. కట్టెను చెక్కేపనిముట్టు, బాడిన.

సం. శీర్ణ-చెల్లాచెదరైనది.

<సం. శీర్ణ- (అర్థవిపరి.).

శీల రూ.చూ. సీల. వి. కర్రమేకు, కొయ్యతోచేసినమేకు.

శీలకుండ రూ. శీలుకుండ. వి. ఆము కాలేటప్పుడు కుండలు కదలకుండా కుండలపరసమీదుగా నిలువుగా బిగించే దాపుకుండ.

శీలమండలు రూ.చూ. చీలమండ. వి.బ.వ. కాలిమడమపైభాగం.

శీలుకుండ రూ.చూ. శీలకుండ. వి. ఆము కాలేటప్పుడు కుండలు కదలకుండా కుండల పరసమీద నిలువుగా బిగించే దాపుకుండ.

శీశా రూ.చూ. శీసా. వి. సీసా.

శీషా రూ.చూ. శీసా. వి. సీసా.

శీసా రూ. శీశా, శీషా, షీషా, సీసా, సీస్సా. వి. సీసా, కాచపాత్ర విశేషం.

హిం. శీశా. గాజు, అద్దం, గాజుసామాను ; ఉ. షీష. గాజు, అద్దం, శోభకోసం పెళ్ళి సందర్భంలో చాందినీలలో

వేలాడ గట్టిన దీపాలు; పార. పీషహ్. గాజు, బాటిలు, గాజుపదార్థం;

క. సీస, సీసె, బుడ్డి, బాటిలు; త. చీచా, సీసి.

<ఉ. పీష.

శకనాశి వి. దేవాలయ ముఖద్వార మార్గం. ద,హిం.శా. సంపు. 5. శా.సం. 280. క్రీ.శ. 1556.

సం. శుకనాసికా. చిలుకముక్కు.

<సం. శుకనాసికా.

శుంకం రూ.చూ. సుంకము. వి. పన్ను. సుంకం.

శుంఠ వి. మొద్దు, ఎంబెన్న.

సం. శుంఠ -. మూఢుడు.

<సం. శుంఠ - (అర్థవిపరి.).

శుంఠకాయ వి. మూఢుడు. పరమ, 5.249. సం. శుంఠ -. మూఢుడు. <సం.శుంఠ-+కాయ. (మిశ్రన.).

శుద్ద రూ.చూ. సుద్ద. వి. గవ్వముక్కలనుండి ఏర్పడి. ముగ్గులు పెట్టటానికి వాడబడే సున్నపు జాతికి చెందిన మట్టిముద్ద; 2. గొడ్డ, మట్టిఉండ.

శుద్దరాయి రూ.చూ, సుద్దరాయి. వి. తెల్లరాయి, ముగ్గు వేసుకోవటానికి పనికివచ్చు తెల్లని మెత్తనిరాయి.

శుద్దిపెట్టు సీ.క్రి. కడుగు. భోజనం చేసిన విస్తరి తీసినిచోట అలికిశుభ్రపరచు.

సం. శుద్ధి -. పరిశుభ్రత, ప్రాయశ్చిత్త సంస్కారం.

<సం. శుద్ధి-+ పెట్టు.

శునకమునకుసూడిద వి. వ్యర్థం అని చెప్పటానికి వాడే పలుకు బడి. కుక్క. 88.

సం. శునక -కుక్క.

శుభస్వీకారము వి. కర్మ ముగిసిన తరువాత మామగార్లు కర్మ చేసిన వారికి వస్త్రాలిచ్చే ఆచారం.

సం. శుభస్వీకార - మేలునుగ్రహించటం.

<సం శుభస్వీకార - (అర్థవిపరి.).

శుభ్రకాటుచీర వి. తెల్లరంగు పట్టులో నేసినచీర.

సం. శుభ్ర -. తెల్లని.

<సం.శుభ్ర-+కాటుచీర. (మిశ్రన.).

శుభ్రకుపునంచీర రూ.చూ. శుభ్రకుప్పణం చీర. వి. ఒకరకం కుప్పడం నేతచీర.

సం. శుభ్ర -. తెల్లని.

శుభ్రకుప్పణంఅంచు రూ. శుభ్రకుప్పనం అంచు. వి. ఒకరకం కుప్పడం అంచు.

సం. శుభ్ర -. తెల్లని.

శుభ్రకుప్పణంచీర రూ. శుభ్రకుపనం చీర. వి. ఒకరకం కుప్పడం నేతచీర.

సం. శుభ్ర -. తెల్లని.

శుభ్రకుప్పనంఅంచు రూ.చూ. శుభ్రకువ్వణం అంచు.

వి. ఒకరకం కుప్పడం అంచు.

శుభ్రగళ్ళచీర వి. తెల్లగళ్ళచీర.

సం. శుభ్ర -. తెల్లని,

<సం. శుభ్ర-+గళ్ళచీర (మిశ్రన.).

శుభ్రగళ్ళంచు వి. తెల్లగళ్ళఅంచు.

సం.శుభ్ర -. తెల్లని.

<సం శుభ్ర - + గళ్ళఅంచు. (మిశ్రన.).

శుభ్రపట్టి వి. తెల్లపట్టెలు పడేట్టు నేసిన అంచు.

సం. శుభ్ర -. తెల్లవి.

<సం.శుభ్ర-+పట్టె. (మిశ్రన.).

శుభ్రపట్టిచీర వి. తెలుపు పట్టెలు వచ్చేట్టు నేసిన ఒక రకం చీర.

శమారు రూ.చూ. సుమారు. వి. అందాజు, రమారమి.

శూన్యముచేయించు అ.క్రి, చేతబడి చేయించు.

సం. శూన్య -. ఏమీ లేకపోవటం.

<సం. శూన్య-+-ము+చేయించు.

శూర్పణఖమేనగోడలు వి. గయ్యాళి. శుక. 3.19.

సం. శూర్పణఖా. రావణునిచెల్లెలు.

<సం. శూర్పణఖా+మేనగోడలు.

శూల రూ.చూ. సూల. వి. 1. ఇటుక, సున్నం, పెంకుకాల్చే కట్టడం; 2. సున్నం మాత్రమే కాల్చే కట్టడం; 3 పోటీనిర్మాణంలో రాకూడని తప్పు.

శూలం రూ.చూ. సూలం. వి. సారెను వంచటానికి వీలుగా అడుగు భాగం లావుగా పైభాగం సన్నగా చేసిన కఱ్ఱ దిమ్మ.

శూలకుట్టు వి. కడుపునొప్పి. జనప. 6.150.

సం. శూల-. కొఱ్ఱు.

<సం.శూల-+కుట్టు. (మిశ్రన.).

శృంగారకట్ట వి. చీపురుకట్ట.

సం. శృంగార -. శృంగారరసం, వలపు, రతి.

<సం.శృంగార-+కట్ట.

శెకడా రూ. చెకడా, శెకదా, శేకడా. సేకడా. విణ. శాతం.

హిం. సైకడ్. నూరు, నూరుమందిగల జనసమూహం.

<హిం. సైకడ్,

శెకదా రూ.చూ. శెకడా. విణ. శాతం.

శెంకు రూ.చూ. శంకు. వి. పూజకొయ్య. మూలస్తంబం, శాస్త్ర పద్ధతిలో చెక్కి గృహనిర్మాణానికి ఓం ప్రథమంలో ఈశాన్యమూలలను పాతేకొయ్య.

శెంకుస్థాపం రూ.చూ. శంకుస్తాపం. వి. గృహనిర్మాణానికి ముమ్ముందు కట్టిన వేదికలో శంకుకఱ్ఱను మంత్రపూర్వకంగా పాతటం.

శెంఖు రూ.చూ. శంకు. వి. పూజకొయ్య, మూలస్తంబం, శాస్త్ర పద్ధతిలో చెక్కి గృహనిర్మాణానికి ఓం ప్రథమంలో ఈశాన్యమూలలను పాతేకొయ్య.

శెనగలు చూ. చెనగ. వి.బ.వ. సెనగలు.

శెమ్మస్ రూ. చెమ్మస్, శెమ్మాస్ వి. చెవాల. పొడుగాటి కామగల ఒకరకం పార, మట్టితవ్వకానికి గుల్లగాఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

శెమ్మాస్ రూ.చూ. శెమ్మస్. వి. చెవాల, పొడుగాటి కామగల ఒకరకం పార, మట్టితవ్వకానికి గుల్లగా ఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

శెమ్మె రూ. శెమ్మే, సెమ్మి, సెమ్మె. వి. 1. నూనెపేసి దీపం పెట్టే లోహపుప్రమిద; 2. మయినపు వత్తి ఉంచే దిమ్మ.

ఉ. అర. షమ్. దీపం, కొవ్వొత్తి, మైనం, షమ్‌దాన్. దీపస్తంభం.

<ఉ, షమ్.

శెమ్మే రూ.చూ. శెమ్మె. వి. 1. నూనెవేసి దీపం పెట్టే లోహపుప్రమిద ; 2. మయినపువత్తి ఉంచేదిమ్మ.

శెరాయి రూ.చూ. షరాయి. వి. పైజమా.

శెలవులనవ్వు వి. సెలవివారనవ్వే నవ్వు. తాళ్ల.సం. 3.198.

<సెలవి+-లు+-అ[7]+నవ్వు.

శెల్లా రూ. శల్ల, శల్లా, సెల్ల, సెల్లా. వి. పట్టువస్త్రం. నె కా. ఒంగోలు. 37.

సం. చేల -. వస్త్రం ; హిం. శాల్. ఒకవిధమైన పట్టుశాలువా ; గు. శాల -. సన్నని పట్టువస్త్రం ; మరా. శాలూ. ఉత్తమమైన పట్టువస్త్రం.

<సం. చేల-.

శెవ్వాల రూ.చూ. చెవాల. వి. ఇనపచేవ. పొడుగాటి కామగల ఒకరకంపార, మట్టితవ్వకానికి గుల్లగాఉన్న నేలనుఎత్తి పోయటానికి పనికివచ్చే పరికరం.

శెవ్వాలు రూ.చూ. చెవాల. వి. ఇనపచేవ, పొడుగాటి కామగల ఒకరకంపార, మట్టితవ్వకానికి. గుల్లగాఉన్న నేలను ఎత్తి పోయటానికి పనికివచ్చే పరికరం.

శేక వి. పానకం.

సం. సీక-. చల్లటం, శీకరస్నానం.

శేకడా రూ.చూ. శెకడా. విణ. శాతం.

శేకం రూ.చూ. శాక. వి. ఆముకాల్పుయొక్క వేడి.

శేకు రూ.చూ. శేఖు. వి. 1. ముఖ్యుడు, ప్రముఖుడు ; 2. మహమ్మదీయుల్లోని నాలుగుతెగల్లో మొదటితెగకు చెందినవాడు.

శేఖు రూ. శేకు. వి. 1. ముఖ్యుడు, ప్రముఖుడు. ద. హిం, శా. సంపు. 10. శా. సం. 780 ; 2. మహమ్మదీయుల్లోని నాలుగుతెగల్లో మొదటి తెగకు చెందినవాడు.

హిం. శేఖ్. మహమ్మదు వంశజుల ఉపాధి, ఇస్లాం ధర్మాచార్యుడు ; మరా. శేఖ్. ముసల్‌మాను పండితుడు, విద్వాంసుడు, వృద్ధుడు ; ఉ. షెఖ్. వృద్ధుడు, పేరునేత, ధర్మశాస్త్రజ్ఞుడు ; పార. షైఖ్. వృద్ధుడు, మహమ్మదీయపండితుడు, ముఖ్యుడు, మతబోధకుడు.

<ఉ. షేఖ్.

శేటు వి. ఋణదాత.

సం. శ్రేష్ఠిన్. గొప్పవర్తకుడు, శిల్పిశ్రేష్ఠుడు ; ప్రా. సెట్టి ; ఒ. శేఠి. చాకలికులం ; హిం. సేఠ్. వ్యాపారసంస్థనాయకుడు, ధనవంతుడు ; మరా. శేఠ్, శేఠే. ఋణదాత.

<మరా. శేఠ్.

శేద రూ.చూ. సేద. వి. అలసట.

శేంది వి. కల్లు.

ఉ. సేందీ. కల్లు ;

తు. సేంది ; త. చేంతి.

<ఉ. సేందీ.

శేపుకొను చూ. చేపు. అ.క్రి. బలంలేకుండా శరీరం ఊరు.

శేమ్యా రూ.చూ. సేవియ. వి. భక్ష్యవిశేషం.

శేర్ రూ.చూ. సేరు[1]. వి. 1. దేశంలో ఒకో ప్రాంతంలో ఒక్కొక్క విధంగా ఉండేకొలపాత్ర. కొలతరాయి ; 2 ఎనభై తులాలఎత్తు.

శేరి రూ. శేరీ. వి. 1. వ్యవసాయం చేయబడే భూసముదాయక్షేత్రం ; 2. పట్టాభూమి, భూఖామందు శిస్తు చెల్లిస్తూ రైతులతో సేద్యం చేయించేభూమి.

శేరీ రూ.చూ. శేరి. వి. పట్టాభూమి. భూఖామందు శిస్తు చెల్లిస్తూ రైతులతో సేద్యం చేయించేభూమి.

శేరీకాస్త వి. సొంతశేరీ, జమీందారు కిందఉన్న పెద్ద ఉద్యోగస్థుడుసొంతగా చేసుకొనే వ్యవసాయం. శేరీసారు వి. దేశముఖుల దగ్గరనుండి భూమిగుత్తకు తీసుకొని సేద్యం చేయించేవాడు.

శేరు[1] రూ.చూ. సేరు[1]. వి. 1. దేశంలో ఒక్కొప్రాంతంలో ఒక్కొ విధంగా ఉండే కొలత ; 2. దేశంలో ఒక్కొ ప్రాంతంలో ఒక్కొవిధంగాఉండె కొలపాత్ర ; 3. ఎనిమిది పలాలఎత్తు.

శేరుకుండ రూ. సేరుకుండ. వి. సేరుబియ్యం ఉడికే కుండ. శేరుముంత రూ. సేరుముంత. వి. 1. కల్లుఅమ్మకంలో వాడే మట్టిపాత్ర ; 2. సేరుకొలతకల పదార్థంపట్టే పాత్ర.

శేరు[2] వి. 1. గిలకజబ్బు (వృషణవ్యాధి), హెర్నియా ; 2. పశువుల మగగురి.

శేవకమాన్యం వి. నౌకరీమాన్యం. E.C. సంపు. 12, తుంకూరు. 52. క్రి.శ. 1447.

సం. సేవక-. నౌకరు.

<సం. సేవక-+మాన్యము (మిశ్రస.).

శేణం రూ.చూ. శ్రావణము. వి. సేనం. రాతినిముక్కలుగా కొట్టటానికి నునుపుచేయటానికి పనికివచ్చే పరికరం.

శేవంతిపువ్వు చూ. చేమంతిపువ్వు. వి.బ.వ. చేమంతిపూవు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 505. క్రి.శ. 1313.

శేషము(జేయు(-చేయు) స.క్రి. అర్పించు. పరమ. 5.676.

సం. శేష-. మిగిలినది.

<సం. శేష-+-ము+-ను+చేయు.

శైత్యము వి. జలుబు.

సం. శైత్య- చల్లదనం.

<సం. శైత్య-. (అర్థవిపరి.).

శైవము వి. శాఖాహారభోజనం.

సం. శైవ-. శివసంబంధి.

<సం. శైవ-. (అర్థవిపరి.).

శైవలాకు వి. పాచి.

సం. శైవల- నీటిపాచి, నాచు.

<సం. శైవల-+ఆకు (మిశ్రస.).

శొంఠి రూ. సొంటి. వి. ఉదకబెట్టి ఎండబెట్టిన అల్లం, సొంటి. కాశీ. 7.186.

సం. శుంఠి-. సొంటి, శుంఠ్, శుంఠయతి. ఎండించు, ఎండు ; ప్రా. సొంఠీ. సుంఠ. సొంఠయ ; అ.మా. సిఉండే, సుంఠ. సుంఠీ ;

క. సుంటి, సొంటి. తు. సుంటి ; స్ూంటి, సొంటి ; త. చుంటి, చొంటి ; మ. శుంఠి.

< పా. సోంఠీ.

శొంఠికొమ్ము రూ.చూ. సొంటికొమ్ము. వి. ఎండిన అల్లంముక్క.

**శోకణాలు** రూ. శోకండాలు. వి.బ వ. ఏడ్పులు.

నం. శోక-. దుఃఖం.

**శోకండాలు** రూ.చూ. శోకణాలు. వి.బ.వ. ఏడ్పులు.

**శోకవరాళి** వి. ముప్పైరెండు నపుంసకరాగాల్లో ఒకటి. హంస. 5.124.

**శోధించు** రూ. చోదిచ్చు, చోదించు. న.క్రి. వడబెట్టు, మురికిని తొలగించు.

నం. శుధ్. వెదకు, పరీక్షించు, శుద్ధిచేయు.

<నం. శుధ్+-ఇంచు³.

**శోబ** రూ.చూ. శోభ. వి. అంచులోనేసే ఒకరకం డిజైను.

**శోబనకడ్డీ** రూ.చూ. శోభనకడ్డీ. వి. అంచులోనేసిన ఒకరకం సన్నపట్టె.

**శోబనంచీర** రూ.చూ. శోభనంచీర. వి. గర్భాదానంనాడు పెళ్ళికూతురికి పెట్టే తెల్లచీర.

**శోబన్‌తీగ** రూ.చూ. శోభనతీగ. వి. అంచులోనేసిన ఒకరకం డిజైను.

**శోబన్‌తీగె** రూ.చూ. శోభనతీగ. వి. అంచులోనేసిన ఒకరకం. డిజైను.

**శోబయిటికి** రూ.చూ. సోబయిటికి. వి. చాలా తక్కువగా కాలినఇటిక.

**శోభ** రూ. శోబ. వి. అంచులోనేసే ఒకరం డిజైను.

సం. శోభా. కాంతి.

<నం. శోభా.

**శోభనకడ్డీ** రూ. శోబనకడ్డీ. వి. అంచులోనేసిన ఒకరకం నన్నపట్టె.

సం. శోభన-. ప్రకాశించేది. శుభప్రదమైనది.

<నం. శోభన-+కడ్డీ.

**శోభనంచీర** రూ. శోబనంచీర. వి. గర్భాదానంనాడు పెళ్ళి కూతురికి పెట్టే తెల్లచీర.

**శోభనతీగ** రూ. శోబన్‌తీగ, శోబన్‌తీగె. వి. అంచులోనేసిన ఒకరకం డిజైను.

**శోభనము** వి. 1. పునస్సంధానం, గర్భాధానం. సుభద్రా కళ్యాణము ప్ర. 49, రాధికా 1.100 ; 2. స్త్రీలు వివాహాదులలో పాడేపాట. శుక. 1.434.

నం. శోభన-. ప్రకాశించేది, సుందరమైనది, శుభప్రదమైనది, శుభం, శుభకర్మ

<నం. శోభన- (అర్థవిపరి.).

**శ్యామసుందరంచు** రూ శామసుందరంచు. వి. ఒకరకం రంగులో నేసిన చీరఅంచు.

నం. శ్యామసుందర-. నీలంవర్ణంకల అందమైనది.

<నం. శ్యామసుందర-+అంచు¹.

**శ్రహి** రూ.చూ. శ్రాహి. వి. పన్నెండు నెలలకాలం, సంవత్సరం. లేఖకదోషం కావచ్చు. E.I. సంపు. 15. కా.సం, 80. క్రీ.శ. 1078.

**శ్రావణము** రూ. శ్రేణం, స్రావణము. వి. 1. కంసాలి సాధనాల్లో ఒకటి ; 2. సేనం, రాతిని ముక్కలు ముక్కలుగా కొట్టటానికి నునుపు చేయటానికి పనికివచ్చే పరికరం.

**శ్రాహి** రూ. శ్రహి. వి. సంవత్సరం, పన్నెండు నెలలకాలం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 169. క్రీ.శ. 1169.

**శ్రిగాకుళం** వి. 1.పిలక ; 2. శ్రీకాకుళం, ఒక ఊరిపేరు

<శ్రీకాకుళము.

**శ్రీకార్యము** వి. దేవాలయ పారుపత్యం. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 1154. క్రీ.శ. 1357.

సం. శ్రీకార్య-. సంపత్కరమైనపని.

<నం. శ్రీకార్య- (అర్థవిపరి.).

**శ్రీకుసుమ** వి. శ్రీకుసుం. 19వ నెంబరు కుసుమ, ఒకరకం ధాన్యం. ఇం. "C" సం.కుసుమ-. పువ్వు. (కుసుమ అనేది ఒకరకం, ధాన్యం.

< ఇం. కుసుమ- (కృతకప్రామాణికరూపం).

**శ్రీధాన్యకటకము** వి. ధాన్యసమృద్ధి. రుక్మా. చ. 1.136. 'శ్రీధాన్యకటకము' ఒకఊరిపేరు.

<శ్రీధాన్యకటకము.

**శ్రీపాదమంటపము** వి. దేవాలయ మంటపం. T.D.I. సంపు. 6. శా. సం. 25. క్రీ శ. 1628.

నం. శ్రీపాదమండప-. ఒకానొక మండపం.

<నం. శ్రీపాదమండప-.

**శ్రీమంగలి** వి. మంగలివాడు, మంగలి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1384.

నం. శ్రీ-. శుభమైనది, లక్ష్మి.

<నం. శ్రీ+మంగలి.

**శ్రీముఖమంటపము** వి. దేవాలయ ముఖ మంటపం. ద హిం.శా. సంపు. 5. శా.సం. 39. క్రీ శ. 1424.

సం. శ్రీముఖ-. సంపత్కరమైన ముంగిలి, మండప-. మంటపం.

<నం. శ్రీముఖమండప- (మిశ్రస.).

**శ్రీయ్యంగము** వి. విగ్రహదేహం, మూర్తి. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1368. క్రీ. శ. 1287.

నం. శ్రీ. మంగళప్రదమైన, అంగ-. శరీరం, అవయవం.

<నం. శ్రీ-+అంగ-+ము.

**శ్రీరంగకస్తురిపట్టెలు** వి.బ.వ. ఒకరకం పువ్వు.

నం. శ్రీరంగ-. శ్రీరంగమనే వైష్ణవక్షేత్రం, కస్తూరీ. కస్తురి.

<నం. శ్రీరంగ+నం. కస్తూరీ+పట్టెలు (మిశ్రస.).

**శ్రీరంగనీతులు** వి.బ వ. శుష్కనీతులు.

నం. శ్రీరంగ-. ప్రసిద్ధమైన వైష్ణవక్షేత్రం, నీతి-.సూక్తి.

<నం. శ్రీరంగనీతి+-లు (అర్థవిపరి.).

**శ్రీరంగములు** రూ. శ్రీరంగాలు. వి. బ. వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

**శ్రీరంగాలు** రూ.చూ. శ్రీరంగములు. వి. బ. వ. ధాన్యవిశేషం

సం. శ్రీరంగ-. ఒక ప్రసిద్ధ వైష్ణవక్షేత్రం.

<సం. శ్రీరంగ-+ము+-లు (అర్థవిపరి.).

**శ్రీరామచిక్కుడు** వి. గోరుచిక్కుడు, మటిక, గోకిరి.

సం. శ్రీరామ-. రాముడు.

<సం. శ్రీరామ-+చిక్కుడు (మిశ్రన.).

**శ్రీరామచుట్టు** అ.క్రి. రద్దుచేయు, కొట్టివేయు.

సం. శ్రీరామ-. దాశరథి.

<సం. శ్రీరామ-+చుట్టు (మిశ్రన.).

**శ్రీరామతోపులు** వి.బ.వ. వస్త్రభేదం. సిం. ద్వా. 3.3.206.

సం. శ్రీరామ-. రామభద్రుడు.

<సం. శ్రీరామ+తోపులు (మిశ్రన.).

**శ్రీరామసేన** వి. గుంపు. మను. 4.16.

సం. శ్రీరామసేనా. రామునిసేన, కోతిమూక.

<సం. శ్రీరామసేన- (అర్థవిపరి.).

**శ్రీవకిలి** వి. అంగణం ముఖద్వారం. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 498. క్రీ.శ. 1309.

సం. శ్రీ-. మంగళప్రదమైన.

<సం శ్రీ+వాకిలి.

**శ్రీవరాళి** వి. (సంగీతం) ముప్పైరెండు నపుంసక రాగాల్లో ఒకటి. హంస. 5.124.

**శ్రీవాకిలిఅంగరక్ష** వి. రాజభవన ద్వారపాలకుడు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 425. క్రీ.శ. 1270.

**శ్రీసేషపడి** వి. భక్తులకు పంచబడే దేవుని నైవేద్య విశేషం. నె. శా. కందుకూరు. 66. క్రీ.శ. 1269.

సం. శ్రీ. సంపత్కరమైనది, శేష-. మిగిలినది, తినగా మిగిలిన అన్నం, నిర్మాల్యం.

<సం. శ్రీశేష-+పడి (మిశ్రన.).

**శ్రుతపడు** అ. క్రి. వినబడు.

సం. శ్రుత-. విన్నది.

<సం. శ్రుత-+పడు.

**శ్రుతపఱచు** స.క్రి. వినిపించు, చెప్పు. (శ్రుతపడు ప్రేరణ రూపం). రాధికా. 1.70.

సం. శ్రుత-. విన్నది.

<సం. శ్రుత-+పఱుచు.

**శ్రేణి** రూ.శ్రేణీ, శ్రేవిణీ. వి దంతె, దూలానికి అడ్డంగాగాని దూలానికి బదులుగాగాని గోడలమీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కన వాసం.

సం. శ్రేణి-, శ్రేణీ. వరుస.

<సం. శ్రేణి- (అర్థవిపరి.).

**శ్రేణీ** రూ.చూ. శ్రేణి. వి. 1. పట్టె, కడ్డీ; 2. కొయ్యవాసం.

**శ్రేణీపట్టె** వి. వాటు, మిద్దెగోడలమీద వేసే అడ్డుకడ్డీ.

**శ్రేవిణీ** రూ.చూ. శ్రేణి. వి. దంతె. దూలాలమీద అడ్డంగా గాని దూలానికి బదులుగా గాని గోడలమీద కప్పుకు ఆధారంగావేసే చెక్కనవాసం.

**శ్రేవిణీకమ్మి** వి. తార్సకడ్డీ, డాబాదూలంమీద పరిచే దంతె.

**శ్రోత్రియకట్నాలు** వి.బ.వ. బ్రాహ్మణ మాన్యాలపై విధింపబడిన కట్నాలు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 586. క్రీ.శ. 1448.

సం. శ్రోత్రియ-. వేదపండితుడు.

<సం. శ్రోత్రియ-+కట్నములు (మిశ్రన.).

**శ్రోత్రియము** వి. స్వల్పంగా ఇచ్చే పన్ను.

**శ్రోత్రియంమడి** వి. 1. వేదపండితులకు జమీందార్లు అన్ని హక్కులు చెల్లేట్టుగా ఇచ్చిన ఇనాంభూమి. ప్రధానంగా తోటలు, మెట్టపొలాలు దీనిపై పన్ను గవర్నమెంటుకే చెల్లించుకోవాలి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 28. క్రీ.శ. 1506; 2. స్వల్పంగా ఇచ్చేపన్ను.

సం. శ్రోత్రియ-. వేదంబాగా చదివినవ్యక్తి.

<సం. శ్రోత్రియ-+మడి.

**శ్రోతియంమడి** చూ. శ్రోత్రియము.

**శ్లాపు** రూ.చూ. శ్లాబు. వి. పడతరం, సిమెంటు పోత పోసి తయారుచేసిన కప్పు.

**శ్లాబు** రూ. శలాపు, శ్లాపు, సలాపు, సిలాబు, సులుబు, స్లాపు, స్లేబు, స్లేంపు. వి. పడతరం, సిమెంటు పోతపోసి తయారు చేసిన కప్పు.

ఇం. *Slab*. రాతిబిళ్ళ.

<ఇం. Slab.

**ష** వి. మూర్ధన్య శ్వాస వివృత మహాప్రాణవర్ణం. అన్యదేశ్య పదాలలోమాత్రం ఈవర్ణం కన్పిస్తోంది. ద్రావిడభాషలలో ఇది స్వతహాగా లేదు.

**షంలా** వి. నడుముకు కట్టుకునేందుకు లేదా తలకు చుట్టుకునేందుకు ఉపయోగించే ఒకరకం శాలువా.

ఉ. పార. షమ్లహ్. మడతలలో చెక్కబడిన తలపాగా లేదా కమర్బందుయొక్కకొన, నడుముకు లేదా తలకు చుట్టుకొనే సన్నటి శాలువా.

<ఉ. షమ్లహ్.

**షంషేరు** రూ.చూ. శంషేరు, వి. ఖడ్గం, కత్తి.

**షడాయించు** స.క్రి. 1. దంచు, నూరు; 2. తిట్టు.

హిం. సడానా కుళ్ళచేయు, ఇతరుల్ని దుర్దశలో పడచేయు. <హిం. సడా(నా)+-ఇంచు.[3]

**షఫర్** వి. యాత్ర.

ఉ. అర. సఫర్. యాత్ర, ప్రయాణం. మహమ్మదీయసంవత్సరంలో రెండవ నెలపేరు;

త. చాపర్, సఫర్, యాత్ర, ప్రయాణం, మహమ్మదీయ సంవత్సరంలో రెండవనెల.

<ఉ. సఫర్.

**షబేబరాత్** వి. మహమ్మదీయ పండుగలలో ఒకటి.

ఉ. అర. షబ్. రాత్రి. షబ్-బరాత్. షాబాన్‌నెలలో పదిహేనవ రాత్రి.

<ఉ. షబ్-బరాత్,

**షమ్లా** రూ.చూ. షెమ్లా. వి. తలకు చుట్టుకోవటానికి నేసిన బట్ట.

**షరకస్తు** వి. వాటా, భాగస్వామిభావం. నె.శా. సంపు. 2.శా. సం. 125. క్రీ.శ. 1570.71.

ఉ. షరాకత్. వాటా, భాగం, భూమిలో భాగం.

<ఉ. షరాకత్.

షరతు రూ. శరత్తు, పరత్తు, షర్తు, సరత్తు. వి. 1. నిబంధన ; 2. అగ్రిమెంటు ; 3. పందెం.

హిం. షరత్, షర్త్. నిబంధన ; ఉ. అర. షర్త్. నిబంధన, కూలి, ఏర్పాటు, సంజ్ఞ ;

క. శరత్. శరతు, శర్త్. షరత్. పందెం, అగ్రిమెంటు, ఒప్పుకొనబడిన నిబంధనలు, బెట్ ; త. సరత్తు.

< ఉ. షర్త్.

షరత్తు రూ.చూ. షరతు. వి. 1. నిబంధన ; 2. అగ్రిమెంటు.

షరత్తుబంది వి. ఒడంబడిక. ఉ. అర. షర్త్. ; పార. బందీ. షరతుకులోబడ్డవాడు. < ఉ. షర్త్. పార. బందీ.

షరబతు రూ. షర్బతు. వి. చక్కెర, నిమ్మరసం కలిపితయారుచేసిన ఒకవిధమైన పానీయం.

హిం. షర్బత్. సిరప్. పానకం, పానీయం, తాగటానికి ఉపయోగించే ఒకమత్తు పదార్థం ; ఉ. అర. షర్బత్.

క. షరబత్ ; త. చర్బత్తు, సర్బత్ ; మ. సర్‌వత్తి.

< ఉ. షర్‌బత్.

షరా వి. 1. జీతం ; 2. గమనిక ; 3. షరతు ; 4. చిట్టచివర రాసే వాక్యాలు ; 5. అనుబంధం, చేర్పు.

హిం. షరహ్. వ్యాఖ్య, వివరణం, వడ్డీ, సందర్భసహిత వ్యాఖ్య ; మరా. షరా ; ఉ. అర. షరహ్, నోట్సు, వ్యాఖ్యానం ;

క. షరా, రిమార్కు, తాజాకలం ; త. చరా, షరా,

< ఉ. షరహ్.

షరాఖత్తు రూ. షరాఖిత్తు వి. పాలికాపుతనం.

హిం.ఉ. షరాఖత్. పాలికాపుతనం.

< హిం. ఉ. షరాఖత్.

షరాఖిత్తు రూ.చూ. షరాఖత్తు. వి. పాలికాపుతనం.

షరాపు రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయివిలువ నిర్ణయించే ఉద్యోగి.

షరాబు రూ.చూ. సరాఫు. వి. 1. నాణ్యాదుల్ని కొని అమ్మే వర్తకుడు ; 2. కోశీదారుడు ; 3. సాహుకారు ; 4. చిల్లర మార్చేవాడు ; 5. ధనికుడు.

షరాయి రూ. చరాయి, చెరాయి, శెరాయి, షెరాయి, సరాయి. వి. నిక్కరు.

ఉ. అర. షర్-ఈ. ఇజారు.

< ఉ. షర్-ఈ.

షరారతు రూ.చూ. శరారతు. వి.1. దుర్మార్గం ; 2. పాడుచేయటం.

షరారత్తు రూ.చూ. శరారతు. వి. 1. పాడుచేయటం ; 2 దుర్మార్గం.

షరాళ్ళు వి.బ.వ. చిన్నగిన్నెలు.

హిం. ఉ. అర. సరావ్. జగ్గు, కుండ, పొడవైనమెడ కలిగినపాత్ర.

< ఉ. సరావ్+-లు.

షరాపు రూ.చూ. సరాఫు. వి. 1. ధనాన్ని తనదగ్గరుంచుకొని దానితో వ్యాపారం చేసేవాడు ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

షరికు రూ.చూ. షరీకు. వి. సంబంధంపెట్టుకోవటం, కలసి ఉండటం.

షరీకు రూ. షరికు, షరిఖు, షరీఖు, షలీఖు. వి. సంబంధం పెట్టుకోవటం, కలసి ఉండటం, చెలిమి.

హిం. షరీక్. కూడిన, చేరిన, కలిసిన, భాగస్వామి, సహాయకుడు, స్నేహితుడు, తోడ్పడినవాడు, శరీక్. సం. బంధించినది, కలసినది, స్నేహితుడు ; ఉ. అర. షరీక్. భాగస్వామి,

< ఉ. షరీక్.

షరీఖు రూ.చూ. షరీకు. వి. చెలిమి. లాలూచీ, కలయిక.

షరీఫ్ వి. షేకు వంశస్థుల యొక్క కులనామం.

హిం. శరీఫ్. గొప్పవాడు, పెద్దమనిషి, కీర్తిగల, పవిత్రమైన, స్వచ్ఛమైన, ఘనమైన, ప్రసిద్ధమైన ; ఉ.అర. షరీఫ్. గొప్పకీర్తిగల, శ్రేష్ఠమైన, ప్రసిద్ధులైన, మక్కా పరిపాలకుల బిరుదు.

< ఉ. షరీఫ్.

షర్టింగు రూ. సర్టింగ్. వి. చొక్కాల కోసం నేసిన బట్ట.

ఇం. Shirting. చొక్కాగుడ్డ.

< ఇం. *Shirting.*

షర్టు వి. చొక్కా.

ఇం. Shirt. చొక్కా.

< ఇం. *Shirt.*

షర్తు రూ.చూ. షరతు. వి. 1. నిబంధన ; 2. ఒప్పందం.

షర్బతు రూ.చూ. షరబతు. వి. తియ్యని చలవ పానీయం, చక్కెర నిమ్మరసం కలిపి తయారుచేసే పానీయం.

షర్రాభు రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

షలీఖు రూ.చూ. షరీకు. వి. సంబంధం పెట్టు కోవటం, కలసి ఉండటం.

షవ్వాల్ వి. మహమ్మదీయ సంవత్సరంలో పదో నెలపేరు.

ఉ. అర. షవ్వాల్. పదోనెలపేరు ;

త. షవ్వాల్.

< ఉ. షవ్వాల్.

షష్టికలు రూ. సత్తిగలు. వి.బ.వ. అరవైరోజులపంట.

సం. షష్టి -.అరవై, షష్టిక -.అరవైకి సంబంధించినది.

< సం. షష్టి క- (అర్థవిపరి.).

షష్ఠాష్టకం వి. విరోధం, సరిపడక పోవటం.

సం. షష్ఠ -. ఆరు, అష్టక -. ఎనిమిది.

< సం. షష్ఠాష్టక - (అర్థవిపరి.).

షహర్ రూ.చూ. షహరు. వి. 1. పట్టణం ; 2. నగరం.

షహరు రూ. శహరు. షహర్, షాహరు, షిహిర. వి. పట్టణం. రంగా.చ. 1.148.

హిం. శహర్. పట్టణం ; మరా. శహర్ ; ఉ. షహర్. పట్టణం ; పార. షహ్ర్ ;

క. శహర్, శహర, శహరు, షహరు ; త. షకర్.

< ఉ. షహర్.

**షహా** రూ.చూ. శాహ. వి. **1.** రాజు ; **2.** చదరంగపు ఆటలో 'షా' చెప్పటం.

**షా** రూ.చూ. శాహ. వి. **1.** రాజు, ప్రభువ ; **2.** సయ్యదాని స్త్రీల ఇంటిపేర్లలో ఒకటి ; **3.** నలుపువన్నె ; **4.** చదరంగంలోని ఒకఎత్తు.

**షాకు**[1] వి. ఆదాయవ్యయాలు లిఖించే పద్ధతి. భాగం. బే.ప. 14.47.

ఉ. షాఖ్. ఖండం, ముక్క. విభాగం.

< ఉ. షాఖ్.

**షాకు**[2] వి. దెబ్బ. విద్యుద్ఘాతం.

ఇం. *Shock*. దెబ్బ. ఆఘాతం, హఠాత్తుగా కలిగే భయం, దిగులు.

< ఇం. Shock.

**షాది** వి. మహమ్మదీయులు జరిపే ఒకరకమైన వివాహం.

హిం. శాదీ. వివాహం ; ఉ. షాదీ. ఆనందం, వినోదం, పండుగ, వివాహం, సంబరం ;

క. శాది. పెళ్ళి ; త. సాతి.

< ఉ. షాదీ.

**షాను** వి. వైభవం. పద్మ.యు. 4.

హిం. శాన్. ప్రతిష్ఠ. శక్తి. వైభవం ; ఉ. షాన్. ఠీవి, శక్తి, ఆడంబరం, వైభవం, ప్రతిష్ఠ.

< ఉ. షాన్.

**షాపింగు** వి. సరుకులు కొనుక్కోటానికి దుకాణాలకు పోవటం, బజారు చేయటం.

ఇం. *Shopping*. బజారు చేయటం.

< ఇం. Shopping.

**షాపు** వి. దుకాణం.

ఇం. *Shop*. దుకాణం.

< ఇం. Shop.

**షాపెన** రూ.చూ. శాపెన. వి. బట్టీచుట్టూ పేర్చిన ఇటుక.

**షాఫేయి** వ. మహమ్మదీయ తెగలలో ఒకతెగ పేరు.

ఉ. అర. షాపిఈ. "ఇమామ్ సాఫియి యొక్క అనుచరుడు, మహమ్మదీయమతంలో ప్రధానమైన నాలుగు తెగలలో ఒక తెగకు ముఖ్యుడైన ఇమామ్‌అబు అబ్దుల్లా మహమ్మద్ - బిస్ - ఇద్రిస్ యొక్క అనుచరుడు.

< ఉ. షాపిఈ.

**షాబాదురాయి** రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణాలోని శాబాద్ గ్రామప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవరాయి.

**షాబాదురౌతు** రూ.చూ. శాబాదిరౌతు. వి. తెలంగాణాలోని శాబాద్ గ్రామప్రాంతం నుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవరాయి.

**షాబాన్** వి. మహమ్మదీయుల నెలలలో ఎనిమిదో నెలపేరు.

ఉ. అర. ష, బాన్. ముస్లింల ఎనిమిదో నెల ;

త. షాపాన్.

< ఉ. ష,బాన్.

**షాబాష్‌బండ** వి. చాపాటుబండ. వి. తెలంగాణాలోని శాబాద్ గ్రామప్రాంతం నుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవరాయి.

హిం. శాబాస్. బళీ ; ఉ. షాబాస్.

< ఉ. షాబాస్ + బండ.

**షామాను** రూ.చూ. సామాను. వి. **1.** గృహోపకరణాలు ; **2.** పనిముట్లు.

**షామియానా** రూ.చూ. శమేనా. వి. గుడ్డతో నిర్మింపబడిన కుటీరం.

**షామిలాత్** రూ.చూ. షామిలాతి. వి. **1.** నెంబరు పైకి కొంత దున్నని పొలం ; **2.** పనిలో ఉండటం.

**షామిలాతి** రూ. షామిలాత్, షామిలాతు. వి. **1.** నెంబరు పైకి కొంత దున్నని పొలం ; **2.** పనిలో ఉండటం.

ఉ. అర. షామిలాత్. భాగస్వామ్యత్వం, సామాన్య వ్యవహారాలు, పార. షామిలాత్. ఎస్టేటుకు సంబంధించిన భూభాగం ;

క. షామిలాతు ; త. షామిలాత్.

< ఉ. షామిలాత్.

**షామిలాతు** రూ.చూ. షామిలాతి. వి. **1.** నెంబరుపైకి కొంత దున్నని పొలం ; **2.** పనిలో ఉండటం.

**షామీరు** వి. సైన్యాధిపతి. పద్మ.యు. 106.

ఉ. షాహ్‌మీర్. సర్దారు, నాయకుడు.

< ఉ. షాహ్‌మీర్.

**షామీలు** వి. భాగస్వామ్యం.

హిం. శామిల్. సంబంధంగల, కూడిన, చేరిన, ఐక్యమైన ; ఉ. అర. షామిల్. కలసి, కూడి, ఐక్యమైన, సమాఖ్య చేసుకున్న ;

క. శామిల్. కూడిన, చేరిన, పొడిగించిన, త. షామిల్. కూడిన, సంబంధం కలిగిన.

< ఉ. షామిల్.

**షాంబాడరు** వి. లాహిరి, గొలుసు, మొగ్గ వరసగా పడేట్టు నేసినఅంచు.

హిం.ఉ. శామ్. నల్లని ;

ఇం. *boarder*. అంచు.

< హిం శామ్ + ఇం. boarder.

**షామ్యానా** రూ.చూ. శమేనా. వి. గుడ్డతో నిర్మించబడిన కుటీరం.

**షాయి** రూ.చూ. శాయి. వి. సిరా, మషీరసం.

**షాయినామా** రూ.చూ. షాలునామా. వి. అక్షరాలు దిద్దినగుడ్డ.

**షాలునామా** రూ. శాల్‌నామా, షాయినామా, షాళనామా. షాళీనామా. వి. అక్షరాలు దిద్దినగుడ్డ.

ఉ.పార. షాల్-నామా. ఫర్మానాలు, సనదులు వ్రాయటానికి ఉపయోగించే గుడ్డ ;

త. షాల్.

< ఉ. షాల్‌నామా.

**షాళనామా** రూ.చూ. షాలునామా. వి. అక్షరాలు దిద్దినగుడ్డ.

**షాళీనామా** రూ.చూ. షాలునామా. వి. అక్షరాలు దిద్దినగుడ్డ.

**షావుకారు** రూ.చూ. సాహుకారు. వి. **1.** నేతపనివాళ్ళకు కూలిఇచ్చి పనిచేయించేవాడు ; **2.** వ్యాపారి.

**షావెల్** చూ. చెవాల. వి. పొడుగాటికామగల ఒకరకంపార. మట్టితవ్వకానికి, గుల్లగాఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికి

వచ్చే పరికరం.

ఇం. *Shovel.* పెద్ద గరిటెవంటి సాధనం.

< ఇం. Shovel.

షాహ రూ.చూ. శాహ. వి. నవాబు, రాజు.

షాహరు రూ.చూ. షహరు. వి. పట్టణం.

షాహుకారు రూ.చూ. సాహుకారు. వి. వర్తకుడు, ధనికుడు.

షికం[1] రూ. సికం, సిగం. వి. పోరంబోకు, ప్రభుత్వాధికారంలో ఉన్నభూమి.

షికం[2] వి. నీళ్ళు నిలిచే చెరువులోపలిభాగం, తటాకగర్భం.

షికస్తు రూ.చూ. శికస్తు. విణ. **1.** శిథిలమైన ; **2.** విరిగిన.

షికాయ వి. తలస్నానానికి ఉపయోగపడే కాయనిచ్చే ఒకరకం తీగ (Acacia Concinna).

షికారి[1] రూ.చూ. షికారు. వి. వేట, స్వారి, వాహ్యాళి.

షికారి[2] రూ.చూ. షికారీ. వి. **1.** వేటగాడు ; **2.** ఆటగాడు. విణ. వేటసంబంధమైన.

**షికారికొంగు** వి. జింక, పెద్దపులి, పక్షులు, తుపాకీ పట్టుకొన్న వేటగాడు కలిసి పడేట్టు డిజైను నేసిన చీరకొంగు.

షికారీ రూ. శికారి, షికారి[2]. సీకారి[2]. వి. **1.** వేటగాడు ; **2.** ఆటగాడు. విణ. వేటసంబంధమైన.

బెం. ఒ.షికారి. వేటకాడు ; హిం. శికారీ ; ఉ. పార. షికార్. వేట, ఎర, ఆట, దొంగతనం, వెంబడించటం, పైఅదాయం ;

క. శికారి, సికార, సికారి ; త. చికారి, సికారి సికార్. మ. సిక్కార్, సిక్కారి.

< ఉ. షికార్.

షికారు రూ. షికారి[1], సికారు. వి. **1.** వేట ; **2.** సంచారం, **3.** పర్యవేక్షించటం ; **4.** సరదాగా తిరిగిరావటం.

బెం. షికార్. వేట, సంచారం ; ఒ. షికార్, షికారి. వేట, సంచారం ; హిం. శికార్ ; ఉ. షికార్.

< ఉ. షికార్.

**షికార్లుకొట్టు** అ.క్రి. ఊరు తిరుగు.

షికార్లుకొట్టు చూ. షికారు.

షికిస్తా వి. ఉర్దూ లేక పర్షియను భాషలో ఒకవిధమైన చేతిరాత.

ఉ. పార. షికస్తహ్. గొలుసుఅక్షరాలు, ఉర్దూలేదా పర్షియను భాషలో ఒకవిధమైనరాత, విరిగిన, బలహీనమైన, గాయపడిన, జబ్బుపడిన, శక్తిలేని, దివాలాతీసిన క్షీణించిన.

< ఉ. షికస్తహ్.

షిక్మ వి. ఉపభాగం.

ఉ. పార. షిక్మి. ఆధారపడిన, చేర్చబడిన, చేతికింది

< ఉ. షిక్మీ.

షిక్మదార్ వి. షిక్మ కలిగినవాడు.

ఉ. పార. షిక్మి-దార్. కలవాడు.

< ఉ. షిక్మీదార్.

షిక్రాని వి. లేతఎరుపు పూలుపూసే ఒకరకంచెట్టు. దీనికలపతో వ్యవసాయపనిముట్లు, గృహోపకరణసాధనాలు తయారు చేస్తారు (Albzzia amara).

షిపాను వి. సన్నని పట్టుబట్ట, సగిలాతు.

ఇం. *Chiffon.* మునుగు మొ. వాటికి ఉపయోగించే సన్ననిసిల్కుబట్ట.

< ఇం. Chiffon.

షియా వి. ముస్లింలలో ఒకతెగపేరు.

హిం. షియా. మహమ్మదీయులలో ఒకతెగ ; ఉ.అర షి'అ. అలీయొక్కమతాన్ని అనుసరించేవాడు, స్వమతంలోనే భిన్నమార్గాన్ని అనుసరించినవాడు ;

త. షియా.

< ఉ. షి'అ.

షిరాన్నెము వి. ఉత్తర సర్కారు, పాలకొండ, విశాఖపట్టణం కొండల్లోపెరిగే ఒకరకంతీగ (Bridelia Stipularis).

షిరిదమాను వి. నదీ తీరప్రాంతాల్లోనూ, రాళ్ళల్లోనూ పెరిగే ఒకరకం పొద (Homonoiariparia).

షిహిర రూ.చూ. షహరు. వి. పట్టణం.

షీకాయ రూ.చూ. సీకాయ. వి. శిఖాఫలం.

**షీకాయిచెట్టు** రూ.చూ. సీకాయచెట్టు. వి. సీకాయచెట్టు.

షీకాయి రూ.చూ. సీకాయ. వి. శిఖాఫలం.

**షీకాయిచెట్టు** రూ.చూ. సీకాయచెట్టు. వి. సీకాయచెట్టు.

షీడు రూ.చూ. సీడు. వి. నూలులెక్క.

షీషా రూ.చూ. శీసా. వి. సీసా, గాజుతో చేసిన పాత్ర విశేషం.

షుతురు వి ఒంటె. పద్మ.యు. 64.

హిం. శుతుర్. ఒంటె ; ఉ.పార. షుతుర్.

< ఉ. షుతుర్.

షుతురునాళము వి. యుద్ధసమయాల్లో ఒంటెవీపుపైనుండి ఉపయోగించే ఒకవిధమైన ఫిరంగి. రంగా.చ. 1.156.

ఉ. షుతుర్‌నాల్. యుద్ధసమయాల్లో ఒంటెవీపుపైనుండి ఉపయోగించే చిన్నఫిరంగి.

< ఉ. షుతుర్‌నాళ్.

షుమారు రూ.చూ. సుమారు. వి. సరాసరి, దాదాపు, కొంచెం.

షురువు రూ. షురూ. వి. **1.** ప్రారంభం. మొదలు ; **2.** నిబంధన.

హిం. శురూ. మొదలు, ప్రారంభం ; ఉ. షురూ. క. శురు, షురు, సురు.

< ఉ. షురూ.

**షురువుచేయు** అ.క్రి. ప్రారంభంచేయు.

షురూ రూ.చూ. షురువు. వి. **1.** ప్రారంభం, మొదలు ; **2.** నిబంధన.

షెడ్డు రూ. సెట్, సెడ్డు. వి. పక్కగోడలులేని రేకుకప్పుగల పాక.

ఇం. *Shed.* పక్కగోడలులేని కప్పుగల కట్టడం లేక పాక.

< ఇం. Shed.

షెమ్లా రూ. షమ్ల, సెమ్ల, సెమ్లా. వి. తలకుచుట్టుకోవటానికి నేసినబట్ట, సిమ్లాలో నేయబడ్డ బట్టకావచ్చు.

షెరాయి రూ.చూ. షరాయి. వి. నిక్కరు.

షెరిఫ్ రూ.చూ. సరాబు. వి. **1.** క్యాషిపరు ; **2.** కోశీదారుడు ; **3.** రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

షెరీఫు రూ.చూ. సరాబు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీ దారుడు ; 3. రూపాయ విలువ నిర్ణయించే ఉద్యోగి.

షెరీఫు రూ.చూ. సరాబు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీ దారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

షెర్వాని రూ.చూ. షేరువాని.వి. ఒకవిధమైన దుస్తు.

షేక్ రూ. షేకు. వి. మహమ్మదీయులలో ఒక కులంపేరు.

హిం. శేఖ్. వృద్ధుడు, పేరు, నాయకుడు, ధర్మ శాస్త్రజ్ఞుడు ; ఉ. షెఖ్ ; అర. షేమ్‌ఖ్. గౌరవనీయుడైన పెద్దవాడు, ప్రధాని, ప్రధానగురువు, మహమ్మదు అను చరులనుండి కొత్తగా మహమ్మదీయమతంలో ప్రవేశించిన వారికి సంక్రమించిన ఒక బిరుదు ;

క. శేకు, శేఖు ; త. షేక్.

<ఉ. షేఖ్.

షేకు రూ.చూ. షేక్. వి. మహమ్మదీయులలో ఒకకులం పేరు.

షేక్‌దార్ వి. భూమిశిస్తుకు సంబంధించిన ఒక ఉద్యోగి.

ఉ. అర. షేఖ్ - దార్. ముఖ్యుడు ;

క. శేకదార, సేకదార.

<ఉ.షేఖ్+పార.-దార్.

షేనం రూ.చూ. సేనం. వి. రాతిముక్కలు కొట్టటానికి పనికి వచ్చే ఒక అంచుపదునుగాఉండే ఉక్కుముక్క.

షేపు వి. 1. పకాడేమీది అర్ధకమ్మి ; 2. ఆకారం.

ఇం. *Shape*. ఆకారం, రూపం, మూర్తి.

<ఇం. Shape.

షేబాదురాయి రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణాలోని శాబాద్‌గ్రామప్రాంతం నుంచి వచ్చే ప్రసిద్ధమైన చలువ రాయి.

షేర్ వి. వీరుడు. రంగా. చ. 1.115.

ఉ. షేర్. పెద్దపులి, సింహం, వీరుడు.

<ఉ. షేర్.

షేరువాని రూ. షెర్వాని, షేర్వాని. వి. ఒకవిధమైన పైదుస్తు.

హిం. శేర్‌వానీ. ఒకరకమైనదుస్తు ; ఉ. షైర్‌వానీ.

<ఉ. షైర్వాని.

షేర్వాని రూ.చూ. షేరువాని. వి. ఒకవిధమైన పైదుస్తు.

షేవింగు వి. క్షవరం.

ఇం. *Shaving*. క్షౌరం.

<ఇం. Shaving.

షేవు వి. క్షవరం.

ఇం. *Shave*. క్షౌరం.

<ఇం. Shave.

షైరు వి. విహారం.

హిం.ఉ.పార. సైర్. బయటికి పోవటం, మనస్సం తోషానికి బయట తిరగటం.

<ఉ. సైర్.

షోకు రూ.చూ. సోకు. వి. 1. నాజూకు, చక్కదనం ; 2. వగ ; 3. విపరీత అలంకరణం.

షోదాయినికొడుకు చూ. సొదు. వి. దుర్మార్గుడు.

సం. షోడశ -. పదహారు.

షోడా వి. అద్దకం రంగు తయారు చేయటానికి వేడినీళ్ళలో కలిపే ఒకరకం లవణం.

ఇం. *Soda*. ఒకరకం లవణం.

<ఇం. Soda.

షోడాతొట్టి రూ.చూ. సోడాతొట్టి. వి. సోడాల పెట్టడానికి నీళ్ళుపోసివాడే మట్టితొట్టి.

షోదా వి. చెనటి, పనిపాట్లు లేకుండా తిరుగుతూ, స్త్రీలవెటం పడుతూ విలాసంగా తిరుగాడే, రౌడీలాగా దుర్మార్గుడుకాక మెత్తగా ఉండే పనికిమాలినవాడు.

హిం. సుఅటా, సోటా. చిలుక.

షోరు వి. గలభా, కోలాహలం. పద్మ,యు. 102.

హిం. షోర్. కోలాహలం, ఉ. షోర్. గలభా, అల్లరి.

<ఉ. షోర్.

స వి. శ్వాసోష్మ మహాప్రాణవర్ణం. పూర్వం తెలుగులో ఇది దంత్యంగా భావించబడింది. ఇప్పుడు దంతమూలీయంగా ఉచ్చరించ బడుతోంది.

సంయిబుడ్డి వి. సిరాబుడ్డి, మసిమణి.

హిం. ఉ. స్యాహీ. సిరా.

<ఉ. స్యాహీ+బుడ్డి.

సంరక్షగుండు వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రని రాయి.

సం. సంరక్షా. కాపాడటం.

<సం. సంరక్షా+గుండు

సంరక్షణగుండు రూ. సవరచ్చ గుండు, సౌరచ్చగుండు. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.

సం. సంరక్షణ-.కాపాడటం.

<సం. సంరక్షణ-+గుండు.

సంసారంచీర వి. నలుపు, ఎరుపు రంగుల్లో నేసిన చీరలో నిలువుగా బీరపువ్వురంగు గీరలు పడేట్టు నేసిన చీర.

త. సంసారం. ఒక చలనచిత్రం పేరు.

సంసారము వి. కుటుంబం.

సం. సంసార-ప్రపంచం ; హిం. సంసార్.

<సం. సంసార -. (అర్థవిపరి.).

సంసారి వి. 1. యజమాని, ఇంటిసొంతదారు ; 2. పతివ్రత.

సం. సంసారిన్. ప్రపంచ సంబంధమైనది, ప్రాణి, జంతువు, జీవాత్మ, గృహస్థు.

<సం. సంసారిన్ (అర్థవిపరి.).

సంసు వి. 1. సంఖ్య ; 2. కాలం ; 3. పాదం.

సంస్థానము వి. సీమ. నె.శా. కందుకూరు. శా. సం. 80. క్రీ.శ. 1642.

సం. సంస్థాన-.స్థలం, చోటు, ఆస్థానం, నివాసస్థలం.

<సం. సంస్థాన- (అర్థవిపరి.).

సంస్థానికుడు వి. గుడి పారుపత్తె దారుడు. నె శా. పొదిలి. 5. క్రీ.శ. 1518.

సం. సంస్థానిక-. సంస్థానానికి చెందినవాడు.

<నం. సంస్థానిక- (అర్థవిపరి.).

**సకంటి పూసలు** వి. బ. వ. ఎక్కువ శాఖలుకలిగి పొదవుగా పెరిగేపొద (Arthroconemdum glaucum).

**సకంద్రిప కాలాతీత సంవత్సరములు** వి.బ.వ. శకనృప కాలాతీత సంవత్సరాలు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 644. క్రీ.శ. 1060.

నం. శకనృప కాలాతీత సంవత్సర-. శకరాజు కాలం మొదలు పెట్టిన తర్వాతి సంవత్సరాలు.

<నం. శకనృపకాలాతీత సంవత్సర-.

**సకలగిలెం వేసుకొను** అ.క్రి. ఎడమకాలిపాదం కుడితొడ దగ్గరికి, కుడిపాదం ఎడమకాలివేళ్ళ దగ్గరికి వచ్చేలాగా కాళ్ళు మడచుకొని కూర్చొను.

**సకలఫలసంపంగె** వి. మంచి సువాసనగల పూలుపూసే ఒక రకం చెట్టు (Artabotrys odorafissimus).

నం. సకలఫల –.అన్ని పళ్ళు.

<నం. సకలఫల-+సంపంగె (మిశ్రన.).

**సకలముకలంపెట్టుకొను** రూ. నకిలముకులంపెట్టుకొను. అ.క్రి. కుండలు సర్సేటప్పుడు కుమిదిపై కుమ్మరి చతికిలబడి కూర్చొను.

**సకలముక వేసుకొను** రూ. శకము కల్లువేసుకొను, అ.క్రి. కుండల్ని సర్సేటప్పుడు కుమిదిపై కుమ్మరి చతికిలబడి కూర్చొను.

నం. సకల -. సమస్తమైన.

**సకలాతి** రూ.చూ. నకలాతు. వి. 1. మేలైన కంబళిదినుసు. ప్రబంధ. 605 ; 2. ఉన్నిబట్ట ; 3. సింధూరంరంగు బట్ట.

**సకలాతు** రూ. శకలాత్తు, సకలాతి, సకలాత్తు, సకళాతు, సగలాత్, నగలాత్తు, సగళాతు, నగిలాతు. వి. 1. సింధూరం రంగుబట్ట. సానంద. 3.47 ; 2. ఉన్నిబట్ట ; 3. మేలైన కంబళిదినుసు.

హిం. సకలాత్. వస్త్రవిశేషం, ఉపహారం, మడతవేసి కుట్టిన కప్పుకునేగుడ, నిషేధం; ఉ. సకలాత్, సకాలాత్. శాలపటం, గురుత్వం, భారమైంది ; పార. సకలాత్, సకలాట్. శాలపటం ; అర. సకలాత్. శాలం.

<ఉ. సకలాత్.

**సకలాత్తు** రూ.చూ. సకలాతు. వి. ఉన్నిబట్ట.

**సకళాతు** రూ.చూ. సకలాతు. వి. 1. మేలైన కంబళిదినుసు. రసిక. 4.102 ; 2. సింధూరం రంగుబట్ట.

**సకా** రూ. సగ. అవ్య. కూడా.

నం. సహ. తో. కూడా.

<నం. సహ.

**సకారదీర్ఘము** వి. సాని, వేశ్య. 'సా' తో సానిశబ్దం మొదలయింది.

**సకారము** వి. వేశ్య, సాని. సకారంతో'సాని పదం మొదలయింది.

**సకి** రూ.చూ. సకియ. వి. 1. స్త్రీ. విజయ. 3.39 ; 2. చెలికత్తె. దశా. 7.206 ; అచలా. 2.2 : 3. ఆడది, స్త్రీ.

**సకిన** రూ. సకినము, సకినె) సగిన, సగినము. సగినె. వి. 1. కీచుబిళ్ళ విక్ర. 7.89 ; 2. కీచుకీచుమనేధ్వని. మను. 6 ; 3. కృత్రిమపక్షి. వసు. 6.34 ; 4. బొమ్మ. భాను. 4. ఆ;

నం. శకున-. శకునం, శకునపక్షి ; ప్రా. సఉన-, సఉని, సఉణ - శుభాశుభసూచక శరీరావయవస్పందన. అ.మా. సఉణ -. శకునం. శకునపక్షి ; పా. సకుణ -. ఒకా నొకపక్షి, సకుణక-, సకుణికా.

<నం. శకున-.

**సకినలమంచము** రూ. సకినెలమంచము. వి. కీచుకీచుమని మోగే మంచం, రవమంచం.

**సకినము** రూ.చూ. సకిన. వి. 1. శుభసూచకనిమిత్తం. ఆం. భా. 1.98 ; 2. శుభాశుభసూచకవాక్కు.

**సకినంపు(బక్కి(-పక్కి)** వి. శకునపక్షి. **సకినంపు(బులు(గు(-పులు(గు)** రూ. సకినంపు(బుల్గు. వి. సకినంచెప్పేపక్షి విశేషం, పైడికంటి. **సకినంపు(బుల్గు** రూ.చూ. సకినంపు(బులు(గు. వి. శకునపక్షి. **సకినాలపక్కి** వి. శకునపక్షి, గుడ్లగూబ. **సకినాలపులు(గు** వి. శకునపక్షి. వేంక. 101.

**సకినంపు(బక్కి** చూ. సకినము.

**సకినంపు(బులు(గు** చూ. సకినము.

**సకినంపు(బుల్గు** చూ. సకినము.

**సకినాలపక్కి** చూ. సకినము.

**సకినాలపులు(గు** చూ. సకినము.

**సకినాలు** చూ. చక్కిలము. వి.బ.వ. బియ్యంపిండితోచేసిన తినుబండారాలు.

**సకినె** రూ.చూ. సకిన. వి. 1. కీచుబిళ్ళ ; 2. కీచుకీచుమనేధ్వని ; 3. కృత్రిమపక్షి ; 4. బొమ్మ.

**సకినెలమంచము** రూ.చూ. సకినలమంచము. వి. కీచుకీచుమని మోగే మంచం.

**సకియ** రూ. సకి. వి. 1. చెలికత్తియ. శృం.నై. 5. 103 ; 2. ఆడది. అచ్చ.రా.యు. 572.

నం. సఖీ. చెలి ; ప్రా. సహి, సహీ ; శాబరి. శహీ ; శౌ. సహీ ; జై. మహా. సహీ, అ.మా.సహి,సహీ. చెలి ; పా. సక్ఖి, సక్ఖీ, సఖీ : అప. సహి, సహియ ;

క.తు. సకి : కుఇ. సక. స్నేహం, చెలిమి.

<నం. సఖీ.

**సకిరించు** రూ.చూ. సకిలించు. అ.క్రి. గుఱ్ఱం అరచు.

**సకిరింత** రూ.చూ. సకిలింత. వి. గుర్రం కూత.

**సకిరింత** చూ. సకిరించు.

**సకిలముకలమేయు** అ.క్రి. కుండల్ని సర్సేటప్పుడు కుమిదిపై కుమ్మరి చతికిలబడి కూర్చొను.

**సకిలముకులంపెట్టుకొను** రూ.చూ. సకలముకలంపెట్టుకొను. అ.క్రి. కుండలు సర్సేటప్పుడు కుమిదిపై కుమ్మరి చతికిలబడి కూర్చొను.

**సకిలించు** రూ. సగిలించు. అ.క్రి. హేషించు, (గుర్రం) ధ్వని చేయు. హర. 6.86.

**సకిలింత** రూ. సకిరింత, సగిలింత. వి. గుర్రం ధ్వని చేయు, హేష. **సకిలింపు** రూ. సగిలింపు. వి. గుర్రం చేసే ధ్వని, గుర్రం అరుపు.

**సకిలింత** చూ. సకిలించు.

**సకిలింపు** చూ. సకిలించు.

**సకుఁడు** వి. చెలికాడు, స్నేహితుడు.

సం. సఖి-. మిత్రుడు, చెలికాడు ; ప్రా. అ.మా. అప. సహి ; శాబరి. శహి ; శౌ. సహి. 'రాజాహస్సఖిభ్యష్టచ్'. (5.4.91) అనే సూత్రప్రకారం రాజన్ శబ్దం, అహన్ శబ్దం, సఖి శబ్దం అంతంలో కల తత్పురుషసమాసం కంటె టచ్(అ) ప్రత్యయం వస్తుంది. 'కృష్ణసఖః'. అనేది ఉదాహరణ. ఇట్టి సమాసగత రూపాల్ని తప్పుగా విరపటం వల్ల 'సకుఁడు' అనే రూపం నిష్పన్నమౌతుంది.

<సం. సఖి-.

**సకునూగు** వి. ఒకరకం కలువుమొక్క.

**సకేరియా** వి. ముదురు చందనం రంగు.

**సక్కట్టు** వి. మరమగ్గంనాడెను ఒక సొరుగులోనుంచి మరో సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి కింద తోలు ఉంగరం బిగించిన కొయ్యబిళ్ళ.

ఇం. Socket. ఏదైనా నిలిచి ఉండే గూడు లేక పల్లం సొరుగు.

<ఇం. Socket.

**సక్కి** రూ.చూ. చక్కి[1]. వి. గాబు, ఓడ. మొ. తయారీకి అంగుళం మందంతో గుండ్రంగా మట్టితో చేసిపెట్టే వలయాకారభాగం.

**సక్కు**[1] వి. పేలపిండి. ద.హిం.శా. సంపు. 4.శా. సం. 1015. క్రీ.శ. 1084.

సం. సక్తు-. పేలపిండి ; ప్రా. సత్తు.

<సం. సక్తు-.

**సక్కు**[2] రూ.చూ. చక్కి[1]. వి. గాబు, ఓడ మొ. వాటి తయారీకి అంగుళం మందంలో గుండ్రంగా మట్టితో చేసి పెట్టే వలయాకార భాగం.

**సక్కుబాయి** వి. ఒకరకం లేతనీలం రంగు.

మరా. సకుక్కబాయి. పండరీనాథుని భక్తురాలు, ఒక సినిమా పేరు.

<మరా. సకుక్కబాయి.

**సక్తు** రూ.సఖ్తు. విణ. కఠినమైన.

హిం. సఖ్త్-. గట్టి, దృఢమైన, కఠినమైన, కష్టమైనR దుర్మార్గమైన, కఠోరమైన ; ఉ.అర. సఖ్త్-. కఠినమైన, తీవ్రమైన, దృఢమైన, కష్టమైన, భయంకరమైన, క్రూరమైన, బాధాకరమైన, గట్టి.

<ఉ. సఖ్త్.

**సక్రీస్తు** రూ. సంక్రీస్తు. వి. పాదిరిగుడిలో పవిత్రమైన పాత్రలు, వస్త్రాలు భద్రపరచబడే భాగానికి అధికారి.

పో. స్క్రిస్తాన్, స్క్రీస్తి ; కొంకణి. సాంక్రీస్త ; క. స్క్రీస్తి ; త. స్క్రిస్తి.

<పో. సక్రిస్తాన్.

**సఖ్తు** రూ.చూ. సక్తు. విణ. కఠినమైన.

**సగ** రూ.చూ. సకా. అవ్య. కూడా.

**సగంకట్టు** చూ. సగము.

**సగంకట్టుదారం** చూ. సగము.

**సగంకట్టువేయు** చూ. సగము.

**సగంకమ్మి** చూ. సగము.

**సగంకాల్పు** చూ. సగము.

**సగంకొయ్య** చూ. సగము.

**సగటు**[1] రూ. సగుట. వి. చదరంగంలోని శకటం. కువ.చ. 4.108.

సం. శకట-. బండి. ; ప్రా. సగడ-, సగడియా, సగడీ, సయడ-, సాగడిఅ. బండి తోలేవాడు, సఅఢ-. యానవిశేషం ; శౌ. సఅడ-; అ.మా. సగడ-, సగడియా, సగడీ. బండి, సాగడ-. బళ్ళగుంపు ; మా. శఅళ- ; పా. సకట- ;

క. చకడా, చకడె, చక్కడి. పయనపుబండి ; త. చకట, చకటం, చకటు, చకటై, చకాటు, చాయి ; మ. చకటు, చాడు. మూతబండి.

"ద్రావిడభాషలనుండియే సంస్కృతం దీన్ని స్వీకరించి ఉండుననుట యుక్తిసహమ"ని ఆచార్య బరోగారి అభిప్రాయం. సంస్కృతంలో దీనివ్యుత్పత్తి అనిర్దిష్టమని మోనియర్ విలియమ్స్ పు. 1096.

**సగటు**[2] రూ. సగుటు, సౌటు. వి. సరాసరి, సామాన్యం. తాళ్ల. సం. 14.20, ఆం.భా. 3.25.

**సగటురమారమి** అవ్య. సరాసరికి కొద్ది హెచ్చు తగ్గు. సగటుసుమారు వి. సరాసరి కంటె హెచ్చు.

**సగతు** వి. 1. రికాబులకాధారమైన తాడు. (ఈ శబ్దం బహువచనాంతంగానే ప్రయోగాల్లో కనబడుతోంది.). వరాహ. 10.93 ; 2. గుర్రపు పల్లంమీద కెంపులు చిగుళ్ళను, పచ్చలు ఆకులుగాను, రవలు పూలుగాను సంతరించి ఏర్పరచిన బంగారుతీగ మోడిపని. చంద్రాంగ. 2.69.

**సగపడు** చూ. సగము.

**సగపాలు** చూ. సగము.

**సగపెట్టు** చూ. సగము.

**సగమగు** చూ. సగము.

**సగమంత్రము** చూ సగము.

**సగమాటుదేవర** చూ సగము.

**సగము** రూ.చూ. సాము. వి. అర్ధభాగం, అర. పండి. చ. 5.135, భార. విరా. 1.85.

**సగంకట్టు** వి. రాట్నంమీద చుట్టిన అరచిలప పట్టుదారం. <సగము+కట్టు. **సగంకట్టుదారం** వి. రాట్నంమీద చుట్టిన అరచిలప పట్టుదారం. **సగంకట్టువేయు** అ.క్రి. అరచిలపకు కట్టుకట్టు. **సగంకమ్మి** వి. ఎరుపు, కపిల, బీరపువ్వు, తెలుపురంగుల్లో అడ్డకొన నేసిన జంపఖానా. <సగము+కమ్మి. **సగంకాల్పు** వి. ఇటుక మొ.వి కాలీ కాలకుండా ఉండటం. <సగము+కాల్పు. **సగంకొయ్య** వి. జేనకొయ్యకు మరొక జేన దూరంలో బిగించిన కొయ్య. <సగము+కొయ్య. **సగపడు** అ.క్రి. 1. సగమగు ; 2. సరిపడు. <సగము+పడు. **సగపాలు** వి. అర్థభాగం, అరపాలు. భార. ఉద్యో. 1.19. <సగము+పాలు.[1] **సగపెట్టు** స.క్రి. 1. తయారుచేయు ; 2. సవరించు. < సగము + పెట్టు. **సగమగు** అ.క్రి. కృశించు. వేంక. పంచ. 1.528, అష్టమ. క. 222పు. 1 పం. <సగము+అగు. **సగమంత్రము** వి.

నడిమధ్య. సం. మన్త్ర-. ఇంద్రజాలం. <సగము + సం. మంత్ర-. సగమాటుదేవర వి. అర్ధనారీశ్వరుడు. పండి. చ. 3.605. <సగము + మాటు + దేవర. సగమెఱుక వి. మిడిమిడిజ్ఞానం; విణ. సరిపడనిది. <సగము + ఎఱుక. సగంపలక రూ. సొకంపలక. వి. దోనెకూ చేతిపలకకూ మధ్య సగంవరకూ నేసిన నేత. <సగము + పలక. సగంపాయ వి. అచ్చుపళ్ళలో అచ్చుకఱ్ఱ చివరిగుదులు రెంటికీ మధ్యభాగం. <సగము + పాయ. సగరేయి వి. నడిరేయి, అర్ధరాత్రి. <సగము + రేయి. సంగోరు వి. 1. సగభాగం; 2. పంటలోని సగంపాలు. <సగము + కోరు[3].

సగమెఱుక చూ. సగము.

సగంపలక చూ. సగము.

సగంపాయ చూ. సగము.

సగరము రూ.చూ. సవరము[1]. వి. సవరం. జల్లితోక.

సగరేయి చూ. సగము.

సగలాత్ రూ.చూ. సకలాతు. వి. ఉన్నిగుడ్డ.

సగలాత్తు రూ.చూ. సకలాతు. వి. ఉన్నిగుడ్డ.

సగళాతు రూ.చూ. సకలాతు. వి. 1. సింధూరం రంగుబట్ట; 2. ఉన్నిబట్ట, మేలైన కంబళి దినుసు.

సగవేయు అ.క్రి. సిద్ధంచేయు.

హిం. సగా-. సొంత, సంబంధించిన, ఒకేరక్త సంబంధంకల.

సగాల రూ. సగాలు. వి. ప్రాంతం, ప్రదేశం.

సం. సకల-. సమస్తమయినది.

సగాలు రూ.చూ. సగాల. వి. 1. సమీపం, చెంత; 2. చోటు.

సగిచ్చినట్లుండు చూ. సగించు. అ.క్రి. హాయిగాఉండు.

సగించు అ.క్రి. రుచించు, నయించు.

సం. సహ్. రుచించు.

<సం. సహ్- + -ఇంచు[3].

సగిటి వి. బొగ్గులపొయ్యి.

సగిన రూ.చూ. సకిన. వి. 1. కృత్రిమపక్షి; 2. కీచుకీచుమనేధ్వని; 3. కీచుబిళ్ళ; 4. బొమ్మ.

సగినంకడవ చూ. సగినము.

సగినము రూ.చూ. సకిన. వి. శకునం. తాళ్ల. సం. 15.78.

సగినంకడవ వి. పూజించి శకునంకోసం పెట్టే మట్టిపాత్ర. <సగినము + కడవ.

సగినె రూ.చూ. సకిన. వి. 1. కీచుబిళ్ళ; 2. కీచుకీచుమనేధ్వని; 3. కృత్రిమపక్షి; 4. బొమ్మ.

సగిరికాయ రూ. సిగిలకాయ. వి. గుండ్రంగా పొడుగుపీకతో ఉండే నీళ్ళకూజా.

సం. సగర-. అయోధ్యాధిపతి అయిన సూర్యవంశపు రాజు, భగీరథుడి తండ్రి, సలిల-. నీరు.

సగిలకాయి రూ.చూ. సగిరికాయ. వి. గుండ్రంగా పొడుగు పీకతోఉండే నీళ్ళకూజా.

సగిలాతు రూ.చూ. సకలాతు. వి. ఉన్నిబట్ట, పెద్దబట్ట.

సగిలి వి. 1. ఊరిపశువులకొట్టంనుంచి నత్తువను కొట్టుకొని వచ్చిన నీరు; 2. సత్తువ 3. నత్తువ ఎక్కువ కావటం.

సం. సలిల-. ; నీరు, సకల-. మొత్తం; హిం. సగత్. పూర్తి.

సగిలించు రూ.చూ. సకిలించు. అ.క్రి. హేషించు, గుర్రం ధ్వనిచేయు.

సగిలింత రూ.చూ. సకిలింత. వి. గుర్రంచేసేధ్వని హేష. సగిలింపు రూ.చూ. సకిలింపు. వి. గుర్రంచేసేధ్వని.

సగిలింత చూ. సగిలించు.

సగిలింపు చూ. సగిలించు.

సగుట రూ.చూ. సగటు[1] వి. చదరంగంలోనిశకటం.

సగుటు రూ.చూ. సగటు[2]. వి. సరాసరి.

సగెడపు వి. ఉత్తరుసర్కారు, దక్కను, కర్ణాటక. విశాఖపట్నం ప్రాంతాల్లోనూ, సామాన్యంగా పాతగోడలపైన. చెట్లపైన పెరిగే ఒకరకం తీగ (Cadaba indica).

సగ్గపొర చూ. సగము. వి. సరిచేసిన తరవాత పడుగులో సగం వరకూ చుట్టిన పైపోగులు.

<సగము + పొర.

సగ్గారి రూ. సగ్గాలము. వి. నక్క. విష్ణుపు. 4.341.

సం. శృగాల-. నక్క, సృగాలా-, సృగాలీ, సృగాలికా. సృగాలినీ. ఆడనక్క; ప్రా. సిగాల-. సిగాలీ, సిఅల; శౌ. సిఅలీ; జై. మహా. సియాల; అ.మా. సిగాల, సియాల, సియాలగ. నక్క; మా. సిగాల-. నక్క, సిగాలీ. ఆడునక్క; పా. సిగాల-. నక్క, సిగాలీ. ఆడునక్క. సిగాలిక-. సృగాలసంబంధి, సేగాల-. నక్కఊళ;

త. ఇకలమ్, ఇకాలమ్; కుఇ. కొలిఅ; పర్జి· గోలి; గ. కొల్య; ఒ. కొల్య; ఒరయాన్. చిగాలో. నక్క.

<ప్రా. సిగాల-.

సగ్గాలము రూ.చూ. సగ్గారి. వి. నక్క. వై.దీ. 108.

సగ్గించు స.క్రి. అడచు, తగ్గించు.

<సగము + -ఇంచు[3].

సగ్గిసముగ్గిసలు వి.బ.వ. 1. పికాపికలు. కవిక. 3.229; 2. చెల్లా చెదరులు; 3. తత్తరపాటు, సంభ్రమం.

సగ్గు[1] రూ.చూ, స్రగ్గు. వి. చూర్ణం. భార. విరా. 4.70. అ.క్రి. 1. తగ్గు, అడుగు. క్రుంగు. సమీర. 2.20; 2. కుళ్ళు.

సగ్గుడుమగ్గుడగు అ.క్రి. సతమతమగు. తాళ్ల. సం. 11.3.164.

సగ్గు[2] రూ. జగ్గు. వి. గమనవేగాదుల్లో అయ్యేవేగం, శీఘ్రం. పల్నా. 2.254.

సగ్గు[3] రూ. స్రగ్గు. అ.క్రి. కుళ్ళిపోవు. మురుగు (ద్రవంలా).

కుఱు. జరార్. వర్షంవల్ల క్రమక్రమంగానశించు;

బ్రా. సజ్. కుళ్ళిపోవు;

పో.చూ. ప్రా. సడై. కుళ్ళు; పా. సడ్నా; బెం. సడా; సిం. సడ్నాణు; గు. సడవుఁ; మరా. సడ్ణెఁ.

పో.చూ. మరా. సడ్ను. కుళ్ళిపోవు.

**సగ్గు**[4] రూ. సబ్బు[1]. వి. ఒకరకం చెట్టుపాలనుంచి తయారుచేసే కృత్రిమధాన్యం, సగ్గుబియ్యం.

పో. సాగూ ; స్పా. సాగూ, సాగో ; డచ్చి. సగో ; ఫ్రెం. సాగూ. ఆంగ్లంద్వారా తెలుగులో చేరిన మలయా భాషాపదమని బ్రౌ. 8. గాలెటి.

<పో. సాగూ.

**సగ్గుబియ్యము** రూ. సబ్బీము. సబ్బుబియ్యము, వి. ఒకరకమైన కృత్రిమధాన్యం.

**సగ్గెడ** వి. **1**. తాగటానికి నీళ్ళుపోసే తోలుపాత్ర. నవ. 2 ; **2**. చెంబు. అష్టమ. క. 1అ. 50పు. 22పం.

క. సగ్గళె. మంచినీళ్ళపాత్ర.

<క. సగ్గళె.

**సగ్గెరకాయబుడ్డి** చూ. సగిరికాయ. వి. గుండ్రంగా పీకతో ఉండే మట్టిపాత్ర.

**సంకట**[1] రూ.చూ. సంకటి. వి. గంజి వార్చకుండా ముద్దగా వండిన అన్నం.

**సంకట**[2] వి. అంగడిసరుకు, సామగ్రి.

**సంకటపడు** చూ. సంకటము.

**సంకటము** వి. సుఖవ్యాధి.

సం. సంకటు-. ఆపద, కష్టం, ఇరుకుగలది ;

క. సంకటు-. కష్టం.

<సం. సంకట- (అర్థవిపరి.).

**సంకటపడు** అ.క్రి. కష్టపడు, ఇరుకునపడు. <సంకటము+పడు.

**సంకటి** రూ. సంకట[1], సంగటి. వి. పండిన రాగిపిండి మొ. వి. చిక్కగా కాచిన అంబలితోప. హంస. 4.32.

త. చంకటి. రాగిజావ.

**సంకటికట్టె** వి. అంబలిమొదలైన వాటిని కలిపేకట్టె, తెడ్డు. **సంకటికుంచె** రూ. సంగటికుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులోఉన్నప్పుడు గంజిచిలకరించే కుంచె. **సంకటికుండ** రూ.చూ. సంగటికుండ. వి. సంగటి చేయటానికి వాడేకుండ.

**సంకతలకాయ** వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితోఉండే మట్టిపాత్ర.

**సంకదాళ** చూ. చంక. వి. చంకలో కలిగేగడ్డ.

**సంకము** రూ.చూ. సంకు[1]. వి. శంఖం. పండి. చ. 5.343.

**సంకరమగు** అ.క్రి. అత్తుకొను.

సం. సంకర-. భేదంలేని కలయిక.

<సం. సంకర-+-ము+అగు.

**సంకలియ** రూ. సంకిలి, సంకిలియ, సంకెల, సంకెలియ, సంకెళ, సంగిలి. వి. **1**. అరదండాలు. నిర్వ. రా. 7.75 ; **2**. సంకెల, కాళ్ళకు కట్టేగొలుసు, చెర. పండి. చ. 5.408 ;

సం. శృంఖలికా, శృంఖలా. సంకెల ; ప్రా. సంఖలిఅ, సంఖిలీ, సంఖిలా ; శౌ. సంకలా. సంఖలా ; జై. మహా. సంకలియా ; అ.మా. సంకల, సంకలా, సంకలియా ; మా. శంఖలా ; పా. సంఖలా, సంఖలికా ; అప. సంకుల-. సంఖల-;

క. సంకల్ ; కొడ. చఙ్గోలె ; తు. సంకలె; సంకొలె, సంకోలె ; త. చంకిల ; మ. చఙ్ఙల, గోం. సంకర్ ; కుఇ. సకిల, సకిలి ; కువి. హికి్, హ్రికి. హిక్లి ; పర్జి. చ్రకిల్.

<ప్రా. సంఖలిఅ.

**సంకిలి** రూ.చూ. సంకలియ. వి. శృంఖల. కాశీ. 4.66.

**సంకిళ్ళవాండ్లు** విఙ. బ.వ. ఖైదీలు.

**సంకిలియ** రూ.చూ. సంకలియ. వి. సంకెల, కాళ్ళకుకట్టేగొలుసు. చెర.

**సంకిళ్ళవాండ్లు** చూ. సంకిలి.

**సంకీర్తనఅరుళప్పాడుభాగవతులు** వి.బ.వ. దేవునికి సంకీర్తనలు పాడే భాగవతులు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 710,

సం. సంకీర్తన- పొగడటం, స్తుతి, దేవతాస్తుతి కావించటం, దేవునిపేరును పలుమార్లు ఉచ్చరించటం. కీర్తన, భాగవత-. భక్తులు.

త. అరుళిప్పాటు దైవాజ్ఞ.

<సం. సంకీర్తన-+ త. అరుళిప్పాటు+ సం. భాగవత-+-లు. (మిశ్రస.).

**సంకీర్తనశావ** వి. సంకీర్తనసేవ. ద. హిం. శా. సంపు. 4.శా సం. 280. క్రీ.శ. 1556.

సం. సంకీర్తనసేవ-. స్తోత్రసేవ.

<సం. సంకీర్తనసేవ-.

**సంకు**[1] రూ. సంకము. వి. **1**. శంఖం. కు. సం. 7.91 ; **2**. శంఖవలయం. భార. విరా. 1.228 ; **3**. అంచు. సారంగ. 1.79.

సం. శంఖ-. శంఖం ; ప్రా. సంఖ- ; అ.మా. సంఖి-, సంఖణగ-. చిన్నశంఖం, సంఖిఅ ; పా. సంఖ-. శంఖం, ముత్యపుచిప్ప ;

క. సంక, సంకు ; త. చంకు ; మ. చఙ్ఙ. శంకు ; ఒరాయన్.

సంఖ. శంఖం, ఆలిచిప్ప.

<ప్రా. సంఖ-.

**సంకుగట్టినజీతము** (-కట్టినజీతము) వి. శంఖమూదినందుకు ఇచ్చే వేతనం. నె.శా. కందుకూరు. 79. **సంకుజిగివాఁడు** విఙ. శంఖం కాంతి లాంటి కాంతి ఉన్నవాడు. అచ్చ.రా. పీఠి. 13. **సంకుటాకు** (-ఆకు) వి. శంఖం చిప్పతో చేసిన చెవినగ, ఒకరకం కర్ణాభరణం. చిత్రభా. 3.125. **సంకుదారి** వి. శంఖధారి, విష్ణువు. **సంకుపూసలు** వి.బ.వ. శంఖంతో చేసే పూసలు. క్రీడా. 72. **సంకుమూతిగుర్రము** వి. గాడిద. **సంకులవాఁడు** రూ. సంకులాఁడు. విఙ. శాంఖిక, శాంఖికుడు, జంగమువాడు, శంఖాన్ని ఊదేవాడు. **సంకులాఁడు** రూ.చూ. సంకులవాఁడు. విఙ. శాంఖికుడు. **సంకులుజంగాలు** వి.బ.వ. దేవాలయాల్లో శంఖాలూదే జంగాలు. **సంకులుస్వరూపం** వి. శంఖాల లెక్క. T.T.D.E. సంపు. 3. శా.సం. 76. క్రీ.శ. 1515. **సంకువట్టు** (-పట్టు[1]) అ.క్రి. శంఖం ఊదేటట్లు ఊదు. దశకు. 6.157. **సంకు**

వాచెడువాడు విణ. సంకువాడు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 66. **సంకువాండు** విణ. శంఖమూదేవాడు. నె.శా. రాపూర్. శా.సం. 47.

**సంకు**[2] రూ.చూ. సుంకము. వి. కన్యాశుల్కం, ఓలి. ఆం. భా. 2.179.

**సంకు**[3] రూ.చూ. సంకె. వి. అనుమానం. తాళ్ల. సం. 17.113.

**సంకు**[4] రూ.చూ. శంకు. వి. శాస్త్ర పద్ధతిలో చెక్కి గృహ నిర్మాణానికి ఓం ప్రథమంలో ఈశాన్యమూలను పాతే కొయ్య.

**సంకుడు** చూ. సుంకము. వి. శుల్కం. కన్యాశుల్కం పురుషోత్తమ కవీయము. 127.

**సంకుస్థాపం** రూ.చూ. శంకుస్తాపం. వి. గృహనిర్మాణానికి మున్ముందు కట్టిన వేదికలో శంకుకర్రను మంత్రపూర్వకంగా పాతటం.

**సంకె** రూ. సంకు3. వి. అనుమానం. తాళ్ల.సం. 10.252.

సం. *శంకా*. సందేహం. అనుమానం, అవిశ్వాసం, భయం ; ప్రా. పా. *సంకా*.

< ప్రా. సంకా.

**సంకెదీరు (-తీఱు)** అ.క్రి. సంశయం పోవు. తాళ్ల. సం. 8.127.

**సంకెల** రూ.చూ. సంకలియ. వి. **1**. అపరాధుల కాళ్ళకు కట్టే ఇనపగొలుసు. పల్నా.పు. 94, హరి.పూ. 8.131 ; **2**. గానుగ కర్రను కాడికి కలిపికట్టే తాడు లేక తీగ.

**సంకెలవాడు** విణ. సంకెళ్ళు వేయబడినవాడు. దొంగ.

**సంకెలియ** రూ.చూ. సంకలియ. వి. అపరాధుల కాళ్ళకు కట్టే ఇనపగొలుసు.

**సంకెళ** రూ.చూ. సంకలియ. వి. అపరాధుల కాళ్ళకు కట్టే ఇనపగొలుసు. తాళ్ల. సం. 5.100.

**సంకోచించు** అ.క్రి. **1**. వెనుదీయు. భాగ. 10పూ. 787 ; **2**. అనుమానించు. నార. పంచ. 1.222.

సం. *సంకోచ* -. ముడుచు కోవటం, భయం.

< సం. సంకోచ -+-ఇంచు[3].

**సంక్రాంతికమ్మి** వి. ఒక రకం చీరకమ్మి.

సం. *సంక్రాంతి* -. కలసి వెళ్ళటం, కలయిక, సూర్యాది గ్రహాల రాశ్యంతరగమనం, మకరసంక్రమణం.

< సం. సంక్రాంతి -+ కమ్మి.

**సంక్రీస్త** రూ.చూ. సక్రీస్త. వి. పాదిరిగుడిలో పవిత్రపాత్రలు, వస్త్రాలు భద్రపరిచే విభాగానికి అధికారి.

**సంగ** సర్వ. సర్వం. ఆం.పద.గుణ.60.

సం. *సంఘటనా*. కూర్పు, సంయోగం.

**సంగటి** రూ.చూ. సంకటి. వి. రాగిజావ.

**సంగటికుండ** రూ. సంకటికుండ. వి. సంగటి చేయటానికి వాడే కుండ. **సంగటికోల** వి. పత్తిరాట్నం నిలువులమధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండేకట్టె. **సంగటివేళ** వి. ఉదయం సంగటి తినేపొద్దు (ఉదయం పదిగంటలు) కాపు కూటివేళ.

**సంగడం** రూ. సంగడి. వి. పత్తిరాట్నం కోలకు చుట్టూ గాట్లు పెట్టి చేసే వడ్రంగిపని.

**సంగడంపట్టు** వి. పత్తిరాట్నం కోలకు చుట్టూ గాట్లు పెట్టి చేసే వడ్రంగిపని.

**సంగడడ్డ** చూ. సంగడి[1].

**సంగడము**[1] రూ. సంగడి, సంగాడి. విణ. **1**. మిత్రం, చెలికాడు. భార. భీష్మ. 1.93 ; **2**. చెలిమి, స్నేహం. భార. ద్రోణ. 1.50 ; **3**. ఉజ్జి. పక్షం. హరి.పూ. 7.92 ; **4**. పరివారం. ఉ.హరి. **1.151** ; **5**. చేరిక, కలయిక. భాగ. 9స్కం. 5.83 ; **6**. రవిక. తాళ్ల.సం. 18.**314** ; **7**. మల్లసాధన విశేషం, జెట్టిసాధన కుపయోగమైన ఇనప గుండు, మను. 3.53 ; **8**. సద్దెమూత, కుతూముఖాచ్ఛాదనం ; **9**. సేన ; **10**. సాయం.

సం. *సంగత*-చేరిక, కలయిక, *సంఘాత*-.రాశి ; ప్రా. *సంఘాడ*-.*సంఘాడగ*-.గుంపు, రాశి ; ఒ. *సాంగొ*, *సాంగాతొ*. స్నేహం, స్నేహితుడు, స్నేహితురాలు ;

క. *సంగడ*. సమీపించినది, సంధి, కలయిక, *సంగడి*, *సంగడిక*. మిత్రుడు, *సంగడితన*. స్నేహం, *సంగడిగిత్త*. చెలిమికత్తె ; తు. *సంగడిగె*. సహచరుడు. మిత్త్రుడు ; బ్రా. *సంగతి*. స్నేహం, సంభోగం.

< ప్రా. సంఘాడ -.

**సంగడములగు** అ.క్రి. సమానమగు. ఉ.హరి. 1.151. < సంగడము +-లు + అగు. **సంగడీఁడు (-ఈఁడు)** వి. స్నేహితుడు, మిత్రుడు, చెలికాడు. కాశీ. 4.68. **సంగడీని తనము** వి. మైత్రి, చెలిమి. భాగ. 9.235.

**సంగడము**[2] వి. దుఃఖం, బాధ. పండి. చ. 5.401.

సం. *సంకట* -. బాధ, కష్టం, ఆపద ; పా. *సంకడ*-. విషమం, దుఃఖం ;

క. *సంగట*. ఆర్తి, బాధ, పీడ ; తు. *సంకడ*.

< ప్రా. సంకడ-.

**సంగడావు** వి. స్త్రీపురుష లక్షణాలతో పుట్టిన ఆవు (దీన్ని ఇంట్లో ఉంచుకోరు. గంగిరెడ్ల వాళ్ళకి ఇచ్చేస్తారు).

సం. *సంకర*-.మిశ్రమవర్ణాలకు మూలమైనది, *సంకట*-కష్టం.

< సంకర-+ ఆవు.

**సంగడి**[1] రూ.చూ. సంగడము[1]. వి. **1**. పార్శ్వం, పక్క. గంరా. బాల. 75పు. 20.పం ; **2**. వెనక, పశ్చాద్భాగం, అనంతరకాలం. భాస్క.రా. కిష్కిం. 204 ; **3**. సమూహం. గుంపు. ఉ. హరి. 6.60 ; **4**. చేరువ, సామీప్యం, సాంగత్యం. హర. 9.124 ; 5. కూడిక. సాహచర్యం. భోజ. 6.306 ; 6. వలపు. అనురాగం. పి.శకు. 4.91 ; 7. స్నేహం, మైత్రి, జత. భాగ. 10.389 ; 8. సంఘాతం, మొత్తం. భాగ. 10.446 ; **9**. చుట్టు, పరివేష్టనం. అష్టమ. క. 2.2066పం. ; **10**. రికాబు, అంకవన్నె. చిత్రభా. 4.19 ; **11**. తొలచిన రెండు రాటి బొందలు చేర్చి కట్టిన తెప్ప ; విణ. **1**. సంబంధిజనం. రామా. సుందర. 120 ; **2**. తోడైంది, జతైంది. బిల్హ. 1.120.

క. *సంగడి*. తోడైనది, జతైంది.

సంగడద్డ వి. పంచ దించటానికి గుర్రపు కొయ్యల మీద వేసిన అడ్డవాసం. <సంగడి+అడ్డ². సంగడికత్తె వి. చెలికత్తె, స్నేహితురాలు. సంగడికాఁడు రూ. సంగఁడు, వి. చెలికాడు. మిత్రుడు. భార. ఆది. 5.203. సంగడికాళ్లు వి.బ.వ. తమలోతాము కూడబలుక్కొని పోగైన కాపటికులు మోసగాళ్ళు. బసవ. 114పు. 10పం. సంగడిగొను (-కొను) అ.క్రి. కలియు, పెనగొను. పండి.చ. 4.280. సంగడిచేడియలు వి.బ.వ. చెలికత్తెలు. అధ్యా.రా.యు. 587. సంగడించు స.క్రి. జతపర్చు, చేర్చు, సంఘటించు. పండి.చ. 3.176 ; అ.క్రి. జతపడు. చెలిమిచేయు. <సంగడి+ఇంచు³. సంగడిబావులు వి.బ.వ. ఒకదాని పక్కమరొకటి ఉన్నబావులు. జోడుబావులు.

సంగడి² వి. జెట్టిసాధనకుపయోగపడే ఇనపగుండు. వరాహ. 4.145.

మరా. సంఘాడి.

<మరా. సంఘాడి.

సంగడివలయము వి. ఒకరకం మల్లసాధనం. చెన్నబసవ. 2.209.

సంగడి³ రూ.చూ. సంగడం. వి. 1. కొయ్యకు మలుపులు చెక్కటం ; 2. పత్తిరాట్నం కోలకు చుట్టూ గాట్లుపెట్టి చేసే వడ్రంగిపని.

సంగడి కోళ్ళమంచం వి. కాళ్ళను (కోళ్ళను) సంగడి (తరిమెన) పైన నునుపుగా గుండ్రంగా చేసి అమర్చిన మంచం, అరణాల మంచం. సంగడిదబ్బ రూ. సంగడ్డబ్బ. వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపు వేసిన వెదురుబద్ద, ఆకప్పుజారకుండా మీద బిగించేబద్ద. సంగడ్డబ్బ రూ.చూ. సంగడిదబ్బ. వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపు వేసిన వెదురుబద్ద, ఆకప్పు జారకుండా మీద బిగించే బద్ద.

సంగడీఁడు చూ. సంగడము¹.

సంగడీనితనము చూ. సంగడము¹.

సంగడ్డబ్బ చూ. సంగడి³.

సంగఁడు రూ.చూ. సంగడికాఁడు. వి. చెలికాడు.

సంగతి వి. 1. లాగు, విధం, రీతి. పండి. చ. 2.60, జైమినిభా. 8.199 ; 2. వార్త, విషయం.

సం. సంగతి-. ఇద్దరు కలసిరావటం, సహవాసం, విజ్ఞానం. మైథునం.

<సం. సంగతి- (అర్థవిపరి.).

సంగనోటు వి. అధికం, ఎక్కువ.

సంగమడుఁగు వి. ఊరికిదగ్గరగా ఉండే మడుగు.

సం. సంఘ-సమూహం, గుంపు.

సంగాడి రూ.చూ. సంగడము¹. వి. సంగత, స్నేహితుడు, చెలికాడు.

సంగాతకత్తియ చూ. సంగాతము.

సంగాతకత్తె చూ. సంగాతము.

సంగాతకాఁడు చూ. సంగాతము.

సంగాతము వి. చెలిమి, మైత్రి. తాళ్ల. సం. 13.130.

సం. సంఘాత- సమూహం ; ప్రా. సంఘాడ-, సంఘాడగ- జోడు, గుంపు ;

క. సంగాత. కలయిక, బృందం, సంగాతి. నెచ్చెలి ; తు. సంగాతె. సహచరుడు. మిత్రుడు.

<సం. సంఘాత-.

సంగాతకత్తియ రూ. సంగాతకత్తె. వి. స్నేహితురాలు. సంగాతకత్తె రూ.చూ. సంగాతకత్తియ. వి. స్నేహితురాలు. సంగాతకాఁడు వి. చెలికాడు, మిత్రుడు. సారంగ. 1.73. సంగాతి వి. 1. చెలికాడు, మిత్రుడు. కువ. చ. 4.103 ; 2. స్నేహితుడు, బంధువు. అచ్చ. రా. యు. 161 ; 3. సహచరం. పార్వ. 4.108 ; 4. ఆప్తుడు. ప్రబంధ. 1.117. ఒ. సోంగాతొ. చెలికాడు, చెలికత్తె, స్నేహితుడు, స్నేహితురాలు. <సంగాతము+-ఇ⁹.

సంగాతి చూ. సంగాతము.

సంగి వి. 1. ఆడదానిలాంటివాడు, ఆడంగిరేకులవాడు. కొజ్జా ; 2. ఏమీ చేతకానివాడు ; 3. కల్లబొల్ల ఎడ్పున్నది,

సంగిలి రూ.చూ. సంకలియ. వి. 1. సంకెల, లంకె ; 2. అరదండాలు.

సంగు వి. రాయి, శిల. ద.హిం. శా. సంపు. 10.శా. సం. 759. 33. క్రీ. శ. 1663.

హిం. సంగ్. కఠినమైన, శిల ; ఉ. సంగ్. రాయి, భారం, సంగ్‌రాయి. శిల, బరువు, అధికారం.

<ఉ. సంగ్.

సంగుశాసనాలు వి.బ.వ. సరిహద్దురాళ్ళు పాతించి చేసే సీమానిర్ణయం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759, క్రీ.శ. 1663.

సంగెడ వి. పాత్రవిశేషం పి.శకు. 1.96.

సంగోరు చూ. సగము.

సంగ్రము వి. ఉక్కపోయటం.

సం. సంగ్రహ-. పట్టుకోవటం, బాగాగ్రహించటం.

<సం. సంగ్రహ-.

సంగ్లీ వి. పన్నె కట్టుబడిలో దండెలమధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి.

సచ్చము వి. చిల్లరరొక్కం అప్పు. వేంక. పంచ. 1.763.

సం. సత్యంకార- సంచకరం; ప్రా. సచ్చంకార- సంచకరం; పా. సచ్చకార- తాకట్టు ముందుగా చెల్లించటం.

<ప్రా. సచ్చంకార-.

సచ్చు రూ.చూ. చచ్చు. అ.క్రి. 1. మరణించు ; 2. చను, వెడలు ; 3. చెల్లు ; 4. చెడు.

సజగురా వి. ధాన్యవిశేషం, సజ్జలు, కొర్రలు అనేధాన్యాలు, సజ్జ, కొర్ర రాయలసీమలో ప్రచురమైనపంటలు.

<సజ్జ+కొఱ్ఱ.

సజన వి. ఉత్తరసర్కారు, దక్కను, విశాఖపట్నం, గుంటూరు కర్నూలు, కోయంబత్తూరు ప్రాంతాల్లో పెరిగే తెల్లటి బెరడు కలిగిన ఒకరకం చెట్టు. (Moringa pterygosperma).

సజా వి. శిక్ష.

హిం.ఉ. సజా. శిక్ష.

<ఉ. సజా.
**సజావు** రూ.చూ. సజావు. వి. తిన్ననైన, క్రమమైన.
**సజాయించు** స.క్రి. సింగారించు, అలంకరించు.
హిం. ఉ. సజానా. అలంకరించటం.
<ఉ. సజా(నా)+-ఇంచు[3].
**సజావు** రూ. సజావు. వి. స్పష్టమైనది, క్రమమైనది.
హిం. సజావ్. అలంకరణ.
<హిం. సజావ్.
**సజ్జ**[1] రూ.చూ. సెజ్జ. వి. **1**. బుట్ట, పండి. చ. 2.727పు. 375పం; **2**. పాన్పు. కేయూ. 3.343; **3**. శివలింగం ఉంచేబుట్ట (లేకబరణి). కాశ. 4.80; **4**. వాసగృహం. కాశ. 4.86; **5**. ఉప్పరిగ, శిరోగృహం. వసు. 6.64.
**సజ్జకట్టు**[1] వి. శయ్యాగృహం. బసవ. 3.512. **సజ్జకాయ** వి. శివలింగం ఉంచే కాయలాంటి బరణి. ఇందు. ప. 5.60. **సజ్జలింగము** వి. ఇలవేల్పు. కాశీ. 1.58.
**సజ్జ**[2] రూ. సజ్జె, సద్ద, సొజ్జ. వి. ధాన్యవిశేషం, గంటె. ఆము. 4.35. చా.మం. 1.126. (Holcus Spicatus).
క. చజ్జె, చెజ్జె, జెజ్జె, సజ్జె, సెజ్జె, వృక్షవిశేషం;
సం. సర్జ- మద్దిచెట్టు, కలపకు పనికివచ్చే చెట్టు.
**సజ్జగడ్డి** వి. సజ్జకారం, ఒకరకం వేళ్ళు. **సజ్జగుబ్బు** వి. సజ్జ దంటులోని గూగు, సజ్జకంకి పొట్టు. **సజ్జబుస్క** వి. సజ్జదంటులోని గూగు. **సజ్జలు** వి.బ.వ. ధాన్యవిశేషం. గంటెలు. ప్రభు 4ఆ. 181పు. 24పం. క. సజ్జె; తు. సజ్జగ.
**సజ్జ**[3] రూ. సజ్జా, సెజ్జ[2]. వి. **1**. ఎండ, జల్లు తగలకుండా కిటికీల మీద రక్షణగా దించిన పలక; **2**. గోడమీది నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.
**సజ్జకట్టు**[2] వి. సన్నాహం; అ.క్రి. మూసకట్టు. **సజ్జకట్టుడు** వి. మూసకట్టుబడి, మూసకట్టు సహాయంతో బొల్కనీలు మొ. వి కట్టటం.
**సజ్జకము** రూ. సజ్జికము. విణ. మనోజ్ఞం, కొత్తది. ఉ. హరి. 11.51.
సం. సజ్జస్క-; ప్రా. సజ్జోక-నూతనమైనది.
క. సజ్జుక. కొత్తది, లేతది;
<ప్రా. సజ్జోక-.
**సజ్జకోల** రూ.చూ. సజ్జనకోల. వి. బెత్తం.
**సజ్జనకోల** రూ. సజ్జకోల. వి. బెత్తం. హంస. 3.141.
క. సజ్జనకోలె. బెత్తం.
**సజ్జరసము** వి. ధూపద్రవ్య విశేషం.
సం. సజ్జ-సిద్ధమైనది.
**సజ్జా**[1] రూ. సర్జా. వి. **1**. ఇంటిముందు స్తంభాలమీద వేసిన కప్పు; **2**. సిమెంటు పోతపోసి తయారుచేసినకప్పు, శ్లాబు.
**సజ్జా**[2] వి. ప్రస్తుతం.
హిం, సజ్జా. అలంకరణ, వేషభూష.
**సజ్జాకారము** వి. సర్జకవృక్షానికెత్తేఉప్పు.
సం. సర్జి-, సర్జీ, సర్జికా. సరోవరతీరాల్లో లభించేలవణం, సర్జికాక్షార- లవణవిశేషం.

**సజ్జారము**[1] వి. పడకటిల్లు. రాధికా. 3.130.
సం. శయ్యాగార- పడకగది; ప్రా. సజ్జాఅర-, సజ్జర-,
<ప్రా. సజ్జాఅర-.
**సజ్జారము**[2] వి. ఏనుగులశాల, గజశాల. శ్రీరం.మా. 10.59.
త. తచ్చారమ్;
సం. సామజాగార-. గజశాల.
<సం. సానుజాగార-.
**సజ్జికము** రూ.చూ. సజ్జకము. విణ. **1**. మనోజ్ఞం, కొత్త. క్రీడా. 1.80; **2**. సిద్ధం. వసు. 1.139.
**సజ్జు** వి. **1**. కూర్పు. కువ.చ. 4.205; **2**. సన్నాహం; **3**. వస్తుసమూహం; **4** జట్టు.
సం. సజ్జ-సిద్ధమైనది, ముస్తాబుచేయబడ్డది; ప్రా. సజ్జ-.
క. సజ్జు. సన్నద్ధమైనది.
<ప్రా. సజ్జ-.
**సజ్జుడు** వి. సన్నద్ధుడు.
**సజ్జె** రూ.చూ. సజ్జ.[2] వి. ఆహారధాన్యంగానూ పశుగ్రాసంగానూ వంటచెరకుగాను, ఇళ్ళు కప్పటానికి ఉపయోగించే తృణవిశేషం. (Eleusine indica).
**సజ్జెనకుమ్మరోళ్ళు** వి.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ.
**సంచ** వి. పశువుల పారుడువ్యాధి.
సం. సంచయ-పోగు, రాశి; ప్రా. సంచ-పోగు చేసినది.
<ప్రా. సంచ-,
**సంచకరము** రూ. సంచకరి, సంచకరువు, సంచకర్వు, సంచకారము. వి. సంచకరువు, సంచకారం, క్రయవిక్రయాలు మొ. వాటి గట్టికోసం. ముందుంచేధనం. బజానా. *. హరి. 4.163.
సం. సత్యంకార-బజానా, సంచకరం; ప్రా. సంచ్చకార-ముందుగా ఇచ్చేధనం;
క. సంచకర, సంచకార, సంచగార. బయానా; కువి. ధంజకర.
<ప్రా. సంచ్చకార-.
**సంచకరి** యా.చూ. సంచకరము. వి. బయానా.
**సంచకరువు** రూ.చూ. సంచకరము. వి. క్రయవిక్రయాలు మొ. వాటిస్థిరత్వం కోసం మొదట ఇచ్చేధనం, బయానా.
**సంచకర్వు** రూ.చూ. సంచకరము. వి. క్రయవిక్రయాలు మొ. వాటి స్థిరత్వంకోసం మొదట ఇచ్చేధనం. శివరా. 3.68.
**సంచకారము** రూ.చూ. సంచకరము. వి. బయానా. హర. వి. 1ఆ.
**సంచగు** చూ. సంచు.[1]
**సంచపురేకు** చూ. సంచము.
**సంచము** వి. కాంచనం, బంగారం. భార. విరా. 1.95.
క. సంస. జాడ.
**సంచపురేకు** వి. బంగారురేకు. హంస. 5.195, ఇలా 1.139.
**సంచి** రూ. సంచీ. వి. **1**. అసిమి, అల్పగోణి. హర. 5.41;

**2**. కత్తులున్న సంచి. నార. పంచ. 1.203; 3. గోణీ భేదం, ధనంమొ. వి ఉంచుకోవటానికి గుడ్డలు మొ. వాటితో కుట్టిన పెద్దతిత్తి.

సం. సంచిత-, చంచ-, చంచా ; ప్రా. సంచిఅ. సంచితం, సంగృహీతం ; అ.మా. సంచియ ;

క. చంచి, సంచి ; తు. తంచి ; మ. సంచి.

<ప్రా. సంచిఅ-.

**సంచికట్టు** వి. **1**. ఒకేవిషయానికి సంబంధించిన వివిధ వస్తువులతో కూడిన సంచి. **2** వైద్యుడు. వ్య. సంచి కట్టుకొని అదేపనిగా సంచరించేవాడు; అ.క్రి. ప్రయాణానికి సిద్ధముగు. **సంచిపట్ట** వి. కుమ్మరి కూర్చోవటానికి లేక పాకంమన్నుమీద కప్పటానికి వాడే గోతాంపట్ట. **సంచిమూల్యము** వి. మూలధనం, పెట్టుబడిధనం. హంస. **5**.120. **సంచిమొదలు** వి. మూలధనం, పెట్టుబడిసొమ్ము. మను. 1.50. పాండు. 1.112.

**సంచిక** రూ. సంచికె. వి. **1**. వివిధరచనలతో కూడిన సంకలన గ్రంథం ; **2**. చేర్చికట్టిన కొన్నితాటాకులు, కాగితాలు.

సం. సంచ-లేఖనానికి ఉపయోగపడే తాళపత్ర గ్రంథం. సంస్కృత సంచ శబ్దంనుంచి 'సంచికా' పదాన్ని తెలుగువారు సృజించి ఉంటారు.

**సంచికె** రూ.చూ. సంచిక. వి. **1**. వివిధరచనల్తో కూడిన సంకలనం; **2**. చేర్చికట్టిన కొన్ని తాటాకులు, కాగితాలు.

**సంచీ** రూ.చూ. సంచి. వి. గోతం, గోనె.

**సంచు**[1] వి. **1**. జాడ, లక్షణం, గుర్తు. భార. విరా. 1.95 ; **2**. నేర్పు. కేయూ. 3.120 ; **3**. గుట్టు, మర్మం. విక్ర. 1.20 ; **4**. తీరు, పద్ధతి. జైమినిభా. 6.96 ; **5**. అందం. పాండు. **5**.131 ; **6**. కాంతి. ఇందు.ప. 3.54 ; **7**. అల్పరవం. ఆం.భా. **3**.59 ; **8**. రతి. ఆం.భా. 3.59 ; **9**. విధం, రీతి. రాజ. వి. 4.58 ; **10**. ప్రకారం. ఆం.పద. నానా. 7 ; **11**. గాజు.

క. సంచు. యుక్తులతోకూడిఉండు, నేర్పుగా వ్యవహరించు, త. సంచు. యుక్తి, ఉపాయం, నేర్పు.

**సంచుపాటు** వి. గొనబుపాటు. **సంచుమీఱు** అ.క్రి. పెంపొందు, అందగోరు. **సంచులమించుబో(డి** వి. ఎరుకత. సోదిచెప్పేది. సుదంతా. 1.64.

**సంచు**[2] వి. **1**. గుంపు. ; **2**. గొడవ.

**సంచగు** అ.క్రి. కలియు, ఏకమగు.

**సంచు**[3] వి. బాణాసంచా.

<బాణాసంచా.

**సంజ**[1] రూ. సందె. వి. **1**. సంధ్యాకాలం. కు.సం. 2.99 ; **2**. సంధ్యారాగం. ఉ.హరి. 2.24 ; **3**. మొదలిసంజ. క్రీడా. పు.20 ; **4**. కడసంజ. కళా. 8,10.

సం. సంధ్యా. సంధ్య ; ప్రా. సంఝా ; జై. మహా. శౌ.అ.మా. పా. సంఝా. అప. సంఝు ,

క. చంజె, సంజె, సందె, సంజెహొత్తు. సందెప్రొద్దు ; తు. తంజ, సంజ, సంజె ; త.మ. అంతి, చంతి ; మరియాగోం. సాంఝుల్ ; ఒరాయన్. సంజోళ్. సందెకుడుపు, సంధ్యాకాలం.

<ప్రా. సంఝా.

**సంజకెంజాయ** వి. సంధ్యాకాలంలో అయ్యే ఎర్రని ఛాయ. శృంనై. 8.153. **సంజపడు (-పడు)** అ.క్రి. సంధ్యాకాలంఅగు. భాస్క. రా.యు. 1095. **సంజవఱుచు(-పఱుచు)** అ.క్రి. ఎర్రపరుచు.

హరి. ఉ. **6.34.**

**సంజ**[2] వి. వరిమడి.

**సంజాయిషి** రూ.చూ. సంజాయిషీ. వి. ఉత్తరం, ప్రతివచనం, సమాధానం.

**సంజాయిషీ** రూ. సంజాయిషి, సమజాయిషీ, సముజాయిషీ సమ్‌జాయిషీ. వి. ఉత్తరం, ప్రతివచనం, సమాధానం,

హిం. సంఝూఇశ్. అబద్ధపు సాక్ష్యం, చేతికింద ఉండటం, దుర్బోధచేయటం లేదా చెరపటం ; ఉ. సంఝూఇష్.

<ఉ. సంఝూఇష్.

**సంజ్జాపు** వి. అంచు లేదా గోటు.

హిం.ఉ. సంజాఫ్. అంచు, గోటు.

<హిం. సంజాప్

**సంజీర** వి. బలపంపొడి.

**సంజీల** వి. డొలుపును మండిగానికి పట్టిఉంచే మేకు.

**సంజీవరాయు(డు** వి. హనుమంతుడు. సమీర. **3**.135.

సం. సంజీవ-. జీవితం.

<సం. సంజీవ - + రాయు(డు.

**సంజెరేవు** చూ. సంజ[1]. రూ.చూ. సందిరేవు. వి. పెళ్ళిళ్ళలో ముహూర్తమైన మరుదినం సాయంత్రం, ఊరిచేరువురేవు దగ్గరకు పెళ్ళికుమారుణ్ణి తీసుకుపోయి అలంకరించి చదురు జరిపి గుర్రం మీద కూర్చుండబెట్టి ఊరేగింపుగా ఇంటికి తీసుకురావటం.

**సంజోక** వి. **1**. సవరణ, పరికరం, విప్ర. **3**.2 ; **2**. బంధనం, కట్టు (జీను) కట్టటం. శుక. 2.265 ; **3**. సన్నాహం. శుక. 3,138 ; **4**. ఉభయముఖాల్లో తాకే కొనముడిఉన్న దుబుదుక్క నడిమితాడు.

సం. సంయోగ -. కలయిక.

<నగము + జోక.

**సట** రూ చూ. సటము. వి. **1**. మాయ, కపటం పని. జైమినిభా. 1.126 ; **2**. కపటం. మోసం. వేమ. **3**.136 ; **3**. అసత్యం, అబద్ధపు మాటలు, పనులు మొ. వాటి డాబు. పారి. 3.32 ; **4**. కొండెం ; **5**. క్రౌర్యం, బాధ,

**సటకా(డు** వి. మాయకాడు, వంచకుడు. తాళ్ల. సం. 17.41, **సట(బడు(-పడు)** అ.క్రి. వంచించబడు, తాళ్ల, సం. 16-1-55. **సటలంబెట్టు** స.క్రి. బాధపెట్టు, పీడించు. హంస. 3,156, తాళ్ల. సం. 9.193.

**సటము** రూ. సట. వి. అసత్యం, మాయ. పండి. చ. 5.319, 525, సాంబో. 1.205.

సం. సఠ-. ధూర్తుడు, కపటి, వక్రటి, కుటిలత ; ప్రా. సఢ-. ధూర్తత, సఢ -. ధూర్తుడు, మాయావి, కపటి వక్రత, కుటిలత ;

క. సఱె. అసత్యం, మోసం, సడ్ యూతు. అసత్య వచనం, సటిగ, సటిగార. కపటి, మాయావి; త. చటుమ్.

< ప్రా. సట్ట -.

**సటర్** రూ చూ. సట్టరు. వి. **1**. మరమగ్గంలో పన్నె, పలక మొ. వి బిగించిన నాలుగుపట్టెల చట్రం ; **2**. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

**సటర్కొయ్య** రూ.చూ. సట్టరుకొయ్య. వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట. **సటర్డబ్బా** రూ.చూ. సట్టదుడబ్బా. వి. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. **సటర్నాడె** రూ.చూ. సట్టరునాడె. వి. పడుగు పై పోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళసాయంతో విసిరే కొయ్యనాడె. **సటర్పలక** రూ.చూ. సట్టరుపలక. వి మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క, **సటర్పాను** రూ. చూ. సట్టరుపాను. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింద కొయ్య. **సటర్పేటి** రూ.చూ. సట్టరుపేటి. వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. **సటర్మగ్గం** రూ.చూ. సట్టరుమగ్గం. వి. నేత నేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది. **సటర్సింగర్** రూ.చూ. సట్టరుసింగర్. వి. మర మగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట.

**సటరుపలక** రూ.చూ. సట్టరుపలక. వి. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క.

**సటరుమగ్గం** రూ. చటల్మగ్గం, సటాలుమొగ్గం, సటిల్ మగ్గం, సటిల్ మొగ్గం. వి. నేత నేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజే ఒకరకం మగ్గం.

**సటవట** విశ. కపటం. తాళ్ల. సం. 10.190.

క. సఱెవటి. కృత్రిమమయిన, నిరుపయోగమైనపని.

**సటాలుకొమ్ము** రూ. సటాల్కొమ్ము. వి. పడుగుపై పోగులకు కిందిపోగులకు మధ్యవేసే పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళసాయంతో విసిరే కొయ్యనాడె.

**సటాలుడబ్బా** రూ. సటాల్డబ్బ, సటిల్ డబ్బా. వి. మరమగ్గం చట్రలలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు

**సటాలుమొగ్గం** రూ.చూ. సటలుమగ్గం. వి. నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజే ఒకరకం మగ్గం.

**సటాల్కొమ్ము** రూ.చూ. సటాలుకొమ్ము. వి. పడుగు పైపోగు లకు కిందిపోగులకు మధ్య వేసే పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ పాయంతో విసిరే కొయ్యనాడె.

**సటాల్డబ్బ** రూ.చూ. సటాలుడబ్బా. వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు.

**సటిల్గుంజ** వి. మరమగ్గం చట్రం మోపటానికి నేతబయలులో పాతినరాట.

**సటిల్డబ్బా** రూ.చూ. వటాలుడబ్బా. వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు.

**సటిల్దండ** వి. మరమగ్గం చట్రంలో మధ్య బిగించిన అడ్డ పట్టె.

**సటిల్మగ్గం** రూ. సటలుమగ్గం. వి. నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది.

**సటిల్మొగ్గం** రూ.చూ. సటలుమగ్గం. వి. నేతనేసేటవ్వుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది.

**సట్టటికె** రూ. సట్టెఅట్క, వి. కూరకువాడే చిన్న మట్టిపాత్ర.

**సట్టన** వి. అవ్య. త్వరగా, వెంటనే (అనుకరణం) దిగ్గనవలె. బసవ. 3పు. 141,

**సట్టపుదాకె** రూ.చూ. సట్టవదాక. వి. ఎక్కువలోతులేక వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

**సట్టర్** రూ.చూ. సట్టరు. వి. **1**. మరమగ్గంలో పన్నె, పలక మొ. వి బిగించిన నాలుగు పట్టెల చట్రం ; **2**. మర మగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

**సట్టర్పేటి** రూ. సట్టరుపేటి. వి. మరమగ్గం చట్రంలో పానుప పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు;

**సట్టదచ్చు** చూ. సట్టరు.

**సట్టరు** రూ. సటర్, సట్టర్, సంటరు². వి. **1**. మరమగ్గంలో పన్నె, పలక మొ. వి బిగించిన నాలుగు పట్టెల చట్రం ; **2**. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

ఇం. *Shutter*. మూసేది.

< ఇం. Shutter.

**సట్టరచ్చు** వి. అంచులో డిజైన్లు పడటానికి తయారుచేసే ఒకరకం అచ్చు. <సట్టరు + అచ్చు. **సట్టరుఅడ్డపెట్టె** వి. మరమగ్గం చట్రంలో మేరువుపలకకు కిందుగా నిలువ పట్టెలు బిగించిన మధ్యకర్ర. **సట్టరుకొయ్య** రూ. సట ర్కొయ్య. వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలుతో పాతిన కొయ్యరాట. **సట్టరుగుజ్జు** వి. మర మగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **సట్టరు గుంజ** వి. **1**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట ; **2**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా మగ్గం గుంటకు పక్కన పాతిన ఒకరకం పొడుగురాట. **సట్టరుచంక** వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **సట్టరుచెంప** రూ. సట్టరు సెంప. వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పెట్టె. **సట్టరుజబ్బ** వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పెట్టె. **సట్టరుడబ్బా** రూ. సటర్డబ్బా. వి. మరమగ్గం చట్రంలో పానుపుపెట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. **సట్టరుతాడు** వి. మరమగ్గం చట్రంలో నిలువుకొయ్య బిగించినతాడు. **సట్టరుదండె** వి. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డ పట్టె. **సట్టరునాడె** రూ. సటర్నాడె, సట్టరులాడె. వి. పడుగు పైపోగులకు, కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె. **సట్టరునిలువు** వి. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **సట్టరుపన్నె** వి. ఒకరకంపన్నె, సట్టరు మగ్గా

నికి బిగించేపన్నె. **సట్టరుపలక** రూ. నటరుపలక, నటర్పలక. వి. మరమగ్గం పన్నె బిగించిన పైచెక్క. **సట్టరుపాన** రూ.చూ. సట్టరుపాను. వి. మరమగ్గంలో వన్నె బిగించిన కిందికొయ్య. **సట్టరుపాను** యా.సటర్పాను, సట్టరుపాన. వి. మరమగ్గంలో పన్నె బిగించినకింది కొయ్య. **సట్టరుపికాసి** వి. మరమగ్గం నాడెను ఒకసొరుగులోంచి మరొక సొరుగులోకి నెట్టటానికి, సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక. **సట్టరుపేటి** రూ. సటర్పేటి, సట్టర్పేటి. వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. **సట్టరుబుజం** వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **సట్టరుబొమ్మ** వి. మరమగ్గం సొరుగుచివరకు నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **సట్టరుమగ్గం** రూ. సటర్మొగం. వి. నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజేది. **సట్టరుమొకం** వి. మరమగ్గం సొరుగుకుచివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క **సట్టరులాడె** రూ.చూ. సట్టరునాడె వి. పడుగుపైపోగులకు. కిందిపోగులకు మధ్య పేక దారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళసాయంతో విసిరే కొయ్యనాడె. **సట్టరుసింగర్** రూ. సటర్‌సింగర్. వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట. **సట్టరుసూత్రం** వి. కుచ్చుతాళ్ళలో డైమను తాడుకు ఒకవైపు కట్టినదారం. **సట్టరుసెంప** రూ.చూ. సట్టరుచెంప. వి. మరమగ్గంచట్రంలో పక్కగా బిగించిన హొడుగు పట్టె.

**సట్టవదాక** రూ. సట్టపుదాక, సట్టవాదాక. వి. ఎక్కువలోతు లేక వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

సట్టపదాకరాయి వి. కూరదాకలు సర్సేరాయి.

**సట్టవాదాక** రూ.చూ. సట్టవదాక. వి. ఎక్కువలోతులేక వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

**సట్టపుదాక** రూ.చూ. సట్టవదాక. వి. ఎక్కువలోతులేక వెడల్పుగా ఉండేమట్టిపాత్ర.

**సట్టికత్తిరింపు** వి. చరికాలంలో ఉన్ని కత్తిరించటం.

**సట్టికుదురు** వి. వాటకుండ కింద ఎత్తుకోసం కొదురులాగా పెట్టిన చన్న మట్టిపాత్ర.

<చట్టి + కుదురు.

**సట్టిపిడతంచు** వి. వెడల్పుగా బద్దలాగా సాఫీగా మట్టిపాత్రలకు పెట్టిన అంచు.

<చట్టి + పిడత + అంచు[3].

**సట్టిరాయి** రూ. చట్టిరాయి, సట్రాయి, సట్లరాయి. వి. సట్టి పిడతలు, పాలముంతలు మొ. మధ్యరకం పాత్రలు సర్సేదానికి వాడే చిన్నరాయి.

**సట్టిఅక్క** రూ.చూ. సట్టటికె. వి. కూరకువాడే చిన్నమట్టి పాత్ర.

**సట్ర** వి. సదకు ఊతపదం. బసవ. 58పు. 27పం.

**సట్రం** రూ.చూ. చట్టము[4]. వి. చెరకుగానుగపొయ్యికి ముందు గాలిలాగటాతికి పెట్టిన బెజ్జాల్తో ఉండే పెంకు.

**సట్రందాక** చూ. చట్టము[1]. వి. ఎక్కువలోతులేక వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

**సట్రాయి** రూ.చూ. సట్టిరాయి. వి. సట్టిపిడతలు. పాలముంతలు మొ. మధ్యరకం పాత్రలు సర్సేదానికి వాడే చిన్నరాయి.

**సట్లరాయి** రూ.చూ. సట్టిరాయి. వి. సట్టిపిడతలు, పాలముంతలు మొ. మధ్యరకం పాత్రలు సర్సేదానికి వాడే చిన్నరాయి.

**సడ**[1] రూ. సడయి. వి. దట్టమయిన నారువరుస, తసి. ఆం.భా. 2.35.

సడబోయు(-పోయు) స.క్రి. గోగులు మొ. పైర్లు చాలు లేకుండా చల్లటం, నిండుగా చల్లటం.

**సడ**[2] రూ.చూ. సడ్డ[2]. వి. **1**. వాంఛ ; **2**. అక్కర.

**సడకుడకలు** వి.బ.వ. భక్ష్యవిశేషం. హంస. 1.105.

**సడగర** రూ.చూ. సడగరము. వి. తొట్రుపాటు.

**సడగరము** రూ. సడగర. వి. సంభ్రమం, ఉత్సాహం, తొట్రుపాటు. కు. సం. 11.6, బసవ. 1. 180పు. 2 పం.

క. సడగర. ఆత్రుత, ఆనందం, సంభ్రమం, సడగరిసు, కలతపడు, సంతోషమయిన.

**సడపు** స.క్రి. అపహరించు. ప్రభా. 4.101.

సం. శద్ ఖండించు, అపహరించు ; ప్రా. సడ-. పోవు.

<ప్రా. సడ-.

**సడయి** రూ.యా. సడ[1]. వి. దట్టమైన నారువరస.

**సడరించు** రూ. సడలించు. స.క్రి. వదులుచేయు.

**సడలఁజేయు** చూ. సడలు.

**సడలించు** చూ. సడలు.

**సడలింపు** చూ. సడలు.

**సడలు** రూ. సడిలు, సల్లు, సళ్ళు[3]. అ.క్రి. **1**. బిగిచెడు, వదులగు. నిర్వ.రా. 6.48 ; **2**. పోవు, నశించు. బసవ. 62పు. 28పం ; **3**. గళితమగు, రాలు. హర. 6.16 ; **4**. చలించు, కదలు. క్రీడా. 1.155 ; **5**. నన్నగిల్లు. కావ్యా. చూ. 1.42, అచ్చ.రా. ఆరణ్య. 84 ; **6**. జారు, శ్లథమగు. విక్ర. 1.112 ; **7**. తగ్గు, క్షీణించు. విక్ర. 1.166 : **8**. చెడు. పోవు ఇందు. 3.7 : స.క్రి. విడుచు, త్యజించు. వరాహ. 8.10 ; పోగొట్టు. నీలా. 2.81.

సం. శిథిల - శృథిల - ; ప్రా. సఢిల-. సిఢిల - శక్తిహీనమగు, మందవీర్యం ; శౌ. సిఢిల, సఢిలదా ; అ.మా. సిఢిల, సిఢిలియా, సిఢిలియ. ఖరోష్ఠీ శిఢిల-; పో.చూ. సం. శ్లథ్.

క. సడిల్, సడల్, సడ్లు.వదులగు, బిగిచెడు. సడల్, సడల, సడిలు. జారు ; తు. సళ్ళు. వథిలగు, లూజగు, సడిలు, సడ్లు. శిథిలం, సడ్లాపుని. శిథిలమగు.

<ప్రా. సఢిల-.

సడలఁజేయు అ.క్రి. వదలించు. విచ్చు, తీసివేయు. < సడలు + -అ[7] + చేయు **సడలించు** స.క్రి. **1**. విడుచు, తీయు భీమ. 5.173 ; **2**. ఊడగొట్టు, పోగొట్టు. ప్రబోధ. 1.56 **3**. తప్పించు. ప్రబోధ. 5.13 ; **4**. తెరచు, తీయు. ఆము. 6. 107 ; **5**. తీసివేయు. పారి. 3.47 ; **6**. కలచు. చలింపచేయు. రాఘవా. 2.6 ; **7**. విప్పు, సడలచేయు, వదల్చు. ఉ. రా. 4.207 : **8**. తొలగించు చంపూరా.

6.24. క. సడలిసు-. వదులుచేయు. <సడలు+-ఇంచు³. **సడలింపు** వి. సడలించటం. లక్ష్మీ. వి. 4. ప్రబంధ. 1.672. **సడలుకొను** అ.క్రి. తొలుగు, పోవు. **సడలుకొలుపు** స.క్రి. సడలు కొనచేయు, పోగొట్టు. మార్క. 2.87. **సడలుచు** రూ.చూ. సడల్చు. స.క్రి. 1. సడలుచేయు, వదులుచేయు ; 2. తెరచు. **సడలుపడు** అ.క్రి. సడలు. అచ్చ. రా. బాల. **సడలుపఱచు** రూ.చూ. సడలువఱచు. స.క్రి. సడలచేయు. **సడలువఱచు** రూ. సడలుపఱచు. స.క్రి. సడలచేయు. నరస. 1.15. **సడలువారు** (-పాఱు³) స.క్రి. సడలు. విజయ. 1.43. **సడల్చు** రూ. సడలుచు. స.క్రి. 1. సడలచేయు, వదులుచేయు సారంగ. 2.191 ; 2. తెరచు. హంస. 3.90.

**సడల్చు** చూ. సడలు.

**సడవ** వి. మార్గం, తోవ. ఆం.భా. 2.8.

సం. శద్-. పడు, నాశనమగు, వెళ్ళు ; ప్రా. సడ-. పోవు, వెడలు.

<ప్రా. సడ-.

**సడవు¹** స.క్రి. అపహరించు. ప్రభా. 4.101.

సం. శద్. పడు, చంపు, నాశనమగు, వెళ్ళు; ప్రా. సడ-. పోవు, గతించు.

<ప్రా సడ-.

**సడవు²** వి. బరువు.

**సడాక** రూ.చూ. సలాక. వి. కడ్డీ. శుక. 2.460.

**సడాక్‌రోడ్డు** వి. రోడ్డు, మంచిబాట.

హిం. సడక్. బాట ; ఇం. Road. బాట.

<హిం. సడక్+ఇం. Road.

**సడాయించు** స.క్రి. 1. దంచు ; 2. విషయించు ; 3. తిట్టు ; 4. రమించు.

హిం. సడా (నా). కుళ్ళేటట్లుచేయు.

**సడి** వి. 1. జాడ. విరాహ. 3.60 ; 2. సద్దు, చప్పుడు. క్రీడా. 135 ; 3. నింద, దూరు, అపవాదు. తాళ్ల. సం. 13.252 ; 4. అమర్యాద : 5. అపకీర్తి.

క. సడి. నింద, అపవాదు, అపకీర్తి.

**సడికుడక** వి. భక్ష్యవిశేషం. హంస. 1.118. **సడికొడిగట్టలేని** అవ్య. చెడ్డపేరుకు భయపడినట్టి. శుక. 2.24. **సడిగొట్టు(-కొట్టు¹)** అ.క్రి. నిందకలిగించు. గౌ.హరి.ఉ. 1636. **సడిచను** రూ.చూ. సడిచను. అ.క్రి. ప్రసిద్ధికెక్కు. హర. 4.23. **సడి(బడు(-పడు)** అ.క్రి. కలుషితమగు. తాళ్ల. సం. 7.273. **సడి(బెట్టు(-పెట్టు)** స.క్రి. కలుషితమొనర్చు. తాళ్ల. సం. 5.41, **సడిసను(-చను)** రూ. సడిచను. అ.క్రి. ప్రసిద్ధికెక్కు. కు.సం. 7.129, భార. విరా. 4.115.

**సడికియ** రూ. సడికియ్య, సడికె². వి. కుక్కమెడకు కట్టేతాడు. బసవ. 139పు. 11పం.

సం. శాటక -, శాటికా. శాటీ, బట్ట, వస్త్రం, పడికిణి ; ప్రా. సాడగ-, సాడిఆ. వస్త్రం.

<ప్రా. సాడగ-.

**సడికియ్య** రూ.చూ. సడికియ. వి. కుక్కమెడకు కట్టేతాడు.

**సడికె¹** చూ. సడి. వి. 1. నిర్లక్ష్యం; 2. ప్రసిద్ధి.

**సడికె²** రూ.చూ. సడికియ. వి. కుక్కమెడకు కట్టేతాడు. ద్విభాగ. 5స్కం. 1391.

**సడించు** స.క్రి. దంచు, నలగదొక్కు.

సం. శద్, శటతి వేరుచేయు, చీల్చు, ప్రా. సడ-. చీల్చు, వేరుచేయు, సడణ- విశరణం, విదారణం ;

క. జడి, దంచు, జడత, జడిత, దంచటం ; తు. జడిపిని, జడిపుని. జడియుని ; పర్జి. చడ్ప్. కొట్టు, సమ్మెటతో కొట్టు.

<ప్రా. సడ-+-ఇంచు³.

**సడింపు(బ్రాలు (-ప్రాలు)** వి. దంపుడు బియ్యం. ఆము. 6.95. **సడింపులు** రూ. సడ్డంపులు. వి.బ.వ. 1. ఎనటిపోతలు, ఆహత తండులాలు. ఆము. 6.71 ; 2. ఎనటిపోతలుగా దంచిన బియ్యం ; 3. చివరన మరోసారి దంచవలసిన బియ్యం ; 4. దెబ్బలు ; 5. సాధింపు మాటలు.

**సడింపు(బ్రాలు** చూ. సడించు.

**సడింపులు** చూ. సడించు.

**సడిలు** రూ.చూ. సడలు. అ.క్రి. తగ్గు. హరి. ఉ. 8.150.

**సడిల్చు** స.క్రి. జారచేయు. కాశ, 4.12. క. సడలిచు

**సడిల్చు** చూ. సడిలు.

**సడుగు¹** రూ.చూ. సణుగు. వి. 1. వక్రోక్తి. ఆం.భా. 1.118 ; 2. మాట ; 3. సణుగుడు, అస్ఫుటవాక్కు.

**సడుగు²** వి. రోడ్డు, మంచిబాట.

హిం. సడక్, బాట, రోడ్డు.

<హిం. సడక్.

**సడుగు³** వి. 1. కటి ప్రదేశంలోని కీలుభాగం. భాగ. 10పూ. 298 ; 2. పేటువడికి కిందవేలాడగట్టిన బరువు.

**సడెంనూలు** వి. కదురుమీద వడికి తీసే తెల్లటి జనుపనార.

**సడ్డ¹** వి. చిన్నముక్క.

**సడ్డ²** రూ. సడ.² వి. 1. ఆదరం. బసవ. 157పు. 13పం ; 2. అక్కర. భార. అను. 97 ; 3. లక్ష్యం, గణుతి. చెన్నబసవ. 1.26 ; 4. శ్రద్ధ, ఆసక్తి. నీలా. 1.116, వేం. మా. 4.130 ; 5. గౌరవం. అష్టమ. క. 3075 ; 6. ఎన్నిక ; విశ. గౌరవమైన. భార. శాంతి. 4.416.

సం. శ్రద్ధా. ఆసక్తి, అక్కర ; ప్రా. సడ్డా. అభిలాష, వాంఛ, ఆదరం, సమ్మానం, చిత్తప్రసన్నతి ; జై. మహా. అ.మా. సడ్ఢా ; పా. సద్ధా ;

క. సడ్డ, సడ్డి, సడ్డె. గౌరవబుద్ధి ; తు. సడ్డు. నిర్లక్ష్యం, తేలికదనం ; త. చట్టై.

<ప్రా. సడ్డా.

**సడ్డచేయు** రూ.చూ. సడ్డసేయు. అ.క్రి. లక్ష్యపెట్టు, లెక్కచేయు. దశా. 7.179. **సడ్డయొనర్చు( ఒనర్చు)** స.క్రి. లెక్కచేయు. శుక. 1.527. **సడ్డలాడు** స.క్రి. గౌరవించు. తాళ్ల. సం. 16.2.52. <సడ్డ+-లు+ఆడు. **సడ్డలుసేయు(-చేయు)** స.క్రి. ఆదరంచేయు, బసవ. 445పు. **సడ్డసేయు** రూ. సడ్డచేయు. స.క్రి. సరకుచేయు, లెక్కచేయు. భాగ, 10ఉ. 499 ; అ.క్రి. ఆదరించు. తాళ్ల. సం. 4.30, **సడ్డించు.** అ.క్రి. 1. అలక్ష్యంచేయు. ఉ. హరి, 4.27 ; 2. మోమాటపడు ; స.క్రి. దంచు. త. చడ్డిదక్.

**సడ్డకుఁడు** వి. తోడల్లుడు.

సం. షడ్డక - తోడల్లుడు ; ప్రా. సడ్డఓ - ;

క. సడ్డక ; తు. సడ్డుకె ; త. చట్టుకన్ ; కుఇ. సడు ; గోం. సగ్లత్.

<సం. షడ్డక-.

**సడ్డగం** వి. కొలిమిలోని బొగ్గును సరిచేయటానికి వాడే ఇనుప కమ్మి ఒకవైపు కత్తిలాగా పట్టుకోవటానికి వీలుగా ఉండేది

**సడ్డించు** చూ. సడ్డ².

**సడ్డింపులు** రూ.చూ. సడింపులు. వి.బ.వ. ఎనటిపోతలుగా దంచిన బియ్యం.

**సడ్డు**¹ వి. దుష్పరిణామం. తాళ్ల. సం. 5.233.

**సడ్డు**² వి. సున్నబ్బట్టిలో మిగిలేగులక. మట్టి, బొగ్గుల మిశ్రమం.

**సణకె** రూ. సణికె. వి. చెలకపార. గడ్డపార.

**సణగు** రూ.చూ. సణుగు. అ.క్రి. అస్ఫుటంగా ధ్వనిచేయు. తాళ్ల. సం. 18.328 ; వి. **1.** బాధ ; **2.** అస్ఫుటవాక్కు ; అ. క్రి. గొణుగు, అస్ఫుటంగా పలుకు.

**సణికె** రూ.చూ. సణకె. వి. చెలకపార.

**సణుగు** రూ. సడుగు¹, సణగు. వి. **1.** బాధ. ఉ. హరి. 5.157 ; **2.** అస్ఫుటవాక్కు ; అ.క్రి. గొణుగు. అస్ఫుటంగా పలుకు, లోలోన పలుకు. ద్వి. పరమ. వి. 323.

సం. స్వన-ధ్వని, గర్జన, హెూరు ; ప్రా. సణ-. శబ్దం, ధ్వని, సణియ ; అ. మా. పా. సణ-. ధ్వని ; మరా. సంకా ; పో.చూ. సం. స్వర-.ధ్వని ;

క. సొన. శబ్దం, గోల, మాట, ధ్వని ; మ. చిణుక్కుక. గొణుగు ; గోం. సఁణ్కో ; పర్జి. సనతి, సణతి.

<ప్రా. సణ-.

**సంటరు**¹ రూ.చూ. సెంటరు. వి. మధ్యభాగం.

**సంటరు**² రూ.చూ. సట్టరు. వి. **1.** మరమగ్గంలో పన్నె పలక మొ. వి బిగించిన నాలుగుపట్టెల చట్రం ; **2.** మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.

**సంటరుడబ్బా** వి. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. **సంటరునాడె** రూ. సంటర్నాడె. వి. పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె. **సంటరుపలక** రూ. సంటర్పలక. వి. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క. **సంటరుమగ్గం** వి. నేత నేసేటప్పుడు పడుగులో ఒకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజే ఒకరకం మగ్గం. **సంటర్నాడె** రూ.చూ. సంటరునాడె. వి. పడుగు పైపోగులకు కిందిపోగులకు మధ్య పేకదారం పడటానికి కండె అమర్చి కుచ్చుతాళ్ళ సాయంతో విసిరే కొయ్యనాడె. **సంటర్పలక** రూ.చూ. సంటరుపలక. వి. మరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క.

**సంటరేగలు** రూ.చూ. సంటరేవులు. వి.బ.వ. ఆముగోడపక్కల నుంచి కొమ్మరేవుల వెంబడి అటొకటి ఇటొకటి సందులు వచ్చేలాగా కట్టిన రేవులు.

**సంటరేవులు** రూ. సంటరేగలు. వి.బ.వ. ఆముగోడపక్కల నుంచి కొమ్మరేవుల వెంబడి అటొకటి ఇటొకటి సందులు వచ్చేలాగా కట్టిన రేవులు.

ఇం. *Centre*. మధ్య.

**సంటర్నాడె** చూ. సంటరు.

**సంటర్పలక** చూ. సంటరు.

**సంటలు** రూ. సంటాలు, సంట్లు, సొంటలు. వి.బ.వ. ఆము పడుగులో కుండలపేర్పు మధ్యకట్టే కంపవేయటానికి వదిలినసందులు.

**సంటాలు** రూ. చూ. సంటలు. వి. బ. వ. ఆముపడుగులో కుండలపేర్పు మధ్య కట్టెకంప వేయటానికి వదిలిన సందులు.

**సంట్రింగు** వి. ఆర్చీలు, శ్లాబులు మొ. వాటి నిర్మాణానికి పనికివచ్చే తాత్కాలికపు కట్టు.

ఇం. *Centring*. మధ్యగా ఉండేటట్లు చేయటం.

<ఇం. Centring.

**సంట్లు** రూ.చూ. సంటలు. వి.బ.వ. ఆము పడుగులో కుండల పేర్పు మధ్య కట్టెకంపలు వేయటానికి వదిలిన సందులు.

**సంద్ర** రూ.చూ. చంద్ర. వి. ముళ్ళుండే ఒకరకం ఎడారిచెట్టు (Mimosa Sundra Roxb).

**సంద్రకంప** వి. ఆముకాల్పుకు వాడే సంద్ర చెట్టు కొమ్మలు.

**సణ్ణయ్య** వి. పినతండ్రి.

<చిన్న+అయ్య.

**సత**¹ రూ.చూ. సత్తా¹. వి. **1.** జూదంలో వాడబడే ఏడు సంఖ్యకుసంజ్ఞ. సత్తా. ఆం. భా. 2.306 ; **2.** సప్తసంఖ్య. ఆం. భా. 3.50, E. I. సంపు. 20.1.

**సతగిబ్బలు** వి. బ. వ. ఏడుగుర్రాలు. నీలా. 2.44. **సతతపసులటెంకి** వి. ఆకాశగంగ. **సతనాలుకలదునీఁడు** రూ. సతనాల్కలదునీఁడు. వి. అగ్ని. సాంబ. దేవ. 12. **సతనాలుకలు** వి. బ. వ. ఏడు నాలుకలు. వేంక. 16. **సతనాల్కలజేజే** వి. అగ్ని. **సతనాల్కలదునీఁడు** రూ.చూ. సతనాలుకలదునీఁడు. వి. అగ్ని, సప్త జిహ్వుడు. **సతనాల్కలపాదుసా** వి. అగ్ని. **సతపేరుతత్తడి జత తేరుగలప్రోడ** వి. సూర్యుడు. సాంబ. దేవ. 9. **సతప్రోల్లు** వి.బ.వ. సప్త క్షేత్రాలు. అచ్చ. రా. బాల. 32. అయోధ్య, మధుర, మాయ, కాశి, అవంతి, ద్వారావతి, ప్రయాగలు సప్త క్షేత్రాలని కొందరు. 'మాయా, ద్వారకావంతి, కాశి, కురుక్షేత్ర గయా, ప్రయాగము'లని అల్లసాని పెద్దనగారు. మను. 2.16. **సతరుసులు** వి.బ.వ. ఏడుగురు మహర్షులు. వేంక. ఆం. 17. **సతహుమాదబి** వి. సూర్యుడు. ఆం. పదా. సుర. 21.

**సత**² వి. తీవ్రప్రయత్నం.

సం. శక్త-. సమర్థమైనది ; ప్రా. సత్త-.

<ప్రా. సత్త-.

**సతకడము** వి. **1.** చదువు. హంస. 2.49 ; **2.** చదవటం.

**సతకబోకి** వి. దృష్టిదోష పరిహారానికి నిమ్మకాయలు, జీడిగింజలు మొ. వి నాలుగుతోవలు కలిసినచోట దిగదీసి పోయటానికి పగలకొట్టిన కుండబొచ్చె.

**సతగొట్టు(-కొట్టు**¹**)** స.క్రి. చితగ్గొట్టు. రం. రా. యు. ప. 253.

పం. 15.

**సతపోరు** మి.స.క్రి. చాలారకాలుగా ప్రయత్నించు.

సం. శత-. నూరు.

< సం. శత-+పోరు.

**సతమతము** రూ.చూ. సదమదము. వి. మిక్కిలి ఆయాసం.

**సతమతమగు** రూ.చూ. సదమదమగు. అ.క్రి. నలిగిపోవు.

**సతము** వి. శాశ్వతం, ఎల్లప్పుడు. భార. అరణ్య. 7.194.

సం. సతత-. అవిచ్ఛిన్నమైన, ఎడతెగని, శాశ్వతం.

< సం. సతత-.

**సతాయించు** రూ. శతాయించు. స.క్రి. హింసించు, బాధించు. పద్మ. యు. 231.

ఒ. సతానా. హింసించటం, బాధించటం; హిం.ఉ. సతానా. దుఃఖపెట్టటం, బాధించటం; మరా. సతావఃణేం. పీడించు, బాధించు.

< ఉ. సతా(నా)+-ఇంచు[3].

**సతి** రూ. సత్తి. వి. గ్రామదేవత. నె.శా. దర్శి. క్రీ.శ. 700.

సం. శక్తి-. బలం, సామర్థ్యం, పీఠాధిష్ఠాన దేవత; ప్రా. సత్తి. సామర్థ్యం, అస్త్రవిశేషం, విద్యావిశేషం; అ. మా. సత్తి. ఆయుధం, బలం, వశిష్ఠుని కుటుంబం; పా. సత్తి. సామర్థ్యం, బలం; అప. సత్తి. శక్తి;

క. సకతి, సకుతి; తు. సకతి, సక్తి, సగుతి. సత్తి త. సత్తి; బ్రా. చత్తి.

< ప్రా. సత్తి.

**సతికిలఁబడు** రూ.చూ. చదికిలఁబడు. అ.క్రి. కూలబడు.

**సతివెట్టి** వి. వెల ఇవ్వకుండా ఊరికే స్త్రీని పొందటం. పండి. చ. ప్రథ. 2.361.

సం. సతీ. భార్య, పార్వతి, స్త్రీ.

< సం. సతీ+వెట్టి.

**సతుకు** చూ. చదువు. స.క్రి. చదువు.

**సత్కదీయు(-తీయు)** అ.క్రి. దృష్టిపరిహారం తీసివేయు.

**సత్త[1]** రూ.చూ. సత్తా. వి. 1. సత్తువ, బలం; 2. ఏడు.

**సత్త[2]** వి. గొడుగు పట్టేవానికి ఇచ్చేభూమి. E. C. 12. తుంకూర్. 52. క్రీ.శ. 1447.

సం. ఛత్ర-. ఛత్రికా. గొడుగు; ప్రా. ఛత్త-.

క. సత్తిగె. గొడుగు.

< ప్రా. ఛత్త-.

**సత్తకన్ను** చూ. సత్తు[1]. వి. 1. అనురాగం లేనిచూపు. కు.సం. 5.79; 2. లొంతకన్ను.

**సత్తకన్నుపొంతకన్ను ఎఱుఁగు** అ.క్రి. ఏదివట్టిదో ఏది గట్టిదో తెలియు.

**సత్తర** వి. కళ్ళంలో తొక్కించటానికి మేటికొయ్యచుట్టూ పరచిన కంకులు.

**సత్తరకాయ** వి. 1. భార్యాభర్తలకు అన్యోన్యత లేకపోయినా కలిగే సంతానం; 2. అల్లరి పిల్లవాడు.

హిం. సతర్. వక్రతుయిన; హిం. ఉ. సతర్. మనుష్యగుహ్యేంద్రియం.

< ఉ. సతర్+కాయ.

**సత్తరము** రూ.చూ. సత్తరువు[1]. వి. అన్నదానగృహం, ధర్మశాల.

**సత్తరు** రూ.చూ. సత్తరువు[2]. వి. వస్తువులు పెట్టుకోవటానికి వీలుగా గోడలోపాతిన చిన్నగూటాల మీద ఇంటికప్పు క్రింద అమర్చిన బల్ల.

**సత్తరుమిట్న** వి. వంకరగా ఉన్నమూలలు కొలవటానికి తాపీపనివాళ్ళు వాడే త్రిభుజాకారపు రేకు పరికరం.

**సత్తరువు[1]** రూ. సత్తరము, సత్రము, సత్రవు. వి. అన్నదాన గృహం, సత్రం. యయా. 1.38.

సం. సత్త్ర-. ధర్మశాల, శరణాలయం, సమావేశం, ఒకానొకయాగం; ప్రా. సత్త-. ధర్మశాల;

క. చత్ర; త. చత్తిరమ్; తొ. సొతిర్క్.

< సం. సత్త్ర-.

**సత్తరువు[2]** రూ. సత్తరు. వి. వస్తువులు పెట్టుకోవటానికి వీలుగా గోడలో పాతిన చిన్నగూటాలుమీద ఇంటి కప్పుకింద అమర్చిన బల్ల.

**సత్తరువుగోడ** రూ. సత్రవుగోడ, సత్రిగోడ. వి. చెన్నగోడ, చుట్టుగోడలమీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు కట్టిన పక్కగోడ.

**సత్తవ** రూ.చూ. సత్తువ[1]. వి. భూమికి వేసే సత్తువ, ఎరువు.

**సత్తా[1]** రూ. సత, సత్త[1]. వి. ఏడు, ఆరునొక్కటి. ఉ. హరి. 3.121.

సం. సప్తన్-ఏడు; ప్రా. సత్త-. ఆరున్నొకటి; జై. మహా. పా. శౌ. అ. మా. అప. సత్త; మా. శత్త;

క. సత్త; కుఇ. సాతొ; కువి. సాత; చెంచు, సాత్.

< ప్రా. సత్త-.

**సత్తా[2]** వి. 1. బలం; 2. ఆర్థికస్తోమత.

హిం. సత్తా. ఉనికి.

< హిం. సత్తా- (అర్థవిపరి.).

**సత్తారు** వి. అన్నంరాశి.

**సత్తి** రూ.చూ. సతి. వి. 1. శక్తి, ఆయుధవిశేషం. అచ్చ.రా. యు. 2.18, సాంబ. దేవ. 7; 2. బలం, సత్తువ. చంద్రాంగ. 2ఆ; 3. పార్వతి. నీలా. 1.52; 4. వశిష్ఠుని కొడుకు. అచ్చ. రా. అయోధ్యా. 44; 5. అమ్మవారు, కుమ్మరివాళ్ళు మట్టిలో చేసినప్రతిమ, గ్రామదేవత; 6. పిశాచం.

**సత్తిగలఁడు** విణ. కుమారస్వామి. **సత్తిగలుగుమేటి (-కలుగుమేటి)** వి. కుమారస్వామి. **సత్తితాలుపు** రూ. సత్తితాల్పు. వి. కుమారస్వామి. శక్తిధరుడు. **సత్తితాల్పు** రూ.చూ. సత్తితాలుపు. వి. కుమారస్వామి, శక్తిధరుడు. **సత్తిదొర** వి. శివుడు. **సత్తిదొరవేనలి** వి. ఆకాశం. **సత్తినెచ్చెలి** వి. లక్ష్మి. ఆం. పదా. సుర. 14. **సత్తిఁబూనువలంతి (-పూనువలంతి)** వి. కుమారస్వామి. సాంబ. దేవ. 7. వ్య. శక్తి ఆయుధాన్ని ధరించే నేర్పరి. **సత్తిరావి.** శివుడు. ఆం. పదా. సుర. 20. **సత్తిరాపగఱ** రూ. సత్తిరాపగఱు. వి. మన్మథుడు. ఆం. పదా. సుర. 6.20, **సత్తిరాపగఱు** రూ.చూ. సత్తిరాపగఱ. వి. మన్మథుడు. సత్తి

రావిల్లు వి. మేరు పర్వతం. పొంగట్టు.

**సత్తికారు** చూ. సత్తి. వి. రెండోపంటదాన్యం.

**సత్తికాలం** వి. సత్యకాలం.

నం. సత్యకాల -. నిజానికి సంబధించిన కాలం.

< నం. సత్యకాల -.

**సత్తిగలు** వి.బ వ. షష్టికలు.

**సత్తిగిన్నె** రూ.చూ. సత్తుగిన్నె. వి. తగరపుగిన్నె.

**సత్తిపాల** వి. తెల్లటిపూలుపూసే ఒకరకం పెద్దచెట్టు.

**సత్తిరిపాతబండ** వి. సర్వేటప్పుడు సలపను తడి చేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

**సత్తు**[1] వి. మెత్తని లోహవిశేషం, తగరం, సీసం.

నం. యశద -. తగరం ; ప్రా. జసద- ; నే. జస్తా; దస్తా ; గు. మరా. జస్తా ;

క. సతువు, సత్తు.

< ప్రా. జసద -.

**సత్తుగిన్నె** రూ. సత్తిగిన్నె. వి. తగరపుగిన్నె.

**సత్తు**[2] వి. పేల పిండి. ఆం. భా. 2.254.

నం. సక్తు-, శక్తు -. పిండి ; ప్రా. సత్తు, సత్తుఅ, సత్తుగ - ; అ.మా. సత్తు, సత్తుగ -, సత్థాగ ; పా. సత్త - ;

క. సత్తుగ ; బ్రా. సత్తూ.

< ప్రా. సత్తు.

**సత్తు**[3] రూ.చూ. సత్తువ. వి, 1. బలం, చేవ ; 2. సామర్థ్యం.

**సత్తుగిత్త** వి. బలంగలఎద్దు. నీలా. 118. **సత్తుమట్టి** రూ.చూ. సత్తువమట్టి. వి. నల్లగా జిగురుగా ఇసుక లేకుండా ఉండేమట్టి.

**సత్తు**[4] వి. సత్యం. సకలనీతి. 420.4.

నం. సత్య-. యథార్థం ; పా.ప్రా. సచ్చ-; ప్రా. సత్త-. తు. సతు. సత్యం, దర్మం ; కువి. సత్తి. వినయం.

< ప్రా. సత్త-.

**సత్తువ**[1] రూ. సత్తవ, సత్తు[3], సత్తువు. వి. 1, దేహబలం. ఆం. భా. 2.221 ; 2. ఎరువు,

నం. సత్త్వ -. స్వభావం. ప్రాణం, సత్యం, బలం ; శక్తి ;

క. సత్తు ; త. సత్తువమ్.

< నం. సత్త్వ -.

**సత్తువమట్టి** రూ. సత్తుమట్టి. వి. నల్లగా జిగురుగా ఇసుక లేకుండా ఉండేమట్టి.

**సత్తువ**[2] వి. చదును, సాపు.

**సత్తువు** రూ.చూ. సత్తువ[1]. వి. 1. శక్తి ; 2. సత్తువగల భూమి.

**సత్తూరి** రూ.చూ. చత్తూరి. వి. ఎముకలు కొట్టేకత్తి.

**సత్తెము** వి. సత్యం, నిజం. తాళ్ల. సం. 8.60, 17.511.

నం. సత్య -. నిజం. యథార్థం ; ప్రా. సచ్చ -, సత్తం - ; శాబరీ. శమ్చ్చ - ; శౌ. సచ్చ - , శకున్తలా తు. సచ్చ, సతు ; కువి సత్తి. వినయం.

< నం. సత్య -.

**సత్తెమ్మ** వి. 1. ఒకగ్రామదేవత ; 2. శక్తిరాయి.

నం. సత్య - నిజం, యథార్థం.

< నం. సత్య - + అమ్మ.

**సత్రెవంగ** వి. సస్యవిశేషం. విష్ణు. పూ. 3.

**సత్రేళము** వి. దసరాలో విచిత్రవేషాలువేసి ఇనాంలు తీసుకోవటం.

**సత్రమఠపతి** చూ. సత్రము.

**సత్రము** రూ.చూ. సత్తరువు[1]. వి. బాటసారుల వసతికోసం కట్టిన కట్టడం.

**సత్రమఠపతి** వి. సత్రపర్యవేక్షకుడు, సత్రాధికారి. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 904. క్రీ.శ. 1291.

**సత్రవ** రూ,చూ. సత్తరువు[1]. వి. బాటసారుల వసతికోసం కట్టినకట్టడం.

**సత్రవు** రూ.చూ. సత్తరువు[1]. వి. బాటసారుల వసతికోసం కట్టిన కట్టడం.

**సత్రవుగోడ** రూ,చూ. సత్తరువుగోడ. వి. చెన్నగోడ, చుట్టుగోడలమీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు కట్టిన పక్కగోడ.

**సత్రిగోడ** రూ,చూ. సత్తరువుగోడ. వి. చెన్నగోడ, చుట్టుగోడల మీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు కట్టిన పక్కగోడ.

**సద** వి. 1. ఆకు. బసవ. 58పు. 27పం ; 2. ఆకుమీది నూగు ; 3. ఆకులోని సన్నటి ఈనెలు.

నం. ఛద- మూత, రెక్క, ఆకు ;

క. సదె. చెత్త.

<నం. ఛద-.

**సదనపవెద్రు** రూ.చూ. సదనపుపెదురు. వి. చాపలు, బుట్టలు మొ. వి అల్లటానికి ఉపయోగపడే వెదురుచెట్టు (Dandrocalamus strictus).

**సదనపువెదురు** రూ. సదనపవెద్రు. వి. బుట్టలు, చాపలు మొ. వి అల్లటానికి ఉపయోగపడే వెదురుచెటు (Dandrocalamus strictus).

**సదను** రూ.చూ. చదును. వి. మిట్టపల్లాలు లేకుండా ఉండటం.

**సదమదమగు** చూ. సదమదము.

**సదమదము** రూ. సతమతము. విశ. 1. చావు. పల్నా. 130 ; నలిగినది. మను. 6.69 ; వి. 1. కలవరం. తాళ్ల. సం. 5.205 ; 2. అలసి పోవటం, నలిగిపోవటం.

నం. సదామద-.నిరంతరమదం, నిరంతరపారవశ్యం, నిరంతర సుఖం.

<నం. సదామద-.

**సదమదమగు** రూ. సతమతమగు. అ.క్రి. 1. నలగు, మర్దితమగు. పిశకు. 2.22 ; 2. చచ్చు. <సదమదము + అగు. **సదమదముచేయు** స.క్రి. 1. మర్దితమొనర్చు, నలగగొట్టు. ఆం. నా. సం. మాన. 47.50 ; 2. చంపు. **సదమదమొనరించు** స.క్రి. నాశనంచేయు. అచ్చరా. కిప్కిం. 51. <సదమదము + ఒనరించు. **సదమదమొనర్చు** స.క్రి. చంపు, వధించు. <సదమదము + ఒనర్చు.

**సదమదమొనరించు** చూ. సదమదము.

**సదమదమొనర్చు** చూ. సదమదము.

సదర్ రూ.చూ. సదరు.[1] విణ. 1. పైచెప్పిన, ముందుచెప్పిన ; 2. ప్రధానమైన.

సదర[1] రూ.చూ. సదరు[1]. విణ. పైన చెప్పినది. నె.శా.1.4. క్రీ.శ. 1746.

సదర[2] రూ.చూ. చదురు[2]. వి. సర్వేటప్పుడు కూర్చొవటానికి కుమ్మరి కిందపరచుకొనే గొర్రెచర్మం.

సదరకొట్టు స.క్రి. ఒకసారి నర్సిన కుండల్ని మళ్ళీ సదరం నలపతో నునుపు చేయు.

సదరమీన్ వి. ప్రధాన న్యాయవాది.

ఉ. అర. సద్-అమీన్ ;

త. చతరమీన్.

<ఉ. సద్-అమీన్.

సదరము విణ. చతురమైన. తాళ్ల.సం. 5.204 ; వి. 1. చాతుర్యం. తాళ్ల.సం. 10.71 ; 2. వేళాకోళం. తాళ్ల. సం. 17.248.

సం. చతుర-.నిపుణమైనది, నేర్పరి ;

క. చదురు, చెదరు. తెలివి ; త. చతుర. నేర్పు ; మ. చతురమ్.

<సం. చతుర-.

సదరంపడుగు వి. ఎర్రాముకాల్పులో కుండలు పేర్చ టానికి ఆముగోడలోపల నల్లాములో మాదిరి ఏటవాలుగా కాకుండా చదరంగా ఉండే ప్రదేశం.

సదరంపడుగు చూ. సదరము.

సదరవా రూ.చూ. సదరు[1]. విణ. పూర్వోక్తం.

సదరహ్ రూ.చూ. సదరు[1]. విణ. పూర్వోక్తం.

సదరహ రూ.చూ. సదరు[1]. విణ. పూర్వోక్తం.

సదరహి రూ.చూ. సదరు[1]. విణ. పైనచెప్పిన, ముందు చెప్పిన ; 2. ప్రధానమైన.

సదరహీ రూ.చూ. సదరు[1]. విణ. 1. పైచెప్పిన, ముందు చెప్పిన ; 2. ప్రధానమైన.

సదరహీలు విణ. బ.వ. పైనచెప్పిబడినవారు.

సదరహూ రూ.చూ. సదరు[1]. విణ. 1. పైనచెప్పిన, ముందు చెప్పిన ; 2. ప్రధానమైన.

సదరి రూ.చూ. సదరు[1]. విణ, 1. పైనచెప్పిన, ముందు చెప్పిన ; 2. ప్రధానమైన.

సదరీ రూ.చూ. సదరు[1]. విణ. 1. పైచెప్పిన, ముందు చెప్పిన ; 2. ప్రధానమైన.

సదరు[1] రూ. సదర్, సదర[1], సదరవా, సదరహ్, సదరహ, సదరహి, సదరహీ, సదరహూ, సదరి, సదరీ, సదురు[1]. విణ. 1. పైనచెప్పినది. నె.శా. కందుకూరు. 48. క్రీ.శ. 1650.51 ; 2. ముఖ్యస్థానం, న్యాయాలయం, ప్రాంగణం. విశ్వే. శ. 55.

హిం. సదర్. ప్రధానం, ముఖ్యం, న్యాయాలయం, నగరరాజధాని ; మరా. సదర్. ముఖ్యుడు, న్యాయసభ. ముఖ్య న్యాయస్థానం ; ఉ సద్ర్. ప్రాంగణం, ముఖ్యుడు, మఖ్యస్థానం ; శ్రేష్ఠుడు ; పార. సద్ర్. ముందు భాగం, ముఖ్యుడు ; అర. సద్ర్. ముఖ్యుడు, స్వద్. చెప్పబడిన, ప్రధానమైన, ముందుకూర్చున్న ;

క. సదరి.

<ఉ. సదర్.

సదరు[2] రూ.చూ. సరుదు. స.క్రి. అద్దలించు, కొయ్యసాధ నాలతో మెల్లగాకొట్టు, బాదు.

సదరుబోయలు వి.బ.వ. ఒకజాతిబోయలు.

సదసద వి. 1. సదముదం, చావు. జైమినిభా. 4.77. 2. నలుగుడు.

క. సదె, సదెబడి. సదముదం ; తు. సది, సద సదప్పు.

సదస్యం వి. వివాహంలో పండితులను వేదవేత్తలను పిలిచి దంపతులకు దీవనలిప్పించి పండితుల నందరిని సంభావనతో సత్కరించటం.

సం. సదస్య-. సభానదుడు, ఋత్విక్సహాయకుడు.

<సం. సదస్య-. (అర్థవిపరి).

సదాకాలం విణ. ఎల్లప్పుడు.

సం. సదా. ఎల్లప్పుడు, కాల-.సమయం.

<సం. సదాకాల- (అర్థవిపరి.).

సదాంకాయ వి. ఊరగాయలకు ఉపయోగించే ఒకరకం పండు.

సదాటము రూ.చూ. సదాటు. వి. సమతలమైన ప్రదేశం, చదరకట్టునేల ; వి. గట్టి, బిట్టు.

సదాటు రూ. సదాటము. విణ. 1. దృఢం, బలంకలది. శశా. 2.16 ; 2. వక్రోన్నతం. ఆం. భా. 3.19.

సదాన రూ.చూ. సదాప. వి. ఒకానొకచెట్టు, మధురిక. ఆం. భా. 1.59 (Anethum panmorium.)

సదాప రూ. సదాన. వి. శతపుష్ప, ఒకరకంచెట్టు. హంస. 4.132.

సం. శతపుష్పా. వృక్షవిశేషం : ప్రా. అ.మా. సయ పుష్పా, సతపుప్ఫీ ; పా. సతపుప్ఫా నే. సుఁప్ ; హిం. సదాఫ్ ; మరా. సెప్, సోప్ ;

క. సదగుప్పె సదాప, సదాబు, సబ్బసిగె. సోవ ; తు. సదాపు, సదాబు ; త. సదాప్పు ; మ. చతకుప్ప,

<సం. శతపుష్పా.

సదాముదు వి. సంతు.

సదాముస్తె వి. ఒకానొకచెట్టు, జెముడు. హంస. 4.10.

సదావర్తి రూ. సదావృత్తి, వి. బైరాగులకు బాటసారులకు నిత్యం. సత్రంలో వండుకోవటానికి ఇచ్చే బియ్యం మొ. వి. J.D.H.R.S.9. P 13.14. క్రీ.శ. 1762.

సం. సదావర్తిన్. ఎల్లప్పుడూ ఉండేది.

<సం. సదావర్తిన్ (అర్థవిపరి.).

సదావృత్తి రూ.చూ. సదావర్తి. వి. 1. బైరాగులు మొ. వారికి సత్రం మొ. వాటిలో వండుకోవటానికి ఇచ్చే బియ్యం మొ. వి. ; 2. తిండి.

సదావృత్తియిచ్చు (-ఇచ్చు) స.క్రి. స్వయంపాకానికి తగిన బియ్యం మొ. వి ఇచ్చు.

సదాసగ్రా వి. కసవుగగ్రా. బసవ. 3.65.

సదించు(-ఇంచు[3]) స.క్రి. రేకుగాకొట్టు.

సదిరిచేయు చూ. చదురు. స.క్రి. నెరుపు, ఎత్తుపల్లాలునరి

చేయు, చదునుచేయు.

**సదిర్య** వి. వేస్ట్‌కోటు.

హిం.ఉ.అర. సద్‌రీ. చేతులులేని జాకెట్టు.

< ఉ. సద్‌రీ.

**సదుగోకపేగు** వి. కుండల్ని నర్సేటప్పుడు నలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

**సదుగోకబండ** వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డపెట్టుకొనే రాయి.

**సదును** రూ.చూ. చదును. వి. **1**. సమతలం, చదరం ; **2**. తేమ, నెమ్ము.

సదునుసేయు స.క్రి. **1**. కొట్టు ; **2**. దిమ్మిసతో సాపు చేయు.

**సదురు**[1] రూ.చూ. సదరు[1]. విశే. **1**. పైనచెప్పినది, ముందు చెప్పిన ; **2** ప్రధానమైన.

**సదురు**[2] రూ.చూ. సరుదు. స.క్రి. నెరుపు, ఎత్తుపల్లాలుసరి చేయు, చదునుచేయు.

**సద్ద** రూ.చూ. సజ్జ[2]. వి. ఆహారధాన్యంగానూ, పశుగ్రాసం గానూ, వంటచెరకుగాను, ఇళ్ళుకప్పటానికి ఉపయోగించే తృణవిశేషం (Eleusine indica).

సద్దగూగు వి. ఆము పడుగులో వేయటానికి ఉపయో గించేది. సద్దబుస రూ. సద్దబూసి. వి. సజ్జదంటులోనిగూగు. సద్దబూసి రూ.చూ. సద్దబుస. వి. సజ్జదంటులోనిగూగు.

**సద్ది**[1] రూ.చూ. చదిలి. వి. చలిది, పర్యుషితాన్నం ; **2** పులిహోర.

సద్దికంపు వి. చద్దివాసన. సద్దిదుత్త రూ. సల్దిదుత్త. వి. పొలంలోకి కూడు, గంజి మొ. వి. తీసుకొనిపోవటానికి వాడే మట్టిపాత్ర. సద్దిపీనుగ వి. ఎప్పుడో చచ్చిన పీనుగ. సద్దులు వి.బ.వ. బతుకమ్మ పండుగరోజు పిండి చక్కెర కలిపిచేసే అయిదురకాలైన పిళ్ళు (పిండిలో చేసిన ఫల హారం).

**సద్ది**[2] వి. ఆడుగురి.

**సద్దు**[1] వి. ధ్వని, చప్పుడు. వేంక. పంచ. 58, ఆం.భా. 1.121.

సం. శబ్ద-. ధ్వని ; ప్రా. సద్ద-; అ.మా. జై.మహా. పా. శౌ. సద్ద- ;

క. సద్ద, సద్దు, సబుద ; తు. సద్దు సద్దు ; త. సద్దమ్; మ. చెత్తం ; కుఇ. సద.

< ప్రా. సద్ద-.

సద్దుమడఁగు రూ. సద్దుమణఁగు. అ.క్రి. చప్పుడుతగ్గు. సద్దుమణఁగు రూ.చూ. సద్దుమడఁగు. అ.క్రి. చప్పుడుతగ్గు. సద్దుసేయు(-చేయు) అ.క్రి. శబ్దంచేయు, ధ్వనించు, చప్పుడు చేయు.

**సద్దు**[2] రూ.చూ. సరుదు[2]. స.క్రి. **1**. ఇచ్చు ; **2**. సమంగా పంచు.

సద్దుకొను రూ.చూ. సరుదుకొను. స.క్రి. సవరించు కొను ; అ.క్రి. అడగు. సద్దుబాటు రూ.చూ. సర్దుబాటు. వి. **1**. సవరింత ; **2**. ఇవ్వటం.

**సద్దులు** చూ. సద్ది[1].

**సద్దె** వి. సొంతం.

**సన** రూ. సైను, స్న. వి. సంవత్సరం, ద.హిం.గా. సంపు. 10. శా సం. 751, క్రీ.శ. 1592.

హిం. సన్. సంవత్సరం ; మరా. సన్. సంవత్సరం ; ఉ. సనా, సన్. వర్షం, సంవత్సరం ; పార. సనత్, సన. సంవత్సరం ; అర. సనా. సంవత్సరం.

< ఉ. సన్.

**సనకటించు** స.క్రి. వినికిడిచేయు.

**సనకట్టె** వి. కుమ్మరిసారెను తిప్పటానికి వాడేకర్ర.

< సన్న[2] + కట్టె.

**సనగ** చూ. సెనగలు. వి. **1**. ఒకసస్యం. విష్ణు. పూ. **3** ; **2**. ధాన్యవిశేషం.

సం. చణక-, చణ-. సస్యవిశేషం ; ప్రా. చణగ-, చణ-, చణఅ ; అ.మా. చణగ-, చణఇయా, చలగ- ; పా. చణక- ;

క. చణక, చణంగ, సెనగ ; త. చణకమ్.

< ప్రా. చణగ-.

సనగలు రూ.చూ. సెనగలు, వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రభు, 5.87.

**సనగొయ్య** రూ. సన్నుగొయ్య. వి. బండిజల్లపక్కకు తొలగ కుండా ఉండటానికి బండిచక్రపునిలువుపట్టెలకు బిగించిన కర్ర.

**సనదు** రూ.చూ. సన్నదు. వి. **1**. ఆజ్ఞాపత్రం. భద్ర.శ. **47** ; **2**. దానపత్రం ; **3**. యోగ్యతాపత్రం ; **4**. పట్టా (ప్లీడరుకిచ్చే) ; **5**. దస్తావేజు.

**సనలింగ** వి. తీతఎరుపుకాండం, మట్టిరంగుబెరడుకలిగిన ఒకరకంచెట్టు (Cinnamonum zeylanicum)

సం. లింగ-. శివలింగం.

< సన్న[2] + సం. లింగ-.

**సనసేట్** రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా, ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదికి దించిన పలక.

**సనసైడు** రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా, ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీ. మీదకు దించిన పలక.

**సని**[1] వి. **1**. దురదృష్టం. విక్ర. **4.68** ; **2**. శని, నవ గ్రహాల్లో ఒకటి ; **3**, పాపం, అసత్యం.

సం. శని-. గ్రహవిశేషం, శనైశ్చరుడు ; ప్రా. సణి. సని ; శౌ, సణి ; అ.మా. సణి ; అప. సణఉం ;

క. సణి, సని సణివార. శనివారం ; తు. సని, శని. సనియార. శనివారం ; మ. శెని ; కు.ఇ. సొని బారో, శనివారం.

< ప్రా. సణి.

**సని**[2] వి. చల్లటానికి వీలుగా విత్తనానికి వచ్చే (మొలక) మొకం.

**సనికలు** రూ.చూ. సనెకలు వి. నూరేరాయి. కవి.ర 3.45.

**సనికల్లు** రూ.చూ. సనెకలు. వి. నూరురాయి. ప్రబంధ. 1.603.

**సనికిపార** రూ.చూ. సెలగపార. వి. సెలగపార.

**సనికిపొట్టు** చూ. సెనగలు. వి. వేరుసెనగకాయలపొట్టు.

**సనిగ** చూ. సనగ. వి. సనిగలు. రాధికా. 3.67.
**సనిగపార** రూ.చూ. చెలకపార. వి. ఒడ్డెపార, మట్టిపని చెయ్యటానికి వడ్డెవారు, రైతులువాడేపార.
**సనివారము** వి. శనివారం.
సం. శనివార-. మందవారం.
<సం. శనివార-.
**సను** రూ.చూ. చను. అ.క్రి. 1. వెళ్ళు, కడచు ; 2. చెల్లు ; 3. అంటు, అత్తు.
**సనుకొను** అ.క్రి. పూనుకొను, కడగు.
**సనుగు** రూ. సనువు. వి. 1. ఒకనేతకు సరిపడేనూలు ; 2. ఒకనేతబట్ట, కాల్తీ, చీరలేక పంచలచాపు.
**సనుగునూలు** వి. ఒకగొంగడికి సరిపడేటంతఉన్నిదారం. **సనుగుబద్దె** వి. బట్టలో చివరవైపు నేసి వదిలినబద్దె.
**సనుగొయ్యలు(-కొయ్యలు)** వి.బ.వ. బండినరంమీదినాట్లు (కొయ్యలు) గుజ్జులు.
**సనుపు** వి. గొర్రెబొచ్చు మెత్తదనం.
**సనువు** రూ.చూ. సనుగు. వి. 1. ఒకనేతకు సరిపడేనూలు ; 2. ఒకనేతబట్ట, కాల్తీ, చీరలేక పంచలచాపు.
**సనె** రూ.చూ. సన్నియ. వి. సన్నికల్లు.
**సనెకలు** రూ. సనికలు, సనికల్లు, సన్నకల్లు, సన్నికల్లు, సన్నికాలు, సన్నెకల్లు. వి. నూరేరాయి, పేషణి. కాశీ. 5.311.
<సన్నియ+కల్లు[2].
**సంత[1]** రూ. సంతము[1], సంత్త. వి. 1. సమీపప్రదేశం. బసవ. 49.192పు 5.44పం ; 2. సామీప్యం. బసవ. 197పు 741పం ; 3. నిర్ణయించబడినదినంలో ఉంచే అంగళ్ళ వరస. ఉ.హరి. 1.72 ; 4. కానేవాళ్ళయొక్క, అమ్మేవాళ్ళయొక్క కూటమి. శాఖ్ల.సం. 13.209 ; 5. చెంత, పార్శ్వం. రసిక. 6.66 ; 6. అపవాదు ; 7. వేదపాఠం ; 8. వల్లె.
సం. సంస్థా. అపవాదం, సభ. సమావేశం, సంస్థా, సంధా. నిర్ణయించబడిన రోజున ఉంచే అంగళ్ళవరస. సమ్మర్దం, కలయిక, క్రిక్కిరిసి ఉండటం ; ప్రా. సంధా గుంపు ; పా. సంధాగార. కొలువు కూటం ; బెం. సం. సంస్థాగార ;
క. సంతి ; సంతె ; తు. సంతె ; త. చంత్తే ; మ. చంత ; తె. సాక్కే ; కొం. సత. సత్త.
<ప్రా. సంధా.
**సంతకన్ను** వి. నిలకడలేని చూపు. కు.సం. 5.79. **సంతకూటమి** వి. కొనేవాళ్ళ యొక్క, అమ్మేవాళ్ళయొక్కకూటమి. శాఖ్ల.సం. 5.121. **సంతగొట్టె** వి. ఏమీ తెలియని వ్యక్తి. **సంతగోల** వి. గొప్పధ్వని, సంతలో చేసేగోల వంటిగోల. **సంతచెప్పు** అ.క్రి. వేదం పల్లించు. **సంతచెప్పువాఁడు** విశ. 1. పాఠకుడు ; 2. వేదాధ్యయనంలో సహపాఠి. **సంతపడు** అ.క్రి. వశమగు, సరిపడు, అనుకూలపడు, ఆయత్తపడు. నార. పంచ. 1ఆ. **సంతపఱుచు** స.క్రి. వశంచేయు. అనుకూలపర్చు. నార.పంచ. 5.13. **సంతపసుపు** వి. లేత పసుపు రంగు పూలు పూసే ఒకరకంచెట్టు. (Zingiber Zerumbet). **సంతపాక** వి. అంగడి పెట్టటానికి వేయబడిన పాక. **సంతపాకకొత్తు** వి. లంజె. వేమ. 2.33. **సంతపెట్టు** స.క్రి. పొందు పర్చు, సమాధానపర్చు. నార. పంచ. 1. **సంతపేట** వి. సంత జరిగే నగరం. వైజ. 3.692. **సంతబసివి** వి. బజారుపడతి, జారిణి. నీతి. 20. **సంతబెట్టు (-పెట్టు)** స.క్రి. విడుచు, త్యజించు. వరాహ. 11.65. **సంతరాశి** వి. సంతకు తెచ్చి అమ్ముకొనే ధాన్యాదుల పోగు. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 528. **సంతవలపు బేరము** వి. అస్థిరం. శాఖ్ల.సం. 12.145. **సంతసొరకాయ** వి. ప్రతివారు ఉపయోగించే వస్తువు అనటం.
**సంత[2]** వి. వేదపాఠం. పాండు. 3.24.
సం. సంస్తవ-. చక్కనిస్తుతి ; సంస్తావ- బృంగానంచే స్తుతి ; స్తుతించటం ; ప్రా. సంథవ-. క. సంతె. వల్లెవేసే పాఠం.
<ప్రా. సంథవ-.
**సంత[3]** వి. చెంత, సమీపం.
సంస్థా. ఉనికి ; ప్రా. సంధా.
<ప్రా. సంధా.
**సంతకము** వి. రాతకర్తయొక్క చేతివ్రాలు. దస్తూరి.
సం. సంధాక - కూర్పు, కూడిక, సన్నిహిత సంబంధం, స్థితి, ఒడంబడిక, ప్రతిజ్ఞ.
<సం. సంధాక-.
**సన్తతిభోగము** వి. వంశపరంపరగా నడిచే వర్తనం. నె.శా. పొదిలి. 38. క్రి.శ. 968.
సం. సంతతి - వంశం, గోత్రం, సంతానం. భోగ -. తినటం, అనుభవం. ప్రయోజనం.
<సం. సంతతి-+సం. భోగ-+-ము. (అర్థవిపరి).
**సంతన** రూ. సంతనము. అ.క్రి. 1. సంఘీభవించు. భార. ఆది. 2.21 ; 2. ఆయత్తపడు. భార. ఆరణ్య. 7.64 ; వి. 1. అమర్చటం, కూర్పు, తాపటం. ఇందు. 2.44 ; 2. కూడిక, మేళనం. అహల్యా. 1.34 ; 3. ఒకపని యొక్క ముగింపు ; 4. పనిచేయటంలో నేర్పు.
సం. సంధాన-కూడటం ; ప్రా. సంధాణ-. సన్నివేశం.
<ప్రా. సంధాణ -.
**సంతనకట్టు** అ.క్రి. 1. సంఘీభవించు, ఏకమగు. భార. ఆది. 2.21 ; 2. ఆయత్తపడు. భార. ఆరణ్య. 6.200 ; స.క్రి. 1. ఆయత్తపరుచు. వి.క. 4.76 ; 2. ధరించు. పూను. **సంతనచేయు** రూ.చూ. సంతనసేయు. స.క్రి. అమర్చు, తాపించు. యయా. 4.74.
**సంతనసేయు (-చేయు)** రూ. సంతనచేయు. స.క్రి. అమర్చు, తాపించు. ద్వి. పరమ. వి. 7.554.
**సంతనము** రూ.చూ. సంతన. వి. 1. అమర్చటం. కూర్చటం ; తాపటం ; 2. కూడిక, మేళనం.
**సంతనాపి** వి. సరైన ఏర్పాటు.
**సంతము[1]** రూ.చూ. సంత. వి. కొనేవాళ్ళు, అమ్మేవాళ్ళ యొక్క కూటమి. శాఖ్ల.సం. 15.139.
**సంతము[2]** రూ.చూ. సొంతము. వి. స్వంతం, తనది.
**సంతరించు** స.క్రి. 1. ఆదరించు. కు.సం. 5.91 ; 2. చక్క

పెట్టు. సవరించు, సరిపరచు. ఉ.హరి. 4.70 ; **3.** తాల్చు, ధరించు. శృం.నై. 8.63 ; **4.** పూను, వహించు. భీమ. 1.31 ; **5**, అలదు, పూయు. హర. 4.78 ; **6.** రచించు, నిర్మించు. కాశీ. 1.8 ; **7.** చేర దీయు, దరిచేర్చు. వేంక. పంచ. 1.448 ; **8.** సిద్ధంచేయు, సంగ్రహించు. వరాహ. 2.78 ; **9.** కలిగించు; పుట్టించు. మను. 5.71 ; **10.** గడించు, సంపాదించు. ఆము. 4.35 ; **11**. సంగ్రహించు, దొంగిలించు. అపహరించు. వైజ. 4.25 ; **12**. నెరపు, చేయు. నడపు. చెన్న. 5.378 ; **13**. పోషించు. దశా. 2.51 ; **14**. చక్కగా దాటు ; **15**. కూర్చు, సేకరించు.

క. సంతయిసు. శాంతపర్చు ; తు. సంతెరిసు. ఓదార్చు. ఆదరించు.

**సంతరించుకొను** స.క్రి. సరిలరచుకొను, చక్కబరచుకొను. కు.సం. 7.46.

**సంతర్పణము** వి. ఎక్కువ మందికి భోజనం పెట్టటం.

సం. సంతర్పణ - సంతృప్తిపరచటం, తనివి కలిగించటం.

<సం. సంతర్పణ - (అర్థవిపరి.).

**సంతసపడు** చూ. సంతసము.

**సంతసము** రూ. సంతొసము, సంతోసము. వి. **1**. సంతోషం, ఆనందం, సంబరం. భార. ఆది. 2.55 ; **2**. తృప్తి. భార. ఉద్యో. 1.19.

సం. సంతోష - తృప్తి. ఆనందం ; ప్రా. సంతోస- తృప్తి, ఆనందం ; అ.మా. సంతోస - ; ప్రా. సంతోస-; క. సంతస, ఆనందం ; త. చంతోటమ్ ; మ తంతోఱం.

<ప్రా. సంతోస -.

**సంతసపడు** అ.క్రి. సంతోషించు. భార. ఆది. 6.170. <సంతసము+పడు. **సంతసించు** అ.క్రి. సంతోషించు. ఆనందించు. భార. ఆది. 4.141. <సంతసము+-ఇంచు³. **సంతసిలు** రూ.చూ. సంతసిల్లు. అ.క్రి. సంతోషించు. అచ్చ.రా. బాల. 15. **సంతసిల్లు** రూ. సంతసిలు. అ.క్రి. సంతోషించు. భార. ఆది. 1.196.

**సంతసించు** చూ. సంతసము.

**సంతసిలు** చూ. సంతసము.

**సంతసిల్లు** చూ, సంతసము.

**సంతు** వి. 1. సమూహం. కకుత్స. 2.78 ; **2.** సంతతి, కులం, వంశం. ముకుంద. 1.43పు. 1పం.

సం. సంతతి - సంతానం. వంశం, గోత్రం ; ప్రా. సంతఇ, సంతతి ; అ.మా. సంతఇ ; మరా. తంతతి.

<ప్రా. సంతఇ.

**సంతుమునుగు** అ.క్రి. వగశం అంతరించు. **సంతులుగొట్టు (-కొట్టు¹)** స.క్రి. నిందించు, నేరములెన్ను. ఆము. 5.109.

**సంతొతొలా** చూ. సంత. వి. సంతలో వసూలు చేసేపన్ను. J.A.H.R.S. 9. P-13-14. క్రీ.శ. 1762.

**సంతొసము** రూ.చూ. సంతసము. వి. ఆనందం. నిర్వ.రా. 7.14.

**సంతోసము** రూ.చూ. సంతసము. వి. సంతోషం, ఆనందం. నిర్వ. రా. 7.14, నృసింహ. 1.49.

**సంతోసించు** అ.క్రి. సంతోషపడు. <సంతోసము+-. ఇంచు³. **సంతోసిలు** రూ. సంతోసిల్లు. అ.క్రి. ఆనందించు. **సంతోసిల్లు** రూ.చూ. సంతోసిలు. అ.క్రి. ఆనందించు. భార, ఆది 8.197.

**సంతోసించు** చూ. సంతోసము.

**సంతోసిలు** చూ. సంతోసము.

**సంతోసిల్లు** చూ. సంతోసము.

**సంత్త** రూ.చూ. సంత. వి. నిర్ణీతమైన దినాన క్రయవిక్రయాలు సాగించే అంగళ్ళవరుస. నె.శా. నెల్లూరు. 78. క్రీ.శ. 1364.

**సంత్ర** రూ.చూ. సాంత్రా, వి. కమలాఫలం.

**సంద** రూ.చూ. సంజ. వి. సంధ్య, సంధ్యాకాలం.

**సందకాడ** వి. సాయంత్రం. మునిమాపువేళ. <సంద+కడ.

**సందరాతిరి** వి. సంధ్యారాత్రి.

**సందట్లోనడేమియా** చూ. సందడి.

**సందట్లోనమారాధన** చూ. సందడి.

**సందడి** వి. **1**. జనసమూహధ్వని. కు. సం. 115 ; **2.** అతిశయం. వేంక పంచ. 5.6 ; **3**. జనసమ్మర్దం. తాళ్ల. సం. 17.214 . **4**. కలిమిడి ; విణ. సంకులసమరం. ఉ. హరి. 4.229.

సం. సంధాన-. కూడటం, కూర్చటం ; ప్రా. సంధణ-. అనుసంధానం. చేరటం, జతకావటం ; క. సందణి, సందవణి. గుంపు, రాశి, కలయిక.

<ప్రా. సంధణ-.

**సందట్లోనడేమియా** వి. సందడిగాఉన్నప్పుడు చేతికి దొరికినది పట్టుకుపోవటం. <సందడి+లో+నడేమియా. **సందట్లోనమారాధన** వి. సందడిగా ఉన్నప్పుడు చేతికి దొరికినది పట్టుకుపోవటం. సం. సమారాధన-. అర్చన, పూజించటం. <సందడి+లో+ సం. సమారాధన. **సందడికయ్యము** వి. సంకులయుద్ధం, దొమ్మియుద్ధం. భార. భీష్మ. 1.267. **సందడికాఁడు** వి. **1**. సామాన్యుడు. ఆం. భా. 3.16 ; **2.** కలివిడిగా ఉండేవాడు. **సందడిగొను(-కొను)** అ.క్రి. **1**. మించు, అతిశయించు. నృసింహ. 1.78 ; **2**. మూగు, క్రమ్ము. విక్ర. 3.62. **సందడిచేయు** అ.క్రి. సద్దుచేయు, శబ్దంచేయు. **సందడిజగడము** వి. సంకులయుద్ధం. ఉ.రా. 3.384. **సందడించు** అ.క్రి. **1**. రొద సేయు, పేలు. బసవ. 82పుం. ; **2**. విజృంభించు. పండి. చ. 2.110 ; **3**. గోలపెట్టు. పండి. చ. 4.252 1.45 ; **4**. అతిశయించు, అధికమగు. మార్క. 5.186 **5**. కార్కొను, చుట్టుకొను, పెనగొను. భాస్క. రా. బాల 687 ; **6**. గుమిగూడు, మూగు, రం. రా. యు. 288పు. 18పం. ; **7**. ప్రకాశించు. వరాహ. 11.8 ; **8.** సంభ్రమం పొందు, తత్తరపడు. నిరంకు. 2.121 ; **9.** వ్యాపించు. విప్ర. 3.100 ; **10.** సాంద్రమగు. విష్ణు. 2.48 ; స.క్రి. **1.** కలవరపెట్టు. భాగ. 5.1 ఆ.28 ; **2**. హెచ్చరించు.

ఇందు. 5.72. <సందడి + -ఇంచు[3]. **సందడిపడు** రూ. సందడివడు. అ.క్రి. 1. గుమికూడు. భాగ. 5.2.120 ; 2. కలతపడు, క్షోభపడు. రామాభ్యు. 7.167 ; 3. ధ్వనించు. రొదచేయు. **సందడిలు** రూ. సందడిల్లు, అ.క్రి. 1. పెనుగొను. దశకు. 9.41 ; 2. మూగు, క్రమ్ము. కాశీ. 2.24 ; 3. ప్రకాశించు. చిత్రభా. 2.99 ; 4. అతిశయించు, మించు. చమ. 1.47. **సందడిల్లు** రూ.చూ. సందడిలు. అ.క్రి. 1. అతిశయించు, మించు. మత్స్య. 1.102 ; 2. మూగు, క్రమ్ము ; 3. ప్రకాశించు : 4. పెనుగొను. **సందడివడు(-పడు)** రూ.చూ. సందడిపడు. అ.క్రి. 1, గుమికూడు ; 2. కలతపడు ; 3. రొదచేయు. ధ్వనించు. **సందడీ(డు(-ఈ(డు)** వి. వ్యాపకుడు. పరమ. 44వ. 12పం.

**సందడీ(డు** చూ. సందడి.

**సందదికిఆడు** చూ. సందు[2].

**సందన్న** వి. చంద్రుడు.

సం. చంద్ర-. చందురుడు.

<సం. చంద్ర- + అన్న.

**సందప్ప** వి. చందమామ.

సం. చంద్ర-. చంద్రుడు.

<సం. చంద్ర + అప్ప.

**సందరము** రూ.చూ. సంద్రము. వి. కడలి, జలరాశి.

**సంది** రూ.చూ. సందు[2]. వి. 1. సందు, మందడి, రెండువస్తువులనడిమిభాగం. పండి. చ. 5.3 63, బసవ. 303వ, ఉ. హరి. 94 ; 2. జూదమాడటానికి ఉపయోగించే ముద్రావిశేషం. సిం. ద్వా. 10.88 ; 3. దండచేయి భుజానికి మోచేతికి మధ్యభాగం. సందిలి, ప్రగండం వేంక. పంచ. 2.8 ; 4. సంధి, కూడిక. ప్రబంధ. 1.16 ; 5. సంధివిగ్రహాది షడ్గుణాల్లో మొదటిది. ఆం. భా. 2.189 ; 6. సన్నిపాతజ్వరం ; 7. ప్రాంతం ; 8. చుట్టుపట్ల.

**సందికడియము** రూ. సందికడెము. వి. సందిట వేసుకునే కడియం. హంస. 2 75. **సందికడెము** రూ.చూ. సందికడియము. వి. సందిట వేసుకునే కడియం. **సందికంతలత్రోవ** వి. ఘంటా పథంకానిది, సందుగొందు. లాళ్ల. సం. 11,70, **సందిక్రంతుజగడములు** వి.బ.వ. సందుల్లో గొందుల్లో జరిగే చిలిపి కయ్యాలు. సిం. ద్వా. 7.27, **సందిదండ** వి. బాహుపురి. కేయూరం, సందిట కట్టుకునే భూషణం. మను. 5.8. **సందిబొందె** వి. దండకు కట్టుకునేనగ. హంస. 4.101. **సందివీరులు** వి.బ.వ. పామరులుకొలిచే దేవతావిశేషాలు. శుక. 3.49.

**సందిచ్చు** చూ. సందు[2].

**సందిటిదండ** చూ. సందిలి.

**సందియదీపము** వి. ఆకాశదీపం, ద. హిం. శా. సంపు. 5, శా. సం. 185. క్రీ.శ. 1279.

సం. సంధ్యా-. రేయింబవళ్ళమధ్య సమయం, దీప-. దివ్వె.

<సం. సంధ్యా + దీప- + ము.

**సందియపడు** చూ. సందియము.

**సందియము** వి. 1. సంశయం. భార. ఆది. 5.151 ; 2. జంకు, కొంకు ; విఖ. సందిగ్ధం, సందేహంకలది, మార్క. 1.106.

సం. సందేహ-. అనుమానం ; ప్రా. సందేహ-. సంశయం, శంక ; అ.మా. పా. సందేహ- ;

క. సందయ, సందెగ, సందెయం ; తు. చెండయ ; త. సందియమ్.

<ప్రా. సందేహ-.

**సందియపడు** అ.క్రి. సంశయించు. భార. ఉద్యో. 1.103.

**సందిరము** రూ.చూ. సంద్రము. వి. సముద్రం. హర. 6.81.

**సందిరేవు** రూ. సంజెరేవు, సందెరేవు. వి. సంసారుల పెళ్ళిళ్ళలో లగ్నంఅయిన మర్నాడు పెళ్ళికొడుకును చెరువుదగ్గరకు తీసుకుపోయి అలంకరించి అక్కడ నాట్యంచదురు జరిపి ఊరేగింపుతో ఇంటికిరావటం.

**సందిలి** చూ. సంది. వి. 1. రెండుదండల నడిమిభాగం. పారి, 3.13 ; 2, సంది, ప్రగండం, దండచేయి. కళా. 6.200 ; 3. బారెడు.

**సందిటిదండ** వి. ఆభరణవిశేషం. ధనాభి. 3,38, 2. దండ కడియం. **సందిలిపట్టు** వి. ఒకరకంపట్టు. **సందిలి. వట్టియాడు** స.క్రి. సందిటితో (కాళ్ళను) కౌగిలించుకొను. కళా. 6,201. <సందిలి + పట్టు + -ఇ[13] + ఆడు. **సందెడు** క్రి. విశ. రెండుచేతులు జవిరి ఎత్తగలిగినంత. సందిలిపట్టునంత. <సందిలి + -ఎ(డు. **సందెడుదొమ్మలు** వి బ.వ. భయస్థునిపట్ల ఉపయోగించే పదం. **సందెడుమాటలు** వి,బ.వ. దిక్కులేనన్నిమాటలు. శివముకుంద. 87.

**సందీలము** వి. ఎక్కువ.

**సందు**[1] స.క్రి. కూర్చు, సంధించు. క్రీడా. 45.

సం. సంధ్-. కూర్చు, ఘటించు, సంధా. కూడిక సన్నిహిత సంబంధం ;

క. సందిసు. కూర్చు, సంధించు ; త. చంది.

<సం. సంధ్.

**సందు**[2] రూ. సంది, సంధు. వి. 1. గొంది, ఇరుకువీధి. నిర్వ రా. 8,52 ; 2. తిరపి, మధ్యకాలం. భార. విరా. 5.176 ; 3. (అవయవాలయొక్క) సంధిబంధం, కీలు. భార. అశ్వ. 1.176 ; 4. నెపం. శృం.నై. 3.26 ; 5. ఎడం. శృం. నై. 8.189 ; 6. నడిమిభాగం, రెండువస్తువుల నడిమిభాగం. హర. 7.76 ; 7. వీలు, అనుకూల్యం. వరాహ. 11.38 ; 8. అవకాశం, వీలు. వేంక. పంచ. 1.608 ; 9. లోపం. గౌ. హరి. పూ. 1400 ; 10. సందర్భం. కళా. 3.186 ; 11. వ్యవధి. శుక. 2.173 ; 12. ఇంటిపక్క ఇరుగ్గా ఉండేచోటు. హంస. 2.69 ; 13. మల్లవిద్యా విశేషం. ప్రబంధ. 1.87 ; 14. మర్మం. రహస్యం. చెన్నబసవ 2 24 ; 15. దొంగదారి, దొడ్డిదారి ; 16. రంధ్రం ; 17. ఆడుగురి ; 18. రెండువస్తువులయొక్క చేరికభాగం.

సం. సంధి-ఛిద్రం, వివరం, సంధానం, సంబంధం, కలయిక, రెండువస్తువుల కలయిక ; ప్రా. సంధి - ; అ.మా. పా. సంధి ;

క. సంది, సందు. మూల, కలయిక, అవకాశం, యోని. ఇరుకుదారి ; తు. సంది కలయిక, ఎడం, సందు ; కొడ. చంది. గుదం, యోని, త. చంతి. కీలు, చంతు. పిరుదులు, ఇరుకుదారి, కలయిక, ఎడము సందు, చీలిక, బల్లి ; మ. చంతు, చంది పిరుదులు ; కుఇ. సంది. మేర, అంచు ; బ్రా. సంద్. కీలు.

< ప్రా. సంధి-.

**సందదికిఅడు** అ.క్రి. అసత్యాన్ని సత్యంగా నిరూపించటా నికితగినట్లు అబద్ధమాడు. కళా. 3.197. < సందు² + అదుకు + -ఇ[13] + అడు. **సందిచ్చు** స.క్రి. వీలుఇచ్చు, అవకాశం ఇచ్చు ; అ.క్రి. తెరిపిఅగు. < సందు² + ఇచ్చు. **సందుకట్టు** వి. 1. మధ్యస్థలం ద.హిం.శా. సంపు. 10, శా.సం. 557. క్రీ.శ. 1343 ; 2. నడిమికాలం. నృసింహ. 3.81. **సందు కానకుండు(-ఉండు)** అ.క్రి. అవకాశం కానకుండు. శుక. 1.518. **సందుకొట్టు** వి. పసిపిల్లలకు నెలలుమారేమధ్య తగిలే బాలగ్రహవ్యాధి. **సందుకొను** రూ. సందుగొను, అ.క్రి. 1. అవకాశం చేసికొను. భార. కర్ణ. 1.186 ; 2. వ్యాపించు. ఉ.రా. 8.165 ; 3. మధ్యదూరు ; స.క్రి. దక్కించుకొను, వశపరచుకొను. వరాహ. 7.20 ; 2. గ్రహించు, కూర్చుకొను. రాజవా. 3 114 ; 3. కలసికొను. **సందుగొట్టు(కొట్టు¹)** అ.క్రి. బిడ్డలకు సందురోషంతగులు. **సందుగొను(-కొను)** రూ.చూ. సందుకొను. అ.క్రి. 1. అవకాశం చేసికొను ; 2. వ్యాపించు. **సందుగొందులు** వి.బ.వ. ఇరుకువీదులు. ద్వి. పరమ. వి. 3.1305. **సందుచేసికొను** అ.క్రి. అవకాశం కల్పించుకొను. రాధా. 3.142 ; < సందు² + చేయు + -ఇ[13] + కొను **సందుదవులు(-తవులు)** అ.క్రి. బిడ్డలకు సందుదోషం తగులు. **సందుదొరకు** అ.క్రి. అవకాశం దొరకు. హంస. 4.105. **సందుదోషము** వి. బిడ్డలకు మాన సందులో కలిగే బాలగ్రహదోషం. సం. దోష - తప్పు. < సందు² + సం. దోష-. **సందుదోసము** వి. బిడ్డలకు మానసందిలో కలిగే బాలగ్రహదోషం. సం. దోష-తప్పు. **సందుపాళి** వి. కాళీనమయం. **సందులు** వి.బ.వ. బాలింతకు నీళ్ళుపోసేరోజు. **సందులేకుండు** అ.క్రి. అన్ని చోట్లవ్యాపించి ఉండు. బసవ. 6.159. < సందు² + లేక + ఉండు. **సందులోమందు** వి. ఇరకాటంలో మెలగటం. **సందువంకలు** వి.బ.వ. 1. ప్రగండనక్షత్రాలు. వేంక. అం. 75 ; 2. విన్నాణాల్లో ఒకటి. **సందువడు (-పడు)** అ.క్రి. చిల్లిపడు. కకుత్స. 1.129. **సందువెట్టు(-పెట్టు)** అ.క్రి. సందనే మల్లబంధ విశేషాన్ని ప్రయోగించు. భాగ. 10స్కం. పూ. 1345. **సందుసీసము** వి. మల్లబంధ విశేషం. మల్లు. 3.69, హంస. 1.206. **సందుసుడిదొంతులుదొబ్బు** స. క్రి. సందుచేసుకుని దొంగకుక్కలా ప్రవర్తించు. తాళ్ల. సం. 5.320. **సందుసుడిమాయలు** వి.బ.వ. 1. సందు చూసుకొని మోసంచేయటం. మను. 3.82 ; 2. సమయానుకూలమైన నటనలు. **సందుసూచు(-చూచు)** అ.క్రి. అవకాశం కోసం వేచి ఉండు. భార. శల్య. 1.180.

**సందు³** వి. పౌర్ణమినాటి చంద్రవంక, నెల.

హిం. ఉ. చాంద్. చంద్రుడు.

< ఉ. చాంద్.

**సందుకా** రూ.చూ. చందుగు². వి. 1. చిన్నపెట్టె, 2. చేత్తో పట్టుకొనివెళ్ళే చిన్నపెట్టె ; 3. మేజాఅర.

**సందుకు** రూ.చూ. చందగు². వి. 1. చిన్నపెట్టె ; 2. చేత్తోపట్టుకొనివెళ్ళే చిన్నపెట్టె ; 3. మేజాఅర.

**సందుగు** రూ.చూ. చందగు². వి చిన్నపెట్టె.

**సందు(డు** వి. స్కంధుడు.

సం. స్కంధ-. కుమారస్వామి.

< సం. స్కంధ-.

**సందె** రూ.చూ. సంజ¹. వి. సంధ్యాకాలం, సంజ. భార. అను. 4.119 ; సంధ్యావందనం. వేమ. 2ఖా. 431.

**సందెకబళము** వి సందెపూట అడుక్కునేకూడు. **సందెచీకటి** వి. సంధ్యాకాలంలో అయినచీకటి. వైజ. 2.18, **సందెజపము** వి. సంధ్యావందనం. విజయ. 2.147. సం. జప-మంత్రాదులఆవృత్తి, వేదాధ్యయనం. **సందెజాము** వి. రాత్రి మొదటియామం. నార. పంచ. 1.312. **సందెప్రొద్దు** వి. సంధ్యవేళ, సాయంత్రం. **సందెమల్లియ** వి. ఒక తీగ, రుద్రాక్షి. **సందెవేళ** వి. సాయంత్రం. హంస. 3.69 సం. వేళా. సమయం.

**సందెదు** చూ. సందిలి.

**సందెదుదొమ్మలు** చూ. సందిలి.

**సందెదుమాటలు** చూ. సందిలి.

**సందెబొందె** చూ. సందు². వి. ఒకానొక బాహుభూష, దండకు పెట్టుకొనే నగ.

**సందెరేపు** రూ.చూ. సందిరేపు. వి. 1. ఊరేగింపు ; 2. సంసారుల పెళ్ళిళ్ళలో లగ్నమైన మర్నాడు పెళ్ళికొడుకుని చెరువుదగ్గరకు తీసుకుపోయి అలంకరించి అక్కడ నాట్యం చదురు జరిపి ఊరేగింపుతో ఇంటికి తీసుకురావటం.

**సందోకు** రూ.చూ. చందుగు². వి. 1. చిన్నపెట్టె ; 2. చేత్తో పట్టుకొని వెళ్లె చిన్నపెట్టె ; 3. మేజాఅర.

**సంద్కు** రూ.చూ. చందుగు². వి. 1. చిన్నపెట్టె ; 2. చేత్తోపట్టుకుని వెళ్ళే చిన్నపెట్టె ; 3. మేజాఅర.

**సంద్ర** వి. పసుపుపచ్చని పూలుపూసే ఒకరకం చెట్టు. (Acacia catechu).

**సంద్రము** రూ. సందరము, సందిరము. వి. 1. సముద్రం. భాస్క.రా.యు. 1092 ; 2. పాలసముద్రం. అచ్చ. రా. అయోధ్యా. 20.

సం. సముద్ర - కడలి, సముద్రం ; ప్రా. సముద్ద- ; ఒ. బెం. సాముద్రా ;

త. సముద్దిరమ్, చముతిరమ్ ; కుఇ. సాముద్రొ ; కువి. సందురి ; బ్రా. సముందర్.

< సం. సముద్ర.-.

**సంద్రు(డు** చూ. సంద్రము. వి. సముద్రుడు. యయా. 3.33.

**సంధు** రూ.చూ. సందు². వి. గ్రామాల, భూములసరిహద్దులు, పొలిమేరలు కూడిన స్థలం. E. 1.12.23. క్రీ.శ. 1434.

**సంధాత** వి. గ్రామంకాని, భూమికాని గుత్తకీయక సర్వస్వామ్యాలను అనుభవిస్తూ సాగుచేసి అనుభవించే అధికారి. నె. శా. రాపూర్‌శాసనం. 3. క్రీ.శ. 1538.

సం. సంధాతృ - సంధానం చేసేవాడు.

<సం. సంధాతృ - (అర్థవిపరి).

**సంధిల్లు** అ.క్రి. **1.** ముట్టుకొను, స్పృశించు. బసవ. 82పు 9పం ; **2.** సమకూడు, కలుగు. మార్క. 1.62.

సం. సంధ్ - కూర్చు, ఘటించు.

<సం. సంధ్-+-ఇల్లు[2].

**సన్ధివిగ్రహి** వి. ప్రభువాజ్ఞ చొప్పున రాజశాసనాలు రాసేవాడు, శాంతియుద్ధాలను తీర్మానించేవాడు. ద.హిం.శా. సంపు.4. శా.సం. 749. క్రీ.శ. 1146.

సం, సంధివిగ్రహిన్. యుద్ధమంత్రి.

<సం. సంధివిగ్రహిన్ (అర్థవిపరి.).

**సంధివిగ్రహిపణ్ణు** వి. సంధివిగ్రహికిచ్చేపన్ను, శాసనాలు రాసేవాడు లేక క్రయవిక్రయాది పత్రాలు రాయటానికి చెల్లించే పన్ను. E.I. సంపు. 30.శా. సం. 46.

**సంధిశిలాశాసనం** వి. దేవతా నైవేద్యంనిమిత్తం ఇచ్చిన రాతిశాసనం. TTDES. III. 92.

సం. సంధి-. కూడిక, చేరిక, శిలాశాసన-. రాతిపై చెక్కిన ఆజ్ఞ.

<సం. సంధిశిలాశాసన- (అర్థవిపరి.).

**సంధ్యదివియ** వి. ఆకాశదీపం, కార్తీకమాసంలోను, శివరాత్రి మొ. ఉత్సవాదులకు రాత్రులలో ఎత్తైన ప్రదేశాల్లో వేలాడదీసే దీపం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1014. క్రీ.శ. 1038.

సం. సంధ్యా. వేకువ, సాయంకాలం.

<సం. సంధ్యా + దివియ.

**సంధ్యమంత్రబోనము** వి. ప్రాతఃకాలంలోను, సాయంకాలంలోను దేవుడికి అర్పించే నైవేద్యవిశేషం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1288.

సం. సంధ్యామంత్ర-. సంధ్యాకాలానికి సంబంధించిన మంత్రాలు.

<సం. సంధ్యామంత్ర- + బోనము. (మిశ్రస.).

**సంధ్యరాయి** వి. సరిహద్దురాయి. నె.శా. ఆత్మకూరు. క్రీ.శ. 1510.

సం. సంధ్యా. రెండు యుగాలకు మధ్యకాలం, రాత్రికి పగటికి మధ్యకాలం.

<సం. సంధ్యా+రాయి.

**సంధ్యాక్షీరస్నపనము** వి. ప్రాతఃకాలాన దేవుడికి పాలతో చేసే అభిషేకం. ద.హిం. శా. సంపు. 4. శా. సం, 1176. A. క్రీ శ. 1137.

సం. సంధ్యా. వేకువ, సాయంకాలం, క్షీర-. పాలు, అన్న-. అన్నం, స్నపన-. స్నానం, కడగటం.

<సం. సంధ్యాక్షీరస్నపన- (అర్థవిపరి.).

**సంధ్యాంగన** వి. పొద్దుపొడవటానికి ముందు ఐదు గడియల వరకు, పొద్దుగుంకినవెనక మూడుగడియలకాలం. HAS. 13.56. క్రీ.శ. 1170.

సం. సంధ్యా. సంధ్యాకాలం, అంగణ-. ముందు భాగం.

<సం. సంధ్యాంగణ-.

**సంధ్యావందనమంటపము** వి. సంధ్యావందనం చేయటానికి నిర్మించిన కట్టడం. T. DI. సంపు. 4. శా. సం. 8. క్రీ.శ. 1531.

సం. సంధ్యావందనమండప-. సంధ్యావందనం చేయటానికి కట్టిన మండపం.

<సం. సంధ్యావందన- + మండప-. (మిశ్రస.).

**సన్న**[1] రూ. సన్య. వి. **1.** సంజ్ఞ. భార. సభా. 2.247 ; **2.** కనుసన్న. కు. సం. 9.122 ; **3.** గుర్తు, జాడ. భార. విరా. 1.47.

సం. సంజ్ఞా. గుర్తు ; ప్రా. సణ్ణా, సన్నా. సంకేతం, ఆఖ్య, గుర్తు; అ.మా. సణ్ణా సన్నా ; పా. సఞ్ఞా : క. సన్నె, సొన్నె ; తు. సన్నె ; త. చన్నై.

<ప్రా. సణ్ణా.

**సన్నకుసన్నగా** అవ్య. రహస్యంగా. క్రీడా. 87. **సన్నదెలుపు(-తెలుపు[1])** అ.క్రి. సైగచేయు. శుక. 1.391. **సన్నలుగావించు (-కావించు)** అ.క్రి. సైగలుచేయు. రాధికా. 5.112. **సన్నలువాఱు(-పాఱు[3])** అ.క్రి. సంజ్ఞా గర్భితమగు. కు. సం. 8.101. **సన్నసేయు(-చేయు)** అ.క్రి. సైగచేయు. భార. సభా. 2.247.

**సన్న**[2] రూ.చూ. సన్నము. విశే. **1.** మెల్లన, మందమైన. శృం. నై. 3.89 ; **2.** పల్చనిది, సూక్ష్మం. హర. 2.121 ; **3.** చిన్నది, స్వల్పం, కొంచమైంది. శుక. 2.342 ; **4.** సన్నం ; **5.** ఆపు, రాతిపొరలు చీల్చే టప్పుడు గడ్డపార కింద మోపుకు పెట్టే ఉక్కుముక్క.

**సన్నఏలకి** వి. సుగంధద్రవ్యంగా వాడే చిన్నకాయలు గల ఒకరకం తీగ (Elettaria cardamonum). **సన్నకండ్లజల్లెడ** వి. సన్నజల్లెడ, మెత్తనిపదార్థాలను జల్లించటానికి పనికివచ్చే జల్లెడ. **సన్నకంది** వి. ఒకరకం కంది. **సన్నకర్ణి** వి. కాడకర్ణి, డిజైన్ పనికివాడే చిన్న కరిణి. **సన్నకళ్ళి** వి. సన్నచెముడు, పొదగా పెరిగే ఒకరకం కంచెమొక్క (Euphoribia firucally). **సన్నకసన్న** అవ్య. **1.** నిగూఢంగా. రం. రా. బాల. 48పు, 11పం ; **2.** మెల్లమెల్లగా. నార. పంచ. 1.405; **3.** తేలికగా. **సన్నకారు** వి. కమసాలి, కమ్మరి మొ. వారి పనిముట్టు. **సన్నకాళియలు** వి. బ. వ. వాద్యవిశేషం. ఒకరకం. బూరకొమ్ము. అష్టమ. క. 5.241. పు. 7పం. **సన్నకుసుమ** వి. M.T.U. (మార్టేరు) 19వ నెంబరు. గింజసన్నం రకంధాన్యం. **సన్నకొణామణి** వి. ఒకరకం ధాన్యం. **సన్నకొఱ్ఱ** వి. కొఱ్ఱల్లో ఒకరకం. **సన్నకోరింద** వి. పచ్చటి పూలుపూసే ఒకరకంతీగ (Pterolobium indicum). **సన్నగడ్డలు** వి.బ.వ. చిన్నపాత్రలు, పొయ్యలోపలికి జారిపోకుండా ఉండటానికి పొక్కళ్ళదగ్గరే చిలకముూతుల్లా పెట్టిన మట్టికుండీలు. **సన్నగండు** వి. నపుంసకుడు. **సన్నగఱుకు** వి. కొంచెంగరుకు, ముడత. హరి. ఉ. 7.79. **సన్నగళ్ళగుడ్డ** వి. ఒకరకం చొక్కాగుడ్డ.

**సన్నగా(డు(-కా(డు)** వి. 1. అల్పుడు. అచ్చ. రా. బాల. 106; 2. చీమ; 3. బీదవాడు. **సన్నగాలి** వి. మందమారుతం. రామాభ్యు. 6 ఆ. **సన్నగించు** అ.క్రి. సన్నవారు, తగ్గు. <సన్న[2] + -ఇంచు[3]. **సన్నగిలు** రూ.చూ. సన్నగిల్లు. అ.క్రి. సన్నమగు. **సన్నగిల్లు** రూ. సన్నగిలు. అ.క్రి. సన్నమగు. **సన్నగుది** వి. దోనెగాడిలో బద్దెమవ్వ బిగించటానికి పల్లకు కట్టిన తాడు. **సన్నగోరంచు** వి. రెండు పోగుల దారంతో సన్నటి గీరపడేట్టు నేసిన అంచు. **సన్నచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు. **సన్నచూపు** వి. మందవీక్షణం. **సన్నజల్లి** రూ.చూ. సన్నంజల్లెడ. వి. సన్నజల్లెడు, మెత్తనిపదార్థాలను జల్లించటానికి పనికివచ్చే జల్లెడ. **సన్నజల్లెడ** రూ.చూ. సన్నం జల్లెడ వి. సన్నజల్లి, మెత్తని పదార్థాలను జల్లించటానికి కళ్ళు చిన్నవిగా ఉన్నజల్లెడ. **సన్నజాజి** వి. తెల్లని, సువాసనకల పూలు పూసే చెట్టు (Jasminum auriculatum). **సన్నజాజిపేటు** వి. అంచులో సన్నజాజిపువ్వు ఆకారంలో నేసిన డిజైను. **సన్నజాజిబుటా** వి. సన్నజాజిపువ్వు మాదిరి నేతడిజైను. **సన్నజాజులు** వి. బ. వ. ఒకరకం జాజిపూలు. దశా. 3.8. <సన్నజాజి+-లు. **సన్నజీలకఱ్ఱ** వి. కణజీరకం, ఒకరకంజీలకఱ్ర. **సన్నజీవము** వి. మేక లేక గొఱ్ఱె. సం. జీవ-. ప్రాణి. **సన్నజెముడు** వి. కళ్ళి, పొదగాపెరిగే ఒకరకం కంచెమొక్క (Euphorbia tirocalli). **సన్నడోరియా** వి. అంగీగుడ్డలో ఒకరకం నేత. **సన్నతాపి** వి. ఎదురాకుతాపి, సన్నగాపొడుగ్గా కోలగా ఉండే రేకు గల చిన్నతాపి. **సన్నతుంగ** వి. మాగాణిలో పెరిగేతుంగ (Cypeous difformis). **సన్నదూలం** వి. గానిగకట్టె, గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. **సన్నద** వి. సన్నదనం, సూక్ష్మత. **సన్ననిమ్మ** వి. మామూలు నిమ్మ. **సన్ననూలు** వి. పోగుసన్నగా నున్నితంగా ఉండే నూలు. **సన్న(దనము (-తనము)** వి. 1. అల్పభావం; 2. సన్నన. **సన్నన్న** వి. పినతండ్రి, సణ్ణయ్య. <సన్న[2]+ అన్న. **సన్నపట్టె** వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కఱ్ఱ. **సన్నపని** వి. చిన్నపని, సిం. ద్వా. 2.107. **సన్నపనితాపి** వి. ఎదురాకుతాపి. సన్నగా పొడుగ్గా కోలగా ఉండేరేకుగల చిన్నతాపి. **సన్నపాకులగన్నేరు** వి. గన్నేరులో ఒకరకం. **సన్నపాటి** విశ. సన్నని. **సన్నపాయలకూర** వి. సన్నవాయిలికూర. (P. quadrifida). **సన్నపిల్ల** రూ.చూ. సన్నపిల్లి వి. సాలెపురుగు. **సన్నపిల్లి** రూ. సన్నపిల్ల. వి. సాలెపురుగు. సాంబ. 4.76. **సన్నపూలములుగోరంట** వి. సహచరి, వృక్షవిశేషం. **సన్నపోరగాండ్లు** వి.బ.వ. చిన్నపిల్లలు. **సన్నబాలబుడ్డి** వి. పిల్లలకు పాలుతాగటానికి పక్కలో గొట్టంపెట్టి చేసిన చిన్నమట్టిబుడ్డి. **సన్నబుగిడి** వి. సన్నటి మొగ్గ ఆకారంలో నేసిన డిజైను. **సన్నబెత్తము** వి. బుట్టల తయారీకి ఉపయోగపడే ఒకరకం తీగ (Calamus rofang). **సన్నమండిక** వి. సరిచేసేటప్పుడు పడుగు మీద చిలకరించటానికి గంజి పోసుకునే ఒకరకం చిన్నమట్టిపాత్ర. **సన్నమండిగలు** వి.బ.వ. వడ్లలో ఒకరకం. హంస. 4.155. **సన్నముంగి** వి. ఒకరకం చిన్నగడి. **సన్నమొలకొలుకులు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **సన్నయిప్ప (-ఇప్ప)** వి. లేతపసుపురంగు పూలుపూసే ఒకరకం చెట్టు (Bassia longifolia). **సన్నయీత(-ఈత)** వి. ఒకరకం ఈతచెట్టు (Phoenix acaulis). **సన్నయేలకి(-ఏలకి)** వి. చిట్టేలకి. **సన్నరాష్టకము** రూ. సన్నరాష్టము, సన్నరాష్ట్రము, సన్నరాస్నము, సన్నరాస్మము. వి. మందుకు పనికివచ్చే మూలిక. **సన్నరాష్టము** రూ.చూ. సన్నరాష్టకము. వి. మందుకు పనికివచ్చే మూలిక. **సన్నరాష్ట్రము** రూ.చూ. సన్నరాష్టకము. వి. రాస్న (వృక్షవిశేషం). **సన్నరాస్నము** రూ.చూ. సన్నరాష్టకము. వి. రాస్న. **సన్నరాస్మము** రూ.చూ. సన్నరాష్టకము. వి. మందుకు పనికివచ్చే మూలిక. **సన్నలచంద** వి. నాలుగైదునెలల్లో పండేపప్పుదినుసు. **సన్నలవంగ** వి. ఒకరకం చెట్టు (Cinnamomum zeylanicum). **సన్నవరులు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **సన్నవల** వి. వలలో ఒకరకం. **సన్నవలిపెములు** వి.బ.వ. సన్నచీరలు, వస్త్రవిశేషాలు. సిం.ద్వా. 3.206. **సన్నవారనగు** అ.క్రి. చిన్నగానవ్వు. పి.శకు. 3.13. **సన్నవాటు** అ.క్రి. 1. సూచితమగు, బయల్పడు. హరి.పూ. 3.177; 2. సన్నయేర్పడు, భావము సూచితమగు. కృ.శకు. 3.13. <సన్న[2]+పాటు[3]. **సన్నవాసం** వి. కాకివాసం, సన్నటి వాసం. **సన్నవిడి** వి. సన్నం. **సన్నవిడిబియ్యము** వి. సన్నని బియ్యం. **సన్నసద్ద** వి. సజ్జల్లో ఒకరకం. **సన్నసన** విశ. సులభం. **సన్నసందు** వి. పడుగులో రెండుఅనులమధ్య వెలితితక్కువఉండటం. **సన్నసందువేయు** అ.క్రి. పడుగులో రెండుఅనులమధ్య వెలితి తక్కువ ఉండు. **సన్నసంబావులు** వి.బ.వ. కిచిడీలు. **సన్నసామాను** వి. కట్టుబడిలో వాడే అడవికట్టెలు. **సన్నసున్నము** వి. పాలగార, మెరుగుసున్నపు పూత. పి.శకు. 1.86. **సన్నసూదులు** వి.బ.వ. ధాన్య విశేషం. 4.128. **సన్నారికె** వి. ఒకరకం ఆహారధాన్యం. <సన్న[6]+ఆరికె. **సన్నిసుక** రూ. సన్నిస్క. వి. మట్టిని పాకంగా చేయటానికి మసితోపాటు మట్టిలో కలిపే సన్నని ఇసుక. <సన్న[2]+ ఇసుక. **సన్నిస్క** రూ.చూ. సన్నిసుక. వి. మట్టిని పాకంగా చేయటానికి మసితోపాటు మట్టిలో కలిపే సన్నని ఇసుక **సన్నోడ** వి. గింజలనిల్వకు $3\frac{1}{2}$ క్పైవారంతో మూతిచిన్నగా గుండుగా చేసిన ఓడ. < సన్న[2]+ ఓడ.

**సన్న[3]** ఏ. మి టి.

**సన్నకల్లు** రూ.చూ. ననెకలు. వి. సన్నెకల్లు. ఆం.భా. 2.299.

**సన్నగాణె** రూ. సన్నగాళియ, సన్నగాళె. వి. సన్నాయి. రాజవా. 5.60.

**సన్నగాళవాడు** విశ. సన్నగాళం వాయించేవాడు. ద.హిం.గా. సంపు. 10.గా.సం. 422. క్రీ.శ. 1269.

**సన్నగాళియ** రూ.చూ. సన్నగాణె. వి. తిరుచిన్నమనే వాద్యం.

**సన్నగాళె** రూ.చూ. సన్నగాణె. వి. వాద్యవిశేషం, తిరుచిన్నం.

**సన్నంజల్లెడ** చూ. సన్నము.

**సన్నద్** రూ.చూ. సన్నదు. వి. 1. దస్తావేజు; 2. అధికార

పత్రిక.

**సన్నదీమిల్కత్‌యిస్తిమిరార్** రూ. సన్నదుమిల్కత్తుయిస్తిమేరారు. వి. బెంగాల్‌లో దక్షిణప్రాంతంలో జమీందార్ల యొక్క యజమానత్వాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం గుర్తించిన దస్తావేజు లేదా సాధకం.

ఉ.అర. సన్నదీ. సన్నదు సంబంధమైన, మిల్కత్. యజమానత్వం, యిస్తిమిరాన్. ఎడతెగని భూమిఉంచుకొనిఉండే మనిషి అనేమాట సన్నదీమిల్కత్ యిస్తిమిరార్ అనే పరవానానుబట్టి భూమిఉంచుకొని ఉండే మనుషుల నందరినీ చేర్చుకుంటున్నది.

< ఉ. సన్నదీమిల్కత్ యిస్తిమిరార్.

**సన్నదు** రూ. సనదు, సన్నద్, సన్నద్దు. వి. 1. ఆజ్ఞాపత్రిక. నె.శా. కందుకూరు. 48. క్రీ.శ. 1651 ; 2. యోగ్యతాపత్రం.

హిం. సనద్. ప్రమాణం, ప్రమాణపత్రం ; మరా. సనద్. శాసనం, అధికారపత్రం ; ఉ. సనద్. ప్రమాణం, ప్రమాణపత్రం ; పార. సనద్. రాజాజ్ఞ, ఆజ్ఞ, ప్రమాణపత్రం ;

క. సనదు, సన్నదు. డిప్లొమా, రాజశాసనం, వారంటు, దానశాసనం, నూతనకల్పనాధికార పత్రిక ; త. చన్నత్తు ; మ. సన్నతి.

< ఉ. సనద్.

**సన్నదుమిల్కత్తుయిస్తిమేరారు** రూ.చూ. సన్నదీ మిల్కత్ యిస్తిమిరార్. వి. బెంగాల్‌లో దక్షిణప్రాంతంలో జమీందార్ల యొక్క యజమానత్వాన్ని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించిన దస్తావేజు లేదా సాధకం.

**సన్నద్దు** రూ.చూ. సన్నదు. వి. 1. దస్తావేజు ; 2. అధికార పత్రిక.

**సన్నపుఁగార్యములు** చూ. సన్నము.

**సన్నపుఁజినుకులు** చూ. సన్నము.

**సన్నపుఁజుక్క** చూ. సన్నము.

**సన్నపుటాణీచీర** చూ. సన్నము.

**సన్నపుఁదలఁపు** చూ. సన్నము.

**సన్నపుఁదలయేరు** చూ. సన్నము.

**సన్నపుబట్ట** చూ. సన్నము.

**సన్నపుముత్యాలకుచ్చు** చూ. సన్నము.

**సన్నపువల** చూ. సన్నము.

**సన్నపువాఁడు** చూ. సన్నము.

**సన్నపువారలు** చూ. సన్నము.

**సన్నపువిన్నాణము** చూ. సన్నము.

**సన్నపుసరి** చూ. సన్నము.

**సన్నము** రూ. సన్న[2]. విశే. 1. సూక్ష్మం. భాస్క.రా. అయోధ్యా. 348 ; 2. మృదువైనది. శృం.నై. 3.89 ; 3. పరిమితం, కొలదిఅయినది. శృం.నై. 7.8 ; 4. స్థూలంకానిది. హర. 3.69 ; 5. అలతి, మందమైనది. వరాహ. 5.12 ; 6. చిన్నది, అల్పం. పాండు. 3.118 ; 7. నాణెం.

సం. శ్లక్ష్ణ-. మెత్తని, నున్నని, సన్నని, అల్పమైన ; ప్రా. సణ్హ-; సన్హ- ; అ.మా.పా. సణ్హ- ;

క. సణ్ణ, సన్న ; కొడ. చణ, సణ్ణ ; తు. సణ్ణ, సన్న ; త. చన్న, సన్నమ్.

< ప్రా. సణ్హ-.

సన్నంజల్లెడ రూ. సన్నజల్లి, సన్నజల్లెడ. వి. మెత్తని పదార్థాల్ని జల్లించటానికి కళ్ళు చిన్నవిగా ఉండే జల్లెడ. సన్నపుఁగార్యములు(-కార్యములు) వి.బ.వ. సూక్ష్మాలైన పనులు. భాస్క.రా.యు. 141 సన్నపుఁజినుకులు(-చినుకులు) వి.బ.వ. స్వల్పంగా పడే చినుకులు. కేయూ. 3.268. సన్నపుఁజుక్క(-చుక్క) వి. ఆశ్లేషా నక్షత్రం. సన్నపుటాణీచీర వి. రెండుకొలుకులునలుప, రెండుకొలుకులులాకీపెట్టి నేసిన సరివన్నెచీర. సన్నపుఁదలఁపు (-తలఁపు) వి. సూక్ష్మమైన ఆలోచన. హరి.పూ. 1.127. సన్నపుఁదలయేరు(-తలయేరు) వి. కొంచెం తలనొప్పి. మను. 5.22. సన్నపుబట్ట వి. సన్నటిబట్ట, సన్నపుముత్యాలకుచ్చు. వి. కత్తి ఒరపై భాగం. సన్నపువల వి. ఒకరకంవల. సన్నపువాఁడు విశే. అల్పుడు. అచ్చ.రా.యు. సన్నపువారలు విశే.బ.వ. అల్పులు నార.పంచ. 1.414. సన్నపువిన్నాణము వి. అల్పమైన జ్ఞానం. భార.వి.రా. 2.15. సన్నపుసరి విశే. సన్నపోగు. పడుగు. సన్నంపుంబని(-పని) వి. తేలికైనపని. సులభ కార్యం. భాస్క.రా.యు. 867. సన్నాలరౌతు వి. మరీచిన్నపాత్రలను సర్దేరాయి. సన్నాలలాయి రూ.చూ. సన్నాల్రాయి. వి చిన్నచిన్నపాత్రలకు సర్దేరాయి. సన్నాలసలప వి. చిన్నకుండల్ని సర్దేదానికి ఉపయోగించే సలప. సన్నాలు వి.బ.వ. దేవుని రథచక్రాలు అటూఇటూ పోకుండా అడ్డువేసేమొద్దు, చొప్పలు. సన్నాల్రాయి రూ.చూ, సన్నాలలాయి. వి. చిన్నచిన్నపాత్రలమ సర్దేరాయి.

**సన్నంపుంబని** చూ. సన్నము.

**సన్నయికోటుచీర** చూ. సన్నాయి. వి. ఒకరంగు రెండుకొలుకులు, ఒకరంగు ఒకకొలికి చొప్పున అచ్చుతికి పడుగు పేక సమంగా నేసిన చీర.

**సన్నాట** వి. తియ్యటి పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Phoenix farinifera).

**సన్నాయి** రూ. సొనాయి, సొన్నాయి. వి. నాగసరం, వాద్య విశేషం. పల్నా. వ. 142.

ఒ. షహనాయ్ ; బెం. షహనాయ్ ; హిం. షహ్‌నాయ్ ; మరా. సనఈ. వాద్య విశేషం ; ఉ. షహ్‌నాయ్. యుద్ధకాహళం ; పార. షహ్‌వాయ్, జయకాహళం, యుద్ధకాహళం.

< ఉ. షహ్‌నాయ్.

సన్నాయిపట్టు రూ. సొన్నాయిపట్టు. స.క్రి. పాత్రమూతి బుంగగా రావటానికి రెండుచేతుల బొటనవేళ్ళను చూపుడువేళ్ళను కత్తెరమాదిరిగా చేర్చిపట్టు.

**సన్నారికె** చూ. సన్న[2].

**సన్నాలరౌతు** చూ. సన్నము.

**సన్నాలలాయి** చూ. సన్నము.

**సన్నాలసలప** చూ. సన్నము.

**సన్నాలు** చూ. సన్నము.

సన్నాల్రాయి చూ. సన్నము.

సన్నాసాకు చూ. సన్నాసి.

సన్నాసి వి. 1. సన్న్యాసి, యతి. వేంక. ఆం. 34 ; 2. పనికిమాలినవాడు, తెలివితక్కువవాడు, విరాగి, సంసార త్యాగి, యతి.

సం. సన్న్యాసిన్. విరాగి, సంసారత్యాగి, యతి ; ప్రా. సణ్ణాసి. యతి, సంసారత్యాగి సణ్ణాస -. సంసారత్యాగం ;

కువి. హన్నసి. తైర్థికుడు.

< ప్రా. సణ్ణాసి.

సన్నాసాకు వి. లంజెసవరం, జడలాగా పొడుగాటి కాడఉండే కలుపుమొక్క. < సన్నాసి + ఆకు.

సన్ని[1] రూ. సన్నీ[1]. వి. తుపాకీ కొనకి చెక్కి ఉండే బాకులాంటి కత్తి.

సన్ని[2] రూ.చూ. సన్నియ. వి. బోదరాయి, నూరటానికి పనికి వచ్చేరాయి.

సన్నికల్లు రూ.చూ. సనెకలు. వి. నూరేరాయి. రామాభ్యు. 59. సన్నికల్లుసరసుడు వి. డాబులరాయడు. సన్నికాలు రూ.చూ. సనెకలు. వి. భోదరాయి, రాతి కూచాలకు స్తంభాలకు అడుగుభాగంలో మోపుకింద ఉంచ బడిన గుంటగలరాయి. సన్నిగొడ్డ వి. నూరేరాయి.

సన్నిదిసంప్రదాయము వి. ఆయాదేవతా సమక్షంలో మతాను సారంగా చేసే పూజావిధానం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 823. క్రీ.శ. 1388.

సం. సన్నిధి-. సామీప్యం, సంప్రదాయ -, ఆచారం

< సం. సన్నిధి సంప్రదాయ - (అర్థవివరి.).

సన్నియ రూ. సనె, సన్ని[2], సన్నీ[2], సన్నె. వి. సన్నెకల్లు, నూరేరాయి. కు. సం. 2.139 ;

సం. సంజ్ఞా. అడుగు, జాడ, దారి, అంజ ; ప్రా. సణ్ణిఅ ;

క. సణ్ణ, సణ్ణిగె, సన్న ; కుఇ. సెని. కొయ్య రోలు.

< ప్రా. సణ్ణిఅ.

సన్నియ్యపొద్దు వి. మధ్యాహ్నం మూడుగంటలు.

సం. సంధ్యా. రేయింబవళ్ళ మధ్యసమయం.

< సం. సంధ్యా + పొద్దు.

సన్నిమక చూ. సన్న[2].

సన్నిస్క చూ. సన్న[2].

సన్నీ[1] రూ.చూ. సన్ని[1]. వి. తుపాకి కొనను చెక్కిఉండే బాకులాంటి కత్తి.

సన్నీ[2] రూ.చూ. సన్నియ. వి. సన్నికల్లు, నూరేరాయి.

సన్నుకాలు వి. కాలి మడుపులో వాపు.

సన్నుగొయ్య రూ.చూ. సనగొయ్య. వి. బండికి పక్కల బిగించే గుజ్జు (మేకు).

సన్నుబుడ్డి రూ. సన్నుబుండి. వి. పసిపిల్లలు పాలుతాగటానికి వీలుగా గొట్టం ఉంచి చేసిన చిన్నమట్టిగురిగి, పాలసీసా.

< చన్ను + బుడ్డి.

సన్నుబుండి రూ.చూ. సన్నుబుడ్డి. వి. పసిపిల్లలు పాలుతాగ టానికి వీలుగా గొట్టం ఉంచి చేసిన చిన్న మట్టిగురిగి, పాలసీసా.

సన్నె రూ.చూ. సన్నియ. వి. నూరేరాయి. జైమినిభా. 2,100.

సన్నెకల్లు రూ.చూ. సనెకలు. వి. నూరేరాయి. ద్వి. భార. విరా. 5.104, పి. శకు. 4.79. సన్నెగొడ్డ వి. విసరేరాయి, తిరగలి.

సన్నోడ చూ. సన్న[2].

సన్‌ప్రూఫ్‌చీర వి. పడుగుకు లాకీపేకకు దమయంతిపచ్చ రంగులు పెట్టి నేసిన కలనేతచీర.

ఇం. *Sun Proof*. సూర్యకాంతి ప్రవేశించని.

< ఇం. Sun Proof. + చీర.

సన్మథబు వి. సమ్మతం. నె.శా. పొదిలి. 38. క్రీ.శ. 968.

సం. సమ్మత -. అంగీకారం, ఇష్టం.

< సం. సమ్మత -.

సన్య రూ.చూ. సన్న[1]. వి. తాంతవ ప్రతికృతి, చేసన్న. ఆం. భా. 2.295.

సన్యాసులతెరబొమ్మ వి. సన్యాసుల పాలిటికి పట్టి బొమ్మ లాంటిది. శుక. 3.20.

సన్‌షేడు రూ. సనసేట్, సనసైడు, సన్‌షేడ్, సన్‌సేడు; సన్‌సైటు ; సన్‌సైడు. వి. జల్లుపరదా, ఎండ జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదకు దించిన పలక.

ఇం. *Sun Shade*.

< ఇం. Sun Shade.

సన్‌సెట్‌రాయి వి. మోటీరాయి, కిటికీల పైభాగంలో ఎంతా వానలు తగలకుండా గోడలోనుంచి ముందుకు పొడుచు కొని వచ్చేటట్టు బిగించినరాయి.

ఇం. *Sunset*. సూర్యాస్తమయం.

< ఇం. Sunset + రాయి.

సన్‌సేడ్ రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా. ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదకు దించిన పలక.

సన్‌సేడు రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా. ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదకు దించిన పలక.

సన్‌సైటు రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా, ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదగా దించిన పలక.

సన్‌సైడు రూ.చూ. సన్‌షేడు. వి. జల్లుపరదా, ఎండ, జల్లు తగలకుండా రక్షణగాకిటికీల మీదకు దించిన పలక.

సపంగుకానికమన్నన వి. పంగకానిక సహితంగా మన్నన. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 450. క్రీ.శ. 1280.

సం. స. సహితం, కూడిన.

సం. స + పంగుకానికమన్నన. (మిశ్రస.).

సపము చూ. సబము. వి. శవం. ఆం. పదా. సుర. 98.

సం. శవ -. మృతకళేబరం, పీనుగు ; ప్రా. సవ - ; పా. ఛవ - ;

క. సబ ; త. చవమ్ ; మ. చవమ్.

< ప్రా. సవ -.

సపరం రూ.చూ. చప్పరము. వి. తట్ట, పొరుడు, వాలుగా ఉన్న ఆకు కప్పు.

సవరి[1] వి. సర్వహక్కులలో స్వాధీనం. సె.శా. పొదిలి. 34, క్రీ.శ. 1583.

సవరి[2] వి. శబరినది.
సం. శబరీ. చెంచెత, రామభక్తురాలైన కోయస్త్రీ.
<సం. శబరీ.

సవరు వి. మహమ్మదీయ సంవత్సరంలో రెండోనెల. ద.హిం. శా. సంపు. 10. శా.సం. 753. క్రీ.శ. 1600.
ఉ. అర. సఫార్. మహమ్మదీయ సంవత్సరంలో రెండోనెల.
<ఉ. సఫార్

సవర్తగుడ్డ వి. కుంకల్ని సర్వేటప్పుడు సలపను తడుపుకోవటానికివాడే త బట్ట.

సవర్తబండ రూ. సపిర్తబండ, సవిర్తబండ. వి. సర్వేటప్పుడు సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సపాట రూ.చూ. సపాటము. విణ. 1. సమమైంది, సమానమైనమితికలది. కాశీ. 2.159 ; 2. మట్టమైంది, సమమైంది. మను. 4.96 ; 3. నేలమట్టం. మొల్లరా. యు. 3.37.

సపాటము రూ. సపాట. వి. 1. ఒక్కుమ్మడి, ఒక్కమాట. భార. విరా. 5.32 ; 2. నేలమట్టమవటం, నాశం. సమీర. 4.18 ; 3. చదరం ; 4. చదును.
సం. చర్పట-చాచినవేళ్ళుగల అరచేయి ; ప్రా. చప్పట-; పం. చాపర్ ; సిం. చాపోరో ; ల. చ్యాపి ; మరా. చపటా, సపాట. సమతలమైన, మృదువైన ;
క. సప్పె ; తు. చప్పట ; మ. చప్పట్ట ; కొం. చప్ప.
<ప్రా. చప్పట-.

సపాయి వి. 1. సమం ; 2. సమతలం ; 3. పూర్తిగా తుదముట్టించటం ; 4. శుభ్రత.
హిం. ఉ. పార. సఫాఈ. మెరుగు, శుభ్రంచేయటం ; క. సపాయి-పాలిష్, సన్నని, శుభ్రమైన, అందమైన, సఫాఈ, స్వచ్ఛత, శుభ్రత, తేటగాఉండటం, విశ్వాసం, తగువు పరిష్కారం చెయ్యటం.
<ఉ. సఫాఈ.

సపార రూ.చూ. చప్పరము. వి. వాలుగాఉన్న ఆకుకప్పు.

సపారము రూ.చూ. చప్పరము. వి. 1. ఇంటివెనక గోడకానించి ఏటవాలుగా గడ్డిఆకుల్తో వేసేపందిరి ; 2. ఒకే పక్కకు ఏటవాలుగా కట్టిన పందిరి, వరండా.

సపారు రూ.చూ. చప్పరము. వి. వసారా, చిన్నపందిరి.

సపిరిగుర్రం వి. గుర్రపుకొయ్య, పంచ దించటానికి వీలుగా గోడలో నాటిన చివరచెక్కిన కొయ్య.

సపిర్తబండ రూ.చూ. సపర్తబండ. వి. సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సపెట్టు చూ. సరిపెట్టు. అ.క్రి. పగపట్టు.
హిం. చపేట్. దెబ్బ, చపేట్‌నా. అణచటం, పరిగెత్తించటం.

సపెర వి. మరవాసంలో తగిలించే మరచెక్కినవాసం.

సపోట రూ.చూ. సపోటా. తియ్యని పళ్ళు కాసే ఒకరకం చెట్టు.

సపోటా రూ. సపోట. వి. 1. దక్షిణ అమెరికానుంచి తెచ్చిన పళ్ళచెట్టు ఎండాకాలం ఆరంభంలో కాపుకాస్తుంది. పండు కోడిగుడ్డు ఆకారంలో ఉండి తినటానికి రుచిగా ఉంటుంది. (Achars sapota). ; 2. సపోటా పండురంగు.
లా. *Achars Sapota.* సపోటా
బెం. సపోటా.
<లా. Achars sapota. సపోటా.

సపోటు రూ.చూ. సపోర్టు. వి. 1. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ. వి. కదలకుండా నిలపటానికి రెండు కర్రలను పైపైపున బిగించికట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు ; 2. నిలువుబోటు, మూసకర్ర ; 3. మూసపోటికి నిలివినకర్ర ; 4. బట్టీగోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ.
సపోటుకర్ర వి. కత్తిగర్ర, పోటీగాపెట్టిన కర్ర.

సపోట్టు రూ.చూ. సపోర్టు. వి. 1. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ. వి. కదలకుండా నిలపటానికి రెండు కర్రలను పైపైపున బిగించి కట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు ; 2. నిలువుబోటు, మూసకర్ర ; 3. మూసపోటికి నిలిపినకర్ర.

సపోట్రు రూ.చూ. సపోర్టు. వి. 1. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ. వి. కదలకుండా నిలపటానికి రెండు కర్రలను పైపైపున బిగించికట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు ; 2. నిలువుబోటు, మూసకర్ర ; 3. మూసపోటికి నిలిపినకర్ర.

సపోర్టు రూ. సపోటు, సపోట్టు, సపోట్రు. వి. 1. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ. వి కదలకుండా నిలపటానికి రెండుకర్రలను పైపైపున బిగించికట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు ; 2. నిలువుబోటు, మూసకఱ్ఱ ; 3. మూసపోటికి నిలిపినకర్ర.
ఇం. *Support*. ఆధారం, బలం.
<ఇం. *Support*.

సప్టీబండ చూ. చప్టా. వి. అడుగురాయి, ఇంటినేలమీద పరిచే పల్చనిరాయి.

సప్తదారిచీర వి. అంచుల్లో ఏడేసి జరీగళ్ళు వరసగా నేసిన చీర.
సం. సప్తన్-ఏడు.
<సం. సప్తన్-+దారి+చీర.

సప్తపేగు వి. కుండల్ని సర్వేటప్పుడు సలపను తడుపుకోవటానికివాడే తడిబట్ట.
సం. సప్తన్, ఏడు.
<సం. సప్తన్+పేగు. (అర్థవిపరి.).

సప్తమారుషులు వి.బ.వ. ఆకాశంలోని ఏడు నక్షత్రాలు. సప్తర్షిమండలంలో మంచంకోళ్ళ మాదిరిగా ఉండే నాలుగు చుక్కలు వాటివెనుక ఉండే మరిమూడు చుక్కలు.
సం. సప్తమహర్షి-ఏడుగురు ఋషులు.
<సం. సప్తమహర్షి-+-లు.

సప్తరౌతు రూ. సప్తిరౌతు. వి. సర్వేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సం. స్వపన్. ఏడు.

<సం. సప్తన్+రౌతు. (అర్థవిపరి.).

సప్తిపేల్క వి. కుండల్ని సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సం. సప్తి-గుర్రం, కాడి, కలిసిపనిచేసేవాడు.

సప్తిరాయి వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సం. సప్తి-గుర్రం, కాడి, కలిసిపనిచేసేవాడు.

సప్తిరేసిరాయి రూ. సప్పిరాసిరాయి, సప్పిరిసేరాయి. వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సం. సప్తి-గుర్రం, కాడి, కలిసిపనిచేసేవాడు.

సప్తిరౌతు రూ.చూ. సప్తరౌతు. వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సప్ప రూ.చూ. సప్పా. వి. సీల, గానుగచక్రం బెనగకుండా బిగించే కొయ్యముక్క.

సప్పకొరకు వి. **1.** నూలులడీలు తడి మురికి పోవటానికి దంపేకొయ్య ; **2.** నీళ్ళలో తడిపిన లడీల మురికి పోవటానికి బండమీద కొట్టేకర్ర.

సప్పట వి. ఊతపదాల్లో ఒకటి. వేంక. పంచ. 1.739.

సప్పటరాయి రూ. చప్పట్రాయి. వి. అడుగురాయి, ఇంటికోల మీద పరిచే పల్చనిరాయి.

<చప్పట[2]+రాయి.

సప్పపుజుక్క చూ. సప్పము.

సప్పము వి. సర్పం, పాము. సుమతీ. 19, ఆ.నా.సం. 84.

సం. సర్ప-పాము ; సర్ప- ; అ.మా.పా.అప. సప్ప-, సప్పె ;

త. చరుపమ్, చర్ప్పమ్ ; చెంచు, సాంప్.

<ప్రా. సప్ప-.

సప్పపుజుక్క (-చుక్క) వి. ఆశ్లేషా నక్షత్రం.

సప్పరము రూ.చూ. చప్పరము. వి. **1.** ఇంటి వెనకగోడ కానించి ఏటవాలుగా గడ్డి ఆకుల్తో వేసేపందిరి ; **2.** ఒకేపక్కకు ఏటవాలుగా కట్టిన పందిరి. వరండా.

సప్పరాసిపాత రూ.చూ. సప్పిరాసిపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సప్పవాపు రూ. సొప్పెవు. వి. జెబ్బవాపు.

సప్పా రూ. సప్ప. వి. 1. ఒకరకం పావుచెక్క ; **2.** చేత్తో డిజైను (రంగు)లు అద్దే ఒకరకం కొయ్య అచ్చు.

సప్పాకొయ్య వి. మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు పాతినకొయ్య. సప్పారంగు వి. చేతి అద్దకంలో మేనాతో అద్దిన రంగు.

సప్పి రూ.చూ. చప్పి[1]. వి. ఒకరకంజబ్బు.

సప్పిడిపాత రూ. సప్పిడిసిపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సప్పిడిపాతచెక్క వి. సర్సేటప్పుడు సలపను తడి చేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే కొయ్యచెక్క. సప్పిడిపాతరాయి వి. సర్సేటప్పుడు సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సప్పిడిబట్ట వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట.

సప్పిడిబండ రూ. సప్పితబండ. వి. సర్సేటప్పుడు సలపను తడి చేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సప్పిడిసిపాత రూ.చూ. సప్పిడిపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సప్పితబండ రూ.చూ. సప్పిడిబండ. వి. సర్సేటప్పుడు సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సప్పిరాయి వి. రొట్టెపెనాలు సర్సేదానికి వాడేరాయి.

సప్పిరాసిచెక్క వి. సర్సేటప్పుడు సలపను తడి చేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే కొయ్యపలక.

సప్పిరాసిపాత రూ. సప్పరాసిపాత, సప్పిరేసిపాత, సప్రాసుపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట.

సప్పిరాసిరాయి రూ.చూ. సప్తిరేసిరాయి. వి. సర్సేటప్పుడు వాలు లోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సప్పిరిసేరాయి రూ.చూ. సప్తిరేసిరాయి. వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి

సప్పిరేసిపాత రూ.చూ. సప్పిరాసిపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట.

సప్పురి (-పురి) వి. కొద్దిపాటి ధారపు పడి.

సప్పురినూలు రూ. జబ్బురి నూలు. వి. పురి తక్కువగా ఉండేనూలు. <సప్ప+పురినూలు. సప్పురిపగ్గం వి. జమిలి పురి వేసిన పగ్గం. సప్పురిరేషం వి. పురితక్కువున్న పట్టు దారం.

సప్పేరాయి వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా. పెట్టుకొనే గుండ్రనిరాయి.

సప్రం రూ.చూ. చప్పరము. వి. వాలుగాఉన్న ఆకుకప్పు.

సప్రాసుపాత రూ.చూ. సప్పిరాసిపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సప్లయి రూ.చూ, సప్లై. వి. సరఫరా

సప్లై రూ. సప్లయి. వి. సరఫరా.

ఇం. *Supply*. సరఫరా, సరఫరాచేయు.

<సం. Supply.

సఫదుర్‌చేయు అ.క్రి. ఛార్జి తీసుకొను.

హిం. సుపుర్ద్. ఛార్జి, కేర్, అధీనం ; ఉ. అర. సిపుర్ద్, సుపుర్ద్. ఛార్జి, ఉంచు కోవటం, అధీనం, అధికారంలో ఉంచు కోవటం, ఆస్తిని ఇచ్చివేయటం, సుపుర్ద్-కర్నా.ఛార్జి ఇవ్వటం, ఒకరి అధీనానికి రెకమెండ్ చెయ్యటం. ఒప్పగించటం ;

త. సుపారి.

<ఉ. సుపుర్ద్+చేయు.

సఫరు వి. ఇస్లాం సంవత్సరంలో రెండో నెల. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 753. క్రీ.శ. 1600.

హిం. సఫర్. యాత్ర ; మరా. సఫర్, యాత్ర ; ఉ. సఫర్. అరబీ సంవత్సరంలో రెండోనెల, యాత్ర ; పార. సఫర్. మహమ్మదీయుల సంవత్సరంలో రెండో

నెల: అర. సఫర్. సంవత్సరంలో రెండోనెల.

< ఉ. సఫర్.

సఫిన్ను రూ.చూ. సఫిన్నూరు. వి. ఒకవిధమైన ఆభరణం.

సఫిన్నూరు రూ. సఫిన్ను. వి. ఒకవిధమైన ఆభరణం.

ఉ. అర. సఫ్. వరుస, క్రమం, గుంపు, వర్గం. నూర్. కాంతి, వెలుగు.

< ఉ. సఫ్-. నూర్.

సఫేదా వి. తెల్ల సీసం.

హిం. సఫేదా. తెల్లసీసం, జింకు ఆక్సైడు, మామిడి కాయలో లేదా దోసకాయలో ఒకజాతిపేరు, ఒకమందు దినుసు ; ఉ. పార. సఫేదా.- సఫేద్, సుఫీద్, తెల్లని, సఫేదీ. తెల్లదనం, కుష్ఠురోగం

త. చపేతా.

< హిం. సఫేదా.

సఫేదు విణ. తెల్లనిది ; వి. తెల్లవర్ణం.

ఒ. సఫీదీ. తెల్లని ; బెం. సఫేద్ ; హిం. ఉ. సఫేద్.

< సఫేద్.

సఫేద్రంగు వి. వర్ణపట్టికలోని మూలవర్ణాల మొత్తపు రంగు. < హిం. సఫేద్+రంగు.

సఫేద్రంగు చూ. సఫేద్.

సబ వి. సభ, కొలువుకూటం. తాళ్ల.సం. 17.280.

సం. సభా. కొలువుకూటం.

< సం. సభా.

సబడి రూ.చూ. సవళి. వి. ఒకజాతి ఆయుధం, ప్రాసం. కు. సం. 12.5.

క. సబళ. ప్రాసం ; ఒ. సాబొళొ. గునపం.

సబడీ రూ.చూ. సవళి. వి. ఒకజాతి ఆయుధం.

సబబు రూ. సబువు, సబ్బు[4]. వి. 1. కారణం. రంగా. చ. 2.149 ; 2. న్యాయం.

ఒ. సబబ్. కారణం ; బెం. సబబ్ ; హిం. మరా. సబబ్. కారణం ; ఉ. సబబ్. కారణం. సాధనం ; పార. సబబ్. హేతువు ; అర. సబబ్. కారణం ; క. సబబు ; త. చప్పు.

< ఉ. సబబ్.

సబబుదరసబబు వి. ఎన్నోకారణాలు.

ఉ. పార. సబబ్ - దర్ - సబబ్. కారణాలు.

< ఉ. సబబ్-దర్-సబబ్.

సబము చూ. సవము. వి. శవం. బసవ. పు. 3.80.

సం. శవ-. మృతకళేబరం ; ప్రా. సవ-, ఛవ- ; క. సబ, సవ. శవం, సా. చచ్చు, సావు. చావు, శవం ; తు. సావు. మరణం ; త. చా. చచ్చు, చావు ; మ. చకం, చవం. శవం, చౌ. చచ్చు ; కుఇ. సావ. చచ్చు ; కువి. షమొమి. శవం, హా. చచ్చు, హాకి. చావు ; పర్జి. చా ; కొలా. సా ; బ్రా. కహింగ్. చచ్చు.

< ప్రా. సవ-.

సబరి[1] రూ.చూ. సవళి. వి. ఒకజాతి ఆయుధం.

సబరి[2] రూ. సబిలము. వి. శబరీనది.

సం. శబరీ. చెంచెత, రామభక్తురాలయిన ఒక కోయ స్త్రీ.

< సం. శబరీ.

సబరు రూ.చూ. సబురు[1]. వి. ఓడస్తంభాల్లో పొడుగైనది.

సబలము రూ.చూ. సవళి. వి. 1. ఆయుధవిశేషం ; 2. గునపం.

సబల్లు రూ.చూ. సవళి. వి. ఆయుధవిశేషం.

సబళి రూ.చూ. సవళి. వి. 1. ఆయుధవిశేషం. భార. ద్రోణ. 2.18 ; 2. తవ్వేసాధనం. ఆం. భా. 2.230.

సబళము రూ.చూ. సవళి. వి. ఆయుధవిశేషం. భార. సౌప్తి. 1.183, రం. రా. ఉ. 74పు. 7పం.

సబాము వి. స్వభావం. భార. అను. 2.427.

సం. స్వభావ-. నిజభావం, స్వధర్మం ; ప్రా. సభావ-, సహావ- ; శౌ. సభావ-, శకున్త ; అ.మా, సభావ-, సహావ- ; పా. సభావ- ; అప. సహాఅ, సహాబ ; బెం. ఒ. స్వభావ్.

< ప్రా. సభావ-.

సబాసు రూ.చూ. సెబాసు. అవ్య. ప్రశంసార్థకం, భళిరే, అజ్ఞారే, బాంగుబళి, బాంగురే, బళా మొ.వి.

సబిడి రూ.చూ. సవళి. వి. ఆయుధవిశేషం.

సబిడీ రూ.చూ సవళి. వి. ఈటెలాంటి ఆయుధం, అచ్చ. రా. యు. 289.

సబిల రూ.చూ సవళి వి. ఒకజాతి ఆయుధం.

సబిలము రూ.చూ. సబరి[2]. వి. శబరీనది.

సబిళము రూ.చూ. సవళి. వి. ఒకజాతి ఆయుధం.

సబురు[1] రూ. సబరు. వి. 1. ఓడప్రయాణం ; 2. ప్రయాణం.

హిం. ఉ. సఫర్. ప్రయాణం ;

త. సపర్.

< ఉ. సఫర్.

సబురు[2] వి. తడవ, పర్యాయం.

సబురున అవ్య. ద్రు. స్వయంగా.

సబువు రూ.చూ. సబబు. వి. 1. కారణం ; 2. న్యాయం.

సబ్బీసు వి. 1. రచయిత ; 2. జీతాలిచ్చే అధికారి.

సబకు వి. కథావిషయం.

ఇం. *Subject*. వాదానికి లేదా వర్ణనకు లేదా ప్రతిపాదనకు విషయమైన వస్తువు, విచారించవలసిన విషయం.

< ఇం. Subject.

సబ్జా వి. 1. గంజాయి ; 2. మట్టిరంగు ; 3. తెల్లపావురం.

ఒ. సజ్జా. ఆకుపచ్చరంగు ; హిం. సబ్జా. పచ్చిక, పచ్చరాయి, మట్టిరంగు గుర్రం, పచ్చని, గంజాయిమొక్క, ఉ. పార. సబ్‌జ. వికసించటం, పాలపక్షి, చెవిలోధరించే ఒకపచ్చరాయి, అప్పుడప్పుడే వస్తున్నగడ్డ, ఒక తులసిచెట్టు, పచ్చిక.

< ఉ. సబ్‌జ.

సబ్బ వి. జంపరు, సుమారు మూరెడు పొడుగుండే ఇనప చువ్వ.

సబ్బడు రూ.చూ. సబ్బండు. విణ. అనేక భేదాలుకలది. ఉచ్చావచం.

సబ్బండు రూ. సబ్బడు. వి. 1. అబద్ధం ; 2. చాలా భేదాలు కలది ; 3. నానాజాతులు కలిసిన సంఘం.

సబ్బండుచాకిరీ వి. అడ్డమైనచాకిరీ. సబ్బండుపెట్టు స.క్రి. బూతులు తిట్టు.

సబ్బతు రూ.చూ. సబ్బాతు. వి. దినం, సబ్బతోత్సవం.

సబ్బత్తు రూ.చూ. సబ్బాతు. వి. దినం, సబ్బతోత్సవం.

సబ్బర్ రూ.చూ. సెబ్ర. వి. చెడు.

సబ్బల్ వి. తివాసీ మగ్గందోనె బిగింపుకు పక్కన బెజ్జంలో దూర్చిన గడ్డపార.

సబ్బాతు రూ. సబ్బతు, సబ్బత్తు. వి. బైబిలు పూర్వ విధానంలో శనివారం, కొత్తనిబంధనల ప్రకారం ఆదివారం, క్రీస్తు పునరుత్థాన చిహ్నమైన సబ్బాతు పుణ్యదినం

-పో. సాబాదు. సర్వేశ్వరుని విశ్రాంతిదినం. శనివారం; స్పా. సాబాదో. శనివారం; హిబ్రూ. షబ్బాత్.

<పో. సాబాదు.

సబ్బిడి వి. చురుకుదనం లేకపోవటం.

సం. స్తబ్ధతా. మాంద్యం.

సబ్బిడితనము వి. చురుకుదనం లేకపోవటం.

సబ్బిణి రూ. సబ్విణి. వి. 1. సంగనాచి, అమాయకురాలు. శుక. 4.42; 2. సభ్యురాలు.

సం. సభ్యా. సభ్యురాలు. సంస్కృత పండితులు సబ్బిణీ పదాన్ని పరికల్పించి ఈ పదాన్ని నిష్పన్నంచేశారు.

<సం. సభ్యా.

సబ్బీము రూ.చూ. సగ్గుబియ్యము. వి. సగ్గుబియ్యం.

సబ్బు[1] రూ.చూ. సగ్గు[4]. వి. బియ్యం.

సబ్బుబియ్యము రూ.చూ. సగ్గుబియ్యము. వి. ఒకరకమైన ధాన్యం.

సబ్బు[2] వి. జిడ్డును పోగొట్టే ఒకవిధమైన చపటికారం, చౌకారం, సబ్బిళ్ళ ఆం. భా. 2.301.

బెం. సాబున్; ఒ. సాబున్; హిం సాబున్; పో. సబాను. సబ్బు; స్పా. హాబోన్; ఫ్రెం. సవో(; ఇం. *Soap*;

క. సబ్బు.

<పో. సబాను.

సబ్బు[3] వి. కంటు, రాతికూచాలమీద అర్ధచంద్రాకారపు సొట్ట లాగా మలచిన గుంట.

సబ్బు[4] రూ.చూ. సబబు. వి. కారణం.

సబ్సిడీ వి. సహాయంకై తక్కువధరకివ్వటం; విశే. సహాయంగా తగ్గింపుధరకిచ్చిన.

ఇం *Subsidy*. సహాయం, సహాయధనం.

<ఇం. Subsidy.

సఫరువా(డు విశే. అశ్వరక్షకుడు, గుర్రాల్ని కాసేవాడు. శుక. చ. 2.426.

హిం. సఫర్. యాత్ర, పర్యటన; అర. సఫ్-ర్.

<ఉ. సఫర్+వా(డు.

సభ్విణి రూ.చూ. సబ్బిణి. వి. 1. సభ్యురాలు; 2. అమాయకురాలు. (తెలంగాణా వాడుక.)

సమకట్టు అ.క్రి. 1. సన్నద్ధమగు, ఆయితమగు. భార. ఆది. 2.8; 2. కడగు, యత్నించు. భార. ఆది. 2.72; 3. కలుగు, సమకూరు. నరస. 5.167; 4. సరిపడు, తగు. శుక. 1.133; స.క్రి. 1. సమకూర్చు, ఘటించు, సిద్ధపర్చు. భార. అరణ్య. 2.196; 2. సంపాదించు. భార. అరణ్య. 3.189; 3. చేయు. భార. విరా. 1.181; 4. ధరించు; కట్టుకొను. బసవ. 8ఆ. 24పం. బసవ. 3.52.; 5. ఏర్పర్చు, నిర్ణయించు. భార. అరణ్య. 6.70; 6. కల్పించు. సిద్ధంచేయు. ఉ.రా. 6.14; వి. కూర్పు, రచనం, వేషరచన. బసవ. 42పు. 27పం.

క. సమ. సిద్ధపడు, ఆయత్తమగు; త. చమై (-వ్--న్త్-) చేయు, ఏర్పరచు, కట్టు; మ. చమయమ్, ఆయత్తమగు, ప్రయత్నపడు, బట్టలు నగలు, సిద్ధపడు. చమెక్కు. సిద్ధపడు, వండు; కొలా. సవరిల్. సిద్ధపరచు, తయారుచేయు.

సమకుఱు రూ.చూ. సమకూరు. అ.క్రి. 1. లభించు. భాగ. 4.246; 2 పూను; 3. ఘటిల్లు; 4. సిద్ధించు: 5. శక్యమగు; 6. పొసగు.

సమకూడు అ.క్రి. 1. కలుగు. విష్ణుపు. 5.351; 2. సిద్ధించు.

సమకూరు రూ. సమకుఱు, సమకూఱు. అ.క్రి. 1. ఘటిల్లు, తటస్థించు. భార. ఆది, 6.240; 2. శక్యమగు. భార. ఆది. 7.184; 3. లభించు, చిక్కు. భార. ఉద్యో. 4 638. 4. కలుగు, సిద్ధించు, శృం. నై. 2.28; 5. కూడుకొను, పొసగు. గంధ. 1.46; 6. పూను.

సమకూరుచు రూ.చూ. సమకూర్చు. స.క్రి. 1 నెరవేర్చు, సిద్ధింపచేయు; 2. ఘటిల్లచేయు; 3. సిద్ధంచేయు; 4. కలిగించు, ప్రాప్తింపచేయు. సమకూర్చు రూ. సమకూరుచు. స.క్రి. 1. నెరవేర్చు, సిద్ధింపచేయు. భాస్క.రా.యు. 1722; 2. ఘటిల్లచేయు. వి.క్ర. 2.7; 3. సిద్ధంచేయు. పారి. 5.75; 4. కలిగించు. ప్రాప్తింపచేయు. సీతారా. 1.63.

సమకూర్చు చూ. సమకూరు.

సమకూఱు రూ.చూ. సమకూరు. అ.క్రి. 1. లభించు. శృం. నై. 5.173; 2. ఘటిల్లు; 3. శక్యమగు; 4. కలుగు; 5. కూడుకొను; 6. పూను.

సమకొను అ.క్రి. 1. రూపొందు, ఏర్పడు. హరి. పూ. 1.140: 2. సిద్ధించు, కలుగు. భాస్క.రా.బాల, 352; 3. లభించు. ప్రాప్తించు. భాస్క.రా.యు. 109; 4. పూను, యత్నించు భాస్క.రా.యు. 1475; 5. ఒప్పు, తగు. భీమ. 2.8; 6. అనుకూలమగు. కవిక. 3.54; స.క్రి. వహించు, పూను. జైమినిభా. 4. 114.

సమకొలుపు రూ.చూ. సమకొల్పు. స.క్రి 1. నెరవేర్చు పూర్తిచేయు; 2. వహించు, పొందు; 3. పూన్చు, పరికొల్పు; 4. కలిగించు: 5. సిద్ధంచేయు. సమకొల్పు రూ. సమకొలుపు. స.క్రి. 1. సిద్ధంచేయు, కూర్చు. భార. శాంతి. 3.177; 2. వహించు, పొందు. భాస్క.రా. అయోధ్యా. 86; 3. యత్నించు. కాశీ. 4.89; 4. పూన్చు, పరికొల్పు. విప్ర. 1.51; 5. కలిగించు. ఓ.శకు. 1.112.

సమకోలు వి. 1. లభించటం, సిద్ధించటం, కలగటం. 2. అంగీకారం, సమ్మతి.

సమకొలుపు చూ. సమకొను.

సమకొల్పు చూ. సమకొను.

**సమకోలు** చూ. సమకొను.

**సమక్షము** వి. సన్నిధి. భార. సభా. 1.275. ఇది సాధారణంగా "సమక్షమునకు. సమక్షమున, సమక్షమునందు" అనే రూపాలతోనే వాడబడుతోంది. ఈ పదం తెలుగులో విశేష్యంగా ప్రయోగించటడుతోంది.

సం. సమక్షమ్. కన్నులఎదుట, ఎట్టఎదుట.

<సం. సమక్షమ్.

**సమగడిచీర** వి. నలుచదరపు గళ్ళునేసిన చీర.

సం. సమ-.సమానమైన.

<సం. సమ-+గడిచీర. (మిశ్రన.).

**సమగొయ్య(-కొయ్య)** వి. నేతబయలులో చివర పాతిన కొయ్య.

సం. సమ-సమానమైన.

<సం. సమ-+కొయ్య. (మిశ్రన.)

**సమచాపు** రూ. సముసాపు. వి. సమానంగా నేసిన రెండు పంచెలు.

సం. సమ-.సమానమైన.

<సం. సమ-+చాపు (మిశ్రన.).

**సమచౌకము** విశ. సముమైన చదరం కలది, చతురస్రం వరాహ. 10.112.

సం. సమ-సమానమైన.

<సం. సమ-+చౌకము. (మిశ్రన.).

**సమజాయించు** స.క్రి. అనునయించు.

సం. సంబిధ్య, సంబుధ్య; ప్రా. సంవిజ్ఝ, సంబజ్ఝిఅ; ఒ. సముజొ. అర్థం చేసుకోవటం, బోధించటం; హిం. సమఝ్. బోధ, వ్యాఖ్యానం; మరా. సమజ్ ఉద్దేశం. బోధనం, వ్యాఖ్యానం.

<హిం. సమఝ్ (నా) +-ఇంచు[3].

**సమజాయిషీ** రూ.చూ. సంజాయిషి. వి. సమాధానం.

**సమట్టం** రూ.చూ. సమమట్టము. వి. సమానమైనమట్టం.

**సమణ** రూ. సమన. వి. బౌద్ధసన్యాసి.

సం. శ్రమణ-. బౌద్ధసన్యాసి; ప్రా. సమణ-.

<ప్రా. సమణ-.

**సమంటం** వి. స్తంభం.

**సమతానిచీర** వి. ఒకరకం చిన్నగడిచీర. సంతానం కోరేవారు కట్టుకొనెచిన్న గడిచీర.

సం. సంతాన-. బిడ్డలు, చీర-. వస్త్రం.

<సం. సంతాన-+చీర.

**సమతారుకాణసేయు(-చేయు)** స.క్రి. పోల్చిచూచు. తాళ్ల. సం. 17.301.

**సమదండ** వి. మల్లవిద్యాసంబంధమైన పన్నెండుదండల్లో ఒకటి. హంస. 1.203.

సం. సమ-.సమానమైన.

<సం. సమ-+దండ. (మిశ్రన.).

**సమన** రూ.చూ. సమణ. వి. బౌద్ధసన్యాసి.

**సమను** వి. విచారణకోసం న్యాయాధిపతి పంపిన కాగితం. ఇం. *Summons*. న్యాయసభాదిస్థలాలకు రమ్మనే ఆజ్ఞలు

<ఇం. Summons.

**సమపడు** అ.క్రి. 1. సంకేతితమగు; 2. నియమానికి లొంగు

సం. సమ-.సమానమైన. సరైన.

<సం. సమ-+పడు.

**సమపఱచు** స.క్రి. సరిపర్చు, సరిచేయు.

**సమపఱచు** చూ. సముపడు.

**సమమట్టము** రూ. సమట్టం. వి. సమానమైనమట్టం.

సం.సమ-. సమానమైన.

<సం. సమ-+మట్టము. (మిశ్రన ).

**సమముపచ్చు** అ.క్రి. సాటివచ్చు. విజయ. 1.100.

**సమయంవాళ్ళు** విశ.బ.వ. పద్మసాలీలదగ్గర అడుక్కొనేవాళ్ళు.

**సమయకార్యము** వి. మతం లేక సంఘవిషయమైనపని ద.హిం. శా. సంపు. 10.శా. సం. 473. క్రీ.శ. 1292.

సం. సమయ-. వేళ, ప్రతిజ్ఞ, కార్య - పని.

<సం. సమయకార్య-(అర్థవిపరి.).

**సమయచక్రవర్తి** వి. వర్తక సంప్రదాయ పరిపాలకుడు. ద. హిం శా. సంపు. 10.శా.సం. 211. క్రీ.శ. 1198.

సం. సమయ-కాలం, తరి, ప్రతిజ్ఞ, చక్రవర్తిన్. మహారాజు.

<సం. సమయచక్రవర్తిన్. (అర్థవిపరి.).

**సమయఁజూచు** సమయు.

**సమయదండము** వి. సాంఘిక సాంకేతికమైనశిక్ష. H.A.S. 19.55 క్రీ.శ. 1320

సం. సమయ-. కాలం, ప్రతిజ్ఞ, తరి, దండశిక్ష.

సం. సమయదండ-(అర్థవిపరి.).

**సమయపడు** అ.క్రి. సంకేతితమగు.

సం. సమయ-. కాలం,ప్రతిజ్ఞ, తరి,

<సం. సమయ-+-ము+ పడు.

**సమయముగూడు** అ.క్రి. కలయుఏకీభవించు. ప్రబోధ. 4.63.

సం. సమయ-. కాలం, ఆచారం, సిద్ధాంతం, శపథం

<సం. సమయ-+-ము+కూడు[2].

**సమయముతెలుపు** అ.క్రి. అవసరం తెలుపు. హేమా. పు. 47.

సం. సమయ-.కాలం, భాష, నియమం, శాస్త్రం, హద్దు.

<సం. సమయ-+-ము+ తెలుపు.

**సమయించు** చూ. సమయు.

**సమయు** అ.క్రి. 1. చెడు, రూపరు. భార. ఆది. 6.275; 2. పట్టు, ఇంకు, కు.సం. 7.114; 3. చచ్చు. భార. భీష్మ. 3.101; 4. క్షీణించు, తగ్గు. భార. ద్రోణ. 6.275; 5. వ్యయమగు, చెల్లిపోవు. బసవ. 108పు. 20పం; 6. అడుగు, తగ్గు. రం.రా. సుందర. 262; 7. ఆరు, మలుగు. వేమ. 1.45; 8 పాయు, తొలగు. వేంక. మా. 2.91; 9. అస్తమించు, అగుపడకపోవు. పె.శకు. 2.209.

క. సమె, సవె, సని, నాశనంచేయు, ఖర్చుపెట్టు, సమయిసు, సవిసు, సవయిసు. ధరింపచేయు, సవర్, నశింపచేయు; త. చమై. (-వ్-,-న్త్-). పాడుచేయు, చంపు. నాశనంచేయు. చమైవు. నాశనం, చవు (చవు-త్త్-.) బలహీనమగు, తపు. నశించిపోవు, చివరికి వచ్చు, చనిపోవు, తపు-త్- నాశనంచేయు, తపు. తగ్గి

పోవు, తవల్. తగ్గిపోవు, చాపు ; మ. చవతీ. ఖర్చు పెట్టు ; కో. చమ్. వ్యయంచేయు, ఖర్చుపెట్టు ; పో. చూ. పర్జి. చమ్. చెడిపోవు, కుళ్ళిపోవు.

<మూ.ద.ద్రా.*చప్-/*తప్- ; *చవ్-వ్-/*తవ్-వ్-; *చమ్-వ్-/*తమ్-వ్-.

**సమయఁజూచు** అ.క్రి. సంహరించు, చంపు. <సమయు+-అ$^{7}$+చూచు. **సమయించు** స.క్రి. చంపు. కు.సం. 11.80. భార. విరా. 2.47 ; **2.** కూల్చు ; **3.** అణచు. <సమయు+-ఇంచు$^{3}$. **సమసిపోవు** స.క్రి. నశించు, చచ్చు, అలసిపోవు. <సమయు+-ఇ$^{13}$+పోవు.

**సమయసేనాపతి** వి. మతవిషయకమైన కార్యాల్ని పరీక్షించేవాడు, అధికారి. ద.హిం.శా. సంపు. 5.శా.సం. 136. క్రీ.శ. 1148.

సం. సమయ-కాలం, నిర్దేశం, ఆజ్ఞ, శాస్త్రం, హద్దు, సేనాపతిం.సైన్యాధిపతి.

సం. సమయసేనాపతి- (అర్థవిపరి.).

**సమయులు** వి.బ.వ. శైవసమయ పక్షంవారి మత, సమాజాలకు చెందిన సభ్యులు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 26. క్రీ.శ. 1412.

సం. సమయ-.వేళ, తరి, ప్రతిజ్ఞ.

<సం. సమయ-+-లు.

**సమరత** రూ. సమర్త, సమర్తు. వి. ప్రథమఋతువు. ఉ. హరి. 5.85.

సం. సమర్తు-, సమఋతు-. సమమైన ఋతువు.

<సం. సమర్తు-.

**సమరసారికలు** వి.బ.వ. ఒకరకంపక్షులు.

సం. సమర-.యుద్ధం, సారికా. పక్షివిశేషం.

<సం. సమరసారికా+లు (అర్థవిపరి.).

**సమరు** రూ. చమురు. వి. చమురు, నెయ్యి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 617. క్రీ.శ. 1145.

**సమరించు** స.క్రి. సంహరించు. రాజవా. 2.75.

సం. సమర-.యుద్ధం.

<సం. సమర-+-.ఇంచు$^{3}$.

**సమర్త** రూ.చూ. సమరత. వి. **1.** స్త్రీ ప్రథమఋతువు. క్రీడా. 1.80 ; **2.** యవ్వనం. వేణు.శ. 23.

**సమర్తగు** అ.క్రి. ఋతుమతిఅగు, ప్రథమరజస్వలఅగు.
**సమర్తపెట్టు** (-పెట్టు) అ.క్రి. సమర్తాడు. బహుళా. 577పు.
**సమర్తాడు** అ.క్రి. ప్రథమరజస్వలఅగు. ఉ. హరిశ్చ. 2.33. <సమర్త+ఆడు.

**సమర్తాడు** చూ. సమర్త.

**సమర్తు** రూ.చూ. సమరత. వి. ప్రథమఋతువు. శివరా. 3.84.

**సమర్థమగు** అ.క్రి. **1.** చాలిఉండు ; **2.** ఆగుదెంచు.

సం. సమర్థ-.శక్తిగలది, తగినది, హితమైనది.

<సం. సమర్థ-+-.ము+అగు.

**సమళాయించు** రూ. సమాళాయించు, సంబాళించు, సమ్మాళించు. స.క్రి. **1.** బుజ్జగించు ; **2.** కష్టంనుంచి బయట పడు, సమాళించు ; **3.** కాపాడుకొను.

హిం. సంభాల్‌నా. హానినుంచి రక్షించటం, పనిభారాన్ని మోయటం.

<హిం. సంభాల్ (నా)+-.ఇంచు$^{3}$.

**సమసకము** వి. శుద్ధాంధ్రపదాల సమూహం. అం.భా. 1.112.

సం. సమాసక-. సంక్షేపం, సంగ్రహం ; ప్రా సమాస- ; పా. సూస-.

<సం. సమాసక-.

**సమసందు** రూ. సవసందు. వి. **1.** సరిసందు, రాతిపేర్పులో ఒకదాని కొకటి ఎదురుగా వచ్చేసందు ; **2.** గొర్రుచాళ్ళ మధ్యసమంగా ఉన్న ఎడం.

సం. సమ-.సమానమైనది.

<సం. సమ-+సందు (మిశ్రస.).

**సమసము** వి. విన్నాణాల్లో ఒకటి.

సం. సమాస-.సంక్షేపం.

<సం. సమాస-.

**సమసారము** వి. జన్మ. ఆలుబిడ్డలతోడి ఉనికి, కాపురం. వీర. వి. 2.144.

సం. సంసార-. ప్రపంచం, పద్ధతి, ప్రపంచజీవయాత్ర, ప్రాపంచికవ్యామోహం ; ప్రా. సంసార- ;
క. సంసర-.బలగం, పరివారం, ప్రపంచం.

<సం. సంసార-.

**సమసిపోవు** చూ. సమయు.

**సమసీసము** వి. **1.** మల్లబంధవిశేషం. మల్లు. 3.69 ; **2.** సీసపద్యభేదం. ఆరింద్రగణాలమీద రెండుసూర్యగణాలున్న పాదాలు నాలుగు చెప్పి అవిూద ఒక ఆటవెలది, చేరిస్తే సమసీసం అవుతుంది.

సం. సమ-. సరిఐనది, తుల్యం.

**సమస్తప్రధాని** వి. సర్వప్రధాని, సకలామాత్యుడు. ద.హిం.శా. సంపు. 4.శా.సం. 1255.

సం. సమస్త-.అన్ని, ప్రధానిన్. ముఖ్యుడు.

<సం. సమస్తప్రధానిన్.

**సమస్య** వి. ఏకీకృతం, నిర్వర్తనం. నె.శా. కందుకూరు. 83. క్రీ.శ. 1526.

సం. సమస్యా. కవులసామర్థ్యాన్ని పరీక్షించటానికి పూరించటం కోసం ఇచ్చే పద్యపాదం మొ.వి.

<సం. సమస్యా (అర్థవిపరి.).

**సమాటం** వి. బరాబరి, సమానం.

సం. సమ-.తుల్యం, సమానమైనది, అట్. సంచరించు.

**సమానచెత్తు** వి. వాలు లేకుండా చదునుగా ఉన్న పెంకు కప్పు.

సం. సమాన-.తుల్యమైనది, హిం. ఛత్. చాందినీ, ఇంటికప్పు.

<సం. సమాన-.+హిం. ఛత్.

**సమానపాటు** వి. కూచాలు ఒకేవరసలో ఉండటం.

సం. సమాన-తుల్యమైన.

<సం. సమాన-.+పాటు. (మిశ్రస.).

**సమానము** వి. బరాబరి, సాటి.

సం. సమాన-తుల్యం, ఒకటి.

<సం. సమాన- (అర్థవిపరి).

**సమారాధన** వి. బ్రాహ్మణులు మొ. వారిసమారాధన. నె.శా. ఒంగోలు. 54.

సం. సమారాధన-.అర్చించటం, పూజించటం.

<సం. సమారాధన- (అర్థవిపరి.).

**సమానించు** స.క్రి. పోల్చు. దశా. 4.232.

సం. సమాన-. తుల్యం.

<సం. సమాన -+-ఇంచు³.

**సమాళాయించు** రూ.చూ. సమళాయించు. అ.క్రి. 1. బుజ్జగించు, బతిమాలు ; 2. కష్టంనుంచి బయటపడు ; 3. కాపాడు కొను.

**సమాహర్త్రి** వి. సుంకాలు, పన్నులు వసూలు చేయటానికి నియమింపబడ్డ ఉన్నతాధికారి. E.I. XXXI. 12. (700 A.D.).

సం. సమాహర్తృ-. పోగుచేసేవాడు, వసూలుచేసే వాడు.

<సం. సమాహర్తృ.

**సమిద** వి. చిదుగు. ఇందు.ప. 2.115.

సం. సమిధ్. చిదుగు, వంటచెరకు.

<సం. సమిధ్.

**సముకము** వి. ఎదురు. తాళ్ల.సం. 14.227.

సం. సమ్ముఖ-. ఎదురు.

<సం. సమ్ముఖ-.

**సముకు** వి. ఉగ్గుగిన్నె.

**సముఖము** వి. సమక్షం. ద.హిం.శా. సంపు. 6. శా. సం. 80.

సం. సముఖ-. మాటకారి, సమ్ముఖ-. సమక్షం.

<సం. సమ్ముఖ-.

**సముజాయించు** రూ.చూ. సముదాయించు. స.క్రి. బుజ్జగించు, ఓదార్చు.

**సముజాయిషీ** రూ.చూ. సంజాయిషీ. వి. సమాధానం.

**సముతు** రూ. సమ్మతు. వి. 1. రాజ్యవిభాగం. నె.శా. శాస్త్రు. 8. క్రీ.శ. 1651 ; 2. కట్టుబాటు. తాళ్ల సం. 15.180 ; 3. తాలూకాలో ఒకభాగం.

సం. సమితి-. సమూహం, సమ్మతి-. అంగీకారం.

<సం. సమితి-.

**సముతుకట్టు** స.క్రి. కట్టుకట్టు. **సముతుపడు** స.క్రి. కట్టుపడు. **సముతుపఱుచు** స.క్రి. కట్టుపరుచు. చంద్రాంగ. 3.66.

**సముతుఁడు** వి. సదృశుడు.

**సముదాయక్షేత్రము** వి. సమిష్టిగా వ్యవసాయం చేయబడే భూమి. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1281.

సం. సముదాయ-. సమూహం, క్షేత్ర-. పొలం.

<సం. సముదాయక్షేత్ర- (అర్థవిపరి.).

**సముదాయించు** రూ. సముజాయించు. స.క్రి. ఓదార్చు, ఊరడించు.

హిం. సమ్ఝూనా. నచ్చచెప్పటం.

<హిం సమ్ఝూ(నా).+-ఇంచు³.

**సముద్దారు** రూ. సముద్దారుడు. వి. సముతుకు అధికారి, తాలూకా అధికారి, జమీందారీ రోజుల్లో రైతులదగ్గర పన్నులు వసూలు చేసేవాడు.

ఉ. సముద్దార్. తాలూకా అధికారి.

<ఉ. సముద్దార్.

**సముద్దారుడు** రూ.చూ. సముద్దారు. వి. సముతు అధికారి.

**సముద్ది** వి. ఎచ్చు, అధికం.

సం. సమృద్ధి-. పెంపు, పెరుగుదల.

<సం. సమృద్ధి-.

**సముద్రకుమారిపేటు** వి. సముద్రం కెరటాలమాదిరిగా అంచుల్లో నేసే డిజైను.

సం. సముద్రకుమారీ. లక్ష్మి.

<సం. సముద్రకుమారీ+పేటు³.

**సముద్రపచ్చ** వి. ఉత్తరసర్కారు. దక్కను కర్ణాటక ప్రాంతాల్లో పెరిగే ఒకరకం తీగ (Argyreia speciosa).

సం. సముద్ర-. కడలి.

<సం. సముద్ర-+పచ్చ (మిశ్రస.).

**సముద్రపండు** వి. లేతపసుపురంగుపూలు, పెద్దఎర్రటిపళ్ళుకల ఒకరకం చెట్టు (Barringtonia racemosa).

సం. సముద్ర-. కడలి.

<సం. సముద్ర-+పండు (మిశ్రస.).

**సముద్రపాల** వి.ఉత్తరసర్కారు, దక్కను, కర్ణాటకప్రాంతాలల్లో పెరిగే ఒకరకం తీగ (Argyreia speciosa).

సం. సముద్ర-. కడలి.

<సం. సముద్ర-+పాల (మిశ్రస.).

**సముద్రపుటెంకాయ** వి. ఒకరకం చెట్టు (Lodoicea seychellarum).

సం. సముద్ర-. కడలి.

**సముద్రబిల్లలు** వి.బ.వ. ఒకరకమైనఆట. తాళ్ల.సం. 10.172.

సం. సముద్ర-. సాగరం.

<సం. సముద్ర-+బిల్ల+లు. (మిశ్రస.).

**సముద్రము** వి. పెద్దచెరువు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 684.

సం. సముద్ర-.సాగరం, కడలి.

<సం. సముద్ర- (అర్థవిపరి.).

**సముద్రలహరి** వి. సముద్రం కెరటాలమాదిరిగా అంచుల్లో నేసే డిజైను ; 2. సముద్రం కెరటాల నమూనాలో అంచు పెట్టి నేసిన చీర.

సం. సముద్రలహరీ. కడలికెరటం.

<సం. సముద్రలహరీ (అర్థవిపరి.).

**సమురుకొడుము** చూ. చమురు. వి. నూనెపోసి ఉంచటానికి ఉపయోగించే మట్టిపాత్ర

**సముసాపు** రూ.చూ. సమచాపు. వి. సమానంగా నేసిన రెండు పంచెలు.

**సమేతు** వి. దారి.

ఉ. అర. సమ్త్. దారి, మార్గం, పక్క, భాగం, వైపు, పాతికె.

<ఉ. సమ్త్.

**సమేలము** రూ. సమేళనము, సమేళము. వి. 1. కలిసినది,

జతకూడినది. చేరిక, గుమి. ఉ.హరి. 2.83 ; 2. ఒద్దిక విష్ణుపు. 5ఆ ; విఱ కూడినదైన, కలిసినదైన.

సం. సమ్మేల-. కూడిక : ప్రా సమ్మేల-.

< ప్రా. సమ్మేల-.

**సమేళనము** రూ.చూ. సమేలము. వి. 1. స్నేహం ; 2. చేరిక.

**సమేళము** రూ.చూ. సమేలము. వి. 1. కలయిక, జతకూడటం చేరిక, గుమి. తాళ్ల.సం. 14.285 ; 2. ఒద్దిక ; విఱ కూడినది, కలిసినది. విజయ. 1.79.

**సమోసా** వి. త్రికోణాకారంలో ఉండే భక్ష్యవిశేషం.

హిం. సమోసా. భక్ష్యవిశేషం ; ఉ.పార. సమోస. త్రికోణాకారంలో ఉండే ఒకవిధమైన పిండివంట, త్రికోణాకారంలో మడచిన శాలువా, చేతిగుడ్డ.

< ఉ. సమోస.

**సమ్‌జాయిషీ** రూ.చూ. సంజాయిషీ. వి. ఉత్తరం, ప్రతివచనం, సమాధానం.

**సంపగి** రూ.చూ. చనుపకము. వి. 1. చంపకం. (Michelia champaka) ; 2. వాసనలేని చిన్న సంపంగి పువ్వుల రంగు ; 3. గోధుమవన్నె మాదిరిరంగు ; 4. పసులోపు నలుపువన్నె ; 5. ఆకుపచ్చలో పసుపువన్నె ; 6. పండు పొగాకురంగు ; 7. ముదురు సస్యంరంగు.

**సంపగియ** రూ.చూ. చనుపకము. వి. సువాసన కలిగిన పూలనిచ్చే ఒకరకంచెట్టు (Michelia champaka).

**సంపగెలు** చూ. చనుపకము. వి.బ.వ. సంపంగిపూలు.

**సంపంగ** రూ.చూ. చనుపకము. వి. సువాసన కలిగిన పూలు పూసే ఒకరకంచెట్టు.

**సంపంగి** రూ.చూ. చనుపకము. వి. 1. చంపకం. ఉ హరి. 1.151 ; 2. ధాన్యంపేరు.

**సంపంగికావులు** వి.బ.వ. ఒకరకంవస్త్రాలు. హంస. 5,355. **సంపంగిచీర** వి. సంపంగిపువ్వు రేకులరంగుచీర. **సంపంగిదండ** రూ.చూ. సంపఁగిదండ. వి. సంపంగి.పూలతో గుచ్చినదండ. ప్రభా. 2.78. **సంపంగినూనియ** రూ.చూ. సంపెంగనూనె వి. సంపంగిపువ్వులతో చేసిననూనె. హర. 2.107. **సంపంగినూనె** రూ.చూ. సంపెంగనూనె. వి.సంపెంగ పువ్వులతో చేసిననూనె. హర. 4.81. **సంపంగిపువ్వు** వి. సంపెంగపువ్వు. **సంపంగిపూవడ్లు** వి.బ.వ. ధాన్యవిశేషం, సంపంగి పూవులా పచ్చగా ఉండేవడ్లు. హంస. 4.128.

**సంపంగియ** రూ.చూ. చనుపకము. వి. 1. చంపకం ; 2. ధాన్యవిశేషం పేరు.

**సంపంగె** రూ.చూ. చనుపకము. వి. 1. చంపకం, విక్ర. 1.133 ; 2. ధాన్యవిశేషంపేరు.

**సంపఁగి** రూ.చూ. చనుపకము. వి. 1. (సంపంగిపువ్వులా అందంగాఉండటంచేత) కుక్కకియ్యబడిన బిరుదు. మను. 4.32 ; 2. చంపకం. కవిక. 3.110 ; 3. ధాన్యవిశేషంపేరు.

**సంపఁగిదండ** రూ. సంపంగిదండ, సంపెఁగదండ. వి. సంపెంగపూదండ. ఉ. హరి. 1.151.

**సంపఁగియ** రూ.చూ. చనుపకము. వి. 1. చంపకం ; 2. ధాన్యవిశేషంపేరు.

**సంపఁగె** రూ.చూ. చనుసకము. వి. సంపంగిచెట్టు. ఉ.రా. 3.201.

**సంపచ్చుక్క** రూ.చూ. సంపతిచుక్క. వి. పిల్లలకోడి, కృత్తికానక్షత్రం. తొమ్మిదిచుక్కలు గుంపుగాఉండి అందులో ఒకటి పెద్దదిగా మిగిలినవి చిన్నవిగాను ఉంటాయి.

**సంపతక్క** రూ.చూ. సంపతిచుక్క. వి. పిల్లలకోడి. సంపతిచుక్క.

**సంపతిగీత** వి. నాపరాళ్ళ పరుపులో అతుకులమీద తాడుతో కొట్టేగీత.

**సంపతిచుక్క** రూ. సంపచ్చుక్క, సంపతక్క. వి. పిల్లలకోడి, కృత్తికానక్షత్రం. తొమ్మిదిచుక్కలు గుంపుగా ఉంటాయి, ఒకటిపెద్దదికాగా మిగిలినవిచిన్నవి.

**సంపతిముంత** వి. పెళ్ళిపందిరి చుట్టూ ఎర్రనీళ్ళు దిగదీయటానికి వాడే మట్టిపాత్ర.

సం. సంపద్. ఐశ్వర్యం.

**సంపతిలు** రూ. సంపతిల్లు. అ.క్రి. సమృద్ధమగు. విక్ర. 7.81.

సం. సంపద్. సంపద.

**సంపతిల్లు** రూ.చూ. సంపతిలు. అ.క్రి. సమృద్ధమగు.

**సంపతివెళ్ళు** అ.క్రి. వివాహంతర్వాత వధువు తల్లిగారింటికి పోవు.

సం. సంపద్. ఐశ్వర్యం

**సంపర్తి** వి. కరణం.

సం. సమవర్తిన్. అంతటాసమంగా ప్రవర్తించేవాడు, యముడు.

< సం. సమవర్తిన్.

**సంపసారి** రూ.చూ. సపాసారి. వి. కోమటి, వైశ్యుడు.

**సంపాటము** వి. నగని మొత్తంగా తూచటం.

సం. సంపాట-. నడుమ ఖండించటం.

< సం. సంపాట-. (అర్థవిపరి).

**సంపాదము** వి. 1. పూర్తిచేయటం ; 2. నెరవేర్చటం ; 3. పొందటం.

సం. సంపాదన-. గడించటం, పొందటం, నెరవేర్చటం, శుభ్రపరచటం, సిద్ధంచేయటం, కలిగించటం.

< సం. సంపాదన-

**సంపాదించుకొను** స.క్రి. 1. కలిగించుకొను, పూను, వహించు. శివత. సా. 337పం ; 2. ఆర్జించు.

సం. సంపద్. పొందు, నెరవేర్చు.

< సం. సంపద్ + -ఇంచు[3] + -కొను.

**సంపాదిల్లు** అ.క్రి. కలుగు. భార. ఆది. 6,249.

సం. సంపద్. పొందు, గడించు, నెరవేరు.

**సంపాళించుట** వి. కంసాలి చేసేపని.

**సంపాసారి** రూ. సంపసారి, సంపాసాలి. వి. కోమటి, వైశ్యుడు. గా. హరి. ఉ. 382.

సం. సంప్రసార-, సంప్రసారక-. విస్తరించేవాడు, వ్యాపించే వాడు ; ప్రా. సంపసారగ-, సంపసారయ-. తిరిగేవాడు, పచారు కొట్టేవాడు.

<[ప్రా. సంపసారగ-.

**సంపాసాలి** రూ.చూ. సంపాసారి. వి. కోమటి, వైశ్యుడు.

**సంపు** రూ.చూ. చంపు. స.క్రి. చంపు. హ.న. 2ఆ.

**సంపుటిచేయు** స.క్రి. మంత్రవర్ణాలను కలుపు.

**సంపెంగ** రూ.చూ. చనుపకము. వి. చంపకం. పండి. చ. 5.355 (Michelia chapamka).

**సంపెంగనూనె** రూ. సంపంగి నూనియ, సంపంగినూనె, సంపెఁగనూనె, సంపంగినూనె, వి. సంపంగిపూలరసంతో తయారైననూనె. క్రీడా. 101.

**సంపెఁగ** రూ.చూ. చనుపకము. వి. చంపకం. మను. 5.64.

**సంపెఁగదండ** రూ.చూ. సంపఁగిదండ. వి. సంపంగిదండ. శృం. నై. 5.92. **సంపెఁగనూనె** రూ.చూ. సంపెంగనూనె. వి. సంపంగినూనె. పారి. 2.9. **సంపెఁగబంతి** వి. సంపంగి పూలతో కట్టినబంతి, విక్ర. 3.49.

**సంపెట** రూ.చూ. సంబెట, వి. 1. సమ్మెట, ఇనుమునుసాగ గొట్టే సాధనవిశేషం. భాస్క. రా.యు. 1077 ; 2. చబుకు, కశ. హరిశ్చ. 2.141.

**సంప్రతి**[1] వి. లెక్కలు సరిచూసే పెద్దకరణం. కృష్ణరా. 2.67.

సం. సంప్రతి ఇప్పుడు. వెంటనే, సరిగా.

<సం. సంప్రతి (అర్థవిపరి.).

**సంప్రతి**[2] విశ. ఈడు, సమానం. చను. 2.42.

సం. సంప్రతి ఇప్పుడు, వెంటనే, సరిగా.

<సం. సంప్రతి (అర్థవిపరి.).

**సంప్రతించు** రూ.చూ. సంప్రదించు. వి. 1. సరిచూచు ; 2 లెక్కలు మొ. వి. సరిచూచు ; 3. సలహాఅడుగు.

**సంప్రదించు** రూ. సంప్రతించు. స.క్రి. 1. సరిచూచు. భీమ. 1.91 ; 2. లెక్క మొ. వి చూచు ; 3. సలహా అడుగు.

సం. సంప్రదా బాగాఇచ్చు.

<సం. సంప్రదా + -ఇంచు[3].

**సంబ**[1] రూ.చూ. సంబావు. వి. ఒకరకం సన్నబియ్యం.

**సంబ**[2] వి. చర్మకషా, సంబలేనువృక్షవిశేషం.

**సంబం** రూ.చూ. స్తంబం. వి. కాడి, ఇటుకతో రాళ్ళతో కట్టిగాని కొయ్యతో చేసికాని నిటారుగానిలిపి పైనున్న వస్తువులకు ఆధారంగా వాడబడే పొడుగాటి నిర్మాణం.

**సంబడము**[1] రూ. సంబళము. వి. 1. పాథేయం, దారిబత్తెం. కాశీ. 5.62 ; 2. ఆయుధవిశేషం. మైరా. 3.2 ; 3. వేతనం, బత్తెం. అచ్చరా. సుందర. 154.

సం. శంబల-, సంబల-. పాథేయం, దారిబత్తెం ; ప్రా. సంబల-, సంబలి ;

క. సంబళ, సంబళి ; తు సంబళ ; త. చంప ళం ; మ. చంబళమ్ ; తె. సాబుళ్మ్.

<ప్రా. సంబల-.

**సంబడము**[2] రూ.చూ. సంబరము. వి. 1. వేగిరపాటు ; 2. ఉత్సాహం ; 3. (వ్యంగ్యంగా) ఇదేనాలనటం.

**సంబడాలు** వి.బ.వ. ఉత్తరక్రియలు జరిగిన మర్నాడు వియ్యంకులు చేసే విందు.

**సంబడాలు** చూ. సంబడము[2].

**సంబడి** రూ.చూ. సంబళి. అవ్య. 'తొలగిపో' అనే అర్థంలో ప్రయోగించబడే శబ్దం.

**సంబడించు** రూ.చూ. సంబళించు. అ.క్రి. 1. చాలు, సమర్థమగు ; 2. సేకరించు.

**సంబడు** వి. వెర్రివాడు.

**సంబరమించు** చూ. సంబరము.

**సంబరము** రూ. సంబడము[2], సంభ్రమము. వి. 1. వేగిరపాటు. పండి.న. 4.290 ; 2. సంతోషం. పండి.చ. 5.357 ; 3. వేడుక. పండుగ. పండి.చ. 5.359. ప్రబంధ. 1.788 ; 4. తిరునాళ్ళు, ఉత్సవం.

సం. సంభ్రమ -. వేగిరపాటు ; ప్రా. సంభమ -. ఆదరం, భయం, క్షోభ ;

త. సంబుర్మ. సంభ్రమం. సంతోషం, వైభవం, హాయి.

<సం. సంభ్రమ-.

**సంబరమించు** స.క్రి. సంతసించు. పల్నా. 30. < <సంబరము + -ఇంచు[3]. **సంబరాలు** వి.బ.వ. భక్ష్య విశేషాలు హర. 2.121. <సంబరము + -లు.

**సంబరవల్లి** వి. ఒకరకం తీగ (Vitis indica).

**సంబరాలు** చూ. సంబరము.

**సంబరి** రూ.చూ. సంబళి. వి. చర్మకారుడు, చండాలుడు. మాలవాడు.

**సంబరు** రూ.చూ. సంబావు. వి. ఒకరకం సన్నబియ్యం.

**సంబరేణి** రూ.చూ సంబరేను. వి. చర్మకం. చర్మకష. ఒక రకం పొద.

**సంబరేనలం** చూ. సంబరేను.

**సంబరేను** రూ. సంబరేణి. వి. చర్మకం, చర్మకష, ఒకరకం పొద. ఆం.పదా.చర. 97, హంస. 4.22,

**సంబరేనలం** వి. చెమ్మనేలల్లోను, కొండలమీదా పెరిగే పాకుడు కలుపుమొక్క (Gratida monniera).

**సంబళకాఁడు** చూ. సంబళము.

**సంబళగాడు** చూ. సంబళము.

**సంబళము** రూ.చూ. సంబడము[1]. వి. 1. పాథేయం, దారి బత్తెం. వేంక. పంచ. 3.232 ; 2 వేతనం, బత్తెం. హంస. 1.226. రాధికా. 4.10 ; 3. ఆయుధ విశేషం.

**సంబళకాఁడు** రూ. సంబళగాడు. వి. జీతగాడు, కూలి వాడు. **సంబళగాడు** రూ.చూ. సంబళకాఁడు. వి. జీతగాడు, ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికింత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు.

**సంబళి** రూ. చెంబడి, శంబళి, సంబడి, సంబరి, సంబళీ. అవ్య. తొలగుము. పండి.చ. 1.210. పూర్వంఅస్పృశ్యులు సవర్ణుల ప్రాంతానికి వస్తే 'సంబళి, సంబళి' అని అరచే వారు. సంబళి అంటే మాదిగవాడు అని అర్థం.

సం. చర్మకార -. చండాలుడు, మాదిగవాడు ; ప్రా. చమ్మయర -, చమ్మార -. చమ్మారయ -. మాదిగ వాడు, ముచ్చు.

<ప్రా. చమ్మార-.

**సంబళిక** రూ.చూ. సంబెల. వి. అడపం, వక్కలాకుల తిత్తి, తాంబూలం. హంస. 1.207.

**సంబళికె** రూ.చూ. సంబెల. వి. అడపం, వక్కలాకులతిత్తి, తాంబూలం. ఉ.హరిశ్చ. 1.68.

**సంబళించు** రూ. సంబడించు. అ.క్రి. చాలు. సమర్థమగు, హరి. ఉ. 9.98.

**సంబళించుకొను** అ.క్రి. తీరుకొను. హరి.ఉ 2 52.

**సంబళీ** రూ.చూ. సంబళి. అవ్య. తొలగుము. శివరా. 3.40.

**సంబవులిడు** చూ. సంబవులు.

**సంబవులు**[1] రూ. సంబాళిగలు, సంబువులు, సమ్మాళి, సమ్మాళిగ, పమ్మాళిగలు, సమ్మాళిగెలు. వి.బ.వ. **1**. పాదరక్షలు. కు.సం. 6.17 ; **2**, పావకోళ్ళు. భార.భీష్మ. 3.7.

సం. చర్మపాదుకా. చెప్పులు ; ప్రా. చమ్మపాఉఆ ; క. చమ్మాళిగె. తోలుచెప్పు ; త. చెమ్మాళి.

<ప్రా. చమ్మపాఉ ఆ.

**సంబవులిడు** అ.క్రి. సేవకావృత్తిచేయు. <సంబవులు+ఇడు.

**సంబవులు**[2] రూ. సంబావులు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.127.

సం. సంభావ-, సంభావనా. సమ్మానం, గౌరవం, ప్రసిద్ధి.

<సం. సంభావ-+-లు.

**సంబాగవు** వి. ఏరుదాటే సాధనం.

**సంబారము** రూ. సంబారు, సంబారువు. వి. ఉప్పు, కారం మొ. వి. వేశవారం, ఉపస్కరణద్రవ్యం. భీమ. 1.60.

సం. సంభార -. సమూహం, సామగ్రి ; ప్రా. సంభార -, మసాలా మొ. దినుసులు, ద్రవ్యసంచయం, సమూహం ; పా. సంభార -. వెంట తీసుకొని పోయేది, భోజనసామగ్రి ;

క. చంబార, సంబర, సంబార, పోపుదినుసులు ; తు. సంబర. సంబార.

<ప్రా. సంభార-.

**సంబారితాడు** వి. ఊడ్తెను నిలబెట్టి కిందిగూటానికి బిగించే తాడు.

**సంబారు** రూ.చూ. సంబారము. వి. ఉపస్కరం. ఆం.పదా. పరి. 82, హంస. 1.113.

**సంబారుబుడ్డి** వి. సాంబారుపొడి వేసుకోవటానికి మూతి చిన్నదిగా పెట్టి చేసినట్టి మట్టిబుడుగ.

**సంబారువు** రూ.చూ. సంబారము. వి. ఉప్పు, మిరపకాయలు, చింతపండు మొ.వి.

**సంబాళిగలు** రూ.చూ. సంబవులు[1]. వి.బ.వ. పాదరక్షలు. యయా. 1.

**సంబాళించు** స.క్రి. **1**. ఆదరించు. పాంచాలీ. 2.39 ; **2**. సముదాయించు ; **3**. అదుపులో పెట్టుకొను.

ఒ. సంబాళా ; హిం. ఉ. సంభాల్నా.

క. సంబాళిసు. ఆదరించు ; త. సమాళి.

**సంబావు** రూ. సంబ[1], సంబరు. సంభావ. సంభావు, సాంబ, సాంబమ్, సాంబరు, సాంబవు. వి. ఒకరకం సన్నబియ్యం

క సంబె - నెల్లు ; త. చంపా. శ్రేష్ఠమైన ఒక; రకం.వరి ; మ. చంపా.

**సంబావులు** రూ.చూ. సంబవులు[2]. వి.బ.వ. ధాన్యవిశేషం.

**సంబుఁడు** వి. శివుడు. బసవ. 105పు. 2పం.

సం. శంభు -, శంభువు - శివుడు ; ప్రా. సంభు - శివుడు, సంబ -. శివుడు ; అ.మా. సంబ -. శివుడు . క. సంబు.

<ప్రా. సంభు-.

**సంబువులు** రూ.చూ. సంబవులు[1]. వి.బ.వ. పావకోళ్ళు. పండి. చ. 5.306.

**సంబెట** రూ. సంపెట, సమ్మిట. సమ్మెట. వి. **1**. చబుకు భార. విరా. 4.73 ; **2**. సుత్తి. రాతిపనివాళ్ళువాడే పెద్ద సుత్తి. వరాహ. 11.105.

సం. సంఘేట -, సంస్ఫేట — పరస్పరఘర్షణ చర్మేష్ట-; ప్రా. సమ్మేట్ట -. ప్రహరణవిశేషం, చర్మవేష్టిత పాషాణం ; అ.మా. చమ్మేరగ-. కమ్మరివాని ఇనుమును సాగగొట్టే సుత్తి ;

క. చమ్మట్ ఇగె. ఒకరకంసుత్తి ; తు. చమటిగె ; త. చమ్మట్టి. కంసాలి పెద్దసుత్తి, ఒకవిధమైన మోటు బండి, చమ్మట్టి - క్కూటమ్. లోహాన్నికొట్టి పలుచగా చేయటానికి ఉపయోగపడే సుత్తి ; మ. చమ్మట్టి - క్కూటమ్ ; తొ. సామొటి. సుత్తి.

< సం. సంఫేట -.

**సంబెరమిచ్చు** చూ. సంబెరము.

**సంబెరము** వి. **1**. సానుభూతి. కు. సం. 5,83 ; **2**. జలాంజలి. హర. 3.92.

సం. శంబర -. జలం ;

క. సంబర. + నీరు.

< సం, శంబర -.

**సంబెరమిచ్చు** అ.క్రి. జలాంజలి ఇచ్చు. హర. 3. 92 ; **2**. సానుభూతిచూపు. <సంబెరము+ఇచ్చు.

**సంబెరముచూపు** అ.క్రి. సానుభూతిచూపు.

**సంబెల** రూ. సంబళిక, సంబళికె, సంబెళ. వి. పక్కలాకుల తిత్తి. పండి. చ. 5,351, హర. 7.12.

సం. సంపుటక -, సంపుటికా. పెట్టి, బుట్ట ; ప్రా. సంపుడ -; పా. సంపుట - ;

క. సంబళిగె. మూతగలపెట్టె ; త. చంపళి. అడపం, తిత్తి.

< ప్రా. సంపుడ -.

**సంబెలపెట్టె** వి. వక్కలాకులు పెట్టుకొనేపెట్టె.

**సంబెళ** రూ.చూ, సంబెల. వి. **1**. వక్కలాకులతిత్తి, అడపం. భీమ. 1.37 ; **2**. సంపుటం. ప్రబోధ. 2.8 ; **3**. దర్భలు మొ. వాటితో అల్లిన సజ్జ.

**సంబోధన** వి. ఆజ్ఞ. E. 1. సంపు. 11. శా. సం, 17.

సం. సంబోధన -, పిలుపు, వివరణ, సంబుద్ధి,

< సం. సంబోధన -. (అర్థవిపరి.).

**సంభ్రమము** రూ.చూ. సంబరము. వి. తొట్రుపాటు, వేగిరిపాటు.

యయా. 3.

**సంభావ** రూ.చూ. సంబావు. వి. ఒకరకం సన్నబియ్యం.

**సంభావు** రూ.చూ. సంబావు. వి. ఒకరకంసన్నబియ్యం.

**సంమ** వి. సీమవిభాగం. నె. శా. తా్ర. 5. క్రీ.శ. 1406.

సం. సీమన్. సరిహద్దు, ఎల్ల.

< సం. సీమన్.

**సమ్మకరలచీర** వి. అడుడికట్టేబట్ట.

**సమ్మక్క (-అక్క)** వి. ఒకగ్రామదేవత.

**సమ్మతు** రూ.చూ. సముతు. వి. సముతు, రాజ్యపాలనా విభాగం. E.C 9. అనెకల్ - 13. క్రీ.శ. 1773.

**సమ్మదము** వి. సమ్మతం, ద.హిం.శా. సంపు. 10. శా.సం. 69. క్రీ.శ. 1139.

సం. సమ్మద -. అధికసంతోషం, సౌఖ్యం, ఆనందం. సమ్మత -. అంగీకారం, ఇష్టం.

**సమ్మంధము** వి. సంబంధించినది. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 261. క్రీ.శ. 1214, తాళ్ల. సం. 16-1-42.

సం. సంబంధ -. తగిన, కలయిక, చుట్టరికం.

< సం. సంబంధ -.

**సమ్మాను** వి. నౌకావిశేషం, చీనాదేశీయుల పద్ధతిలో నిర్మించిన ముక్కోయ్య పడవ. హర. 1.27.

మలె. సమ్మన్. మూడుపలకలపడవ.

< మలె. సమ్మన్.

**సమ్మాళి** రూ.చూ. సంబావులు[1]. వి. పాదరక్ష, పాదుక. నిరంకు. 4.67.

**సమ్మాళిగ** రూ.చూ. సంబావులు[1]. వి. పాదరక్ష, పాదుక.

**సమ్మాళిగతొండలు** వి.బ.వ. (భగవంతుని) పాదుక సేవకులు. ద్వి. పరమ. వి. 3.212.

**సమ్మాళిగలు** రూ.చూ. సంబవులు[1]. వి.బ వ. పాదరక్షలు. కళా. 2.17.

**సమ్మాళిగెలు** రూ.చూ. సంబవులు[1]. వి.బ.వ. పాదరక్షలు. వేంక. ఆం. 68.

**సమ్మాళించు** రూ.చూ. సముళాయించు. స.క్రి. 1. బుజ్జగించు ; 2. కష్టంనుండి బయటపడు ; 3. కాపాడుకొను.

**సమ్మిట** రూ.చూ. సంబెట. వి. పెద్దసుత్తి.

**సమ్మిలు** వి.బ.వ. ఒకతెగబిచ్చగాళ్ళు, చేనేతపనివారిదగ్గర వంశకథలు చెప్పి అడుక్కొనేవాళ్ళు.

**సమ్మెట** రూ.చూ. సంబెట. వి. 1. చబుకు : 2. పెద్దసుత్తి.

**సమ్మెటకోల** వి. కొరడా.

**సయాట** రూ.చూ. సయ్యాటము. వి. 1. పరిహాసం. శ్రీరంగ. 5.77 ; 2. క్రీడ.

**సయాటము** రూ చూ. సయ్యాటము, వి. 1. పరిహాసం ; 2. క్రీడ.

**సయాతము** వి. స్వతంత్రం.

సం. స -. సహితమైనది, కూడినది, యాత -. కదచినది, గతం.

< సం. సయాత -. (అర్థవిపరి.).

**సయాము** వి. సొంతం.

సం. స్వయమ్. తనంతటతాను, స్వకీయ. తనకు సంబంధించిన.

< సం. స్వయమ్.

**సయి** రూ.చూ. సై. విశ. సహాశబ్దార్థకం.

**సయిదోడు** రూ.చూ. సైదోడు. వి. 1. తోబుట్టువు. క్రీడా. 78 ; 2. సహోదరుడు. వరాహ. 4.13,

**సయికము** రూ. సైకము. వి. 1. సూక్ష్మదృష్టి. భార. అను. 5.277 ; 2. సూక్ష్మత్వం ; విశ. సూక్ష్మం, చిన్నది.

సం. సూక్ష్మ -. చిన్నది.

**సయికిలు** రూ. సైకిలు. వి. బయిస్కిలు, సైకిలు.

ఇం. *Cycle.* చక్రం, వృత్తం, Bycycle సైకిలు

< ఇం. Cycle.

**సయిగ** రూ.చూ. సైగ. వి. 1. జాడ, సన్న ; 2. సంజ్ఞ, హస్తాదులసంజ్ఞ.

**సయిచు** రూ.చూ. సైంచు. స.క్రి. ఓర్చుకొను, సహించు.

**సయించు** అ.క్రి. రుచించు. ద్వి. బాగ. 3.

సం. సహ్ -. భరించు ; ప్రా. సహ -, సహిష్ణుత : అ.మా. సహ ఈ ;

క. సయిచు, సహిసు ; తు. సయిసుని, సహసుని. ఓర్చు. బలపరుచు ; త. చకి. సహించు; క్షమించు, భరించు, చకిప్పు. సైచు ; మ. సహిక్కె. ఓర్చు, భరించు, చకిప్పు. సైచు, ; మ. సహిక్కె. ఓర్చు' భరించు, క్షమించు.

< ప్రా. సహ - + ఇంచు[3].

**సయింపు** రూ.చూ. సైంపు. వి. సహనం. **సయింపుడు** రూ.చూ. సైంపుడు. వి. సహనం.

**సయించు** రూ.చూ. సైంచు. అ.క్రి. 1. ఇష్టమగు ; 2. రుచించు ; 3. సహించు, ఓర్చు ; స.క్రి. ఓర్చుకొను, సహించు.

**సయింపు** రూ.చూ. సైంపు, వి. సహనం. ఓర్పు, తాల్మి.

**సయితము** రూ. సైతము. అవ్య. కూడ. భాస్క. రా. అయోధ్యా. 201.

సం. సహిత -. కూడా ; ప్రా. సహిఅ -, సహిఇ, యుక్తం ; పా. సహిత -.

< సం. సహిత -,

**సయితుడు** వి. సూర్యుడు.

సం. సవితృ. సూర్యుడు.

< సం. సవితృ -.

**సయిదము** రూ.చూ. సైదము. వి. గోధుమపిండి

**సయిను[1]** రూ.చూ. సైను[1]. వి. ఒకరకంబట్ట.

**సయిను[2]** రూ.చూ. సైను[2]. వి. గుర్తు.

**సయిను[3]** రూ.చూ. సైను[4]. వి. చేవ్రాలు.

**సయిందము** రూ.చూ. సైందము. వి. గోధుమపిండి.

**సయింపు** చూ. సయించు.

**సయింపుడు** చూ. సయించు.

**సయింపు** చూ. సయించు.

**సయిరణ** రూ.చూ. సైరణ. వి. సహనం, క్షాంతం, ఓరిమి.

**సయిరించు** రూ.చూ. సైరించు. అ.క్రి. తాళు, సహించు. భాగ. 10.4.1149.

**సయొద్ధ** రూ. సయోద్దె, సయ్యొద్ధ, సయ్యొద్దె, సయ్యోద్ధ, సయ్యోద్దె. వి. 1. చేరిక ; 2. స్నేహం.

సం. సయోధ్య-. ఒకజాతిలేక ఒకతెగకు చెందినవాడు.

<సం. సయోధ్య-

**సయోద్దె** రూ.చూ. సయొద్ధ. వి. 1. చేరిక ; 2. స్నేహం.

**సయ్యట** రూ.చూ. సయ్యాటము. వి. 1. పరిహాసం, హేళన ; 2. అశ్రద్ధ ; 3. స్త్రీపురుషుల పరిహాసం ; 4. లీల.

**సయ్యదానీ** వి. సయ్యదువంశపుస్త్రీ.

ఉ. అర. సైయ్యద్. సయ్యదువంశం.

<ఉ. సైయ్యద్.

**సయ్యదు** రూ.చూ. సైదు. వి. మహమ్మదీయులలో ఒకతెగ.

**సయ్యాట** రూ.చూ. సయ్యాటము. వి. 1. పరిహాసం. వేంక. పంచ 4.724 ; 2. కలసిఆడటం. యయా. 3.42 ; 3. అశ్రద్ధ ; 4. స్త్రీపురుషుల పరిహాసం ; 5. లీల.

**సయ్యాటించు** అ.క్రి. పరిహసించు. పాండు. 4.254.

**సయ్యాటము** రూ. సయాట, సయాటము, సయ్యట, సయ్యాట. వి. 1. పరిహాసం. కాశీ. 4.103 ; 2. సహక్రీడ. యయా. 3.42.

**సయ్యాటించు** చూ. సయ్యాట.

**సయ్యారు** (-ఊలు) వి. ప్రత్యేకించి కొండప్రాంతాల్లో పెరిగే సువాసన పూలు కలిగిన ఒకరకం చిన్నచెట్టు (Murraya exotica).

**సయ్యొద్ధ** రూ.చూ. సయొద్ధ. వి. 1. చేరిక ; 2. స్నేహం.

**సయ్యొద్దె** రూ.చూ. సయొద్ధ. వి. 1. చేరిక ; 2. చెలిమి, స్నేహం.

**సయ్యోద్ధ** రూ.చూ. సయొద్ధ. వి. 1. చేరిక ; 2. చెలిమి, స్నేహం.

**సయ్యోద్దె** రూ.చూ. సయొద్ధ. వి. 1. చేరిక ; 2. స్నేహం.

**సయ్యేయు**(-వేయు) స.క్రి. కుండలు కాల్చటానికి ముందు వెంట్రుకలు, మిరపకాయలు, ఉప్పు మొ. వి, చేర్చి దిష్టితీసి ఆముపొయ్యిలో వేయు.

**సరం**[1] రూ. సరాల. వి. 1. అడ్డదూలం, పంచస్తంభాల మీదవేసే అడ్డవాసం ; 2. గుజ్జు, కామర్లలో ఒకటి ; 3. ఆసరకట్టె, దూలాలస్తంభాల మీదనుంచి కదలకుండా బిగించిన చెక్క ; 4. పంకాబట్టి దగ్గర తిత్తులు దూర్చటానికి వీలుగాకట్టిన మట్టిదిమ్మ.

**సరంవాసం** రూ. సరమాసం. వి. గుడిసెవెనుగ్రకు సమాంతరంగా ఉండి పరుపువాసాలను మోసేవాసం. **సరందూలం** వి. 1. గంటదూలానికి ఆధారంగా గోడలమీద వేసే చిట్టచివరివాసం ; 2. పంచస్తంభాలమీద వేసే అడ్డవాసం. **సరప్పలక** వి. దూలాలకింది మొగరాలను కలిపేవాసం. <సరం[1]+పలక. **సరప్పీట** వి. మొగరం మీది సరప్పట్టికింద వేసినపీట. <సరం[1]+పీట. **సరబోదె** వి. దూలాలకింది మొగరాలను కలిపేఅడ్డవాసం. <సరం[1]+బోదె. **సరమాసం** రూ.చూ. సరంవాసం. వి. గుడిసె పెనుగ్రకు సమాంతరంగా ఉండి పరుపు వాసాలను మోసేవాసం. **సరంపట్టె** వి. 1. సరాలను (గుజ్జులను) మోసేపట్టె ; 2. దూలాలకింది దారు తుంక కిందుగా వేసినవాసం.

**సరం**[2] రూ.చూ. తరం. వి. ఒంచె, పట్టను జోలెలాగా మడిచి తాళ్ళతో బద్దకు వేలాడదీసిన సాధనం.

**సరక** రూ. సరకము. వి. నెత్తురు పారుకొనేరోగం.

సం. సరక-. తిన్ననిమార్గం, సరకా. గమనం, పోవటం.

<సం. సరకా (అర్థవిపరి.).

**సరకటము** వి. 1. సంకటం ; 2. తొందర.

క. సరకటిసు. ముందుకుతొందరగా పోవు.

**సరకత్తు** వి. ఊరేగింపు.

**సరకము** రూ.చూ. సరక. వి. మలం.

**సరకలకట్టె** రూ.చూ. సారికోలకట్టె. వి. సారెనుతిప్పే కర్ర.

**సరకాయించు** రూ చూ. సర్కాయించు. స.క్రి. సర్దుకొను.

**సరకారు** రూ.చూ. సర్కారు. వి. ప్రభుత్వం.

**సరకు**[1] రూ. సరుకు[2]. వి. 1. అమ్మదగిన వస్తువు. భార. అను. 5.104 ; 2. సొమ్ము. భార. అను. 5.108 ; 3. సామగ్రి, వస్తుసముదాయం, వస్తువు. భార. మౌసల. 132.

క. సరకు, సరక్కు. వస్తువులు, రకరకాల విలువైన వస్తువులు ; తు. సరకు. వస్తువులు, చరకు. వస్తువులు, సరుకులు ; త. చరక్కు. వస్తుసముదాయం, బంగారం, మందులు మొ. సామగ్రి ; మ. చరక్కు. విలువైన వస్తువులు ; కో. చర్క్. కూరలో వేసే సుగంధద్రవ్యాలు.

పో.చూ.సం. సరక-. కదలటం, బయల్దేరటం, వర్తకుల బిడారు,

**సరకులు** వి. బ. వ. దినుసులు, వస్తువులు. నె.శా.

పో.చూ. సం. సరక-. కదలటం, బయల్దేరటం, వర్తకుల బడారు.

ఒంగోలు. 58. క్రీ.శ. 1310. **సరకుసప్పట** వి. సరకులు. వేంక. పంచ. 1.74.

**సరకు**[2] వి. లెక్క, లక్ష్యం. భార. ఉద్యో. 2.263.

క. సరకు. గౌరవం, లక్ష్యం.

**సరకుగఁజూచు** స. క్రి. సరకుచేయు. <సరకు[2]+ అగు+ - అ[7]+చూచు. **సరకుగాఁగొను** స.క్రి. లెక్క చేయు, లక్ష్యపెట్టు. భార. విరా. 3.94. <సరకు[2]+అగు +అ[7]+కొను. **సరకుఁగొను** (-కొను) అ.క్రి. లక్ష్యపెట్టు. పి.శకు. 3 225, భార. ద్రోణ. 2.15.

**సరఖా** వి. కన్నం, దొంగతనం.

**సరగము** వి. బంగారుపూస.

సం. స్వర్ణగ-. బంగారం పొందింది.

<సం. స్వర్ణగ-.

**సరగు** వి.శె. అనా. 1. త్వరగా, చప్పున, శీఘ్రంగా. శృం. నై. 6.46 ; 2. వేగం. యయా. 3.33.

క. సరక్కనె. వడిగా, వేగంగా, సరసరనె. తొందరగా ; త. చరక్క. త్వరగా, శీఘ్రంగా.

పో.చూ. సం. స్రాక్ వేగంగా.

**సరంగు** రూ.చూ. సరాంగు. వి. ఓడమాలిమికాడు, నావికుడు.

**సరచు** రూ.చూ. చఱచు. స.క్రి. 1. మొక్కపోయిన కత్తి మొ. వారివాదరను కాచిసరిచేసి పదునెక్కించు ; 2. గట్టిగా కొట్టు ; 3. ఎడమచేత్తోరాయితో వాటలో భాగంలోను కుడిచేత్తో సలపతో వాటపైభాగంలోను చేతిమీద కుండను

తిప్పుతుంటూ పాత్ర ఆకారం పూర్తిగా వచ్చేటట్లు సాగగొట్టు.

సరజా వి. సింహపు బొమ్మ.

హిం. సర్ జా. గొప్పవ్యక్తి, ప్రధానాధికారి, సింహం; ఉ. పార. షర్ జ. భయంకరమైన, గర్జించేటటువంటి, ఉగ్రంగాఉండే.

< ఉ. షర్ జ.

సరంజా రూ.చూ. సరంజామా. వి. వస్తువులు.

సరంజాం రూ.చూ. సరంజామా. వి. 1. సరకులు, సామాను; 2. తయారు, సర్దుకోవటం.

సరంజామా రూ. సరంజా, సరంజాం. వి. 1. వస్తువులు; 2. తయారు, సర్దుకోవటం.

ఒ. సారంజామ్; హిం. సర్ అంజామ్. సామానులు. ఫర్నిచరు, పరికరాలు, ఉపకరణాలు; ఉ. పార. సర్-అంజామ్. పరికరాలు, ఫర్నిచరు, వస్తువులు, సామగ్రి, ముగింపు, చివర, ఇంటిసామాను, పాత్ర సామాను, సంభారం, విద్య;

త. సరంజామ్.

< ఉ. సర్-అంజామ్.

సరంజామాచేయు అ.క్రి. సరఫరాచేయు.

సరటాలు రూ. సరడాలు. వి.బ.వ. భక్ష్యవిశేషం.

సరటు చూ. సరి[5].

సరటుగుంజ చూ. సరి[5].

సరటుమోకు చూ. సరి[5].

సరట్ట చూ. సరి[5].

సరట్టగుంజ చూ. సరి[5].

సరట్టి చూ. సరి[5].

సరట్టిగుది చూ. సరి[5].

సరట్టిబడితె చూ. సరి[5].

సరట్టు చూ. సరి[5].

సరట్టుగుది చూ. సరి[5].

సరట్లతాడు చూ. సరి[5].

సరడాలమూకటి చూ. సరడాలు.

సరడాలు రూ.చూ. సరటాలు. వి.బ.వ. భక్ష్యవిశేషం.

సరడాలమూకటి వి. సరడాలు అనే పిండి వంటలు తయారుచేయటానికి వాడే జల్లిమూకుడు.

సరడు వి. 1. భూషావిశేషం, స్త్రీలు మెడలో పెట్టుకొనే బంగారు అల్లికతీగ; 2. మంగళసూత్రాలు బిగించే దారంలాఉండే బంగారుదండ.

సరణి వి. రీతి, విధం. విక్ర. 1.30.

సం. సరణి-. తోవ, దారి.

< సం. సరణి-.

సరత వి. చెమట.

సం. స్వేద-. చెమట.

సరతాణిలగ్గ చూ. సురతాణి, లగ్గ. వి. సేన కోటలో ప్రవేశించటం.

సరత్తు రూ.చూ. షరతు. వి. 1. నిబంధన; 2. అగ్రిమెంటు.

సరదా రూ. సర్దా. వి. వినోదం, విలాసం, ఆనందం.

ఒ. సార్దా. వినోదం; హిం. ఉ. సర్ద్. చల్లని, సర్దా. శ్రేష్ఠమైన కర్బూజా.

< ఉ. సర్దా.

సరదాకు చూ. తాఁకు. వి. 1. రౌతు; 2. యోధుడు.

సం. శరధారిన్. బాణాల్ని ధరించేవాడు, శర-. బాణం.

< సం. శరధారిన్.

సరదాడు(-త్రాడు) వి. 1. తీపుతాడు, జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు; 2. పెట్టెళ్ళబదులు ఎద్దుల మెడ కిందుగా తీసి కాడికి కట్టేతాడు.

సరదారు రూ. సర్దారు. వి. 1. నాయకుడు. ద. హిం. శా. సంపు. 7. శా. సం, 563. క్రీ. శ. 1655; 2. శూరుడు.

ఒ. బెం. సర్ దార్; హిం. సర్దార్; మరా. సర్దార్. సైన్యంలో ఒక ముఖ్యాధికారి; ఉ. సర్-దార్. శాసకుడు, నాయకుడు;

క. సరదార, సర్ దార, ప్రధానాధికారి, ఛీఫ్ఆఫీసర్. యువరాజు, నాయకుడు; త. సర్ తార్; మ. సర్ దార్.

< ఉ. సర్-దార్.

సరదు రూ. సద్దు. అ. క్రి. 1. సెరవు వ్యాపింపచేయు. యయా. 4.38; 2. పంచు, విభజించు. పరమ. 4.236,

సరదుకొను రూ. సద్దుకొను. స.క్రి. పంచుకొను. ద్వి. పరమ. వి. 1.44.

సరద్దు చూ. సరి[5].

సరద్దుగోడ చూ. సరిహద్దు.

సరంతీలు వి. బ. వ. వస్త్రవిశేషాలు. హంస. 5.356.

సరందప్ప చూ. సరము[2].

సరపణి రూ.చూ. సరిపణి. వి. 1. ఇనుపగొలుసు. ద్వి. పరమ. వి 1.38; 2. బంగారం మొ. వాటిగొలుసు. ద్వి. పరమ. వి. 4.274.

సరపదకం వి. చక్రపతకం. TTDES. సంపు. 3. క్రీ. శ. 1514.

సం. సర-దండ, పదక-. పతకం.

< సం. సరపదక-.

సరపరా రూ.చూ. సరఫరా. వి. సమకూర్చటం, అమర్చటం.

సరపరాయి రూ.చూ. సరఫరా. వి. సమకూర్చటం, అమర్చటం.

సరపాతబండ రూ. సరిపాతబండ. వి. సర్వేటప్పుడు సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

సరపువ్వులు చూ. సరము[1].

సరప్పలక చూ. సరం[1].

సరప్పీట చూ. సరం[1].

సరఫరా రూ. సరపరా, సరపరాయి, సరఫరాయి, సరబరాయి, సర్వరా, సర్వరాయి. వి. 1. సమకూర్చటం; 2. అమర్చటం.

ఉ. పార. సర్ బర. నిభాయించటం, నడిపించటం, నిర్వాహకం;

క. సరబరాయి. ప్రయాణానికి కావలసినవి సిద్ధం చేయటం; త. చర్ ప్పిరాకి, చర్ ప్పిరాయి.

< ఉ. సర్ బర.

సరఫరాచేయు స.క్రి. ఇచ్చు: అ.క్రి. నడిపించటం.

సరఫరాయి రూ.చూ. సరఫరా. వి. సమకూర్చటం, అమర్చటం.
సరబడి వి. ద్వారం, ఆశ్రయం. నార. పంచ[1]. ఆ, రామాభ్యు. 6.198.
త. సరపడి, సరసడి. కుటుంబం ;
సం. సృప్. నడచు.
సరబరాయి రూ.చూ. సరఫరా. వి. సమకూర్చటం, అమర్చటం.
సరబోదె చూ. సరం[1].
సరమ వి. శ్రమం.
సం. శ్రమ-. అలసట, పరిశ్రమ ; ప్రా. అ. మా. పా. సమ-. ఖేదం, ఆయాసం, పరిశ్రమ ;
క. సవ ; మ. చిరమం.
<సం. శ్రమ-.
సరమగొను(-కొను) అ.క్రి. శ్రమపడు. రామాభ్యు. 7.216.
సరమాసం చూ. సరం[1].
సరము[1] వి. 1. మాలిక, దండ. నీలా. 1.13 ; 2. బాణం. పురుషోత్తమ కవీయం. 131.
సం. సర-. హారం, దండ, బాణం ; ప్రా. సర-. బాణం ;
అ.మా. పా. సర- ;
క. సర ; త. చరమ్ ; మ. చరం.
<ప్రా. సర-.
సరపువ్వులు వి.బ.వ. దండగా గుచ్చేపువ్వులు. పిఃశకు. 1.27. ఆము.5.106.
సరము[2] వి. ముక్కుగాలి. ఉ. హరి. 3.120.
సం. స్వర - ; ప్రా. సర- ;
క. సర ; త. చరమ్.
<ప్రా. సర-.
సరందప్పు అ.క్రి. 1. దాహంతో గొంతెండిపోవు ; 2. బొరపోవు. <సరము[3]+తప్పు.
సరంబ రూ.చూ. సరంబి. వి.దొల్లుమిద్ది, ఆకు లేక తడిక కప్పు మీద మట్టిమేగిన మిద్దె.
సరంబి రూ.చూ. సరంబీ. వి. దూలానికి పనికివచ్చేమొద్దు.
సరంబీ రూ. సరంబ, సరంబి. వి. 1. అటుకు, వస్తువులు పెట్టుకోవటానికి వీలుగా గోడలోపాతిన చిన్న గూటాలమీద ఇంటికప్పు కింద అమర్చినబల్ల ; 2. ఒల్లకూర్చు, మిద్దె.
సరళి వి. కలయికలున్న సరిగమపదని అనే సప్తస్వరాల గ్రామం. ప్రబంధ. 1.100.
క. సరళె. స్వరగ్రామం. త. సరళి.
సరళిస్వరము వి. వివిధాలైన కలయికలతో కూడిన సరిగమపదని అనే సప్తస్వరాల వరస.
సరవ రూ. సర్వ. వి. 1. నీళ్ళుకాచటానికి వాడే అండాలాంటి మట్టిపాత్ర ; 2. చిన్నకడవ, బుంగ, బుడ్డి ; 3. వంటకు వాడే చిన్నమట్టిపాత్ర.
సం. శరావ -.మూకుడు ; ప్రా. సరావ-.
<ప్రా. సరావ-
సరవడి రూ. సలుగుడు. వి. 1. ఈడిక, గడ్డి మొ. వాటిని తెచ్చేబండిపరంలాంటి సాధన విశేషం. అం.భా. 2.8 ; 2. బరువు బండల్నిలాగటానికి ఉపయోగించే చక్రాలు లేని మొరటు కొయ్యచక్రం ; 3. చక్రాలులేని లాగుడుబండి.
సరవత్తి వి. ఒకరకం బాణసంచు. ప్రబంధ. 1.788.
సరవి[1] యా. ప్రావి. వి. క్రమం, వరుస. జైమినిభా. 8.143 ; 2. తీరు, విధం. ప్రభా. 5 23 ; 3. ఒప్పు, అందం. రామాభ్యు. 5.101.
క. సరవి.తోడు, తీగ.
సరవి[2] రూ.చూ. సరుగుడు. వి. ఆస్ట్రేలియానుంచి తీసుకొనిరాబడి సముద్రతీరపు ఇసుక నేలల్లో పెంచబడి వంటచెరకుగా ఉపయోగపడే చెట్టు.
సరవెంద రూ. సెరవంజి. వి. సెరవెంద, తీక్ష్ణగంధ వృక్ష. విశేషం.
సరస రూ. సరుస. వి. 1. దాపు, పార్శ్వం, పక్క. ఉ. హరి; 4.21 ; 2. వరస, శ్రేణి. భాగ. 10పూ. 1028 ; 3. సమీ. పం. అచ్చ.రా. కిష్కిం. 16 ; 4. సమక్షం. శుక. 1.285 ; 5. ఆసనార్థం. అం.భా. 2.165.
సం. సదృశ-.సమానం. సాటి ; ప్రా. సరిస-. తుల్యం సమానం ; జై.మహా. జై.శౌ. అ.మా. అప. సరిస-. పోలిక, సాదృశం ;
క. సరిస. సమత, సామ్యం.
<ప్రా. సరిస-.
సరసపట్టె వి. దూలాలపై ఉన్న గుజ్జుపీటలమీదుగా వెనుగాడి కిందుగా వేసేవాసం. సరసబాన వి. పెళ్ళిరోజుల్లో నవధాన్యాలుపోసి దీపారాధన చేయటానికి ఉపయోగించే బాన.
సరసమాడు చూ. సరసము.
సరసము వి. 1. సయ్యాట. పరిహాసం, నవ్వులాట. దశా. 7.41 ; 2. పరిహాసవాక్యం. హంస. 1.241.
సం. సరస-.రసంతోకూడిన, రుచిగల.
<సం. సరస-(అర్థవిపరి.).
సరసమాడు అ క్రి. హాస్యమాడు, సరసంగాపలుకు. భాస్క.రా. బాల. 687, శృం. నై. 1.37. <సరసము+ఆడు.
సరసర వి. గమనాదుల్లో అయ్యేధ్వనికి అనుకరణం, శీఘ్రం. బసవ. 2.432; క్రి. విశ. ద్రు. మిక్కిలివేగంగా, బసవ. 2.335.
క. చరచర ; త. సరసరప్పు.
సరసాతబండ వి. సర్వేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డపెట్టుకునేరాయి.
సరసాలు వి బ.వ. ఆవాలు.
సం. సర్షప-.ఆవాలు ; ప్రా. సరిసవ-, సరిస్సవ- ; అ.మా. సరసవ-. సరిసవ-, సాసవ- ; పా. సాసవ- ; అప. సరిసవ- ;
క. సాసవె, సాసివె ; తు. సాసెము, దాసెమి ; త. ఐయవి ; కువి. అవ.
<ప్రా. సరిసవ-+-ము+-లు.
సరసు విశ. రుచిగలది, స్వాదువు, గాటుతక్కువకలది, ఆకృతిలో పెద్దది. పాండు. 5.215 ; అ.క్రి. 1. సర్దు, పంచు;

సమంగాపంచు. సారంగ. 2.152 ; 2. కమ్ముకొను.

సం. సదృశ్-.సమానం ; ప్రా. సరిజ- సరిస ; జై. మహా. జై. శౌ. శౌ. అ.మా. అప. సరిస-. సరిఅయినది, క. సరి. సరిచేయు, క్రమంలో ఉంచు. సరిస. సరియైనది, సమత. కొడ. సైరి. సరియైనది ; తు. సరసు, సరి. సదృశం ; త. చరి. యుక్తం, సదృశం ; మ. సరి. సరియైనది, సదృశం.

< ప్రా. సరిస-.

**సరస్వతిపేటిచీర** రూచూ. సరస్వతిపేటుచీర. వి. ఒకరకం డిజైనులో నేసిన చీర.

**సరస్వతిపేటుచీర** రూ. సరస్వతిపేటిచీర. వి. ఒకరకం డిజైనులో నేసిన చీర.

సం. సరస్వతి. వాణి.

**సరస్వతిరంగు** వి. 1. మెజంటాలో లేతరంగు ; 2. ఒకరకం ఎరుపురంగు.

సం. సరస్వతి. వాగ్దేవత, పలుకు, ఒక నదిపేరు, ఆవు.

< సం. సరస్వతీ + రంగు.

**సరహద్దు** రూ.చూ. సరిహద్దు. వి. పొలిమేర, ఎల్ల.

**సరాకత్తు** వి. 1. ఏర్పాటు, 2. మాట.

హిం. సరీక్ తా. భాగం కలయిక ; ఉ. షరీక్ తా ; పార. శరీక్ + తా. సమ్మేళనం.

< ఉ. షరీక్తా.

**సరాగము** వి. 1. ఒద్దిక, అనుకూల్యం. రసిక. 2అ ; 2. ఒప్పిదం. సారంగ. 2.62.

క. సరాగ. అడ్డులేనిది, సూటైనది. సరాళ ; త. చరాగ.

**సరాగాలు** వి.బ.వ. సరదాలు, హాస్యాలు, వినోదాలు.

సం. సరాగ -. రాగంతోకూడిన, ప్రేమగల, రంకుగల.

< సం. సరాగ- + -ము + -లు.

**సరాంగు** వి. ముఖ్యనావికుడు.

ఉ. సర్ హంగ్. కొత్త్వాలు, సిపాయి, సేనాధిపతి ; పార. సర్ హంగ్. జనరల్, కమాండర్, చీఫ్‌క్యాప్టన్, పదాతి దళానిక చెందిన నావికుడు, ఓవర్‌సీయర్.

త. చరంకు, చారాంకు.

< ఉ. సర్ హంగ్.

**సరాట** చూ. సరి[5].

**సరాటకాలు** చూ. సరి[5].

**సరాటగుంజ** చూ. సరి[5].

**సరాటగుది** చూ. సరి[5].

**సరాటతాడు** చూ. సరి[5].

**సరాటపటె** చూ. సరి[5].

**సరాటము** రూ.చూ. సరాతం. వి. అట్లకాడ.

**సరాటమోకు** చూ. సరి[5].

**సరాటు** చూ. సరి[5].

**సరాతం** రూ. సరాటము. వి. 1. డంగుపార, చెవాలలాంటి పొడుగాటికామగల ఇనపపార ; 2. అట్లకాడ.

**సరాతి** వి. గోడలా గుడారంచుట్టూ ఏర్పరచినతెర. సమీర. 3.67, సత్య. 3.5,

క. సరాతి. గుడారంగోడ.

**సరానబడు(-పడు)** అ.క్రి. 1. కుత్తుక దగ్గరపడు ; 2. పొరబోవు.

**సరాపు** రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

**సరాఫ్** రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయివిలువ నిర్ణయించే ఉద్యోగి.

**సరాఫు** రూ చూ సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయివిలువనిర్ణయించే ఉద్యోగి.

**సరాబ్** రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

**సరాబు** రూ.చూ. సరాఫు. వి. 1. క్యాష్‌కీపరు ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి ; నాణేల్ని పరిశీలించేవాడు.

**సరాఫు** రూ. షరాపు, షరాబు, ష్రాఫు, షరావు, షెరిఫ్, షెరీపు, షెరీఫు, సరాపు, సరాఫ్-, సరాఫు, సరాబ్, సరాబు. వి. 1. ధనాన్ని తనదగ్గరుంచుకొని దానితో వ్యాపారం చేసేవాడు. E.C. సంపు. 10. భాగేపల్లి శాసనం, 1768 ; 2. కోశీదారుడు ; 3. రూపాయి విలువ నిర్ణయించే ఉద్యోగి.

హిం సరాఫ్. వెండిబంగారువ్యాపారం చేసేవ్యక్తి, నాణేలను మార్చేవ్యక్తి ; ఉ.అర. ష్రాఫ్ ;

క. షరాబు. ష్రాఫ ; బాంక్ మొ. వాటిల్లో డబ్బు తనఅధీనంలో ఉంచుకొనేవాడు, డబ్బు తనఅధీనంలో ఉంచుకొనేవాడు ; త. చిరాప్పు. షరాబు ; మ. సరాప్పి.

< ఉ. ష్రాఫ్

**సరాయి** రూ.చూ. షరాయి. వి. నిక్కరు.

**సరాయికుమ్మ** వి. పొదగా పెరిగే ముళ్ళకంచెమొక్క, వంట సారాయంబట్టీలో ఈచెట్టుబెరడును వాడతారు.

< సారాయి + తుమ్మ.

**సరాల** రూ.చూ. సరం[1]. వి. 1. పంచస్తంభాలమీదవేసే అడ్డవాసం ; 2. గుజ్జు, కొమరల్లో ఒకటి ; 3. దూలాల స్తంభాలమీదనుంచి పక్కలకు కదలకుండా బిగించినచెక్క.

**సరాసరి** రూ. సరాసరీ. వి. 1. సగటు ; 2. నేరుగా, తిన్నగా, చక్కగా,

హిం. సరాసర్. ఒకకొననుండి ఇంకోకొనవరకు, నెమ్మదైన, సరిగ్గా, తొందరగా, అందాజు ; ఉ.పార. సరాసర్. మొత్తం, అన్ని, పూర్తిగా ;

క. సరాసరి. సగటు, అందాజు, పైన, సరాసరిలో, పైపైన ; త. చరావరి, సరాసరి ; మ. సరాసరి.

< ఉ సరాసర్.

సరాసరిచేయు స.క్రి. చదునుచేయు.

**సరాసరీ** రూ.చూ. సరాసరి. వి. సగటు.

**సరి**[1] వి. 1. సాటి. భార. ఆది. 3.216 ; 2. తగిన సమాధానం. భాగ. 12.3 ; 3. సామ్యం, పోలిక. వరాహ. 11.46 ; విశ. 1. యుక్తం, సముజసం. భార. సభా. 2.117 ; 2. రుజువు. భార. అరణ్య. 1.188 ; 3. సమానం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1007. క్రి.శ.

1065. కు.సం. 11.22 ; 4. సమమైనది, సాటిఅయినది, భార. ఉద్యో. 3.281 ; 5. అనుకూలమైనది, తగినది. హర. 6.129 ; 6. సమాప్తం. ఆము. 2.47 ; 7. సమర్థత కలిగిన. ఇందు. 4.23 ; 8. చెడిపోయినది ; 9. తగినట్లు ; విశే 1. పూర్ణంగా. భార. ఆరణ్య. 1.258 ; 2. సమానంగా. భార. ఆరణ్య. 1.306 ; 3. యుక్తంగా. రం.రా. బాల. 36పు. 22పం ; 4. అనుకూలంగా. రం.రా.ఉ. 42పు ; అవ్య. అంగీకారార్థం.

సం. సదృశ-. సాటి, సదృక్, సదృశ- ; పా. సరి తుల్యమైన, సరి, సరిక్ఖ-, సరిజ, సరిఅ సరీస ; సరీస-, సరిసయ. సదృశ. జై మహా. జై శౌ. సరిస-. అవంతి. సరిచ్ఛ- ; శౌ. సరిక్ఖ-, సరిస- ; అ.మా. సరి. సరిసగ-, సరిస-, సరిసయ. సదృశం ; పా. సదిస-, సరిస-. పోలిక, పోలటం ; మా. శలిశ- ; శాకరీ. సరిచ్ఛ-; అప. సరి, సరిస- ;

క. సరి, సరు ; కొడ. సెరి ; తు. సరి ; త. చరి ; మ. సరి ; తొ. సరి ; కు.ఇ. సర్నా. తిన్నని.

< ప్రా. సరి.

**సరికట్టు** వి. సమానమైన మితి. శుక. 2 69 ; అ.క్రి. 1. సరిదాకు, సరిపడు ; 2. తగు. **సరికడచు** రూ. సరిగడచు. అ.క్రి. 1. ముగియు, సమాప్తమగు. శృం. నై. 7.101 ; 2. కడచు, గతించు. భీమ. 1.31 ; 3. అతిక్రమించు, దాటు ; 4. మించు, అతిక్రమించు. **సరికిబేసికి** అవ్య.క్రదు. ప్రతిదానికి, ఐనదానికి కానిదానికి. ద్వి. పరమ. వి. 7.927. **సరికిసరి** వి. దేనికది. తాళ్ల.సం. 9.74. **సరికిసరిబరికిబరి** వి. సరిసమానం. **సరిగంగలాడు** అ.క్రి. ఆలుమగలు కొంగులు ముడివేసుకుని స్నానంచేయు. వసు. 6.61. సం. గంగా. గంగానది, నీరు. **సరిగడచు(-కడచు)** రూ.చూ. సరికడచు. అ.క్రి. కడచు, గతించు. కాశీ. 6.125 ; 2. మించు, అతిక్రమించు. భీమ. 4.202 ; 3. అతిక్రమించు, దాటు, ప్రభా. 2.42 ; 4. ముగియు, సమాప్తమగు. **సరిగద్దియ** వి. సమానపీఠం. కాశ. 2.9. **సరిగద్దెనుండు(-ఉండు)** అ.క్రి. అర్ధాసీనుడగు. తాళ్ల.సం. 6.139. **సరిగనెదిరించు** స.క్రి. మారుమసలు. ఆం.భా. 3.8. <సరి[1] + అగు + -అ[7] + ఎదిరించు. **సరిగా** అవ్య. క్రదు. ఒప్పుగా, లెస్సగా, బాగా. <సరి[1] + అగు + -అ[7]. **సరిగాలి** వి. చూషకం, వాయువు. **సరిగెల్పులందు** స.క్రి. సమానంగా విజయంచెందు. రాధికా. 1.145 ; <సరి[1] + గెల్పు + -లు + అందు. **సరిగొను(-కొను)** స.క్రి. 1. చంపు, రూపుమాపు, ప్రతీకారంచేయు. భార స్త్రీ. 1.131 ; 2. సాటిగొను, లెక్కచేయు. బిల్హ. 1.34. **సరిగ్రుచ్చు** స.క్రి. వరసగాకూర్చు, మాలికగా గుచ్చు. నిర్వ రా. 1.5. **సరిచూచు** స.క్రి. 1, సంప్రదించు, పరిశీలించు ; 2. చక్కజేయు. **సరిచెప్పు** అ.క్రి. సమానమనిచెప్పు. వేంక. పంచ. 1.739. **సరిచేయు** స.క్రి. 1. నాశంచేయు, సమాప్తంచేయు. బసవ 164పు. 12పం ; 2. సమానంగా ఎంచు. దశా. 2.421; 3. చక్కబర్చు, బాగుచేయు. **సరిచేసికొను** స.క్రి. 1. సమానునిగా ఎంచు. బసవ. 120పు. 1పం ; 2. చక్కబరచుకొను. తాళ్ల.సం. 7.280 ; 3. వశం చేసుకొను. **సరిజోడు** వి. గజకవచం. రం.రా.ఉ. 68.1పం. **సరితరము** వి. భూమిని సారాన్ని బట్టి తరగతులుగా ఏర్పరచటం. **సరితాపు** వి. చక్కన, ఎదురు. **సరితూగు** అ.క్రి. సమానంగా తూగు, సమానమగు. తాళ్ల.సం. 8.119. **సరిదాకు (-తాకు)** అ.క్రి. 1. దెబ్బతిను. రం.రా.ఉ.87పు. 6పం ; 2 సరిపడు. కళా. 2.168 ; 3. సరికట్టు, దృష్టాంతమగు. కళా. 3.206. **సరిదాపు** వి. దగ్గరివాడు. తాళ్ల.సం.11,108. **సరిదీయు (-తీయు)** స.క్రి. సారించు, సరిగ్గాచేయు. **సరిదీర్చు (-తీర్చు)** స.క్రి. యుక్తంగా పరిష్కరించు. ఆము. 4.36. **సరినాగు** వి. అప్పుగా తీసుకున్నధాన్యానికి సంవత్సరానికి రెండింతలుగా ఇచ్చే వడ్డీలాంటి ధాన్యం, సరికిసరి నాగు. **సరినొత్తు (-ఒత్తు)** స.క్రి. 1. సరిచేయు ; 2. అంగీకరించు ; 3. తగవు లేకుండా చేసికొను. **సరిపట్టు** అ.క్రి. బతిమాలుతూ తిరుగు. **సరిపడు** అ.క్రి. 1, సమానంగా. క్రీడా. 1.229 ; 2. అనుకూలమగు ; 3. యుక్తమగు ; 4. పొందుపడు ; 5. వీలుపడు ; 6. బాగుపడు. **సరిపఱచు** రూ.చూ. సరిపఱుచు. స.క్రి. 1. నాశం చేయు, చంపు ; 2. ఈడుపరచు, సరిచేయు. **సరిపఱుచు** రూ. సరిపఱచు. స.క్రి 1. నాశం చేయు. చంపు ; 2. ఈడు పరచు, సరిచేయు. **సరిపుచ్చు** స.క్రి. 1. సరిపోయేటట్లు చేయు. వేంక.పంచ. 1.790 ; 2. నాశం చేయు. రామలిం.శ. 100. **సరిపుచ్చుకొను** స.క్రి. రుజువు పరచుకొను, తార్కాణించుకొను. కళా. 6.151. **సరిపురుషుడు** వి. అధికుడును. హీనుడును కానిపురుషుడు. విజ్ఞా.ఆచా. 91. సం. పురుష -. నరుడు. **సరిపెట్టు** స.క్రి. 1. నాశం చేయు. చంపు. రామాభ్యు. 8.165 ; 2. ఈడుపరచు. సరిచేయు, కుదుర్చు. తాళ్ల.సం. 6.17. **సరిపెట్టుకొను** స.క్రి. ఉన్నదానిలో సంతృప్తిపడు. **సరిపొట్ట** వి. ఈనుపొట్ట, ఆకులు విడబడి కంకి వెళ్ళే ముందున్న పైరుదశ. **సరిపొత్తు కలియు** అ.క్రి. సమానమగు. వర.రా. బాల. 12పు. 20పం. **సరిపొద్దు** రూ.చూ. సరిప్రొద్దు. వి. అర్ధరాత్రం. **సరిపోటు** వి. సాదృశ్యం. ఆం.భా. 2.302. **సరిపోలు** రూ.చూ. సరివోలు. అ.క్రి. సాటగు, పోలు. కకుత్స. 5.45. **సరిపోవు** అ.క్రి. 1. సరిపడు, కుదురు. వేంక.పంచ. 1.266 ; 2. సమ్మతమగు, అనుకూలమగు. ఆము. 4 265 ; 3. సమానమగు, ఆము. 6.68 ; 4. నశించు. ప్రభా. 4.9. పాండు. 5.84 ; 5. పర్యాప్తమగు. సరిపడు. దశా. 3.199. **సరిప్రొద్దు** రూ. సరిపొద్దు. వి. అర్థరాత్రి. కాశీ. 4.120. **సరిబత్తు** స.క్రి. 1. సరిచేసుకొను ; 2. రెంటిని పోల్చి చూచుకొను. **సరిబరి** వి. సరిసమానం. **సరిబేసికి** అవ్య. అయినదానికి కానిదానికి. తాళ్ల.సం.14. 157. **సరిబేసి జంటజరుపు** స.క్రి. చిక్కుప్రశ్నలువేయు. తాళ్ల.సం. 10.203. **సరిబేసులు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. యయా. 1.47, విష్ణు. 7.212. **సరిమందడి** వి. 1. వాట్పాటు, గోడరాళ్ళు ఒకవరసలో ఉండి తూకం సరిపోయేటట్లు కట్టటం ; 2. మట్టపులాదు, సమానమైన మట్టంలో ఇటికలను నిలువున అతికి కప్పువేయటం. **సరిమాయు** అ.క్రి.

విషయమగు, చెడు. చంద్రాంగ. 1.18. సరిమిన్న వి. ఆకాశమధ్యం. భాస్క.రా. అరణ్య. 135. సరియ$^{3}$ రూ, నరె$^{2}$. అవ్య. అంగీకారం, ఒప్పుదల మొ. వాటిని తెలిపే పదం. సరియగు (-అగు) అ.క్రి, 1. నశించు. ఆము. 2.47 ; 2. నమానమగు. సరిలెపెల్ వి. నమమట్టం, నమానమైన మట్టం. సరిలేపి విణ. ఎనలేని సాటిలేని. సరిలేమ వి. తోటివెలది. శృం.నై. 6.136. సరివచ్చు అ.క్రి. సాటిఅగు. భార. అశ్వ. 4.177. సరివన్నెనేత వి. పడుగు, పేక ఒకేరంగు పోగులు పెట్టి నేసిననేత. సరివాటు వి. నమభాగం, చెరినగం. కళా. 3.204. సరివా(డు విణ. 1. నమానుడు, తుల్యుడు, ఉ.హరి. 4.123 ; 2. తనరాదు. ఇందు 2.18. సరివారలు విణ. బ.వ. నమానులు. తాళ్ల సం. 8.53. సరివారు విణ. బ.వ. నమానులు, బంధుమిత్రులు. సరివోలు (-పోలు) రూ. సరిపోలు. అ.క్రి. పాటిఅగు, పోలు. శృం.నై. 3.181. సరివోవు (-పోవు) అ.క్రి. సాటియగు. కు.సం 5 162. సరిసందు వి. 1. నాట్పాటు, గోడరాళ్ళు ఒకవరసలో ఉండి తూకం సరిపోయేటట్లు కట్టటం ; 2. నమసందు. రాతి పేర్పుల్లో ఒకదానికొకటి ఎదురుగా వచ్చే సందు. సరిసరి అవ్య. బాగు బాగు. రసిక 5.160 ; వి. అన్నివిధాల సమత్వం. విజ్ఞా. వ్యవ. 108. సరిసర్లు వి.బ.వ. శూద్రుల్లో ఒకజాతివారు. ఖీమ. 1.31. సరిసేయు (-చేయు) స.క్రి. 1. నమానం చేయు. భార. విరా. 2.15 ; 2. పోల్చు, ఉపమించు. హంస. 1 210. సరులు వి.బ.వ. సరిసంఖ్యలు. సరె$^{2}$ రూ.చూ. సరియ$^{3}$. అవ్య. అంగీకారం ఒప్పుదల మొ. వాటిని తెలిపేపదం. సరెనరు వి. అత్తెసరు. <సరి$^{1}$ + ఎనరు. సరే అవ్య. అంగీకారాన్ని తెలిపేపదం, <సరి$^{1}$ + ఏ$^{3}$.

సరి$^{2}$ రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో ఉప్పునీరుగాని ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు (Casuarina equsetifolia).

సరి$^{3}$ వి. 1. దండ, (పూవుల) సరం. శృం.నై. 2.113 ; 3. హారం.

నం. సర-.దండ.

<సం. సర-.

సరికెంకణము వి. నతి, మొక్కు. సరిదండ వి. కేయూరం.

సరి$^{4}$ చూ. చరియ. వి. కొండ చరియ. నరస. 5.145.

సరి$^{5}$ వి. 1. గంజి ఆరబెట్టి నేతకు అనుకూలంగా పోగు బిరుసెక్కేటట్లు చేసిన పడుగు ; 2. పడుగు ; 3 పడుగుకు పెట్టే గంజి. గంజి ; 4. నారపడుగును తడిపే చింత గంజి ; 5. నేతలో నిలువు ; 6. ఉన్నినేతలో ఆనుపోసి నిలువుకు వాడే నూలు.

సరటు రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. సరటుగుంజ రూ. చూ. సరాటగుంజ. వి. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య. సరటుమోకు రూ.చూ. సరాటమోకు. వి. ఊడ్తెను నిలబెట్టి కింది గూటానికి బిగించే తాడు. సరట్ట యూ.చూ. సరాట. వి. 1. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య ; 2. సరిచేసేటప్పుడు ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్రను బిగించటానికి నేలలో పాతిన కొయ్య. సరట్టగుంజ వి. ఊడ్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం. సరట్టి రూ.చూ. సరాట. వి. 1. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య ; 2. సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్రను బిగించటానికి నేలలో పాతినకొయ్య. సరట్టిగుది రూ. సరట్టుగుదీ. వి. సరిగుంజల అడ్డకట్టెలకు వేసినతాడు. సరట్టిబడితె రూ. సరెట్టుబడితె. వి. సరిగుంజల పైవైపున అడ్డంగా కట్టిన కట్టె. సరట్టు రూ.చూ. సరాట. వి. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య ; 2. సరిచేసేటప్పుడు ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్రను బిగించటానికి నేలలో పాతినకొయ్య. సరట్టుగుది రూ.చూ. సరట్టిగుది. వి. సరిగుంజల అడ్డకట్టెకు వేసినతాడు. సరట్లతాడు వి. సరిచేయటానికి చాపిన ఉన్నిపడుగును గూటాలకు బిగించేతాడు. సరద్దు రూ.చూ. సరిటెద్దు. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. సరాట రూ. సరటు. సరట్ట, సరట్టి, సరాటు, సరోటి, స్రాట, సౌరట, సౌరవటి, సౌరాట, వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు. <సరి$^{5}$ + రాట. సరాటకాలు రూ. సౌరాటకాలు. వి. నేలమీద మోసే ఊడ్తెకొయ్య. సరాటగుంజ రూ. సరటుగుంజ, సౌరాటుగుంజ. వి. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య. సరాటగుది వి. పడుగు చాపేటప్పుడు ఊడ్తె అడ్డపట్టెమా పడుగేరుకర్రమా కలిపేతాడు. సరాటతాడు రూ. సరోటితాడు. వి. ఊడ్తెను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు, సరాటపట్టె రూ. సౌరాటపట్టె. వి. ఊడ్తె పైవైపున బిగించిన అడ్డపట్టె. సరాటమోకు రూ. సరటుమోకు. వి. ఊడ్తెను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు. సరాటు రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. సరిఅటికె రూ.చూ. సరిఅటికె. వి. 1. పడుగుకు పెట్టే గంజి పోసుకునే ఒకరకం మట్టిపాత్ర ; 2. ఉన్నిపడుగుకు పెట్టే చింతఅంబలి పోసిన చిన్నకుండ. సరిఅటికె రూ. సరిఅటిక. వి. 1. పడుగుకు పెట్టేగంజి పోసుకునే ఒకరకం మట్టిపాత్ర ; 2. ఉన్నిపడుగుకు పెట్టే చింతఅంబలి పోసిన చిన్నకుండ. సరిఅతుకు అ.క్రి. బద్దెపోగులకు పడుగుపోగులకు కలిపి వడిపెట్టు. సరిఅంబలి వి. చింతగింజలు మొ. వి. కలిపి గొంగళ్ళు నేయటంలో గట్టికోసం ఉపయోగించే అంబలి. సరిఎత్తు అ.క్రి. పడుగు ఆరుతున్నప్పుడు కచ్చిపోగులు అంటుకుపోకుండా విడదీయు. సరికచ్చిపట్టు వి. పడుగుతో అని వెంబడి దూర్చిన రెండులాకుల మధ్య భాగం. సరికట్టు అ.క్రి. గంజిపెట్టిన పడుగును నేతకు అనువుగా సాపుచేయు. సరికట్లంబెన(గు రూ.చూ. సరికట్ల(బెన(గు. స.క్రి. సమా

నంగా పెనగు. హంన. 3.162. **సరికట్లబెనగు** రూ.చూ. నరికట్టంబెనగు. న.క్రి. నమఉద్దీగా రతిక్రీడనలుపు. శుక. 2.69. **సరికాకు** వి. చింతఅంబలి కాచేకుండ. **సరికానోడు** వి. నేతలో నిలువుకువాడే నూలుకు గంజి పెట్టిసాపు చేసేవాడు. **సరికుంచి** రూ.చూ. సరికుంచె. వి. 1. గంజిపెట్టిన పడుగును ఆరుబయట చాపి దువ్వే పనిముట్టు ; 2. అంబలిపెట్టిన ఉన్ని పడుగును దువ్వేకుంచె. **సరికుంచె** రూ. సరికుంచి. వి. 1. గంజిపెట్టిన పడుగును అరుబయటచాపి దువ్వే పనిముట్టు ; 2. అంబలి పెట్టిన ఉన్ని పడుగును దువ్వే కుంచె. **సరికుండ** వి. 1. గంజి తియ్యటానికి అన్నం వండే కుండ ; 2. చింత అంబలి కాచేకుండ. **సరికూటిగంజి** వి. పడుగుకు పెట్టేగంజి. **సరికూడు** రూ. నరుగుడు2. వి. బియ్యంతో గాని, నూకలతో గాని సరికి పెట్టటానికి వండినకూడు. **సరికూలి** వి. నిర్ణయించిన దానికంటె అదనంగా నేతపనివాడికి బహుమతిగా ఇచ్చినకూలి. **సరికొండె** వి. ఊత్తైను అడ్డపట్టెకు బిగించిన ఇనపకొక్కెం. **సరికొయ్య** రూ. సరిగొయ్య, వి. 1. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం ; 2. ఆరుబయటచాపిన పడుగు రెండో వైపు కట్టటానికి పాతినకొయ్య. **సరికోల** వి. 1. ఊత్తై పైవైపున బిగించిన అడ్డపట్టె; 2. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం; 3. పడుగు చాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటికర్ర. **సరిగంజి** వి. మెత్తగా ఉడకబెట్టిన బియ్యపుజావ. **సరిగాక** రూ.చూ. సరిగోక. వి. పడుగు తడపటానికి గంజిలో ముంచినగుడ్డ. **సరిగుంజ** వి. 1. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య ; 2. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం. **సరిగుంజలాట** వి. ఒకబాలక్రీడ. పండి. చ. 2.460. **సరిగుండు** వి. 1. సరిబండమీద ఉన్నిరుబ్బే పొత్రం ; 2. రోట్లో పిండి రుబ్బేరాయి. **సరిగుతి** రూ.చూ. సరిగుది. వి. తిరుగుడుకు రెండువైపులా కట్టినతాళ్ళు. **సరిగుది** రూ. సరిగుతి. వి. తిరుగుడుకు రెండువైపులా కట్టిన తాళ్ళు. **సరిగునపం** వి. ఊత్తైను నిలబెట్టి మోకుతో బిగించటానికి నేలలో పాతినగునపం. **సరిగుర్రం** వి. ఆరుబయట ఊత్తైలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు. **సరిగూటం** వి. 1. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం ; 2. ఊత్తైగూటాన్ని నేలలో దిగగొట్టే. ఇనపమొద్దు ; 3. సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర. **సరిగొయ్య** (-కొయ్య) రూ.చూ. సరికొయ్య. వి. 1. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం; 2. ఆరుబయట పాతిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినకొయ్య. **సరిగొలుసు** వి. ఊత్తై అడ్డపట్టెకు గాని సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు. **సరిగొలుసుతాడు** వి. పడుగు చాపేటప్పుడు గొలును కడియాన్ని సరిగుంజకు కలిపే కట్టెతాడు. **సరిగోక** రూ. సరిగాక, సరిగోకు. వి. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ. **సరిగోకు** రూ.చూ. సరిగోక.వి. పడుగు తడపటానికి గంజిలో ముంచినగుడ్డ. **సరిచినికడ** రూ.చూ. సరిచిలకడ. వి. సరి చేయటానికిగాని నేతనేయటానికిగాని చాపిన ఉన్నిపడుగు బిగింపుకు తలకోలకు తగిలించినతాడు. **సరిచిలకడ** రూ. సరిచినికడ. వి. సరిచేయటానికిగాని నేతనేయటానికిగాని చాపిన ఉన్నిపడుగు బిగింపుకు తలకోలకు తగిలించిన తాడు. **సరిచేయు** రూ. సరిజేయు. స.క్రి. 1. ఆరుబయట చాపిన పడుగు పోగులు అంటుకుపోకుండా విడదీసి నెరపు ; 2. గంజిపెట్టిన పడుగును ఊత్తైలకు చాపి కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలంగాచేయు. **సరిజావ** వి. మెత్తగా ఉడకబెట్టిన బియ్యపుజావ. **సరిజేయు**(-చేయు) రూ.చూ. సరిచేయు. స.క్రి 1. ఆరుబయట చాపిన పడుగు పోగులు అంటుకు పోకుండా విడదీసి నెరపు ; 2. గంజిపెట్టిన పడుగును ఊత్తైలకు చాపి కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలంగా చేయు. **సరిటెద్దు** రూ. సరద్దు, సరిపెద్దు, సరెద్దు. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు. <సరి5+ రాట+హద్దు. **సరిటెద్దుపెట్టు** అ.క్రి. ఆరుబయట పడుగు చావటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు పెట్టు. **సరితడుపు** రూ. సరిదడుపు. స.క్రి. పడుగుకు గంజి పెట్టు. **సరితాడు** రూ సర్తాడు, సర్దాడు. వి. 1. కమాను నరం నునుపుగా వచ్చేటట్టు చేసే ఈతనార తాడు; 2. ఊత్తైను నిలబెట్టి కింది గూటానికి బిగించే తాడు ; 3. సరి చేయటానికి చాపిన ఉన్ని పడుగును గూటాలకు బిగించే తాడు. **సరితిరుగుడు** వి. చాపిన పడుగు తిరగవెయ్యటానికి ఉపయోగించే కొయ్యపనిముట్టు. **సరితొట్టి** వి. 1. ఒకరకం మట్టిపాత్ర, పడుగుకు పెట్టటానికి గంజిపోసుకొనే తొట్టి ; 2. చింతఅంబలిపోసిన తొట్టి. **సరిదడుపు** (-తడుపు) రూ చూ. సరితడుపు. స.క్రి. పడుగుకు గంజి పెట్టు. **సరిదండిగె** వి. సరిచేసేటప్పుడు ఉన్నిపడుగు ముందు వైపు దూర్చిన లావాటికర్ర. **సరినక్కు** వి. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం. **సరినీళ్ళు** వి.బ.వ. పడుగు తడిపే గంజి. **సరినూలు** వి. నేతకు పడుగుకు వాడేనూలు. **సరినెరపు** స.క్రి. సరి చేసేటప్పుడు పడుగు పోగులు విడదీసి వెడల్పుగా పరచు. **సరినేత** వి. 1. రెండు రంగుల నూలు చెరొక సగంపెట్టి నేసిన నేత ; 2. నిలువు, అడ్డం ఒకే నెంబరు నూలుపెట్టి నేసిన నేత ; 3. ఒకరకం దారం పైనా ఇంకొకరకం దారం కిందా సమంగా వచ్చేట్టు నేసిననేత ; 4. పచ్చి నూలు సరిచేసి నేసిన నేత. **సరిపగ్గం** వి. సరి చేయటానికి చాపిన ఉన్నిపడుగును గూటాలకు బిగించే తాడు. **సరిపంగి** వి. పడుగులో పైపోగులూ కింది పోగులూ కలవకుండా ఉండటం. **సరిపంగివచ్చు** అ.క్రి. పడుగులో పైపోగులూ కిందిపోగులూ కలవకుండా ఉండు. **సరిపట్టు** స.క్రి. ఆరుబయట పడుగు పరచు, రెండు ఊత్తైలకు మధ్యగాని ఒక ఊత్తైకూ సరిగుంజకూ మధ్య గాని పడుగు చాపు; అ.క్రి. పడుగుకు గంజి అంటు ; వి. నేతలో

నిలువుకు వాడే పట్టుదారం. **సరిపడుసు** వి. **1.** గంజి పెట్టిన పడుగు ; **2.** నేతలో నిలువుకు వాడేపట్టు ; **3.** ఉన్ని నేతలో ఆనుపోసి నిలువుకు వాడే నూలు. **సరిపాయ** వి. పడుగు పోగుల్లో కొంతభాగం. **సరిపిడచ** రూ. సరిపిడస, సరిపిడిసి. వి. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ. **సరిపిడస** రూ.చూ. సరిపిడచ. వి. పడుగు తడపటానికి గంజిలో ముంచినగుడ్డ. **సరిపిడిసి** రూ.చూ. సరిపిడచ. వి. పడుగు తడపటానికి గంజిలో ముంచినగుడ్డ. **సరిపీట** వి. నరి చేయటానికి చాపిన ఉన్నిపడుగును బ్రరు పెట్ట టానికి సరితాడుకు తగిలించిన కొయ్యబిళ్ళ. **సరిపూయు** అ.క్రి. పడుగుకు గంజిపెట్టు. **సరిపెట్టు** అ.క్రి. పడుగుకు గంజిపెట్టు. **సరిబడుకు** రూ.చూ. సరివడుకు. వి. నేతలో నిలువుకు వాడే పట్టుదారం. **సరిబండ** వి. గంజి, అంబలి మొ. వాటితో పడుగు తడపటానికి పరచినరాయి. **సరిబద్ద** వి. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద. **సరిబయట** వి. సరిచెయ్యటానికి పడుగుచాపే బహిరంగ ప్రదేశం. **సరిబాన** వి. పడుగు పెట్టటానికి గంజిపోసుకునే ఒకరకం మట్టిపాత్ర. **సరిమట్ట** రూ.చూ. సరిమట్టు. వి. **1.** ఆరుబయటచాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య ; **2.** ఉన్నిపడుగులో కిందిపోగులకు పైపోగులకు మధ్యదూర్చిన తాటిబద్ద. **సరిమట్టగుది** రూ.చూ. సరి మట్టుగుది. వి. సరిగుంజల అడ్డకట్టెకు వేసిన తాడు. **సరి మట్టబడితె** రూ.చూ. సరిమట్టుబడితె. వి. సరిగుంజల పైపైపున అడ్డంగా కట్టినకట్టె. **సరిమట్టు** రూ. సరిమట్ట. వి. ఆరుబయట చాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య. **సరిమట్టుగుది** రూ. సరిమట్టగుది. వి. సరిగుంజల అడ్డకట్టెకు వేసినతాడు. **సరిమట్టుతాడు** వి. సరిగుంజల అడ్డకట్టెకు వేసిన తాడు. **సరిమట్టుబడితె** రూ. సరిమట్ట బడితె. వి. సరిగుంజల పైపైపున అడ్డంగా కట్టినకట్టె. **సరి మండిక** రూ.చూ. సరిమండిగె. వి. వెడల్పు మూతిగల గుండ్రటి మట్టిపాత్ర. **సరిమండిగె** రూ. సరిమండిక. వి. వెడల్పు మూతిగల గుండ్రటి మట్టిపాత్ర. **సరిమల్లు** వి. ఒకరకం గడినేత. **సరిముట్టా** వి. **1.** పడుగులో చివర చుట్టిన పాయ ; **2.** పడుగుపాయల్లో కొంతభాగం. **సరి ముట్టాచుట్టు** వి. **1.** పడుగు చివర చుట్టిన పాయ ; **2.** పడుగుపాయల్లో కొంతభాగం. **సరిముంత** వి. కుండలో నుంచి అంబలి తీసుకొనే పిడత. **సరిమోకు** వి. ఊద్దైను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు. **సరిమోకుబడి** వి. ఊద్దైతాడు బిగించి వేసిన ముడి. **సరిరాయి** వి. సరిచేసే టప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర. **సరిలాక** రూ. సర్లాక. వి. సరిచేసేటప్పుడు పడుగులో దూర్చిన అడ్డబద్ద. **సరిలాకఎక్కించు** స.క్రి. సరి చేసేటప్పుడు పడు గుకో అడ్డబద్దదూర్చు. **సరిలాకనడుపు** స.క్రి. సరిచేసే టప్పుడు పడుగులో అడ్డబద్ద దూర్చు. **సరివడుకు** రూ. సరి ఒడుకు. వి. నేతలో నిలువుకు వాడే పట్టుదారం. **సరిసలిగె** వి ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద. **సరిసాగు** వి. గంజిపెట్టి చాపిన పడుగు. **సరిసాటి** వి. సమానం. హంస. 4.190. **సరిసారు** స.క్రి. సరిచేసే టప్పుడు పడుగుకు పెట్టిన గంజి చేతులతో సమంగారుద్దు. **సరిసుక్కచీర** వి. రెండు కొలుకులు తెలుపు, రెండు. కొలుకులు వక్కరంగు పెట్టి అంచుల మధ్య నేసిన చీర. **సరిసెద్దు** రూ.చూ. సరిబెద్దు, సరెద్దు. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. **సరిసెద్దు బయలు** వి. సరిచెయ్యటానికి ఊద్దైలకు పడుగుచాపే బహి రంగప్రదేశం. **సరెట్టుబడితె** రూ.చూ. సరట్టిబడితె. వి. సరిగుంజలపైపైపున అడ్డంగా కట్టిన కట్టె. **సరెంటి** రూ. సరెంటు, సరెంటె. వి. **1.** వడితిప్పి చుట్టిన నూలు, సరి చేసిన తరువాత మామూలుగా ఒక కర్రకు చుట్టటం ; **2.** అచ్చుతికిన తరవాత చుట్టబెట్టిన పడుగునూలు ; **3.** చుట్టచుట్టిన పడుగు నూలు, మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒకకర్రకు చుట్టటం. <సరి$^{5}$+ఎంటి. **సరెంటి పాగడ** వి. సరిచేసిన తరవాత చుట్టిన పడుగు. **సరెంటివేయు** స.క్రి. **1.** వడితిప్పి చుట్టిన నూలు, సరిచేసిన తరవాత మామూలుగా ఒక కర్రకు చుట్టు ; **2.** అచ్చుతికిన తరవాత పడుగునూలు చుట్టబెట్టు ; **3.** చుట్టచుట్టిన పడుగునూలు, మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒకకర్రకు చుట్టు. <నరి$^{5}$+ఎంటి+వేయు. **సరెంటు** రూ.చూ. సరెంటి. వి. **1**. వడితిప్పి చుట్టిన నూలు, సరిచేసిన తరవాత మామూ లుగా ఒకకర్రకు చుట్టుం : **2.** అచ్చుతికిన తరవాత చుట్ట బెట్టిన పడుగునూలు ; **3.** చుట్టచుట్టిన పడుగునూలు, మగ్గంమీద కొంత చాపగా మిగిలింది ఒకకర్రకు చుట్టటం. <సరి$^{5}$+ఎంటు. **సరెంటె** రూ.చూ. సరెంటి. వి. **1.** వడి దిప్పి చుట్టిననూలు, సరిచేసిన తరవాత మామూలుగా ఒకకర్రకు చుట్టటం ; **2.** అచ్చుతికిన తరవాత చుట్టబెట్టిన పడుగునూలు ; **3.** చుట్టచుట్టిన పడుగు నూలు, మగ్గం మీద కొంతచాపగా మిగిలింది ఒక కర్రకు చుట్టటం. **సరెద్దు** రూ.చూ. నరిసెద్దు వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపని ముట్టు. **సరెద్దుమోకు** వి. ఊద్దైను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు. **సరోటి** రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. **సరోటితాడు** రూ.చూ. సరాటతాడు. వి. ఊద్దైను నిలబెట్టి కింది గూటా నికి బిగించేతాడు. **సర్తాడు** రూ.చూ. సరితాడు. వి. **1.** కమానునరం నునుపుగా వచ్చేటట్లు చేసే ఈతనారతాడు ; **2** ఊద్దైను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు ; **3.** సరిచేయటానికి చాపిన ఉన్నిపడుగును గూటాలకు బిగించే తాడు. **సర్దాడు** రూ.చూ. సరితాడు. వి. **1.** కమానునరం నునుపుగా వచ్చేటట్టు చేసే ఈతనారతాడు ; **2.** ఊద్దైను నిలబెట్టి కిందిగూటానికి బిగించేతాడు; **3.** నరిచేయటానికి చాపిన ఉన్నిపడుగును గూటానికి బిగించేతాడు. **స్రరాట** రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు. **సర్లాక** రూ.చూ. సరిలాక. వి. సరిచేసేటప్పుడు పడుగులో దూర్చిన అడ్డబద్ద. **సర్వటి గుంజ** వి. దనలిపడుగు సరిచెయ్యటానికి ఊద్దైకు రెండో వైపునేలలో పాతిన కొయ్యరాట.

**సరికి** రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో,

ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు (Casuarina equsetifolia).

**సరికిచౌక** వి. సరిక, చౌక అనే సమానార్థక శబ్దాలు రెండింటితో ఏర్పడిన జంటపదం.

**సరికూడు** చూ. సరి[1]. రూ. సరుగుడు[2]. వి. బియ్యం నానబోసి ఉడకబెట్టినఅన్నం.

**సరిఖేలు** చూ. సరి[1]. వి. ఇష్టుడు. నె.శా. ఉదయగిరి. 27. క్రీ.శ. 1740.

**సరిగ** రూ.చూ. సరిగె. వి. 1. హారం. ఉ.హరి. 2.171; 2. జలతారు. రాజవా. 2.39; 3. బట్టఅంచులకుగాని డిజైన్లకోసంగాని నేలలో వాడే సన్నటి మెరపుదారం.

సరిగచీర వి. జరీపెట్టి నేసిన చీర. సరిగంచు వి. జరీ అంచు. వల్నా. పు. 54. రామాభ్యు. 4.40. <సరిగ+-అంచు[3].

**సరిగదబ్బ** రూ.చూ. సరిగబద్ద. వి. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద.

**సరిగబద్ద** రూ. సరిగదబ్బ. వి. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద.

**సరిగస్తు** వి. ఊరేగింపు. (నిజాంవాడుక).

హిం. శహర్ గస్త్. ఊరేగింపు; ఉ. షహర్ గస్త్.

<ఉ. షహర్‌గస్త్.

**సరిగి** రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో, ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు (Casuarina equsetifolia).

**సరిగె** రూ. సరిగ. వి. 1. హారం, గొలుసు. పండి. చ. 5.343; 2. జలతారు జరీ. రం.రా. బాల. 74పు. 29పం; 3. కాంతి, మెరుగు. ముకుంద. 2.183; 4. కలధౌతవస్త్రం, బంగారుబట్ట. ఉ.రా. 5.267; 5. ఎద్దు కాలుకు అలంకారంగా వేనివేసే సరిగడ్డి కడియం.

సం. సరికా. ముత్యాలహారం; ప్రా. సరిఆ, మాల సరీ. హారం;

క. సరిగె, సలిగె. స్త్రీల కంఠాభరణం; తు సరిగె. జలతారుపోగు, నందిదండ; త. చరిగై.

<సం. సరికా.

**సరిచేషము** రూ.చూ. సర్చెషం. వి. దఫేదార్ల అధికారానికి లోబడిన కొంతమంది నౌకర్ల సమూహానికి క్యాప్టన్.

**సరించు** రూ.చూ. సరియించు. స.క్రి. 1. జరిగించు, జరుపు; 2. సిద్ధంచేయ; 3. అందించు.

**సరిడె** వి. జొన్న మొ. పైర్లు కోసి పొలంలో వేసిన చిన్నకుప్ప.

**సరిత** రూ. సరితె. వి. చరిత్ర. శాశ్న. సం. 17.185.

సం. చరిత్ర-.నడవడి. విహితకృత్యం. ధర్మం.

<సం. చరిత్ర-.

**సరితాళంపుమొన** చూ. సరి[1]. వి. మల్లబంధవిశేషం. హంస. 1.206.

**సరితె** రూ.చూ. సరిత. వి. చరిత్ర. శాశ్న. సం. 17.389.

**సరిదికట్టు** వి. గట్టిమసరనేల.

**సరిదు** రూ.చూ. సరిహద్దు. వి. సరిహద్దు. రా.వా.పు. 28.

**సరిపణి** రూ. సరపణి, సరిపణీ, సరిపిణ, సరిపెణ, సరిపెణము, సరిపెణీ, సరిపెన, సర్పెన. వి. 1. గొలుసు. ఆము. 5.140; 2. అలంకారంగా ఉపయోగించే బంగారు గొలుసు లలంతిక. చంపూరా. 3.9; 3. ఇనపగొలుసు.

క. సరపణి, సరపళి. గొలుసు, నెక్లెసు; తు. సరపళి, సరపణి, సరపాళి. గొలుసు; త. చరపణి. వజ్రాలు పొదిగిన బంగారు నెక్లెసు, చరప్పళి; మ. సరప్పళి. అనేకపేట్ల బంగారు గొలుసు; కో. సర్పేకళ్లె, స్త్రీలకంఠాభరణం.

**సరిపణీ** రూ.చూ. సరపణి. వి. 1. గొలుసు; 2. బంగారం మొ. వాటిగొలుసు.

**సరిపని** చూ. జరుపు, సరించు. విణ. జరపని. ద.హిం.కా' సంపు. 5. శా.సం. 1123. క్రీ.శ. 1058.

**సరిపాతబండ** రూ.చూ. సరపాతబండ. వి. సర్పేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

**సరిపించు** చూ. జరిపించు. స.క్రి. మొద్దైనకత్తి మొ. వాటివాదరను కాచి కొట్టి పదును వచ్చేట్టు చేయు.

**సరిపిటిపాత** రూ.చూ. సరిపిడిపాత. వి. కుండల్ని సర్పేటప్పుడు నలపను తడుపుకోవటానికి వాడేతడిబట్ట.

**సరిపిటిరాయి** వి. సర్పేటప్పుడు పాటలోపల మోపుగాపెట్టుకునే గుండ్రనిరాయి.

**సరిపిడిపాత** రూ. సరిపిటిపాత, సలిపిరిపాత. వి. కుండల్ని సర్పేటప్పుడు నలపను తడుపుకోవటానికి వాడేతడిబట్ట.

**సరిపిండిబండ** రూ. నలిపిరిబండ. వి. సర్పేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

**సరిపిణి** రూ.చూ. సరిపణి. వి. గొలుసు, స్త్రీలఆభరణం.

**సరిపెణ** రూ.చూ. సరిపణి. వి. 1. బంగారం మొ.వాటి గొలుసు, లలంతిక. దశకు. 3.77; 2. కుక్కలమెడలకు కట్టేగొలుసు, ఇనపగొలుసు. మను. 4.31; 3. సరిపణీ గొలుసు. కళా. 6.224; 4. ఆభరణ విశేషం. హంస. 2.191.

**సరిపెణము** రూ.చూ. సరిపణి. వి. 1. కుక్కలమెడలకు కట్టే గొలుసు, ఇనపగొలుసు; 2. బంగారం మొ. వాటిగొలుసు. లలంతిక; 3. సరిపణి, గొలుసు; 4. ఆభరణవిశేషం.

**సరిపెణీ** రూ.చూ. సరిపణి. వి. 1. అలంకారంగా ఉపయోగించే బంగారుగొలుసు. చంద్రాంగ. 2.69; 2. గొలుసు; 3. ఇనపగొలుసు.

**సరిపెన** రూ.చూ. సరిపణి. వి. బంగారుగొలుసు. ఇందు. 1.35.

**సరిపేషు** రూ. సర్పేషము. వి. (చంద్రవంకలా ఉండే) శిరోభూషావిశేషం. మృత్యు. 3.20.

హిం. ఉ. సర్ పేచ్. తలపాగా, శిరోభూషణం.

<ఉ. సర్‌పేచ్.

**సరిబిత్తరము** వి. మల్లవిద్యా విశేషం. హంస. 1.206.

**సరిమి** రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలగానిల్లో ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగాతగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగులఎత్తువరకు పెరిగేచెట్టు

(Casuarina equsetifolia)

సరిమితుక్కు వి. సరివిఆకు మొ. వి ఆముకప్పటానికి ఉపయోగం.

సరిమిడి వి. తెగింపు, సాహసం.

సరిమిడిమానిసి వి. శౌర్యవంతుడు.

సరింబేకలు(-పేకలు) వి.బ.వ. నేతలోపొడుగు, అడ్డం.

సరియ[1] రూ. సరె[1]. వి. 1. దంతాలసందు. మను. 4.60 ; 2. సందు. ఆం. భా. 1.145 ; 3. రంధ్రం. ఆం. భా. 1.145.

సరియ[2] వి. సరియక్షేత్రం, వరిభూమి. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1204. క్రీ.శ. 1292.

సం. సరి-. నీటిబుగ్గ.

సరియించు రూ. సరించు, సరియించ్చు. స క్రి. 1. అఖండ దీపానికి నూనె సిద్ధంచేయు. ద. హిం. శా. సంపు. 4. శా సం. 1014. క్రీ. శ. 1038 ; 2. సిద్ధంచేయు ; 3.. అందించు.

సరియింపన్ రూ.చూ. సరియింప్పన్. అవ్య. ద్రు. జరిగించ టానికి. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 1006. క్రీ శ. 1087.

సరియించ్చు రూ.చూ. సరియించు. స.క్రి. జరిగించు. ద.హిం. శా. సంపు. 4. శా. సం. 1013. క్రీ.శ. 1064.

సరియింప్పన్ రూ. సరియింపన్. అవ్య. ద్రు. జరిగించ టానికి. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1014 క్రీ.శ. 1082.

సరియింపన్ చూ. సరియించు.

సరియింప్పన్ చూ. సరియించ్చు

సరియు రూ.చూ. సరుదు[2]. స.క్రి. సమంగాపంచు. భల్లా. 1.

సరివ రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లోగాని, ఉప్పునీరు, ఉప్పునీటిగాలి బాగాతగిలే ప్రదేశాల్లోగాని నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగేచెట్టు (Casuarina equsetifolia).

సరివి రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లోగాని, ఉప్పునీరు ఉప్పునీటిగాలి బాగా తగిలే ప్రదేశాల్లోగాని నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు. (Casuarina equsetifolia).

సరివికంప రూ. సర్వికంప. వి. ఆముపదుగులో వేయ టానికి ఆముకాల్చటానికి వాడే సరివిముంత. సరివిక్ర వి. సరివిపేళ్ళు, సవుక్కట్టె, ఆముకాల్చటానికి వాడే సరివిచెట్టు క్ర. సరివిపేళ్ళు వి.బ.వ. ఆముకాల్చుకు వాడే సరివిచెట్ల కట్టెలు.

సరిసదగా క్రి. విఅ. సతమతమైనట్లుగా. జైమినిభా. 4.77.

సరిసప్పుడు రూ.చూ. చడిచప్పుడు. వి. చడిచప్పుడు. కాశీ. 5.289.

సరిసాధనం వి సర్వసాధారణం.

సరిసెద్దు చూ. సరి[5].

సరిహద్దు రూ. సరహద్దు, సరహద్ధు, సరిదు, సరిహద్దు, సరుదు, సర్దు. వి. పొలిమేర. పల్నా. పు.33. ద.హిం. శా. సంపు. 10. శా. సం. 755. క్రీ.శ. 1604.

హిం. సర్‌హద్ ; మరా. సర్‌హద్ద. మేర, పొలిమేర ; ఉ. పార. సర్-హద్. అవధి, మేర, సీమ ;

క. సరహద్దు ; త. చరకత్తు, సరిహద్దు, < ఉ. సర్-హద్.

సరద్దుగోడ వి. దొడ్డిగోడ. దొడ్డివైపునగాని, పొలాల్లో గాని ఒకేవైపున(హద్దుగా) కట్టిన చిన్నగోడ. < సరిహద్దు + గోడ. సరిహద్దురాయి రూ. సరెద్దురాయి. వి. ఊరి పొలి మేరను సూచించేరాయి. సరిహద్దురౌతు వి. సరిహద్దురాయి.

సరిహద్దు రూ.చూ. సరిహద్దు. వి. పొలిమేర, ఎల్ల.

సరీను వి. కండి. గోడలకట్టుబడిలో వాడే రాతిముక్క.

సరుకారు రూ.చూ. సర్కారు. వి. ప్రభుత్వం, సుబాలో ఒకభాగం. ద. హిం. సంపు. 10. శా. సం. 772. క్రీ.శ. 1696.

సరుకు[1] రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో గాని ఉప్పునీరు ఉప్పునీటిగాలి బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగులఎత్తువరకు పెరిగి వంటచెరకుగా ఉపయోగపడేచెట్టు (Casuarina equsetifolia).

సరుకుచెక్కరంగు వి. సరుకుచెట్టు ఆకుతోగాని చెక్కతో గాని తయారుచేసిన ఎరుపురంగు.

సరుకు[2] రూ.చూ. సరకు[1]. వి. 1. సామాను ; 2. సారాయి

సరుకుపిడత వి. సారాయిబట్టీలో గూనలోనిఊట సారాయిగా దిగటానికి వీలుగా కిందభూమిమీద పెట్టిన మట్టిపాత్ర. సరుకులు వి.బ.వ. కుమ్మరి అమ్మటానికి సిద్ధంచేసిన కండలు, సట్లు, తొట్లు మొ. పాత్రలమొత్తం.

సరుగు[1] రూ.చూ. సరుగుడు. వి. వంటచెరకుగాఉపయోగ పడే, సముద్రతీరప్రాంతాల్లో పెరిగే ఒకరకంచెట్టు, చౌక చెట్టు (Casuarina equsetifolia).

సరుగు[2] వి. 1. సజ్జ, జొన్న మొ. వాటికంకిపొట్ట ; 2. బొంకు (కంకి) వదలనిగింజ.

సరుగు[3] అ.క్రి. వర్ధిల్లు, పెరుగు. రాఘవ. 2.6.

క. సరి. ముందుకుపోవు ;

సం. సృ.పోవు.

సరుగుడు[1] రూ. సరవి, సరి,[2] సరికి, సరిగి. సరివ, సరివి[2], సరుకు,[1] సరుగు[1], సరువు[2], సర్వి, సర్విన్. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో, ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగులఎత్తువరకు పెరిగే వంటచెరకుగా ఉపయోగపడే చెట్టు (Casuarina equsetifolia).

సరుగుడుకఱ్ఱ వి. ఒకరకం వంటకట్టె, సరుగుడు చెట్టు క్ర.

సరుగుడు[2] రూ.చూ. సరికూడు. వి. బియ్యం నానబోసి రుబ్బి ఉడకబెట్టిన అన్నం,

సరుగుడు[3] వి. తడక, చలుగుడు, కంప మొ. వి వేసి ఈడ్చుకొని వచ్చే చక్రాలు లేని తడిక.

సరుగునేత రూ.చూ. చెరగునేత. వి. పడుగులో పేకదారం పోగులు కలని పోయేటట్లు చిక్కగా నేసిననేత.

**సరచు** చూ. చరచు. స.క్రి. ఎడమచేత్తో రాతితో వాటలో భాగంలోను, కుడిచేత్తో సలపతో వాటపైభాగంలోను చేతిమీద కుండను తిప్పుకుంటూ పాత్రఆకారం పూర్తిగా వచ్చేలట్లు సాగగొట్టు.

**సరుడు**[1] వి. మెడలో ధరించే బంగారునగ, గరిలేనిసరం. సారంగ. 1.94.

**సరుడు**[2] వి. బాణం. చండాంగ. 1.

**సరుణు** వి. ప్రమిదలకు సున్నంపూసి ఊరేగింపుతో పోలేరమ్మ గుడిదగ్గరకి తీసుకొనిపోయి అక్కడ కుడుములు, పొంగలి నైవేద్యంపెట్టి పెళ్ళికొడుక్కి ఆడవేషంవేసి మేళంతో అమ్మవారికి చేసేప్రదక్షిణం.

**సరుదు**[1] రూ.చూ. సరిహద్దు. వి. ఎల్ల, మేర, సరిహద్దు.

**సరుదు**[2] రూ. సదురు², సద్దు², సరియు, సర్దు² సరుసు. స. క్రి. 1. సమంగా విభజించు. పరమ. 4.236 ; 2. అద్దలించు, కొయ్యసాధనాలతో మెల్లగా కొట్టు.

క. సరి. సర్దు, సరైన క్రమంలోఉంచు ; తు. సరి. సరైన, సరిగాఉన్న, తగిన, ఉచితమైన ; త. చరి. తగినది, సరైనది ; కుఇ. సర్న, తిన్నని ; కురు. సర్య. సరైన స్థలంలో ఉంచు ; మాల్తొ. సర్యర్. సరైన, మాన్పిన.

**సరుదుకొను** రూ. సద్దుకొను, సర్దుకొను. స.క్రి. సవరించుకొను పల్నా. 25పం.

**సరుదు**[3] రూ. సర్దు³. వి. వరద, వెల్లువ.

**సరుచేష్మా** రూ.చూ. సర్చేషం. వి. దఫేదార్ల అధికారానికి లోబడిన కొంతమంది నౌకర్ల సమూహానికి క్యాప్టన్.

**సరుము** రూ.చూ. సరువు⁴. స.క్రి. మట్టిని చేత్తో బాగా రుద్దు.

**సరులు** చూ. సరి¹.

**సరువ** వి. 1. బిందె ; 2. కడవ.

**సరువడము** చూ. చరచు. వి ముద్ద, పిండం, పిడచ.

**సరువు**[1] చూ. చమురు. అ.క్రి. అఖండదీపానికి నూనె, నేయి జాగ్రత్తచేయు. ద. హిం. కా. సంపు. 4. కా. సం. 1110. క్రీ.శ. 1239.

**సరువు**[2] రూ.చూ. సరుగుడు¹. వి. ఒక విదేశపు చెట్టు.

**సరువు**[3] వి. 1. నెత్తురు పారుకొనే రోగం ; 2. వానజల్లు.

**సరువు**[4] రూ. సరుము, సర్వు. స.క్రి. మట్టినిచేత్తో బాగారుద్దు.

**సరుస** రూ.చూ. సరస. వి. 1. సరస, సమీపం E.I. 13. క్రీ.శ. 1434 ; 2. పక్క, దాపు. శాళ్ల. సం. 5.58.

**సరుసు** రూ.చూ. చరచు. స.క్రి. ఎడమచేత్తో రాతితో వాటలో భాగంలోను, కుడిచేత్తో సలపతో వాట పైభాగంలోను చేతిమీద కుండను తిప్పుకుంటూ పాత్రఆకారం పూర్తిగా వచ్చేటట్లు సాగగొట్టు.

**సరసుకొను** అ.క్రి. పాలుపంచుకొను. **సరుసుసర్దు** స.క్రి. ఒకసారి సర్దినకుండల్ని మళ్ళీ సద ంసలపతో నునుపు చేయు.

**సరె**[1] రూ.చూ. సరియ¹. వి. 1, సందు. చంద్రాంగ. 2.46 ; 2. కన్నం, రంధ్రం.

**సరె**[2] చూ. సరి¹.

**సరెట్టుబడితె** చూ. సరి⁵.

**సరెంటి** చూ. సరి⁵.

**సరెంటిపొగడ** చూ. సరి⁵.

**సరెంటివేయు** చూ. సరి⁵.

**సరెంటు** చూ. సరి⁵.

**సరెంటె** చూ. సరి⁵.

**సరెద్దు** చూ. సరి⁵.

**సరెద్దుమోకు** చూ. సరి⁵.

**సరెద్దురాయి** రూ.చూ. సరిహద్దురాయి. వి. ఊరి పొలిమేరను సూచించేరాయి.

**సరెనరు** చూ. సరి¹.

**సరే** చూ. సరి¹.

**సరేపోలమ్మపండగ** చూ. సరి¹. వి. దేవాంగులు వైశాఖమాసంలో చేసుకొనే ఒకపండుగ.

**సరేయి** వి. సత్రం.

హిం. సరాయ్. సత్రం, దావిడి ; ఉ. పార. సరా.ఎ. సత్రం, దివ్యభవనం ;

త. చరామ్.

<ఉ. సరా. ఎ.

**సరేషు** రూ. సరేసు. వి. ఒకరకం బంక (దీన్ని వజ్రం అని కొందరు వ్యవహరిస్తారు).

హిం. సరేస్. పరిమాణం, వజ్రం ; ఉ. పార. సరేష్. గంజి. బంక.

<ఉ. సరేష్.

**సరేసు** రూ.చూ. సరేషు. వి. ఒకరకం బంక.

**సరోజ** వి. ఒకరకం గులాబిరంగు.

సం. సరోజ-. పద్మం ; హిం. సరోజ్. కమలం ; హిం. ఉ. రోజా. గులాబి.

<సం. సరోజ- (అర్థవిపరి.).

**సరోటి** చూ. సరి⁵.

**సరోటితాడు** చూ. సరి⁵.

**సరోతా** వి. వక్కలు పొడిచేసే కత్తెర.

హిం. ఉ. సరోతా, సరౌతి. వక్కలను ముక్కలు చేసే సాధన విశేషం.

<ఉ. సరోతా.

**సర్క** వి. ఒకరకం జంతురోగం.

**సర్కాయించు** రూ. సరకాయించు. స. క్రి. సర్దుకొను.

హిం. ఉ. సర్కా(నా). ఉన్నచోటునుంచి ముందుకు జరుపు. తొలగించు.

<ఉ. సర్కా(నా) +-ఇంచు³.

**సర్కార్** రూ.చూ. సర్కారు. వి. 1. ప్రభుత్వం ; 2. ప్రభుత్వం వారి.

**సర్కారాముదాలు** చూ. సర్కారు.

**సర్కారి** రూ.చూ. సర్కారు. వి. 1. ప్రభుత్వం ; 2. ప్రభుత్వం వారి.

**సర్కారు** రూ. సరకారు, సరుకారు, సర్కార్, సర్కారి. సురుకారు, వి. 1. ప్రభుత్వం. నె. కా. కందుకూరు. 47. క్రీ. శ. 1651, రంగా. చ. 1.116 ; 2. ప్రభుత్వంవారి.

హిం. సర్కార్. ప్రభువు, ప్రభుత్వం, యజమాని,

పాలకుడు, సర్కారీ. ప్రభుత్వసంబంధమైన; మరా. సర్‌కార్; ఉ. సర్కార్. సర్దారు, ప్రభువు, రాజ్యం; పార. సర్-కార్. రాజాస్థానం, ప్రభుత్వం, ఎస్టేటు, ఆస్తి అనేక పరగణాలు కలిగిన జిల్లా, సూపరింటెండెంటు, వ్యక్తులకు ఇచ్చే యువర్ హైనెస్, యువరానర్ మొ. వాటితో సమానమైన బిరుదు, సర్-కారీ. ప్రభుత్వానికి సంబంధించిన;

క. సరకార, సర్కార్, సర్కారు; త. సర్‌క్కార్, సర్కార్; మ. సర్‌క్కర్.

<ఉ. సర్కార్

సర్కారాముదాలు వి. బ. వ. ఒకరకం ఆముదాలు. <సర్కారు+ఆముదాలు. సర్కారుసాంబ. వి. ఒకరకం వడ్లు, GEB. 24వ నెంబరు.

సర్జా రూ.చూ. సజ్జా. వి. 1. ఇంటిముందు స్తంభాలమీద వేసిన కప్పు; 2. సిమెంటు పోతపోసి తయారుచేసిన కప్పు, శ్లాబు.

సర్టింగ్ రూ.చూ. షర్టింగు. వి. చొక్కాలకోసం నేసినబట్ట.

సర్తాడు చూ. సరి[5].

సర్దు వి. చెమట.

సం. స్వేద-. చెమట; హిం. ఉ. సర్ద్. చల్లని.

సర్తె వి. అక్కిడికట్టె, గుంటకకుకట్టిఎద (పెర) పెట్టే సాధనం.

సర్దా రూ.చూ. సరదా. వి. 1. వినోదం, విలాసం, ఆనందం; 2. ఆసక్తి.

సర్దాడు చూ. సరి[5].

సర్దారు రూ.చూ. సరదారు. వి. నాయకుడు.

సర్దు[1] రూ.చూ. సరిహద్దు. వి. ఎల్ల, మేర, సరిహద్దు.

సర్దు[2] రూ.చూ. సరుదు[2]. స.క్రి. 1. సమంగా విభజించు; 2. సవరించు; 3. ఇచ్చు, పుచ్చుకొను.

సర్దుకొను రూ.చూ. సరుదుకొను. స.క్రి. సవరించుకొను. సర్దుగిట్ట వి. కొన్నిపశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలిగిట్ట. సర్దుబాటు రూ. సర్దుబాటు. వి. 1 సవరింత: 2. ఇవ్వటం.

సర్దు[3] రూ.చూ. సరుదు[3]. వి. వెల్లువ, వరద.

సర్పం వి. పరంబడె, పాకబద్ద, పిడారుబద్ద, పిరాటుబద్ద, పిరిటిబద్ద, పైపారుబద్దరేక, రేకబద్ద, వంకరతీగె, వంపు. వంపుడుబడితె, వంపుడువాసం, పంగలుగాఉన్న ఒసి కర్రలమీద పొడుగ్గా వేసిన కర్ర.

సర్పరా రూ.చూ. సరఫరా. వి సమకూర్చటం, అమర్చటం.

సర్పరాయి రూ.చూ. సరఫరా. వి. సమకూర్చటం, అమర్చటం.

సర్పరేఖ వి. పిట్టగోడలో అమర్చేపనితనంగల తడిక.

సం. సర్ప-. పాము, రేఖా. గీత.

<సం. సర్పరేఖా. (అర్థవిపరి.).

సర్పాక్షి వి. తెల్లనిపూలుపూసే భూమిలోపల పెరిగే ఒకరకం పొద. (Ophiolrhiza Mungos).

సర్పి రూ.చూ. చప్పి[1]. వి. ఒకరకమైన చర్మవ్యాధి.

సర్పెన రూ.చూ. సరిపణి. వి. 1. గొలుసు; 2. అలంకారంగా ఉపయోగించే బంగారంగొలుసు; 3. జనపగొలుసు.

సర్పేషము రూ.చూ. సరిపేషు. వి. తురకలపాగామీదధరించే నగ. ధను. 1.43.

సర్మరాయి చూ. సరుము. వి. కుమ్మర్లు గూనలను సరిచేయటానికివాడే చరుచురాయి.

సర్య వి. చర్య, సేవ. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 156 క్రీ.శ. 1364.

సం. చర్యా. తిరగటం, గతి, నడవడి.

<సం. చర్యా.

సర్యూటు వి. దేశసంచారం, తిరిగిరావటం.

ఇం. *Circuit*. ప్రదక్షిణం, దేశసంచారం.

<ఇం. Circuit.

స్రరాట చూ. సరి[5].

స్రరున అవ్య.ద్రు. జర్రున. (ధ్వన్యను.).

సర్లపలుపు వి. పట్టెడ, బండికాడికి ఎడ్లనుకట్టేతాడు లేక తోలు పరికరం.

సర్లాక చూ. సరి[5].

సర్వ రూ.చూ. సరవ. వి. 1. చట్టి, చిన్నమట్టిపాత్ర; 2. నీళ్ళుకాచే లోహపుకాగు; 3 వంటకువాడే చిన్నమట్టిపాత్ర; 4. గుండ్రంగాఉండే ఒకరకం ఇత్తడిగిన్నె.

సర్వకరపరిహారువు వి. సమస్తకరవర్జితం, సర్వమైన పన్నుల విడుపు. E.I. సంపు. 4. శా.సం. 43. క్రీ.శ. 1053.

సం. సర్వకరపరిహార-. అన్నిపన్నుల మినహాయింపు

<సం. సర్వకరపరిహార-.

సర్వటిగుంజ చూ. సరి[5].

సర్వదుంబాలా వి. పన్నులేనిమాన్యం.

సం. సర్వ-. అన్ని.

<సం. సర్వ-+ దుంబాలా. (మిశ్రన.).

సర్వదుంబాలఇనాం చూ. సర్వదుంబాలా. వి. చాలామందికి కలిపి పూర్తిపన్నులేకుండా ఇచ్చిన ఇనాం.

సర్వంతోటకూర వి. ఏదైనా సులభమే అని చెప్పేటప్పుడు ఉపయోగించేమాట. (తోటకూర సులభంగా దొరుకుతుంది).

సం. సర్వ-. అన్ని.

<సం. సర్వ-+తోటకూర.

సర్వభోగంశ్రోత్రియం వి. అన్నిహక్కులున్నశ్రోత్రియం.

సం. సర్వ-. సమస్తం. భోగ-. అనుభవం, శ్రోత్రిం-బ్రాహ్మణుడు, వేదంబాగా తెలిసినవాడు.

<సం. సర్వ-+సం. భోగ-+ సం. శ్రోత్రియ.

సర్వమంగళము వి. శూన్యం. భీమ. 2.133.

సం. సర్వమంగళ-. అంతాశుభం.

<సం. సర్వమంగళ- (అర్థవిపరి.).

సర్వమధ్యస్థము వి పరస్పరంవాడుకొనేది.

సం. సర్వ-. సమస్తం, మధ్యస్థ-. మధ్యఉండేది.

<సం. సర్వమధ్యస్థ-. (అర్థవిపరి).

సర్వలగ్గ వి. శత్రుసేనలు నాలుగు పక్కలనుంచి కోటనెగబాకటం, రాజవా. 5.32.

సం. సర్వ-. సమస్తం, అన్ని.

<సం. సర్వ-+లగ్గ. (మిశ్రన.).

సర్వసమస్యము వి. సకలపూజనీయం, Hy. Arch. 13.42.

క్రీ.శ. 1215.

సం. సర్వ-. అన్ని, సమస్తం. సమస్యా. కలయిక. సమస్యా పూరణంలో ఇచ్చే చిక్కుప్రశ్న.

<సం. సర్వసమస్యా, (అర్థవిపరి.).

సర్వసిద్ధిసరసులు వి.బ.వ. నెల్లూరి నెరజాణలకు సరిపోయే సరసులు.

సం. సర్వసిద్ధి-. అన్నీ సిద్ధించిన వ్యక్తులు. సరస-. రసికులు.

<సం. సర్వసిద్ధిసరస-. (అర్థవిపరి).

సర్వి రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లోగాని, ఉప్పునీరు, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగేచెట్టు. (casuarina equsetifolia).

సర్వికంప యా.చూ. సరివికంప. వి. ఆముపదుగులో వేయటానికి, ఆముకాల్చటానికి వాడే సరివిమండ.

సర్వీ రూ.చూ. సర్వే. వి. 1. భూమికొలత ; 2. భూపరిశీలన.

సర్వీస్ రూ.చూ. సరుగుడు. వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లోగాని, ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు.

సర్వీస్‌చెట్టు వి. చౌకచెట్టు, ఇసుకనేలల్లో, ఉప్పునీరుగాని, ఉప్పునీటిగాలిగాని బాగా తగిలే ప్రదేశాల్లో నిటారుగా 50 అడుగుల ఎత్తువరకు పెరిగే చెట్టు (casuarina equisetifolia).

సర్వీస్ఇనాం వి. ప్రభుత్వోద్యోగుల కిచ్చిన ఇనాం.

ఇం. *Service* సేవ.

<ఇం. Service+ఇనాము.

సర్వీసు వి. 1. సేవ ; 2. ఉద్యోగంలో ఉండి పనిచేయటం.

<ఇం. *Service* సేవ.

ఇం. Service.

సర్వు రూ.చూ. సరువు. స.క్రి. మట్టిని చేత్తో బాగా రుద్దు.

సర్వుబోకి వి. అంచుకాడికి మూతికట్టేసి జాతర్లలో బలి తిరిగేవాడు పట్టుకొని తిరిగే మట్టిపాత్ర.

సర్వే రూ. సర్వీ. వి. పొలం కొలవటం మొ.పనులు.

ఇం. *Survey* ఒకభూభాగం యొక్క పరిమాణాదుల్ని తెలుసుకోవటం.

<ఇం. *S*urvey

సర్వేకొలతరాయి వి. గుమ్మంరాయి, గ్రామాలకు చివర, పొలాలకు, స్థలాలకు వీథులకు మధ్య, హద్దులను సూచిస్తూ పాతి పెట్టినరాయి. సర్వేరాయి వి. గుమ్మంరాయి, గ్రామాలకు చివర, పొలాలకు, స్థలాలకు, వీథులకు మధ్య హద్దులను సూచిస్తూ పాతిపెట్టినరాయి.

సర్సబండ రూ.చూ. సర్సుడుబండ. వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సర్సు రూ.చూ. సరుసు. స.క్రి. ఎడమచేత్తో రాయితో వాటలో భాగంలోను, కుడిచేత్తో సలపతో వాటపైభాగంలోను చేతిమీదకుండను తిప్పుకుంటూ పాత్ర ఆకారం పూర్తిగా వచ్చేటట్లు సాగగొట్టు.

సర్సుకొను స.క్రి. ఎడమచేత్తో రాయితో వాటలో భాగంలోను, కుడిచేత్తో సలపతో వాటపైభాగంలోను, చేతిమీద కుండను తిప్పుకుంటూ పాత్ర ఆకారం పూర్తిగా వచ్చేటట్లు సాగగొట్టు. సర్సుడటిక వి. సారెమీద కాకుండా రాయి, సలపలతో సర్సిచేసిన మట్టిపాత్ర. సర్సుడుపాత రూ. సర్సుడుబాత, సర్సేరపాత, సర్సేరుపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట. సర్సుడుపిడత వి. కుమ్మరి కుండల్ని సర్సేటప్పుడు కుడి, చేతివైపు పెట్టుకొనే నీళ్ళపాత్ర. సర్సుడుబట్ట వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట. సర్సుడుబండ రూ. సర్సబండ. వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి. సర్సుడుబాత రూ.చూ. సర్సుడుపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట. సర్సుడురాయి వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి. సర్సుడువిడస వి. కుండల్ని సర్సేటప్పుడు సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సర్సెషం రూ. సరిచేషము, సరుచేష్మా. వి. దఫేదార్ల అధికారానికి లోబడిన కొంతమంది నౌకర్ల సమూహానికి క్యాప్టన్.

ఉ. పార. సర్ - చష్మ, ఊట, పౌంటెన్, మూలం, జన్మస్థానం, నదీమూలం.

<ఉ. సర్ - చష్మ.

సర్సేరపాత రూ.చూ. సర్సుడుపాత. వి. కుండల్ని సర్సేటప్పుడు, సలపను తడుపు కోవటానికి వాడే తడిబట్ట.

సర్సేరుపాత రూ.చూ. సర్సుడు పాత. వి. కుండల్నిసర్సేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట.

సఱ్ఱు వి. ప్రుక్కటంలో అయ్యే ధ్వన్యనుకరణం. చంద్రాంగ. 2 ఆ.

సల వి. 1. వత్తి, పరికి. కు.సం. 11.128 ; 2. ప్రవేశం. ప్రబంధ. 1.193 ; 3. ఏటికాలువ మొ. వాటినీళ్ళు ఆవలికి పోవటానికి మధ్య అడ్డంగా నిలిపే జల్లి తడిక ; 4. చిన్నకాలువల్లో కర్రలతో చేపలు పడటానికి కట్టిన అడ్డం.

క. సల, సలవు. ప్రదేశం, సలుహ. ప్రవేశం, ప్రవాహం ;

సం. సల -. జలం, నీరు.

సలక[1] రూ.చూ. సలగె. వి. 1. చిన్నగోనె ; 2. రెండున్నర తూములు లేక మూడున్నర తూములధాన్యం ; 3. భూమి కొలత, ఒకఎకరం.

సలక[2] రూ.చూ. సలాక[1]. వి. 1. చువ్వ, లాపుపాటితీగ ; 2. కమ్మి. కిటికీలో అడ్డంగా గాని నిలువుగా గాని బిగించిన ఇనప బద్దీ.

సలకం వి. రాటిఆకులు బిగించిన వెదురుగొట్టం.

సలగ వి. 1. పారచిప్ప ; 2. దర్వాజాపట్టెలమీద లతలు చెక్కటానికి వాడే పనిముట్టు ; విణ. పొడవైన.

సం. శల్యక - ఈటె, ముల్లు ; ప్రా. సల్లగ -. శలాక, బాణం ;

క. సలగ.

<ప్రా. సల్లగ-.

సలగపాలు వి. పారచిప్ప. వి.ప్ర. 4.3.

సలగఎద్దు వి. ఎద్దులమందలోని వృషభరాజం. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 460. క్రీ.శ. 1288.

క. సలగ. పశురాజం (ముఖ్యంగా ఏనుగు లేదాఎద్దు).

సలగము వి. విష్ఠ. మలం.

సం. శమల - పురీషం, మలం, అపరిశుద్ధత. మురికి. పాపం. దుఃఖం. ఆపద.

సలగె రూ. సకల[1] వి. భూపరిణామవిశేషం, రెండున్నర తూములు. E. 1.10. 100-106. క్రీ.శ. 674.

క. సొలగె, సొలిగె, సొల్లగె. సొల్లిగె. కడవలో నాలుగోభాగం. ఎద్దులబండి బరువు ; కొడ. చల్గ్. గింజ ఎత్తు ; త. చలకై, గింజఎత్తు ; కో. చల్గ్. గింజఎత్తు.

<మూ.ద్రా. *చలక్.

సలతనత వి. అధికారం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 756.6. క్రీ.శ. 1592.

హిం. సల్తనత్. రాజ్యం. సామ్రాజ్యం ; ఉ. సల్తనత్. రాజ్యం, రాష్ట్రం, శాసనం ; పార. సల్తనత్. అధికారం, సామ్రాజ్యం, రాజ్యం ; అర. సల్తనత్. రాజ్యం, అధికారం.

<ఉ. సల్తనత్.

సలప[1] రూ. సల్ప[1]. వి. 1. చరుపుడు చెక్క, మట్టిని మెత్తగా నలగగొట్టటానికి మట్టిపాత్రను దట్టించటానికి కుమ్మర్లు వాడే కొయ్య, రాతిసాధనం ; 2. గూటం, బేల్దారులూ వడ్రంగులూ వాడే కొయ్యసుత్తె ; 3. ఆరుదలకి వచ్చిన వాటల్ని చరిచే సుత్తిలాంటి కొయ్యపరికరం.

సలపకోడు వి. ఆరుదలకు వచ్చిన వాటల్ని సర్వేసుత్తిలాంటి కొయ్యపరికరం. సలపచ్చు వి. మట్టిపాత్రకు అంచులో కక్కులుగా అచ్చు కొట్టటానికి ఉపయోగించే సలప. <సలప[1]+అచ్చు[1]. సలపపిడి వి. సలపను పట్టుకునే పిడిభాగం.

సలప[2] రూ. సల్ప[2], సిలప. వి. రాతిబండలోని పగలగొట్టబడిన పల్చని భాగాలు.

సలపన వి. కచ్చు, అచ్చులో ఉన్న పచ్చి ఇటికకు నేల మీది సన్నసన్న రాళ్ళు మట్టి అతకనందున ఏర్పడిన బుడిపె.

సలపరము చూ. సలపు.

సలపరించు చూ. సలపు.

సలపు రూ.చూ. సలుపు[2]. వి. 1. నొప్పి, బాధ ; 2. జ్వరం.

సలపరము వి. ఒంట్లో జ్వరం వచ్చినట్లుండు. సలపరించు రూ.చూ. సలుపరించు. స.క్రి. బాధించు, నొప్పిపెట్టు.

సలపెట్టు స.క్రి. భయపెట్టు.

సలరేపు రూ.చూ. చెలరేగు. అ.క్రి. విజృంభించు. కు.సం. 11.123.

సలవ[1] రూ. సలువ. వి. అధికం, హెచ్చు.

సలవ[2] వి. వెదల్పుఖండం, చెక్క.

సం. శలాకా. ముక్క.

సలవన విశ. పల్చన.

సలవరింత చూ. సలపరము. రూ.చూ. సలుపరింత, వి. 1. బాధ, పోటు ; 2. జ్వరం.

సలవరింపు చూ. సలపరము. వి. బాధ, పోటు ; 2. జ్వరం.

సలవాది రూ.చూ. చలవాది. వి. 1. పెద్దసెట్టి ; 2. పదిమందికి చావు సమాచారం తెలిపేవాడు.

సలరము వి. జ్వరం.

సం. జ్వర - జ్వరం.

సలసల రూ.చూ. చలచల. వి. కాగటంలోను, తెర్లటంలోను అయ్యేధ్వన్యనుకరణం. సిం. ద్వా. 6.126.

సలసలకాగు అ.క్రి. నూనె, నీళ్ళు మొ. వి బాగాకాగు.

సలహ్ రూ. సలహా, సలాహ, సలాహా. వి. మంచిసూచన.

బెం. ఒ. సలహా ; హిం. సలాహ్. బుద్ధి. ఆలోచన. నెమ్మది, జాగ్రత్త, ఎన్నిక, సంభాషణ ; ఉ. అర. సలాహ్ సంధి, బుద్ధి, సలహా, నెమ్మది, శాంతం, సరళత; సజ్జనత ;

క. సలహా, సలహె, సల్లా.

<ఉ. సలాహ్.

సలహా రూ.చూ. సలహ్. వి. 1. ఆలోచన ; 2. సమ్మతి ; 3. మంచిసూచన.

సలా రూ.చూ. సలహ్. వి. మంచిసూచన.

సలాక రూ. సడాక, సలక, సలాకా, సలాకి, సలాకు, సలాఖ, సలాయి. వి. 1. వెదురుమొ. వాటిబద్ద. క్రీడా. 1.70 ; 2. బంగారం మొ. వాటికమ్మి. చా.మం. 1.130 ; 3. చువ్వ, లావు పాటితీగ ; 4. కిటికిలో అడ్డంగాగాని, నిలువుగాగాని బిగించిన ఇనపబద్దీ ; 5. దట్టనగజం, బండల్లో తొలిచిన బెజ్జాల్లో తుపాకిమందు కూరటానికి వాడే ఇనపకడ్డీ ; 6. పాకబద్ద జల్లను పట్టిఉంచే గడకొయ్యల మీద అడ్డంగా పరచిన కర్ర ; 7. రాటతిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; 8. మరమగ్గంలో పన్నెబిగించిన పైచెక్క ; 9. నేతబద్దెను దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ ; 10. రంగునీళ్ళు అండాలో ఉడకబెట్టటానికి పీలుగా పక్కన ఉండేవంప ; 11. సాంచెమీద పేనినబద్ద.

సం. శలాకా. కడ్డీ ; ప్రా. సలాకా, సలాగా, సలాయా ; అ.మా. సలాగా, సలాయా, సిలాగా; సిలియా ; పా. సలాకా ;

క. సలగె, సలాకి, సలాకె. ఇనపచువ్వ.

<ప్రా. సలాకా.

సలాకా రూ.చూ. సలాక. వి. 1. చివరవెడల్పుగాఉన్న చిన్న గడ్డపార ; 2. చువ్వ.

సలాకి రూ.చూ. సలాక. వి. 1. రాటినూలం దూర్చిన ఇనపఊచ ; 2. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; 3. దండెదగ్గర నేతపడుగులో దూర్చిన ఇనపఊచ ; 4. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య, నేతనేసేటప్పుడు దీనిమీద నాడె ఆడుతుంది ; 5. రాటతిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; 6. మరమగ్గంలోపన్నెబిగించిన పైచెక్క ; 7. నేతబద్దెను దోనెకు బిగించే

పొడుగాటి ఇనపచువ్వ ; **8.** రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనపఊచ ; **9.** దట్టనగజం, బండల్లో తొలిచిన బెజ్జాల్లో తుపాకిమందు కూరటానికి వాడే ఇనపకడ్డీ.

**సలాకు** రూ.చూ. సలాక. వి. **1.** చువ్వ, లావుపాటితీగ ; **2.** కమ్మి, కిటికీలో అడ్డంగాగాని నిలువుగాగాని బిగించిన ఇనపబద్దీ ; **3.** బంగారు మొ. వాటికమ్మి ; **4.** రాట తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; **5.** మరమగ్గంలో పన్నెబిగించిన పైచెక్క ; **6.** నేతబద్దెను దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ ; **7.** రంగునీళ్ళతొట్టిలో ఉడకబెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనపఊచ ; **8.** జంపఖానా మగ్గందోనెగాడిలో బిగించిన చిన్నపుల్ల.

**సలాఖ** రూ.చూ. సలాక. వి. పత్తినుంచిగింజలు వేరుచేయటానికి వాడే ఇనపకడ్డీ.

**సలాజిత్తు** రూ.చూ. సిలాజిత్తు. వి. పటిక సంబంధమైన ఖనిజపదార్థం.

**సలాది** రూ.చూ. చలవాది. వి. **1.** పెద్దసెట్టి ; **2.** పదిమందికి చావుకబురు తెలిపేవాడు.

**సలాపము** వి. సముద్రంలో ముత్యాలచిప్పలేరటం.

త. చలాపమ్. చిలాపము. ముత్యం చిప్పలేరటం
మ. సలాపమ్, శిలాపమ్.

**సలాపు** రూ.చూ. శ్లాబు. వి. పదతరం, సిమెంటుపోతపోసి తయారు చేసినకప్పు.

**సలామ్** రూ. సలాము, సల్లాము. వి. వందనం. పల్నా. 1220.

బెం. ఒ. సలామ్ ; హిం. సలామ్. ప్రణామం ; మరా. సలామ్. నమస్కారం ; ఉ. సలామ్. ప్రణామం, ఒకరకం పద్యం ; పార. సలామ్. వందనం, శాంతి, రక్షణం ; అర. సలామ్. ప్రణామం ;

క. సలాము.

<ఉ. సలామ్.

**సలాము** రూ.చూ. సలామ్. వి. నమస్కారం, వందనం. హంస. 4.213. రాజ. వి. 4.33.

సలాముచేయు స.క్రి. నమస్కరించు. సారంగ. 1.62.

**సలాయి** రూ.చూ. సలాక. వి. **1.** రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; **2.** మరమగ్గంలో పన్నెబిగించిన పైచెక్క ; **3.** నేతబద్దెను దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ ; **4.** రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనపఊచ ; **5.** నేతబద్దెను దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ.

సలాయిచీర వి. **1.** అంచులమధ్య నేతలో సన్నగీరలు పడేట్టు నేసిన చీర ; **2.** ఆయిదుకొలుకులదారం నీలి, రెండు కొలుకులదారం మరొకరంగుపెట్టి నేసిన చీర.

**సలాసు** వి. మూడు. ద. హిం. శా. సంపు 10. శా. సం 353. క్రీ.శ. 1600.

ఉ. పార. అర. సలాస్. మూడు.

<ఉ. సలాస్.

**సలాహ** రూ.చూ. సలహా. వి. మంచిసూచన.

**సలాహా** రూ.చూ. సలహా. వి. మంచిసూచన.

**సలి** వి. సందడి, అలికిడి. ఉ.హరి. 3.31.

సం. శబ్ద-. ధ్వని, చప్పుడు.

**సలిక** రూ. సలికె. వి. చిన్నపార.

క. సలికె, సలికె. ఇనపచువ్వ, పార.

సలికపార రూ.చూ. చెలకపార. వి. మట్టిపని చెయ్యటానికి వడ్డెవారు, రైతులు వాడేపార.

**సలికము** విశే. **1.** అల్పం ; **2.** సన్నని.

సం. స్వల్పక-. తక్కువైనది.

**సలికె** రూ.చూ. సలిక. వి. చిన్నపార.

సలికెపార రూ.చూ. చెలకపార. వి. మట్టిపని చెయ్యటానికి వడ్డెవారు, రైతులు వాడేపార.

**సలిగ** రూ.చూ. సలిగె. వి. **1.** కూడని స్వాతంత్ర్యం. పార్వ. 4.121 ; **2.** ఆశ్రయం. ప్రాపు. తాళ్ల. సం. 14.266.

**సలిగటం** రూ.చూ. చల్లగటం. వి. గ్రామదేవత పండుగలో ఇంట్లో పూజపెట్టి మూలపెట్టిన మట్టిపాత్ర.

సలిగటంకుండ వి. ఊర్లో అమ్మవారున్నప్పుడు శాంతికోసం మజ్జిగ పోసుకొని ఇల్లిల్లూ తిరుగుతూ తీసుకుపోయే కుండ.

**సలిగె** రూ. సలిగ. అవ్య. ద్రు. కూడని స్వాతంత్ర్యంతో. తాళ్ల. సం. 14.98 ; వి. ఆశ్రయం.

క.తు. సలిగె, ఆశ్రయం ; త. చలిగై.

**సలిఘటం** రూ.చూ. చల్లగటం. వి. గ్రామదేవత పండుగలో ఇంట్లో పూజపెట్టి మూలపెట్టిన మట్టిపాత్ర.

**సలిచప్పుడు** చూ. సలి. వి. చడీచప్పుడు. ఉ. హరి. 3.31.

**సలించు** అ.క్రి. చలించు. హరి. ఉ. 10.31.

సం. చల్. కదలు.

<సం. చల్ + -ఇంచు[3].

సలింత వి. **1.** కదలిక ; **2.** చెంగలింపు. సలింపు వి. **1.** కదలిక ; **2.** చెంగలింపు.

**సలితము** వి. కొలువుకుకాణి కొలువునుంచి తోయటం, (ఉద్యోగం నుంచి తీసివేయటం).

సం. చలిత-. కదల్చబడింది.

<సం. చలిత- (అర్థవిపరి.)

**సలింత** చూ. సలించు.

**సలింద్ర** రూ.చూ. చలిపందిరి. వి. చలివేంద్రం.

**సలింద్రము** రూ.చూ. చలిపందిరి. వి. చలివేంద్రం.

**సలిపి** రూ.చూ. చప్పి[1]. వి. పేలినట్లు ఎర్రటిగుల్లలుగుల్లలుగా లేచి బాధించే సోకుడువ్యాధి.

**సలిపిరి** రూ.చూ. చప్పి[1]. వి. పేలినట్లు ఎర్రటిగుల్లలు గుల్లలుగా లేచి బాధించే సోకుడువ్యాధి.

**సలిపిరిపాత** రూ.చూ. సరిపిడిపాత. వి. కుండల్ని సర్దేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట.

**సలిపిరిబండ** రూ.చూ. సలిపిడిబండ. వి. సర్దేటప్పుడు సలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

**సలిపిరిరాయి** రూ. సలిపిర్రాయి. వి. సర్దేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సలిపి[్రాయి రూ.చూ. సలిపిరిరాయి. వి. సర్సేలప్పుడు వాటాలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సలింపు చూ. సలించు.

సలీసు వి. **1**. సౌలభ్యం ; **2**. అడ్డులేకుండా సులభంగా పోవటం ; **3**. చవక.

హిం. సలీస్. సులభమైన, జాతీయమైన సారస్వత భాష ; ఉ. అర. సలీస్. సులభమైన, సాధారణమైన, చిక్కులేని ;

త. చలీచు, సలీస్.

< ఉ. సలీస్.

సలివేంద్ర రూ.చూ. చలిపందిరి. వి. సలింద్రం.

సలుకు చూ. చప్పి[1]. వి. పేలినట్లు ఎర్రటిగుల్లలుగుల్లలుగా లేచి బాధించే నోకుడువ్యాధి.

సలుగ రూ.చూ. సలువ[1]. వి. **1**. ధాన్యం కొలిచినప్పుడు నిర్ణీతసంఖ్య ముగిసిన వెంటనే గుర్తుకోసం దోసిటితో ఎత్తిపోసే ధాన్యంకుప్ప ; **2**. కొలిచేవాడికి పుట్టికింతని ఇచ్చే పెచ్చుధాన్యం ; **3**. పెచ్చు ; **4**. రూపాయలు మొ. వి. ఎంచినప్పుడు నిర్ణీతసంఖ్య ముగిసిన వెంటనే గుర్తుకోసం ఎత్తి ఉంచే రూపాయ మొ. వి.

సలుగు[1] రూ. సలువు[1]. వి. ఏదుపంది. కకుత్స. **4.93**.

సం. శల్ల-, శల్లక-, శల్యక-. ఏదుపంది, ఈటె ; ప్రా. సల్లగ- ; పా. సల్లక-. ఏదుపంది.

< ప్రా. సల్లగ-.

సలుగు[2] రూ.చూ. సలువు[2]. వి. **1**. మొరటువాడు ; **2**. నాగలికర్ర ; **3**. దున్నేటప్పుడు నేలతేలికగా పైపైన తెగటం.

సలుగుపీట రూ.చూ. సలువుపీట. వి. ఎలువసలువులకు ఏడికోలకాడి కలిపేచోట వారిణె దూర్చిన చిన్నకొయ్య గొట్టం.

సలుగుడు రూ.చూ. సరవడి. వి. చక్రాలు లేని లాగుడు బండి.

సలుప వి. కుమ్మరివాని ఒకానొకపనిముట్టు. హంస. 5.5.

సలుపరించు చూ. సలుపు[2].

సలుపరింత చూ. సలుపు[2].

సలుపు[1] రూ.చూ. చలుపు. స.క్రి. **1**. కావించు, చేయు. కు.సం. **4.112** ; **2**. కడపు. రం.రా. ఉ. 160ప 20పం.

సలుపు[2] రూ. సలపు. అ.క్రి. పుండు, కురుపు మొ. బాధపెట్టు. ద్వి.సా. చ. **2.36**పు. 19పం ; వి. **1**. నొప్పి, బాధ ; **2**. చిన్న చూపు ; **3**. జ్వరం.

క. సళె, సెళె. లాగటం, ఈడ్చటం. రోగంవల్ల నొప్పితో బాధపడు ; కుఇ. జెల్బ (జెస్-). లాగు, ఈడ్చు.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *దళ్-/*బెళ్-.

సలుపరించు రూ. సలపరించు, సళుపరించు. స.క్రి. నొప్పిపెట్టు, బాధించు. సలుపరింత రూ. సలపరింత. వి. **1**. నొప్పి, పోటు ; **2**. జ్వరం. సలుపూపోటూ వి. బాధ.

సలుపు[3] వి. **1**. నాగలి, బండి మొ. వాటిని పన్నేటప్పుడు కాడిని నొగమొదలుకు దగ్గరగా కట్టేది (దీనివల్ల నాగలి నేలలో బాగా దిగుతుంది. బండి భారమౌతుంది); **2**. లఘుత్వం ; **3**. చనవు.

సలుపూపోటూ చూ. సలుపు[2].

సలువ రూ. సలుగ, సలవ[1]. సెలగ[1]. వి. **1**. పెచ్చు, అధికం. పరమ. 4.175 ; **2**. కొలిచేవానికి పుట్టికింతఅని ఇచ్చే పెచ్చుధాన్యం ; **3**. కొలిచేటప్పుడు నిర్ణీతసంఖ్య ముగియటంతోనే గుర్తుకోసం దోయిలిలో ఎత్తిపోసే ధాన్యంకుప్ప ; **4**. రూపాయలు మొ. వి ఎంచేటప్పుడు నిర్ణీతసంఖ్య ముగిసిన వెంటనే గుర్తుకోసం ఎత్తిఉంచే రూపాయ మొ. వి.

సలువు[1] రూ.చూ. సలుగు[1]. వి. ఏదుపంది, ముళ్ళపంది.

సలువు[2] రూ. సలుగు[2], సల్గు. వి. **1**. దున్నేటప్పుడు నేల తేలిగ్గా పైపైన తెగటం ; **2**. శలాక.

సలువుపీట రూ. సలుగుపీట. వి. వారిణెపీట. ఎలువసలువులకు ఏడికోలకాడి కలిపేచోట వారిణ దూర్చిన చిన్నకొయ్య పీట.

సలువుపేడు రూ. జలువుపేడు, స్గలుపేడు. వి. ఏడికోలను పణతలో దూర్చేసందులో పైవైపు కొట్టేపేడు. దీనివల్ల నేల తేలిగ్గా తెగుతుంది.

సలుసు అ.క్రి. నొప్పిపెట్టు.

సలెకపార రూ.చూ. చెలకపార. వి. మట్టిపని చెయ్యటానికి వడ్డెవారు రైతులు వాడేపార.

సలెము వి. పైత్యంవల్ల శరీరంమీద ఏర్పడే దద్దురు.

సలేంద్రి రూ.చూ. చలిపందిరి. వి. చలివేంద్రం.

సల్గు రూ.చూ. సలువు[2]. వి. **1**. దున్నేటప్పుడు నేలతేలిగ్గా పైపైన తెగటం ; **2**. శలాక.

సల్దిదుత్త రూ.చూ. సద్దిదుత్త. వి. పొలంలోకి కూడు, గంజి మొ. వి తీసుకొనిపోవటానికి వాడే మట్టిపాత్ర.

సల్దిపురుగు వి. సాలెపురుగు.

సల్ప[1] రూ.చూ. సలప[1]. వి. **1**. బేసుమెంటునుంచి రెండడుగుల ఎత్తున రాతితోకట్టిన అరుగుచూరు ; **2**. కుమ్మరివాడు కుండలు నున్నగా చేసేటప్పుడు ఉపయోగించే కొయ్య ; **3**. పల్చనిబండ, సలప.

సల్ప[2] రూ.చూ. సలప[2]. వి. రాతిబండలోని పగలగొట్టబడిన పల్చనిభాగాలు.

సల్పు రూ.చూ. చలుపు. స.క్రి. **1**. కావించు, చేయు. కు. సం. 6.147 ; **2**. కడపు.

సల్లకడవ వి. ఊర్లో అమ్మవారున్నప్పుడు శాంతికోసం మజ్జిగ పోసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర.

సల్లపెట్టు స.క్రి. **1**. సడలజేయు ; **2**. జార్చు.

సల్లబుడత వి. భూమిలోపల పెరిగే ఒకరకం పొద.

సల్లసట్టి వి. పొలాలకుగంజి, సద్ది మొ. వి. తీసికొనిపోవటానికి వాడే మట్టిపాత్ర.

సల్లాడము రూ.చూ. చల్లడము. వి. చల్లటం, పైజామా. ఎజారు, సల్లడం.

సల్లాము రూ.చూ. సలామ్. వి. నమస్కారం.

సల్లికుకుటి రూ.చూ. నల్లికుంకుడు. వి. దక్కను, కృష్ణా, కర్నూలు, కడప, కర్ణాటక, చెంగల్పట్టు ప్రాంతాల్లో పెరిగే ఒకరకంచెట్టు. (Allophylus cobbe).

సల్లికుంకుడు రూ. సల్లికుకుటి. వి. దక్కను, కృష్ణా, కర్ణాటక, కడప, చెంగల్పట్టు ప్రాంతాల్లో పెరిగే ఒకరకం చెట్టు. (Allophylus cobbe).

సల్లు[1] రూ.చూ. సడలు. అ.క్రి. సడలు, వదులుగాఅగు.

సల్లు[2] రూ.చూ. జల్లు. వి. జడి.

సల్లువాన రూ.చూ. సొల్లువాన. వి. జల్లువాన.

సల్లోన రూ.చూ. సొల్లువాన. వి. జల్లువాన.

సల్లోపిల్లోయనియుండు (అనియుండు) అ.క్రి. కలగలుపుగా ఉండు.

సల్విసంపదలు చూ. చెలువ. వి.బ.వ. చెలువు. చెల్వి, సంపద. ద. హిం.గా. సంపు. 4.గా సం. 1268.

సం. సంపద్. ఐశ్వర్యం.

సల్సురాయి వి. సర్వేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రనిరాయి.

సళాది చూ. చలపాది. వి. పెద్ద అధికారినౌకరు, మణియం గాని కింకరుడు. హంస. 2.49.

సళిగె చూ. సెనగ. వి. బద్ద. పండి. చ. 5.343.

సళించు అ.క్రి. దుఃఖించు. నీలా. 2.84.

సం. చల్-. కదలు, చల-. కదలటం ; ప్రా. చల-.

<ప్రా. చల-+-ఇంచు[2].

సళియము వి. కలయంపి. పండి. చ. 4.295.

సళుపరించు రూ.చూ. సలుపరించు. అ క్రి. వ్రణం మొ. వి పోటెత్తు.

సళుపరింత వి. సళుపరించటం, సళుపు.

సళుపరింత చూ. సళుపరించు.

సళుపు రూ.చూ. చలుపు. అ.క్రి. వ్రణంలోనైనవి పోటెత్తు. తాళ్ల.సం. 13.62; వి. వ్రణంలోవచ్చేపోటు; విణ. 1. బాధాకరమైన. తాళ్ల. సం. 15.163 ; 2. భారమైన.

సళువు విణ. భారమైన.

సళ్ల(బెట్టు చూ. సళ్ల.

సళ్ల రూ.చూ. సడలు. అ.క్రి. 1. వెనక్కితగ్గు. హంస. 3.216 ; 2. నశించు. జారు. ప్రబంధ. 1.675 ; 3. వదులగు, నడలిపోవు. ధాతుమాల 91 ; స.క్రి. విడుచు, వదలు. చంద్రాంగ. 6.152 ; అచ్చ. రా.యు.131.

సళ్ల(బెట్టు స.క్రి. నడలచేయు. ఆము. 5.150.

<సళ్ల+-అ[7]+పెట్టు.

సళ్ళు[1] వి.బ.వ. ఊదర, పడుగుతీసిన తరవాత ఉన్న చెత్త. చెదారం.

సళ్ళుగొట్టు- (-కొట్టు[1]) అ.క్రి. 1. వానజల్లు పక్కల నుండిలోపలికి కొట్టు, జల్లుకొట్టు ; 2 పడుగుతీసిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్తచెదారంతూర్పారపట్టు. సళ్ళుతోలు అ.క్రి. పడుగుతీసిన తరవాత ధాన్యంమీద ఉన్న చెత్తా చెదారాన్ని తూర్పారపట్టు.

సళ్ళు[2] చూ. చన్ను. వి.బ.వ. 1. కుచాలు ; 2. కాళ్ళు.

సళ్ళు[3] రూ.చూ. సడలు వి. 1. వదులు ; 2. వానజల్లు.

సవ వి. 1. జాడ. కాశీ. 4.123 ; 2. క్రమం. అష్టమ. క. 1.25 ; 3. నాయ. ప్రబంధ. 1.450.

సం. ఛవి-కాంతి.

సవ(సందు రూ.చూ. సమసందు. వి. 1. సరిసందు, రాతి పేర్పులో ఒకదానికొకటి ఎదురుగా వచ్చే సందు ; 2. గొర్రు చాళ్ళమధ్య సమంగా ఉన్న ఎడం.

సవక వి. సరుగుడు చెట్టు.

సవకాల వి. ఒకరకం నేతగడి.

సవకాలగడిచీర చూ. చౌకంగడి చీర. వి. ఒకరకం గళ్ళ చీర, నేతలో పొడుగు వెడల్పుల గళ్ళు సమానంగా వచ్చేట్టు నేసిన చీర. సవకాలచీర రూ. సవకాల్చీర, సవకాల్చిరి. వి. ఒకరకం గళ్ళచీర, మటిరంగు పడుగులో తెల్లగళ్ళు పడేట్టు నేసిన చీర. సవకాల్చీర రూ.చూ. సవకాలచీర. వి. ఒకరకం గళ్ళచిర. సవకాల్చిరి రూ.చూ. నవకాలచీర. వి. ఒకరకం గళ్ళచీర, మట్టిరంగు పడుగులో తెల్లగళ్ళుపడేట్టు నేసిన చీర.

సవకాల్చీర చూ. సవకాల.

సవకాల్చిరి చూ. సవకాల.

సవటం రూ.చూ. నవుటం. వి. తొలికలుపు, పల్లపుభూమిలో తీసే మొదటికలుపు.

సవటమన్ను చూ. చౌడు. రూ.చూ. సవిటిమన్ను. వి. పాల నవిటిమట్టి, కొంచెం ఎరుపుగా ఇసక కలిపిఉన్నమట్టి.

సవఠాణము వి. 1. స్వరస్థానవిశేషం. బసవ. 70పు. 28పం ; 2. వీణకు కట్టబడిన స్వరభేదాన్ని తెలిపే తీగల్లో ఒకటి.

సం. సమస్థాన.-సమమైనచోట.

సవడలు వి.బ.వ. రెండడుగుల వరకు పెరిగే మంచినీటి చేపలు.

సవడి రూ.చూ. సవళి. వి. 1. జాడ. వరాహ. 1.1 ; 2. ఆయుధ విశేషం.

సవడికా(డు వి. యుద్ధంలో ఒకరకం ఆయుధం ధరించే వాడు. కు.సం. 11.40.

సవడు రూ.చూ. నవెడు. వి. 1. మూడుపోగులదారం ; 2. నాలుగుపోగులదారం, కొన్నిచోట్ల పట్టుదారం.

సవతాలు చూ. నవతి.

సవతి రూ. సవితి, సైతి. వి. సపత్ని, ఒకేభర్తగలస్త్రీలలో ఒకతె, ఏరాలు. భార. ఆది. 2.7.

సం. సపత్ని. సవతి ; ప్రా. సఉత్తి, సపత్తి సవత్తిణీ, సత్తియా, సవత్తి ; జైమహా. సవత్తి ; శౌ సపత్తి ; అ.మా. సవత్త-. విపక్షి, శత్రువు, సవత్తియా సవత్తి ; పా. సపతి, సపత్తి ; అప. సాయత్త- ; క.తు. సవతి, సపత్ని ; త. సవత్తి.

<ప్రా. నవత్తి.

సవతాలు వి. సవతి, ఏరలు. భార. భీష్మ. 1.168.

<సవతి+ఆలు. సవతికొడుకు వి. తోటిపెళ్ళాం కొడుకు. భార. అరణ్య. 6.298. సవతితనము వి. సహభార్యాత్వం. భాస్క. రా. అయోధ్యా. 131. ననవతితల్లి వి. మారుతల్లి, విమాత. సిం. ద్వా. 1.76 ; సవతిపొత్తు సవత్ని సంబంధం. సిం.ద్వా. 1.193. సవతిపోరు వి. పతులకయ్యం,

తగనిపగ. కళా. 2.3. సవతిబిడ్డలు వి.బ.వ. ఒకేభర్తగల భార్యలకు పుట్టిన బిడ్డలు. దశా. 5.55. సవతీవ వి. లతావిశేషం. చంద్రాంగ. 2.38.

**సవతీవ** చూ. సవతి.

**సవతు** వి. **1**. సామ్యం, ఔపమ్యం, ఈడు, సమానం. భార. ఆది. 3.210 ; **2**. విధం, పద్ధతి. ద్వి. పరమ. వి. **5.381** ; **3**. ఖ్యాతి. చంద్రాంగ. **4.37**.

సం. సపత్న-. శత్రువు, తుల్యుడు, సమతా. తుల్యం ; ప్రా. సవత్త- ; శత్రువు, తుల్యుడు; అ.మా. సవత్త-. విపక్షి, ప్రతిస్పర్ధి.

పా. సపత్త. విరోధి, విరోధం.

< ప్రా. సవత్త-.

సవతువచ్చు అ.క్రి. **1**. సాటివచ్చు. జైమినిభా. **1.34**. **2**. సమమగు, సాటిఅగు. రాజ. వి. 3.222 ; **సవతుసేయు (-చేయు)** స.క్రి. పోల్చు, సాటిచేయు. గౌ. హరి. 1.2.

**సవదండవల** వి. జాలభేదం, ఒకానొకవల. కాశి. **3.46**. యయా. 1.38.

**సవదరించు** స.క్రి. **1**. సంఘటించు. భార. ద్రోణ. **4.262** ; **2**. ఆశ్రయించు, వహించు. ఉ. హరి. 1.117 ; **3**. ధరించు, తాల్చు. కాశీ. 1.97 ; **4**. మోహించు. కాశీ. 4.18 ; **5**. చక్కజేయు, సవరించు. విక్ర. 1.158 ; **6**. సిద్ధంచేయు. వరాహ. 4.156 ; **7**. తీర్చు, దిద్దు. ఉ. రా. 7.346 ; **8**. అనుగ్రహించు. పద్మ. 4.179.

సం. సావధారణ-. అవధారణతోకూడింది ;

త. చవతరిత్తర్-.

< సం. సావధారణ-.

**సవము** రూ.చూ. సాము[2]. వి. సగం, అర్ధభాగం. ఆం. నా. సం. 61.

సవరాతిరి వి. అద్దమరేయి. ఆం. షదా. సుం. **50**. సవరేయి వి. అర్ధరాత్రి. పాండు. 5.28. సవసవ వి. **1**. చూచాయ, మెల్లమెల్ల. మను. 5.27 ; **2**. సంభ్రమం, తొట్రుపాటు. చంద్రభా. 3.23 ; క్రమక్రమం. కువ.చ. **4**.178 ; **4**. కొంచెం, అత్యల్పం. చంద్రరే. 1.124 ; **5**. భేదం. లక్ష్మీ వి. 2.56. సవసవగా క్రి. విశ. ద్రు. సూచనగా.

**సవర**[1] చూ. సవరించు. రూ. సవరు. వి. **1**. ఒత్తిడిలేనిది. పి.శకు. 4.175 ; **2**. చక్కనిది, అందమైనది. ప్రబోధ. **4**.7 ; **3**. మెత్తని, ఎగుడు దిగుళ్ళులేని.

**సవరచేయు** స.క్రి. **1**. చక్కజేయు, సరిచేయు. శృం. నై. 2.51 ; **2**. నున్నగింత నలపతో రెండోసారి సాపు చేయు ; **3**. సరిచేసేటప్పుడు పడుగుకు పెట్టిన గంజిని చేతులతో సమంగారుద్దు. **సవరతనము** రూ. సవరదనము. వి. చక్కదనం. క్రీడా. 2.53. **సవరదనము(-తనము)** రూ.చూ. సవరతనము. వి. **1**. చక్కదనం. సారంగ. 1.22పు. **13**పం ; **2**. శుభ్రపరచటం.

**సవర**[2] వి. ఒకఆటవికజాతిపేరు.

సం. శబర-. ఒకఅనార్యదేశం, ఆదేశంలోని ప్రజలు : ప్రా. సవర-, సమర-, సబర- ; జై. మహా. పా. శౌ. సవర-. ఒకానొక ఆటవిక జాతి ; అ.మా. సబర-, సంబరియా, సబరీ, సవర-. ఒకానొక అనార్యజాతి ; అప. సమర-.

< ప్రా. సవర-.

సవరపెనం వి. సవరలు ఉపయోగించే పెనం. సవరలు వి. బ. వ. చెంచుజాతివాళ్ళు, సవరవాళ్ళు. సవరాటకము వి. సవరవాళ్ళసంఘం.

**సవర**[3] రూ. సౌర. వి. **1**. ఆరుపోగులదారం ; **2**. నాలుగు పోగులదారం.

**సవర**[4] రూ.చూ. సావరిన్. వి. బంగారుసావరిన్, సవరస.

**సవర**[5] వి. మూల, రెండుదిక్కుల మధ్యభాగం.

**సవర**[6] వి. చవుడుబారటం.

**సవరణ** రూ. సవరణము, సవరన. వి. **1**. వాహనాద్యలంకారం. నిర్వ. రా. **7.143** ; **2**. యుద్ధపరికరం. భార. ఉద్యో. 1.226 ; **3**. సన్నాహం. భార. ఉద్యో. 3.131 ; **4**. సామగ్రి. భార. శాంతి. 2.388 ; **5**. సవరింపు. బాగుచేయటం, మరమ్మత్తు. నె. శా. వెంకటగిరి. 22 ; **6**. సౌమ్యం ; **7**. సేవ.

క. సవరణె. కలపటం, పోగుచేయటం ; త. సవరణై.

సవరణచేయు రూ. సవరణసేయు. స.క్రి. అలంకరించు. భార. మౌసల. 28. సవరణసేయు రూ.చూ. సవరణచేయు. స.క్రి. అలంకరించు, వాహనాదుల నలంకరించు. సవరణించు స.క్రి. సవరణచేయు. వరస. 4.65.

**సవరణము** రూ.చూ. సవరణ. వి. **1**. పరికరం ; **2**. చక్కచేయుటం.

**సవరణించు** చూ. సవరణ.

**సవరన** రూ.చూ. సవరణ. విశ. **1**. చదును, సమం. హరి. పూ. **1.130** ; **2**. సౌందర్యం. ప్రబంధ. 1.250.

**సవరనివా(డు** చూ. సవరు.

**సవరను** రూ.చూ. సావరిన్. వి. కాసు, ఒక బంగారునాణెం.

**సవరపుకాడ** చూ. సవరము.[1]

**సవరపుకుప్పె** చూ. సవరము[1].

**సవరపుమెకము** చూ. సవరము[1].

**సవరపెట్టు** స.క్రి. అడ్డగించు, ఇది చోరులుపయోగించే వాక్యం. ధర్మ. 1.90.

**సవరము**[1] రూ. సగరము, సౌరము. వి. **1**. చమరీమృగం తోక. పండి. చ. **5**.436 ; **2**. స్త్రీలు జుట్టుముడిలో ఉపయోగించే చమరవాలం. దశా. 6.34 ; **3**. మట్టిగోడ మధ్యలోదడి కట్టుకు బిగించేకర్ర.

సం. చమర-, చామర-, చమరీమృగం ; ప్రా. చమర-, చామర- ; పా. చామర- ; అప. చఉరియ ; క. చవర, చవరి, చవురి, చవుల, చౌరి ; తు. చవర్ ; త. చవరీ ; మ. చవరి. చమరీమృగం.

< ప్రా. చమర-.

**సవరపుకాడ** వి. పరాన్నజీవిగా ఇతరపొదలపై ఆధారపడి జీవించే ఒకరకం పచ్చటిమొక్క. (Cuscutareffexa).

**సవరపుకుప్పె** వి. సవరానికి మొదటఉండే గ్రంథి. ప్రబంధ.

1.76. సవరపుమెకము వి. బల్లి మెకం, చమరమృగం.
సవరాలగడ్డి వి. లంజెనవరం, జడలాగా పొడుగాటి కాడ ఉండే కలుపుమొక్క. తీగగా పాకుతుంది. ఆకును కూరగా వండుకుంటారు. (Paederia foefida).
సవరము² వి. చక్కదనం. క్రీడా. 56.
సవరాటకము చూ. సవర².
సవరాతిరి చూ. నవము¹.
సవరాలగడ్డి చూ. సవరము¹.
సవరించు చూ. సవర. స.క్రి. 1. చక్కబరుచు, సరిచేయు. కు.సం. 5.91; 2. సంగ్రహించు. భార. శాంతి. 3.307; 3. చక్కజేయు, సరిపెట్టు. మార్క. 1.170; 4. సిద్ధం చేయు. హరి. ఉ. 2.16; 5. ధరించు, తాల్చు. హర. 5.5; 6. రచించు, నిర్మించు. వరాహ. 1.38; 7. కూర్చు, ఘటించు. వరాహ. 3.114; 8. కలిగించు. వసు. 1.30; 9. అనుభవించు, పొందు. పాండు. 90; 10. చేయు. రాఘవ. 1.51; 11. పూను, (కోపం) వహించు. సమీర. 2.77; 12. సమకూర్చు. చంద్రభా. 3.22; 13. అనుభవించు, పొందు. శేషధ. 5.223.
క. సవఱు, సమఱు, సమనిసు, సవనిసు. సిద్ధం చేయు, సంపాదించు, పొందు, సమకూర్చు.
< సవరు + -ఇంచు.³
సవరించుకొను స.క్రి. 1. చక్కబరచుకొను. కు. సం. 5.91; 2. సిద్ధంచేసికొను. భార. కర్ణ. 2.367; 3. చేసికొను. ద్వి. పరమ. వి. 5.447. సవరింత వి. సవరించటం.
సవరింతచేయు రూ.చూ. సవరింతసేయు. స.క్రి. చక్కబరచు. సవరింతసేయు(-చేయు) రూ. సవరింతచేయు. స.క్రి. సవరించు, చక్కబరచు. రస. 3. సవరింపు వి. సవరించటం, చక్కబరచటం.
సవరింత చూ. సవరించు.
సవరింతచేయు చూ. సవరించు.
సవరింతసేయు చూ. సవరించు.
సవరింపు చూ. సవరించు.
సవరిల్లు చూ. సవరు.
సవరు రూ.చూ. సవర¹. విశే. చక్కనైన, అందమైన. పల్నా 1.177.
సవరనివాఁడు విశే. అందగాడు. తాళ్ల. సం. 14.250. సవరిల్లు అ.క్రి. ఒప్పు. రం.రా.ఉ. 69.పు 11పం. సవరుచు రూ.చూ. సవర్చు. స.క్రి. 1. చిత్రించు. ముకుంద. 2.122; 2. కూర్చు. సవరుపరుచు అ.క్రి. దిద్దు. సవర్చు రూ. సవరుచు. స.క్రి. 1. కూర్చు. ముకుంద. 150పు. 4పం.; 2. చిత్రించు. సవర్జేతబల్ల వి. కుదంకొట్టిన తరవాత పల్చగ. సున్నగ సర్చటానికి వాడే సలప.
సవరేయి చూ. సవము.
సవర్చు చూ. సవరు.
సవర్జేతబల్ల చూ. సవరు.
సవలీశంఖు వి. శంఖవిశేషం. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 131. క్రీ.శ. 1296.
సవలక్షగుండి రూ.చూ. సవలక్షగుండు. వి. దంతెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.
సవలక్షగుండు చూ. సవా. రూ. సవలక్షగుండి, సవాలక్ష గుండు, సౌలక్షగుండు. వి. బందెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.
సం. లక్ష. నూరువేలు.
సవలచ్చగుండు చూ. సవలక్షగుండు. వి. దండెదగ్గరపడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టే కండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.
సవళి¹ రూ.చూ. సవళి. వి. ఈటె, లోహదండం.
సవళి² వి. ఒకజాతి పందెంకోడి.
సవళి రూ. సబడి, సబడీ, సబరి¹, సబలము, సబల్లు, సబళ, సబళము, సబిడి, సబిల, సబిళము, సవడి, సవళ¹. వి. ఈటె. లోహదండం. కు. సం. 11.109.
సం. శర్వలా, సర్వలా. లోహదండం; ప్రా. సవ్వల-, సవ్వలా. ఈటె, సబ్బలం. ఆస్త్రవిశేషం; అ.మా. సబ్బలం. ఈటె;
క. సబిళ; తు. సవలియె, సపలె, సపల్యె, సపల్లై. ఈటెకారు, జాలరి, సబ్బళు. గడ్డపార; త. చవళమ్; మ. చవళం; కుఇ. సబలి. గడ్డపార.
< ప్రా. సవ్వల-.
సవసవ చూ. నవము.
సవసవగా చూ. నవము.
సవా రూ. సవ్వా. వి. ఒకటింబావు, సవాలక్ష. గౌ. హరి. పూ. 66పు.
సం. సపాద-; ప్రా. సవాఅ; ఒ. సవా. ఒకటింపావు. హిం. సవా, సవాఈ; మరా. సవా, సవ్వా. ఒకటింపావు.
< ప్రా. సవాఅ.
సవాణము వి. ఒకరకం పనిముట్టు.
సం, శాణ-. ఒరగల్లు; ప్రా. సాణ-.
సవాయి¹ వి. 1. మహమ్మదీయప్రభువుల బిరుదునామం. కళా. 1.33; 2. పడవ పెద్దమోకు.
హిం. సవాఈ. జయపురరాజులబిరుదు, $1\frac{1}{4}$.
సవాయిదూలం వి. పెద్దకొమెరమీది పిల్లదూలం.
సవాయి² వి. మేహరోగవిశేషం.
సవాయి³ రూ. సవ్వాయి. విశే. శ్రేష్ఠమైన. కళా. పీఠి. 33; వి. వెండి లేదా బంగారం.
ఉ. సొవామ్. వెండి లేదా బంగారం; పార సొవామ్. వెండిలేదా బంగారం మొత్తం.
< ఉ. సొవామ్.
సవరచేప వి. పాములాంటి తలవున్న చేప.
సవారాజన వి. పదిమందిని పిలిచిపెట్టే భోజనం.
సం. సమారాధన-. సేవించటం, పూజించటం.
< సం. సమారాధన- (అర్థవిపరి.).
సవారి రూ.చూ. సవారీ. వి. 1. గుర్రానెక్కిపోవటం. కువ.చ. 3.189; 2. పల్లకి; 3. రెండెడ్లబండిగూడు, గుడారం; 4. గుర్రపుస్వారీచేసేవాడు.

**సవారికచటం** రూ.చూ. సవారికచ్చడం. వి. పైనగూడు ఉన్న ప్రయాణపుబండి. **సవారికచలం** రూ.చూ. సవారికచ్చడం. వి. పైనిగూడు ఉన్న ప్రయాణపు బండి. **సవారికచ్చడం** రూ. సవారికచటం, సవారికచలం. సవారికచ్చరం, సవారుకచటం, సవారుకచలం, సవారుకచ్చడం సవారుకచ్చరం. వి. పైనగూడుఉన్న ప్రయాణపు బండి. **సవారికచ్చరం** రూ.చూ. సవారికచ్చడం. వి. గూడుబండి, పైనగూడు ఉన్న ప్రయాణపు బండి. **సవారికొమ్ము** వి. నిలువుగా ఉండి కొనవంపుతిరిగిన కొమ్ము. **సవారిబండి** రూ. సవారుబండి. వి. మనుష్యులు ఎక్కేబండి, సవారీకచ్చరం, పెట్టిబండి. **సవారివేయు** అ.క్రి. చనిపోవు.

**సవారీ** రూ. సవారి. వి. 1. గుర్రాన్ని ఎక్కిపోవటం. పద్మ. య. 7 ; 2. పల్లకి ; 3. వాహనం ; 4. బండిపైకప్పు ; 5. గుర్రపుస్వారీ చేసేవాడు.

హిం. సవారీ. స్వారీచేయటం, వాహనం, ఊరేగింపు ; ఉ. పార. సవారీ. స్వారీచేయటం, పరివారం, వాహనం ; క. సవార, స్వార. గుర్రంలేక బండి ఎక్కిన. గుర్రపు స్వారీచేసే మనిషి, స్వారీ చేయటం, నడపటం, పోవటం, వాహనం. బండ్లమీద ఉండే వెదురు పైకప్పు ; త. సవారి ; మ. సవారి.

< ఉ. సవారీ.

**సవారు** వి. 1. గుర్రంరౌతు ; 2. కొరడా.

హిం.ఉ. సవార్. గుర్రంరౌతు, అశ్వారోహిసైనికుడు.

< ఉ. సవార్.

**సవారుకచలం** రూ.చూ. సవారికచ్చడం. వి. పైన గూడు ఉన్న ప్రయాణపుబండి.

**సవారుకచ్చడం** రూ.చూ. సవారికచ్చడం. వి. గూడుబండి, పైనగూడుఉన్న ప్రయాణపుబండి.

**సవారుకచ్చరం** రూ.చూ. సవారికచ్చడం. వి. గూడుబండి, పైన గూడుఉన్న ప్రయాణపు బండి.

**సవారుబండి** రూ.చూ. సవారిబండి. వి. సవ్వారిబండి, గూడు బండి.

**సవాల్** రూ.చూ. సవాలు. వి. ప్రశ్న.

**సవాల** వి. 1. పెద్దగొంగళి ; 2. గొంగళి.

**సవాలక్షగుండు** రూ.చూ. సవలక్షగుండు. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.

**సవాలు** రూ. శవాలు, సవాల్. వి. ప్రశ్న, విచారణ, ప్రత్యుత్తరం కోసం వేసే యుక్తిప్రశ్న, చాలెంజి.

హిం. ఉ. సవాల్. ప్రశ్న ;

త. చవాల్. పందెం.

< ఉ. సవాల్.

**సవాలుచేయు** అ.క్రి. 1. యుక్తితో కూడిన ప్రశ్న వేయు ; 2. వేలంపాటపాడు.

**సవాలుదారుడు** వి. సవాల్ చేసేవాడు,

హిం. ఉ. అర. సవాల్ -. పార -. దార్. ప్రశ్నించే వ్యక్తి, పృచ్ఛకుడు.

< ఉ. సవాల్‌దార్.

**సవి**[1] రూ.చూ. సావి[1]. వి. భ్రాంతి. కు. సం. 8.8.

**సవి**[2] అవ్య. 1. ఇత్యర్థకం, అని. ఆం. బా. 3.67 ; 2. హేత్వర్థకం.

**సవిటితిపాతబండ** వి. సర్వేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుట్ట పెట్టుకొనేరాయి.

**సవిటిపండుగ** రూ.చూ. చవితిపండుగ. వి. ఉండ్రాళ్ళచవితి, వినాయకచవితి, కుమ్మరి తనసాధనాలను పూజచేసే పండుగ.

**సవిటిమట్టి** రూ చూ. సవిటిమన్ను. వి. పాలనవిటిమట్టి, కొంచెం ఎరుపుగా ఇసక కలిసి ఉన్నమట్టి.

**సవిటిమన్ను** రూ. నవటమన్ను, సవిటిమట్టి. వి. పాలనవిటిమట్టి, కొంచెం ఎరుపుగా ఇసక కలిసి ఉన్నమట్టి.

**సవితి** రూ.చూ. సవతి. వి. సపత్ని, ఏరాలు.

**సవితిపండగ** రూ.చూ. చవితిపండుగ. వి. ఉండ్రాళ్ళచవితి, వినాయకచవితి, కుమ్మర్లు సారె, నలప మొ. సామాన్లను పూజించే పండుగ

**సవిరిల్లు** చూ. సవరు. రూ. సవెరిల్లు. వి. చౌకపిల్లు, పొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిట్రాడిల్లు.

**సవిరేల** వి. ఇంద్రవల్లి, వృక్షవిశేషం.

**సవిర్తతొట్టి** వి. కుండల్ని సర్వేటప్పుడు కుమ్మరి కుడివైపు పెట్టుకొనే నీళ్ళతొట్టి.

**సవిర్తబండ** రూ.చూ. సపర్తబండ. వి. సర్వేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

**సవిలె** వి. నూలుపోగులలెక్క, నాలుగు పోగులదారం.

**సవుకభూమి** చూ. చౌడు. వి. చవకభూమి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1167. క్రీ.శ. 1220.

**సవుకాకు** రూ.చూ. సౌకాకు. వి. చౌకుచెట్టుఆకు.

**సవుకార్** రూ.చూ. సాహుకారు. వి. వ్యాపారి.

**సవుకారు** రూ.చూ. సాహుకారు. వి. వ్యాపారి.

**సవుక్కట్టె (-కట్టె)** వి. ఆముకాల్వుకు వాడే సరివిచెట్ల కట్టె.

**సవుక్కంప (-కంప)** వి. ఆముకాల్వులో వాడే సరివి కంప.

**సవుటం** రూ. సవటం, సౌటం. వి. తొలికలుపు, పల్లపు భూమిలో తీసే మొదటి కలుపు.

**సవుడు** రూ.చూ. చౌడు. వి. చవిటినేలమన్ను, చవుడు.

**సవుదాగర్** రూ.చూ. సౌదాగర్. వి. వ్యాపారి.

**సవుదాగరు** రూ.చూ. సౌదాగర్. వి. వ్యాపారి.

**సవుబొడ్డునుడి** వి. బొడ్డునుడి, బొడ్డుకు సూటిగా వీపుమీద ఉండేసుడి.

**సవురు** రూ.చూ. సౌరు. వి. 1. విధం. సమీర. 1.124 ; 2. నిగ్గు, సారం. ముకుందవి. 3.236 ; 3. అందం, ఒప్పిదం. విజయ. 1.84 ; 4. కాంతి. హంస. 3.193 ; 5. ఇంపు.

**సవెడు** రూ. చౌడు, సవడు, సవ్వడు, సౌడు. వి. 1. మూడు పోగులదారం ; 2. నాలుగుపోగులదారం, కొన్నిచోట్ల పట్టుదారం.

**సవెరిల్లు** రూ.చూ. సవిరిల్లు. వి. పొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిట్రాడిల్లు.

**సవేటటికె (-అటికె)** వి. సవేదన్నం ఉడికే మట్టిపాత్ర.

**సవేతి** వి. కుమ్మరాము హెచ్చుతగ్గులు లేకుండా సమానంగా ఉండేటట్లు చేయటం.

**సవ్వ** వి. 1. విత్తనాలు జల్లిన వెంటనే చేనిలో నిలిచిన నీటిని బయటికి పంపటానికి చేసిన సన్నకాల్వ ; 2. అసమర్థుడు.

**సవ్వడి** రూ.చూ. సవళి. వి. 1. జాడ ; 2. అచూకీ.

**సవ్వడు** రూ.చూ. సవెరు. వి. 1. నూలుపోగులలెక్క ; 2. మూడుపోగులదారం ; 3. నాలుగుపోగులదారం, కొన్ని చోట్ల పట్టుదారం.

**సవ్వన** అవ్య. జవ్వన, చప్పన, వెంటనే.

**సవ్వా** రూ.చూ. సవా. వి. ఒకటింపావు, సవాలక్ష.

**సవ్వాయి** రూ.చూ. సవాయి³. వి. వెండి లేక బంగారం. రామరా. 210.

**సవ్వాలు** వి. అరబీ సంవత్సరంలో పదోనెల. ద.హిం.శా. సంపు 10. శా. సం. 751.4, క్రీ.శ. 1592.

ఉ. షవ్వాల్. ముసల్మానుల సంవత్సరంలో పదో నెల ; పార. షావాల్. మహమ్మదీయుల సంవత్సరంలో పదోనెల.

< ఉ. షవ్వాల్.

**సష్టిపంచ** వి. సుబ్బారాయుడి షష్టినాడు బ్రహ్మచార్లకు దానం చేసే చిన్నపంచ.

సం. షష్ఠీ. తిథులలో ఆరోది.

< సం. షష్ఠీ + పంచె.

**ససలరోగం** వి. శరీరం కృశించే లక్షణం ఉన్నజబ్బు, క్షయ.

సం. శ్వాస -. ఊపిరి.

< సం. శ్వాస- + -లు + -అ¹² + సం. రోగ-.

**ససవ** వి. పనికిమాలినవాడు.

**ససి¹** క్రి.విశే. బాగా. కాశీ. 2.73 ; వి. 1. నిగ్గు. మను. 3.28 ; 2. బాగు. భర్తృ. 1.90 ; 3. విధం రఘునా. 7.65 ; 4. ఆరోగ్యం ; 5. సౌందర్యం.

తు. సజ్జి. మంచి, చక్కని, అందమైన, గొప్ప, ఆరోగ్యమైన ; త. చె -, చెమ్ -. తిన్నని, చెప్పమ్. ఋజుత్వం, మృదుత్వం, సమత్వం, చెమ్మల్. గొప్ప తనం, అందం, సౌందర్యం, చెవ్వి. ఋతువు ; మ. చెమ్మ. ఋజుత్వం, సౌభాగ్యత, ససినే. సూటిగా, తగినట్లుగా. చక్కగా ; కుయి. సెన. సరైన, తిన్నని.

**ససి²** రూ. సస్సె, సస్సెము. వి. 1. పైరు, సస్యం. అము. 5.127 ; 2. విత్తనాలు పోసినకయ్య, ఆకుమడి ; 3. శక్తి. 4. రుచి.

సం. సస్య -. పైరు, వృక్షాదిఫలం ; ప్రా. సస్సఅ, సాస -. క్షేత్రగతధాన్యం. సస్సియ. కృషీవలుడు ; అ.మా. సస్స -, సాస -. ధాన్యం, పంట ; పా. సస్స -, సస్య -, సస్సకాల -. కోతలసమయం, సస్సకమ్మ-. వ్యవసాయం · అప. సాయ- ; క. ససి. చిన్నమొక్క, సాసి. ససి ; తు. తై, పై. మొలక ; మ. తై. మొలక.

< ప్రా. సస్స -.

**ససికలుపు** వి. తొలికలుపు, పైరుగుదేకుతో ఉన్నప్పుడు తీసేకలుపు, కన్నెకలుపు.

**ససికుట్టు** వి. నారు, వరి మిరప మొ. వాటి చిన్న మొలకలు, కొన్నిచోట్ల ఎదిగిన పైరు.

**ససిబుడ్డదుంప** వి. కోయంబత్తూర్ తూర్పు తీరప్రాంతాల్లో పెరిగే ఒకరకం చెట్టు.

**ససియాడు(-అడు)** అ.క్రి. చెల్లా చెదరుగా విసరివేయు. కు.సం. 12.105.

**ససులెత్తు** అ.క్రి. మొలకెత్తు, అంకురించు. అష్టమ. క. 5.233ప. 5పం.

< ససి¹ + -లు + ఎత్తు¹.

**ససుకాణిటంకాలు** వి బ.వ. సస్కానిటంకాలు, రెండు డబ్బుల నాణెం. ద.హిం. శా. సంపు. 6. శా.సం. 1019. క్రీ.శ. 1401.

**ససులెత్తు** చూ. ససి².

**ససువు¹** వి. సాధువు. రామాభ్యు. 4.8.

సం. సజ్జన-. సత్పురుషుడు.

**ససువు²** చూ. ససి². వి. మొలక.

**ససేమిరా** అవ్య. మొండి పట్టుదలను సూచించే పలుకు, బొత్తిగా, ఏమాత్రం.

< ససి¹ + ఏమి + రా.

**సస్కాని(-కాని¹)** వి. రెండుడబ్బులనాణెం.

**సస్సె** రూ.చూ. ససి². వి. సస్యం, పైరు.

**సస్సెము** రూ.చూ. ససి². వి సస్యం, పైరు. ఆం. నా. సం. 70.

**సహపాదలక్ష** వి. అత్యధికం. సిం. ద్వా. 2.12.

సం. సహపాదలక్ష-. 1¼లక్షలు.

< సం. సహపాదలక్ష-.(అర్థవిపరి.).

**సహసా** అవ్య. చిరునవ్వుతో, స్మితంగా.

సం. సహసా. బలాత్కారంగా, తీవ్రంగా, తీక్ష్ణంగా హఠాత్తుగా, వేగంగా, తలకిందుగా, ఆలోచించకుండా, ఒకేసారిగా, ఆకస్మికంగా.

< సం. సహసా. (అర్థవిపరి).

**సహస్రభోజనము** వి. వెయ్యిన్నూటఎనిమిదిబ్రాహ్మణులు దేవుని అష్టోత్తర సహస్రనామాల్ని చెబుతూ చేసే సంతర్పణం. ద. హిం. శా. సంపు. 6. శా సం. 586 క్రీ.శ. 1074.

సం. సహస్రభోజన-. వేయిమందికి పెట్టేభోజనం.

< సం. సహస్రభోజన-. (అర్థవిపరి.).

**సహే** వి. చక్రవర్తి. హర. పీఠి. 24.

హిం. శాహ్. పాదుషా ; మరా. శహా రాజు, ప్రభువు, సుల్తాను ; ఉ. షహ్, షాహ్. పాదుషా ; పార. షహ్, షాహ్. అధిపతి, ప్రభువు, షాహీ. రాజసంబంధి, రాజ్యం, రాచకీవి.

< ఉ. షహ్.

**సహేమీ** వి. ఒకఉద్యోగి.

ఉ. అర. సహాబ్. పుస్తకాలను బైండుచేసేవాడు, పుస్తకవిక్రేత, గ్రంథాలయాధికారి.

< ఉ. సహాబ్.

**సహేయబు** రూ.చూ. సాహేబు. వి. సాహేబు, అధికారి. ద. హిం. శా. సంపు 10. శా. సం. 748. క్రీ.శ. 1577.

**సహేరా** వి. శూన్యం.

అర. స్హ్రా . లిబియా ఎడారి ; ఇం. *Sahara*.

< ఇం. Sahara.

**సహారువు** వి. కూడిక. జూదంలోని పరిభాష. ఉ.హరి. 3.117.

సం. సహకార-. సహకారంతో కూడినది. తోడ్పాటు : ప్రా. సహయార-, సహార-. ఆశ్రమం, ఆధారం, ఉపకారం.

< ప్రా. సహార-

**సహిచేయు** అ.క్రి. 1. సంతకం పెట్టు. 2. అంగీకరించు. సరేఅను.

హిం. ఉ. స్యాహీ. సిరా.

< ఉ. స్యాహీ + చేయు.

**సహిస్రంగతి** వి. సహస్రారంలోని గమనం అనేభావంలో వాడబడింది.

**సా** రూ.చూ. సాము[2]. విణ. సగం, వృత్తిలో సాముశబ్దానికి అంత్య వర్ణం లోపించగా మిగిలినరూపం. ఉదా. సామేను, సాంబాలుమొ. వి. ఆం. నా. సం. 14.

సాంబాలు (-పాలు[1]) వి. అర్ధభాగం. సాంబ. 41.

**సాక** వి. 1. కల్లుతాగేపాత్ర. సిం. ద్వా. 4.259 ; 2. జాడ. నవనాథ. 1.68పు. 6పం.; 3. పిల్లలకు మనూచి వచ్చినప్పుడు ప్రతిఅడంగ గుడిముందు పోసేమందు.

సం. చషక-. కల్లుతాగేపాత్ర ; హిం. సాకా. జాడ ; త. చరక. కల్లుతాగేపాత్ర.

**సాకతము** వి. 1. ఊరడింపు. నిర్వ.రా. 6.46 ; 2. పోషణం. భార. విరా. 1.219 ; 3. అనుగ్రహం. భార. విరా. 1.268 ; 4. దయ. పద్మ. 10.270 ; 5. చేపట్టు.

సం. సాకూత-. ఉద్దేశపూర్వకమైనది, అర్థవంతమైనది, స్వాగత-. ఆహ్వానం ; ప్రా. సాఅద-, సాగయ-. అ. మాగ. సాగయ- ; మా. శాఅద- ; శౌ. సాఅద-.

**సాకము** రూ.చూ. సాకు. వి. 1. ఉత్సవం. ఆం.భా. 3.59 ; 2. వ్యాజం, నెపం, కపటం.

**సాకలసిప్ప** చూ. చాకలి. రూ. సాకల్సిప్ప. వి. గుంతగా కైవారంగా ఉండే పెద్దచిప్ప.

**సాకల్సిప్ప** రూ.చూ. సాకలసిప్ప. వి. గుంతగా కైవారంగా ఉండే పెద్దచిప్ప.

**సాకి** రూ.చూ. సాకిరి. వి. సాక్షి.

**సాకిన్** రూ. సాకిన్, సాకీను. వి. నివాసంఉండేవాడు.

హిం. ఉ. సాకిన్. నివాసి, ఉండేవాడు.

< ఉ. సాకిన్.

**సాకిరి** రూ. సాకి, సాకె. వి. సాక్షి. తాళ్ల. సం. 9.95.

సం. సాక్షిన్. పరమాత్మ, ప్రత్యక్షజ్ఞానం కలవాడు, ఏదైనా ఒకపనిని చూచికాని వినికాని తెలిసిన వ్యక్తి, సాక్షీ. చెప్పినమాట ; ప్రా. సక్ఖ-. సాక్ష్యం, సక్ఖి-, సక్ఖిజ్జ-, సాక్ఖి-. సాక్షిత్వం ; జై. మహా. పా.శౌ. సక్ఖి- ; అ.మా. సక్ఖ-, సక్ఖి ; మా. శఖకీ ; ప్రా. -ఇర. విధి, ఆదర్శకృషి, ధర్మం, స్వభావం.

క. సక్కి, సాక్కి ; తు. సాకి ; త. చాక్కి ; తొ. సాక్య ; కుఇ. కువి. సాకి.

< ప్రా. సక్ఖి + ప్రా. -ఇర.

సాకిరిబోను వి. ఒకరకంబోను. సాకిరివెట్టు(-పెట్టు) అ.క్రి. సాక్ష్యంచెప్పు. తాళ్ల. సం. 15.223. సాకిరులుచెప్పు అ.క్రి. సాక్ష్యంచెప్పు. తాళ్ల. సం. 18.531.

**సాకిరులుచెప్పు** చూ. సాకిరి.

**సాకీ** వి. మద్యం తాగించేవ్యక్తి.

హిం. ఉ. సాకీ. మద్యం తాగించేవాడు.

< ఉ. సాకీ.

**సాకీన్** రూ.చూ. సాకిన్. వి. నివాసం ఉండేవాడు.

**సాకీను** రూ.చూ. సాకిన్. వి. మకాం. విణ. నివసిస్తున్న.

**సాకీసు** వి. చిరునామా.

**సాకు** రూ. సాకము, వి. మిష, వ్యాజం, నెపం. నె.శా. ఒంగోలు. 12. నార. పంచ. 3.220.

క. సాకు. మిష. సాకు, నెపం ; త. చాక్కు. మిష, సాకు.

**సాకె** రూ.చూ. సాకిరి[1]. వి. సాక్షి. ఆం. భా. 2.308

**సాక్కేయు** చూ. సాగు[1].

**సాక్షికం** వి. సాక్ష్యం.

సం. సాక్షిక-. సాక్షికలది.

< సం. సాక్షిక- (అర్థవిపరి.).

**సాక్షిపలుకు** స.క్రి. సాక్ష్యమిచ్చు. కవిక. 3.213.

సం. సాక్షిన్. పరమాత్మ. ప్రత్యక్ష జ్ఞానం కలవాడు. ఏదైనా ఒకపనిని చూచికాని వినికాని చెప్పినవ్యక్తి.

< సం. సాక్షిన్ + పలుకు.

**సాఖ్తు** వి. తయారీ.

ఉ. పార సాఖ్త. తయారుచేయబడిన. ఏర్పడిన, మోసపూరితమైన, కల్పించబడిన, మోసగించబడిన, కృత్రిమమైన లేదా దొంగతనంగా చేసిన.

< ఉ. సాఖ్త.

**సాగ[1]** వి. అల్లెతాడుగా పనికివచ్చే నారనిచ్చే చిన్నమొక్క (Sanseviera zeylanica).

సాగనార వి. జనపనార. సాగనారమట్టు వి. జనపనార.

**సాగ[2]** వి. మేడితోకకు పక్కన అడ్డంగా బిగించే కొయ్య

సం.శాఖా. కొమ్మ ; ప్రా. సాహా ; పా. సాఖ-, సాఖా.

< పా. సాఖ-.

**సాగ[3]** వి. గొట్టం మూతి ఒంపుగా ఉండేపాత్ర.

**సాగగడ్డ** చూ. సాగు. వి. పొడవైనగట్టు. కకుత్స. 2.8.

**సాగ(గొట్టు** చూ. సాగు[1].

**సాగతము** వి. 1. మైత్రి. నృసింహ. 4.107 ; 2. సంబంధం. హర. 5.5.

సం. సాంగత్య- కూడిక, కలయిక, మైత్రి, స్నేహం.

< సం సాంగత్య-.

**సాగనంపు** చూ. సాగు[1].

**సాగ(దీయు** చూ. సాగు[1].

**సాగ(దీసిమూరవేయు** చూ. సాగు[1].

**సాగ(దోలు** చూ. సాగు[1].

**సాగ(బడిమ్రొక్కు** చూ. సాగు.[1]

**సాగ(బడు** చూ. సాగు[1].

**సాగరము** వి. **1.** నెయ్యి, నూనె మొ. వి. నింపిన సిద్దెలజోడు ; **2.** సంవత్సరం పొడుగునా నీరుండే పెద్దచెరువు.

సం. సాగర-. కడలి, సముద్రం.

< సం. సాగర- (అర్థవిపరి.).

**సాగవచ్చు** చూ. సాగు[1].

**సాగవేయు** చూ. సాగు[1].

**సాగా** అవ్య. సైతం. వేంక. పంచ. 1.349.

**సాగించు** చూ. సాగు[1].

**సాగిన** రూ.చూ. సామెన. వి. కంకులు కోసిన చొప్పతో వేసిన కుప్ప.

సాగినవేయు స.క్రి. కుప్పవేయు.

**సాగింత** చూ. సాగు[1].

**సాగిపాఱు** చూ. సాగు[1].

**సాగిలు** చూ. సాగు[1].

**సాగివచ్చు** చూ. సాగు[1].

**సాగు[1]** రూ. చాగు, చాఁగు, సాఁగు. అ.క్రి. **1.** ముందుకిపోవు, ఉద్గమించు, పైకివచ్చు. కు.సం. 4.87 ; **2.** జరుగు, ప్రవర్తిల్లు. ఉ. హరి. 2 170 ; **3.** నెరవేరు, సఫలమగు. జైమినిభా. 1.84 ; **4.** ప్రారంభించు, మొదలుపెట్టు (ఈఅర్థంలో ఇది తుమున్నంతానికి అనుప్రయుక్త మౌతుంది ). అము. 4.265 ; **5.** ఎగిరిపోవు. పాండు. 5.249, **6.** చెల్లు, మాటలేక అధికారం చెల్లుబడిఅగు. కళా. 8.65 ; **7.** ఒప్పు. జాహ్న. 89 ; **8.** ప్రసరించు; వ్యాపించు. ఇంధు. 6.33 ; **9.** కూడవచ్చు, వెంటవచ్చు ; **10.** తిరుగు, సంచరించు ; **11.** ప్రవహించు. పారు ; **12.** సాగిలబడు ; వి. **1.** రాట్నం అడ్డపట్టె, రాట్నం తిప్పేటప్పుడు ఒకకాలితో తొక్కపట్టే అడ్డపట్టె; **2.** పడుగేరేటప్పుడు, నరిచేసేటప్పుడు అల్లుచేసేటప్పుడు చాపినపడుగు ; **3.** మగ్గానికి ఆమర్చి నేత బయలులో చాపిన పడుగునూలు.

క. సాగు. వెడలు, ముందుకుకదలు, సాగు, సాగ. అభివృద్ధి, వ్యవసాయం, ముందుకుతీయ లేక తెచ్చు. సాగవళి, సాగువళి. వ్యవసాయం, సాగిసు. ముందుకు వెళ్ళు, తీసికొనిపోవు, కాపాడు ; తు. సాగుని. పోవు. వెళ్ళు, అభివృద్ధిపొందు, సాగు. పనిలోఅభివృద్ధి, నిర్బంధం, సాగువళి, సాగొళి, సాగ్వళి ; త. చాయ్ (-వ్-,-న్త్-). గుంపుగాకదలు, పరుగెత్తిపోవు ; మ. చాంపు. దీర్ఘమగు, సాగు ; కో. చ.గ్- (చ.క్గ్). వెళ్ళటం, పోవటం, అనుకూలంగా ఉండటం, జయించటం, చ.గ్చ్, (చ.గ్చ్). జీవించు, మారు ; గోం. సాహతానా. చేతులుసాచు ; కుఇ. సాప్పా. సాస్ప. (చేతులు. కాళ్ళుమొ. వాటిని) చాచు ; కువి. హాహ్నై. (చేతులు) సాచు ; మాల్తొ. చక్ల్. కాళ్ళు బారచాచు.

సాక్కేయు రూ.చూ. సాగుకేయు. అ.క్రి. అల్లుచేయటానికి ఆరుబయట పడుగుచాపు. సాగఁగొట్టు స.క్రి. సాగ్గొట్టుకొట్టు. < సాగు[1]+-అ[7]+కొట్టు[1]. సాగనంపు అ.క్రి. అనుగమించు, వెంటవెళ్ళు. చెన్నబసవ. 5.138. < సాగు[1]+-అ[7]+అంపు. సాగఁదీయు రూ.చూ. సాఁగఁదీయు. అ.క్రి. పొడుగ్గా అయేటట్టులాగు. సాగఁదీసిమూరవేయు స.క్రి. **1.** అలసిపోయేదాకా పనిచేయించు ; **2.** అనవసరంగా పెంచి చెప్పు. < సాగు[1]+-అ[7]+తీయు+-ఇ[13]+ మూరవేయు. సాగఁదోలు స.క్రి. గిత్తల్ని కాడికిక‌ట్టు. < సాగు[1]+-అ[7]+ తోలు[1]. సాగఁబడిమ్రొక్కు అ.క్రి. సాష్టాంగపడు. శుక. 1.526. < సాగు[1]+-అ[7]+పడు+-ఇ[13]+మ్రొక్కు. సాగఁబడు రూ.చూ. సాఁగఁబడు అ.క్రి. సాష్టాంగపడు. పారి. 5.48. సాగవచ్చు అ.క్రి. కూడవచ్చు వెంటవచ్చు. రాజవా. 5.8. < సాగు[1]+-అ[7]+వచ్చు. సాగవేయు స.క్రి. పంపు. పుచ్చు, తరలించు. < సాగు[1]+-అ[7]+వేయు. సాగించు స.క్రి. **1** నిర్వహించు. కాశీ. 3.81 ; **2** నెరవేర్చు. కాశీ. 4.150 ; **3.** జరుపు, కావించు. కాశీ. 7.72 ; **4.** నిర్వర్తించు. చంద్రాంగ. 4.154 ; **5.** నడిపించు. అచ్చ.రా. యు. 222 ; **6.** ప్రవర్తించు ; **7.** యత్నించు. < సాగు[1]+-ఇంచు[3]. సాగింత వి. నమస్కారవిశేషం. సాగిపాఱు అ.క్రి. చెల్లు, సమర్థుడగు. వేమన. 3.136. < సాగు[1]+-ఇ[13]+పాఱు[2]. సాగిలు రూ.చూ. చాఁగిలు. అ.క్రి. సాష్టాంగపడు. తాళ్ల. సం. 13.215. సాగివచ్చు అ.క్రి. జరిగివచ్చు. హరి. ఉ. 6.112. < సాగు[1]+-ఇ[13]+వచ్చు. సాగుకేయు రూ. సాక్కేయు. అ.క్రి. అల్లుచెయ్యటానికి ఆరుబయట పడుగుచాపు. సాగుచాపు రూ. సాగుసాపు, అ.క్రి. పడుగుచాపు, రెండు ఊడ్తెలకు మధ్యగాని ఒకఊడ్తెకూ సరిగుంజకు మధ్యగాని పడుగుచాపు. సాగుడు వి. **1.** బట్టిని కింద వెడల్పుగా, పైకిపోనుపోను సన్నగాపేర్చినపేర్పు ; **2.** తాప, బట్టిపైకి ఎక్కటానికి మెట్లకు బదులుగా కట్టిన వాలుగోడ. సాగుడుమెట్టు వి. సాదామెట్టు. నలుపలకలగాఉండే అరుగుతో వంకలు వంపులు లేకుండా నిటారుగా కట్టినమెట్టు. సాగుపాటు రూ. సాగుఁబాటు[1]. వి. జరుగుబాటు. సాగుబడి[1] వి. సాగుబాటు, చెలామణి. ప్రబంధ. 1 744. సాగుఁబాటు[1] (-పాటు) రూ.చూ. సాగుపాటు. వి. జరుగుబాటు. సాగుసాపు రూ.చూ. సాగుచాపు. అ.క్రి. ఆరుబయట సాగుపరచు. రెండు ఊడ్తెలకు మధ్యగాని, ఒకఊడ్తెకూ సరిగుంజకూ మధ్యగాని పడుగు చాపు. సాగేయు స.క్రి. వాటను. వాటేతబల్లతో మొదట సాగగొట్టు. < సాగు[1]+ వేయు.

**సాగు[2]** వి. సేద్యం, కృషి, వ్యవసాయం.

క. సాగు. వ్యవసాయం, కృషి, సేద్యం.

సాగుచేయు స.క్రి. **1.** ఆయవరచు, సాగుబడిచేయు ; **2.** నడిపించు. సాగుదారు వి. పాలికాడు, రైతు, పాలికిసేద్యం చేసేవాడు. పార. -దార్. కలవాడు అనే అర్థం ఇచ్చే ప్రత్యయం. < సాగు[2]+పార-. -దార్. సాగుపాలి వి. పొలందున్నే ముందు ఏటబలితో చేసేపూజ. సాగుబడి[2] వి. కృషి, పైరు పెట్టటం. క. సాగువళి, వ్యవసాయం. కృషి. సాగుఁబాటు[2] (-పాటు) వి. నాగటిపూజ, ఏరువాక.

**సాగుబలా** రూ. చాంగుబళా, సాగుబళా, సాంగుబలా, సాంగుబళా. వి. **1.** వేత్రధరులు హెచ్చరిక చేసేటప్పుడు ఉపయోగించే పదం. రం.రా. కిష్కిం ; **2.** నతివిశేషం.

ఎరగుడు. హంస. 4.203.

**సాగుబళా** రూ.చూ. సాగుబలా. వి. నతివిశేషం.

**సాగుమానము** వి. సహగమనం.

సం. సహగమన. కూడా పోవటం, భర్తతో చితిలో ప్రవేశించటం.

<సం. సహగమన-.

**సాగెల** రూ.చూ. సిగిరి. వి. వాటకుండలోని బురదమన్ను.

**సాగెలకుండ** వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర.

**సాగేయు** చూ. సాగు[1].

**సాంగుబలా** రూ.చూ. సాగుబలా. వి. **1**. వేత్రధరులు హెచ్చరిక చేసేటప్పుడు ఉపయోగించే పదం; **2**. నతి విశేషం, ఎరగుడు.

**సాంగుబళా** రూ.చూ. సాగుబలా. వి. **1**. వేత్రధరులు హెచ్చరిక చేసేటప్పుడు ఉపయోగించేపదం ; **2**. నతి విశేషం.

**సాంగెము** రూ.చూ. సాంగ్యము. వి. తక్కువకులం వారి కులపు కట్టుబాటు.

**సాంగ్యము** రూ. సాంగెము. వి. తక్కువ కులంవారి కులపు కట్టుబాటు.

**సాఁకించు** చూ. సాఁకు.

**సాఁకు** స.క్రి. **1**. రక్షించు, కాపాడు. అచ్చ.రా.యు. **393** ; **2**. పెంచు. శుక. 3·379.

క. సాకు, పెంచు, పెంచిపెద్దచేయు, ఆలనాపాలనా చూడు, తాఁగు. ఉంచు, బలపరచు ; కొడ. చ.క్ - (చకి-)· చాక్ - (చాయ్క్). పెంచిపెద్దచేయు , తు. సాంకుని. పెంచు, రక్షించు; త. సాంకావుని. సాంకణె. పెంచుకొను, రక్షించుకొను. తాంకు. రక్షించు, కాపాడు, బలపరచు. తాంకుని. జాగ్రత్తగా చూచుకొను. పెంచు, కాపాడు. తాంగు. బలపరచు ; కో. చ.క్ - పెంచు, రక్షించు ; తొ. సాక్. పెంచిపెద్దచేయు ; బ్రా. సాక్. ఒక్కొక్కరిచేత ఇష్టపడేది.

మూ.ద.ద్రా. *చాంక్/*తాంక్– *చాక్క్/*తాక్క్.

**సాఁకించు** స.క్రి. రక్షించు. కాపాడు. బసవ. 52పు. 46పం. <సాఁకు+-ఇంచు[8]. **సాఁకుకొను** స.క్రి. పెంచుకొను. **సాఁకుడుకొడుకు** వి. పెంచుకొనే కొడుకు. **సాఁకుడుచిలుక** వి. పెంచుకొనే చిలుక. **సాఁకుడుతల్లి** వి. పెంపుడు తల్లి. **సాఁకుడుపులుగు** వి. కోయిల.

**సాఁగఁదీయు** చూ. సాఁగు.

**సాఁగఁబడు** చూ. సాఁగు.

**సాఁగిలి** చూ. సాఁగు.

**సాఁగిలు** చూ. సాఁగు.

**సాఁగిల్లు** చూ. సాఁగు.

**సాఁగు** రూ.చూ. సాగు[1]. అ.క్రి. **1**. దీర్ఘమగు. భార. విరా. 2.313 ; **2**. పోవు, నడచు. గౌహరి. పూ. 1530 ; **3**. సాష్టాంగనమస్కారంచేయు. జాహ్న. 1.75 ; **4**. అడుగున తాడుకట్టిన కటారి అలుగులాంటి ఆయుధం.

**సాఁగఁదీయు** రూ. సాగఁదీయు. స.క్రి. ప్రార్థించు, బతిమాలు ; **2**. పొడిగించు. <సాఁగు+-అ[7]+తీయు. **సాఁగఁబడు** రూ. సాగఁబడు. అ.క్రి. శరీరమంతా భూమి మీద తాకేట్లుపడు. సాష్టాంగంచేయు. పారి. 5.35. <సాఁగు+-అ[7]+పడు. **సాఁగిలి** వి. నతివిశేషం. సాష్టాంగ నమస్కారం. ప్రబంధ. 1.881. **సాఁగిలు** రూ.చూ. చాఁగిలు. అ.క్రి. **1**. నేలకురాలు. కళా.1.163 ; **2**. సాష్టాంగనమస్కారంచేయు, మొక్కు. శ్రీరం.మ. 6.86. **సాఁగిల్లు** రూ.చూ చాఁగిలు. అ.క్రి. **1**. నేలకురాలు ; **2**. సాష్టాంగ నమస్కారంచేయు, మొక్కు. **సాఁగుడుమానిసి** వి. పొడగరి.

**సాచినూలు** చూ. సాఁచు. వి. మెత్తగా ఉండి తెగేనూలు.

**సాచ్చికం** వి. సాక్ష్యం.

సం. సాక్ష్యక -. సాక్ష్యం.

<సం. సాక్ష్యక-.

**సాచ్చె** వి. ఇటుక పెంకు తయారీకి వాడే కర్రమూస.

**సాజము** విణ. స్వభావంతో కలిగింది. తాళ్ల.సం. 9.141 ; వి. స్వభావం. ద్విపదమ. వి. 3.154.

సం. సహజ -. స్వభావం ; ప్రా. సహజ-.

క. సాజ. తగిన, నిజమైన.

<ప్రా. సహజ-.

**సాంచ** రూ.చూ. సాంచె. వి. అచ్చు, ఇటుక, పెంకు తయారీలో వాడేమూస.

**సాంచా** రూ.చూ. సాంచె. వి. **1**. చేతిమగ్గంమీదడిజైన్లు నెయ్యటానికి నేతపడుగుకు పైన వంతెన మాదిరిగా అడ్డంగా కట్టిన లావుదారాలు ; **2**. ఇటుక, పెంకు తయారీలో వాడే మూస.

**సాంచి** రూ.చూ. సాంచె. వి. ఇటుక, పెంకు తయారీలో వాడే మూస.

**సాంచు** రూ.చూ. సాంచె. వి. ఇటుక, పెంకు తయారీలో వాడే మూస.

**సాంచె** రూ. సాంచ, సాంచా, సాంచి, సాంచు, సాంచై. వి. **1**. ఇటుక, పెంకు తయారీలో వాడేమూస ; **2**. డిజైన్లు నేసే చేతిమగ్గంలో అడ్డ బేలునుంచి పడుగులోకి వేలాడే దారాలు.

**సాంచెకాడు** వి. అచ్చుమేస్త్రి, ఇటిక అచ్చుతీసే పనివాడు. **సాంచెతడు** వి. సాంచెకాడు, ఇటిక అచ్చు తీసే పనివాడు. <సాంచె+అతడు. **సాంచెపెంకు** వి. ఇంటికప్పుకి వాడే పెంకు. **సాంచెమనిసి** వి. సాంచెకాడు, ఇటిక అచ్చు తీసే పనివాడు. **సాంచెరాయి** వి. కట్టుబడిలో ఉన్న అరీ్ఛకింద ఆధారంగా నిలిపిన రాతిపలక. **సాంచెవాడు** విణ. సాంచెతాడు, ఇటిక అచ్చు తీసేపనివాడు.

**సాంచై** రూ.చూ. సాంచె. వి. ఇటుక, పెంకు తయారీలో వాడే మూస.

**సాంజ్** వి. పన్నెండంతలకు బిగించిన పుల్లమధ్య వెలితి.

హిం. సాంజ్. సంధ్య.

**సాఁచు**[1] రూ.చూ. చాఁచు. స.క్రి. **1**. చాపు ; **2**. ప్రయోగించు ; **3**. ముందుకు పోనిచ్చు ; **4**. ప్రసరింపచేయు ; **5**. గడియవేయు.

**సాఁచు**[2] వి. (స్త్రీసంబంధి) రేతస్సు.

**సాట** రూ. సాటా[2], సాటువ[3]. వి. **1.** పరివర్తకం ; **2.** వినిమయం ; **3.** వర్తకులు ఒకవస్తువు నిచ్చి మరొక వస్తువును పుచ్చు కోవటం.

క. సాటి. వస్తువినిమయం ; తు. సాటా ; మ. సాట్టి.

**సాటఅట్క** వి. పలావు వండటానికి వాడే వెడల్పు అటిక.

**సాటకొమ్ము** వి. బండి చట్రంలో నిలువుపట్టె.

**సాటవ[1]** యూ.చూ. సాటువ[1]. వి. **1.** సామెత, నానుడి, చాటువ ; **2.** ఒకజంతువునిచ్చి బదులుగా మరోజంతువును తీసుకోవటం ; **3.** పోలిక, సంబంధం.

**సాటవపెట్టితిట్టు** స.క్రి. పిల్లిమీద ఎలుకమీద పెట్టి నూటి పోటి మాటల్ని అను.

**సాటవ[2]** రూ. సాటా[1], సాటువ[2], సాట్వ. వి. బండినొగఉన్న చట్రం.

**సాటపపెట్టె** వి. గూడుబండిపై పెట్టిమాదిరి వేసిన చెక్కల. చట్రం. **సాటవాకొయ్య** వి. పలగడకొమ్ము, వసికొయ్య.

**సాటవాకొయ్య** చూ. సాటవ[2].

**సాటా[1]** యూ.చూ. సాటవ[2]. వి. బండి అడ్డ లేక డొలుపుమీద వేసిన నిలువుఅడ్డపట్టెల చదరం.

**సాటా[2]** రూ.చూ. సాట. వి. **1.** పరివర్తకం, **2.** వినిమయం ; **3.** వర్తకులు ఒకవస్తువునిచ్చి మరొకవస్తువును పుచ్చ కోవటం.

**సాటాకోటి** వి. సాటాబేరం, వస్తుపరివర్తనపు బేరం. **సాటాబేరము** వి. ఒకపవస్తువునిచ్చి మరొకవస్తువ పుచ్చ కొనే. బేరం

**సాటి[1]** విశ. సమానం. నిర్వ. రా. 3.61. కాశీ. 2,137 ; వి. ఉపమానం, పోలిక. హర. 4.62.

క. సాటి. సామానత్వం, పోలిక, పోలిన, సమానమైన ; సం. సార్ధ-, కలిసినట్టుగా, సాదృశ్య-.పోలిక ; ప్రా. పా. సద్ధిమ్. కలిసిన ; ప్రా. సట్టు-.

< ప్రా. సట్ట-.

**సాటికిబేటికి** అవ్య. ద్రు. మాటికిమాటికి. రామాభ్యు. 1.181. కళా. 7.76. **సాటిచేయు** రూ.చూ. సాటిసేయు. స.క్రి. ఉపమించు. **సాటిమొఱ** వి. అందరికి తెలిసే మొర. **సాటియగు(-అగు)** అ.క్రి. సమానమగు. పారి. 5.29. **సాటివచ్చు** అ.క్రి. ఈడగు, సమానమగు. మను. 5.81. **సాటిసేయు (-చేయు)** రూ. సాటిచేయు. స.క్రి. ఉపమించు. శృం. నై. 2.13.

**సాటి[2]** వి. కాసెకోక. గా. హరి.ఉ. 52.

సం. శాటీ. వస్త్రఖండం, జట్ట ; ప్రా. సాడయ, సాడిఅ, సాడీ, సాలిఅ. వస్త్రం ; పా. సాటు-.వస్త్రం, సాటకా-,సాటి-,సాటికా. బహిర్వస్త్రం ; హిం. సాడీ. చీర, మరా. సాడీ, సాడా ;

క. సాటి. వస్త్రం ; త. చాటి.

< పా. సాటి-.

**సాటి[3]** రూ.చూ. జాటి. వి. పశువుల్ని తోలే చేరుకోల.

**సాటిక** వి. శాటి, బట్ట.

సం. శాటికా. వస్త్రం, బట్ట ; పా. సాటికా. బహిర్వస్త్రం.

< పా. సాటికా.

**సాటింగుపేటంచు** రూ. సేటిన్‌పేటంచు. వి. రిబ్బను మాదిరిగా నేత అయిమూలగా కనబడేట్టు నేసిన అంచు.

**సాటించు** రూ.చూ. చాటించు. అ.క్రి. టముకువేయు.

**సాటింపు** రూ.చూ. చాటింపు. వి. గ్రామదేవతల తిరునాళ్ళ ప్రారంభం మొ. వాటిగురించి గ్రామంలో తెలియ చేయటం, టముకు.

**సాటిన్‌వన్నె** రూ.చూ. సేటిన్‌వన్నె. వి. **1.** ఒకరకంనీలం రంగు. **2.** ఒకరకం లేతనీలంరంగు ; **3.** రామనీలంరంగు కంటీలేతరంగు ; **4.** నీలంరంగు మధ్యరకంగా ఉండేది.

ఇం. Satin. ఒకవిధమయిన పట్టుబట్ట,

< ఇం. Satin. + వన్నె,

**సాటింపు** చూ. సాటించు.

**సాటు** వి. **1.** మట్టిదిమ్మ ; **2.** ఇంటిలోపల పోయించేమట్టి.

**సాటుకొట్టు** స.క్రి. సలపతో కుండల్ని నర్చు. **సాటుబట్ట** వి. పాత్రల్ని నర్చేటప్పుడు బట్టలమీద మట్టినీళ్ళు పడకుండా కుమ్మరి చుట్టుకొనే పాతగుడ్డ. **సాటుబుడ్డి** వి. గుండ్రంగా మూతి చిన్నగా ఉండే మట్టిపాత్ర.

**సాటువ[1]** రూ. చాడువ, చాటువ, సాటవ, సాటువు. వి. **1.** ప్రసిద్ధి. రుక్మా. చ. 1.73 ; **2.** సామ్యం ఆం. భా. 2.302 ; **3.** సామెత ; విశ. ఉచితం, తగిన. ప్రబోధ. 5.28.

సం. సాదృశ్య-.పోలిక, చాటు-. మనోహరం.

< సం. చాటు-.

**సాటువ[2]** రూ.చూ. సాటవ[2]. వి. పైకప్పులేనిబండి, కచ్చడం.

**సాటువ[3]** రూ.చూ. సాట. వి. వస్తువినిమయం.

**సాటువు** రూ.చూ. సాటువ[1]. వి. **1.** సరి ; **2.** సామెత ; **3.** సాటిపోలినది.

**సాటుసంట** చూ. చాటు. వి. కట్టెలు పెట్టటానికి ఆములో ఉంచిన సందు.

**సాటెనగొట్టు** వి. దుష్టుడు, దుష్టురాలు. చెన్నబసవ. 2.24.

**సాట్వ** రూ.చూ. సాటవ2. వి. చట్టం, బండి ఇరుసుమీద నిలిచే నిలువు అడ్డపట్టెలు.

**సాడగొట్టు (-కొట్టు[1])** రూ.చూ. సేడెగొట్టు. అ.క్రి. మట్టిపాకం వల్లగాని కాల్పులోపం వల్లగాని ఆముకాల్పులో కుండలు పేళ్ళుపేళ్ళుగా పగిలిపోవు.

**సాడు** స.క్రి. కొలుచు, సేవించు.

**సాడూ** వి. షడ్డకుడు, తోడల్లుడు.

హిం. సాడూ. తోడల్లుడు.

< హిం. సాడూ.

**సాడెనద్దిగాలి** వి. ఈదరగాలి, తుప్పరతో వీచే చల్లగాలి.

**సాణ** వి. చిక్కువరస. పడుగుపేకలుగా పేర్చిన ఇటుకపేర్పు.

**సా(డు** వి. రేతస్సు, ముట్టు.

త. చాంటు. రేతస్సు ; మ. చాంటు. వీర్యం, రేతస్సు.

**సాతని** రూ.చూ. సాతాని. వి. జందెంలోని వైష్ణవుడు. హంస. 3.29.

**సాతాని** రూ. సాతని, పాత్తని. వి. శూద్రజాతి విశేషం,

జందెంలేని వైష్ణవుడు. పల్నా. 17.

క. చాతాణి, చాతాళి. సాతాని ; త. చాతాదవన్, చాతాని. గుళ్ళతో సేవచేసే బ్రాహ్మణేతర వైష్ణవులు.

<త. చాత్తాని.

సాతానిసామవేదం వి. శక్తిహీనుడి విద్యాప్రదర్శనం. సం. సామవేద -.నాలుగు వేదాలలో మూడోవేదం.

**సాతాను** రూ.చూ. సేతాను. వి. పిశాచాలకు అధిపతి.

**సాతాళించు** స.క్రి. నానిన విత్తులు మొ. వాటిని నూనె కొంచెంగా వేసి పక్వంచేయు.

**సాతాళింపు** వి. తాళింపు, తిరగబోత, పోగపు.

**సాతాళింపు** చూ. సాతాళించు.

**సాతి** వి. స్వాతి.

సం. స్వాతి. ఒకానొక నక్షత్రం.

<సం. స్వాతి.

**సాతికసుడి** రూ.చూ. సాత్వికసుడి. వి. సాద్యపుసుడి, వీపు మీద దామెనసుడికీ, బొడ్డుసుడికీ మధ్యన ఉండే సుడి.

**సాతిన** వి. జందెం వేసుకున్న వైష్ణవుడు. హంస. 3.29.

త. చాత్తాన్. పూజ్యుడు.

<త. చాత్తాన్.

**సాతినవాండ్లు** విణ. బ.వ. సాతానివాళ్ళు.

**సాతిపీట** వి. ఎద్దులపేట, ఒకరకం నాగలబండి పరానికి ముందున్న పట్టె.

**సాతు**[1] వి. **1.** వర్తక జనసమూహం. భార. శాంతి. 3.474 ; **2.** పథికజనసమూహం. దశకు. 3.53 ; **3.** పసులమంద.

సం. సార్థ-. వర్తకసముహం ; ప్రా. సత్థ-. ప్రయాణంలో ఉన్న వ్యాపారిజన సమూహం ; అ.మా. సత్థ-. వర్తకులబిడారు, సత్థవాహ ; పా. సత్థ -, సత్థక-, సత్తిక, సత్థివాహ- ;

త. చాత్తు.

<ప్రా. సత్థ-.

**సాతువడు(-పడు)** అ.క్రి. బిడారు కొల్లపోవు. అము. 7.20.

**సాతు**[2] స.క్రి. సమర్పించు. ద్వి. భాగ. 1.814.

**సాతుకొయ్య** వి. వసారాకప్పుకు బిగించిన నిలుపుకొయ్య.

**సాతుపడి** వి. నందన, కస్తూరి, కర్పూర, కుంకుమపూలతో మిశ్రితమైన సుగంధద్రవ్యం. ద.హిం.శా. సంపు. 10శా. సం. 427 క్రి.శ. 1270.

**సాతుముడి** వి. కైసేత, గంధం.

**సాత్కరించు** స.క్రి. దానమిచ్చు. భార. శాంతి. 1.243, శృం.నై. 8.108.

సం. సాత్కృ. అధీనపరచు 'తదధీనవచనే' (5-4-48) అనే పాణిని సూత్రప్రకారం నామవాచకంపై తద్ధిత ప్రత్యయమైన ఈ 'సాతి' ప్రత్యయం వస్తుంది. కాని తెలుగు కవులు వ్యస్తంగా దీన్ని ప్రయోగించారు.

<సాత్కృ+-ఇంచు[3].

**సాత్కాలు** వి. జాతకకాలం.

సం. జాతకకాల-.జాతకకాలం.

<సం. జాతకకాల-.

**సాత్ఘుడి** వి. ఒకరకం నారింజచెట్టు (Citus Aurantium).

**సాత్తని** రూ.చూ. సాతాని. వి. సాతానిజాతివాడు. విప్ర. 5.10.

**సాత్తికసుడి** రూ.సూ. సాత్వికసుడి. వి. సాద్యపుసుడి. వీపు మీద దామెనసుడికీ బొడ్డుసుడికీ మధ్యన ఉండే సుడి.

**సాత్తెలపెనుము** వి. మూకటిలాగా ఉండి చిల్లులుండే మట్టిపాత్ర.

**సాత్‌ఫూల్** వి. ఏడుపువ్వులు.

హిం. సాత్‌ఫూల్. ఏడుపువ్వులు.

<హిం. సాత్‌ఫూల్.

**సాత్మించు** స.క్రి. సహించు, సైచు. భార. ఆశ్ర. 2.53.

సం. సాత్త్విక-, సాత్త్వి. నిజమైనది, సత్వగుణంకలది.

<సం. సాత్త్వి+-ఇంచు[3].

**సాత్వికదానము** వి. ఉదకపూర్వకంగా ఈయనిదానం. E.1, సంపు. 15.

సం. సాత్త్వికదాన -. సత్వగుణసంబంధంవల్ల కలిగిన దానం.

<సం. సాత్త్వికదాన- (అర్థవిపరి.).

**సాత్వికసుడి** రూ. సాతికసుడి, సాత్తికసుడి. వి. సాద్యపుసుడి. వీపుమీద దామెనుసుడికీ బొడ్డుసుడికీ మధ్యన ఉండే సుడి.

సం. సాత్త్విక-. పరిశుద్ధమైనది, సారభూతమైనది, శక్తిమంతమైనది.

<సం. సాత్త్విక-+సుడి (మిశ్రన.).

**సాద** రూ. సాదా[1]. వి. **1.** అల్పుడు. తాళ్ల.సం. 11.97 ; **2.** మట్టికంచం ; విణ. **1.** సామాన్యమైన ; **2.** అలంకరణలు లేని, **3.** స్టాంపులులేని.

బెం, ఒ. సాదా ; హిం. సాదా. సరళమైన, నిష్కపటమైన, ఖాళీయైన, సామాన్యమైన, అలంకరణలేని, కల్తీలేని, తప్పులేని. తెల్లని, మూర్ఖమైన, పొరపాటులేని ; మరా. సాధా. సరళమైన, నిష్కపటమైన; ఉ. సాద. శుద్ధం, అమలినం. ; పార. సాద. తెల్లని, అలంకరణలేని, కపటంలేని, నమ్మకమైన, సమతలమైన, శృంగారంలేని ;

క. సాద. సాదా, సాదు, సాధా. సమతలమైన, సామాన్యంగా ఉండే, స్వచ్ఛమైన ; త. సాతా. సామాన్యమైన, సమతలమైన.

<ఉ. సాద.

**సాదనేత** రూ.చూ. సాదానేత. వి. పడుగుపేక ఒకే రకంగా ఉండేటట్లు నేసిన నేత.

**సాదన** రూ. సాదనం. వి. **1.** సాము. పి.శకు. 3.225 ; **2.** నైపుణ్యం. సారంగ. 2.125 ; **3.** మల్లవిద్య. ఆం.భా. 2.202 ; **4.** మల్లవిద్యాప్రదర్శనం. రసిక. 1.81 ; **5.** అభ్యాసం ; **6.** వాసాలకు బల్లెంవంటి ఆయుధాలకు పనికి వచ్చే 20-50 అడుగుల ఎత్తుపెరిగే వెదురు (Bambusa stricta, Dendrocalamus strictus).

సం. సాధన-. ఉపకరణం, ఉపాయం;ప్రా. సాహణ-. రోదనం, కారణం ; పా. సాధన- ;

క.తు. సాదన ; మ. చాదన.

<సం. సాధన-.

**సాదనకాడు** విణ. శస్త్రదక్షుడు, ఆయుధవిద్యలో ఆరి

తేరినవాడు. ఆం.భా. 2.205. సాదనజోదు వి. మల్లుడు. ఆం.భా. 2.203. సాదనదీవె వి. గస్తీతిరిగే యోధులురాత్రి పట్టేదీపం. ఉ. హరి. 2.74. సాదనపెనఁకువ వి. గదాయుద్ధం. ఉ.రా. 3.246,

**సాదనం** రూ.చూ. సాదన వి. వాసాలకు, బల్లెంలాంటి ఆయుధాలకు పనికివచ్చే 20-50 అడుగుల ఎత్తుపెరిగే వెదురు (Bambusa stricta, Dendrocalamus strictus).

**సాదము**[1] వి. ఒకవిధమైనపన్ను. ద.హిం.శా. సంపు. 4.శా. సం. 665. క్రీ.శ. 1138

**సాదము**[2] వి. అన్నం. వేంక. ఆం. 44, ప్రి 5.10.

సం. ప్రసాద-. స్వచ్ఛత, దయ, కరుణ, సాదివ్య-. దైవానుగ్రహం ప్రా. పసాయ-.అనుగ్రహం, సాదివ్య-. సాదేవ్య-. దైవానుగ్రహం ; పా. పసాద-.

< సం. ప్రసాద-.

**సాదరు** వి. 1. వాడకంసొమ్ము ; 2 కలిమి ; 3. చిల్లర ఖర్చు.

హిం. ఉ. సాదర్. జారీచేయబడిన మరా. సాదర్ ; పార. సాదిర్ ;

క. సాదరు. వచ్చిన, పుట్టిన, జారీచేయబడిన, ఎడిట్ చేయబడిన.

< ఉ. సాదర్.

సాదరుచేయు రూ. సాదర్‌చేయు. అ.క్రి. జారీచేయు.

**సాదర్‌చేయు** రూ.చూ. సాదరుచేయు. అ.క్రి. జారీచేయు.

**సాదరువారి** రూ.చూ. సాదర్వారి. వి. కంటింజెన్సీ, చిల్లర ఖర్చులు.

**సాదర్‌చేయు** చూ. సాదరు.

**సాదర్వారి** రూ. సాదరువారి. సాదర్‌వారు, సాదలవారి సాదల్‌వార్. వి. కంటెంజెన్సీ, చిల్లరఖర్చులు.

ఉ. అర. సాదిర్. పొందిన, సంభవించిన, వచ్చిన, ప్యాస్‌చేయబడిన, ఇష్యూచేయబడిన. పుట్టించిన, వారిద్. రావటం, సమీపించటం, ప్రవేశించటం ;

త. చతుర్వారిత్తు.

< ఉ. సాదిర్ + వారిద్.

**సాదర్‌వారు** రూ.చూ. సాదర్వారి వి. కంటెంజెన్సీ, చిల్లర ఖర్చులు.

**సాదలవారి** రూ.చూ. సాదర్వారి. వి. కంటింజెన్సీ, చిల్లర ఖర్చులు.

**సాదల్‌వార్** రూ.చూ. సాదర్వారి. వి. కంటింజెన్సీ, చిల్లర ఖర్చులు.

**సాదా**[1] రూ.చూ. సాద. విశ. 1. సాధారణమైన, నగిషీలేనిది, వన్నెచిన్నెలులేనిది ; 2. స్టాంపులేని.

సాదాఅచ్చు వి. మమూలు అచ్చు, పైనఒకపోగూ కింద ఒకపోగూ పన్నెగూట్లోనుంచి దూర్చినఅచ్చు. **సాదాఅంచు** వి. చీరఅంచులో నిలుపుకు రంగుపోగులు పెట్టి అడ్డానికి పేకదారం పెట్టి నేసిన మామూలు అంచు. **సాదాఅర్చి** వి. మట్టమార్చి, పైభాగం బల్లపరుపుగా ఉండే అర్చి. సాదాఒల్లె రూ.చూ. సాదావల్లె. వి. కన్నెపిల్లలు కట్టుకొనే చిన్నచీర. సాదాకండువా రూ. సాదాకాండువా. వి మామూలుగా నేసిన కండువా. సాదాకమ్మి వి. మామూలుగా బెత్తెడు వెడల్పున నేసినకమ్మి. సాదాకాండువా రూ.చూ. సాదాకండువా. వి. మామూలుగా నేసిన కండువా. సాదాకారు వి. పట్టుకారు, వేడివస్తువులను పట్టుకోవటానికి వాడేపవిముట్టు. సాదాకిస్తీ వి. గడ్డకిస్తీ, చట్రంతో సమానమైన మట్టంలో ఉండే కిస్తీ. సాదాకుంచి రూ.చూ. సాదాకుంచె. వి. 1. కుంచెపరుపు సమతలంగా ఉన్నకుంచె ; 2. పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతో దువ్వటం. సాదాకుంచె రూ. సాదాకుంచి. వి. 1. కుంచెపరుపు సమతలంగా ఉన్నకుంచె ; 2. పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతో దువ్వటం. సాదాకుంచెలాగు అ.క్రి. పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతో దువ్వు. సాదాకుంచెవేయు అ.క్రి. పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతోదువ్వు. సాదాకుప్పడం వి. అంచులకు ప్రత్యేకంగా వేరేరంగు పేకదారాలు పడేట్టు నేసిన మామూలునేత. సాదాకొంగు వి. పడుగుకు ఏదైనా రంగు పెట్టి డిజైన్లు లేకుండా మామూలుగా నేసిన చీర చెంగు, సాదాగట్టికమ్మి వి. డిజైన్లు లేకుండా మామూలుగా చిక్కగా నేసిన కమ్మి. సాదాగడిచీర వి. మామూలుగా నేసిని గళ్ళచీర. సాదాగూడు వి. చౌకంగూడు, నలుపలకలుగా ఉండేగూడు. సాదాచట్రం వి. గుజ్జులమీదకామరులు, వాటిమీద పీటలు అపైనవెన్నుగాడిగల కప్పుచట్రం. సాదాచిడీ వి. సాదామెట్టు, నలుపలకలుగా ఉండే అరుగుతో వంకలు వంపులు లేకుండా నిటారుగా కట్టినమెట్టు. సాదాచీర వి. డిజైన్లు లేకుండా నేసిన మామూలునేతచీర. సాదాచెట్లకమ్మి వి. చెట్లమాదిరి నమూనాలు నేసిన ఒకరకం కమ్మి. సాదాజముఖానా వి. ఒకేరంగునూలుతో నేసిన జంపఖానా. సాదాతంతె వి. సాదామెట్టు, నలుపలకలుగా ఉండే అరుగుతో వంకలు వంపులు లేకుండా కట్టినమెట్టు. సాదాతలుపు వి. దిసితలుపు, చెక్కడపని చేయని తలుపు. సాదాతువాలు రూ.చూ. సాదాతువ్వాలు, వి. మామూలుగా నేసిన తువ్వాలు, సాదాతువ్వాలు రూ. సాదాతువాలు. వి. మామూలుగా నేసిన తువ్వాలు. సాదాదోతి రూ.చూ. సాదాధోతి. వి. మామూలుగా నేసిన పంచె. సాదాధోతి రూ. సాదాదోతి. వి. మామూలుగా నేసిన పంచె. సాదానాడి రూ.చూ. సాదానాడె. వి. 1. మామూలునేతనాడె ; 2. వజానేతలో అంచులమధ్యభాగం నెయ్యటానికి పేకదారం కండె బిగించిన మామూలునాడె. సాదానాడె రూ. సాదానాడి. వి. 1. మామూలునేతనాడె ; 2. వజానేతలో అంచుల మధ్యభాగం నెయ్యటానికి పేకదారం కండె బిగించిన మామూలునాడె సాదానిచ్చెన వి. కాళ్ళనిచ్చెన సాదానేత రూ. సాదనేత. వి. పడుగుపేక ఒకేరకంగా ఉండేటట్లునేసిన నేత. సాదాపరుపుకుంచె వి. కుంచెపరుపు సమతలంగా ఉన్నకుంచె. సాదాపేటు వి. అంచులోనేసిన ఒకరకం డిజైను. సాదాపొత్తు వి. ఇద్దరు కలిసి చేసేసాగు. సానాబుటా వి. రెండుఅంచులమధ్యభాగంలోనేసిన ఒకరకం డిజైను. సాదామలుకు వి. పన్నెకట్టుబడిలో దండెల మధ్య

ఈనెలుబిగించి దారంతో వేసిన మామూలుకట్టు. సాదాముంగి వి. మామూలునేతగడి. సాదామూకుడు వి. చుట్టూ సాదాగా అంచు చదరంగా ఉండి పాత్రలో మూతపెట్టుకోవటానికి వాడే మట్టిపాత్ర. సాదామెట్టు వి. నిచ్చెనమెట్టు, సాఫీమెట్టు, నలుపలకలుగా అరుగుతో వంకలు వంపులు లేకుండా నిటారుగా కట్టినమెట్టు. సాదారాయి వి. 1. దొంటురాయి, పునాదులు నింపటానికి కొన్నిసమయాల్లో గోడల కట్టుబడికి కూడా వాడబడే చెక్కనిరాయి ; 2. నల్లబండ, జిగురు మట్టి. సాదారేషన్ వి. మామూలుపట్టు. హిం. రేశమ్. పట్టు; ఉ. రేషమ్. < సాదా¹ + ఉ. రేషమ్. సాదారౌతు వి. సాపురౌతు, చదునుగా నున్నగా ఉన్నరాయి. సాదాలుంగీ వి. మామూలుగా నేసిన లుంగీ. సాదావజా వి. పేకపోగులు అంచులోకి రాకుండా వేరేపోగులుపెట్టి నేసిన డిజైను నేత. సాదావడి వి. మామూలు దారంతో అచ్చుకర్రకు వేసిన అల్లిక. సాదావల్లె రూ.చూ. సాదాఒల్లె. వి. కన్నెపిల్లలు కట్టుకునే చిన్నచీర. సాదాసల్ల వి. కుండలు. అటికలుమొ॰ వాటిని నర్సేబల్ల.

సాదా² వి. మల్లవిద్యావిశేషం. మల్లు. 3.69,

క. సాద. స్పష్టత.

సాదాత వి. జాగు.

సాదాను అవ్య. మామూలు.

సం. సాధారణ-. సామాన్యం, తుల్యం, విశ్వజనీనం.

<సం. సాధారణ-.

సాదారణకట్టు వి. కాశిరాయికట్టుబడి, చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి.

సం. సాధారణ-. సామాన్యం, తుల్యం, విశ్వజనీనం.

<సం. సాధారణ- + కట్టు.

సాదాలతొట్టి చూ. సాదా¹. రూ. సేదాల్తొట్టి. వి. కుండలువానే టప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర.

సాదించు అ.క్రి. విరామం లేకుండా కఠినమైన మాటలతో బాదించు. బాధించు.

సం. సాధ్. పూర్తిచేయు, జయించు, సంపాదించు వశపరచుకొను, నేర్చు, పరిహరించు.

<సం సాధ్- + -ఇంచు³.

సాదిత్తరుళ వి. అనుగ్రహం కోరటం.

సాదిరు వి. 1. ఉత్తరువు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 767. క్రీ.శ. 1680 ; 2. అర్పణం.

పార. సాదిర్. నిర్లక్ష్యమయిన, గందరగోళపడిన.

సాదు¹ రూ. సాదువు. వి. 1. సాధువైనపశువు. భార.ఉద్యో. 2.13 ; 2. సాధువు (సన్యాసి). అచ్చ.రా.బాల. 196 ; విశే. 1. సాధువు. భార. కర్ణ. 3.55 ; 2 అమాయక మయిన. శాల్ల.సం 8.113 ; 3. యోగ్యుడు, మంచివాడు. పాండు. 5.107 ; అవ్య. బాగు, మేలు. శృం.నై. 3.16.

సం. సాధు-. యతి, ఋషి, సజ్జనుడు ; పా. సాధు-; అప.అ.మా. ప్రా. సాహు ;

క. సాద, సాదు. మంచితనం, దయాళుత్వం ; తు. సాద, సాదు. స్వచ్ఛత, నిరాడంబరత.

<సం. సాధు-.

సాదుగామిడి వి. పైకి సాధువుగా కనిపిస్తూ దుర్మార్గుడైన వాడు. సాదు(జేయు-(చేయు) స.క్రి. చక్కజేయు. భార. ద్రోణ. 1.205. సాదుబేనుంగు(-ఏనుంగు) వి. మంచి ఏనుగు. భార శాంతి. 2.177. సాదుతనము వి. సాధుత్వం. సమీర. 2.201. సాదుపలవ వి. పైకిసాధువుగా కనిపిస్తూ దుర్మార్గుడైనవ్యక్తి. సాదువిసాళి వి. సాధువుగా కనిపించే దుర్మార్గుడు. సారంగ. 3.56. సాదుబిడ్డ వి. మంచివ్యక్తి. సారంగ. 3.55.

సాదు² స.క్రి. 1. సంరక్షించు, పెంచు ; 2. సరిదిద్దు, అదుపులో ఉంచు.

క. సాదు. మంచిగంధంపూత ; త. చాన్తు. మంచి గంధం ; మ. చాన్దు.

సాదు³ రూ.చూ. చాఁదు. వి. బొట్టుపెట్టుకోవటానికి మెత్తగా చేసి ఎండబెట్టిన నల్లటి పదార్థం.

సాదువు రూ.చూ. సాదు¹. వి. సజ్జనుడు. ఆం. భా. 2.170.

సాదేవకాడ వి. తుప్పగా పెరిగే ఒకరకం కలుపుమొక్క, లేత ఆకుపచ్చరంగు పూలుపూస్తుంది. (Ichnccarpus frufescens).

సం. సహదేవ-. పాండవులలో చిన్నవాడు.

<సం సహదేవ- + కాఁడ.

సాద్దెపుసుడి చూ. సాధ్యపుసుడి. వి. సాత్వికసుడి, వీపుమీద దామెనసుడికీ బొడ్డుసుడికీ మధ్యనఉండే సుడి.

సాధనాశూరులు వి.బ.వ. పద్మసాలీల దగ్గర గారడివంటి వినోద విద్యలు ప్రదర్శించి అడుక్కొనేవాళ్ళు.

సం. సాధనా. సిద్ధి, పరిసమాప్తి, సమాధానం. శూర-. పరాక్రమవంతుడు.

<సం. సాధనాశూర-. (అర్థవిపరి.).

సాధ్యపుసుడి వి. సాత్వికసుడి, వీపుమీద దామెనసుడికీ బొడ్డుసుడికీ మధ్యఉండేది.

సం. సాధ్య-. సాధించబడ్డ.

<సం. సాధ్య-. + సుడి.

సాన¹ వి. 1. గంధంతీసేరాయి. పండి. చ. 5.351. బసవ. 4 873 ; 2. కత్తులు మొ. వి నూరేరాయి. నిర్వ.రా. 6.48 ; 3. మణుల మొక్కలు పోరాచి మెరుగుపెట్టేరాయి. శృం. నై. 116, సిం. ద్వా. 1.15.

సం. శాణ-, శాటా. శానం ; ప్రా. సాణ-. ;

క. సాణె, సాణె. సాణెకల్లు, ఒరగల్లు, సాణెగ. మెరుగుపెట్టేవాడు ; తు. సాణె. సాణెకల్లు సానె ; త. చాణై ; మ. చాణ.

<ప్రా. సాణ-.

సానకత్తి వి. సాముచేసే కత్తి. ప్రబంధ. 1.78. సానకొడవలి వి. పెద్దకొడవలి, జొన్న మొ. పైర్లుకోసే పెద్దసైజు కొడవలి. సానక్రిందవన్నె వి. నలుపు. సానఁదీరు(-తీరు) రూ.చూ. సానలఁదీరు. అ.క్రి. మెరుగెక్కు. రాజవా. 3.75. సానఁదేలు(-తేలు) అ.క్రి. మెరుగారు, పదునెక్కు. దశా. 6.15. సానపట్టు రూ.చూ. సానఁబట్టు అ.క్రి. మెరుగుపెట్టు. సానఁబట్టు(-పట్టు¹) రూ. సానపట్టు. అ.క్రి. పదునుపెట్టు, మెరుగుపెట్టు. కాశీ. 1.121. సానఁ.

బెట్టు(-పెట్టు) స.క్రి. సానమీదనూరి పదును పెట్టు. శృం. నై. 6.116. సానరాయి రూ. స్రాన్రాయి. వి. పన్నె కట్టటానికి వాడే కత్తులకు పదును పెట్టే సున్నపురాయి. సానలఁదీరు(-తీరు) రూ. సానఁదీరు. అ.క్రి. సాన ఒరిపిడితో మెరుగెక్కు. వసు. 1.19. సానలఁదేరు అ.క్రి. మెరుగువచ్చు, పదునువచ్చు. సానలవాఁడు విణ. 1. మణికారుడు, మణుల్ని బాగుచేసేవాడు. ఆం భా. 2.286; 2. మెరుగు పెట్టేవాడు. స్రాన్రాయి రూ.చూ. సానరాయి. వి. పన్నె కట్టటానికి వాడే కత్తులకు పదును పెట్టే సున్నపురాయి.

సాన[2] రూ.చూ. సారె[1] వి. కుమ్మరి కుండలుచేసే చక్రం.

సానకఱ్ఱ వి. కుమ్మరిసారెను తిప్పటానికి వాడే కఱ్ఱ. సానపెట్టి రూ.చూ. సారెపెట్టు. వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలుకట్టి పైనచుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తినమట్టి. సానపెట్టు రూ.చూ. సారెపెట్టు. వి. సారెతయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. సానముల్లు రూ.చూ. సారెముల్లు. వి. వాటలు కోయటానికి ఉపయోగించే పొడుగాటి సన్నని కమ్మి. సానమెత్తు రూ.చూ. సారెమెత్తు. వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలుకట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తినమట్టి. సానమొల రూ.చూ. సారెమొల. వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కింది భాగంలో బిగించిన ఇనపమేకు. సానసందు వి. సారికోలకట్టిపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం.

సానం రూ.చూ. సేనం. వి. రాతిముక్కలు కొట్టటానికి పనికి వచ్చే ఒక అంచు పదునుగా ఉండే ఉక్కుముక్క.

సానాగడ వి. సావనకఱ్ర. ఉ. హరిశ్చ. 4.114.

సాని[1] రూ. శాని. 1. దేవదాసి. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 109. క్రీ.శ. 1076; 2. వేశ్య, వారస్త్రీ. ద.హిం. శా. సంపు. 10. శా. సం. 107. క్రీ.శ. 1139; 3. స్త్రీల పేర్ల చివర 'అమ్మ' అనే అర్థంలో వచ్చే ప్రత్యయం. ద. హిం.శా. సంపు. 4. శా.సం. 695. క్రీ.శ. 1415; 4. అధిపురాలు. భార. ఆది. 7.221; 5. స్త్రీ. భార. ఆది. 7.223; 6. వృత్తిఉన్నస్త్రీ (మంత్రసాని). భీమ. 1.112: 7. రాణి. కాశీ. 6.221; 8. భార్య. భాగ. 1.24; 9. ఉత్తరపదంగా వచ్చినట్లయితే దేవిలేక అంబ, ముద్దుసాని. భాగ. 1.24. ఉ. 1. పూజారిసాని. క్రీడా. 97; 2. నాపసాని. కళా. 7.88: 3. దాసరిసాని. వైజ. 2.54; 4. దొరసాని. అచ్చ. రా. బాల. 33; 5. నెఱసాని. శకా. 3.112; 6. ఏలికసాని. సకల. 2.293; 7. ఒజ్జసాని. ఆం. భా. 2 107; 8. ప్రెగ్గడసాని. ఆం. భా. 2.107; 9. వేలుపుసాని. ఆం.భా. 2.110; 10. సోమిసాని. ఆం. భా. 2.110; 11. రెడ్డిసాని. హంస. 4.138; 10. ప్రధానంగా నల్లగాఉండి దానిమీద నాలుగైదు ఇతరరంగులు కలిగి మెరిసే చేప.

సం. స్వామినీ; ప్రా. సామిణీ. స్వామిని; అ.మా. పా. సామినీ; క. సాని. నెచ్చెలి, సహచరుడు; తు. సాని. స్త్రీల నామాలచివర గౌరవార్థం చేర్చే ఉపనామం; త. చాని. తురైచాని మొ. వాటిలోని ఉత్తరభాగం; కువి. సానేని. భోగంది.

<ప్రా. సామిణీ.

సానిచేప వి. ఒకరకం చేప. (Labrus). సానిది విణ. వేశ్య. సానిమానినిబంధకాండ్రు వి.బ.వ. దేవాలయ పరిచారకులైన సానులు, మానులు. ద. హిం. శా. సంపు. 405. క్రీ. శ. 1265. సానిమేళం వి. మేజువాణి. సానిమొయ్య వి. చుక్కలు చుక్కలుగా ఉండే సముద్రంచేప. సానివాడ వి. వేశ్యావాటి, దేవదాసీలు నివసించే పేట. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 989. క్రీ.శ. 1163. సానివాండ్లు విణ.బ.వ. వ్యభిచారంతో జీవించే జాతివారు. సానివాఁడు విణ. వ్యభిచరించిన స్త్రీల వలన జీవించే కులంలోనివాడు, భోగంవాడు. సానివ్రిత్తి వి. దేవాలయంలో రంగభోగానికి నియుక్తమైన సానుల కిచ్చిన వృత్తి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 107. క్రీ.శ. 1139. సం. వృత్తి-. ఉండటం, వృత్తి, శాశ్వతమైన, మిగిలిన, షరతు, కదలిక, పద్ధతి, ప్రవర్తన, వ్యాపారం, జీవితం, కూలి, జీతం. <సం. వృత్తి-. సానులు మానులువిద్యామంతులు వి.బ.వ. సానులు మానులు వాద్యకాండ్రు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 107. క్రీ.శ. 1139.

సాని[2] రూ.చూ. సాహిణి. వి. గుఱ్ఱంరౌతు. సాంబ. మాన. 6.

సానికరణము వి. 1. లెక్కలుసరిచూసేవాడు; 2. కరణంకింద కరణం.

సాని[3] రూ.చూ. సారె[1]. వి. కుమ్మరి కుండలు చేసే చక్రం.

సాని[4]. విణ. రెండవ.

ఉ. సానీ. రెండవ, హోదాలలో రెండవ తరగతికి చెందిన.

<ఉ. సానీ.

సానిక[1] చూ. సానిప. వి. పేడనీళ్ళు.

సానిక[2] రూ. చానిక, శానిక, సానికి. సానికె, సానిగ, సాన్కె. వి. 1. వెలుపాటి తట్ట. ఆం. భా. 2.245; 2. మట్టి కంచం; 3. అన్నం తినేకంచం; 4. నూలు కండెలు వేసుకొనే వెడల్పు మూతిగల తొట్టి లేక మూకుడు.

సానికి రూ.చూ. సానిక[2]. వి. వెడల్పు అంచుతో గుంతగా ఉండే మూకుడు.

సానికె రూ.చూ. సానిక[2]. వి. వెడల్పు అంచుతో గుంతగా ఉండే మూకుడు.

సానిగ రూ.చూ. సానిక[2]. వి. వెడల్పు అంచుతో గుంతగా ఉండే మూకుడు.

సానిప రూ. సానిపి, సానిపె, సానుపు సాన్పి, సాన్పు. వి. వాకిలి తుడిచి కళ్ళాపు నీళ్ళు చల్లటం.

సానిపి రూ.చూ. సానిప. వి. వాకిలి తుడిచి కళ్ళాపునీళ్ళు చల్లటం.

సానిపికుండ రూ.చూ. సానుపుకుండ. వి. ఇంటిముందు కళ్ళాపు చల్లటానికి వాడే మట్టిపాత్ర.

**సానిపె** రూ.చూ. సానిప. వి. వాకిలి తుడిచి కళ్ళాపినీళ్ళు చల్లటం.

**సానిపెతడుపువాన** వి. కళ్ళాపి చల్లితే అయినంతగా నేల పదునయ్యే వాన.

**సానిమేళం** వి. మేజువాణి.

**సానియంబాటి** వి. స్థలనామం. ద. హిం.శా. నంపు. 5. శా. నం. 22. క్రీ.శ. 1094.

**సానియంబాటిమానిక** వి. ఒకవిధమైన కొలమానిక. స్థల నామంతో వ్యవహారంలో ఉన్న మానిక. ద. హిం.శా. నంపు. 5. శా.నం. 12.

**సానుపు** రూ.చూ. సానిప వి. వాకిలి తుడిచి కళ్ళాపు నీళ్ళు చల్లటం.

**సానుపుకుండ** రూ. సాన్పుకుండ. సానిపికుండ. వి. ఇంటిముందు కళ్ళాపు చల్లటానికి వాడే మట్టిపాత్ర.

**సానులుమానులు** విద్యామంతులు చూ. సాని[1].

**సానె** రూ.చూ. సారె[1]. వి. టగిరి, కుండలు, పెంకులు మొ. వి తయారు చేయటానికి కుమ్మర్లు వాడే చక్రంలాంటి సాధనం.

**సానెగుంటక** వి. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలేగుంటక.

**సాన్కె** రూ.చూ. సానిక[2]. వి. వెడల్పు అంచుతో గుంతగా ఉండే మూకుడు.

**సాంతికొంగ** వి. ఒకరకం కొంగ (Bubulcus coromandus).

**సాంత్రా** రూ. నంత్రా. వి. మేలి దినుసు నారింజలు.

హిం. సంత్‌రా. కమలాఫలం; పో. చింత్రా. పోర్తుగాలు లోని 'చింతా' పట్టణ పరిసరాల్లో పండే నారింజ పళ్ళు ప్రపంచ ప్రసిద్ధం.

<హిం. సంత్‌రా.

**సాందై** వి. చిన్నగోడ, చుట్టుగోడలమీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు పట్టిన పక్కగోడ.

**సాతు** వి. గోనెలు నేసేవారి జాతి. దశకు. 3.52.

**సాతువాడు** విణ. గోనెలు నేసే జాతివారు.

**సాన్నికుండ** చూ. సానిప. వి. ప్రతిఉదయం ఇంటి ముందు చల్లే పేడనీళ్ళు కలిపేకుండ, కళ్ళాపకుండ.

**సాన్పి** రూ.చూ. సానిప. వి. వాకిలి తడిచి కళ్ళాపు చల్లటం.

**సాన్పు** రూ.చూ. సానిప. వి. వాకిలి తుడిచి కళ్ళాపు నీళ్ళు చల్లటం.

**సాన్పుకుండ** రూ.చూ. సానుపుకుండ. వి. ఇంటిముందు కళ్ళాపు చల్లటానికి వాడే మట్టిపాత్ర.

**సాన్రాయి** చూ. సాన[1].

**సావగడ్డపార** చూ. చాఁపు. వి. అలుగుగడ్డపార, చివర వెడల్పు పలుగున్న గడ్డపార.

**సాపట్లపెండెం** వి. బెల్లందోసెలు పోయటానికి పొయ్యశే అమర్చి ఉండే మట్టిపెనం.

**సాపట్లపెనం** వి. బెల్లందోసెలు పోయటానికి వాడే పొయ్యశే అమర్చి ఉండే మట్టిపెనం.

**సాపడు** రూ. సావడు. స.క్రి. 1. తిను, భుజించు. విక్ర. 2.33; 2. మింగకుండా ఊరికే నములు; 3. ఎంగిలితిను.

త. చాప్పడు. తిను.

<త. చాప్పడు.

**సాపను** స.క్రి. నున్నగారుద్దు. సాపుచేయు

**సాపత్యం** వి. సామ్యం.

సం. సాపత్న్య-. సవతితనం, స్పర్ధ, పోటీ.

<సం. సాపత్న్య-.

**సాపము** వి. శాపం, తిట్టు.

సం. శాప-. తిట్టు. దూరు; ప్రా. సాప-, సావ-.

<ప్రా. సాప-.

**సాపించు** స.క్రి. తిట్టు, శపించు. <సాపము+-ఇంచు[3].

**సావర[1]** వి. లేతనీలంరంగుపూలు పూసే ఒకరకం తీగ (Da'bargia zerumbet).

**సావర[2]** వి. ఒకరకంచెట్టు (Symplcus raumosa).

**సాపరజాగాకు** వి. ఒకరకం ఆకుకూర.

**సాపాటు** వి. 1. ఆరగించటం. వైజ. 2.122; 2. వివాహం తరవాత నాలుగోరోజున బంధువులు తినేవిందు; 3. రాజభోజనం.

త. చాప్పాటు. భోజనం, తిండి.

<త. చాప్పాటు.

**సాపాటురాయుడు** వి. తిండికితప్ప ఇతరపన్లకి పనికి రానిసోమరి.

**సాపించు** చూ. సాపము.

**సాపు[1]** రూ.చూ. చాఁపు. వి. ఒకజత.

**సాపు[2]** రూ. జాపు, సాపూటి, సాఫీ, సాఫు. వి. 1. చదరం, మెత్తన, ఎగుడుదిగుళ్ళు లేకుండటం; 2. స్పష్టత; 3. తుడుపులూ తప్పులూ లేనిరాత; విణ. 1. తేట, శుభ్రమైన; 2. వంకరలేని, చదునయిన; 3. నన్నని.

హిం. ఉ. సాఫ్. శుభ్రమైన, తెల్లని, మురికిలేని, అంతా, స్వచ్ఛమైన;

క. సాప, సాఫ, సోఫు. శుభ్రమైన, స్వచ్ఛమైన, నున్నని, క్రమమైన, సాదాగా ఉండే, తెల్లని, నీతిబాహ్యత నుండి దూరమైన, జబ్బు నుండి దూరమైన, నిందపోగొట్టు కున్న, నాశనం, పూర్తివినాశనం; త. చాప్పు.

<ఉ. సాఫ్.

**సాపుకత్తి** వి. పన్నెదండెల మధ్య బిగించిన పుల్లలుసాపు చేసేకత్తి. **సాపుకప్పు** వి. చదరంగాఉన్న ఆకుకప్పు.

**సాపుగొట్టం** వి. గుండ్రంగాతయారుచేసిన మట్టితూము.

**సాపుచిడీ** వి. సాదామెట్టు, నలుపలకలుగాఉండే అరుగుతో వంకలు వంపులు లేకుండా నిటారుగాకట్టినమెట్టు.

**సాపుచేయు** రూ. సాఫ్జేయు. స.క్రి. నున్నగింత నలపతో రెండోసారి నునుపు చేయు; 2. కుండనాలుగుపక్కల సాపుగా రావటానికి బట్టలోపట్టు; 3. వాటలకు పైభాగంలో చుట్టూ గతుకులు లేకుండా దబ్బతో శుద్ధంచేయు.

**సాపుచేయువాడు** విణ. చాకలివాడు. **సాపుతంతె** వి. సాదా మెట్టు, నలుపలకలుగాఉండే అరుగుతో వంకలుపంపులు లేకుండా నిటారుగా కట్టినమెట్టు. **సాపుతాపి** వి. బిళ్ళతాపి, గచ్చును నున్నబరచటానికి పనికివచ్చే చిన్నతాపి.

**సాపుపట్టు** స.క్రి. కుడిచేత్తో అద్దం వేలువేసిముఖం ఏర్ప

రచటానికి కుండ నాలుగుపక్కల సావుగా రావటానికి బట్టపట్టు. సాపుపని వి. సున్నంతో సున్నగా రుద్దేపని. సాపుబల్ల వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడేసలప. సాపుమానం వి. మెత్తన, నున్నన, ఎగుడు దిగుళ్ళు లేకుండటం. సాపురాయి వి. కందిపొడ రాయి, కట్టుబడికిగాని, నేలపై పరవటానికిగాని స్తంభాలు నిలపటానికిగాని వాడే చెక్కిన లేక మలచిన రాయి. సాప్జేయు రూ.చూ. సాపుచేయు. స.క్రి. వాటకు పైభాగంలో చుట్టూగతుకులు లేకుండా దబ్బతో శుద్ధం చేయు.

సాఫూటి రూ.చూ. సాపు². అవ్య. సక్రమం, సాపు.

సాపెన వి. 1. ఒకజాతి. హంస. 5.117 ; 2. శాపం. సం. శాప-. తిట్టు ; ప్రా.పా. సాప-, సావ-. శాపం క.తు. సాప.

<ప్రా. సాప-.

సాపెనలమారి వి. శాపనశీలుడు, తిట్టుబోతు. హంస. 5.113.

సాప్జేయు చూ. సాపు².

సాప్ని వి. రేకుడబ్బాలమీద నూలుచుట్టే యంత్రం.

సాప్లవరు రూ.చూ. సాఫవరు. వి. ఒకరకం లేతనీలంరంగు.

సాఫ్రా వి. మలచినరాత్తోకట్టిన కట్టుబడి.

సాఫీ రూ.చూ. సాపు². వి. 1. శుభ్రత, తిన్నదనం ; 2. నున్నన, ఎగుడుదిగుళ్ళు లేకుండా ఉండటం.

హిం.ఉ. సాఫీ. శుభ్రమైనది.

సాఫీమెట్టు వి. సాదామెట్టు, నలుపలకలుగా ఉండే అరుగుతో వంకలు వంపులు లేకుండా నిటారుగా కట్టిన మెట్టు.

సాఫు రూ.చూ. సాపు² వి. తుడుపులు, తప్పులులేనిరాత.

సాఫుచేయు స.క్రి. శుభ్రంచేయు. ఉ. అర. సాఫ్. శుభ్రమైన, తేటఅయిన, స్వచ్ఛమైన, అమాయకమైన, నిష్కళంకమైన. ఉ. సాఫ్. <ఉ. సాఫ్+చేయు.

సాఫురౌతు వి. సాదారౌతు, చదువుగానున్నగాఉన్నరాయి.

హిం. సాఫ్. స్వచ్ఛమైన, నిర్మలమయిన.

<హిం. సాఫ్+రౌతు.

సాఫ్ఝూడా వి. అంతాఅయిపోవటం.

హిం. సాఫ్. విమలమయిన, పూర్తిగా, ఝూడా. మైల. మలినం.

<హిం. సాఫ్ ఝూడా.

సాఫ్లవరు రూ. సాప్లవరు. వి. ఒకరకం లేతనీలంరంగు.

సాఫ్సీదా వి. సంపూర్ణంగా.

హిం. సాఫ్, నిర్మమైన, పూర్తిగా, సీధా. తిన్నని, రుజువైన.

హిం. సాఫ్సీదా.

సాబకు విణ. ముందుగా ఇచ్చిన ఉత్తరువు.

హిం. ఉ. సాబిక్. మునుపటి, భూతపూర్వం.

<ఉ. సాబిక్.

సాబాజీ వి. ఉత్తముడైన లేక కులీనుడైన ప్రభువు. ద. హిం శా. సంపు. 10. శా. సం. 751. క్రీ.శ. 1592.

ఉ. పార. షహ్‌బాజ్, మంచిప్రభువు.

<ఉ. షహ్‌బాజ్.

సాబాతురాయి రూ.చూ. శాబాద్‌రాయి. వి. తెలంగాణాలోని శాబాద్‌గ్రామప్రాంతంనుంచి వచ్చే ప్రసిద్ధమైన చలవ రాయి.

సాబాసు రూ.చూ. సేబాసు. అవ్య. ప్రశంసార్థకం. చంద్రభా. 1.129 ; వి. హెచ్చరికపదం.

సాబీతు వి. 1. నిరూపించబడటం ; 2. గట్టిగా.

హిం. ఉ. సాబిత్. స్థిరపడిన, నిరూపించబడిన, నిశ్చయించ బడ్డ. మొత్తం, సాబిత్-కర్నా. సాక్ష్యంద్వారా నిరూపించటం, సాబుత్, సాబూత్. మొత్తం, సరైన, అంతా ;

క. సాబీతు, సాబూతు. మంచి, గట్టి, నిరూపించ బడ్డ, స్థిరపడిన ; త. చాపీత్తు.

<ఉ. సాబిత్.

సాబూతుచేయు అ.క్రి. సాగులోకి తేవటం, బాగుపరచటం.

హిం. ఉ. అర. సాబిత్. గట్టి, ఎడతెగని, మన్నికైన, స్థిరమైన, నిరూపించబడిన, నిర్ణయించబడిన, దృఢ పరచబడిన, నిశ్చయించబడిన, సాబిత్‌కర్నా. నిశ్చయించటం, మన్నికగా ఉండేటట్లు చేయటం, స్థిర పరచటం, సాక్ష్యంద్వారా నిరూపణచెయ్యటం.

<ఉ. సాబిత్+చేయు.

సాబుదానగంజి రూ.చూ. సాబుదానాగంజి. వి. సగ్గుబియ్యం ఉడకబెట్టి చేసినగంజి.

హిం. సాబున్. సబ్బు.

సాబుదానాగంజి రూ. సాబుదానగంజి. వి. సగ్గుబియ్యం ఉడకబెట్టిచేసినగంజి.

సాబేతుమసర వి. కలరాలాంటిజబ్బు, ముక్కునుండినీరు కారటం, కంటినుండి రక్తం కారటం, గడగడ వణకటం దీనిలక్షణాలు.

సామగడ్డి రూ.చూ. చామగడ్డి. వి. పొడిగా సారవంతంగా ఉండే నేలలో పెరిగే కలుపుమొక్క (Panicum frumentaceum).

సామగ్రి వి. క్రొముట్టు, పనులు చేయటానికి వాడే పరికరం. సం. సామగ్రీ. వస్తుసముదాయం, నిలవసరుకు, ద్రవ్య సంభారం.

<సం. సామగ్రీ (అర్థవిపరి.).

సామాజకం వి. సమాజం.

సం. సామాజిక-. సమాజానికి సంబంధించింది, సభా. సంబంధి. సంఘానికి సంబంధించింది.

<సం. సామాజిక-.

సామణి రూ.చూ. సామెన. వి. ఒదె. (మెట్ట) పైర్లు కోసి పొలంలోవేసిన కుప్పల వరస, కొన్నిపనలుకలిపి కోసుగా నిలబెట్టిన వరస.

సామనలుపు వి. చామనచాయ.

సం. శ్యామ-. నీలమయినది.

సామంతము వి. గర్వం చూపటం, అహంభావం, టెక్కు.

సం. సామంత -. ఇరుగు, పొరుగు, దిట్టతనం ;

క. సామన్త.

< సం. సామంత- (అర్థవిపరి.).

**సామంతరాగోల** వి. ఆయుధవిశేషం. పల్నా. ప. 11.

సం. సామంత -. నాయకుడు, అరిగాపు. ఇంకో రాజుకు అధీనమై ఉన్నవాడు, పొరుగునఉన్నవాడు.

< సం. సామంత - + రాగోల. (మిశ్రస.).

**సామంతవదులు** రూ.చూ. సామంతవళులు. వి.బ.వ. వస్త్ర విశేషం.

**సామంతవళులు** రూ. సామంతవదులు. వి.బ.వ. వస్త్ర విశేషం. ప్రబంధ. 1.272.

సం. సామంత -. పొరుగున ఉన్నవాడు, ఇంకో రాజుకు అధీనమై ఉన్నరాజు.

< సం. సామంత- + వళి + - లు (మిశ్రస.).

**సామరి** చూ. సాము[1].

**సామలు** చూ. సామి. వి.బ.వ. అధికారులు. E.C.X. నిడ్ల ఘట్ట తాలుక్. 104. క్రీ.శ. 1532.

**సామానర్ర** చూ. సామాను.

**సామాను** రూ. పామాను, సావాను. వి. 1. గృహోపకరణాలు ; 2. పనిముట్లు ; 3. ఫర్నిచర్.

ఒ. సామాన్ ; హిం. సామాన్. పనిముట్టు, పరికరం ; మరా. సామాన్ ; ఉ. సామాన్ ; పార. సామాన్. ఫర్నిచరు, పరికరాలు, సాధనాలు, పనిముట్లు, కొలత, పరిమాణం, కారణం, తెలివి, ఆచారం, అలవాటు, విధానం, క్రమం, అధికారం, సంపద, పెద్దమనిషితనం, పొలిమేరరాయి, సమతూకం ;

క. త. చామాన్, సామాన్ ; మ. సామాన్.

< ఉ. సామాన్.

సామానర్ర వి. కొట్టడి, సరుకులు పెట్టుకొనే గది, < సామాను + అర[1]. సామానుకొట్టడి వి. సామాను గది, సరుకులు పెట్టుకొనే గది. సామానుగది వి. కొట్టడి, సరుకులు పెట్టుకొనే గది.

**సామి** వి. 1. నాయకుడు. కేయూ. 3.150 ; 2. కుమారస్వామి. భీమ. 2.28 ; 3. ప్రభువు. కళా. 6.61, E.I. సంపు. 21.2 ; 4. ప్రియుడు, ఉపపతి. పాండు. 3.87 ; 5. అధిపతి. యయా. 2.91 ; 6. సంబోధనలో పూజ్యులైన వారి నుద్దేశించిపలికేది. దశా. 2.62 ; 7. దేవుడు. ఉ.రా. 1 ఆ ; 8. రాజు. విజయ. పీఠి. 17 ; 9. భర్త. అచ్చ.రా. సుందర. 72.

సం. స్వామిన్. నాయకుడు, అధిపతి, ఈశ్వరుడు ; ప్రా. సామి, సామిఅ ; అ.మా. జై. మహా. శౌ. అప. సామి ; పా. సామిన్ ; మా. శామి ; శాబరీ. శామి ; శాసనప్రా. సువామి ;

క. సామి, సాయి, సావి, సోలు ; తు. సామి . త. చామి, చువామి ; ఘ. సామి ; ఒరయాన్; సాయ్యా. ప్రభువు, జానపదగాథల్లో గేయాల్లో భర్త అనే అర్థంలో ప్రయుక్తం.

< ప్రా. సామి.

సామికొట్టిడి వి. దేవుడిగది, దేవుడి బొమ్మపెట్టి పూజచేసుకొనేగది. సామిగట్టు వి. స్వామిమల, కుమారస్వామి ఉన్నకొండ. చంద్రాంగ. 2.45. సామితల్లి వి. పార్వతి. సామిదోగి వి. స్వామిద్రోహి. ప్రబంధ. 1.788. సం. ద్రోహిన్. ద్రోహం చేసేవాడు. < సామి + సం. ద్రోహిన్. సామిమల వి. కుమారస్వామి ఉండే ఒకానొక పర్వతం, హిమాలయపర్వతం. కాశీ. 4.302. సామియరదము (-అరదము) వి. గురుత్మంతుడు, విష్ణువాహనం, సామిలాతు వి. సహాయకుడు. సామిసామేనుచేకొన్నచాన వి. పార్వతి.

**సామిడి** వి. కల్లాపు, చల్లినపేడనీళ్ళు.

సామిడికుండ వి. ఇంటిముందు పేడనీళ్ళు చల్లటానికి వాడే మట్టిపాత్ర.

**సామిణి** రూ.చూ. సామెన. వి. ఒదె (మెట్ల) పైర్లు కోసి పొలంలో వేసిన కుప్పల వరస, కొన్నిపనలు కలిపి కోనుగా నిలబెట్టిన వరస.

**సామిత** రూ.చూ. సామెత ; వి. 1. సామెత ; 2. పురాణోక్తి ; 3. దర్శనోక్తి ; 4. లోకోక్తి.

**సామితె** రూ.చూ. సామెత. వి. లోకోక్తి.

**సామిని** రూ.చూ. సామెన వి. 1. కుండలుపేర్చి కాల్చుకు సిద్ధం చేసినట్టి ఆము ; 2. గడ్డివామి, మేట.

**సామీను** రూ.చూ. సామెన. వి. గడ్డిమొదలైన వాటిమోపుల్ని మట్టసంగా పేర్చిన కుప్ప.

**సాము**[1] వి. వ్యాయామం. శృం. నై. మను. 2.43.

సం. శ్రమ -. పరిశ్రమ, ఆయాసం, సంశ్రమ - ; ప్రా. సమ-. ;

క. సాము.

< ప్రా. సమ -.

సామరి వి. సాము నేర్చినవాడు. విజయ. 1.81. < సాము[1] + - అరి. సాముచేయు అ.క్రి. వ్యాయామం చేయు, గడ సాధనచేయు. విజయ. 3.25.

**సాము**[2] రూ. సగము, సవము, సా[2]. వి. అర్ధభాగం. కు.సం. 4.53 ; విఙ. సగం. హర. 5.24.

సం. సామి. సగం, అసంపూర్ణం.

< సం. సామి.

సాముకంటిచుక్క వి. పూర్వఫల్గుని నక్షత్రం. కవిక.1. సాముకొప్పు వి. అరకొప్పు. వాల్మీ. 2.13. సామునెలములికి రూ.చూ. సామునెలముల్కి. వి. అర్ధచంద్రబాణం, సామునెలముల్కి రూ. సామునెలములికి. వి. అర్ధచంద్ర బాణం. అచ్చ.రా.యు. 247. సామురెండయినన్ అవ్య. ద్రు. ఎంత చిక్కిపోయినా, ఎన్నికష్టాలుపడినా. సామేను వి. సగమేను, అర్ధశరీరం. మార్క. 6.120. సామేనుగలితదాలుపు రూ.చూ. సామేనుగలితదాల్పు. వి. శివుడు, అర్ధనారీశ్వరుడు. సామేనుగలితదాల్పు (-తాల్పు) రూ. సామేనుగలితదాలుపు, వి. శివుడు, అర్ధనారీశ్వరుడు. సాంబాలు వి. 1. సగం, సమభాగం. భార. విరా. 5.35 ; 2. సమాంశం, అర్ధాంశం, చెన్నబసవ. 3.38. < సాము[2] + పాలు[1].

**సామెణ** రూ.చూ. సామెన. వి. పైర్లు కోసి పొలంలో వేసిన కుప్పల వరస. కొన్ని పనలు కలిసి కోనుగా నిలబెట్టిన

కుప్ప.

**సామెత** రూ. సామిత, సామితె. వి. లోకోక్తి. యయా. 3.105.

సం. సామ్యతా, సామ్యత్వ -. సాదృశ్యం ; ప్రా. సమ్మత్త -. సమ్యగ్దర్శనం, అవిపరీతం, సత్యం, పర మార్థం ;

క. సామతి. సదృశం, పోలిక, లోకోక్తి ; తు. సామతి. ఉపమానం, పోలిక, లోకోక్తి.

< ప్రా. సమ్మత్త -.

**సామెన** రూ. సాగినె. సామణి, సామిణి, సామిని, సామీను, సామెణ, సామెర. వి. ఒడె (మెట్ట) పైర్లు కోసి పొలంలో వేసిన కుప్పల వరస, కొన్ని పనలు కలిపి కోసుగా నిల బెట్టిన వరస.

**సామెనగూడు** వి. కొన్ని సామెనలు కలిపి గుండ్రంగా వేసిన కుప్ప.

**సామెర** రూ.చూ. సామెన. వి. మెట్టపైర్లు కోసి పొలంలో వేసిన కుప్పల వరస.

**సామేను** చూ. సాము[2].

**సామేను గళితదాలుపు** చూ. సాము[3].

**సామేనుగళితదాల్పు** చూ. సాము[2].

**సాంపోంకాహునర్** వి. లివాసీ నేతలో పాముల నమూనాలు నేసిన డిజైను.

హిం. సాంప్. సర్పం హునర్. కౌశలం, కళ. సాంపోంకాహునర్. సర్పాల (చిత్రాలతో నేసిన నేత వల్లచూపిన) నైపుణ్యం ;

< హిం సాంపోంకాహునర్.

**సాంబ** రూ.చూ. సంబావు. వి. సాంబార్లు, మంచి సన్నరకం వడ్లు.

**సాంబమ్** రూ.చూ. సంబావు. వి. ఒకరకం సన్నబియ్యం.

**సాంబరు** రూ.చూ. సంబావు. వి. ఒకరకం సన్నబియ్యం.

**సాంబవు** రూ.చూ. సంబావు. వి. ఒకరకం వడ్లు.

**సాంబా** వి. కణితి, సాంబార్ అనే జంతువు.

**సాంబారు** వి. ఒకరకమైన పప్పుచారు.

త. సాంపార్. ఒకరకం పప్పుచారు.

< త. సాంపార్.

**సాంబ్రాణాకు** చూ. సాంబ్రాణి.

**సాంబ్రాణి** రూ. సాబ్రాణి సాబ్రాణీ. వి. 1. సంబరేను చెట్టు వల్ల వచ్చే ధూపద్రవ్య విశేషం. పల్నా.7ప ; 2. సాబ్రాణి దేశంగుర్రం. ఉ.రా. 4.156 ; 3. ఒకానొకదేశం. విణ. సాబ్రాణి దేశంలో పుట్టింది.

ఉ. సమ్‌రాన. తర్కిస్తాన్‌లోని ఒకనగరం, ఇదిగుర్రా లకు ప్రసిద్ధి ;

క. సాంబ్రాణి.

< ఉ. సమ్‌రాన.

**సాంబ్రాణాకు** వి. చెమ్మనేలల్లో ఏటాలేచి పెరిగే ఒక రకం పాకుడు కలుపు మొక్క. లేతనీలిరంగు పూలు పూస్తుంది. (Graliolo monniera, Herpesfis, Monniera) < సాంబ్రాణి+ఆకు. **సాంబ్రాణికడ్డీ** వి. ఊదు బత్తీ. సాంబ్రాణితో ఇతర ద్రవ్యాలను కలిపి సన్నటిపుల్లకు పూసి ఆరిన తరువాత ఉపయోగించే కాడ. **సాంబ్రాణికడ్డీలు** వి.బ.వ. అగరువత్తులు. **సాంబ్రాణివత్తి** వి. ఊదువత్తి. **సాంబ్రాణీలు** వి బ.వ. కిడిడీలు.

**సాంబ్రాణీలు** చూ. సాంబ్రాణి.

**సాబంతి** విణ 1. (భోజనాది) సహపంక్తి ; 2. ఒకేవరస లోనిది.

సం. సహ - కూడా, పంక్తి-. వరస.

< సం. సహపంక్తి-.

**సాబాలు** చూ. సాము[2].

**సామ్యము** వి. సామెత.

సం. సామ్య-. పోలిక, సాదృశ్యం, సమానత్వం, అభేదం, పక్షపాత రాహిత్యం.

< సం. సామ్య-. (అర్థవిపరి.).

**సామ్రాణి** రూ.చూ. సాంబ్రాణి. వి. 1. ఉత్తమాశ్వం. జైమి. నిభా. 7.146 ; 2. సామ్రాణి దేశపుగుర్రం. నవనాథ 185పు ; 3. సుగంధద్రవ్యం. ప్రబంధ. 52.

**సామ్రాణి** రూ.చూ. సాంబ్రాణి వి. ఉత్తమాశ్వం, సామ్రాణి దేశపుగుర్రం. నవనాథ. పు. 185.

**సాయి**[1] వి. ఒకరాగ విశేషం. పండి. చ. 2.455.

సం. సాయ - అంతం, సమాప్తి.

< సం. సాయ - (అర్థవిపరి.).

**సాయగౌళ** వి. ఒకరాగవిశేషం. పండి. చ. 2.454.

**సాయి**[2] వి.బోదె. మడికి నీళ్ళు పెట్టే చిన్న కాలవ.

**సాయంకాల అవసరము** వి. సాయంకాలంలో దేవునికి అర్పించే పూజాపునస్కార వైవేద్యాదికాలు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556.

సం. సాయంకాల - సాయంత్రం, అవసర - సమ యం.

< సం. సాయంకాల-+సం. అవసర-. (అర్థవిపరి.).

**సాయచీల** రూ. కాయిచీల, కాయిశీల. వి. కడిసీల, బండిచక్రం జారిపోకుండా కుండపక్కన ఇసుకలోకి దించిన మేకు.

**సాయబాన** రూ.చూ. సాయిబాన్[2]. వి. వారపాక, వాలుకప్పు గలపాక.

**సాయబు** రూ.చూ. సాహేబు. వి. 1 ప్రభువు. చంద్రాంగ, 2.95 ; 2. మహమ్మదీయుల పేర్ల చివరలో వాడబడేది ; 3. మహమ్మదీయుడు.

**సాయబ్బులు** వి.బ.వ. తురకలు. చేనేతకు పనికి వచ్చే పన్నె అచ్చు మొ.వి. తయారు చేసేవారు.

< సాహేబు+-లు.

**సాయము** వి. 1. సుంకం. పల్నా. 313 ; 2. సహాయం. లోడు. నార. పంచ. 1.56.

సం. సహాయ-. సహాయం ; ప్రా. సహాఅ- తోడ్పాటు; పా. సహాయ - మిత్రుడు.

క. సాయ ; తు. సాయ. తోడ్పాటు, రక్షణ, సాయన. రక్షణ. సాయనె. తోడు.

< ప్రా. సహాఅ-

**సాయంప్రాతలు** వి.బ.వ. ఉభయ సంధ్యలు.

సం. సాయమ్. సాయంకాలం, సాయ- సమాప్తి.

ప్రాతస్. ఉదయం.

<సం. సాయం ప్రాతస్.

సాయర్ రూ. శాయిరు, సాయరు, సాయిరు. వి. సుంకం, బళ్ళు మొ. వాటిమీదపన్ను.

బెం. సాయర్ ; హిం. సాయర్. శిస్తు మినహాయించబడ్డ నేల యొక్క పంట. సముద్రం. పైభాగం, నానావిషయ సముచ్చయం ; మరా, సాయల్ ; ఉ. పార. సా'ఇర్. పన్ను, సొంత ఆస్తిమీద విధించే పన్ను. మొత్తంమిగిలింది నడవటం, తిరగటం ;

త. చాయర్.

<ఉ. సా.ఇర్.

సాయరు రూ.చూ. సాయర్. వి. బళ్ళు మొ. వాటిమీదపన్ను.

సాయరుచావడి వి. విదేశాలనుంచి వచ్చే వస్తువులకు పన్ను వసూలు చేసేతావు.

సాయరేవు చూ. సాయము. రూ. సాయిరేగు. సాయిరేవు. సావిరేవి. వి. ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చెక్కగా ఉండే పెద్దరేవు.

సాయి[1] వి. 1. స్వామి, ప్రభువు ; 2. సాయిబాబా ; 3. షిర్డిసాయిబాబా ; 4. సత్యసాయిబాబా.

సం. స్వామిన్. ప్రభువ ; ప్రా. సామి-; మరా. సాఈ ;

క. సాయి.

<మరా. సాఈ.

సాయిరామ్ వి. సత్యసాయిబాబా నామమంత్రం.

సాయి[2] వి. సిరా.

హిం. ఉ. స్యాహీ. సిరా, ఇంకు;

<ఉ. స్యాహీ.

సాయిజన్న వి. జున్నలో ఒకరకం.

సం. ఛాయా. నీడ.

సాయించు అ.క్రి. హితవగు.

సం. సహ్. ఓర్చు.

<సం. సహ్ + -.ఇంచు[3].

సాయిత్తరుళ్ వి. శరణు వేడటం.

సాయిపిడస వి. వంపులేని పిడస.

సాయిబాన్ రూ. శాయిబాన్, సాయబాన, సాయిమాను. వి. 1. వారపాక, వాలుకప్పుగలపాక, 2. పంచ, ఇంటిముందున్న కప్పువేసిన అరుగు.

సాయిబిళ్ళ వి. చక్రంబండి కుండకు సాయిమేకుకుమధ్యఉన్న సందులో ఇరుసుకు వేసిన ఇనుపబిళ్ళ.

సాయిబు రూ.చూ. సాహేబు. వి. 1. ప్రభువు. 2. మహమ్మదీయుడు.

సాయిమాను రూ.చూ. సాయిబాన్. వి. వారపాక. వాలుకప్పుగల పాక.

సాయిమానుగుజ్జు వి. సిపాయిగుజ్జు, దూలానికి మేల్దూలానికి మధ్య నిలిపిన పొడుగాటి ఒంటిగుజ్జు.

సాయిమేకు రూ. చాయిమేకు, శాయిమేకు. వి. కడిచీల, బండిచక్రం జారిపోకుండా కుండపక్కన ఇరుసులోకి దించినమేకు.

సాయిమొల వి. కడసీల, బండిచక్రం జారిపోకుండా కుండపక్కన ఇరుసులోకి దించిన మేకు.

సాయిరు రూ.చూ.సాయర్. వి. సుంకం, ఒకరకం పన్ను.

సాయిరేగు రూ.చూ. సాయరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

సాయిరేవు రూ.చూ. సాయరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

సాయిల వి. డుబుడక్కలవాడు బుడబుక్కలవాడు.

సాయిలాపాయిలా రూ.చూ. సాయిలాఫాయిలా. వి. తేలిక.

సాయిలాఫాయిలా రూ. సాయిలాపాయిలా. వి. స్నేహం.

హిం. ఉ. సాయల్. ప్రశ్నించేవాడు, ప్రార్థించేవాడు, ఫాయ్‌దా. లాభం.

సాయిలి వి. పునాస పంటవెయ్యటానికి ముందు మూడుసార్లు దున్నిన పొలం.

సాయు అ.క్రి. తొలగు, నశించు. గౌ.హరి. 5.125.

క. సాయ్, సాయు. చనిపోవు, శక్తిపోవు.

సాయెబు రూ.చూ. సాహేబు. వి. ప్రభువు.

సాయేబు రూ.చూ. సాహేబు. వి. ప్రభువు.

సార[1] వి. ఒకరకంచెట్టు (Buchanania angustifolia)

సం. సార-. ముఖ్యం, శ్రేష్ఠం, సత్యం, సర్వోత్తమం.

<సం. సార- (అర్థవిపరి.).

సార[2] వి. తినే గింజల్నిచ్చే ఒకరకం చెట్టు (Buchanania latifolia).

సం. సార-. ముఖ్యం, శ్రేష్ఠం, సత్యం, సర్వోత్తమం, నిగ్గు.

<సం. సార- (అర్థవిపరి.).

సారచెట్టు వి. ఒకరకం అడవిచెట్టు. సారపప్పు వి. సారచెట్టు గింజలనుండి తీసినపప్పు, తినేగింజల్ని కలిగిన ఒకరకం చెట్టు (Buchanania angustifolia).

సార[3] రూ.చూ. చాఱ[1]. వి. తాను, పొరలు పొరలుగా ఉన్న బండరాళ్ళలోని విడివిడి పొరలను గుర్తించటానికి అనువుగా ఉన్నగీత.

సారకంద రూ.చూ. చాఱకంద. వి. చార(మామిడి) కంద.

సారం వి. చౌడు. సున్నంకలిపిననీళ్ళు, రంగు అద్దేముందు దీంట్లో నూలులడీలు వేసి ఉడకబెట్టేనీళ్ళు.

సం. సార-. నిగ్గు, ఆయువుపట్టు.

<సం. సార- (అర్థవిపరి.).

సారంతీయు అ.క్రి. రంగు అద్దేముందు నూలు తడపటానికి చౌడు. సున్నం నీళ్ళలో కలుపు.

సారకట్టు వి. మేడమెట్లవాలును దారం కట్టి గుర్తించి దాని కింద సరిగా కట్టిన రాతికట్టడం.

సం. సార-. ముఖ్యం, శ్రేష్ఠ, సత్యం, సర్వోత్తమం. నిగ్గు.

<సం. సార- + కట్టు (మిశ్రన.).

సారకలకట్టె రూ.చూ. సారికోలకట్టె. వి. సారెను తిప్పే కర్ర.

సారకాలకట్టె రూ.చూ. సారికోలకట్టె. వి. సారెను తిప్పే కర్ర.

సారగము వి. 1. సేవకావృత్తి ; 2. ఎక్కువకృషి.

సం. సారఘ-. తేనె,మధువు.

<సం. సారఘ-.

**సారంగి** వి. పెద్దగడిలో సన్నగళ్ళు పడేట్లు నేసిన చీర.

సం. సారంగీ. ఆడలేడి.

<సం. సారంగీ.

**సారటికె** చూ. సారె[1].

**సారటు** వి. రథం, గుర్రంబండి.

ఇం. *Chariot*. రథం ;

క. సారట్, సారెట్, సారోట్. రథం.

<ఇం. Chariot

**సారణంచేయు** స.క్రి. సరిచేసేటప్పుడు పడుగుకు పెట్టిన గంజి చేతులతో సమంగా రుద్దు.

సం. సారణ-. కదిలేటట్లు చేయటం, ప్రవహించేటట్లు చేయటం.

<సం. సారణ-.+-ము+చేయు.

**సారణము** వి. శ్యేనవిశేషం, డేగ. గా. హరి. 1.533.

సం. సారణ-. ఒకవిధమైన సుగంధద్రవ్యం.

<సం. సారణ-. (అర్థవిపరి.).

**సారబట్టి** రూ.చూ. సారాయిబట్టీ వి. సారాయితయారీకి వాడే మట్టిపాత్రల మొత్తం సెట్టు.

**సారవ[1]** రూ.చూ. సారువ. వి. 1. గోవ, ఎత్తుగా ఉండే గోడలను కట్టటానికి వాటిపక్కన కట్టిన తాత్కాలిక నిర్మాణం ; 2. వంతెన ; 3. చార ; 4. దాలి, మోటలాగే ఎద్దులు ముందుకు వెనక్కి నడిచే ఎటవాలుదారి ; 5. చిక్కు వరస, పడుగు పేకలుగా పేర్చిన ఇటికపేర్పు ; 6. పరంజు.

**సారవ[2]** రూచూ. సారవా[2]. వి. సారవాపంట.

**సారవా[1]** రూ.చూ. సారుప. వి. గోవ, ఎత్తుగా ఉండే గోడలను కట్టటానికి వాటిపక్కన కట్టిన తాత్కాలిక నిర్మాణం.

**సారవాలు** రూ. సారువాలు, సార్వాలు. వి.బ.వ. ఆము పడుగులో కుండలపేర్పుమధ్య కట్టె కంప వేయటానికి వదలిన సందులు.

**సారవా[2]** రూ. సారువ[2]. సారువా, సాళువ[2]. వి. సారావాపంట.

సం. సారవ-. సరయూ సంబంధమైనది, సారవత్. సారవంతమైనది, సారవాన్, సారవచ్ఛబ్దంయొక్క ప్రథమాపుంలింగైకవచనశబ్దం.

<సం. సారవాన్.

**సారవొద్ది** వి. తెల్లటి, అందమైన పూలుపూసే ఒకరకం చెట్టు (Dol chandror e crispa).

**సారసతులు** రూ. సారెసత్తులు. వి.బ.వ. ఒకరకం పిండివంట, జంతికెలు. కాశీ. 7.186.

**సారసము** వి. వినోదం. భార. భీష్మ. 1.142.

సం. సారస్య-. సరసత్వం.

<సం. సారస్య-.

**సారసేతులు** చూ. సారసత్తులు. వి.బ.వ. భక్ష్యవిశేషం. ద. హిం.శా. సంపు. 6.శా. సం. 695. క్రీ.శ. 1519.

**సారా** రూ.చూ. సారాయి. వి. మద్యం.

**సారాకూజా** వి. పీకసన్నంగా ఉండి మట్టులేని కూజా. **సారాగూన** వి. సారాయి బట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్దమట్టిపాత్ర. **సారాజాడి** వి. సారాయి నిల్వచేసుకోవటానికి వాడే జాడీ. **సారాబాన** రూ. సారాయి బాన. వి. సారాయిబట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్ద సైజు మట్టిపాత్ర.

**సారాయము** రూ.చూ. సారాయి. వి. మద్యం. మదిర

**సారాయి** రూ. చారాయి, చాఱాయి, సారా. సారాయము, సాఱాయి. వి. మద్యం. రం.రా. ఉ., సాంబ. 47.

సం. సార-. నిగ్గు, ఆయువుపట్టు, సర్వోత్తమం, ముఖ్యం, సురా. మద్యం ; ప్రా. సార-. రసం. సారాయ్. సారరూపం అగు ; అ.మా. సరఈ ; హిం. ఉ. పార. షరాబ్. మద్యం, ద్రాక్షారసం ;

క. సరాయ, సరాయి, సారాయ, సారాయి ; తు. సారాయి ; త.మ. చారాయయ్ ; తొ. సారొయ్.

<ప్రా. సార-.

**సారాయితత్తెర** రూ. సారాయితిత్తి. వి. సారా ఉంచుకొనేతిత్తి, సురాభస్త్రిక. **సారాయితిత్తి** రూ.చూ. సారాయితత్తెర. వి సారా ఉంచుకొనే తిత్తి. **సారాయిబట్టీ** రూ. సారబట్టి. వి. సారాయి తయారీకి వాడే మట్టిపాత్రల మొత్తం సెట్టు. **సారాయిబాన** రూ.చూ. సారాబాన. వి. సారాయి బట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్ద సైజు మట్టిపాత్ర.

**సారావ** రూ.చూ. సారువ. వి. గోవ, ఎత్తుగా ఉండే గోడలను కట్టటానికి వాటి పక్కన కట్టిన తాత్కాలిక నిర్మాణం.

**సారి[1]** రూ. చారి, సాన[2], సానె, సారె[1]. వి. టగిరి, కుండలు పెంకులు మొ. వి. తయారుచేయటానికి వాడే చక్రం లాంటి సాధనం. కు.సం. 6.147.

సం. సారిన్. నడిచేది.

<సం. సారిన్.

**సారిఅంర్దం** రూ.చూ. సారెరంధ్రం. వి. సారికోల కట్టెపెట్టి సారె తిప్పటానికి అరంగుళం లోతులో సారె మెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. **సారిఅస్తరి** వి. వాటలతయారీకి మట్టిముద్దను వేయటానికి సారెమధ్య నుండే గుండ్రని చెక్క భాగం. **సారికదురు** వి. వాటల్ని కోయటానికి వాడే సన్నని పొడుగాటికమ్మి. **సారికన్నం** వి. సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారె మెత్తుకు ఒకవైపున పెట్టినరంధ్రం. **సారికప్పు** వి. సారె మొల బిగింపుకు సారెపలక కిందభాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణె కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. **సారికర్ర** వి. సారెను తిప్పటానికి కుమ్మరి ఉపయోగించే కర్ర. **సారికలకట్టె** రూ.చూ. సారికోల కట్టె. వి. సారెను తిప్పేకర్ర. **సారికాడలు** వి.బ.వ. సారె చక్రంలోని ఆకులు. **సారికొయ్య** వి. 1. సారెను తిప్పే కర్ర ; 2. సారె తిరగటానికి ఆధారంగా సారె పలక కిందిభాగంలో బిగించిన కొయ్యగుంజ. **సారికోలకట్టె** రూ. సరకలకట్టె, సారకలకట్టె, సారకాలకట్టె, సారికలకట్టె. వి. సారెను తిప్పేకర్ర. **సారికోలకర్ర** వి. సారెను తిప్పే కర్ర. **సారిగునిసి** వి. సారెకట్టె పెట్టిసారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిగుంత** రూ.చూ. సారెగుంట. వి. సారి

కోలకట్టి పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిగూటం** వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కిందభాగంలో బిగించిన కొయ్యగుంజ. **సారిగూన** వి. సారెమీద తయారుచేసిన గూన. **సారిచక్రం** వి. మట్టిపాత్రలు చేయడానికి కుమ్మరి ఉపయోగించే చక్రం. **సారిచెక్క** రూ. సారిసక్క. వి. వాటల తయారీకి మట్టిముద్దను వేయటానికి సారె మధ్య నుండే గుండ్రని చెక్కభాగం. **సారితాడు** వి. సారెకర్ర చక్రానికి చుట్టేతాడు, **సారితూట** వి. సారికోల కట్టెపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. **సారితొలి** రూ.చూ. సారెతొల వి. సారికోల కట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిదండిలు** రూ. సారిదండ్లు. వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. **సారిదండ్లు** రూ.చూ. సారిదండిలు. వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. **సారిదుంక** రూ.చూ. సారిదొంక వి సారెకోలకట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన రంధ్రం. **సారిదొల** రూ.చూ. సారెతొల. వి. సారెకోలకట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారినట్టవ** రూ.చూ. సారినత్తవ. ని. సారెపలకలో మధ్యభాగం. **సారినత్తన** రూ.చూ. సారినత్తవ. వి. సారెపలకలో మధ్యభాగం. **సారినత్తప** రూ. సారినట్లవ, సారినత్తన, సారినెత్తం, సారినెత్తడి. సారినెత్తవ, సారినెత్తడి. వి. సారిపలకలో మధ్యభాగం. **సారినెత్తం** రూ.చూ. సారినత్తవ. వి. సారెపలకలో మధ్యభాగం. **సారినెత్తడి** రూ.చూ. సారినత్తవ, వి. సారెపలకలో మధ్యభాగం. **సారినెత్తవ** రూ.చూ. సారినత్తవ. వి. సారెపలకలో మధ్యభాగం. **సారిపలక చెక్కలు** వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. **సారిపలకలు** వి బ.వ. సారెచక్రంలోని ఆకులు. **సారిపలుక** రూ.చూ. సారెపలక వి. వాటలతయారీకి మట్టి మద్దను వేయటానికి సారిమధ్య నుండే గుండ్రని చెక్కభాగం. **సారిపాక** వి. వాటలతయారీకి మట్టిముద్దను వేయటానికి సారెమధ్య నుండే గుండ్రని చెక్కభాగం. **సారిపెంకు** వి. నాటు పెంకు. మామూలుగా ఇళ్ళు కప్పటానికి వాడే చిన్న పెంకు. **సారిపెట్టి** రూ.చూ. సారెపెట్టు. వి. సారెతయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైనచుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. **సారిపెట్టు** రూ,చూ. సారెపెట్టి. వి. సారెతయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. **సారిపెట్టుమన్ను** వి. సారెచక్రానికి మెత్తటానికి మట్టి, ఇనుక గొర్రెబొచ్చు కలిసిన మన్ను. **సారిపొక్క** రూ.చూ. సారెబొక్క. వి. సారెకోల కట్టెపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. **సారిబట్ట** వి. సారెమీద పాత్రల స్వరూపం తయారవుతున్నప్పుడు నునుపు పట్టటానికి అంచు ఏర్పరచటానికి వాడే తడిబట్ట. **సారిబరిణ** రూ. సారిబరిణి, సారిబరినె. వి. సారెమొల బిగింపుకు సారెపలక కిందిభాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చినభాగం, **సారిబరిణి** రూ.చూ. సారిబరిణ. వి. సారెమొల బిగింపుకు సారెపలక కింది భాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా తీర్చిన భాగం. **సారిబరినె** రూ.చూ. సారిబరిణ. వి. సారెమొల బిగింపుకు సారెపలక కింది భాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. **సారిబల్ల** వి. సారెపలక, సారెలోని ఇరుసులాంటి భాగం, మట్టిముద్దను వేయటానికి సారెమధ్య ఉండే గుండ్రని చెక్క భాగం. **సారిబిల్ల** వి. వాటల తయారీకి మట్టిముద్దను వేయటానికి సారెమధ్యనుండే గుండ్రని చెక్క. **సారిబిళ్ళ** వి. సారెమొల బిగింపుకు సారెపలక కిందిభాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చినభాగం. **సారిబెజ్జం** వి. సారెకట్టె పెట్టి తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిబొడ్డు** వి. సారెమొల దించటానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. **సారిబొత్త** వి. సారెకట్టె పెట్టి సారెను తిప్పటానికి అంగుళంలోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిబొద్ది** వి. సారెకట్టెపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిబొంద** వి. సారెకర్రపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిబొర** రూ.చూ. సారిబొర్ర. వి. సారికోలకట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. **సారిబొర్ర** రూ. సారిబొర. వి. సారికోల కట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. **సారిబోలె** వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర. **సారిమన్ను** రూ.చూ. సారెమన్ను. వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలుకట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. **సారిమళ** రూ.చూ. సారెమొల. వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కిందిభాగంలో బిగించిన ఇనపమేకు. **సారిమెండ్లు** రూ. సారిమెన్లు. వి.బ.వ. సారె చేతులు, సారె చక్రంలోని ఆకులు. **సారిమెత్తడి** రూ. సారినత్తవ. వి. సారెపలకలో మధ్యభాగం. **సారిమెత్తు** రూ.చూ. సారెమెత్తు. వి. సారెతయారీలో చక్రానికి లోపల బద్దలుకట్టి పైన చుట్టూ జానెడు గుండ్రంగా మందంగా మెత్తినమట్టి **సారిమెన్లు** రూ.చూ. సారిమెండ్లు. వి. బ. వ. సారెచేతులు, సారెచక్రంలోని ఆకులు. **సారిమేకు** వి. సారె తిరగటానికి ఆధారంగాసారెపలక కిందిభాగంలో బిగించిన ఇనపసీల. **సారిమొళ** రూ.చూ. సారెమొల. వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కింద భాగంలో బిగించిన ఇనపమేకు. **సారిరెక్కలు** వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. **సారిరౌతు** వి. సారెమొలకు దించటానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం

ఉన్నరాయి. సారివత్తి రూ. సారివొత్తి. వి. సారె రాపిడి లేకుండా తిరగటానికి గుబ్బిరాయి రంధ్రంలో నూనెతో తడిపి పెట్టిన గుడ్డ. సారివొత్తి రూ.చూ. సారివత్తి. వి. సారె రాపిడి లేకుండా తిరగటానికి గుబ్బిరాయి రంధ్రంలో తడిపి పెట్టినగుడ్డ. సారిసెక్క రూ.చూ. సారిచెక్క. వి. వాటల తయారీకి మట్టిముద్దను వేయటానికి సారెమధ్య నుండే గుండ్రని చెక్కభాగం. సారిసెయ్యిలు రూ.చూ. సారె చేతులు. వి.బ.వ సారెచక్రంలో ఆకులు.

సారి[2] రూ. సారె[5]. వి. తూరి, తడవ. పండి. చ. 4.252.

క. సారి, సారె. తూరి, పర్యాయం ; తు. సారి, సార్తి. పర్యాయం. తడవ ; త. చారి. తడవ, సారి, పర్యాయం ; మ. సారి. పర్యాయం, తూరి.

సారి[3] వి. 1. వేట. శుక. 1.158 ; 2. యుద్ధయాత్ర. శశా. 4.86.

సం. శారుక-. కొట్టేవాడు, హింసించేవాడు ; ప్రా. సారుఅ. ప్రహారం.

< ప్రా. సారుఅ.

సారివెడలు స.క్రి. సన్నద్ధమై వెడలు. శుక. 1.247.

సారిక వి. నాట్యవిశేషం.

త. చారికై. నాట్యవిశేషం ;

సం. చర్చరికా. హర్షక్రీడ. నృత్తగీతవాద్యాలు, చప్పట.

సారికంద రూ.చూ. చాఱకంద. వి. ఒకరకం కంద, దురద ఉంటుంది.

ఓ. సారు.

సారికలుగొను(-కొను) అ.క్రి. నర్తించు. భాగ. 3.507.

సారితుంగ చూ. చాఱ[1]. వి. తుంగలో ఒకరకం. (Cyperus species).

సారిందా వి. ఫిడేలు.

ఉ. సారింద. సంగీతవాద్య విశేషం ;

త. చారంతా.

< ఉ. సారింద.

సారియ[1] రూ.చూ. సారె[3]. వి. గోరువంక.

సారియ[2] రూ.చూ. సారె[4]. వి. వీణమెట్టు.

సారు[1] వి. నాట్యగతిభేదం. కు. సం. 12.105.

సం. చర్చరీ. నృత్తగీతవాద్యాలు, హర్షక్రీడ, చప్పట.

సారు[2] రూ.చూ. చారు[1]. వి. ద్రవపదార్థం, మిరియాలు మొ. దినుసులు చేర్చి కాచిన చింతపండు రసం.

సారు[3] వి. 1. ఉపాధ్యాయుడు ; 2. అధికారి.

ఇం. *Sir* అయ్యా, ఒక బిరుదు.

< ఇం. Sir.

సారువ రూ.చూ. సారువు. వి. 1. అడ్డకట్ట. వసు. 1.22 ; 2. దిబ్బ. రాజవా. 3.83 ; వసు. 2.58 ; 3. సోపాన పంక్తి ; 4. పరంజా ; 5. శిఖరంమీద ఉండే మణి ; 6. హారం మధ్యలో ఉండే మణి ; 7. పంతెన ; 8. చార.

సారువా రూ.చూ. సారవా[2]. వి. వర్షాకాలంలో నీటి ఆసరాతో పండే పల్లంపంట.

సారువాలు రూ.చూ. సారవాలు. వి. బ. వ. ఆము పడుగులో కుండలపేర్పు మధ్యకట్టె కంపవేయటాని వదలిన సందులు.

సారువు రూ. సారవ[1], సారవా[1], సారావ, సారువ, సార్వ. వి. ఎక్కటానికి, బరువెక్కించటానికి పొడుగ్గా కట్టలాగా వేయించే ఇనక మొ. వాటిదిబ్బ. భార. ఆది. 7.167.

సం. సారోహ-, సారోప-. ఎక్కటం ; ప్రా. సారోహ-, సారోహి- ;

క. సార, సారవె. తాత్కాలికంగా ఏర్పరచిన నిచ్చెన ; త. చారమ్ ; కో. చర్మ్.

< సం. సారోప-.

సారె[1] రూ.చూ. సారి[1]. వి. టగిరి, కుండలు, పెంకులు మొ.వి తయారుచేయటానికి కుమ్మరులువాడే చక్రంలాంటి సాధనం. భార. ఉద్యో. 4.116 ; 2. భక్ష్య విశేషం. సానంద. 1ఆ.

సారటికె వి. సారెమీద మట్టిపాత్రలు చేసేటప్పుడు చేతికివచ్చిన బురదను వేయటానికి కావలసినప్పుడు మట్టిని తడుపుకోవటానికి సారెపక్కన కుడివైపు పెట్టుకొనే చిన్న నీళ్ళపాత్ర. < సారె[1] + అటికె. సారెకట్టె రూ. సారెగట్టె. వి. సారికోలకట్టె, సారెను తిప్పేకర్ర. సారెకాలు వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. సారెకోల వి. కుమ్మరిసారెను తిప్పటానికి వాడేకర్ర. సారెగట్టె రూ.చూ. సారెకట్టె. వి. సారెనుతిప్పేకర్ర. సారెగండి వి. సారికోల కట్టెపెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్నరంధ్రం. సారెగుంట రూ. సారిగుంత. వి. సారికోల కట్టెపెట్టి సారెను తిప్పటానికి అరంగుళంలోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. సారెగుబ్బ రూ. సారెగుబ్బి, సారెగుబ్బె. వి. సారెమొల బిగింపుకు సారెపలక కిందిభాగంలో ఏర్పరచిన అరంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. సారెగుబ్బి రూ.చూ. సారెగుబ్బ. వి. సారెమొల బిగింపుకు సారెపలక కింది భాగంలో ఏర్పరచిన అరంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. సారెగుబ్బె రూ.చూ. సారెగుబ్బ. వి. సారెమొల బిగింపుకు సారెపలక కిందిభాగంలో ఏర్పరచిన అరంగుళం దళసరితో బరిణి కప్పులాగా గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం. సారెచట్టం వి. సారెపలక, సారెలోని ఇరుసు లాంటి భాగం. సారెచెయ్యిలు రూ.చూ. సారెచేతులు. వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. సారెచేతులు రూ. సారిసెయ్యిలు. సారెచెయ్యిలు, సారెసేతులు. వి.బ.వ. సారి చక్రంలోని ఆకులు. సారెతెడ్డు వి. సారెకట్టె. సారెను. తిప్పేకర్ర. సారెతొట్టి వి. కుండలువానేటప్పుడు సారె పక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర. సారెకొల రూ. సారితొలి, సారిదొల. వి. సారెకోలకట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతుతో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. సారెదిడ్డి వి. సారెకర్రపెట్టి తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం సారెదొంక రూ. సారిదుంక. వి. సారికోలకట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారె

మెత్తుకు ఒకవైపున పెట్టిన రంధ్రం. సారెపలక రూ. సారి పలుక. వి. వాటల తయారీకి మట్టిముద్దను వేయటానికి సారిమధ్యనుండే గుండ్రని చెక్కభాగం, సారెపీట, ఇరుసు లాంటి భాగం. సారెపాము వి. ఒకజాతిపాము, జెర్రి పోతు. సారెపీట వి. సారెపలక, సారెలోని ఇరుసులాంటి భాగం. సారెపెట్టు రూ. సానపెట్టి, సానపెట్టు, సారిపెట్టి సారిపెట్టు. వి. సారె తయారీలో చక్రానికిలోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. సారెపొయ్యి వి. సారెమీద చేసిన పొయ్యి. సారెబొక్క రూ. సారిపొక్క వి. సారికోల కట్టె పెట్టి సారెను తిప్పటానికి అరంగుళం లోతులో సారమెత్తుకు ఒకవైపున పెట్టిన చిన్న రంధ్రం. సారెబొడ్డు వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కిందిభాగంలో బిగించిన ఇనుపమేకు. సారెమన్ను రూ. సారిమన్ను. వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు వెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. సారెముద్ద వి. సారె పలక మీద వేసిన మట్టి ముద్ద. సారెముల్లు రూ. సాన ముల్లు. వి. వాటలు కోయటానికి ఉపయోగించే పొడుగాటి సన్నని కమ్మి. సారెమెత్తు రూ. సానమెత్తు, సారిమెత్తు. వి. సారె తయారీలో చక్రానికి లోపల బద్దలు కట్టి పైన చుట్టూ జానెడు పెడల్పుతో గుండ్రంగా మందంగా మెత్తిన మట్టి. సారెమొల రూ. సానమొల, సారిమళ, సారిమొళ, వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కింది భాగంలో బిగించిన ఇనపమేకు. సారెయిరుసు (-ఇరుసు) వి. సారె తిరగటానికి ఆధారంగా సారెపలక కింద భాగంలో బిగించిన ఇనుపమేకు. సారెయొడ్డు (-ఒడ్డు) స.క్రి. పాచికవేయు. ఉ.హరి. 3.123. సారెరంధ్రం రూ. సారి అంద్రం. వి. సారికోల కట్టె పెట్టి. సారె తిప్పటానికి అరంగుళం లోతులో సారెమెత్తుకు ఒకవైవున పెట్టిన చిన్న రంధ్రం. సారెరెక్కలు వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. సారెరెట్టలు రూ. సారె రెట్టులు, సారెరెట్లు. వి.బ.వ. సారె చక్రంలోని ఆకులు. సారెరెట్టులు రూ.చూ. సారెరెట్టలు. వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. సారెరెట్లు రూ.చూ. సారెరెట్టలు. వి.బ.వ. సారెచక్రంలోని ఆకులు. సారెసట్టం వి. సారె చక్రంలోని ఆకులు సాధారణంగా నాలుగు ఉంటాయి, సుమారు నాలుగు జానల బెత్తెడు పొడుగు ఉంటాయి. సారెసత్తాలు రూ చూ. సారెసత్తులు. వి.బ.వ. **1.** భక్ష్యవిశేషాలు, జంతికలు ; **2.** ఆవిరితో ఉడికించిన పిండి వంట. సారెసత్తులు రూ. సారెసత్తాలు, సారెసెత్తులు. వి.బ.వ. **1.** భక్ష్య విశేషాలు, జంతికలు. ఉ.హరి. 4.157 ; **2.** ఆవిరితో ఉడికించిన పిండివంట. సారెసూది వి. గూనపెంకులు కోయటానికి వాడే సన్ననికమ్మి. సారె సెత్తులు రూ.చూ. సారెసత్తులు. వి.బ.వ. భక్ష్య విశేషాలు, జంతికలు. ప్రభు. 4.150వ. 22పం. సారెసేతులు రూ. చూ, సారెచేతులు. వి.బ.వ. సారెచక్రంలోని అకులు.

సారె[2] వి. జూదానికి ఉపయోగించే పనిముట్టు. సొగటాలకాయ పాచిక, జూదమాడే నిడుపాళ్ళు. భార,సభా 2 194.

సారె[3] రూ. సారియ[1]. వి. శారికా, గోరువంక. శృం.నై. 3.103.

సం. శారి-. శారికా. గోరువంక, రుగడసాలకాయ. వీణమొ. వాటిని వాయించే కొడుపు; ప్రా. సారి, సారిఅ. సారిఇఅ, సారీ ; శౌ. సారిఅ- ; పా. సారిక - ; క. సారకె, సారికె, గోరువంక.

< ప్రా. సారి.

సారె[4] రూ. సారియ[2]. వి. వీణమెట్టు. గౌ.హరి. 9.50.

సారె[5] రూ.చూ. సారె[2]. అవ్య. మాటిమాటికి. పారి. 3.47.

సారెకు అవ్య. ద్రు. మాటిమాటికి. విక్ర. 7.115.

సారెసారెకు చూ. సారి[2]. అవ్య. ద్రు. మాటిమాటికి.

సారె[6] వి. పగడసాల.

సారె[7] వి. కూతిర్ని అత్తవారింటికి పంపించినప్పుడు పుట్టింటి వారిచ్చే అరణం మొ.వి.

సారెచీర వి. పెళ్ళికూతురుకు అత్తవారు సారెపెట్టేచీర. సారొల్లె వి. పిల్లను అత్తవారింటికి పంపేటప్పుడు పుట్టింటి వారు పెట్టే చిన్నచీర. < సారె[7] + వల్లె.

సారె[8] వి, గర్భాదానం.

సారొల్లె చూ. సారె[7].

సార్క రూ.చూ. చారిక. వి. గీత, అంచుదగువగా. కంఠం కింద ఉబ్బు, పైనగోటితోగాని రేకుతోగాని అలంకారంగా వేసేగీత.

సార్జంతు రూ. సార్జెంతువు. వి. **1**. సేనాధికార్లలో ఒకడు. రంగా. చ. 1.147 ; **2**. జాతిబంట్రోతు. బొబ్బిలి. 3.106 ; **3**. భటుల మీది అధికారి.

ఇం. Sergeant. సేనలోని హవల్దారు, మెజిస్ట్రేటు ; పో. సార్జెంతు ; స్పా. సార్జెంతో ; ఫ్రెం. సర్ జో(

< పో. సార్జెంతు.

సార్జెంటు వి. **1**. సేనాధికార్లలో ఒకడు ; **2**. భటులమీది అధికారి ; **3**. జాతిబంట్రోతు,

ఇం. *Sergeant*. సేనలోని హవల్దారు, ఒకపోలీసు ఉద్యోగి.

< ఇం. Sergeant.

సార్జెంతువు రూ.చూ. సార్జంతు. వి. భటుల మీది ఉద్యోగి.

సార్లా వి. **1**. కార్యసిద్ది ; **2**. అనుకూలత.

సం. సఫల -. ఫలంతో కూడినది, నెరవేరినది.

సార్లాఅగు న.క్రి. నఫలమగు. సార్లాచేయు అ.క్రి. పరిష్కారం చేయు, సిద్ధంచేయు. సార్లాపడు న.క్రి. అను కూలపడు, సఫలమగు. సార్లపరచు అ.క్రి. అనుకూలపర్చు, తీర్చు.

సార్లె వి. వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

< సారె[1] + -.లు.

సార్వ రూ.చూ. సారువ. వి. గోవ, ఎత్తుగా ఉండే గోడలను కట్టటానికి వాటిపక్కన కట్టిన తాత్కాలికపు నిర్మాణం.

సార్వన్లు వి.బ.వ. ఒంటెలను నడిపేవారు.

ఉ. సార్-వాన్.

< ఉ. సార్-వాన్ + -లు.

సార్వాలు రూ.చూ. సారవాలు. వి.బ.వ. ఆముపడుగులో కుండలపేర్పు మధ్య కట్టె కంపవేయటానికి వదిలిన

సందులు.

**సాఠాయి** రూ.చూ. సారాయి. వి. మద్యం.

**సాల్** రూ.చూ. సాలు². వి. ఒకసంవత్సరం.

**సాల** వి. **1**. ఇల్లు. కు. సం. 2.17 ; **2**. వంటసాల. పరమ. 5 ; **3**. నాటకశాల ; **4**. గుర్రంసాల ; **5**. చావడి. మొగసాల ; **6**. కొలువుసాల ; **7**. జొన్నసాల ; **8**. కొట్టం ; **9**. పూరిల్లు ; **10**. పరంజా.

సం. శాలా. ఇల్లు, చావడి, గుర్రం, గోవు మొ. వాటికేర్పరచిన చావడి ; ప్రా. సాల-, సాలా. గృహం, భిత్తిరహితగృహం ; అమా. సాలా. కొలువుకూటం ; పా. సాలా ;

క. సాలె. పాఠశాల, అంగడి, కర్మాగారం ; తు. సాలె. శాల ; త. అర్రై ; మ. అల. చాల, చాళ. శాల, గోశాల ; కువి. హాల. పాక, కొట్టం ; పర్జి. వేల. కొట్టం.

<ప్రా. సాలా.

**సాలదిండు** వి. రెండుబద్దె (పలుగు) లగుంటక, పైరులో కలుపుతీసే పరికరం. **సాలదేవర** వి. వానలు కురవకపోతే ఊరివారంతా వనభోజనం వెళ్ళి ఆరాధించే దేవత. **సాలపాయ్యి** వి. వెనకవైపు పొడుగ్గా తీనె నిర్మించి ముందు పక్కల కట్టెలు పెట్టటానికి వీలుగా రెండుద్వారాలు నిర్మించిన పొయ్యి. **సాలబత్తులు** వి.బ.వ. ఒకరకంవడ్లు.

**సాలాటం** వి. ఉలుప, గృహప్రవేశ సమయంలో ఇచ్చేబలి.

**సాలంకలు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**సాలంపురి** వి. ఒకరకంవడ్లు.

**సాలశ్రీ** వి. అశ్వవైద్యుడు.

సం. శాలా. చావడి, సాల.

**సాలాటం** చూ. సాల.

**సాలానా** వి. వార్షికం, సంవత్సరానికి సంబంధించివచ్చే ఆదాయం.

హిం. ఉ. సాలానా. సంవత్సరసంబంధి.

<ఉ. సాలానా.

**సాలాన్‌చేయు** స.క్రి. సిద్ధంచేయు, అనుకూలపరచు.

హిం. సార్‌నా. పూర్తిచేయు, ముగించు, నిర్మించు, బాగుచేయు, రక్షించు, కళ్ళకు కాటుక దిద్దుకొను, అలంకరించు కొను.

<హిం. సార్‌నా + చేయు.

**సాలాబాదు** వి. **1** పన్ను కట్టుకొని అనుభవించే భూమి. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759. క్రీ.శ. 1668 ; **2**. వార్షికం.

హిం. ఉ. పార. సాలాబాద్.

**సాలాభోగము** వి. బ్రాహ్మణ సత్రానికై ఇచ్చినభాగం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 200.

సం. శాలాభోగ-. శాలకై ఇచ్చినభోగం.

<సం. శాలాభోగ-.

**సాలామిశ్రీ** వి. ఒకరకం మందుచెట్టు, ఒకరకం మందు దినుసు.

**సాలారిఅంచు** వి. ఒకరకం సన్నఅంచు.

హిం. ఉ. సాలార్. నాయకుడు.

**సాలారిచీర** వి. నేతలో నిలువున పదిపన్నెండు కొలుకుల గీరలు పడేట్టు నేసిన చీర.

**సాలారు** వి. సంవత్సరాంతం.

హిం. ఉ. పార. సాల్. సంవత్సరం.

**సాలి**[1] వి. పచ్చటి బెరడు కలిగి, నీలగిరి, అన్నామలై, కోయంబత్తూర్ కొండల్లో పెరిగే ఒకరకం చెట్టు. దీన్నుంచిపచ్చటి రంగు తయారు చేస్తారు.

**సాలి**[2] రూ.చూ. సాలియ. వి. సాలె, నేతనేసేవాడు.

**సాలింఇనాం** రూ. సాలెం ఇనాం. వి. పూర్తిగా శిస్తు రద్దుచేసి దేవధర్మస్థానాలకిచ్చినభూమి.

హిం. ఉ. సాలిమ్. పూర్తిగా, ఇనామ్. బహుమతి.

<ఉ. సాలిమ్ఇనామ్.

**సాలికట్టునేత** చూ. సాలు.³

**సాలికంప** వి. పచ్చటి పూలు పూసే భూమిలోపల పెరిగే ఒకరకం పొద (Stylosanthes mucronata).

**సాలిహూకుడు** వి. కృష్ణా, కర్నూలు, కర్ణాటక, కడప, చెంగల్పట్టు ప్రాంతాల్లో పెరిగే ఒకరకం చెట్టు (Allophylus cobbe).

**సాలిగ** వి. తవ్వలోసగం.

**సాలిడుపు** చూ. సాలు³.

**సాలిపెద్దీలు** చూ. సాలు³. వి.బ.వ. రెండుమూడేళ్ళ కొకసారి సేనాపతులదగ్గర అడుక్కునేవాళ్ళు.

**సాలియ** రూ. సాలి², సాలె. వి. సాలె, నేతనేసేవాడు. వేంక. పంచ. 1.61.

సం. శాలిక-. శాలసంబంధి, శాలా, శాలికా. ఇల్లు, దుకాణం, కార్యస్థానం ; ప్రా. సాలియ-. తంతువాయుడు ; అ.మా. సాలియ- ;

క. సాలిగ, సాలియ, సాలె. నేతగాడు ; త.మ. చాలియన్ ; కువి. సాలిఎసి.

<ప్రా. సాలియ-.

**సాలియానా** రూ.చూ. సాలీనా. వి. ప్రతిసంవత్సరం.

**సాలీఁడు** వి. **1**. సాలెపురుగు. శివత. సా. 172పం. ; **2**. సాలెవాడు. నార. పంచ. 1.164.

క. సాలియ, సాలిగ. సాలెవాడు ; త. చాలియన్. సాలె వారు ; మ. చాలియన్. సాలెవాడు.

**సాలీనా** రూ. సాలియానా, సాలీయానా, సాలునా. వి. ప్రతి సంవత్సరం ; క్రి. విశే. ప్రతిసంవత్సరానికి.

హిం. ఉ. పార. సాలియాన, సాలీన ;

త. చాలియానా.

<ఉ. నాలీన.

**సాలీనుపోగు** వి. దుర్బలం, బలహీనం. వేంక. ఆం. 40.

**సాలీయానా** రూ.చూ. సాలీనా. విశే. సంవత్సరంది.

**సాలు**[1] రూ.చూ. శాలూ. వి. **1**. సన్నని వస్త్రం. శకా. 4.119 ; **2**. సాలువ, ఉన్నితో తయారైన వస్త్రోత్తరీయం. నీలా. 1.109 ; **3**. రాంకవం. భాను. 4,62,

**సాలు**[2] రూ. సాల్. వి. సంవత్సరం. ద. హిం. శా. సంపు.

10. గా. సం. 755. క్రీ.శ. 1604.

హిం. మరా. ఉ. పార. సాల్. సంవత్సరం.

త. సాల్.

<ఉ. సాల్.

సాలుబస్సాలు క్రి. విశ. ప్రతిసంవత్సరం వచ్చే.

సాలుసరి విశ. ఏడాదికి సంబంధించిన.

సాలు[3] రూ.చూ. చాలు[2]. వి. 1. పొడవు, అంగసౌష్టవం కలిగి ఉండటం ; 2. వంశక్రమం, చాలు.

క. సాలు. పంక్తి.

సాలికట్టునేత రూ. సాలుకట్టునేత. వి. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిన నేత. సాలిదుపు రూ.చూ. సాలువిదుపు. వి. మొక్కజొన్న తెగులు. దొలుపుడుపురుగు పడి ఈతకువచ్చే సమయాని కల్లా మొక్క ఎండిపోతుంది. సాలుకట్టు వి. ఆములో కుండల్ని కాల్చటానికి తాళ్ళు విడిచి వరసలుగా పేర్చటం. సాలుకట్టునేత రూ.చూ. సాలికట్టునేత. వి. పేక పోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిననేత సాలుజన్న వి. తెల్లజొన్నల్లో ఒకరకం. సాలుమలేయు స.క్రి. నరిచేసేటప్పుడు తడుగు తిరగేయు. సాలుమూల వి. 1. వరుస ; 2. క్రమం. సాలువిదుపు రూ. సాలిదుపు. వి. మొక్కజొన్న తెగులు, దొలుపుడు పురుగుపడి ఈతకువచ్చే సమయాని కల్లా మొక్క ఎండిపోతుంది. సాల్వు(డు అ.క్రి. 1. నిస్సార మగు. భార. ఆది. 2.89 ; 2. చీలి బారులుకట్టు. భార. ఆది. 2.91 ; 3. ఒరగు. భార. అరణ్య. 3.294 ; 4. ధారగా ప్రవహించు. కావ్యా. చూ. 5.86 ; 5. సాగు. <సాలు[1] + పడు. సాల్వుఱుచు స.క్రి. సాల్వడేట్లుచేయు. విక్ర. 680.

సాలుచేయు స.క్రి. బందుచేయు. ఆపు.

<చాలు[1] + చేయు.

సాలునా రూ.చూ. సాలీనా. వి. ప్రతిసంవత్సరం.

సాలుపు చూ. చాలు[2]. రూ. సాల్పు. వి. కొండ, ఏరు మొ. వాటిపక్కన అనుకొని పొడవుగా సాగిపోయే ప్రదేశం.

సాలువ రూ. శాల్, శాలవ, శాలు, శాలువ శాలుపు, శాలూ, శాల్వ సాలువు, సాల్వు సేలు[1], సేలువ, సేలువి, వి. 1. భుజాల మీద ఉత్తరీయంలా వేసుకొనే వస్త్రవిశేషం. చిత్రభా. 8.125 ; 2. సన్నవస్త్రం. శుక. 2.426 ; 3. తృణభేదం. ప్రబంధ. 1.201.

హిం. శాల్. ఒకరకంపట్టుబట్ట, ఉన్నిబట్ట, ఉ.షాల్. ఉన్ని లేదా పట్టుతో నేసిన దుప్పటి, టిబెట్ జాతి గొర్రె ఉన్నితో తయారుచేసిన కప్పుకునే మేలురకం వస్త్రవిశేషం, దర్వేషులు కప్పుకొనే కంబళి, తెల్లని ఉన్నితోనేసిన కంబళి : మరా. శాలూ. ఉత్తమమైన పట్టువస్త్రం ;

క.శాలువె ; త. చాల్వై. సాలువ.

<ఉ. షాల్.

సాలువము రూ.చూ. సాళువము. వి. ఒకరకండేగ.

సాలువు రూ.చూ. సాలువ. వి. సాలువ. శశా. 4.119.

సాలె[1] రూ.చూ. సాలియ. వి. 1. బట్టలునేసి జీవించేజాతి. ఆము. 4.35 ; 2. సాలీడు, పట్టుపురుగు. వేంక. అం. 97.

సాలెగూ(డు వి. సాలెపట్టు. సాలెత వి. తంతువాయస్త్రీ. సాలెజాతి ఆడది. పల్నా. 26పు. సాలెపట్టు వి. 1. సాలె పురుగు నేసిన నేత ; 2. ఆగాబంధం. సాలెపద్దు వి. నమ్మ రానిది. రాధికా. 4.79. సాలెపురుగు వి. బొడ్డులో నూలు విడిచి నేతనేసే ఒకపురుగు, తంతువాయం. సాలెబత్తులు వి.బ.వ. చేనేత పనిచేసేవాళ్ళలో ఒకతెగ, సాలీలు. సాలె వా(డు విశ. నేతనేసేవాడు. సాలెవానిసనిముట్లు వి.బ.వ. మగ్గంపనిముట్లు. సాల్నాడి రూ.చూ. సాల్నాడె. వి. అంచు నేతకు ప్రత్యేకంగా వాడే కొమ్మునాడె. సాల్నాడె రూ, సాల్నాడె. రూ. అంచునేతకు ప్రత్యేకముగావాడే కొమ్ము నాడె.

సాలె[2] వి. తెల్లటిపూలుపూసే చిన్నచెట్టు. దీని కలపను ఇంధ నంగా ఉపయోగిస్తారు. (Acacia Planifuns).

సం. సాల- మద్దిచెట్టు. చెట్టు.

<సం. సాల-.

సాలెపట్టు వి. కర్రలు చిన్నచిన్న దడివల్లలుగా పనికి వచ్చే ఒకరకం చిన్నచెట్టు.

సాలె[3] వి. చదువులబడి (కన్నడసంప్రదాయం), సాళె.

క. సాలె. పాఠశాల, బడి ;

సం. శాలా. గృహం, చావడి ; ప్రా. సాల-.

<క. సాలె.

సాలెం వి. కంపగా పెరిగే ఎడారిమొక్క (Acacia planiformis)

సాలెంఇనాం రూ.చూ. సాలింఇనాం. వి. పూర్తిగా శిస్తు రద్దుచేసి దేవధర్మస్థానాలకిచ్చిన ఇనాం.

సాలెమంత వి. తెల్లటిపళ్ళుకాసే ఒకరకం పొద (Fluggea lucopyrus).

సాలెహోలు వి. ప్రస్తుత సంవత్సరం.

ఉ. పార. సాలిహాల్. ప్రస్తుత సంవత్సరం.

త. సాలేహాల్.

<ఉ. సాలిహాల్.

సాలేశ్వరము వి. చత్వారం, నలభైఏళ్ళకు కలిగే కంటిచూపు మసక.

హిం.ఉ. సాల్. సంవత్సరం ; సం. ఈశ్వర-. ప్రభువు.

సాలోకులు వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. సాలోక్య-. చతుర్విధముక్తులలో ఒకటి, ఇష్టదేవత ఉన్న లోకం పొందటం.

సాల్చు చూ. చాలు[1]. స.క్రి. పూర్తిచేయు.

సాల్నాడి చూ. సాలె[1].

సాల్నాడె చూ. సాలె[1].

సాల్పు రూ.చూ. సాలుపు. వి. కొండ, ఏరు మొ. వాటిపక్కన అనుకొని పొడవుగా సాగిపోయే ప్రదేశం.

సాల్లు రూ.చూ. సాళ్ళు వి.బ.వ. ఆముపడుగులో కుండలపేర్పు మధ్యకట్టే కంపవేయటానికి వదలిన సందులు.

సాల్వడు చూ. సాలు[3].

సాల్వుఱుచు చూ. సాలు[3].

సాల్వు రూ.చూ. సాలువ. వి. సన్ననివస్త్రం, కప్పుకునేఉన్ని

వస్త్రం. దశా. 8.166.
**సాల్‌సజస్తా** వి. గడచిని సంవత్సరం.
ఉ. పార. సాల్-గుజష్త. జరిగిన ఏడు.
< ఉ. సాల్-గుజష్త.
**సాళగింపు** వి. కలగలుపుదనం, మేళనం. పాండు. 3.43.
నం. సాళగ- తిలతండులన్యాయమైన రాగాల మేళం.
**సాళ(గనాట** వి. ఒకరాగవిశేషం. పండి. చ. 2.455.
నం. సాళగ-. తిలతండుల న్యాయమయి రాగమేళనం.
< నం. సాళగ- + నాట.
**సాళవగించు** అ.క్రి. మిళితమగు, నక్తమగు. శృం.నై. 7.146.
నం. సాళవ-, తిలతండుల న్యాయమైన రాగాల మేళనం.
< నం. హళవ- + -ఇంచు$^{3}$.
**సాళి**[1] వి. రాగాల్లో ఒకటి, స్వరస్థాయిభేదం. బనవ. 71.వ 8పం.
**సాళి**[2] చూ. సాలె. వి. అర్ధసాళులు. భార. విరా. 1.72.
**సాళించు** న.క్రి. బలిఇచ్చు. సిం.ద్వా. 11.30.
< చాలు$^{1}$ + -ఇంచు$^{3}$.
**సాళియలు** చూ. సాలియ. వి.బ.వ. వస్త్రవిశేషాలు, అంగదట్టాలు, మీదవేసుకునే పైటలు. వాల్మీ. 3.112.
**సాళులు** వి.బ.వ. నిందలు. కు. నం. 7.27.
**సాళులుపెట్టు** అ.క్రి. జతపర్చు, ఆవరనలో చేర్చు. కు. నం 6.27.
< చాలు$^{2}$ + -లు + పెట్టు.
**సాళువ**[1] రూ.చూ. సాళువము. వి. ఒకజాతిడేగ.
**సాళువ**[2] రూ.చూ. సారవా$^{2}$, సారువా. వి. 1. వర్షాకాలంలో సీరు ఆధారంగా పండే పల్లపుపంట. నె.శా. ఒంగోలు. 12 ; 2. ఒకరకంగడ్డి.
**సాళువము** రూ. సాలువము, సాళువ$^{1}$, సాళ్వము. వి. 1. ఒక జాతిడేగ, శ్యేన విశేషం. జైమినిభా. 1.45 ; 2. పందెం కోడిపుంజు కియబడ్డ పేరు. హంస. 3.215 ; 3. వేటకుక్కకు పెట్టిన పేరు. రామే. 5.78.
నం. శాలివ -, జాలివ -. ప్రా. సాలివ-.
క. సాళువ, సాళ్వ. ఒకరకం పక్షి.
**సాళెము** వి. పాట. పండి.చ. 5.435.
**సాళెముల్‌సూవు** (-చూపు) అ.క్రి. రాగభంగుల్ని చూపించు. పండి.చ. 2.305.
**సాళ్లు** చూ. చాలు రూ. సాల్లు. వి.బ.వ. ఆముపదుగులో కుండల పేర్పుమధ్య కట్టెకంప వేయటానికి వదలిన సందులు.
**సాళ్లుకట్టు** రూ. సాలుకట్టు. వి. ఆములో కుండల్ని కాల్చటానికి తాళ్ళు విడిచి పరసగా పేర్చటం.
**సాళ్లె** చూ. సాలె$^{3}$. వి.బడి, పల్లెకూటం,సాలె.
**సాళ్వ(డు** చూ. సాళ్వము.
**సాళ్వము** రూ.చూ. సాళువము. వి. 1. ఒకజాతి డేగ. అష్టమ. క. 5.221పు. 28పం ; 2. తృణవిశేషం. హంస. 5.45.
**సాళ్వ(డు** వి. కుక్క.
**సావ** వి. మట్టికంచం. ఆం.భా. 2.248.
నం. శరావ -. మూకుడు ; ప్రా. సరావ -. సావ -. మృణ్మయ పాత్ర విశేషం ; అ,మా. పా. సరావ. మట్టి కంచం ;
మ. చరావం. పాత్ర ; కుఇ. సారె. పెద్దమట్టి కుండ.
< ప్రా. సావ-.
**సావడ** రూ.చూ. సావడము. వి. పాములా పొడుగ్గా పలచగా ఉండే చేప.
**సావడచేప** వి. ఒకరకం చేప.
**సావడము** రూ. సావడ, సావిడాయి. వి. పాములా పొడుగ్గా వల్చగా ఉండే చేప, ములుగు.
**సావడా** రూ.చూ. చావడి. వి. పాక, మూడు పైపులా మూసిన దూలాలు లేని పొడుగాటి ఇల్లు.
**సావడి** రూ.చూ. చావడి. వి. 1. పరిపాలనా భూభాగం. ద.హిం.శా. సంపు. 10.శా.నం. 586. క్రీ.శ. 1448 ; 2. చావడి.
**సావడు** రూ.చూ. సాపడు. న.క్రి. తిను, భుజించు.
**సావరిన్** రూ. సవర$^{4}$, సవరను. వి. సవరన, బంగారుకాసు.
ఇం. *Sovereign*. రాణి, చక్రవర్తి, బంగారుకాసు.
< ఇం. Sovereign.
**సావలి** రూ.చూ. సావిలి. వి. డుబుడుక్కవాడు.
**సావలికా(డు** వి. డుబుడుక్కవాడు. సావలీ(డు వి. డుబుడక్కవాడు.
**సావలీ(డు** చూ. సావలి.
**సావా** వి. నూలు పోగుల లెక్క.
**సావా(ను** రూ.చూ. సామాను. వి. క్షౌరముట్టు, పనులు చేయటానికి వాడే పరికరం (పరికరాలు).
**సావాలు** వి.బ.వ. సమాంశం.
నం. సమ -. తుల్యం, సమానం.
**సావాసము** వి. కలసి ఉండటం, స్నేహం., పొత్తు.
నం. సహవాస -. కూడా నివసించటం ;
త. చాకవాచమ్.
< నం. సహవాస-.
**సావాసి** వి. 1. సౌవిదల్లుడు, అంతఃపురం కావలివాడు. రం. రా.యు. 290పు. 6పం. ; 2. చెలికాడు.
నం. సహవాస -. కూడ నివసించటం, చెలికత్తె, సహవాసిన్. కూడా కలసి ఉండేవాడు ; ప్రా. సహవాస -. కలసి ఉండటల.
క. సావాస, సావాసి. కంచుకి, అంతఃపురం కావలివాడు. నౌకరు ; తు. సావాస ;
త. చావాచమ్.
< నం. సహవాసిన్.
**సావి**[1] రూ. సవి$^{1}$. వి. 1. భ్రాంతి, భ్రమ. కు.నం. 1.3 ; 2. కాలం. కాశీ. 7;40 ; 3. సారం. ఘటికా. 2.87 ; అవ్య. 1. అని (అని భ్రాంతిపడి). కు నం. 1.95 ; 2. తీరా పండకముసుపే ఎండిపోయినపైరు. కళా. 4.78 ; విజ. మనోజ్ఞం. ద్వి. పరమ. వి. 3 225.
త. చవలై. (తల్లిపాలు తాగని) బాలుడి బలహీనత, అపరిపక్వత, చావి, ఎండిపోయిన పైరు ; మ. చవల,

ఖాళీగింజ ; కుఱ. సడు. ఉట్టిపొల్లు. ఊక.

**సావి**² రూ.చూ. చావు. వి. మృత్యువు.

**సావిడాయి** రూ.చూ. సావడము, వి. పాములా పొడుగ్గా పలచగా ఉండే తెల్లని చేప.

**సావిడి** రూ.చూ. చావడి. వి. కొట్టం పశువుల నివాసం కోసం ఏర్పరచిన ఇల్లు.

**సావిరేవి** రూ.చూ. సాయరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

**సావిర్తి** వి. సావిత్రి.

సం. సావిత్రి. సూర్యకిరణం, ఒకమంత్రం.

<నం. సావిత్రీ.

**సావిలి** రూ. సావలి. వి. బుడబుక్కలవాడు. ప్రబంధ. 1.121.

**సావు** రూ.చూ. చావు. వి. 1. మృత్యువు ; 2. తుది.

**సావుకార్** రూ.చూ. సాహుకారు. వి. 1. వ్యాపారి ; 2. యజమాని.

**సావుకారి** రూ.చూ. సాహుకారు. వి. 1. ఆసామి, పెద్దరైతు, ఎక్కువ పొలం ఉన్నరైతు ; 2. పొలం సొంతదారు ; 3. వ్యాపారి.

**సావుకారు** రూ.చూ. సాహుకారు. వి. 1. వ్యాపారి ; 2. యజమాని, ఇంటిసొంతదారు.

**సావోటి** వి. పెచ్చు.

**సాశే** వి. గుండ్రంగా 12అంగుళాల వ్యాసంతో అరడుగు లోతులో అంచు సన్నంగా అడుగున భోడిగా ఉండే మట్టిపాత్ర.

**సాసనము** వి. శాసనం.

సం. శాసన -. శిక్షించటం, బోధించటం, పరిపాలన. ప్రా. సాసణ-.

<ప్రా. సాసణ-.

**సాసనికుడు** వి. ప్రభువు, శాసనం చేసేవాడు ద.హిం.శా. సంపు. 5.శా.సం. 1061. క్రీ.శ. 1133.

సం. శాసనక -. శాసనం చేసేవాడు.

<సం. శాసనక-.

**సాసముఖా** అవ్య. చాంగుబళాలాంటి పదం. తాళ్ల.సం. 7.237.

క. సాస. ధైర్యం.

**సాసవలు** రూ.చూ సాసువులు. వి.బ.వ. ఆవాలు.

**సాసించు** అ.క్రి. సాహసించు. తాళ్ల సం. 11.159.

సం. సాహస -. ఔద్ధత్యం, తెగింపు.

<సం. సాహస-+-ఇంచు³.

**సాసిర్బరు** వి. వేయి. ద.హిం.శా. సంపు.7. శా.సం. 734. క్రీ.శ. 1228.

సం. సహస్ర -. వేయి ;

క. సాసిర.

**సాసుపులు** రూ. సాసవలు, సాసూలు. వి.బ.వ. ఆవాలు. హంస. 2అ.

సం. సర్షప-. ఆవాలు ; అవ. ప్రా. సరిసవ-, సరిస్సవ- ; అ.మా. సరసవ-, సరిసవ-, సాసవ-; పా. సాసవ- ; ఒ.బెం. సారిసొ.

క. సాసవె, సాసివె ; తు. సాసెము ; త. ఐయవి.

<ప్రా. సరిసవ-.

**సాసూలు** రూ.చూ. సాసువలు. వి.బ.వ. ఆవాలు.

**సాహరి** వి. అహమిక, ఓహరి.

**సాహి** రూ.చూ. సాహిణి. వి. అశ్వారోహకుడు. బసవ. 2.40.

**సాహిణము** వి. 1. గజశాల. వరాహ. 3.65 ; 2. గుర్రంసాల. మను. 141 ; 3. గుర్రం. నిరంకు. 3.36 ; 4. సేన.

సం. సాధన-. సేన, యుద్ధం, సాదని. సేన ; ప్రా. సాహణీ, సాహణ-. సేన, చతురంగబలం.

<ప్రా. సాహణ-.

**సాహిణి** రూ. సాని², సాహిణీ. వి. 1. గుర్రంశాల మీద అధికారి. ద.హిం. శా. సంపు. 4. శా. సం. 121. క్రీ.శ. 1123 ; 2. గుర్రం వాడు. సారంగ. 1.81 ; 3. గుర్రం రౌతు. సాది. ఉ. హరిశ్చ. 2.56.

సం. సాధన-. సేన. యుద్ధం, సాధనిన్. సేనాపతి ; ప్రా. సాహణీ. సేన, సాహణిఅ. సేనాపతి, సాహణ-. సేన ; అప. సాహి. స్వామి, ప్రభువు.

<పా. సాహణీ.

**సాహిణీ** రూ.చూ. సాహిణి. వి. రౌతు, గుర్రంరౌతు. ఆము. 3.22.

**సాహిత్యమిచ్చు** చూ. సాహిత్యము.

**సాహిత్యము** వి. 1. పల్లెల్లో సంసార్ల ఇళ్ళకు బ్రాహ్మణ అతిథులు వచ్చినప్పుడు వారిభోజనం కోసం కావలసిన వంట సామగ్రిని ఒక బ్రాహ్మణుని ఇంటికి పంపటం (దీనితో వంటచేసి అతిథిసత్కారం చేస్తారు) ; 2. సరిపోయేది.

సం. సాహిత్య-. మైత్రి, కావ్యవాఙ్మయం.

<సం. సాహిత్య- (అర్థవిపరి.).

**సాహిత్యమిచ్చు** అ.క్రి. స్వయంపాకమిచ్చు. <సాహిత్యము+ఇచ్చు.

**సాహిబు** రూ.చూ. సాహేబు. వి. యజమానుడు, ప్రభువు ద.హిం.శా. సంపు. 10.శా.సం. 759. క్రీ.శ. 1663.

**సాహిబుకారి** వి. మహమ్మదీయుల మతగ్రంథం పేరు.

ఉ. అర. సాహిబ్-. కురాన్. ఒకపుస్తకంపేరు.

<ఉ. సాహిబ్-. కురాన్.

**సాహు** రూ.చూ. శాహ. వి. 1. వడ్డీవ్యాపారం చేసేవాడు. పాండు. 3.16 ; 2. వర్తకుడు.

**సాహుకారి** రూ.చూ సాహుకారు. వి. వడ్డీ వ్యాపారం చేసేవాడు.

**సాహుకారు** రూ. సావుకారు, సవుకార్, సవుకారు, సావుకార్, సావుకారి, సావుకారు, సాహుకారి, సౌకార్, సౌకారు. వి. వ్యాపారి.

హిం. సాహుకార్. పెద్దవ్యాపారి, కోటీదారు ; మరా. సావకార. ధనవంతుడు, డబ్బును అప్పుగా ఇచ్చేవాడు ; ఉ. సాహుకార్ ;

త. సాహుకార్.

<హిం. సాహుకార్.

**సాహూ** రూ.చూ. సాహెూ. అవ్య. (ఆశ్చర్యార్థకం) ఎచ్చరిక పదం, రాజునుగాని, దేవుణ్ణిగాని చూడటానికి వెళ్ళినప్పుడు

వేత్రహస్తులు చేసే విన్నపం లేదా ఎచ్చరిక. అని. 4.4.

సాహెబ్ రూ.చూ. సాహేబు. వి. 1. మహమ్మదీయుల పేర్ల చివరలో వాడబడేది ; 2. మహమ్మదీయుడు.

సాహెబు రూ.చూ. సాహేబు. వి. ప్రభువు, సామంతరాజు. రంగా. చ. 1.138.

సాహేబు రూ. సహాయబు. సాయబు, సాయిబు, సాయెబు సాయేబు, సాహిబు. సాహెబ్, సాహెబు. సాహేబూ. వి. 1. ప్రభువు రాజవా. 5.35 ; 2. మగడు, భర్త. ప్రబంధ. 1.162.

హిం. సాహబ్ సాహిబ్, స్వామి, మిత్రుడు, గౌరవ సూచకశబ్దం, యజమాని; మరా. సాహెబ్. అధికారి యజమానుడు, ప్రభువు ; ఉ. సాహిబ్. స్వామి, ఆదర సూచకశబ్దం, పరమేశ్వరుడు, మిత్రుడు ; అర. సాహిబ్. ప్రభువు, యజమాని, స్నేహితుడు ; పార. సాబ్, సాహిబ్. స్నేహితుడు, సమ్మానసూచకమైన శబ్దం ; క. సాబ్, సాహెబ్, సాహెబు ప్రభువు, యజమాని, పెద్దమనిషి, సర్, చాయప్ప, చాయిప్, సాహిప్, సాహెప్; మ. సాయిప్పు. ఇంగ్లీషువాడు, యూరోపియనువాడు.

<ఉ. సాహిబ్.

సాహేబుబహదూరు వి. పేర్లకు ముందుగా గౌరవ ప్రదంగా చేర్చే ఒక బిరుదవాచకం. ఉ. సాహెబ్-. బహదుర్. గొప్పవీరుడు. <ఉ. సాహెబ్-. బహాదుర్.

సాహేబులవాడు విశ. యజమానుడు, ప్రభువు. ద. హిం. శా. సంపు. 10.శా. సం. 773. క్రీ.శ. 1697.

సాహేబూ రూ.చూ. సాహేబు. వి. 1. ప్రభువు ; 2. మగడు భర్త.

సాహెూ రూ. సాహూ. అవ్య. పరివారజనం చేసే హెచ్చరిక. వరాహ. 6.42. ధ్వన్యను.

సాహెూనినాదమిడు అ.క్రి. 1. ప్రోత్సాహ పరుచు. మను. 5.84 ; 2. సెబాసనిపలుకు. సం. నినాద-. ధ్వని

సాహెూయనిహెచ్చరించు స.క్రి. ప్రోత్సాహించు. రాజగో. 5.27. సాహెూయను (-అను) అ.క్రి. యుద్ధాదులకు పోయేటప్పుడు ధ్వని చేయు. హంస. 1.29.

సింహంకూజా వి. నీళ్ళు వంచుకొనే భాగంలో సింహం ముఖం తీర్చినకూజా.

నం. సింహ-. సింహం.

<నం. సింహ-+-ము+కూజా.

సింహతలాటం కూజా వి. నీళ్ళు వంచుకొనే భాగంలో సింహం ముఖం తీర్చి చేసిన కూజా.

నం. సింహతలాట-. కవిపండితులకు సన్మానంగా ఇచ్చే సింహం బొమ్మతో కూడిన మురుగు.

<నం. సింహతలాట-+-ము+కూజా.

సింహద్వారణం వి. తలవాకిలి. ఇంటిలోని మొట్టమొదటి, పెద్దదైన ముఖ్యమైన ద్వారం.

సం. సింహద్వార-. ప్రధానద్వారం, ముఖ్యద్వారం.

<సం. సింహద్వార-.

సింహశిత్య రూ.చూ. సియాశెత. వి. గాయని. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1150. క్రీ.శ. 1290.

సింహాలంచు వి. సింహం ఆకారంలో డిజైన్లు పడేట్టు నేసిన అంచు.

సం. సింహ-. మృగరాజు.

సం. సింహ-+-ము+-లు+-అ[11]+అంచు.[3]

సిక[1] రూ.చూ. సిగ. వి. 1. శిఖ, జుట్టు. అచ్చ. రా.బాల. 42 ; 2. నెమలిజుట్టు.

సికగన్నదాటుట వి. బాలక్రీడావిశేషం.

సికతరుగు రూ. శికతరుగు, సిగతరుగు. అ.క్రి. (శిష్టార్థం) తలగొరుగు. సికదొమ్మ వి. ఊపిరితిత్తులజబ్బు. సికపట్లాడు రూ. సిగపట్లాడు. అ.క్రి. పోట్లాడు. సానంద. 3.32. <సికపట్లు+ఆడు. సికపట్లు రూ.చూ. సిగపట్లు. వి.బ.వ. దెబ్బలాట. సికపువ్వు రూ. సిగపువ్వు, సిగపూవు. వి. 1. తలపై పెట్టుకున్నపువ్వు, చంద్రుడు. రుక్మి. 1.19 ; 2. చంద్రుడు.

సిక[2] రూ.చూ. సీకాయ. వి. శిఖాఫలం.

సికం రూ.చూ. షికం[1]. వి. పోరంబోకు, ప్రభుత్వాధికారంలో ఉన్నభూమి.

సికరం వి. మోటు, గడ్డిగూడు వేసేటప్పుడు పైన కొనుగా కట్టే భాగం.

నం. శిఖర-. కొన, పర్వతాగ్రం.

<నం. శిఖర-.

సికరంకట్టు అ.క్రి. గడ్డిగూడు వేసేటప్పుడు పైన కొనుగా కట్టు.

సికస్తు రూ.చూ. శికస్తు. విశ. శిథిలమైన,

సికా రూ. శిక్కా, శిఖా, సిక్కా, సిఖా. వి. ముద్ర. చంద్రాంగ. 1.63.

హిం. సిక్కాముద్రా. ముద్రితచిహ్నం ; మరా. శిక్కాముద్ర ; ఉ. సిక్కా. ముద్ర ; పార. సిక్కా. ముద్ర, పరిపాలనం, చట్టం, దుస్తులు ; అర. సిక్కా. ముద్ర.

<ఉ. సిక్కా.

సికాయుంగరము(-ఉంగరము) వి. ముద్రఉన్న ఉంగరం. ముద్దుటుంగరం, మొహరుంగరం.

సికారు రూ.చూ. షికారు. వి. వాహ్యాళి.

సికినవువక్కలు రూ. సిగినవువక్కలు. వి బ.వ. పల్లాలు పల్లాలుగా ఉండే నాణెమైన వక్కలు.

సికిమ్‌దార్ రూ.చూ. సిక్మదార్. వి. 1. శేరీల అన్నదమ్ముల్లో పెద్దవాడు శేరీదారు, మిగిలిన వాళ్ళు సిక్మీదార్లు ; 2. వ్యవసాయం చేసేవాడు.

సికోరాలు వి.బ.వ.మూతలుగా వాడటానికి ప్రమిదల్లాగా ఉండే మూకుళ్ళు.

నం. శిఖర-. పర్వతాగ్రం, కొన.

<నం. శిఖర-+-ము+-లు.

సిక్కా రూ.చూ. సికా. వి. ముద్ర.

సిక్కాచేయు అ.క్రి. సీలువేయు.

సిక్కు రూ.చూ, చిక్కు[2]. వి. కష్టం. తాళ్ల.సం. 12.15.

సిక్కొండి చూ. సిగ.

సిక్కొండిఅంచు చూ. సిగ.

సిక్కొండికోతికొయ్య చూ. సిగ.
సిక్కొండికోల చూ. సిగ.
సిక్కొండినేత చూ. సిగ.
సిక్మ్‌దార్ రూ. సికిమ్‌దార్. వి. 1. శేరీల అన్నదమ్ముల్లో పెద్దవాడు, శేరీదారు, మిగిలినవాళ్ళు సిక్మ్‌దార్లు ; 2. వ్యవసాయం చేసేవాడు.
సిఖా రూ చూ. సికా. వి. ముద్ర. కృష్ణరా. 2.123.
సిగ రూ. శిక, సిక[1]. వి. 1. శిఖ. క్రీడా. 176 ; 2. సీకాయ చెట్టు ; 3. నెమలిజుట్టు ; 4. కొప్పు, ఇంటికప్పుపై ఉన్న మొనతేలిన భాగం ; 5. అనికట్టు.

సం. శిఖా. జుట్టు ; ప్రా. సిఖా ; సిహా ; అ.మా. సిహా ; పా. సిఖా ; నాగరఅప. సిఘా.

<ప్రా. సిఖా.

సిక్కొండి రూ.చూ. సిగకొండి. వి. అంచుల్లోడి జైన్లు పడటానికి మగ్గానికి పైన అమర్చిన ఒకరకం పనిముట్టు. సిక్కొండిఅంచు రూ.చూ. సిగకొండిఅంచు. వి. మగ్గానికి పైన సిగకొండి అమర్చి పేకదారం రంగు అంచులో కలవకుండా వేరేరంగు దారంతో నేసిన అంచు. సిక్కొండికోతికొయ్య రూ.చూ. సిగకొండి కోతికొయ్య. వి. అంచులో డిజైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు, కట్టుబడిలో ఒకభాగం. సిక్కొండికోల రూ.చూ. సిగకొండి కోల. వి. అంచులో డి జైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు. సిక్కొండినేత రూ.చూ. సిగకొండినేత. వి. మగ్గానికి సిగకొండి అమర్చి నేసిన నేత. సిగకుచ్చెల వి. పైన కోసుగా వచ్చేట్టు వేసిన జొన్నగడ్డి కుప్ప. సిగకొండి రూ. సిక్కొండి. వి. అంచుల్లో డి జైన్లు పడ టానికి మగ్గానికిపైని అమర్చిన ఒకరకం పనిముట్టు, సిగకొండిఅంచు రూ. సిక్కొండిఅంచు. వి. మగ్గానికిపైన సిగకొండి అమర్చి పేకదారం రంగు అంచులో కలవకుండా వేరేరంగు దారంతో నేసిన అంచు. సిగకొండికోతికొయ్య రూ. సిక్కొండికోతికొయ్య. వి. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు. కట్టుబడిలో ఒక భాగం. సిగకొండికోల రూ. సిక్కొండికోల. వి. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి అమర్చిన ఒకరకం పనిముట్టు. సిగకొండినేత రూ. సిక్కొండినేత. వి. మగ్గానికి పైన సిగకొండి అమర్చి నేసిన నేత. సిగకొండిసూత్రం రూ. సిగకొండి సూత్రం. వి. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికి పైన అమర్చిన ఒకరకం పనిముట్టు. కట్టుబడిలో ఒకభాగం. సిగకొండిసూత్రం రూ.చూ. సిగకొండిసూత్రం. వి. అంచుల్లో డిజైన్లు పడటానికి మగ్గానికిపైన అమర్చిన ఒకరకం పనిముట్టు కట్టుబడిలో ఒకభాగం. సిగకోట వి. రెండిరి కొమ్ములు జతచేసి ఏర్పరచిన ఆయుధవిశేషం. ఆం.భా. 2.206. సిగకోతలమారి వి. కలహకారి. సానంద. 2.30. సిగకోయు రూ. సిగకోయు. అ.క్రి. (శిక్షార్థం) తలగొరుగు. సిగగోయు(-కోయు) రూ.చూ. సిగకోయు. అ.క్రి. (శిక్షార్థం) తలగొరుగు. సిగతరుగు రూ.చూ. సికతరుగు. అ.క్రి. (శిక్షార్థం) తలగొరుగు. సిగదండ వి. 1. శేఖరం ; 2. భూషణవిశేషం. సిగపట్లగోత్రం వి. దెబ్బలాట, తన్నులాటం. సిగపట్లాడు రూ.చూ. సికపట్లాడు. అ.క్రి. పోట్లాడు.
<సిగపట్లు + ఆడు. సిగపట్లు రూ. సికపట్లు. వి.బ.వ. దెబ్బలాట. కువ.చ. సిగపువ్వు రూ.చూ. సికపువ్వు. వి. 1. తలపై పెట్టుకొనేపువ్వు ; 2. చంద్రుడు. సిగపువ్వులు చుట్టు అ.క్రి. ఒకరిజుట్టు ఒకరు పట్టుకొని పోరాడు. సిగపూవు రూ.చూ. సికపువ్వు. వి. 1. తలపై పెట్టుకొనే పువ్వు. 2. చంద్రుడు. సిగబంటిగా విశ. పూర్తిగా, సమృద్ధిగా. పాండు. 4.44. సిగబంతి వి. 1. భూషణ విశేషం. చంద్రాంగ. 2 ; 2. శేఖరం. సిగమర రూ.చూ. సిగమోర. వి. ఎద్దులమూతికి తగిలించే తాడు. సిగమారి రూ.చూ. సిగమోర. వి. చిక్కుతాడు, తాడుతోగాని తోలుతోగాని అల్లి ఎద్దులమూతికి తగిలించే అలంకారం సిగమారు రూ.చూ. సిగమోర. వి. చిక్కుతాడు, తాడుతోగాని, తోలుతోగాని అల్లి ఎద్దులమూతికి తగిలించే అలంకారం. సిగమోర రూ. సిగమర, సిగమార, సిగమారు, సిగమోరు. వి. చిక్కుతాడు, చిటిమూరుతాడు, చింజోర, చిలమరక, చిలముకుతాడు, చిలమోల, ముకుచిక్కారు, మూతిచిక్కం, తాడుతోగాని తోలుతోగాని అల్లి ఎద్దులమూతికి తగిలించే అలంకారం. సిగమోరతాడు వి. మోరతాడు, గూడమూతికి అటూఇటూ కట్టినతాడు. సిగమోరు రూ.చూ. సిగమోర. వి. చిక్కుతాడు, తాడుతోగాని తోలుతోగాని అల్లి ఎద్దుల మూతికి తగిలించే అలంకారం. సిగలువిప్పు అ.క్రి. తల వెంట్రుకలు విప్పు. ఆము. 7.14. సిగపోయిన పోనిమ్మని (-పోయిన పోనిమ్మని) అవ్య. చివరకు తల పోయినా సరే అనే అర్థంలో వాడే మాట. శుక. 3.274.
సిగం రూ.చూ. పికం[1]. వి. పొరంబోకు, ప్రభుత్వాధికారంలో ఉన్న భూమి.
సిగనపుకుండ చూ. సిగనము.
సిగనము రూ.చూ. సిగరము. వి. 1. గోడ దిమ్మమీది గోపురంలాంటి నిర్మాణం ; 2. మేలుజాతినక్క.

సిగినపుకుండ రూ.చూ. సిగినెంకుండ. వి. దేవాలయాలపైన మేడలమీద అలంకారానికి పెట్టే కూజాలాంటి మట్టిపాత్ర.
సిగము రూ.చూ. సివము. వి. దేవతావేశం.
సిగర రూ.చూ. సిగరి[2]. వి. 1. మెంతిమజ్జిగ, మజ్జిగపులుసు. పాండు. 4.184 ; 2. దధిశర్కరాది కృతలేహ్యం.
సిగరజంబు వి. తీగెలు అల్లుకోవటానికి పాతే నిలువుకొయ్య.
సిగరము రూ. సిగనము, సిగినము. వి. శిఖరం. ఆం.భా. 1.18.

సం. శిఖర-. పర్వతోపరిభాగం, అగ్రభాగం ; ప్రా. సిహర-; అ.మా. పా. సిహర -. కొన. అగ్రం ; అప. సిహర -. ;

క. చికరి, సికర, త. చికరమ్.

<సం. శిఖర-.

సిగరి[1] వి. భస్మం.
సిగరి[2] రూ. సిగర. వి. మెంతిమజ్జిగ. పాండు. 2.108.

సం. శిఖరిణీ. ఖాద్య విశేషం ; ప్రా. సిహరిణీ, సిహరిల్ల-. ; అ.మా. సిహరిణీ. భోజ్యపదార్థ విశేషం, అరటిపళ్ళు, పాలు, పంచదార కలిపినది.

<సం. శిఖరిణీ.

**సిగరె** వి. 1. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; 2. దండెదగ్గరి పడుగు పోగులు నెరపటానికి అచ్చు దగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం.

**సిగరెట్టు** వి. కాగితం తొడుగున్న పొగచుట్ట.

ఇం. *Cigarette.* చిన్ని పొగచుట్ట.

<ఇం. Cigarette.

**సిగళ్ళకోల** రూ. సీళ్ళకోల. వి. ఆనుపోసిన పడుగులో మొదటి అని పడ్డభాగం.

**సిగారు** వి. పొగచుట్ట.

ఇం. *Cigar.* పొగచుట్ట.

<ఇం. Cigar.

**సిగిడీ** రూ.చూ. చీడీ. వి. మెట్టు, ఎక్కటానికి దిగటానికి వీలుగా కట్టిన నిర్మాణం.

**సిగినపుకుండ** చూ. సిగరము. రూ. సిగినెంకుండ. వి. దేవాలయాలపైన, మేడలమీద అలంకారానికి పెట్టే కూజాలాంటి మట్టిపాత్ర.

**సిగినపువక్కలు** చూ. సిగరము. రూ.చూ సికినపు వక్కలు. వి.బ.వ. నాణెమైనవక్కలు.

**సిగినమాకు** చూ. సిగరము. వి. మేలైన తమలపాకు.

**సిగినము** రూ.చూ. సిగరము. వి. కొండకొన.

**సిగినలుకర్ర** రూ.చూ. సిగ్నలుకర్ర. వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా కత్తెరగుంజకు పైన అడ్డంగా బిగించిన కొయ్యపట్టె.

**సిగినాలు** చూ. సిగరము. వి బ.వ. నాణెమైన వక్కలు.

**సిగినెంకుండ** రూ.చూ. సిగినపుకుండ. వి. దేవాలయాలపైన మేడలమీద అలంకారానికి పెట్టే కూజాలాంటి మట్టి పాత్ర

**సిగినేలు** చూ. సిగరము. వి.బ.వ. దేవాలయాలమీద, మేడలమీద అలంకారంగా పెట్టటానికి దొంతుల మోస్తరు చేసిన మట్టిపాత్ర.

**సిగిరి** రూ. చేగిలి, సాగెల, సిగిలి, సేకిరి, సేకిలి, సేగిలి. వి. వాటకుండలోని బురదమన్ను.

**సిగిరికుండ** రూ. సేకిరికుండ. వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళకుండ.

**సిగిరెతొడుగు** రూ.చూ. సివరతొడుగు. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సిగిలి** రూ.చూ. సిగిరి. వి. వాటకుండలోని బురదమన్ను.

**సిగిల్కుండ** రూ.చూ. సేకిరికుండ. వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళకుండ.

**సిగు** రూ.చూ. సిగ్గు. వి. లజ్జ.

**సిగుడు** రూ.చూ. సేడు. వి. అనులు పడకుండా ఆనుపోసిన నూలు.

**సిగురుగాడు** వి. పాలికాడు, పాలికిసేద్యం చేసేవాడు.

**సిగురుపుల్ల** వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సిగ్గరి** చూ. సిగ్గు.

**సిగ్గరికత్తియ** చూ. సిగ్గు.

**సిగ్గరికత్తె** చూ. సిగ్గు.

**సిగ్గరికాఁడు** చూ. సిగ్గు.

**సిగ్గరితనము** చూ. సిగ్గు.

**సిగ్గరీఁడు** చూ. సిగ్గు.

**సిగ్గఱికత్తియ** చూ. సిగ్గు.

**సిగ్గఱికత్తె** చూ. సిగ్గు.

**సిగ్గఱు** చూ. సిగ్గు.

**సిగ్గిఁడి** చూ. సిగ్గు.

**సిగ్గిలు** చూ. సిగ్గు.

**సిగ్గిల్లు** చూ. సిగ్గు.

**సిగ్గు** రూ. శిగ్గు, సిగు. వి. బిడియం, లజ్జ. భార. ఆది. 2.85.

క. సిగ్గు, లజ్జ, బిడియం, సిగ్గాళి. సిగ్గుపడినవాడు, కో. చిగ్. బిడియం, లజ్జ.

**సిగ్గరి** విశ. 1. సిగ్గుకలవాడు; 2. సిగ్గుకలది. <సిగ్గు +-అరి. **సిగ్గరికత్తియ** రూ.చూ. సిగ్గఱికత్తియ. వి. సిగ్గుకలది. **సిగ్గరికత్తె** రూ.చూ. సిగ్గఱికత్తియ. వి. సిగ్గుకలది. **సిగ్గరికాఁడు** వి. సిగ్గుకలవాడు. **సిగ్గరితనము** వి. సిగ్గు, బిడియం. తాళ.సం. 14.175. **సిగ్గరీఁడు** వి. సిగ్గుకలవాడు. తాళ్ల.సం. 17.589. **సిగ్గఱికత్తియ** రూ. సిగ్గరికత్తియం, సిగ్గరికత్తె, సిగ్గఱికత్తె. వి. సిగ్గుకలది. వసు. 4 23. **సిగ్గఱికత్తె** రూ.చూ. సిగ్గఱికత్తియ. వి. సిగ్గుకలది. **సిగ్గఱు** అ.క్రి. సిగ్గుచెడు. భార. విరా. 5.222. <సిగ్గు. +- అఱు. **సిగ్గిఁడి** విశ. 1. నిర్లజ్జతనం; 2. సిగ్గుచెడినవాడు; 3. సిగ్గుచెడినది. <సిగ్గు +-ఇఁడి. **సిగ్గిలు** రూ.చూ. సిగ్గిల్లు. అ.క్రి. 1. సిగ్గుపడు; 2. అవమానపడు. **సిగ్గిల్లు** రూ. సిగ్గిలు. అ.క్రి. 1. సిగ్గుపడు; 2. అవమానపడు. **సిగ్గుచూరఁబోవు** అ.క్రి. మానంపోవు. తాళ్ల. సం. 12.248. **సిగ్గుచెడు** అ.క్రి. సిగ్గుపోవు, అవమానం చెందు. కాశ. 3.160. **సిగ్గుచెందు** అ.క్రి. సిగ్గుపడు. **సిగ్గుతీయు** అ.క్రి. మానంతీయు. **సిగ్గుదేర్చు(-తేర్చు)** స.క్రి. సిగ్గును తేటపడేట్లుచేయు. ఉ.హరి. 1.76. **సిగ్గుపడు** రూ.చూ. సిగ్గువడు. అ.క్రి. లజ్జచెందు. **సిగ్గుపఱుచు** రూ. సిగ్గువఱుచు. స.క్రి. 1. అవమానించు. శుక్మా. చ. 2.144; 2. సిగ్గుపడేటట్లు చేయు. **సిగ్గుపాటు** వి. సిగ్గుపడటం. శృం. నై. 3.84. **సిగ్గుపాటులగు** అ.క్రి. నగుబాటులగు. హంస. 2.127. <సిగ్గుపాటు + -లు + అగు. **సిగ్గుపోవు** రూ.చూ. సిగ్గువోవు. అ.క్రి. 1. సిగ్గుపడు. నృసింహ. 2.90; 2. మానంపోవు. **సిగ్గుబిళ్ల** వి. కొడిదిపూస, మానంబిళ్ళ. **సిగ్గుమాలిన** విశ. లజ్జలేని. **సిగ్గుమాలు** అ.క్రి. 1. సిగ్గువిడుచు; 2. మొండికెత్తు. **సిగ్గులమ్ముకొను** స.క్రి. మానం అమ్ముకొను. తాళ్ల సం. 11.2.19. <సిగ్గు + -లు + అమ్ముకొను. **సిగ్గులుచెఱచు** స.క్రి. మానభంగం చేయు. తాళ్ల. సం. 3.150. **సిగ్గువడు(-పడు)** రూ. సిగ్గుపడు. అ.క్రి. లజ్జచెందు. **సిగ్గువఱుచు(-పఱుచు)** రూ.చూ. సిగ్గుపఱుచు. స.క్రి. 1. అవమానించు; 2. సిగ్గుపడేటట్లు చేయు, **సిగ్గువోవు(-పోవు)** రూ. సిగ్గుపోవు. అ.క్రి. 1. సిగ్గు

పడు ; **2**. మానంపోవు.

సిగ్గి వి. చిన్నకండెల బేలు.

సిగ్నలు వి. **1**. మరమగ్గం చ(టం నిలబెట్టటానికి నేతబయలులో పాతిన ఒకరకం నిలువుగుంజ ; **2**. సంజ్ఞ, సూచన.

ఇం. *Signal*. సంజ్ఞ, గుర్తు.

< ఇం. Signal.

సిగ్నలుక(ర రూ. సిగినలుక(ర. వి. మరమగ్గం చ(టం నిలబెట్టటానికి ఆధారంగా కత్తెరగుంజకు పైన అడ్డంగా బిగించిన కొయ్యపట్టె.

సింకి చూ. సంకు. వి. తాలు, పలుకులేనిగింజ, గింజపట్టని వట్టిపొట్టు.

సింగ్ వి. అచ్చుక(రకు కుట్టిన పడిదారం బి(రుగా ఉండటానికి పై మెలికల మీద రుద్దే దుప్పికొమ్ము.

సం. శృంగ-. కొమ్ము, హిం సింగ్. కొమ్ము, సింగాఁ. కొమ్ములు.

< హిం. సీంగ్.

సింగ చూ. సింగము. రూ. సింగఁడు. పి. నృసింహుడు, వ్యక్తినామం. పండి. చ. 4.85.

సం. సింహ-. సింహం ; పా. సీహ. ;

(ప్రా. సింఘ-. ; అప. అ.మా. సీహ-.

< (ప్రా. సింఘ-.

సింగన రూ. సింగన్న. వి. నరసింహస్వామి. < సింగ + అన. సింగన్న రూ.చూ. సింగన. వి. నరసింహస్వామి. సింగన్నదాఁటులు రూ. సింగన్నదాఁట్లు. వి. బ వ. బాల (క్రీడావిశేషం. సింగన్నదాఁట్లు రూ.చూ. సింగన్నదాఁటులు. వి.బ.వ. బాల(క్రీడా విశేషం. సింగరవళి వి. సింహరావం. సం. రవళి-. ధ్వని.

సింగఁడు రూ.చూ. సింగ. విణ. కోపించినవాడు. వేంక. పంచ. 1 ; వి. **1**. ఎరుకవాడు. శుక. 1.19 ; **2**. నృసింహుడు. సింగఁడుబూరడునగు(-అగు) అ.(క్రి. ఉబ్బిపోవు వేంక. పంచ. 4.147.

సింగనాదము వి. కంటి నల్లగుడ్డు.

సం. సింహనాద-. సింహగర్జన, ధ్వని ; (ప్రా. సింఘ-. సింహం.

సింగనాదముపన్ను వి. శృంగనాదం ఊదటానికి నియమించబడినవాని జీవితానికై విధించబడ్డ పన్ను. H A.S. 19.

సం. శృంగనాద-. కొమ్ముబూరధ్వని.

సింగంతూం వి. ధాన్యంకొలత, 12 మానికలు.

< సింగము + తూము[2].

సింగపుగొంగ చూ. సింగము.

సింగపుఁగొదమ చూ. సింగము.

సింగపుజక్కి చూ. సింగము.

సింగపుదండ చూ. సింగము.

సింగపుపుట్టి చూ. సింగము.

సింగపుబీఁట చూ. సింగము

సింగపురాసి చూ. సింగము.

సింగపువేట చూ. సింగము.

సింగపూరుకైల వి. సింగపూరుకు ఎగుమతి చెయ్యటానికి నేసిన తురకల గళ్ళలుంగీ.

ఇం. *Singapur*, ఒకపట్టణం.

< ఇం. Singapur.

సింగము వి. **1**. సింహం. కు. సం. 4.62 ; **2**. మల్లబంధ విశేషం.

సం. సింహ-. సింహం ; (ప్రా. సింఘ-. సింహం; సీహ ; అ మా. పా. సీహ ; అప. సీహ ;

క. సింగ ; తు. సింగ ; త. చింకమ్, చిమ్మమ్ , మ. చింకం, చిజ్ఞం.

< (ప్రాం. సింఘ-.

సింగపుగొంగ వి. **1**. ఖడ్గమృగం ; **2**. శరభం. సింగపుఁగొదమ(-కొదమ) వి సింహం శిశువు, చిన్నసింహం. భార. (ద్రోణ. 2.89. సింగపుజక్కి వి. సింహవాహన. పార్వతి. సింగపుదండ వి. మల్లబంధ విశేషం, ఒకరకమైన జెట్టిపెనకువ. సింగపుపుట్టి రూ.చూ. సింగంపుట్టి. వి. ధాన్యం కొలత, 30 చిన్నతూముల కొలమానం, 320 మానికల కొలమానం. సింగపుఁబీట(-పీట) వి. సింహాసనం. పాంచా. 1ఆ. సింగపురాసి వి. సింహరాశి. సింగపువేట వి. సింహం చేసేవేట. కు.సం. 4.62 ; **2**. సింహాన్ని వేటాడటం. సింగమునుబేరమాడు అ.(క్రి. తలకుమించిన పనికిడిగు. సింగమునెక్కుదంట వి. పార్వతి. ఆం. పదా. సుర. **114**. < సింగము + -ను + ఎక్కు + దంట. సింగమువాళ్ళు వి. బ. వ. నేతపనిచేసే దేవాంగులదగ్గర అడుక్కొనేవాళ్ళు, అచ్చులు కట్టేవాళ్ళు. సింగంపుట్టి రూ. సింగపుపుట్టి. వి. మార్కేళ్ళసీమ అనబడే పొదిలిదర్శి తాలూకాల (ప్రాంతంలో సింగంరాజు అధికారం సాగించి ఒకకొత్త కొలమానాన్ని తనపేర (పవేశపెట్టాడు. దీనికి 30 చిన్నతూములు. దీని కంటె పెద్దపుట్టిని ఆ (ప్రాంతంవారు వల్లెపుట్టి అంటారు.

సింగంపుట్టి చూ. సింగము.

సింగల్‌కిస్తీ వి. గడ్డకిస్తీ, చ(టంలో సమానమైన మట్టంలో ఉండే కిస్తీ.

ఇం. *Single*. ఒక.

< ఇం. Single + కిస్తీ.

సింగల్‌బాణా వి. ఒకరకం కృ(తిమపు పట్టు, పురిలేకుండా ఉన్న ఒకేపోగు.

ఇం. *Single*. ఒక.

సింగళము వి. సింహళద్వీపం.

సం. సింహల. సింహళదేశం ; (ప్రా. సింఘల-, సీహల. ఒకానొకదేశం ; (ప్రా. సీహల-, సీహళ-;

క. సింగళ ; త. చింకళ.

< (ప్రా. సింఘల-.

సింగాడ వి. గూబయొక్క నివాసం.

సింగాడాదుంప వి. నీటికంద, జలఫలం.

సింగాణి రూ.చూ. సింగిణి. వి. **1**. ఒకరకం బాణం. వేంక. ఆం. 76 ; **2**. ఒకరకం కుక్క ; **3**. శృంగధనువు ; **4**. జిగురుపూసినదారం.

సింగారపుజొన్న చూ. సింగారము.

సింగారపుఁదోట చూ. సింగారము.

**సింగారము** వి. **1**. శృంగారం. భార. విరా. 2.242 ; **2**. అలంకారం. కళా. 1.34 ; విణ. మంజులం, హృద్యం.

సం. శృంగార -. సుందరం, భూషణాదికశోభ ; ప్రా. సింగార-. సిణగార-. అలంకారం ; అ.మా. సింగార-. పా. సింగార-. వేషం, శృంగారం ;

క. సింగర, సింగార. శృంగారం, సింగరిగ. శృంగారి, సింగరిసు శృంగారించు ; తు. చింగర. భూషణం, అలంకారం ; మ. చింకారం. భూషణం, మరియా గోండీ సింగార్ ; ఒరయాన్ సింగార్ అలంకారం

< ప్రా. సింగార -.

**సింగారపుజొన్న** వి. సన్నగింజరకంజొన్న, సింహళం, మారిషస్ ద్వీపాలనుంచి మొదట దిగుమతి అయినరకం

**సింగారపుఁదోట (-తోట)** వి. శృంగారవనం, ఉద్యానవనం.

**సింగారముచిందు** అ.క్రి. ముద్దులొలుకు, సారంగ. **3.38**.

**సింగారించు** స.క్రి. శృంగారం చేయు. అలంకారం చేయు, కుస్తరించు, దిద్దు, పారాణించు, సవరించు, హవణించు.

< సింగారము + -.ఇంచు³.

**సింగారి** వి. శృంగారి. శృంగారవతి.

సం. శృంగారిన్. శృంగార సంబంధమైన, కాముకుడు. ప్రా. సింగారి.

< ప్రా. సింగారి.

**సింగారించు** చూ. సింగారము.

**సింగాలు** చూ. సింగమువాళ్ళు. వి.బ.వ. **1**. నేతపనిచేసే దేవాంగులదగ్గర అడుక్కోవటానికి వచ్చేవాళ్ళు ; **2**. దేవాంగుల దగ్గర సేవకులు,

**సింగి** వి. ఎరుకలసాని, చెంచుది.

సం. శృంగిన్. కొమ్ముగల, శిఖరంగల, కొమ్ములు గలది ; ప్రా. సింగి ; జై. మహా. అ.మా. పా. అప. సింగ, సింగి ;

క. సింగి ; మ. చింగి. ఆటవికుడు.

< ప్రా. సింగి.

**సింగిడి** రూ.చూ. సింగిణి. వి. **1**. ఉండేలు, అచ్చువెంకును కోయటానికి కుమ్మర్లు వాడే సాధనం ; **2**. హరివిల్లు, కొరడు.

**సింగిడించుకొను** అ.క్రి. ఒళ్ళు విరుచుకొను.

**సింగిణి** రూ. సింగాణి, సింగిడి, సింగిణీ. వి. **1**. విల్లు, ధనువు. భీమ. 5.96, మను. **4**.28 ; **2**. ఇంద్రధనస్సు.

సం. శృంగిణీ ; ప్రా. సింగణీ ;

క. సంగాడి ; త.మ. కింకాటి.

< ప్రా. సింగణీ.

**సింగిణీ** రూ.చూ. సింగిణి. వి. విల్లు, ధనస్సు. రాజవా. 2.134.

**సింగితమనుకుపల** వి. చేపలు. పట్టటానికి ఉపయోగించే ఒకరకమైన వల.

**సింగితాడు** వి. **1**. పెడకోలకు తగిలించే మలగర్ర ; **2**. నేత పడుగులో చివరిపాయకు కట్టినదారం.

**సింగినాదము** వి. **1**. శృంగనాదం, కొమ్మువాద్యం. కళా. 2.50 ; **2**. పొడలున్న దుప్పి కొమ్ములతో చేయబడి యోగులచేత ఉపయోగింపబడే సుషిరవాద్యం, పిల్లయోగుల వాద్యవిశేషం ; **3**. చెప్పుకోదగినది కాని దాన్నిగురించి తీసివేతగా మాట్లాడేటప్పుడు వాడేపదం ; **4**. అసత్య ప్రవర్తనం ; **5**. పిల్లలఏడ్పు ; **6**. పొల్లుమాట.

సం. శృంగనాద -. కొమ్ముబూరధ్వని, నాద -. ధ్వని ; ప్రా. సింగి. కొమ్ములుగల.

< ప్రా. సింగి + సం. నాద -.

**సింగినాదములూఁదు** స.క్రి. కొమ్ములూదు. తాళ్ల.సం. 7.12, < సింగినాదము + -. లు + ఊఁదు.

**సింగిలీకకము** రూ.చూ. సింగిలీకము. వి. పెద్దనల్లకోతి.

**సింగిలీకము** రూ. సింగిలీకకము. వి. పెద్దనల్లకోతి. హంస. 5.400, ద్వి. నల. 3.290.

క. సింగనీక, సింగలిక. పెద్దనల్లకోతి.

**సింగీతము** వి. చేపలు పట్టే వల.

**సింగులు** వి.బ.వ. బొండిలీలని బాలజీలని పిలవబడే ఒకజాతి ప్రజలు.

**సింగోట** వి. రెండిర్రి కొమ్ముల్ని రెండుపక్కలా మొనలుగా జతపరచి ఏర్పరచిన ఆయుదవిశేషం. ఆం. భా. 2.206.

**సింఘమాసము** వి. సూర్యుడు, సింహరాశిలో సంచరించే నెల. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 674. క్రీ.శ. **1131**.

సం. సింహమాస -, సూర్యుడు సింహరాశిలో ఉన్నప్పటి నెల ; ప్రా. సింఘమాస-.

< ప్రా. సింఘమాస -.

**సింఘెపోత్రేబ్రాహ్మణులు** వి.బ.వ. కపూరియేబ్రాహ్మణులు.

సం. బ్రాహ్మణ -. విప్రుడు.

**సించగూడ** వి. సురిటిగూడ, ఒకమనిషిమాత్రమే వేసేగూడ.

**సిట్టుపొయ్యి** రూ.చూ. చిట్టుపోయ్యి. వి. పొట్టుపోసి రగిలించి వంటచేయటానికి వాడే మట్టిపొయ్యి.

**సిట్టెపుతొట్టి** వి. కంసాలి ఉపయోగించే కుంపటి.

< చిట్టెము + తొట్టి.

**సిట్లుదబ్బ** రూ.చూ. చిట్లబద్ద. వి. పచ్చికుండలకు పూజలు పెజ్జటానికి వాడే వెదురుదెబ్బ.

**సిడము** రూ. సిడెము. వి. **1**. ధ్వజస్తంభం. నిర్వ. రా. 6 91 ; **2**. రథాదులమీద ఉంచబడే జెండా. ఉ. హరి. **4**.213.

**సిడి**¹ రూ. సిడె. వి. **1**. సిడిమాను. పాండు. **3**.77 ; **2**. అంకుశం ; **3**. ఏతంమాను ; **4**. గ్రామదేవత. జాతర్లలో ఒకడి వీపుకి గాలంగుచ్చిగాని, ఒకణ్ణి గంపలో కూర్చోపెట్టిగాని తిప్పేదూలం.

సం. శ్రేణీ. నిచ్చెన ; ప్రా. సిఢ్ఢీ సేఢీ, సేఢి. నిచ్చెన, వరుస ; అ. మా. సేఢీ ; జై. మహా. సేఢి.

క. సిడి. ఇనుపకొక్కెం ; తు. సిడి, సెడి, శెడి ; త. చెటిల్. ఒక మనిషికి కొక్కెం తగిలించి మానుకు వేలాడదీసే ఒకరకం సిడిమాను ;

< ప్రా. సిఢ్ఢీ.

**సిడిదల** వి. కొరతవేయటం. తాళ్ల.సం. 11-2-62.

**సిడిపక్క** రూ. సిరిపక్క. వి. పాత్రమూతికింద ఉన్న పొట్టభాగం. **సిడిమాను** వి. **1**. బండిమీద ఎత్తుగట్టిన నొగలాంటి కర్ర ; **2**. పోలేరమ్మ కొలువులో బండిమీద

ఊరేగించే గొ(్రెపోతును కట్టే క(్ర. సిడి(్రమా(ను వి. (్రగామదేవతల జాతరకు నాటిన స్తంభం. సిడులు రూ.చూ. సిళ్లు. వి.బ.వ. 1. బరిగోలలు. భార. భీష్మ. 2,297 ; 2. అంకుశాలు. <సిడి[1] + లు. సిళ్లు రూ. సిడులు. వి. బ.వ. 1. అంకుశం. కు. సం. 10.144 ; 2. ములుకోల ; 3. బరికోల.

సిడి[2] వి. 1. పోరుపెట్టటం ; 2. పిల్లలు తెలియని బాధలతో తలిదం(్రులకు కలిగించే చికాకు.

క. సిడి. భయం, కలవరం.

సిడిపెట్టు. రూ. సిడివెట్టు. స.(క్రి. 1. కష్టపెట్టు ; 2. పిల్లలుపోరుపెట్టు. సిడిముడి రూ.చూ. చిడిముడి. వి. 1. చిడిముడి. భార. (్రోణ. 5.258 ; 2. రోషం ; 3. కోపం. క. సిడిముడి. భయం, కలవరం. సిడివెట్టు రూ.చూ. సిడిపెట్టు. స.(క్రి. 1. కష్టపెట్టు ; 2. పిల్లల పోరుపెట్టు. పిల్లలు పోరుపెట్టు.

సిడి[3] రూ.చూ. సీడు. వి. 1. నూలులెక్క, లడీలో పదోవంతు నూలు ; 2. లడీలో అయిదో వంతునూలు ; 3. 80 నెంబరు లడీలో ఇరవయ్యో వంతునూలు ; 4. ఒకలడీనూలు ; 5. అనులు పడకుండా అనుపోసిన నూలు ; 6. పడుగులో సగం నూలు ; 7. పడుగులో కొంతభాగం నూలు ; 8. అనుపొయ్యటం ఉపవృత్తిగాగల రైతులు మొ. వారు అనులు లేకుండా పోసిన నూలు ; 9. అనుపోసిన నూలు, నేతలో నిలుపుకు వాడే నూలు ; 10. పడుగులో విడదీసిన కొంత భాగం.

క. సిడి. చిన్నతనం, పల్చనితనం.

సిడీ రూ.చూ. చీడీ. వి. మెట్టు, ఎక్కటానికి దిగటానికి వీలుగా కట్టిననిర్మాణం.

సిడు వి. తాటి, కొబ్బరి మొ. వాటి చెలసాగి కాలిన పూత.

సిడుడుగు అ.(క్రి. తాటి, కొబ్బరి మొ. వాటి గెలనుంచి పూతరాలు. <సిడు+ఉడుగు.

సిడులు చూ. సిడి[1].

సిడె[1] రూ.చూ. సిడి[1]. ఆటగ(్ర, ఆటమాను, ఏతపుమాను, ఏతంబారు, ఏతంమాను, ఏతాంమాను, కోనంకి, కోనక(్ర, తొక్కుడుమాను, పోలు, దిండిమాను, మీగ. మీనమేటి, ఏతంలో ఒకభాగం, మునివితొక్కే లేక సాగే ఏటవాలు కొయ్య.

సిడె[2] వి. నిలవ చెయ్యటానికి కట్టే పొగాకు కట్ట.

సిడెకట్టు స.(క్రి. నిలవ చేయటానికి పొగాకును కట్టగా కట్టు.

సిడెము రూ.చూ. సిడము. వి. 1. ధ్వజస్తంభం. భార. భీష్మ. 1.340 ; 2. లోహఖండం.

సిండ రూ.చూ. చిండ. వి. చిండ, గొల్లి, ఆడుగురి.

సితకట్టె వి. అంపనన్నకట్టె. బండిదొలుపు కింద నొగలను బిగించిన క(్ర.

సితకలు రూ.చూ. చితకలు, వి.బ.వ. మాంసపు ముక్కలు.

సితగు(డు వి. మొండి, బండవాడు. బసవ. 3.60.

సితపలక రూ.చూ. సీతాఫలం. వి. సీతాఫలం.

సితమణిబన్ధమ్ వి. తెల్లమణులదండ. ద.హిం కా. సంపు. 4. కా. సం. 1007. (క్రీ.శ. 1065.

సం. సితమణిబన్ధ-తెల్లమణులముడి.

<సం. సితమణిబన్ధ-.

సితలాఫు చూ. సీతాఫలం. వి. సీతాఫలం.

సితాపల రూ.చూ. సీతాఫలం. వి. సీతాఫలం.

సితార రూ.చూ. సితారు. వి. ఏడుతీగల వాద్యవిశేషం.

సితారు రూ. సితార. వి. వాద్యవిశేషం.

హిం. ఉ. సితార్, సితారియా. సప్తతంతువులు కల వాద్య విశేషం.

<హిం. సితార్.

సిత్తిరి వి. గయ్యాళి.

హిం. సిత్‌రీ. స్వేదం, చెమట.

సితుకుబొతుకులు చూ. చితుకు. వి.బ.వ. చిన్నచిన్నముక్కలు. వేంక. అం. 3.151.

సిత్తి వి. కృత్రిమపట్టు.

సిదుగు రూ.చూ. చిదుగ. వి. అల్లరి, కొంటెతనం.

సిద్ద రూ.చూ. సిద్దె. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర ; 2. చిలుం, పొగపీల్చే గొట్టం ; 3. చిన్న మట్టిపిడత.

సిద్దకిన్నెర వి. తంత్రివాద్యవిశేషం.

సం. సిద్ధ-. సిద్ధులు.

<సం. సిద్ధ+కిన్నెర.

సిద్దవటందోస వి. కరబూజ. సిద్ధవటం (్రగామనామం.

సిద్దాయము వి. 1. వెచ్చం సొమ్ములో కూడబెట్టిన సొత్తు ; 2 కప్పం ; 3. వ్యయవిశేషం.

సం. సిద్ధాయ-.కప్పం ;

క. సిద్ధాయ. కప్పం.

<సం.సిద్ధాయ-.

సిద్ది[1] వి. మహమ్మదీయుల్లో ఒకతెగవారు. భ(ద.శ. 29.

ఉ. సిద్దీక్. అబూబ(క్రీయొక్క ఇంటిపేరు ; పార. సిదీక్. అబూబ(క్రీ యొక్క ఇంటిపేరు.

<ఉ. సిద్దీక్.

సిద్ది[2] రూ. సిద్దీ. వి. అధికబలంగల నీ(గ్రోజాతివారు.

సిద్ధి[3] వి. 1. యోగమహిమ ; 2. నెరవేరటం.

సం. సిద్ధి-. లాభం, (్రపాప్తి, జయం, వృద్ధి, నిదర్శనం, నిర్ణయం, తీర్పు, సంసిద్ధత, అతిమానుషశక్తి ; (్రపా. సిద్ధి. ముక్తి, కర్మక్షయం, అణిమాదిశక్తి, కృతార్థత, నిష్పత్తి.

<సం. సిద్ధి-.

సిద్దిపేట వి. రెండు మొగ్గల వరసలో బొమ్మలు పడేటట్లు నేసిన డిజైను.

సిద్దియ రూ.చూ. సిద్దె. వి. బుంగలా తోలుతో కుట్టినపాత్ర.

సిద్దిలి వి. డెక్కలి జాతిది.

సిద్దీ రూ.చూ. సిద్ది[2]. వి. సిద్ది, నల్లగా మొద్దులా ఏనుగంత బలం ఉన్న కామాటి పనివాడు, నీ(గ్రోజాతివాడు.

సిద్దె రూ. సిద్ద, సిద్దియ. వి. 1. నూనెగిన్నె. ద.హిం.కా. సంపు. 10.కా. సం. 667 ; 2 తోలుతో కుట్టినపాత్ర ; 3. తాబేలు ఆకారంలాగ బద్దపాటుగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర.

క. సిద్దిగె. సిద్దెవర్తకంలో నేయి, నూనెలకుపయోగించే కోలు సంచి ;

సం. స్యూతి-. సంచి, కుట్టుపని.

**సిద్ధం** వి. శాసనారంభంలో ప్రయోగించబడే మంగళవాచకం. జయం. E.1. సంపు. 1.1.

సం. సిద్ధ-. పవిత్రం, పుణ్యం, సిద్ధించింది. సిద్ధుడు.

< సం. సిద్ధ- (అర్థవిపరి.).

**సిద్ధమగు** అ.క్రి. **1**. సంపూర్ణమగు. హంస. 1.84 ; **2**. సన్నాహమగు.

సం. సిద్ధ-. పూర్తిచేయబడ్డది, నెరవేర్చబడ్డది, జయించినది, స్థిరీకరించబడ్డది, తీర్చబడ్డది, పక్వమైనది, విముక్తమైనది.

< సం. సిద్ధ- + -ము + అగు.

**సిద్ధవినాయకచవితి** రూ.చూ. సిద్ధివినాయకచవితి వి. నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్టుపెట్టి పూజచేసుకునే పండుగ.

**సిద్ధాంతి** వి. వేదమూర్తి, ఇంటికట్టుబడికి ముహూర్తాన్ని నిర్మాణపద్ధతులను శాస్త్రప్రకారం సూచించేవాడు.

సం. సిద్ధాంతిన్. శాస్త్రగ్రంథాలలో నిష్ణాతుడు, పూర్వపక్షాన్ని ఖండించి సిద్ధాంతాన్ని స్థాపించేవ్యక్తి, మీమాంస ధర్మాన్ని అనుసరించే వ్యక్తి, తత్త్వవేత్త.

< సం. సిద్ధాంతిన్ (అర్థవిపరి ).

**సిద్ధివినాయకచవితి** రూ. సిద్ధవినాయకచవితి. వి. నేతపనివాళ్ళు మగ్గంసామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజ చేసుకునే పండుగ.

సం. సిద్ధివినాయక -. విఘ్నరాజు, వినాయకుడు.

**సినీమా** రూ. శనామటి, సుడామడ. వి. చలనచిత్రం.

ఇం. *Cinema*. చలన చిత్రం.

< ఇం. Cinema.

**సిందురము** వి. **1**. వావిలి. వసు. 3.149 ; **2**. చెందిరం· నీలా. 2.22 ; **3**. నాగసంభవం ; **4**. పెద్దరేకు ; **5**. అందుగుచెట్టు.

సం. సిందూర -. వావిలి; ప్రా. సిందూర- రక్తవర్ణవిశేషం.

క. సెందుర ; మ. చిందూరం ; కుఇ. సిందురి.

< ప్రా. సిందూర-.

**సింద్రీబొగ్గు** వి. రైలుబొగ్గు, భూగర్భం నుంచి తవ్వి తీసిన బొగ్గు. నేలబొగ్గు. సింద్రీ ఊరుపేరు.

**సిపాన్‌తాడు** వి. ఒకరకం డిజైను నేతలో అనులు రేపటానికి కట్టిన తాడు.

**సిపాయి**[1] రూ.చూ సిఫాయీ. వి. **1**. కాలిబంటు ; **2**. భటుడు.

**సిపాయి**[2] వి **1**. పెంకాము వెనక నిలువుగాపేర్చి దావపెట్టిన పెంకు ; **2**. నడిమి దూలం మీది కొమెర ; **3**. ఆనుగర్ర, బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగకింద ఎత్తుగాపెట్టిన కొయ్య పరికరం.

సిపాయికర్ర వి. గిడ్డ, ఆనుగర్ర, నొగకింద ఆపుగా పెట్టిన కర్ర. సిపాయిగుజ్జు వి. నిలువుగుజ్జు, దూలానికి మేల్దూలానికి మధ్య నిలిపిన పొడుగాటి ఒంటిగుజ్జు. సిపాయిగుంజ వి. ఆనుగర్ర, బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగలకింద ఎత్తుగా పెట్టిన కొయ్య పరికరం. సిపాయిగొలుసు వి. పోలుగర్ర ఉంచటానికి రెండు సిపాయి కర్రలను కట్టినతాడు. సిపాయిచట్రం వి. ఒంటికొమరమీది బిగువువాసం, దానిమీద గుజ్జు గల కప్పుచట్రం. సిపాయి దబ్బ వి. సిపాయికర్ర, నొగకింద ఆపుగా పెట్టినకర్ర. సిపాయిపట్టి వి. గుజ్జుకు ఎదురుగా వేసేపట్టి ; **2**. ఆనుగర్ర, నొగకింద ఆపుగా పెట్టిన కర్ర. సిపాయిపీట వి. **1**. తొట్టిపీట, తొట్టికర్రలు దూర్చేకొయ్య ; **2**. ఎత్తయినబల్ల. సిపాయిమోకు వి. జువ్వాయి మోకు, బండి కాడినుంచి పోలుగర్ర కిందగా డొలుపువరకు అమర్చిన తాడు.

**సిపాయీ** రూ.చూ. సిఫాయీ. వి. కాలిబంటు, సైనికుడు.

సిపాయీలు వి.బ.వ. ఒకరకం వడ్లు.

**సిపారసు** రూ.చూ. శిఫారుసు. వి. మాటసాయం.

**సిపారుసు** రూ.చూ. శిఫారుసు. వి. మాటసాయం.

**సిప్ప** రూ.చూ. చిప్ప. వి. **1**. బండి చక్రం, గాలు. కల్లు ; **2**. కొబ్బరి చిప్ప.

**సిప్పగి** రూ.చూ. చిప్పె[2]. వి. దర్జీ, టైలరు. బట్టలు కుట్టే వ్యక్తి.

**సిఫాయి** రూ.చూ· సిఫాయీ.వి. **1**. కాలిబంటు ; **2**. భటుడు.

**సిఫాయీ** రూ· శిపాయి, శిపాయీ, శిఫాయీ, శీపాయీ. సిపాయి[1], సిపాయీ, సిఫాయి, సీపాయి. వి. **1**. కాలిబంటు, రంగా. చ. ; **2**. భటుడు.

సం. అశ్వవాహీ ; బెం. సిపాయ్ ; ఒ. సిపాయ్ ; హిం. సిపాయ్ , ఉ. సిపాహీ. సైనికుడు, పరాక్రమశాలి ; పార. సిపాహీ. సేన, సైనికుడు, అశ్వికుడు, ప్రభువు.

< ఉ. సిపాహీ.

**సిఫారసు** రూ.చూ. శిఫారుసు. వి. **1**. యోగ్యతావచనం ; **2**. యోగ్యతా పత్రిక.

**సిఫారుసు** రూ.చూ. శిఫారుసు. వి. **1**. యోగ్యతావచనం ; **2**. యోగ్యతా పత్రిక.

**సిఫారుస్సు** రూ.చూ. శిఫారుసు. వి. మాటసాయం.

సిఫారుస్సుచేయు అ.క్రి. రెకమెండ్‌చేయు.

**సిఫార్సు** రూ.చూ. శిఫారుసు. వి. **1**. యోగ్యతావచనం ; **2**. యోగ్యతా పత్రిక.

**సిబురు** రూ.చూ. సివర. వి· మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సిబ్బంది** రూ.చూ. శిబ్బంది. వి. పనివాళ్ళు, ఉద్యోగులు.

**సిబ్బి**[1] రూ. సిబ్బె, సిబ్బెము[2]. వి. **1**. ఇత్తడి మొ. వాటిలో చేయబడిన అంచుల్లేని గుండ్రటిపళ్లెం ; **2**. మూకుడు. మట్టిమూత ; **3**. పళ్ళెక ; **4**. గంప, పెద్దతట్ట ; **5**. అంచులు సూదిగాఉన్న మూత.

క. చిబ్బల, చిబ్బలు, చిబ్బలి, చిబ్బుల్. వెదురు మూత.

సిబ్బితట్ట వి. ఇత్తడి మూకుడు, గంజి వార్చేటప్పుడు తపేలామీద మూసే తట్ట. సిబ్బిపళ్లిక వి, వెడల్పుమూతి గల గంప. సిబ్బిరేకు వి. గంజి వార్చుకునే చిల్లుల తట

జల్లి మూకుడు.

**సిబ్బి**[2] రూ.చూ. సిబ్బెము[1]. వి. చర్మానికి కలిగే పొడరోగం.

**సిబ్బితి** రూ. సిబ్బెత. వి. సిగ్గు. కళా. 6.128.

**సిబ్బితికత్తియ** రూ.చూ. సిబ్బితికత్తె. వి. సిగ్గుకలస్త్రీ. **సిబ్బితి కత్తె** రూ. సిబ్బితికత్తియ. వి. సిగ్గుగల ఆడది. **సిబ్బితికాఁడు** వి. సిగ్గుగల పురుషుడు. కళా. 4.72. **సిబ్బితి పఱచు** రూ. సిబ్బితి పఱుచు. స.క్రి. సిగ్గుపరచు. కాశీ. 2.79. **సిబ్బితి పఱుచు** రూ.చూ. సిబ్బితిపఱచు. స.క్రి. సిగ్గుపడేటట్లు చేయు.

**సిబ్బంది** రూ.చూ. సిబ్బంది. వి. **1**. సేవకులు ; **2**. సైన్యం.

**సిబ్బిమేనిమెకము** వి. ఏనుగు.

**సిబ్బియము** రూ.చూ. సిబ్బెము[2]. వి. బొల్లి, పొడ.

**సిబ్బుద్ధి** వి. అనునయం.

సం. బుద్ధి - ఎరుక, జ్ఞానం. సద్బుద్ధి -. మంచిబుద్ధి,

<సం. సద్బుద్ధి-.

**సిబ్బుద్ధిపడు** రూ.చూ. సిబ్బుద్ధివడు. అ.క్రి. అనునయం పొందు. **సిబ్బుద్ధివడు (-పడు)** రూ. సిబ్బుద్ధిపడు. అ.క్రి. అనునయం పొందు. కు సం. 6.18.

**సిబ్బె** రూ.చూ. సిబ్బి[1]. వి. **1**. అన్నం వార్చుకొనే చిల్లుల మూకుడు, మట్టిదిగాని, లోహందికాని ; **2**. తక్కెడతట్ట ; **3**. బియ్యం మొ. వి. వడపోయటానికి ఉపయోగించేపేళ్ళ తో అల్లినబుట్ట ; **4**. చర్మానికి కలిగే పొడరోగం, సోబి.

**సిబ్బెత** రూ.చూ. సిబ్బితి. వి. సిగ్గు.

**సిబ్బెము**[1] రూ. సిబ్బి[2], సిబ్బియము. వి. **1**. బొల్లి, పొడ. వేంక. ఆం. 71 ; **2**. శోప.

సం. సిధ్మ -. బొల్లి. చర్మరోగ విశేషం ; ప్రా. సిబ్బ-, సింభ-; మరా. శిబే -; అ.మా. సింధు ; సిబ్బ- ; సింభ-, సింహ-. ఒకానొకకుష్ఠు ;

క. చిబ్బ, చిబ్బు, సిబ్బ, సిబ్బు. సిబ్బె. శరీరం లో ఏర్పడే ఒకపొడ ; తు. చిబ్బు, సుబ్బ ; త. ఉత్తి. పాము పడగ మీది పొడలు, శుభలక్షణ సూచకాలైన ఒంటి మచ్చలు ; గోం. సోపోరా. చర్మం మీది తెల్లటి పొడలు.

<ప్రా. సిబ్బ-.

**సిబ్బెము**[2] రూ.చూ. సిబ్బి[1]. విణ. సిబ్బి ఆకారంలో ఉన్నది ; వి. మూకుడు.

**సిమట్టు** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సిమద్వారం** రూ. శివద్వారం, సిమ్మద్వారం. వి. తలవాకిలి, ఇంటిలోని మొట్టమొదటి, పెద్దదైన, ముఖ్యమైన ద్వారం.

సం. సింహద్వార-. ప్రధానద్వారం.

<సం. సింహద్వార-.

**సిమాంట** వి. మొట్టమొదటిసారి.

<సం. శ్రీరామ-+అనుట.

**సిమిటిసారి** రూ.చూ. సిమెంటుసారె. వి. ఇనుపకడ్డీలకు సిమెంటు మెత్తి చేసిన సారె.

**సిమిటీ** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారు చేసిన మిశ్రమం.

**సిమెంటు** రూ. సిమట్టు, సిమిటీ, సిమ్టీ సిమ్టు, సిమ్మంటు, సిమ్మింటు, సిమ్మెటి, సిమ్మెటు, సిమ్మోంటు, సిమెంటు, సీమెంటు. వి. జిగురు మట్టి సున్నపురాయి కలిపి తయారు చేసిన మిశ్రమం.

ఇం. *cement*. గచ్చు.

<ఇం. cement.

**సిమెంటుబిళ్ళ** వి. సాంకేతికంగా 'మార్ల్' అని పిలవబడే ఈ సిమెంటురాయి ముఖ్యంగా సున్నం మెగ్నీషియాల కార్బనేట్లతో తయారైన ఒకరకం జిగురుమట్టిరాయి. **సిమెంటురంగు** రూ.చూ. సిమ్మోంటురంగు. వి. ఒకరకం బూడిద రంగు. **సిమెంటురాయి** వి. ఎర్రమొరంరాయి, ఇళ్ళు కట్టటంలోను, రోడ్లువేయటంలోను, అలంకరణసామగ్రిగాను ఉపయోగించేరాయి. సాంకేతికంగా సున్నపురాయి అని పిలవబడుతుంది. **సిమెంటురోడ్డంచు** వి. రంగుదారంతో పట్టెమాదిరిగా నేసిన అంచు. **సిమెంటుసారె** రూ. సిమిటి సారి. సిమ్మోంటుసాన. సీమట్టిసారి. వి. ఇనపకడ్డీలకు సిమెంటు మెత్తి చేసిన సారె. **సిమెంట్‌రంగు** రూ.చూ. సిమ్మోంటురంగు. వి. ఒకరకం బూడిదరంగు.

**సిమెంట్‌రంగు** చూ. సిమెంటు.

**సిమ్టీ** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి, సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సిమ్టు** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సింపించుకొను** చూ. చింపు. స.క్రి. ఒకరు తినేదాన్ని అసహ్యించుకొను.

**సింబారము** వి. ముక్కుతాడుతోపాటు అలంకారార్థం పశువుల మూతికి కట్టేతాడు.

**సింబిరిసన్నం** వి. ఒకరకంవడ్లు.

**సిమ్మంటు** రూ.మా. సిమ్మెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సిమ్మద్వారం** రూ.చూ. సిమద్వారం. వి. తలవాకిలి, ఇంటిలోని మొట్టమొదటి, పెద్దదైన ముఖ్యమైన ద్వారం

**సిమ్మానాని** రూ.చూ. సిమ్మానూనె. వి. కిరసనాయిలు, సీమనూనె.

**సిమ్మానూనియ** రూ.చూ. సిమ్మానూనె. వి. కిరసనాయిలు, సీమనూనె.

**సిమ్మానూనె** రూ. సిమ్మానూని, సిమ్మానూనియ. వి. కిరసనాయిలు, సీమనూనె.

సం. సీమన్. సరిహద్దు.

<సం. సీమన్+నూనె.

**సిమ్మాదిరప్పన్న** వి. అబోతు.

సం. సింహాద్రి-. సింహాచలం.

<సం. సింహాద్రి-+అప్పన్న.

**సిమ్మింటు** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారు చేసిన మిశ్రమం.

**సిమ్మెటి** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సిమ్మెటు** రూ.చూ. సిమ్మోంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి

కలిపి తయారు చేసిన మిశ్రమం.

సిమ్మెట్‌చక్రం రూ.చూ. సిమెంటుచక్రం. వి. ఇనప కడ్డీలకు సిమెంటు మెత్తి చేసినట్టి ఆధునికమైన సారె.

సిమ్మెట్‌చక్రం చూ. సిమ్మెటు.

సిమ్మెంటు రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి, సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

సిమ్మెంటుకలరు రూ. సిమ్మెంటుకల్లు. వి. సిమ్మెంటు రంగు, ఒకరకం బూడిదరంగు. ఇం. *colour*. రంగు. సిమ్మెంటు + ఇం. colour. సిమ్మెంటుకల్లు రూ.చూ సిమ్మెంటు కలరు. వి. సిమ్మెంటురంగు, ఒకరకంబూడిద రంగు. సిమ్మెంటుచక్రం రూ.చూ. సిమెంటుచక్రం. వి, ఇనప కడ్డీలకు సిమెంటు మెత్తి చేసిన ఆధునికమైన సా. సిమ్మెంటురంగు రూ. సిమెంటురంగు, సిమెంట్‌రంగు. వి. ఒకరకం బూడిదరంగు. సిమ్మెంటులైట్ వి. లేతబూడిద. రంగు. సిమ్మెంటుసాన రూ.చూ. సిమెంటుసారె. వి. ఇనపకడ్డీలకు సిమెంటుమెత్తి చేసినసారె.

సియాణిత రూ. సింహశిత్య. వి. గాయని. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 422. క్రీ.శ. 1269.

సిరం వి. ఆవు, గేదె మొ. వాటిచన్ను

సం. సిరా. బోలునరం, నాడి.

సిరకండె వి. పొదుగాటికంకి.

సిరకా వి. 1. పలిమెట్టు ; 2. పల్లబెట్టిన కడుగునీళ్ళు.

సిరంగఁడు వి. శ్రీరంగనాథుడు. పాంచాలీ. 1.21.

సం. శ్రీరంగ-. తమిళనాటఉన్న ఒకానొక వైష్ణవపుణ్య క్షేత్రంలోని దేవుడు

<సం. శ్రీరంగ-.

సిరంగము వి. శ్రీరంగక్షేత్రం. పాంచాలీ. 1.21.

సం. శ్రీరంగ-. తమిళనాటఉన్న ఒకానొక పుణ్య క్షేత్రం.

<సం. శ్రీరంగ-.

సిరంజి వి. ఇంజెక్షన్ చేయటానికి ఉపయోగపడే వైద్యుల పనిముట్టు.

ఇం. *Syringe*. పిచికారు, చిమ్మనగొట్టం.

<ఇం. Syringe.

సిరంజిచెక్క చూ. సిరంజి. వి. రంగులఅద్దకం తయారీలో వాడే ఒకరకం కొయ్యచెక్క.

సిరప్ వి. బలహీనతను లేదా రోగాన్ని తగ్గించటానికి ఉప యోగించే మధుర ద్రవపదార్థవిశేషం.

ఇం. *Sirup, Syrup*. షర్బత్, పానకం.

<ఇం. Sirup లేదా Syrup.

సిరమని రూ.చూ. చిరిమన. వి. వెలమ. నిర్మాణద్రవ్యంగా పనికివచ్చే ఉత్తమజాతికి చెందిన కలపనిచ్చేచెట్టు.

సిరము[1] వి. తల. కు. సం. 11.178.

సం. శిరస్. తల ; ప్రా. సిర-. మస్తకం, ప్రధానం, శ్రేష్ఠం. అగ్రభాగం ; అ.మా. పా. సిర- ; మా. గాకారీ. శిల- ; అప. సిరు ;

క. సిర, సిరసు. తల ; తు. సిర ; మ. చిరం.

<ప్రా. సిర-.

సిరము[2] విణ. చల్లనిది. విక్ర. 4.162.

సం. శిశిర-. ఋతువులలో ఒకటి, చల్లని.

సిరవాయి రూ. సిరోయి. వి. చేరు (మూత్రావయవం) వాపు, చేరుకూడ.

సిరసము వి. శిరీషపుష్పం. కవి. సంజీ.73.

సం. శిరీష-. దిరిసెనం ; ప్రా. సిరిస- ; అ.మా. సిరీస- ;

క. సిరసల, సిర్సల, సిరిస.

<ప్రా. సిరిస-.

సిరసు వి. శిరస్సు, తల. తాళ్ల. సం. 4.145.

సం. శిరస్. తల ; ప్రా. సిర-. మస్తకం, ప్రధానం, అగ్రభాగం ; అ.మా. పా. సిరం ; మా. శిల- ; అప. సిరు.

<సం. శిరస్.

సిరస్తాదారు రూ.చూ. శిరస్తాదారు. వి. 1. ఒకానొక ఉద్యోగి ; 2. లెక్కలు చూసేవారిపై ఉద్యోగస్థుడు.

సిరస్థాయి వి. చిరకాలం ఉండేది. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1250. క్రీ.శ. 1122.

సం. చిరస్థాయిన్. చిరకాలం ఉండేది.

<సం. చిరస్థాయిన్.

సిరా రూ. శిరా. వి. మసి, కాయి, ఇంక్.

సం. సిరా. రక్తనాళిక, గొట్టంలాంటిపాత్ర, ప్రవాహం, ఏరు ; ప్రా. సిరా. రక్తనాళం ; పా. సిరా. నరం.

<సం. సిరా.

సిరారంగు వి. 1. ఒకరకం నీలంరంగు ; 2. వయిలెట్‌లో లేతరంగు ; 3. వయిలెట్, సిరావన్నె కలిసిన రంగు.

సిరాజి[1] రూ.చూ. సిరాజీ[1]. వి. ప్రవాళం ; 2. ఒకానొక దేశం ; 3. తెల్లబట్ట ; 4. హద్దు.

సిరాజి[2] రూ. సిరాజీ[2]. విణ. శ్రేష్ఠమైంది.

సిరాజీ[1] రూ. సిరాజి[1]. వి. 1. ఒకానొకదేశం. మను. 4.28 ; 2. ప్రవాళం ; 3. తెల్లబట్ట ; 4. హద్దు.

హిం. సిరాజ్. శిరాజ్‌నగరం, సిరాజీ, శిరాజ్. గుర్రంలేక పావురం ; ఉ. షిరాజ్. ఇరాను దేశంలోని ప్రసిద్ధపురాతనపట్టణం, షిరాజీ, షీరాజ్. పట్టణసంబంధమైన.

<ఉ. షిరాజ్.

సిరాజీ[2] రూ.చూ. సిరాజి[2]. విణ. సంపూర్ణమైన నాణ్యత కలది.

సిరాణము వి. ఆయుధవిశేషం. ఉ.హరి. 4.413.

సిరాసి వి. మేల్బంతి.

సం. శ్రీరాశి-. సంపదలకురాసి.

<సం. శ్రీరాశి-.

సిరి వి. 1. సంపద. భార. అరణ్య. 2.111 ; 2. లక్ష్మి. భీమ. 5.52 ; 3. శోభ. తాళ్ల.సం. 4.25 ; 4. పీఠి బడిలో ముందు వచ్చినవారి చేతిలో పెట్టేగుర్తు ; 5. పేర్లకు మొదట చివర చేర్చే గౌరవసూచకమైన పదం.

సం. శ్రీ-. లక్ష్మి, సంపద, శోభ, సమృద్ధి ; ప్రా. సిరి,

సిరి. సంపద, సమృద్ధి, శోభ, వైభవం, లక్ష్మీదేవి : త్రై. మహా. సిరి ; శౌ. సిరి ; అ.మా. సిరి, సిరియా, సిరీ ; పా. సిరి, సిరీ ; అప. సిరి ; నాగరఅప. శిఅ ;

క. సిరి, సిరియ, తిర, తిరి, తిరు ; తు. సిరి, తిరి ; త. చిరి, చీ, తిరు ; మ. చిరి, చిరు, చీ, తిరి, తిరు.

<ప్రా. సిరీ-.

సిరికచ్చి వి. నేతలో రెండుపోగులమధ్య వచ్చిన వెలితి. సిరికమ్మి వి. 1. అద్దకమ్మి ; 2. తోరణం కమ్మి. సిరికైదండ(గొన్న)సామి వి. విష్ణుమూర్తి, సిరిచెలువుడు. సిరిగట్టు వి. శ్రీశైలపర్వతం. సిరిగంధము వి. 1 శ్రీచందన వృక్షం. వసు. 1.17 ; 2. చందనం. సం. శ్రీగంధ-. మంచిగంధం. సిరిగన్నతండ్రి(-కన్నతండ్రి) వి. సముద్రుడు. సిరిగేస్తు వి. విష్ణువు. సిరిచుక్క వి. వీథిబడుల్లో పిల్లలు తెల్లవారకముందే బడికి వచ్చేవారు. మొదటవచ్చిన వానికి సిరి, రెండవవానికి చుక్క అరచేతిలో పెట్టేవారు. ఆతర్వాత వచ్చినవారికి మూడుమొదలు వరసప్రకారం బెత్తంలో అన్నేసి దెబ్బలుకొట్టేవారు. అట్టిచుక్క. సిరిచూలి వి. శ్రీపుత్రుడు, మన్మథుడు. సిరిదొర వి. లక్ష్మీవల్లభుడు, విష్ణువు. సిరిపట్టి వి. లక్ష్మీకుమారుడు, మన్మథుడు. సిరిపింగణాలవృత్తి వి. చిన్నపిల్లలు ఆడేఆట. సిరిపిల్లడు వి. శ్రీపుత్రుడు, మన్మథుడు. వేంక. ఆం.8. సిరిపెనిమిటి రూ. సిరిపెన్మిటి. వి. లక్ష్మీవల్లభుడు, విష్ణువు. సిరిపెన్మిటి రూ.చూ. సిరిపెనిమిటి. వి. విష్ణువు. సిరిబద్ద వి. రీపరు పట్టె, ఇంటికప్పు వేయటంలో వాడేపలచని చెక్క. సిరిబొజ్జ వి. సిరివస్తూఉంటే పెరిగేబొజ్జ. సిరిమగడు వి. లక్ష్మీవల్లభుడు, విష్ణువు. సిరిమంతుడు విణ. శ్రీమంతుడు, ధనికుడు. సిరిమల వి. హిమవత్పర్వతం. సిరిమలల్లుడు వి. హిమవంతుని అల్లుడు, శివుడు. <సిరిమల+అల్లుడు. సిరియన్న(-అన్న) వి. చంద్రుడు. సిరిరాచవేలుపు రూ. సిరిరాచవేల్పు. వి. విష్ణువు. సిరిరాచవేల్పు రూ.చూ. సిరిరాచవేలుపు. వి. విష్ణువు. సిరిలెపలు వి. భూముట్టం, నేలతో సమానమైన ఎత్తు. సిరిల్లు వి. డబ్బు దాచుకునేగది. <సిరి+ఇల్లు. సిరివరుడు వి. విష్ణువు. సం. శ్రీవర-. శ్రీపతి, విష్ణువు. సిరిసంపద వి. ధనం, పశువులు మొ.వి. సిరిసారబ వి. ఒకరకం వడ్లు. సిరిసింగణాలవృత్తి రూ.చూ. సిరిసింగనాలవృత్తి. వి. బాలక్రీడావిశేషం. సిరిసింగణావృత్తి రూ. సిరిసింగనవృత్తి. వి. బాలక్రీడావిశేషం. కాళ. 3.33. సిరిసింగనవృత్తి రూ.చూ. సిరిసింగణావృత్తి. వి. ఒకరకమైన పిల్లలఆట. తాళ్ల.సం. 10.172. సిరిసింగనవృత్తి చేయు అ.క్రి. ఆటలాడు. నలచ. 3.142. సిరిసింగనాలవృత్తి రూ. సిరిసింగణాలవృత్తి. వి. బాలక్రీడావిశేషం. రాజవా. 2.23. సిరులు వి.బ.వ. గ్రామదేవతల జాతర్లు.

సిరిచాప రూ.చూ. చిరుచాప. వి. 1. సన్నటితుంగపోచల్తో రంగురంగులుగా అల్లిన మెత్తటిచాప ; 2. చిన్నచాప.

సిరిటిగూడ రూ.చూ. సురిటిగూడ. వి. చేగూడ, సింగిగూడ.

సిరిట్‌లెవలు రూ. సురుటిలెవిలి, స్పిరిట్‌లెవెలు. వి. మట్టం సరిచూడటానికి తాపీపనివాళ్ళు వాడే చిన్నపరికరం. ఇం. *Spirit*. స్పిరిటు. *Level*. సమానం.

<ఇం. Spirit + ఇం. Level.

సిరిడి వి. ద్వారం ముందు చదునుగా ఉండే అరుగు.

సిరినామ రూ.చూ. చిరునామ. వి. చిరునామ. బే.ప. 80.

సిరిపక్క రూ చూ సిడిపక్క. వి. పాత్రమూతుకిందఉన్న పొట్టభాగం.

సిరిమని రూ.చూ. చిరిమన. వి. వెలమ, నిర్మాణద్రవ్యంగా పనికివచ్చే ఉత్తమ జాతికి చెందిన కలపనిచ్చే చెట్టు.

సిరిమను రూ.చూ. చిరిమన. వి. వెలమ, నిర్మాణద్రవ్యంగా పనికివచ్చే ఉత్తమజాతికి చెందిన కలపనిచ్చే. చెట్టు.

సిరిమల్లె రూ.చూ. చిరిమల్లె. వి. తెల్లని సువాసన గల్గిన పూల మొక్క.

సిరిమానుఅంటు వి. సిరిమాను చెట్టు జిగురు, పట్టుపడుగుకు పెట్టే గంజిలో కలిపే జిగురు.

సిరిముట్టె వి. సిగమోర, తాడుకోగాని, తోలుకోగాని అల్లి మూతికి తగిలించే అలంకారం.

సిరివేరుచాయ రూ. సిరివేరుసాయ. వి. ఒకరకం ఎరుపు రంగు, చిక్కటి రక్తంరంగు.

సిరివేరుసాయి సిరివేరుచాయ. వి. ఒకరకం ఎరుపు రంగు, చిక్కటి రక్తంరంగు.

సిరిసము వి. శిరీషం. కవిసంశ. 73.

సం. శిరీష-. దిరిసెనం ; ప్రా. సిరిస-, సిరీస-. అ.మా. సిరీస-.

< ప్రా. సిరిస-.

సిరునామ రూ.చూ. చిరునామ.వి. అడ్రెసు.

సిరునామా రూ.చూ. చిరునామ. వి. అడ్రెసు.

సిరులు చూ. సిరి.

సిరుసు వి. ఒకచెట్టు.

హిం. సిరస్. ఒకరకంచెట్టు.

<హిం. సిరస్.

సిరేలుబుడ్డి వి. ప్రయాణంలో ఎడ్లకు దానా పెట్టటానికి ఉదక బెట్టిన ఉలవల్నిపోసుకొని బండికి కట్టుకొనిపోయే మట్టిపాత్ర.

సిరోయి రూ.చూ. సిరవాయి. వి. చేరు (మూత్రావయవం) వాపు, చేరుమాద.

సిర్కా వి. వినిగరు, పులియటానికి చేసే రసవిశేషం. హిం. సిర్కా. వండి పులియపెట్టబడ్డ చెరకు మొ. వాటి రసం ; ఉ. పార. సిర్క, సిర్కా ; క. సిర్కా ; మ. సుర్క.

<ఉ. సిర్కా.

సిర్కాలివ్ రూ.చూ. సిల్కాలివు. వి. 1. పాచిరంగులో లేత పన్నె ; 2. పేడరంగు.

సిర్వేరురంగు రూ.చూ. సిర్వేరిరంగు. వి. ఒకరకం ఎరుపు రంగు, చిక్కటిరక్తంరంగు, సిర్వేరిచెట్టుచెక్క పొడిచేసి తయారు చేసినరంగు.

సిఱ్ఱులు చూ. చిఱ్ఱు. వి. కోపం.

సిల[1] వి. సత్ప్రవర్తన. E.I. సంపు. 32.1

నం. శీల-. స్వభావం, అలవాటు ; ప్రా. పా. సీల-.

ప్రవర్తన, సత్ప్రవర్తన ; హిం. సీల్. అభిరుచి.

<ప్రా. సీల.

సిల[2] వి. సెలయేరు, నీటిపట్టు.

సం. శిలా. రాయి ; ప్రా. సిలా. రాయి, శిలాజిత్తు.

<ప్రా. సిలా.

సిల[3] యా.చూ. సెల. వి. రాయి.

సిలక రూ.చూ. సిల్కు[1]. వి. 1. పట్టుపురుగుల నుంచి వచ్చేదారం ; 2. ఒకరకం కృత్రిమపుపట్టు.

సిలకపంటె రూ.చూ. సిల్కుపంటె. వి. పట్టుదారం చుట్టే కొయ్య పనిముట్టు. సిలకమైజారు రూ.చూ. సిల్కుమైజారు. వి. పట్టునూలు పెట్టి నేసిన పైటకొంగు.

సిలప రూ.చూ. సలప[2]. వి. రాతిబండలోని పగలగొట్టబడిన పల్చని భాగాలు.

సిలపర వి. పాటు, గోడకట్టేటప్పుడు కొన్నిరాళ్ళు లోపలకు కొన్నిబయటకు ఉండేటట్లు పేర్చి చివరలు వదిలివేయగా వాటిలో లోపలకున్నరాయి.

సిలలు వి.బ.వ. 1. దారులింగాలు ; 2. సంసార్ల అపరక్రియల్లో పూజకు నెలకొల్పే ఇటుకరాతిలింగాలు. వీటికే అదరింపుగా పోసేసీన్నీళ్ళు అనేనీటి అభిషేకం చేస్తారు ; 2. దేవతలనే భావంతో ఉంచిన రాళ్ళు, శిలలు.

సం. శిలా. రాయి ; ప్రా. సిలా.

<ప్రా. సిలా+-లు.

సిలలునిలుపు స.క్రి. సంసార్ల అపరక్రియల్లో రాతి లింగాల్ని నిలబెట్టు.

సిలాజితు రూ. సలాజత్తు. సిలాజిత్తు. వి. ఒకానొక మందు దినుసు.

సం. శిలాజిత్. జేగురువాటుమచ్చ తైలం ; ప్రా. సిలాజతు.

<సం. శిలాజిత్.

సిలాజిత్తు రూ.చూ. సిలాజితు. వి. ఒకానొక మందు దినుసు.

సిలాబు రూ.చూ. శ్లాబు. వి. పడతరం, సిమెంటు పోతపోసి తయారుచేసిన కప్పు.

సిలారునేత వి. పడుగుకు రెండురంగులూ పేకకు ఒకరంగూ పెట్టి నేసిన నేత.

సిలిండరు వి. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు.

ఇం. *Cylinder*. స్థూపాకారం, స్థూపం.

<ఇం. Cylinder.

సిలింపిడత వి. శవాన్నికాల్చిన బూడిదను నదిలో కలపటానికి ఎత్తుకొనిపోయే మట్టిపాత్ర.

<చిలుము[1]+పిడత.

సిలుకు[1] రూ.చూ. సిల్కు[1]. వి. 1. పట్టుపురుగుల నుండి వచ్చేదారం ; 2 ఒకరకం కృత్రిమపుపట్టు.

సిలుకుపేటిఅంచు రూ.చూ. సిల్కుపేటంచు. వి. పట్టులో డిజైను పడేట్టు నేసిన ఒకరకం అంచు. సిలుకులడి రూ.చూ. సిల్కులడి. వి. పట్టుదారం లెక్క.

సిలుకు[2] రూ.చూ. చిలుకు[1]. వి. పట్టు, భూఖండం పంచుకున్న నేలలో ఒకముక్క.

సిలుకు[3] రూ.చూ. శిలుకు. వి. 1. అనిశ్చితమైన, తీర్పు చెప్పని ; 2. నిలవ.

సిలుగందు చూ. సిలుగు.

సిలుగు రూ. శిలుగు, సిలువు. వి. 1. ఉపద్రవం. హరి. 9.47 ; 2. హాని ; 3. కష్టం.

క. సిలుకు, సిల్కు. కష్టమైన, చిల్లతన. కష్టం ; త. చిలుకు. కష్టం, తగవు, అడ్డంకి ; మ. చిలుకు. కష్టం, చిలుకన్. తగవుల మారి ;

పో. చూ. సం. శూల-. త్రిశూలం, అపరాధుల్ని కొరతవేసే కొయ్య, ఓర్వరానిబాధ, వాతరోగం.

సిలుగందు అ.క్రి. కష్టపడు. తాళ్ల.సం. 3.40. <సిలుగు + అందు. సిలుగుచింతలేకయుండు అ.క్రి. చీకూచింతా లేకుండా ఉండు. ఉ.హరి. 5.280. సిలుగులపెట్టు స.క్రి. కష్టపెట్టు. విక్ర. 5.20.

సిలువ వి. క్రీస్తును బంధించి వధించిన కొర్రు.

నం. శల్యక-. ఈటె, ముల్లు, పేడు, ముళ్ళపంది ; ప్రా. సల్లగ- ముల్లు, ఈటె ; పా. సల్లక-. బాణం, పొడిచేముల్లు ; హిం. సాల్.

సిలువవేయు స.క్రి. కొర్రునగుచ్చి చంపు.

సిలువా వి. కాశెగడ్డితో అల్లిన, అలంకరణకు పనికి వచ్చే పరదా చాప.

సిలువు రూ.చూ. సిలుగు. వి. 1. ఉపద్రవం ; 2. హాని ; 3. కుష్ఠు.

సిలువేరు వి. కొట్టవచ్చినట్లుండే ఎర్రరంగు, ముదురు ఎరుపు.

సిలేటుకలర్ రూ.చూ. స్లేట్‌కలర్. వి. బలపంరాయిరంగు.

సిల్కాలివు రూ. సిర్కాలివ్, సిల్కాలీబు. వి. 1. పాచిరంగులో లేతవన్నె ; 2. పేడరంగు.

ఇం. *Silk Olive*. పట్టు ఆలివ్.

<ఇం. Silk Olive.

సిల్కాలీబు రూ.చూ. సిల్కాలివు. వి. 1. పాచిరంగులో లేత పన్నె ; 2. పేడరంగు.

సిల్కు[1] రూ. సిలక, సిలుకు[1]. వి. 1. పట్టుపురుగుల నుంచి వచ్చేదారం ; 2. ఒకరకం కృత్రిమపు పట్టు.

ఇం. *Silk*. పట్టు.

<ఇం. Silk.

సిల్కుపంటె రూ. సిలకపంటె. వి. పట్టుదారం చుట్టే కొయ్యపనిముట్టు. సిల్కుపేటంచు రూ. సిలుకుపేటి అంచు. వి. పట్టులో డిజైను పడేట్టు నేసిన ఒకరకం అంచు. సిల్కుమైజారు రూ. సిలకమైజారు. వి. పట్టునూలు పెట్టినేసిన పైటకొంగు. సిల్కులడి రూ. సిలుకులడి. వి. పట్టుదారం లెక్క.

సిల్కు[2] రూ చూ. శిలుకు. వి. 1. అనిశ్చితమైన, తీర్పుచెప్పని ; 2. నిలవ.

సిల్వరుపట్టె వి. మరాను కట్టుబడిలో పడుగు పోగులు దూర్చే బెజ్జాలుగల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్య పట్టె.

సిల్పం వి. పూత.

సిల్ల చూ.రూ. సీల. వి. కర్రమేకు, కొయ్యతో చేసినమేకు.

సిల్లకంప వి. ముళ్ళులేని చిల్ల చెట్లకంప.

**సిల్లఱసుంకము** వి. చిల్లర వస్తువులపై విధించబడేపన్ను. నె.శా. ఒంగోలు. 58. క్రీ.శ. 1620.

< చిల్లర + సుంకము.

**సిల్లసెలు** వి.బ.వ. ఒకరకం కలుపు మొక్క.

**సిల్లులుకుండ** వి. ఎర్రగుడ్డలు మొ. వి వేసిపెట్టటానికి బెజ్జాలుండే మట్టిపాత్ర.

< చిల్లు[3] + - లు + కుండ.

**సిల్వర్‌గ్రే** వి. ఒకరకం బూడిదరంగు.

ఇం. *Silver grey.* ఒకరకం బూడిదరంగు.

< ఇం. Silver grey.

**సిల్వర్‌రంగు** వి. అల్యూమినియంరంగు,

ఇం. *Silver.* వెండి.

< ఇం. Silver + రంగు.

**సిల్వరుతాంబుచీర** వి. అంచులో తెల్లగీరలు పడేట్టు నేసినచీర.

ఇం. *Silver.* వెండి.

**సిల్వరురుమాలు** రూ. సిల్వ్రరుమాలు. వి. తెల్లనూలుతో చేసిన తలపాగ.

ఇం. *Silver.* వెండి.

< ఇం. Silver + రుమాలు.

**సిల్వ్రరుమాలు** రూ.చూ. సిల్వరురుమాలు. వి. తెల్లనూలుతో నేసిన చీర.

**సిల్వేరిచెక్కరంగు** వి. ఒకరకం ఎరుపురంగు.

**సిల్వేరిబండ** వి. సిల్వేరి చెక్క పొడుం కొట్టేరాయి,

**సిల్వేరిరంగు** రూ. సిర్వేరురంగు. వి. ఒకరకం ఎరుపురంగు. చిక్కటిరక్తంరంగు, సిల్వేరి చెట్టు చెక్కపొడి చేసితయారు చేసిన రంగు.

**సిళ్లు** చూ. సిడి[1].

**సివ** వి. చిట్టె, వెదురువాసం.

సం. శివ -. శుభం, మేలు, శివుడు ; ప్రా. సివ -. మంగళం, మంగళయుక్తం, శివుడు.

< ప్రా. సివ -.

**సివంగి** రూ.చూ. చివ్వంగి, వి. **1.** సివంగిలా ఉండేకుక్క. మను. **4.32** ; **2.** సివగి ; **3.** కస్తూరి.

**సివంగితనము** వి. కసురుబోతుతనం.

**సివగి** రూ.చూ. చివ్వంగి. వి. సివంగి.

**సివచెన్నంగి** వి. చెన్నంగిలో ఒకరకం ఆకెరువుమొక్క. (Lagerstraenta Species).

**సివమాడు** చూ. సివము.

**సివము** రూ. సిగము. వి. **1.** ఆవేశం. ఆం.భా. 1.142 ; **2.** దైవం శరీరం మీదకి రావటం, పూనకం.

సం. శివ -. శుభకరం, సౌఖ్యకరం ; ప్రా. సివ -. మంగళం, సుఖం, అహింస, ముక్తి ; పా. సివ - ; అ.మా. సివ ; అప. సిఅ, సివ- ;

క. సివ. సివె.

< ప్రా. సివ -,

**సివమాడు** అ.క్రి. దయ్యం పట్టి ఆడు. అష్టమ. క. 2095. < సివము + ఆడు. **సివముపుట్టించు** స.క్రి. ఆవేశం కలిగించు. హంస. 2.90. **సివములాడు** అ.క్రి. ఆవేశపడు. రాధా. 5.113. < సివము + లు + -.ఆడు. **సివములెత్తు** స.క్రి. ఆవేశం కలుగు. హంస. 1.266. < సివము + -లు + ఎత్తు[1]. **సివమెత్తు** అ.క్రి. దైవావేశమగు, < సివము + ఎత్తు[1]. **సివవెఱ్ఱి** వి. మిక్కలివెర్రి. వైజ. 4.53. < సివము + వెఱ్ఱి. **సివసత్తి** వి. శ్రీదేవతా విశేషం. వైజ. 3.31.

**సివమెత్తు** చూ. సివము.

**సివర** రూ. సిబురు. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సివరతొడుగు** రూ. చివరతొడుగు. సిగిరెతొడుగు. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సివవెఱ్ఱి** చూ. సివము.

**సివసత్తి** చూ. సివము.

**సివసివా** అవ్య. ఏమీ తెలియక అనటం.

సం. శివ -. శివుడు ; ప్రా. పా. సివ -.

< ప్రా. సివ -. + సివ -.

**సివా** రూ. శివాయి[1], సివాయి. అవ్య. **1.** తప్ప, కాక ; **2.** వేరుగా ; **3.** మించి, పైన ; **4.** లేకుండా,

హిం. ఉ. సివా, సివాఇ. తప్ప, కాక, ఎక్కువ, మేలైన, లేకుండా, జరిగిపోయిన, పైన. మీద.

< ఉ. సివా.

**సివాగం** వి. అచ్చులికే బద్దెపోగులపాయ.

**సివాగులు** వి.బ.వ. అచ్చులికే బద్దెపోగులపాయలు.

**సివాగులు** చూ. సివాగం.

**సివాబండి** వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**సివాయి** రూ.చూ. సివా. అవ్య. తప్ప, కాక.

**సినారకుండలు** వి బ.వ. పెళ్ళిపందిట్లో సీళ్ళుపోసి పెట్టే కుండలు.

**సివారు**[1] రూ.చూ. శివార. వి. **1**, మెరిసేపూత ; **2.** సున్నపు పూతమీది మెరుగు.

**సివారు**[2] రూ.చూ. శివారు. వి. పెద్దగ్రామానికి చేరిఉండే చిన్నపల్లె.

**సివిలు** విశ. ఆస్తివిషయమైనది.

ఆం. *Civil.* పౌరసంబంధి.

< ఇం. Civil.

**సివెంటు** రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

**సివ్వంగి** రూ.చూ. చివ్వంగి. వి. సివంగి.

**సివ్వగి** రూ.చూ. చివ్వంగి. వి. సివంగి.

**సిష్టనం** రూ.చూ. సిష్టం. వి. ఆచారం, కట్టుబాటు, మర్యాద.

**సిష్టం** రూ. సిష్టనం. వి. ఆచారం, కట్టుబాటు, మర్యాద.

ఇం. *System.* పద్ధతి, కట్టుబాటు.

< ఇం. System.

**సిసకమ్మరి** వి. చొప్పలాగా ఇంటికప్పుమీద పరవటానికి పనికివచ్చే ఒకరకం గడ్డి.

**సిసల్** రూ. సిసలు. విశ. నిర్ధారణమైన.

బెం. ఒ. హిం. ఉ. సిసల్. నిశ్చితమైనది.

< ఉ. సిసల్.

**సిసలు** రూ.చూ. సిసల్. విణ. నిర్ధారణమైన ; వి. 1. వంశమూలం ; 2. మేలైన ; 3. యోగ్యమైన ; 4. సరైన, సక్రమమైన కొలతగా ని, లెక్కగాని.

**సిసింద్రీ** విణ. చురుకైన ; వి. ఒకరకం బాణసంచా.

**సిసువరకము** చూ. సిసుడు.

**సిసుడు** రూ.చూ. సిసువుడు. వి. శిష్యుడు. సాంబ-దేవ.19.

సిసువరకము వి. శుశ్రూష.

**సిసువు** వి. బిడ్డ, పసిబిడ్డ. పండి. చ. 4.217.

సం శిశు -. పసిబిడ్డ ; ప్రా. సిసు, సుసు. బిడ్డ ; అ.మా. పా. సుసు ;

క. సిసు.

< ప్రా. సిసు -.

**సిసువుడు** రూ. సిసుడు. వి. శిష్యుడు. తాళ్ల.సం. 5.158.

సం. శిష్య-. విద్యార్థి, అనుయాయి, ప్రా. సిస్స-విద్యార్థి, ఛాత్రుడు ; జై. మహా. సిస్స-, సీస-, సీసగ-శౌ. సిస్స-, సిస్సా. ; అ.మా. సిస్స-. అనుయాయి, శిష్యుడు, విద్యార్థి, సిస్సణీ. విద్యార్థిని, సీస-. విద్యార్థి, సీసగ-;

త. చీటన్. విద్యార్థి ; మ. శిష్టియన్. సేవకుడు.

< ప్రా.సిస్స-.

**సిస్తచ్చు** చూ. సిస్తు.

**సిస్తు**[1] విణ. అందమైంది. ఉ.రా. 4.176 ; వి. 1. సొంపు. ఉ.రా. 4.237 ; 2. అందం. భాను. 2.212.

సిస్తచ్చు వి. ఒకరకం అచ్చు, ఎక్కువ పుంజాల నూలు పడుగు అతికి నేసే అంచు. < సిస్తు[1]+అచ్చు. సిస్తుచేయు. స.క్రి. చక్కజేయు సిస్తుపఱచు స.క్రి. సొంపుచేయు, చక్క చేయు ఇలా. 180.

**సిస్తు**[2] రూ.చూ. శిస్తు. వి. 1. కప్పం. రంగా. చ. 2.33 ; 2. పన్ను. 3. రాజసందర్శనంవేళ ఇచ్చే కానుక.

**సిస్సాల** విణ. మూడేళ్ళకొకమారు వచ్చేది.

హిం.ఉ. సాల్. సంవత్సరం.

**సీ**[1] రూ.చూ. చీ. అవ్య. జుగుప్సాసూచకమైన అవ్యయం.

సీకొట్టురూ.చూ. చీకొట్టు. స.క్రి. 1. చీచీ అను, ధిక్కరించు ; 2. అవమానించు. సీముసురు వి. ఆగిఆగి వచ్చే వాన. సీసీ రూ.చూ. చీచీ. అవ్య. 1. ధిగర్థకం ; 2. నిందార్థకం ; 3. ఈసడింపును తెలిపే అర్థం.

**సీ**[2] వి. 1. సంపద ; 2. పూజ్యతావాచకం.

సం. శ్రీ.- మంగళకరమైన, సంపద ; ప్రా. సి. అప. సి.

< ప్రా. సీ.

సీఅగిసె వి. ఒకరకం అగిసె. సీరాముడు వి. శ్రీరాముడు. మను. 4.16. సం. శ్రీరామ-.దాశరథి. సీరాముసేవ వి. శ్రీరాముని సేన.

**సీకరిణి** వి. అరటి, మామిడిపళ్ళు తరిగి చక్కెరవేసి చేసిన ఫలహారం.

**సీకాయ** రూ. షీకాయ, షీకాయి, సిక[2], సీకాయి. వి. శిఖాఫలం నూనె మొ. వాటి జిడ్డు పోగొట్టే దినుసు (Acacia concinna).

క. సీగె. పొదలాంటిది; తు.సీగె, సిగె-కాయి. సీకాయ పొడి, తలస్నానానికి వాడేది ; త. చి-క్కాయ్. చియ-క్కాయి. జుట్టురుద్దుకొనేది : మ. చీక్క-క్కాయి. చీయ-క్కాయి. జుట్టురుద్దుకొనేది ; కో. సిక్సె.

సీకాయచెట్టు రూ. షీకాయచెట్టు, షీకాయిచెట్టు, సీకాయి చెట్టు. వి. షీకాయచెట్టు. అం.భా. 2.70.

**సీకాయి** రూ.చూ. సీకాయ. వి.శిఖాఫలం, నూనె మొ. వాటి జిడ్డు పోగొట్టే దినుసు (Acacia concinna).

సీకాయిచెట్టు రూ.చూ. సీకాయచెట్టు. వి. షీకాయ చెట్టు.

**సీకారి**[1] వి. గాయకుడు, పాటగాడు.

**సీకారి**[2] రూ.చూ. షికారీ. వి. వేటగాడు, యోధుడు. యయా. 4.12.

**సీకి**[1] వి. రేగు, వాడైన సన్నటిముళ్ళు, పగుళ్ళతో కూడిన ఋడిదరంగు బెరడు, పంగలకొమ్మలు, పసుపుపచ్చటి పూలు ఉండి 10-20 అడుగుల ఎత్తు పెరిగే ముళ్ళచెట్టు. దీనికొమ్మలు కంచెగా వేస్తారు. పళ్ళుతింటారు. దీని ఆకు జిగురు, పళ్ళు వైద్యంలో ఉపయోగిస్తారు (Tizyphus jujuba).

**సీకి**[2] వి. పరిగి, నల్లటిపళ్ళు తినటానికి కొమ్మలు కంచెకు పనికివచ్చే పొదగా పెరిగే ముళ్ళమొక్క (Pterolobium indicum).

**సీకిరి** రూ చూ సిగిరి. వి. వాటకుండలోని బురదమన్ను.

సీకిరికుండ రూ. చేగిలికుండ సిగిరికుండ, సిగిల్కుండ, సీకిలికుండ వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకొనే నీళ్ళకుండ.

**సీకిలి** రూ.చూ. సిగిరి. వి. వాటకుండలోని బురదమన్ను.

సీకిలికుండ రూ.చూ. సీకిరికుండ. వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకునే నీళ్ళ కుండ. సీకిల్జట్టి రూ.చూ. సీకిల్సట్టి. వి కుండలు వానేటప్పుడు చేతికొచ్చిన బురదను వేయటానికి మట్టిని తడుపు కోవటానికి కుమ్మరి సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర. సీకిల్సట్టి రూ. సీకిల్జట్టి, వి. కుండలు వానేటప్పుడు చేతికొచ్చిన బురదను వేయటానికి మట్టిని తడుపు కోవటానికి కుమ్మరి సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర.

**సీకిల్జట్టి** చూ. సీకిలి.

**సీకిల్సట్టి** చూ. సీకిలి.

**సీకు**[1] రూ.చూ. చీకు[2]. వి. జబ్బు ; విణ. ఆరోగ్యంలేనివాడు, ఆరోగ్యంలేనిది.

**సీకు**[2] వి. 1. రాటి తిరగడానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; 2. పడుగు చివరిభాగంలో ఎక్కించినసక్ర ; 3. రంగునీళ్ళ అండాలో ఉడకబెట్టటానికి నూలులడేలు తగిలించిన ఇనప ఊస.

**సీకులు** వి.బ.వ. సలాకలు.

**సీగాడు** వి. భరతపక్షి (Myrrhulandu grisea).

**సీగిరి** రూ.చూ. సీవిరి[1]. వి. 1. వింజామర. భార. శాంతి. 1.351 : 2. ఆలవట్టం.

**సీగిలి** రూ,చూ. సిగిరి. వి. వాటకుండలోని బురదమన్ను.

**సీటిబల్ల** రూ. సీటుబల్ల. వి. తూర్వారపోసేమనిషి కూర్చోవటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

ఇం. *seat*. ఆసనం.

< ఇం. seat + బల్ల.

**సీటుబల్ల** రూ.చూ. సీటిబల్ల. వి. తూర్వార పోసేమనిషి కూర్చోటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

**సీడ**[1] రూ.చూ. చీడు. వి. **1.** సస్యాదులకు కలిగే వ్యాధి; **2.** బాధ; **3.** పైరు చెరిచే పురుగు; **4.** గజ్జి.

**సీడ**[2] రూ.చూ. సీడు. **1.** బండి జల్ల తెరచి ఉన్నవైపు. **2.** బండి జల్ల తెరచి ఉన్నవైపు అడ్డం పెట్టిన తడిక లేక చొప్పకట్ట.

**సీడి** రూ.చూ. సీడు. వి. **1.** నూలులెక్క, లడీలో పదోవంతు నూలు; **2.** లడీలో అయిదోవంతు నూలు; **3.** 80 నెంబరు లడీలో ఇరవయ్యోవంతు నూలు; **4.** ఒకలడీనూలు; **5.** అనులుపడకుండా ఆనుపోసిన నూలు; **6.** పడుగులో సగం నూలు; **7.** పడుగులో కొంతభాగం నూలు; **8** ఆను పొయ్యటం ఉపవృత్తిగాకల రైతులు మొ. వారు అనులు లేకుండా పోసిన నూలు; **9.** ఆనుపోసిన నూలు నేతలో నిలుపునకు వాడే నూలు; **10** పడుగులో విడదీసిన కొంత భాగం; **11.** పెట్టెలో ఉండే నూలుకట్ట.

**సీడీ** రూ.చూ. చీడీ. వి. మెట్లు ఎక్కటానికి దిగటానికి పనికి వచ్చేటట్లు కట్టిన నిర్మాణం.

**సీడు** రూ. చీడి, చీడు[1], పీడు, సిగుడు, సిడె[3], సీడి, సీలు[2]. వి. **1.** నూలులెక్క, లడీలో పదోవంతు నూలు; **2** లడీలో అయిదోవంతు నూలు; **3** 80 నెంబరు లడీలో ఇరవయ్యోవంతు నూలు; **4.** ఒకలడీనూలు; **5.** అనులు పడకుండా ఆనుపోసిన నూలు.;

**సీడె** రూ.చూ. సీడి. వి. **1.** బండిజల్ల తెరచి ఉన్నవైపు; **2** ఎరువు కంకులంతోలే బండి జల్ల తెరచి ఉన్నవైపు అడ్డంపెట్టిన తడిక లేదా చొప్పకట్ట; **3.** పడుగులో సగంనూలు; **4.** పడుగులో కొంత భాగం నూలు; **5.** ఆనుపొయ్యటం ఉపవృత్తిగాకల రైతులు మొ. వారు అనులు లేకుండా పోసిన నూలు; **6.** ఆను పోసిన నూలు, నేతలో నిలువుకు వాడే నూలు. **7.** పడుగులో విడదీసిన కొంతభాగం; **8.** పుంజంతక్కువవార.

**సీడుకొయ్య** వి. ఆనుపోసేగొట్టం, పోగు తీసుకొని ఆనుపోసేగొట్టం. **సీడుజరుపు** స.క్రి. అచ్చుతికిన పడుగులో ఆతుకుపోగులు అచ్చులోనుంచి పన్నె ఇవతలకు జరుపు. **సీడుపోయు** అ.క్రి. ఆనుగొట్టంలోకి పోగతీసుకొని ఆను కొయ్యలకు చుట్టి వచ్చేట్టుచేయు. **సీడుమాను** వి. పడుగు నూలు పోసే కొయ్యపనిముట్టు. **సీడులాక** రూ సీల్లాక. వి. పడుగులో మొదటదూర్చినలాక.

**సీతకలరు** రూ. సీతక్రలు. వి. ఒకరకం రంగు, కాఫీరంగుమాదిరిరంగు.

సం. సీతా. జానకి.

ఇం. Colour. రంగు.

< సం. సీతా + ఇం. Colour.

**సీతక్రలు** రూ.చూ. సీతకలరు. వి. ఒకరకం రంగు, కాఫీరంగు మాదిరిది.

**సీతకాటుకలు** వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. సీతా. జానకి.

**సీతకుండ** రూ. శీతకుండ, సీతపుకుండ, సీతవకుండ, సీతాకుండ, సీతాయకుండ, సేతకుండ. వి. దిష్టికుండ, పంటకు దిష్టి తగలకుండా సున్నంతోగాని, మసితోగాని బొట్లుపెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ.

సం. శీత.-.చల్లని, సీతా. జానకి.

**సీతడీప్** వి. ఒకరకం ముదురురంగు, లేతకాఫీరంగు.

సం. సీతా. జానకి.

ఇం. *Deep*. లోతు.

**సీతతలంబ్రాలు** వి.బ.వ. జల్లికంకి, తెల్లటిపెద్దగింజరకాలు.

సం. సీతా. జానకి.

**సీతపుకుండ** రూ.చూ. సీతకుండ. వి. కప్పుమీద కర్రకు గుచ్చి తగిలించే కుండ.

**సీతఫలం** రూ.చూ. సీతాఫలం. వి. గగ్గురు, సీతాఫలం.

**సీతభేది** వి. ఆము విరేచనం.

సం. శీత, చల్లని, భేదిన్. భేదించేది, చీల్చేది.

< సం. శీతభేదిన్.

**సీతమ్మజొన్న** వి. తెల్లటి పెద్దగింజరకాలు.

సం. సీతా. జానకి.

< సం. సీతా + అమ్మ + జొన్న.

**సీతమ్మపురుగునూలు** వి. వానాకాలంలో పొదలమీద అల్లుకొనే ఒకతీగ.

సం. సీతా. సీత.

< సం. సీతా + అమ్మ + పురుగు + నూలు.

**సీతమ్మవారిచిక్కుళ్ళు** వి.బ.వ. చిక్కుళ్ళలో ఒకరకం.

సం. సీతా. జానకి.

**సీతమ్మవారిజళ్ళు** వి.బ.వ. సీతమ్మవారినవరం (Iponaea angustifolia).

సం. సీతా. జానకి.

**సీతవకుండ** రూ.చూ. సీతకుండ. వి. దిష్టికుండ, పంటకు దిష్టి తగలకుండా సున్నంతోగాని, మసితోగాని బొట్టుపెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ, పంటచలవకు నిలిపినకుండ.

**సీతసాగరాలు** వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. సీతా. జానకి. సాగర-. సముద్రం.

**సీతాకుండ** రూ.చూ. సీతకుండ. వి. దృష్టిదోషం తొలగించటం కోసం సున్నంపూసి నల్లని చుక్కలుంచే దిష్టికుండ.

**సీతాకోకచిలుక** వి. చిత్రవర్ణమయమైన పెద్దరెక్కలున్న ఒక పురుగు.

సం. సీతా. జానకి.

**సీతాఫలం** రూ. సితపలక, సీతఫలం. వి. గగురు, బొడిపెలు, తొక్కుగల పళ్ళు, నల్లటివిత్తనాలుఉండి పొదగా 15-20 అడుగులు ఎత్తుపెరిగే చెట్టు. దక్షిణఅమెరికా నుంచి తెచ్చినది. ఆకును పచ్చిఎరువుగా ఉపయోగిస్తారు (Anona Squamosa).

నం. సీతాఫల-. ఫలవిశేషం.

<నం. సీతాఫల-.

**సీతాభోగములు** వి.బ.వ. వడ్లలో భేదం.

నం. సీతాభోగ-. జానకీవైభవం.

<నం. సీతాభోగ- (అర్థవిపరి.).

**సీతాయకుండ** రూ.చూ. సీతకుండ. వి. దిష్టికుండ, పంటకు దిష్టి తగలకుండా సున్నంతోగాని, మసితోగాని బొట్లుపెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టినకుండ, పంట చలవకు నిలిపినకుండ.

**సీతారామకోరు** అ.క్రి. కళకళలాడు.

నం. సీతారామ-. సీతారాములు, వీరు అనుకూల దంపతులు.

**సీతాళాలు** వి.బ.వ. తట్టు అనే స్ఫోటకం. (Chiken pox).

**సీతి** రూ.చూ. సీతు. వి. శైత్యం.

**సీతు** రూ. సీతి, సీతువు. వి. **1**. చలికాలం. నిర్వ.రా. **3.63**; **2**. చలి. భార. శాంతి. **3.316**.

నం. శీత-. శీతలం, చల్లనిది; శౌ. సీదల-; ప్రా. సీత-; సీఅ-. మంచు. చలికాలం; అ.మా. సీత-, సీయ-. శైత్యం; పా. సీత-. చల్లని; అప. సీయలత్త-. శీతలత్వం;

క. సీత.

<ప్రా. సీత-.

**సీతువు** రూ.చూ. సీతు. వి. **1**. చలికాలం; **2**. చలి.

**సీతోముంత** వి. సున్నంపూసి నల్లచుక్కలు పెట్టిన దిష్టికుండ, సీతకుండ.

**సీదరపుబెద్ద** చూ. సీదరము.

**సీదరము** రూ. సీద్రము. వి. **1**. బీదతనం. వసు. 1.98; **2**. ఎద్దడి; **3**. సర్పం.

నం. శ్రీధర-. విషధారి.

<నం. శ్రీధర-

సీదరపుబెద్ద (-పెద్ద) వి. ఆదిశేషువు.

**సీదరిచ్చు** రూ.చూ. చీదరించు. స.క్రి. అసహ్యపడు, చీదరించు.

**సీదరించు** రూ.చూ. చీదరించు. స.క్రి. రోతపడు; అ.క్రి. చిరాకుపడు.

**సీదా** క్రి. విశ. **1**. నేరుగా, తిన్నగా; **2**. సరిగా.

హిం. సీధా. నిలువుగా ఉండే, నేరుగాఉండే, సాదాగా ఉండే, అమాయకమైన, సరైన, సాధువైన, సాధారణమైన, నెమ్మదైన, ప్రశాంతమైన, విధేయమైన.

<హిం. సీధా.

**సీదారము** చూ. చీదరు[1]. రూ. చీద్రము. వి. **1**. రోత; **2** శని.

**సీద్రము** రూ.చూ. సీదరము. వి. **1**. సర్పం. పాండు. 2.208; **2**. బీదతనం; **3**. ఎద్దడి.

**సీధువు** రూ.చూ. శీధువు. వి. **1**. పక్వమైన చెరుకురసంనుంచి చేయబడిన కల్లు. నార. పంచ. 2.110; **2**. మద్యం; **3**. ఏనుగు కళ్ళల్లోని మదం.

**సీనంటాపి** వి. ఎదురాకుతాపి, సన్నగా పొడుగ్గా కోలగా ఉండే రేకుగల చిన్నతాపి.

**సీనా** వి. మెత్తని చక్కెర.

నం. చీన-. చైనాదేశం.

<నం. చీన-.

**సీనాం** రూ.చూ. సేనం. వి. రాతిముక్కలుకొట్టే ఒక అంచు పదునుగా ఉండే ఉక్కుముక్క.

**సీను**[1] వి. **1**. నాటకాదుల్లో ముందు వేసే తెర; **2**. దృశ్యం; **3**. రంగం.

ఇం. *Scene*. రంగం, తెర, దృశ్యం.

<ఇం. Scene.

**సీను**[2] వి. తలుపునులాగి తెరవటానికి వీలుగా బిగించిన పింగాణిబుడ్డి.

నం. చీన-. చైనాదేశం.

**సీను**[3] వి. శ్రీ వెంకటేశ్వరుడు.

నం శ్రీనివాస-. వెంకటేశ్వరస్వామి, తిరుపతి నివాసంగా కలవాడు.

<నం. శ్రీనివాస-.

**సీనురౌతు** వి. ఎర్రరాయి, గృహనిర్మాణానికి, అలంకరణకు, సాధారణంగా నేలమీద పరవటానికి, కొన్నిచోట్ల ఇంటి కప్పుకు వాడే సున్నపు మస్తురాయి.

**సీందా** వి. ఓడ, కూజా అడుగుభాగం.

**సీపాయి** రూ.చూ. సిపాయీ. వి. సైనికుడు.

**సీపారసు** రూ.చూ. శిఫారసు. వి. రెకమెండేషను.

**సీపి** వి. ముత్యంచిప్ప.

నం. శుక్తి-. ముత్యంచిప్ప.

**సీపిరిగొయ్య(-కొయ్య)** వి. కుండలకు కంఠంకింద గీతలు గీయటానికి వాడే సన్నని పుల్ల.

**సీపెముత్తెము** చూ. సీపి. వి. అసలుముత్యం, ఆణిముత్యం.

**సీబావి** వి మంచినీటిబావి.

**సీబిల్లి(-పిల్లి)** వి. పిల్లి.

**సీమ** వి. **1**. పరదేశం; **2**. దేశం.

నం. సీమన్, సీమా. సరిహద్దు, ఎల్ల, గుర్తు, తీరం, ఉనికి, చెరువు మొ. వాటిగట్టు.

<నం. సీమా. (అర్థవిపరి.).

సీమకరక వి. శ్లేష్మాన్ని హరించే ఓషధీ విశేషం. సీమకలబంద వి. అమెరికానుంచి తెచ్చిన ఒకరకం కలబంద మొక్క, కంబళ్ళు, చాపలు తయారుచేయటానికి నార ఉపయోగపడే కలబంద (Aloe litaralis). సీమకళ్ళి వి. కంచెమొక్క, దీనిఆకులు నారికురుపు చికిత్సలో వాడుతారు (Gceinea worm). సీమకాయ వి. ఒకరకం మిరప. సీమకోరింద వి. కోరిందలో ఒకరకం. సీమగరికె వి. సన్నగరికె, పశువులమేతకు ప్రశస్తం (Eragrotis plumosa). సీమగుడ్డు వి. నాముతెగులు. సీమగుమ్మడి వి. గుమ్మడిలో ఒకరకం. సీమగోంగూర వి. తెల్లగోంగూర, కాడలు తెల్లగా ఉంటాయి. సీమచిక్కుడు వి. బెంగుళూరు చిక్కుడు. సీమచింత వి. బాగా ఎత్తుగా పెరిగి, ఇంధనంగా ఉపయోగపడే ఒకరకం చెట్టు (Pithecolobium duke). సీమచింతచెట్టు వి. ఒకరకంచెట్టు. సీమచిప్పర వి. చిప్పరలో

ఒకరకం కలుపుమొక్క. సీమచీకిరేను రూ. సీమసిక్కరేను. వి. పసుప్పచ్చటి నూగుతో నిండిన ఆకులు నల్లటి బెరడు గలరేగుచెట్టు. ఆకును పశువులమేతగా పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు (Albizzlaanara Boivin. Acacia amara). సీమజొన్న వి. ఒకరకంజొన్న సీమటపాకాయ వి. చిన్నరకం టపాకాయ. సీమతంగేడు వి. 2అడుగుల ఎత్తుగాపెరిగే ఆఫ్రికాదేశం మొక్క. పసుప్పచ్చటి పూలు పూస్తుంది. దీన్ని కొండతంగేడు అని అంటారు. ఆకెరువుగా ప్రశస్తం. వంటచెరకుగా ఉపయోగిస్తారు. సీమతుమ్మ వి. కంచెగావేస్తారు, పచ్చటిపూలు పూస్తుంది, నల్లరేగడినేలల్లో బాగా పెరుగుతుంది (Pankinsonia acrleata) సీమనీలి వి. ముదురు నీలిరంగు, విదేశాలనుంచి దిగుమతి అయిన ఒకరంగు. సీమనూనె వి. కిరసనాయిలు, విదేశాల నుంచి దిగుమతిఅయ్యేనూనె అనివ్యు. అర్థం. సీమనూలు వి. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు. సీమనేపాలము వి. ఎర్రటి పూలుపూసే ముదురురంగు పొద (Tatropha gossypifclia). సీమపట్టు రూ చీమపట్టు, సీమపొట్టు. వి. 1. ఒకరకం నారింజపండురంగు; 2. గుమ్మడిపువ్వులో ఎరుపువన్నె కలిసినరంగు; 3. తిరుచూర్ణం రంగులో నిండురంగు. సీమపత్తి రూ. సీంపత్తి. వి. పెద్దకాయపత్తి, దూదితెలుపు, బరువుతక్కువ. సీమపార వి. సెలగపార, కూలుతోకూడా పోతపోసిఉన్న సెలగపార. సీమపురుగు వి. చెరుకువేళ్ళు కొరికేపురుగు. సీమపెంకిల్లు వి. బంగళా, బెంగుళూరిపెంకులు కప్పినఇల్లు. <సీమపెంకు+ఇల్లు. సీమపెంకు వి. బంగాళాపెంకు. సీమపొట్టు రూ.చూ. సీమపట్టు. వి. 1. ఒకరకం ముదురు నారింజపండురంగు; 2. గుమ్మడిపువ్వులో ఎరుపువన్నె కలిసినరంగు; 3. తిరుచూర్ణం రంగులో నిండురంగు. సీమబెండ వి. ఒకరకం బెండ. సీమబొగ్గు వి. రైలుబొగ్గు, భూగర్భంనుంచి తవ్వి తీసిన బొగ్గు. సీమమగ్గం రూ. సీమ్మొగ్గం. వి. ఒకరకం మగ్గం, నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజే మగ్గం. సీమమినుము వి. ఒకరకం మినుము. సీమమిరప వి. ఒకరకం మిరప. సీమమొక్కజొన్న వి. ఒకరకం మొక్కజొన్న. సీమరేగు వి. 1. ఏపిల్‌పళ్ళచెట్టు; 2. ఏపిల్‌పండు; 3. చిన్నపరిమాణంకలరేగు. సీమరేణిచెట్టు వి. ఒకరకం అడవిచెట్టు. సీమవంగ వి. రామమునగకాయ టమేటో. సీమవిసె వి. తోటల్లో పెంచబడే ఒక అందమైన చెట్టు, దీన్ని మందుల తయారీలో ఉపయోగిస్తారు (Cassiaalata). సీమవెండి వి. ఒకానొక తెల్లని లోహం, అల్యూమినియం. సీమసమ్మెట వి. గట్టుసమ్మెట. రాతిని చీల్చటానికి పనికి వచ్చే ఉక్కుపళ్ళుగల పెద్దసుత్తి. సీమసిక్కరేను రూ.చూ. సీమచికరేను. వి. పసుప్పచ్చటి నూగుతో నిండిన ఆకులు, నల్లటి బెరడుగల రేగుచెట్టు, ఆకును పశువులమేతగా పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు (Albizzia anara boivin, acacia amara). సీమసుద్ద వి. నల్లబల్లమీద రాయటానికి పాఠశాలల్లో ఉపయోగించే సుద్ద. సీమసున్నము వి. తెల్లనిసున్నం. సీమసెనగ వి. వేరుసెనగ, మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు. వేళ్ళకుకాసే కాయల పప్పుతో నూనె తయారుచేస్తారు, దక్షిణ అమెరికానుంచి 19వ శతాబ్దంలో మనదేశానికి ఈపైరు వచ్చింది. సీములవ వి. ఉలవలో ఒకరకం. <సీమ+ఉలవ. సీంపత్తి రూ.చూ. సీమపత్తి. వి. పెద్దకాయపత్తి, దూదితెలుపు, బరువుతక్కువ. <సీమ+పత్తి. సీమ్మొగ్గం రూ.చూ. సీమమగ్గం. వి. ఒకరకం మగ్గం, నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చు పట్టుకొని గుంజే మగ్గం.

సీమకాటురంగు రూ. చీమకాటురంగు. వి. నారింజరంగు, ఆరంజెస్, పటిక, తేజాపు, నైట్రేట్ సోడాలు కలిపి తయారుచేస్తారు.

సీమట్టిసారి రూ.చూ. సిమెంటుసారె. వి. ఇనపకడ్డీలకు సిమెంటు మెత్తిచేసిన సారె.

సీమాటి వి. 1. సౌభాగ్యవతి. చంద్రాంగ. 3.98; 2. భాగ్యశాలి అయిన ఆడది. హంస. 1 212.

సం. శ్రీమతీ-. పుణ్యశాలిని అయినస్త్రీ.

<సం శ్రీమతీ.

సీములవ చూ. సీమ.

సీమెంటు రూ.చూ. సిమెంటు. వి. జిగురుమట్టి సున్నపురాయి కలిపి తయారుచేసిన మిశ్రమం.

సీమెంటుచక్రం రూ. చిమ్మెంట్ చక్రం, సిమ్మెట్‌చక్రం, సిమ్మెంటుచక్రం. వి. ఇనపకడ్డీలకు సిమెంటు మెత్తి చేసిన ఆధునికమైన సారె.

సీంపత్తి చూ. సీమ.

సీమ్మొగ్గం చూ. సీమ.

సీరా వి. 1. సత్యనారాయణ ప్రసాదంగా గోధుమ నూకతో చేసే తీపిపదార్థం, ప్రసాదం; 2. హల్వా.

హిం. ఉ. సీరా. హల్వా; పార. షీర.

<హిం. సీరా.

సీరెంచు రూ.చూ. సీలంచు. వి.రెండుగా చీలినట్లు పెట్టినఅంచు.

సీర్ణం వి. నాపరాతి పరుపులోని సందులు అతికి దారం కొట్టటం,

సం. శీర్ణ-. చెల్లాచెదరైనది.

<సం. శీర్ణ-.

సీర్ణం కట్టుబడి వి. కట్టురాయి కట్టుబడి, రాతిని చెక్కి కట్టే పద్ధతి. సీర్ణంకరిణె వి. కాడకర్ణి. డిజైన్‌పనికి పనికివచ్చే చిన్న కరిణె సీర్ణంపని వి. నన్నటికొయ్య చెక్కడపు పని.

సీర్నం వి. నగిషీ, చెక్కమీదచేసే సున్నితమైన అలంకారం.

సం. శీర్ణ-. చెదరినది.

సీర్నంతాపి వి. ఎదురాకు తాపి, నన్నపనులకు ఉపయోగపడే, నన్నగా పొడుగ్గా కోలగా ఉండే రేకుగల చిన్నతాపి.

సీల రూ.చూ. చీల[1]. వి. 1. చీల, కీలం, శల్య, మేకు. కు. సం. 4.83; 2. అనుపేటలకు దిగగొట్టిన నిలువుపుల్ల; 3. అనుపీటల బిగింపుకు వేసేకొయ్యపేటు; 4. మరానుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి అడ్డ కట్టెకు బిగించిన ఇనపపుల్ల; 5. మరానుమీద పడుగు తోడేటప్పుడు అనులు పడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్య పట్టెకు బిగించిన రేకుముక్క; 6. ఈ డ్రైకాళ్ళ

బిగించిన మేకు ; 7. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య ; 8. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల ; 9. మరమగ్గం ఉడతకు పైన ఉడతతోలు కొనలు బిగించిన ఇనపపుల్ల : 10. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య 11. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చినకొయ్య పుల్ల ; 12. అచ్చుగుదుఌ తగిలించే వంకర ఇనపఊచ ; 13. మరనాడె మొన అరిగి పోకుండా బిగించిన ఇనపపొన్ను ; 14. పేటువడికి కింద వేలాడ గట్టిన బరువు ; 15. కొడతంకర్ర. గానుగచక్రం బెసగ కుండా బిగించే కొయ్యముక్క ; 16. కొయ్య మేకు, కొయ్య తో చేసిన మేకు.

సీలకొండి వి. చింతకాయ, గానుగ దూలానికి చివర బిగించే 'S' ఆకారపు ఇనపకొక్కెం. సీలగొడ్డలి వి. సన్నని ములికిలాగా ఉండే సల్పని గొడ్డలి. సీలతొలి వి. దోనెపలక విప్పటానికి పన్నెకట్టె దూర్చే దోనెగాడి. సీలపట్టె వి. మరాను మీదపడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకుకు బిగించిన అడ్డకట్టె. సీలమండ రూ.చూ. చీలమండ. వి. చరణగ్రంథి, గుల్ఫం, మడిమ. సీలలగుంత రూ. చీలలగుంత. వి. పేటుతూకాలు నేలకు తగలకుండా వేలాడటానికి మగ్గం గుంటకు పక్కగా తీసిన గొయ్యి. సీలలపట్టె వి.మరానుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకుకు బిగించిన అడ్డకట్టె.

సీలంచు రూ. సేరెంచు. వి. రెండుగా చీలినట్లు పెట్టిన అంచు.

సీలామాలపు చింత వి. అనవసరమైన దిగులు. కాశ. శ. 9.

సీలింగుపెంకు వి. మంగుళూరి పెంకు, యంత్రంతో తయారుచేసే బరువుగా మందంగా ఉండే పెద్ద పెంకు.

ఇం. *Ceiling*. లోకప్పు, ఇంటికప్పు.

< ఇం. Ceiling + పెంకు.

సీలితము వి. పదవినుంచి తప్పించటం.

సీలు[1] స.క్రి. స్థిరపరచు, గట్టిగామూయు ; వి. 1. ముద్ర 2. అచ్చు పోత ; 3. తిరగటం ; 4. సీసామొ. వాటిని లక్క మొ. వాటితో గట్టిగా మూసివేయటం.

ఇం. *Seal*[1]. ముద్ర.

< ఇం. Seal.

సీలు[2] రూ.చూ. సీడు. వి. 1. నూలులెక్క, లడీలో పదోవంతు ; 2. లడీలో అయిదోవంతునూలు ; 3. 80 నెంబరులడీలో ఇరవయ్యో వంతునూలు ; 4. ఒకలడీనూలు ; 5. అనులు పడకుండా అను పోసిన నూలు ; 6. పడుగులో సగం నూలు ; 7. పడుగులో కొంత భాగంనూలు ; 8. అను పొయ్యటం ఉపవృత్తిగా గలరైతులు మొ. వారు అనులు లేకుండా పోసిననూలు ; 9. అనుపోసిన నూలు, నేతలో నిలువుకువాడే నూలు ; 10. పడుగులో విడదీసిన కొంత భాగం.

సీల్నాడె షర్టింగు వి. నేతనేసేటప్పుడు నాడెలు మారుస్తూ నేసిన ఒకరకం చొక్కాగుడ్డ. ఇం. *Shirting*. చొక్కా గుడ్డ. < సీలు[2] + నాడె + ఇం. Shirting. సీల్లాక రూ.చూ. సీడులాక. వి. 1. అల్లు చేసేటప్పుడు పడుగులో దూర్చిన వెదురుబద్ద ; 2. నేతపడుగులో దండెకూ అచ్చుకూ మధ్య దూర్చిన వెదురుబద్ద ; 2. నేతపడుగులో దండెకూ అచ్చుకూ మధ్య దూర్చిన వెదురుబద్ద. < సీలు[2] + లాక.

సీలు[3] వి. చేపల్ని తినే సముద్రజంతువు.

ఇం. *Seal*[2]. చర్మంకోసం నూనెకోసం వేటాడబడే చేపల్ని తినే సముద్రజంతువు.

< ఇం. Seal[2].

సీలుఅగు అ.క్రి. కోలుకొను.

సీలుసుత్తి రూ.చూ. చీరుసుత్తి. వి. పల్లుసుత్తె, రాతిని చీల్చ టానికి పనికివచ్చే ఉక్కుపళ్ళుగల సుత్తె.

సీల్నాడెషర్టింగు చూ. సీలు[2].

సీల్లాక చూ. సీలు[2].

సీళ్ళకోల రూ.చూ. సిగళ్ళకోల. వి. అనుపోసిన పడుగులో మొదటి అనిపడ్డభాగం.

సీళ్ళపంటె వి. చేత్తోనూలు చుట్టే పనిముట్టు.

సీళ్ళరాటం వి. దబ్బాలరాట్నం, దబ్బాలకు నూలు తోడే రాట్నం.

సీళ్లవేయు అ.క్రి. ఈలవేయు.

సీవరించు చూ. సీ[1]. అ.క్రి. కోపంతో సీత్కరించు. కు. సం. 3.7.

సీవిరి[1] రూ. సీగిరి, సీవురు. వి. 1. ఆలవట్టం. భార. శల్య. 2.402 ; 2. వింజామర.

క. సీగురి. ఒకరకం వింజామర ; త. చివిఱి. వింజామర ; కుఇ. జివెరి. పంకా.

సీవిరి[2] వి. కల్లు.

సీవు వి. కుయ్యంరాయి, రాతిశ్ో కట్టిన ఆర్చికి మధ్యభాగంలో బలం కోసం బిగించిన పెద్దరాయి.

సీవురు రూ.చూ. సీవిరి[1]. వి. 1. ఆలవట్టం ; 2. వింజామర.

సీసకము[1] వి. 1. కిరీటం. భార.శల్య. 2.256 ; 2. మల్ల బంధ విశేషం ; 3. శ్రేష్ఠమైనది.

సం. శీర్షక -. శిరస్త్రాణం ; ప్రా. సీసక్క -. శిర స్త్రాణం, సిస్స-, సీస-. తల ; జై. మహా.పా. సీస-. తల, అగ్రభాగం ; అ.మా. సీస-. తల ; అప. సీస-, సీసక- ;

క. సీసక. శిరస్త్రాణం.

< ప్రా. సీసక్క.

సీసకము[2] వి. 1. చెడ్డముత్యం ; 2. గొగ్గి.

సం. సీసక -. సీసం, సత్తు.

< సం. సీసక- (అర్థవిపరి.).

సీసపుకుండ వి. మేడలమీద అలంకారానికి పెట్టే కలశంలాంటి మట్టిపాత్ర.

సం. సీసక -, సీస -. సత్తు.

< సం. సీస- + -ము + కుండ.

సీసము వి. మల్లబంధ విశేషం భార. విరా. 2.15.

సం. శీర్ష -. తల ; ప్రా. సీస -. ఛందోవిశేషం, తల : శౌ. అ మా. పా. సీస- ; మా. శిశ-.

< ప్రా. సీస-.

సీసా రూ.చూ. శీసా. వి. గాజుపాత్ర విశేషం, బుడ్డి, చిన్న

బుడ్డి.

సీసాకాయ వి. సీసా, గాజుకాయ, గాజుబుడ్డి. సీసామూ(త వి. బిరడా. సీసాలోకిదించు స.(క్రి. పూనిన దయ్యాన్ని మాం(త్రికుడు మం(త్రాలతో వదిలించి ముగ్గుమధ్యలో పెట్టి ఉంచిన ఒకసీసాలోనికి దిగేట్లు చేయు, బిరడాపెట్టు.

సీస్సా రూ.చూ. శీసా. వి. కాచపా(త విశేషం, సీసా.

సు రూ.చూ. చూ. అవ్య. చూడుము, చూడు(డు మొ. వాటి లుప్త శేషరూపం, ఇది(ప్రసిద్ధిని నిశ్చయాన్ని తెలుపుతుంది.

సుకదట్టము వి. చిలకపచ్చవన్నె ఉన్నబట్ట. కవిక. 4.195.

సం. శుక -. చిలుక.

సుకన్యపేటుచీర వి. ఒకరకం డిజైనులో నేసినచీర.

సం. సుకన్యా. ఒకానొక పతి(వత.

సుకబోగి వి. సన్నటి కాడల కలుపుమొక్క.

సం. సుఖభోగిన్. సుఖాల్ని అనుభవించేవాడు.

<సం. సుఖభోగిన్.

సుకమ్ రూ. సుకము. వి. హాయి, సుఖం. ద.హిం.శా. సంపు. శా.సం. 586. (క్రీ.శ. 1074.

సం. పా. సుఖ -. ఆనందం, హాయి ; (ప్రా. సుఖ-, సుక్ష -, సుహ-, అప.అ.మా. సుహ-. క్షేమం. కుశలం. సంతోషం,

క. సుకం, సొకం. హాయి ; తు. సుక ; (బా. సొఖా, సౌఖ్యం.

<సం. సుఖ-.

సుకమంచి రూ. సుగమంచి, సుగుమంచి. వి. 1. కన్యాశుల్కం తో పాటు ఇచ్చే ఇబ్బడి బియ్యం పప్పులు, నేయి వగైరా సంబారం ; 2. రెడ్లలో ఒకతెగ.

సుకము రూ.చూ. సుకమ్. వి. సుఖం, హాయి. ద్వి. పరమ. వి. 4.308పు.

సుకవాసి రూ. సుగవాసి. వి. కష్టపడకుండా సుఖంగా ఉండే వాడు. హంస. 1.96.

సం. సుఖవాసిన్. సుఖంగా నివసించేవాడు.

<సం. సుఖవాసిన్.

సుకసాలీలు వి.బ.వ. నేతపని చేసేవారిలో ఒకతెగ.

సం. సుఖ -. సౌఖ్యం.

<సం. సుఖ-+సాలీలు.

సుకసుకము వి. మిక్కిలి సుఖం. రం.రా. అరణ్య. 171పు. 7పం.

సం. సుఖసుఖ -. ఆనందం.

సుకస్తంబం వి. గు(రం బిగుమీది అడ్డ చెక్క.

సం. శుక -. చిలుక, సుఖ -. హాయి. స్తంభ - స్తంభం.

సుకారి వి. ఎద్దులమీద సరుకెత్తించుకొని ఊరూరు తిరిగి వర్తకం చేసే ఒకజాతి.

హిం. సుఖారా, సుఖారీ. సుఖి.

<హిం. సుఖారీ.

సుకారించు స.(క్రి. భరించు.

సుకి రూ.చూ. సుకియ. వి. లోపల తీపిపదార్థం పూర్ణంలా పెట్టి చేసే తినుబండారం, బూరె.

సుకించు రూ. సుకియించు. అ.(క్రి. సుఖపడు. క్షేమంగాఉండు. రామే. మా. 5.69.

సం. సుఖ -. ఆనందం.

<సం. సుఖ-+-ఇంచు[3].

సుకిని[1] రూ.చూ. సుకియ. వి. సుఖిని, బెల్లం సెనగపప్పుతో చేసిన భక్ష్య విశేషం.

సుకిని[2] రూ. సుకుని[2]. వి. సుఖవతి. (ఆం. భా.).

సం.పా. సుఖినీ. సుఖవతి.

< సం. సుఖినీ.

సుకియ రూ. సుకి, సుకిని[1]. సుకుని[1], సుగయ. వి.బ.వ. భక్ష్య విశేషం, బూరెలు. రామాభ్యు. 2.115.

సం. శుష్కిత -. ఎండినది: (ప్రా. సుక్క-, సుక్ఖ-, సుక్ఖియ. వేయించబడింది; పా. సుక్ఖ -. సుక్ఖిత -. ఎండినది ;

క. సుగ్గు. బియ్యంపిండి, బెల్లం, కొబ్బరితో కలిపి చేసినది ; త. చుకియన్. తినే తీపి పదార్థం, చుకియన్.

<(ప్రా. సుక్క-.

సుకియించు రూ.చూ. సుకించు. అ.(క్రి. సుఖించు. మైరా. 3.143.

సుకుని[1] రూ.చూ. సుకియ. వి. సుఖిని. బెల్లం, సెనగపప్పుతో చేసే భక్ష్య విశేషం. ఆం.భా. 2.256.

సుకుని[2] రూ.చూ. సుఖిని[2] వి. సుఖవతి.

సుకురు(డు రూ.చూ. సుక్కురు(డు. వి. శు(క్రాచార్యుడు. సాంబ. దేవ. 19.

సుకురుసిసులు రూ.చూ. సుకురు సిసువులు. వి.బ.వ. రాక్షసులు, శు(క్రాచార్యుని శిష్యులు. సుకురుసిసువులు రూ. సుకురుసిసులు. వి.బ.వ. శు(క్రశిష్యులు, రాక్షసులు. సాంబ. దేవ. 19.

సుకురుసిసులు చూ. సుకురు(డు.

సుకురుసిసువులు చూ. సుకురు(డు.

సుకులు వి.బ.వ. దేవతలు, వేల్పులు.

సం. సుఖిన్. సుఖవంతుడు.

<సం. సుఖిన్+-లు.

సుకొలి వి. సురకొలి, బాణం.

సుకోరీలు వి.బ.వ. పానకం తాగటానికి వాడే గురిగెలు.

సుక్కా రూ. చుక్కా. వి. వేయించిన మాంసం.

సం. శుష్క -. ఎండినది ; (ప్రా. సుక్ఖ-.

<(ప్రా. సుక్ఖ-.

సుక్కాను రూ.చూ. చుక్కాను. వి. చుక్కాని.

సుక్కిళ్లు రూ.చూ. సుక్కుళ్లు. వి.బ.వ. ముసలితనం వల్ల ముఖం లో వచ్చే ముడతలు.

సుక్కు రూ.చూ. (సుక్కు. వి. గర్వం. పల్నా. 55.

సుక్కుతీగ వి. నేతలో తీగమాదిరిగా నేసిన ఒకరకం డిజైను.

సుక్కురాచారి సిసువులు వి.బ.వ. శు(క్రశిష్యులు. వేంక. ఆం. 22.

సుక్కురారము వి. శు(క్రవారం. శాశ్న.సం. 14.152.

సం. శు(క్రవార -. వారంలో ఆరోరోజు.

<సం. శు(క్రవార -.

**సుక్కురు(డు** రూ. సుకురు(డు. వి. శుక్రాచార్యుడు. వేంక. ఆం. 24, అచ్చ.రా.యు. 437.

సం. శుక్ర -. భార్గవుడు, రాక్షసాచార్యుడు ; ప్రా. సుక్క - ; అ.మా.పా. సుక్క - ;

తు. సుక్ర -; కుఇ. సుక్రో. శుక్రవారం ; ఒల్లా. సుక్కర్. శుక్రవారం.

< సం. శుక్ర -

**సుక్కుళ్లు** రూ. సుక్కిళ్లు, స్రుక్కుళ్లు. వి.బ.వ. ముడతలు భోజనుతా. 3.77.

**సుక్తా** అవ్య. మిగలకుండా, పూర్తిగా.

**సుఖంసాలీలు** వి.బ.వ. నేతపని చేసేవారిలో ఒకతెగ.

సం. సుఖ -. ఆనందం.

< సం. సుఖ-. + సాలీలు.

**సుఖభోగులు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.158.

సం. సుఖ -. సౌఖ్యం, భోగ -. అనుభవం.

< సం.సుఖభోగ -. (అర్థవిపరి.).

**సుఖరోగము** వి. స్త్రీరోగం.

సం. సుఖ -. ఇంద్రియాలకు సుఖంగా ఉండేది. రోగ- తెగులు.

< సం. సుఖరోగ. (అర్థవిపరి.).

**సుఖా** విణ. వైద్యసంబంధమైనది.

హిం. సూఖా. పిండిన, కఠినమైన, క్రూరమైన, కరువు, ఎండినభూమి, నదిఒడ్డు, ఎండినపొగాకు, న్యూమోనియా, క్షయ, పిల్లల్లో వచ్చే ఈడ్పు వ్యాధి.

< హిం. సూఖా.

**సుగభోగులు** వి.బ.వ. ధాన్య విశేషం.

సం. సుఖభోగిన్. సౌఖ్యం అనుభవించేవాడు.

< సం. సుఖభోగిన్ + -లు.

**సుగమంచి** రూ.చూ. సుకమంచి. వి. **1**. పెళ్ళికూతురుకి ఇచ్చే ఒలితోపాటు వెంటపంపేధాన్యం ; **2**. రెడ్లలో ఒకతెగ.

**సుగమంచివారు** వి.బ.వ. రెడ్లలో ఒకతెగవారు.

**సుగము** రూ.చూ. సోకు. వి. సుఖం. ఆం.భా. 1.98.

**సుగయ** రూ.చూ. సుకియ. వి. బూరె.

**సుగవాసి** రూ.చూ. సుకవాసి. విణ. సుఖంగా ఉండేవాడు శుక 2.443.

**సుగాలఅవిరేని** వి.బ.వ. లంబాడీలు పెళ్ళిళ్ళకు వాడే అవిరేణి పాత్రలు.

**సుగాలము** వి. ఆయుధవిశేషం. హంస. 1.205.

**సుగాలీ** వి. ఒకతెగ అనాగరికజాతి.

మరా. సుగాలి. లంబాడీ జాతివారు.

క. సుకాలిగ.

< మ. సుగాలీ.

**సుగాసి** విణ. కష్టమోర్వలేని.

**సుగిపట్టములు** వి.బ.వ. వస్త్రభేదం. సిం.ద్వా. 3.206.

**సుగీలు** వి.బ.వ. తినుబండారాలు.

**సుగుడి** విణ. సరసుడు, గుణవంతుడు, యోగ్యుడు. మను. 4.91.

సం. సుగుణిన్. సుగుణాలు కలవాడు ;

త. సుకుటి, సుగుడె.

< సం. సుగుణిన్.

**సుగుంటలు** చూ. సుకియ. వి.బ.వ. పూర్ణంతో చేసిన ఫలహారాలు.

**సుగందపాల** వి. అన్నిప్రాంతాల్లోనూ, అడవుల్లో పెరిగే ఒక రకం పొద. (Hemidesnus indicus).

**సుగుమంచి** రూ.చూ. సుకమంచి. వి. కన్యాశుల్కంతో పాటు ఇచ్చే ఇబ్బడి బియ్యం, పప్పులు నేయి వగైరా సంబారం.

**సుగ్గడి** విణ. నీతిబాహ్యుడు. దశకు. 4.66.

ప్రా. సుగ్గమ్. విసర్జించబడిన.

**సుగ్గడితనము** విణ. సుఘట్టితం, తరచైన నేతకలది. క్రీడా. 15, వసు. 5.81.

సం. సుఘటిత-. బాగా కూర్చబడినది ; సంఘట్టిత-. రాపిడి చేయబడ్డది ; ప్రా. సుఘడిత-.

< ప్రా. సుఘడిత -.

**సుగ్గి** వి. పంటమార్పిడికాలం, మహనూల్.

**సుగ్గికూలి** వి. అమినికూలీ, ఊడుపుకూలీ నాట్లుపనికి వచ్చే కూలీ.

**సుగ్గులు** వి.బ.వ. విరేచనాలు.

**సుగ్రీవాజ్ఞ** వి. తిరుగులేనిది.

సం. సుగ్రీవాజ్ఞా. సుగ్రీవునియొక్క ఆన.

< సం. సుగ్రీవాజ్ఞా. (అర్థవిపరి.).

**సుంకగుత్తకా(డు** చూ. సుంకము.

**సుంకపు(గాసులు** చూ. సుంకము.

**సుంకపుతలారి** చూ. సుంకము.

**సుంకమాన్యము** చూ. సుంకము.

**సుంకము** రూ. చుంకము, శుంకం, సుంకు[3], సుంఖము. వి. **1**. పన్ను తాళ్ల.సం. 15.238, E I. సంపు. 24. శా.సం. 183. క్రీ.శ. 825 ; **2**. వర్తకులమీద విధించేపన్ను. గౌ.హరి. ఉ. 1.67 ; **3**. ప్రతిబంధం. ఆము. 6.44 ; **4**. వివాహంలో కన్యకిచ్చే ధనం. ఆం.భా. 2.179.

సం. శుల్క -. శుల్కం ; ప్రా. సుంక-. మూల్యం, పన్ను, ఒలి, సుక్క-, సుగ-, సుంకియ, సుంక-, శుక్కో, సుంగో ; అ.మా. సుక్క-, సుంక-. పన్ను, అరణం, పెల్లువడ్డి ; పా. సుంక- ; హిం. చుంగీ, పన్ను, దిగుమతిపన్ను ; ఉ. చుంగీ. ఒక మనిషి చేతిలో తీసుకోగలిగిన. ధాన్యాన్ని రోజూ వర్తకులనుంచి పన్ను రూపంగా వసూలు చేయటం ;

క. సుంక, సుంకి. సుంకం, సుంకదవ. సుంకిగ, సుంకరి, మంగడి. వడ్డి. సుంకె ; తు. సుంక; త. ఉల్కు. శుల్కం, చుంకు, చుల్కమ్. కన్యాశుల్కం ; మ. చుంకం ; బ్రా. సుంగ్. రవాణాపన్ను.

< ప్రా. సుంక-.

**సుంకగుత్తకా(డు** వి. సుంకాన్ని రాబట్టు కోవటానికి గుత్తకు తీసుకొనేవాడు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 565. క్రీ.శ. 1391. **సుంకపు(గాసులు (-కాసులు)** వి.బ.వ. అడవులనుంచి కట్టెలు మొ. వాటిని తెచ్చుకోవటం కోసం

చెల్లించే రొక్కం. శుక. 3.248. సుంకపుతలారి వి. సుంకం వసూలు చేయటానికి నియమించబడ్డ పర్యవేక్షకుడు. నె.శా. ఒంగోలు. 132. క్రీ.శ. 1443. **సుంకమాన్యము** వి. పన్నులేకుండా ఇచ్చేభూమి. తాళ్ల.సం. 7.277. **సుంకముపట్టు** అ.క్రి. పన్నురాబట్టు. శృం.నై. 5.103. **సుంకరఇనాం** వి. సుంకం (పన్ను) వసూలు చేసేవాడి కిచ్చేఇనాం. **సుంకరి** వి. 1. శుల్కాధికారి, పన్నురాబట్టే వాడు. సుమతి. 62. రాజవా. 3.356 ; 2. ఊరి బంట్రోతు. <సుంకము+-.అరి. **సుంకరికొట్నం** వి. పెళ్ళిఅయిన తర్వాత సంక్రాంతి నోముకివాడే మట్టిపాత్రలు. **సుంకరిమాటలు** వి.బ.వ. కలగలుపు మాటలు **సుంకరిమెట్టు** వి. ఘట్టం, పన్నుపుచ్చుకొనే చావడి. **సుంకరీఁడు** వి. శుల్కాధికారి, సుంకం తీసేవాడు. హంస. 4.115. **సుంకసూత్రాలు** వి.బ.వ. సుంకం చెల్లించటానికి చేసే ఏర్పాటులు. ద.హిం.శా, సంపు 4. శా.సం. 709. క్రీ.శ. 1558. **సుంకాధికారులు** వి.బ.వ. సుంకాన్ని రాబట్టే అధికారులు. తె.శా. ఇ.శా. 6. క్రీ.శ. 1162. సం. అధికారిన్. అధికారం ఉన్నవ్యక్తి. <సుంకము+సం అధికారిన్+అధికారిన్+-లు. **సుంకీఁడు** వి. శుల్కంపుచ్చుకొనేవాడు. పన్నురాబట్టేవాడు. బసవ. 2.37పు. 488పం.

**సుంకమ్మ(-అమ్మ)** చూ. సుంకు. వి. గ్రామదేవతపేరు.

**సుంకరఇనాం** చూ. సుంకము.

**సుంకరి** చూ. సుంకము.

**సుంకరికొట్నం** చూ. సుంకము.

**సుంకరిమాటలు** చూ. సుంకము.

**సుంకరిమెట్టు** చూ. సుంకము.

**సుంకరీఁడు** చూ. సుంకము.

**సుంకలకోల** రూ.చూ. సుంగుడుకోల. వి. నేతపడుగు చివర పాయలతాళ్ళు కట్టినకర్ర.

**సుంకసూత్రాలు** చూ. సుంకము.

**సుంకాధికారులు** చూ. సుంకము.

**సుంకాళమ్మ(-అమ్మ)** చూ. సుంకు. వి. గ్రామదేవతపేరు.

**సుంకానరి** రూ.చూ. సుంకేసరి. వి. తెల్లపువ్వులుండే పెద్దచెట్టు.

**సుంకినన్నం** రూ. సుంకునన్నం. వి. శ్రీకాకుళం విశాఖజిల్లాల్లో పండించే ఒకరకం వడ్లు, అనకాపల్లి 2వ నెంబరు దీనికి చెందుతుంది.

**సుంకీఁడు** చూ. సుంకము.

**సుంకు**[1] వి. శంకు, శాస్త్రపద్ధతిలో చెక్కి గృహనిర్మాణానికి మొట్టమొదట ఈశాన్యమూలలో పాతేకొయ్య.

సం. శంకు-. స్తంభం.

<సం. శంకు-.

**సుంకు**[2] వి. 1. సస్యకుసుమరజం, పువ్వాళ, రజస్సు, దుమ్ము. ఉ.హరి. 4.3 ; 2. పెళ్ళిలో పళ్ళెరంలో పోసి వధూవరులమీద చెరిగే వడ్లపొట్టు. రామాభ్యు. 8.67 ; 3. అమ్మవారు పోసిదిగుతున్నప్పుడు పెనలు ఉడికించి తట్టలోపోసి సోకినవ్యక్తి ఎదురుగా చెరగి పంచిపెట్టే గుగ్గిళ్ళు ; 4. బాధ ; 5. తగవు ; 6. మొగలి పువ్వులోని రజం ; 7. వరిగింజపువ్వు ; 8. మదం.

నం. శూక-, శుంగ-. సుంకు ; ప్రా. సుంకఅ- ; సుంక- ; పా. సూక- ;

క. సుంకు ; తు. చుంగె, తుంగు, సూంగు ; త. చికు.

<ప్రా. సుంకఅ-.

**సుంకుపొలి** వి.బ.వ. ఒకరకం వడ్లు. **సుంకురాల్చు** స.క్రి. వేదించు, నలచివేయు. వర.రా.సుం. 167.20. **సుంకులు** వి.బ.వ. పెళ్ళికి ముందు ముత్తైదువలు దంచే వడ్లు. **సుంకులుచల్లు** అ.క్రి. పెళ్ళిళ్ళు మొదలైన వాటిలో తలంటే టప్పుడు, పాటలు పాడుతూ ధాన్యాన్ని దంచి ఒకచేటలో పోసి దానిమీద ఒకచేట బోర్లించి, ఆనందుల్లోనుండి తలంటుకొన్న వారి తలలమీద పడేట్లు చెరగు. **సుంకునన్నం** రూ.చూ. సుంకినన్నం. వి. ఒకరకంవడ్లు.

**సుంకు**[3] రూ.చూ. సుంకము. వి. ప్రతిబంధం. కవిక. 3.45.

**సుంకులమ్మ(-అమ్మ)** చూ. సుంకు[2]. వి. ఒకగ్రామదేవత.

**సుంకేప** వి. కట్టె, వంటచెరకుగా పనికవచ్చే ఒకరకం చెట్టు.

**సుంకేసరి** రూ. సుంకానరి, సుంకేసల, సుంకేసలము, సుంకేసిరి. వి. వృక్షవిశేషం. హంస. 4.11.

**సుంకేసల** రూ.చూ. సుంకేసరి. వి. ఎర్రటిపూలు, నల్లటిబంక ఉండి నీటివారల పెరిగే పెళుసుకొమ్మల పెద్దచెట్టు. నీడకోసం బావులగట్లపై పెంచుతారు. ఆకుసుపచ్చి ఎరుపుగా ఉపయోగిస్తారు (Poinciau elata).

**సుంకేసలము** రూ.చూ. సుంకేసరి. వి. వృక్షవిశేషం.

**సుంకేసిరి** రూ.చూ. సుంకేసరి. వి. ఒకరకం చెట్టు.

**సుంకోల** రూ.చూ. సుంగుడుకోల. వి. నేతపడుగు చివరపాయల తాళ్ళు కట్టినకర్ర.

**సుంక్యఅధికారి** వి. సుంకాలిం రాబట్టే ఉద్యోగి లేక అధికారం కలవాడు. ద.హిం.శా. సంపు. 10.శా.సం. 528. క్రీ.శ. 1319.

**సుంఖం** రూ.చూ. సుంకము. వి. పన్ను, సుంకం.

**సుంఖవిహితకట్నం** వి. నిర్ణీతమైన సుంకాది కట్నాలు. ద.హిం. శా. సంపు. శా.సం. 511. క్రీ.శ. 1559.

**సుంగలకట్టె** రూ.చూ. సుంగులకట్టె. వి. 1. నేతపడుగుచివర పాయలతాళ్ళు కట్టినకర్ర ; 2. నేతపడుగులో చివర పాయలు బిగించినకర్ర.

**సుంగారం** వి. అలంకారం, అలంకరణ.

సం. శృంగార-. అలంకారం, ఒకరసం, కామం.

<సం. శృంగార-.

**సుంగితాడు** రూ. సింగితాడు. వి. నేతపడుగులో చివరపాయకు కట్టిన దారం.

**సుంగు** వి. 1. పడుగునూలులో చివర పాయగా విడదీసిన పోగులు ; 2. నేతపడులో చివరపాయకు కట్టినదారం ; 3 కమ్మిపక్కన మామూలుగా నేసినభాగం.

**సుంగుదారం** వి. నేతపడుగులో చివరపాయకు కట్టిన దారం. **సుంగుబద్ది** వి. నేతచీరకు ముందువైపు వదిలిన బద్దె. **సుంగులకట్టె** రూ. సుంగులకట్టె, సుంగులుకట్టె, సుంగుల్కట్టె. వి. 1. నేతపడుగు చివరపాయల తాళ్ళు కట్టిన కర్ర. 2. నేతపడుగులో చివరపాయలు బిగించినకర్ర.

**సుంగులుకట్టె** రూ.చూ. సుంగులకట్టె. వి. **1**. నేతపడుగు చివర పాయలు తాళ్ళు కట్టిన ; కర్ర. **2**. నేతపడుగులో చివరపాయలు బిగించిన కర్ర. **సుంగుల్కట్టె** రూ.చూ. సుంగులకట్టె. వి. **1**. నేతపడుగు, చివరపాయల తాళ్ళు కట్టిన కర్ర ; **2**. నేతపడుగులో చివరిపాయలు బిగించినకర్ర,

**సుంగుడు** వి. **1**. మిగతశేషం, లాభం, చింగుడు ; **2**. వడ్డి.

**సుంగుడుకోల** రూ. సుంకలకోల, సుంకోల. వి. నేతపడుగు చివరపాయల తాళ్ళు కట్టినకర్ర.

**సుజాణ(డు** వి. మంచినేర్పరి. తాళ్ల.సం. 17. 101.

సం. సు. మంచి.

<సం. సు+జాణ(డు (మిశ్రస.).

**సుచిమనసి** వి. సన్యాసులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 29.

సం. శుచి-. పరిశుద్ధమైనది, మనస్విన్. మనసుకల వాడు.

<సం. శుచిమనస్విన్.

**సుజినీ** రూ.చూ. సుదినీ. వి. **1**. నేతలో నిలువుకు అడ్డానికి రెండేసిపోగుల చొప్పున పెట్టి నేసిన దుప్పటి ; **2**. నెమలికన్ను నేతలో నేసిన జంపఖానా.

**సుంచిపిటాలు** వి.బ.వ. ఒకరకం పిండివంట.

**సుంచులు** వి.బ.వ. కుచ్చులు, ఎడ్లకొమ్ములకు అలంకారంగా వేసే కుచ్చులు.

**సుట్టచిప్ప** వి. అన్నం తినటానికి వాడే మట్టిపాత్ర.

**సుట్టు** చూ. చుట్టు. వి. ఆములో కుండలు పేర్చేటప్పుడు మొదటనిలువుగా పేర్చి దానిపైన అడ్డంగా పెట్టేకుండ.

**సుట్టుకుండ** వి. పొయ్యికి ఒకపక్కన నీళ్ళు కాగటానికి పెట్టే మట్టిపాత్ర. **సుట్టుబెట్టు(-పెట్టు)** స.క్రి. ఆములోకుండల పేర్పులో కుదుర్లపైన మొదట ఓటికుండల్ని బోర్లించు.

**సుత్రగాలి** రూ.చూ. చుట్టగాలి. వి. సుడిగాలి. గిరగిర తిరిగే వాయుగుండం.

**సుట్లు** చూ. చుట్టు. వి.బ.వ. **1**. తాగేచుట్టలు ; **2**. మట్టెలు.

**సుడామడ** రూ.చూ. సినీమా. వి. చలనచిత్రం.

**సుడాలము** వి. అశ్వగతిభేదం. పారి. 2.102.

హిం. సుడౌల్, సుఢార్. సుందరమైనది.

**సుడి** రూ. సురి[2]. వి. **1**. జలావర్తం. కు.సం. 3.50 ; **2**. గాలులు చక్రభ్రమణం. కు.సం. 3.103 ; **3**. కష్టం, బాధ. భాగ. 10.265 ; **4**. రోమావర్తం. మను. 6.26 ; **5**. వత్రువసుడి. పాండు. 1.71 ; **6**. రాజులకు కోటల నుండి వచ్చే ఆదాయభేదం ; 7. అదృష్టం ; 8. గుబురుగా పెరిగే పైరుమొక్కల ఆకు ; 9. జొన్నకోసి పొలంలో వేసిన గుండ్రటికుప్ప ; **10**. పశువుల ఒంటిమీద ఎక్కడైనా కనబడే రోమావర్తం ; **11**. ఒకరకం తిక్క, గొడ్డు గిర్రున తిరిగి పడిపోయేతిక్క ; **12**. తమలపాకుల చిన్న కట్టలుపెట్టి కట్టిన పెద్దకట్ట ; **13**. కట్ట, మోపు.

క. తొఱల్. (తొఱల్ద్-) గుండ్రంగా కదులు, గుండ్రంగా తిరుగు, లేకవెళ్ళు, తొఱకల్. తిరిగినట్టు నటించు, తిరగటం, తొఱలి. చుట్టూకదలటం, తొఱలికె. తిరగటం, తొఱలిసు. చుట్టుకొను, తొఱలుపికె. చుట్టూ తిరగటం, తొఱసు. అసహ్యపడు, తుఱ. గుండ్రంగా తిప్పటం, సుడి. గుండ్రంగావెళ్ళు, తిరుగు, సోమరితనం, కప్పు చేయటం, వంచన, సుఱవు. వెనక్కువెళ్ళు. తరుగు, సుఱసు. కదిలించు, గుండ్రంగా తిరుగు, సుఱవు, సుఱుహు. గుండ్రంగా తిరుగు ; కొడ. చుళి. ఆకువేయు ; తు. సులిపిని, సులిపుని. చుట్టుకొను, గుండ్రంగా తిరుగు, తులిపుని, తులియుని. వెన్నుచేయటం, తుళిపుని, సుళిపుని. కదిలించు, కలతపెట్టు, సుళి. నీటిలోని సుడి, సుళియుని. కదిలించు, నీటిలోని కదలిక ; త. చుఱల్ (చుఱల్వ్-, చుఱణ్ఱ్-). తిరుగు, చక్రంలాగ తిరుగు. వ్రేలబడు, వాలిపోవు, కళ్ళను అటు ఇటు తిప్పినట్టు తిప్పు. చుఱట్చి. గిరగిర వేగంగా తిప్పటం, అటూ ఇటూ తిరగటం, కష్టం, చుఱఱ్ఱల్. తలతిప్పు, మైకం, చుఱఱ్ఱి. నూలు వడికే రాట్నాన్నితిప్పు, చుఱఱ్ఱు (చుఱఱ్ఱి-). తిరగటం, తిప్పటం, గుండ్రంగా వేలాడు, తిప్పు, మైకంగాఉండు, చుఱ. (-వ్, న్త్-). గుండ్రనగు, వ్యాకులతచెందు, (-ప్ప-, త్త్-). సుడిగాలిలాగా తిరుగు. వంపు, అదృష్టరేఖలు, చుఱయల్. వెంట్రుకలు వంపులుగా తిరగటం, చుఱయణ్. మోసగాడు, చుఱవు, ఆత్రుత, చుఱ్(-వ్-, న్త్). చుట్టుకొను. గుండ్రంగాచుట్టు. చుఱ్త్తు(చుఱ్త్తి). చుట్టుకోవటం, కల్పించుకొను, చుఱ్. వోర్. చుట్టుపక్కలవాళ్ళు. ప్రేక్షకులు. చుఱల్. చుట్టుపక్కలు, సామీప్యం, ఇరుగుపొరుగు ; మ. చుఱలుక. తిరుగు, తిప్పు, చుట్టుకొను, చుఱలి. తిరగటం, చుఱల్, తిరగటం, చుఱల్ప్. భ్రమణం, తలతిప్పు, మైకం, చుఱఱ్ఱుక. గుండ్రంగా తిరుగు, వేలాడు, విసరివేయు. చుఱఱ్ఱి. చేపలవల, విసనకర్ర, తిప్పేయంత్రం. చుఱఱ్ఱు. వేలాడటం. తిప్పు, చుఱఱ్ఱిక్క. వేలాడజేయు, చుఱ. గిరగిర వేగంగాతిప్పు, గుండ్రం, కాలం, చుఴియుక. గిరగిర వేగంగాతిప్పు, చుట్టుకొనునట్లు చేయు, చుఱవు. నీటిలోనిసుడి, చుఱక్క. వేగంగా తిరగటం, చుఱప్పు. గిరగిర వేగంగాతిరుగు, అసత్యం, చూఱుక. చుట్టుకొను, చూఱ, చూఱవె. చుట్టూతిరగటం, చూఱ. లొంగిపోవు, సముద్రం ; కో. చూళి. నదిలో నీటిలోని సుడి, చర్గ్. మనుషుల తలలోని వెంట్రుకల సుడి, జంతువులకు శరీరంపై మంచిచెడ్డలు తెలుసుకోవటానికి ఉండే వెంట్రుకలసుడి ; తొ. తుళి. లోతైనగుంట, తుడి-(తుడ్స-). పదిమందిలో కలిసిమెలగు, సోమరిగా తిరుగు(తుడ్చ-). గుండ్రంగా తిరుగు ; కుఇ. డుఱ. తిరగటం, డొడ్గ(డొడ్గి-). నేలపైన తిరగటం, పాకు ; కువి. దూఱ్లి-కీఅలి. తిరగటం.

**సుడికత్తి** వి. చక్రం. వేంక. ఆం. 18. **సుడికయిదువ** రూ. సుడికైదువ. వి. చక్రాయుధం. అచ్చ. రా. అరణ్య. 11.4. **సుడికైదువ** రూ.చూ. సుడికయిదువ వి. చక్రాయుధం. **సుడికొలుపు** రూ.చూ. సుడికొల్పు. స.క్రి. కష్టపెట్టు, బాధించు. **సుడికొల్పు** రూ. సుడికొలుపు, సుడిగొలుపు, సుడిగొల్పు. స.క్రి. కష్టపెట్టు. బాధించు. ద్వి. పరమ. 3.222. **సుడిగట్టు** వి. చక్రవాళపర్వతం. యయా. 1.19. **సుడిగాడు** రూ. సుదుగాడు, సుదుగాడు. వి. శ్మశానం,

**సుడిగాడ్పు** వి. సుడిగాలి. భార. ద్రోణ. 3.268. **సుడిగాలి** వి. 1. చుట్టిచుట్టి వీచేగాలి. భార. శాంతి. 3.5.17 ; 2. ఒకానొక జాతిపందెం కోడి. హంస. 3.215. **సుడిగొట్టు** వి. గాలి. **సుడిగొట్టుజాలు** వి. గాలి. వేంక. ఆం. 13. **సుడిగొండ(-కొండ)** వి. చక్రవాళగిరి. **సుడిగొను(-కొను)** అ.క్రి. 1. చుట్టుకొను, పెనగు. నిర్వ. రా. 89 ; 2. భ్రమించు, తిరుగు. భాస్క. రా. యు. 5.12 ; 3. కలతనొందు, బాధపడు. హర. 6.46 ; 4 అదృష్టం ఫలించు. మొల్ల. అయోధ్యా. 32. **సుడిగొలుపు** రూ.చూ. సుడికొల్పు. స.క్రి. చుట్టుకొనజేయు. **సుడిగొల్పు** రూ.చూ. సుడికొల్పు. స.క్రి. చుట్టుకొనచేయు. **సుడిగోరు** వి. తంతి మీటటానికి బంగారం మొ. వాటితోచేసి వేళ్ళకి పెట్టుకొనే గోరు. గౌ. హరి. 2. **సుడిచందువాచేవ** వి. ఒకరకం చేప. **సుడితెగులు** వి. వరి, జొన్న మొ. పైర్ల కొసాకులు ఎండిపోయే తెగులు. **సుడినూలు** రూ. సురినూలు. వి. పోగులు కలిపి పురిపెట్టిన నూలు. **సుడిపురువు** వి. ఆరణ్య జంతువిశేషం. ప్రబంధ. 1130. **సుడిపుర్వు** రూ.చూ. సుడిపురువు. వి. ఆరణ్య జంతు విశేషం. **సుడిపెట్టు** రూ.చూ. సుడివెట్టు. అ.క్రి. పనికానివ్వకపోవు. **సుడిపోవు** రూ.చూ. సుడివోవు. అ.క్రి. 1. నశించు ; 2. చెడు. **సుడిబిడ్డలు** వి.బ.వ. గావు సంబరంలో వాడే చిన్న మట్టిగురిగెలు. **సుడిఁబడు** రూ.చూ. సుడివడు. అ.క్రి. 1. కలతపడు, బాధనొందు. సిం. ద్వా. 11.100 ; 2. చుట్టుకొంటూ రాలు, పడు ; 3. ఆవర్తాలు కలదగు, సుడులు కలదగు, సంక్షోభించు ; 4. చిక్కుపడు ; 5. పరిభ్రమించు, (అవశంచేత) గిరగిరతిరుగు ; 6. చెదరు ; 7. సంక్షోభించు, తొట్రుపడు ; 8. దుర్బలమగు, నిస్సత్త్వమగు ; 9. తిరుగు, వెనుతిరుగు ; 10. చెడు, నశించు. **సుడియడిదము(-అడిదము)** వి. చక్రం. ఆం. భా. 52. **సుడియాడు(-ఆడు)** అ.క్రి. పరిభ్రమించు. సారంగ. 2.52పు. 4పం. **సుడివడు(-పడు)** రూ. సుడిఁబడు. అ.క్రి. 1. కలతపడు, బాధనొందు. భార. ఉద్యో. 4.36 ; 2. తిరుగు, వెనుతిరుగు. పండి. చ. 1.61 ; 3. చెదరు. భాస్క. రా. ఆరణ్య. 149 ; 4. పరిభ్రమించు. గిరగిరతిరుగు. భాస్క.రా. ఆరణ్య. 2.234 ; 5. దుర్బలమగు, నిస్సత్త్వమగు. భాస్క. రా. సుం. 29 ; 6. చిక్కుపడు. కాశీ. 1.138 ; 7. చెడు, నశించు. భాగ. 7.389 ; 8. ఆవర్తాలు కలదగు, సుడులు కలదగు, సంక్షోభించు. మను. 3.28 ; 9. సంక్షోభించు, తొట్రుపడు. ఆము. 4.35 ; 10. చుట్టు కుంటూరాలు, పడు. కామాభ్యు. 6.108. **సుడివఱచు(-పఱచు)** స.క్రి. సుడివడచేయు. వరాహ. 10.62. **సుడివాలు** వి. చక్రాయుధం. అచ్చ. రా. బాల. 62. **సుడివాలుజోదు** వి. చక్రి, విష్ణువు. **సుడివాలుదాలుపు** రూ.చూ. సుడివాలుదాల్పు. వి. విష్ణుమూర్తి. **సుడివాలుదాల్పు** రూ. సుడివాలుదాలుపు, సుడివాల్దాలుపు. వి. విష్ణుమూర్తి. అచ్చ. రా. అయోధ్యా. 100. **సుడివాలుదొర** రూ.చూ. సుడివాల్దొర. వి. చక్రి, విష్ణువు. **సుడివాల్దాలుపు** రూ.చూ. సుడివాలుదాల్పు. వి. విష్ణుమూర్తి నీలా. 1.65. **సుడివాల్దొర** రూ. సుడివాలుదొర. వి. విష్ణువు. యయా. 5.1. **సుడివెట్టు(-పెట్టు)** రూ. సుడిపెట్టు. అ.క్రి. పని కానివ్వకపోవు. **సుడివెంట్రుకలవాడు** విశే. దౌర్భాగ్యుడు. **సుడివోవు(-పోవు)** రూ. సుడిపోవు. అ.క్రి. చెడు, నశించు, సుడివడు. మార్క. 1.168. **సుడిసుడిగొను(-కొను)** స.క్రి. మిక్కిలిసుడిగొను. భాగ. 8.361. **సుడిసుడులుగట్టు(-కట్టు)** స.క్రి. మిక్కిలిసుడులు కట్టు, అవిచ్ఛిన్నంగా ప్రసరించు. రంగా. చ. 3.90. **సుడెండ** వి. మధ్యాహ్నం, తీక్ష్ణంగా సూటిగాపడే ఎండ. <సుడి+ఎండ. **సుళ్లమారి** విశే. 1. సుడులు కలవాడు ; 2. చుట్టబెట్టేవాడు. శృంగార రసాల వాలం. 1ఆ. **సుళ్ల(బెట్టు** స.క్రి. చిక్కులుపెట్టు. ఇందు. 1.77. <సుడి+-లు+అ[7]+పెట్టు. **సుళ్లు** వి.బ.వ. అబద్ధం. <సుడి+-లు. **సుళ్లగ్రుక్కు** స.క్రి. గ్రుక్కిపోవు. ఆము. 5.123.

**సుడియ**[1] వి. తమలపాకుల బరువులోసగం.

**సుడియ**[2] విశే. తులువ.

**సుడియ**[3] వి. కన్య.

**సుడియు**[1] అ.క్రి. 1. వీచు. భార. ఆది. 8.79 ; 2. తిరుగు, భ్రమించు కు. సం. 1.65 ; 3. చుట్టుకొను, కమ్ము. వ్యాపించు. కు. సం. 3.108 ; 4. ప్రసరించు, వ్యాపించు. కు. సం. 6.33 ; 5. చలించు, కదలు. కు.సం. 8.179 ; 6. సుడిగావీచు. నిర్వ.రా. 3.56 ; 7. కలతనొందు. హరి. ఉ. 8.46 ; 8. డాయు, సమీపించు. భాస్క.రా. అయోధ్యా. 1.64 ; 9. సంచరించు, మసలు. రం.రా. అయోధ్యా. 13పు. 6పం ; 10. అడ్డువచ్చు, వచ్చు; భోజ. 6.25 ; 11. మొదలు, ఆడు. భాగ. 8.643. 12. లీనమగు, అణగు. సీతారా. 3.58.

క. సులి, తులి. చుట్టుతిరుగు ; తు. సులిపుని. తిరుగు, చుట్టూతిరుగు, సుళి. సుడిగుండం ; త. చులి. (గాలిలాగా) గుండ్రంగా తిరుగు ; మ. చులియుక. తలతిరుగు, తిరుగు, చులివు. సుడిగుండం.

మూ. ద.ద్రా. *చూల్-, *చుల్-వ్-.

**సుడియు**[2] చూ. చూఁడు. స.క్రి. కాలు, దగ్ధమగు.

**సుడుగాడు** రూ.చూ. సుడిగాడు. వి. శ్మశానం.

**సుడుము** వి. 1. కంటకాదిభారం. ఆం. భా. 2.38 ; 2. కంప తొడుగు ; 3. విత్తనాలు చల్లిన తరవాత చేను చదును చేయటం కోసం ఈడ్చేకంప ; 4. నూరుగొర్రెల గుంపు ; 5. దిపటి.

**సుడెండ** చూ. సుడి.

**సుడెము** రూ. జుడెం. వి. 1. దీపావళినాడు వెలిగించి తిప్పటానికి చొప్పతో కట్టబడిన పంజు ; 2. రాగోలతో ఎత్తటానికి వీలుగా అంటొత్తిన ముళ్ళకంప.

**సుణుగు** స.క్రి. వంచించు, కికురించు, మోసగించు.

**సుంట**[1] వి. ఆములో పెంకు కాల్చటానికి ఏర్పరచినసందు.

**సుంట**[2] వి. ఇసుర్రాయి. రాతిదిమ్మల కట్టుబడిలో పనికివచ్చే రాయి.

**సుండ** రూ.చూ. సుండు. వి. మోటబొక్కెన అడుగున కట్టిన తోలు గొట్టం లేక తిత్తి.

**సుండతాడు** రూ.చూ. సుండుతాడు. వి. తొండం తాడు.

**సుండు** రూ. సుంఠ, సొంటె², సొండు, సోండమ్. వి. 1, తొండం, తొంటి ; 2. వామి కట్టుబడిలో మధ్యభాగం' అడుగుకు కప్పుకుమధ్య నున్నది 3. మోటబొక్కెనఅడుగున కట్టిన తోలుగొట్టంలేకతిత్తి.

నం. శుండా. ఏనుగు తొండం ; ప్రా. సుండా.

<ప్రా. సుండా.

**సుండుతాడు** రూ. సుండతాడు. వి. తొండంతాడు.

**-సు(డి** రూ.- సు(డు. అవ్య. నిశ్చయార్థకం.

'చూడు(డి'కి సంగ్రహ రూపం.

**-సు(డు** రూ.చూ. - సు(డి. అవ్య, నిశ్చయార్థకం.

**సుణ్ణంగి** వి. చూడలేనితనం కలవాడు, ఈర్ష్యాళువు.

**సుత** రూ.చూ. తుది. అవ్య. ప్రభృత్యర్థకం, మొదలుకొని. కూడ ; విశ. చివరిది, కడపటిది.

పోచూ. నం. సహిత-. కూడినది, కలసిఉన్నది, సహించబడ్డది.

**సుతరాం** రూ.చూ. సుతరాము. అవ్య. బొత్తుగా, ఎంత మాత్రం.

**సుతరాము** రూ. సుతరాం, సుతలాం, సుతలాము, సుత్రాము. అవ్య. బొత్తిగా.

నం. సుతరామ్. అధికతరం, అధికంగా, హిం' సుతరాం. కాబట్టి, ఇంకా, కనుక.

<నం. సుతరామ్ (అర్థవిపరి.).

**సుతలాం** రూ.చూ. సుతరాము. అవ్య. బొత్తుగా, ఎంత మాత్రం.

**సుతాలాము** రూ.చూ. సుతరాము. అవ్య. బొత్తిగా.

**సుతారము** విశ. సుకుమారం, శ్రేష్ఠం. శ్రీరం. మూ. 1.112, రత్న. 49 ; వి. 1. నాణ్యం ; 2. నేర్పు ; 3. సున్న పుని ; 4. పంట ; 5. చిన్నవిషయం.

పో.చూ. నం. సుధాకార్య-. సున్నపుని ; హిం. సుతార్. శ్రేష్ఠమైంది.

**సుతారి¹** వి. సురంగం తవ్వేసాధనం. రంగా. చ. 3.60.

హిం. సుతారీ. చెప్పులుకుట్టే సూది.

**సుతారి²** రూ. సుతారు. వి. 1. బేలుదారు, ఇల్లుకట్టే పనివాడు ; 2. నేర్పరి.

హిం. సుతారీ. శిల్పకారుడు, వడ్రంగి.

<హిం. సుతారీ.

**సుతారు** రూ.చూ. సుతారి². వి. 1. బేలుదారి, ఇల్లుకట్టే పనివాడు ; 2. నేర్పరి.

**సుతాల్** వి. 1. అర్ధుచెక్క ; 2. కిటికీమీద నన్ షేడులాగా దించినరాతిపలక.

నం. సుతాల-. మంచిశాళం.

**సుతాశము** వి. అతిశయం. కవిరాజ. 497.

**సుతి** వి. 1. శ్రుతి, పల్నా. పు. 17 ; 2. కంఠస్వరాదులకి సహాయమయ్యేతీగ మొ. వాటిధ్వని. ప్రబంధ. 706 ; 3. కొలిమితిత్తి ; 4. షడ్జాది స్వరారంభకావయవమైన హ్రస్వ మాత్రకశబ్దవిశేషం.

క. సుతి ;

నం. శ్రుతి-. చెవి, ధ్వని, వేదం, సుతి ; అ.మా. ప్రా. సుఇ- ; ప్రా. సుఇ- ; పా. సుతి.

**సుతికా(డు** వి. శ్రుతిచేసేవాడు. ఆం. భా. 2.287. **సుతిగూడు(-కూడు²)** అ.క్రి. శ్రుతికలుపు. రాజవా. 4.108. **సుతిగూరుచు(-కూరుచు)** రూ. సుతిగూర్చు. అ.క్రి. శ్రుతి కూర్చేట్లుచేయు. దశా. 4.119. **సుతిగూర్చు** రూ.చూ. సుతిగూరుచు. అ.క్రి. శ్రుతికూర్చేట్లు చేయు. **సుతిమించి రాగానపడు** అ.క్రి. అతిశయించు. విజృంభించు. **సుతి మించు** అ.క్రి. 1. మితిమీరు ; 2. చెలరేగు. **సుతిమీటు** స.క్రి. శ్రుతివిర్పడేట్లు తీగమీటు. చంద్రికా. 4.107. **సుతిమీఱు** అ.క్రి. అతిశయించు. చెలరేగు **సుతిమెత్తన** వి. మిక్కిలిమెత్తన.

**సుతినీ** రూ.చూ. సుదినీ. వి. నేతలో నిలువుకు అడ్డానికి రెండేసి పోగుల చొప్పున పెట్టి నేసిన దుప్పటి.

**సుతిలి** వి ఏకుబద్దకు కట్టిన గట్టి పురిదారం.

**సుత్తరుపు** వి. గజకాల మొ. వి. నిర్మించటానికి పాతేమేకు. వరాహ. 4.113.

**సుత్తర్లు** వి. నిర్మాణవిశేషం, ఒకరకమైన కట్టడం. ద.హిం.శా. సంపు. 5. శా.నం. 118, క్రీ.శ. 1434.

**సుత్తి** రూ.చూ. సుత్తె. వి. చిన్నసమ్మెట, కంచరి మొ. వారి పనిముట్టు. ఆం.భా. 2.298.

**సుత్తియెముక (-ఎముక)** వి ఎముక. **సుత్తిరాతు** వి. గోడల కట్టుబడిలో వాడే రాతిముక్క. **సుత్తివర** వి. ఒకరకంచేప. (Rhinobatus granilatus).

**సుత్తిడి** రూ.చూ. సుత్తె. వి. కొయ్యపిడికి ఒకవైపున తగిలించిన లోహపు తలగల పరికరం.

**సుత్తియ** రూ.చూ. సుత్తె. వి. 1. తాడపు, బంగారం నరికేఉలి, చీనాం సేనం ; 2. సవాణం, ప్రావణం.

**సుత్తు** చూ. సుత్తె. వి. వడ్డెసిబ్బి అంచున గుండ్రంగా చుట్టిన వెదురుచువ్వ.

**సుత్తె** రూ. సుత్తి, సుత్తిడి, సుత్తియ. వి. దాగలిమీద బంగారం మొ. వాటినుండి సాగగొట్టే సాధనం, చిన్న సమ్మెట, అల్పనంఖి. పల్నా. పు. 42, రాజవా. 1.9

క. సుత్తిగె, సుత్తి ; తు. సుత్తి, సుత్తిగె, సుత్తియె, సుత్తె, సుత్యె. సుత్తి ; త. చుత్తి, చుత్తియల్. చిన్న సుత్తి ; మ. చుత్తి, చుత్తిక. సుత్తి.

**సుత్తెమలుపు** వి. బూసి చెక్కుడు రాతిని సుత్తెలతో కొట్టిచెక్కటం.

**సుత్రాము** రూ.చూ. సుతరాము. అవ్య. పూర్తిగా.

**సుత్లిడోరి** వి. దారం, శివాసీ నేతలో నిలువుకు వాడేదారం.

**సుత్లిదారం** వి. నారతో పేనిన తాడు, పురికొస.

**సుద** రూ.చూ. తుది. విశ. చివరిది, కడపటిది. నరస. 5.22, గౌ. హరి. ఉ. 2.55.

**సుదకువచ్చు** అ.క్రి. స్మృతికివచ్చు. నిరంకు. 2.34.

**సుదిని** రూ.చూ. సుదినీ. వి. పక్క మీద పరిచే దుప్పటి.

**సుదినీ** రూ. సుజినీ, సుతినీ, సుదిని, సుదీన, సూదినీ. వి. నేతలో నిలువుకు అడ్డానికి రెండేసి పోగుల చొప్పున పెట్టి నేసిన

దుప్పటి.

**సుదీన** వి. పక్కమీదపరచే దుప్పడి.

**సుదుగాడు** రూ.చూ. సుడిగాడు. వి శ్మశానం,

**సుదుము** వి. ఎక్కువగా నలగిపోయిన గడ్డి.

**సుదేసెంఅంచు** రూ.చూ. స్వదేశం అంచు. వి. లోపలి అంచు అయిదు కొలుకులు తెలుపుఅయిదు కొలుకులు పదిపది హేనుకొలుకులు గోటు అయిదుకొలుకులు రంగు తర్వాత చిగురుచొప్పునవరసగా వచ్చేట్టునేసిన అంచు.

**సుద్ద** రూ. చుద్ద, శుద్ద. వి. **1**. గొడ్డ, మట్టిఉండ తేరాల శాసనం. సంపు. **3**. శా.సం. 16. క్రీ.శ. 678 ; **2**. గవ్వముక్కల నుండి ఏర్పడి ముగ్గులు పెట్టటానికి వాడబడే సున్నపు జాతికి చెందిన తెల్లని మట్టిముద్ద. ఆం. భా. 2.5 ; **3**. ముగ్గుగా ఉపయోగించే ఒకరకం తెల్లని గట్టిమట్టి ; **4**. మూత్రం గుండా బయటపడే తెల్లటి పదార్థం, ఇది ఒక వ్యాధి ; **5**. సారెపలకమీద వేసిన మట్టిముద్ద ; **6**. సున్న పురాయి **7**. మొద్దు మనిషి.

సం. సుధా ; అమృతం, సున్నం ప్రా. సుధా ; మహా. సుహా. శ్వేతద్రవ్య విశేషం ; అ.మా. సుహా ; పా. సుధా. సున్నం, పాల గచ్చు, వెల్ల ;

క. సొదె. సున్నం, గార, గచ్చు ; కువి. సుత్తె, సుద్దె. సున్నం,

<ప్రా. సుధా.

**సుద్దకట్టు** వి. మట్టి ముద్దలను పేర్చి కట్టే పద్ధతి, **సుద్దకట్టునేల** వి. మెత్తని సున్నపురాళ్ళనేల. **సుద్దకరి** రూ.చూ. సుద్దక్రి. వి. అచ్చమైన నలుపు. **సుద్దక్రి** రూ. సుద్దకరి. వి. అచ్చమైన నలుపు. **సుద్దగడ్డ** వి. తెల్లమట్టి నేల ; **2**. మిద్దెల మీద పరిచే తెల్లమట్టి. **సుద్దచవుడు** వి. సున్నం కలిపిన చవుడు. **సుద్దబట్టి** వి. **1**. తెల్లమట్టినేల ; **2**. మిద్దెలమీద పరిచే తెల్లమట్టి. **సుద్దబెట్టి** వి. **1**. ముగ్గులు పెట్టటానికి ఉపయోగపడే గవ్వముక్కల నుంచి ఏర్పడ్డ సున్నపురాతి జాతికి చెందిన మట్టిముద్ద ; **2**. సున్నపురాళ్ళ గరుప. **సుద్దబెళుకు** వి. మెత్తనిపలక (బెళుకు) రాళ్ళు గల నేల. **సుద్దరాయి** రూ. శుద్దరాయి. వి. **1**. తెల్లరాయి, ముగ్గు వేసుకోవటానికి పనికివచ్చే తెల్లని మెత్తనిసిరాయి ; **2**. ఇళ్ళుకట్టటంలోను, రోడ్లు వేయటంలోను, అలంకరణ సామగ్రిగాను ఎక్కువగా వాడుకలో ఉన్న సున్నపురాయి ; **3**. నాపరాయి, జిగురుమట్టి ఘనీభవం పొంది సాగేశక్తిని కోల్పోయిన దశలో ఉన్న మస్టురాయి ; **4**. కట్టుడురాయి, ఉత్తరకోస్తాలో గృహనిర్మాణానికి వాడబడే గోదుమరంగు కలిసిన బూడిదరంగురాయి ; **5**. లింగరాయి, సాధారణంగా తెలుపు. బూడిదరంగు నీడల్లోను, కొద్దిసమయాల్లో ఆకు పచ్చ, ఎరుపు రంగుల లేతచాయల్లోను దొరికేరాయి ; **6**. ఎర్రాయి, నిర్మాణద్రవ్యంగా వాడుకలో ఉన్న, చాలా వన్నెల్లో దొరికే 'క్వార్జ్' జాతికి చెందిన మిశ్రశిల ; **7**. పింగాణీ తయారీకి. విరేచనాలు కట్టటానికి వైద్యంలోను, కాగితం, రబ్బరు, రంగులతయారీలో నింపుడుద్రవ్యం గాను వాడబడేరాయి ; **8**. పచ్చసుద్ద, పరుపుడురాయిగా వాడబడే పసుపురంగు కలిసిన ఆకుపచ్చరంగు ముదురు చాయల్లో పలకలుగా దొరికేరాయి ; **9**. మెగ్నీషియం సిలికేట్ ఆనేద్రవ్యానికి సూక్ష్మరూపమైన ఈరాయి స్టియటైట్‌కు మరొక రూపభేదం. **సుద్దవేయు** అ.క్రి. పాంక మట్టిని సారెపలకమీద ముద్దగా పెట్టు.

**సుద్దగించు** చూ. సుద్దము.

**సుద్దంతట్టుట** చూ. సుద్దము.

**సుద్దము** వి. **1**. నిర్మలం. అచ్చ. రా. సుందర. 83 ; **2**. నిర్దోషం. శశా. 1.28.

సం. శుద్ధ -పవిత్రం, నిర్దోషం, ఉజ్జ్వలం : ప్రా. సుద్ధ- ; అ.మా.పా. సుద్ధ- ;

క. సుద్దగె. స్వచ్ఛత ; త. సుత్తమ్ ; తొ. సుద్ఌ.

<ప్రా. సుద్ధ-.

**సుద్దగించు** అ.క్రి. కంసాలి బంగారం మొ. వాటిని సుత్తె పిడితో మిట్టపల్లాలు లేకుండా చేయు. హంస. 2.182. <సుద్దము + ఇంచు.[3] **సుద్దంతట్టుట** వి. కమ్మరిపనిలో ఒకటి. (నెల్లూరు తిరుపతి దత్తమండలం వాడుక). **సుద్దం బద్దం** వి. మంచీచెడు. సం. బద్ధ-కట్టబడినది. <సుద్దము + సం. బద్ద-+-ము.

**సుద్దంబద్దం** చూ. సుద్దము.

**సుద్ది**[1] వి. **1**. నుడి, మాట ర.ంరా. అయోధ్యా. **94**పు. **13**పం ; **2** వృత్తాంతం, వార్త. శృం.నై. 1.74 ; **3**. సామెత, కాశీ. **5.292** ; **4**. ప్రసంగం. ప్రబోధ. 2.46 : **5**. జాడ. ప్రభా **2.104** ; **6**. సల్లాపం, ముచ్చట. దశా. 6.86 ; **7**. జోస్యం ; **8**. పాటగాచెప్పే వీరుల కథ ; **9**. విషయం, జోలి.

సం. సూక్తి-నుడి, మాట, శ్రుతి-. సామెత; ప్రా. సుత్తి. సుభాషితం, సుందరవచనం ; అ.మా. సుద్ధి. వార్త ; పా. సుత్తి ;

క.సుత్తి ; తు. సుజ్జి. సుద్ధి ; తొ. సుద్య : కుఇ. సొద్ది సొది. వార్త.

<ప్రా. సుత్తి.

**సుద్దులకత్తియ** రూ.చూ. సుద్దులకత్తె. వి. మాటకారి. మంచిమాటలు చెప్పే స్త్రీ. **సుద్దులకత్తె** రూ. సుద్దులకత్తియ. వి. మాటకారి, మంచిమాటలు చెప్పేది. గౌ. హరి.పూ. 6. **సుద్దులకన్నియ** రూ.చూ. సుద్దులకన్నె. వి. సరస్వతి, వాణి. **సుద్దులకన్నె** రూ. సుద్దులకన్నియ. వి. సరస్వతి. రాజవా. 1.3. **సుద్దులకుమారు(డు** వి. గొల్లసుద్దులు పాడే వాడు. సం. కుమార-. పుత్రుడు. **సుద్దులకుమాళ్లు** వి.బ.వ. గొల్లసుద్దులు పాడేవాడు. హంస. 3.29. **సుద్దులకొమారు(డు** వి. గొల్లసుద్దులు మొ. వి చెప్పి జీవించేవాడు. **సుద్దులమారి** వి. **1**. వాచాలుడు, ప్రేలరి, వదరుబోతు. హంస. **5.113** ; **2**. తుంటరి. **సుద్దులవాళ్ళు** విణ. బ.వ. నేతపనిచేసే దేవాంగుల దగ్గరకథలుచెప్పి అడుక్కునే వాళ్ళు. **సుద్దులాడు** అ.క్రి. **1**. మంచిమాటలుచెప్పు ; **2**. సోదెచెప్పు ; **3**. నీతులుచెప్పు, **సుద్దులు** వి.బ.వ. **1**. గొల్లసుద్దులు ; **2**. మంచిమాటలు, సూక్తులు. **సుద్దులుకల్పించు** అ.క్రి. అపదూరు కల్పించు. కళా. 6.153. **సుద్దులుచెప్పు** అ.క్రి. డంబాలు పలుకు. ద్వి. పరమ. వి. 3.180.

**సుద్ది**[2] విణ. ధౌతం, శుచిఅయిన. శుక. 1 526. చమ 2.12 ;

వి. మైలవిడుపు, పరిశుద్ధి.

సం. శుద్ధి-. నిర్దోషత, నిర్మలత్వం; ప్రా. సుద్ధి; అ.మా. పా. అప. సుద్ధి.

క. సుద్ది ; త. చుత్తమ్. చుత్తి, చుద్ధి.

<ప్రా. సుద్ధి-.

**సుద్దిగాఁడు** వి. పరిశుద్ధుడు. శుక. 1.481. **సుద్దిచేయు** స.క్రి. శుద్ధిపరచు. **సుద్దీబుద్దీలేకుండు** అ.క్రి. మంచీ చెడ్డా లేకుండు. సం. బుద్ధి-. తెలివి.

**సుద్దీ** అవ్య. పూర్తిగా, సుతరాం.

సం. సుధీ. మంచిబుద్ధి.

<సం. సుధీ.

**సుద్దీబుద్దీలేకుండు** చూ. సుద్ది[2].

**సుద్దులకత్తియ** చూ. సుద్ది[1].

**సుద్దులకత్తె** చూ. సుద్ది[1].

**సుద్దులకన్నియ** చూ. సుద్ది[1].

**సుద్దులకన్నె** చూ. సుద్ది[1].

**సుద్దులకుమారుఁడు** చూ. సుద్ది[1].

**సుద్దులకుమాళ్లు** చూ. సుద్ది[1].

**సుద్దులకొమారుఁడు** చూ. సుద్ది[1].

**సుద్దులమారి** చూ. సుద్ది[1].

**సుద్దులవాళ్ళు** చూ. సుద్ది[1].

**సుద్దులాడు** చూ. సుద్ది[1].

**సుద్దులు** చూ. సుద్ది[1].

**సుద్దులుకల్పించు** చూ. సుద్ది[1].

**సుద్దులుచెప్పు** చూ. సుద్ది[1].

**సుధాయిన** వి. ఒకస్వరస్థాయి. బసవ. 71పు. 11పం.

సం. సుధాయన-. అమృతమార్గం.

<సం. సుధాయన-.

**సునాతి** వి. సౌకుమార్యం.

**సునామణి** వి. **1.** చదివి వినిపించటం ; **2.** సవరణ ; **3.** నెరవేరటం.

సం. శ్రావణ-. వినిపించటం.

**సునాముఖి** వి. ఒకానొకమందాకు, లేహ్యంలోను, విరోచనకారి గాని ఉపయోగించే ఆకు.

ఒ. సునాముఖీ. ఒకరకంఆకు.

<ఒ. సునాముఖి.

**సునాయించు** స.క్రి. **1.** వినిపించు ; **2.** సర్దుకొను.

హిం. సునానా. వినిపించటం.

<హిం. సునా(నా)+-ఇంచు[3].

**సునితి** రూ.చూ. సున్నతీ. వి. **1.** తురకల ఉపనయనం ; **2.** నష్టం ; **3.** కోయటం.

**సుంత** వి. కొంచెం, ఇంచుక. పాండు. **5.263.**

సం. సూక్ష్మతా. కొంచెంతనం.

**సుంతాను** రూ.చూ. సురతాణి[2]. వి. మహమ్మదీయ ప్రభువు.

**సుందరమణిచీర** వి. డైమండ్ చుక్క మాదిరి డిజైన్లు పడేట్లు నేసినచీర.

సం. సుందరమణి. అందమయినమణి.

**సుందరాపుసట్టు** వి. అబ్బుగుల్ల, ఉష్ణదేశాల్లో వానాకాలం తర్వాత భూమి లోపలి పొరల్లో ఉన్న సుద్దనీరు ఉపరితలానికివచ్చి ఆతర్వాత బెట్టగా ఉండే, దీర్ఘకాలంలో ఎండి, భూమిపైపొరకు దిగువనే పొరగట్టి గట్టిపడుతుంది. ఈ పొర సాధారణంగా ముద్దముద్దగా, ముడిముడిగా, గుల్ల గుల్లగా ఉండి ఇనుముతో సుద్దతో కలిసి ఉంటుంది. దీన్ని సాంకేతికంగా '"కేలైసైట్," కంకర్ అంటారు. దీన్ని కాల్చి సున్నంతయారుచేస్తారు. తీవ్రతాపోష్ణ పీడనాల వల్ల కాలక్రమాన ఇదే సున్నపురాయిగా మారి నిర్మాణద్రవ్యంగా ఉపయోగపడుతుంది.

**సున్న** రూ. చిన్ని, సున్ని[2], సున్ను. వి. **1.** లేనిది, శూన్యం. మను. **4.105,** విక్ర. 5.126 ; **2.** అనుస్వారం, బిందువు. ఇది నిండుసున్న అరసున్న అనిరెండు విధాలు. అము. 2.11 ; **3.** సారెమొల దించటానికి గుబ్బిరాయి మధ్యలో పెట్టినరంధ్రం.

సం. శూన్య-. వట్టిది, రిక్తం ; ప్రా. సుణ్ణ-. నిర్జనస్థానం, శూన్యం, సున్న, పూర్ణబిందువు ; శౌ. సుణ్ణ- ; అ.మా. సుణ్ణ-, సున్న. శూన్యం, బిందువు ; అప. సున్నా, సున్న. శూన్యాశూన్యాలు ; పా.సుఞ్ఞ-;

క. సున్న, సున్నె. సొన్నె. సున్న, చుక్క ; తు. సొన్నె ; త. సొన్నె. సున్న, చుక్క ; మ. సున్నం. పూర్ణబిందువు ; కువి. సున్న ; బ్రా. సున్. వట్టిది. రిక్తం.

<ప్రా. సుణ్ణ-.

**సున్నకుసున్న హళ్ళికిహళ్ళి** వి. ఏమీ మిగలలేదనటం. **సున్నగిలు** రూ.చూ. సున్నగిల్లు. అ.క్రి. **1.** శూన్యమగు ; **2.** గుంత్రమగు. **సున్నగిల్లు** రూ. సున్నగిలు. అ.క్రి. **1.** శూన్యమగు ; **2.** గుంత్రమగు. **సున్నగు** అ.క్రి. శూన్యమగు, క్షీణించు, తగ్గు. మను. 3.117. <సున్న+అగు. **సున్నచుట్టు** అ.క్రి. 1. శూన్యంచేయు, లేదను ; **2.** ఓడించు ; **3.** చెరచు. **సున్నచేయు** రూ.చూ. సున్నసేయు. స.క్రి. శూన్యంచేయు. **సున్నపెట్టు** రూ.చూ. సున్నఁబెట్టు. స.క్రి. **1.** వంచించు. రాధికా. **4.103** . **2.** బాకీ ఎగవేయు. **సున్నఁబెట్టు (-పెట్టు)** స.క్రి. మోసగించు, సున్నచుట్టు. రాధికా. 4.81, **సున్నరాయి** రూ. సున్నారాయి, సున్నిరాయి, సున్నురాయి. వి. సారెమొల దించటానికి గుబ్బ గడ్డలో పొదిగిన రంధ్రంఉన్నరాయి. **సున్నసేయు (-చేయు)** రూ. సున్నచేయ. స.క్రి. శూన్యం చేయు. భాగ. 10పూ.977.

**సున్నంరాయి** చూ. సున్నము.

**సున్నంరౌతు** చూ. సున్నము.

**సున్నంవేయు** చూ. సున్నము.

**సున్నతల్** రూ.చూ. సున్నతీ. వి. మహమ్మదీయులు చేసే లింగాగ్ర చర్మభేదనం.

**సున్నతి** రూ.చూ. సున్నతీ. వి. శిశ్నం కొనతోలును ఛేదించటం.

**సున్నతీ** రూ. సునితి, సున్నతల్, సున్నతి, సున్నితి. సున్నితీ. వి. శిశ్నం కొనతోలును ఛేదించటం. భద్ర.శ.6.

హిం సున్నత్. మహమ్మదీయులు బాలుర లింగాగ్ర

చర్మాన్ని ఛేదించేపని ; ఉ. సున్నత్. నియమం పద్ధతి, మహమ్మదీయులు చేసేపని, లింగాగ్రఛేదనం ; పార. సున్నత్. సున్నా, అఖ్యానం, ఆచారం, భగవదాదేశం;

క. సునతి, సున్నతి ; త. చున్నత్తు, సున్నత్ ; మ. సున్నత.

<ఉ. సున్నత్.

**సున్నపు(గాయ(-కాయ)** చూ. సున్నము.

**సున్నపురాయి** చూ. సున్నము.

**సున్నము** వి. ముత్తెం మొ. వాటినికాల్చిన తెల్లటి ఒకపదార్థం. పండి.చ. 5.317, భీమ. 2.126.

సం. చూర్ణ-. సున్నం ; ప్రా. చుణ్ణ- ; అప. చుణ్ణ-. ; పా. అ.మా. శౌ. జై. మహా. మా. చుణ్ణ- ;

క. సుణ్ణ ; తు. సుణ్ణ. సున్నం, గార ; తొ. సుణ్ ; మ. చుణ్ణం ; కుఇ. సునొ ; కువి. సునోమి, హున్ను ; పర్జి. చూన ; ఒరయాన్. చున్నా ; బ్రాహు ఈ. చున్.

<ప్రా.చుణ్ణ ;

**సున్నపు(గాయ(-కాయ)** వి. చూర్ణకరండం. ఆం.భా. 2.167. **సున్నపురాయి** వి. సున్నంరాయి. తాళ్ల.సం. 4.93. **సున్నసున్నము** వి. పాలగార. మను. 5.38.

**సున్నసున్నము** చూ. సున్నము.

**సున్నారాయి** రూ.చూ. సున్నరాయి. వి. సారెమొలదించటానికి గుబ్బ గడ్డలో పొదిగిన రంధ్రం ఉన్నరాయి.

**సున్ని** వి. 1. నలుగుకై పచ్చిపెసలు మొ. వాటిని దంచి చేసినపొడి. రంగా.చ. 3.221 ; 2. మినుం, బియ్యం మొ. వాటిపిండి. చెన్నబసవ. 2.78.

సం. చూర్ణ. పొడి ; ప్రా ; చుణ్ణిఅ, చున్నియ. చూర్ణితం, నలగకొట్టబడినది ; అ.మాగ. చుణ్ణిఆ. ఒక వస్తువును ముక్కముక్కలుగా చేయటం.

<ప్రా. చుణ్ణిఅ.

**సున్నిఉండ** మినప్పిండి, బెల్లం, నెయ్యికలిపిచేసిన భక్ష్య విశేషం. **సున్నిపిండి** వి. మినప్పిండి, బెల్లం, నెయ్యి కలిపి చేసిన తినుబండారం.

**సున్నితము** విణ. కచ్చితం. పురుషోత్తమకవీయము. 135.

సం. సునిహిత-. బాగాఉంచబడింది.

<సం. సునిహిత-.

**సున్నితి** రూ.చూ. సున్నతీ. వి. శిశ్నంకొనతోలును ఛేదించటం.

**సున్నితీ** రూ.చూ. సున్నతీ. వి. శిశ్నంకొనతోలును ఛేదించటం.

**సున్నిరాయి** రూ.చూ. సున్నరాయి. సారె మొలదించటానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం ఉన్నరాయి.

**సున్నురాయి** రూ.చూ. సున్నరాయి. వి. సారె మొలదించటానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం ఉన్నరాయి.

**సుపాణి** రూ. సుప్పాణి. వి. 1. శుభ్రమైన నీరున్నముత్యం. నవనాథ. పు.56 ; 2. ముత్యాల్లో ఉండే తళుకు తెలుపు. వసు. 5.87, నవనాథ. 420పు ; 3 ముత్యం.

మరా. సుపాణీ. కాంతిమంతమయిన, మిర్మిట్లుగొలుపు.

<మరా. సుపాణీ.

**సుపారి** వి. వక్క.

హిం.ఉ. సుపారీ. పోకచెట్టు, వక్కలు ; త. సుపారి.

<ఉ. సుపారీ.

**సుప్పనక** రూ.చూ. చుప్పనాక. వి. శూర్పణఖ. అచ్చ.రా. అరణ్య. 8.

**సుప్పనాక** రూ.చూ. చుప్పనాక. వి. శూర్పణఖ.

**సుప్పనాతి** రూ.చూ. చుప్పనాక. వి. శూర్పణఖ. అచ్చ.రా. అరణ్య. 15.

**సుప్పాణి** రూ.చూ. సుపాణి. వి. 1. ముత్యం. కృష్ణరా. 3.75 ; 2. శుభ్రమైన నీరున్నముత్యం. లక్ష్మీవి. 5 4 ; 3. ముత్యాల్లో ఉండేతళుకు తెలుపు.

**సుప్పులు** వి.బ.వ. చక్కిలాలు.

సం. సూప -. సుఖసేయమైనవంటకం, వండినపప్పు ; ప్రా. సూవ - ; పా. సూప.

<సం. సూప - + - లు.

**సుఫా** రూ.చూ. సుబా. వి. రాష్ట్రం.

**సుఫేద్** వి. తెలుపు (తివాసీనేతపనివాళ్ళవాడుక).

హిం. ఉ. సఫేద్. తెలుపు.

<ఉ. సఫేద్.

**సుబ** రూ.చూ. సుబా. వి. 1. రాష్ట్రం. దేశంలో కొంతభాగం ; 2. సుబేదారు.

**సుబా** రూ. సుఫా. సుబ, సూబా. వి. 1. రాజ్యభాగం. రాష్ట్రంలో ఒకభాగం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 772. క్రీ.శ. 1667. రంగా.చ. 1.138 ; 2. మండలాధిపతి. రంగా.చ. 2.172.

హిం ఉ. పార. సుబా. కొన్నిజిల్లాలు కలిసిన రాష్ట్రం, దేశభాగం ; మరా. సుబా. రాష్ట్రం, ప్రాంతానికి అధికారి.

<ఉ. సుబా.

**సుబాగిరి** వి. రాష్ట్రాధిపత్యం.

ఉ. సూబహ్‌గిరి. రాష్ట్రాధికారం ; పార. సుబహ్‌గిరి.

<ఉ. సూబహ్‌గిరి.

**సుబాణము** వి. ఒకరకం ఫిరంగి.

సం. సుబాణ-. మంచిబాణం.

<సం .సుబాణ-. (అర్థవిపరి.).

**సుబాదారి** రూ.చూ. సుబాదారు. వి. రాష్ట్రపాలకుడు, స్థానిక సైనికాధికారి. సాంబ. దేవ. 11.

**సుబాదారు** రూ. సుబాదారి, సుబేదా, సుబేదార్, సుబేదారు. వి. 1. రాష్ట్రపరిపాలకుడు, స్థానికసైనికాధికారి. ఆనంద, పీఠి. 128.

హిం. సుబేదార్. చిన్నప్రాంతానికి శాసకుడు ; మరా. సుబేదార్. దేశప్రాంతాధికారి ; ఉ. సుబాదార్, సుబేదార్, ప్రాంతానికధిపతి, కొంతదేశభాగాన్ని శాసించేవాడు, కొంతసైన్యానికధిపతి ; పార. సూబా. కొన్ని జిల్లాలు కలిసినరాష్ట్రం, దేశభాగం. సుబాదార్. రాష్ట్ర నాయకుడు, గవర్నరు, సైనికోద్యోగి.

<ఉ. సుబాదార్.

**సుబిరె** రూ.చూ. సూరె[2]. వి. 1. అచ్చు కట్టేటప్పుడు

అనివెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్నబెత్తం ; 2. దండెదగ్గరి పడుగు పోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం.

సుబిరెలాకు వి. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురు బద్ద.

సుబేదా రూ.చూ. సుబాదారు. వి. రాష్ట్రాధిపత్యం.

సుబేదార్ రూ.చూ. సుబాదారు. వి. తాలూకాప్రధానాధికారి, సైన్యాధికారి.

సుబేదారు రూ.చూ. సుబాదారు. వి. 1. సేనాధికార్లలో ఒకడు. రంగా.చ. 1.147 ; ద.హిం.శా. సంపు. 10. శా.సం. 772. 5, క్రీ.శ. 1697 ; 2. సుబాకు ప్రభువు.

సుబ్బ(డు వి. కుమారస్వామి.

సం. సుబ్రహ్మణ్య-. కుమారస్వామి.

<సం. సుబ్రహ్మణ్య-.

సుబ్బదుంప వి. ఎర్రటి పూలుపూసే ఒకరకం చెట్టు. (Dioscorea tomentosa).

సుబ్బనచూలి చూ. సుబ్బు.

సుబ్బనచూలిలాడు చూ. సుబ్బు.

సుబ్బలి వి. జంబాలం, అడుసు.

సం. జంబాల-. అడుసు.

సుబ్బారాయుడుచీర చూ. సుబ్బ(డు. వి. ఒకరకం నాగుల చీర, ఒకఅంచు ఎరుపు, ఒకఅంచునలుపు పెట్టి పైటచెరగులో ఎరుపు, నలుపు పోగులు దూర్చి నేసినచీర.

సుబ్బి రూ. సుబ్బెం. వి. సోబి, సుబ్బెరి.

సం. శోభిన్. శోభించేది.

<సం. శోభిన్.

సుబ్బు అ.క్రి. 1. వ్యాపించు, ప్రసరించు. ప్రభా. 1.135 ; 2. బయల్పడు, ప్రకాశమగు. రాజవా. 2.60 ; 3. లోకప్రవాదం, జనశ్రుతి. కృ.శకు. 3.43 ; 4. గాలిమిటా.

సం. శుభ్ర-. స్వచ్ఛమైనది ;

క. సుబ్బు. శుభ్రం.

<సం. శుభ్ర-.

సుబ్బనచూలి వి. ప్రకటితమయ్యేట్లు చేసేకొల్ల, పెద్ద దోపిడి. భాస్క.రా.యు. 1453. సుబ్బనచూలిలాడు స.క్రి. పెద్దకొలగొను. హరి.ఉ. 9.83. <సుబ్బనచూలి+లు+ఆ(డు. సుబ్బుసుబ్బుల అవ్య.ద్రు. కుతూహలంతో. శుక. 3.48.

సుబ్బెం రూ.చూ. సుబ్బి. వి.సోబి.

సుమ రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మా, నిశ్చయార్థకం.

సుమతి వి. ద్వైతమతావలంబకుల బిరుదనామం. E.I.VI. 25. క్రీ.శ. 1281.

సం. సుమతి-. మంచిబుద్ధి, దేవతావరప్రసాదం, కోరిక.

<సం. సుమతి-. (అర్థవిపరి.).

సుమా రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మా; నిశ్చయార్థకం.

సుమాది వి. సోమరిపోతు, పనిదొంగ.

సుమారు రూ. శుమారు, షుమారు, సువా(రు. వి. 1. కొంచెం ఎచ్చుతగ్గు ; 2. రమారమి ; 3. నాసిరకం ; విణ. సమ్మరాని.

హిం. శుమార్. గణనం, లెక్క ; మరా. సుమార్, శుమార్. పరిమితి, మర్యాద, ప్రమాణం ; ఉ. షుమార్ ; పార. షుమార్. సంఖ్య, లెక్కపెట్టటం ;

క. షుమారు, సుమార, సుమారు ; త. చుమార్, సుమార్ ; మ. సుమార్.

<ఉ. షుమార్.

సుమాళము వి. 1. సంతోషాదులవల్ల కలిగిన పారవశ్యం. భార. విరా. 5.244 ; 2. మత్తత, గర్వం. నార.పంచ. 1.13 ; 3. సంతోషాతిశయం. వరాహ. 11.92 ; 4. వినయం, యయా. 5.46 ; 5. సుఖం. ఆం. భా. 1.98 ; 6. మూర్ఛ. ఆం. భా. 2.223.

సం. సుకుమార- మృదువైనది, అందమైనది ; ప్రా. సుమాల-, సుఉమాల-, సుఉమార-, సుకుమాల- అతికోమలం, సుందరం.

<ప్రా. సుమాల-.

సుమాళి విణ. సుమాళం కలవాడు, గర్వం కలవాడు. ఉ. హరి. 3.113. సుమాళించు అ.క్రి. 1. సంతోషంతో పరవశమగు. భార. విరా. 4.84 ; 2. ఉత్సహించు వేడుక పడు. కాశా. 7170, 202. <సుమాళము+ఇంచు.[3]

సుమాళి చూ. సుమాళము.

సుమాళించు చూ. సుమాళము.

సుమి రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మా, నిశ్చయార్థకం.

సుమీ రూ.చూ. సుమ్ము. అవ్య. 1. నిశ్చయార్థకం. భార. శల్య. 2.15.

సుంనపనులు చూ. సున్నము.

సుమ్మ రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మీ, నిశ్చయార్థకం.

సుమ్మా రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మీ.

సుమ్మి రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మా, నిశ్చయార్థకం.

సుమ్మీ రూ.చూ. సుమ్ము. అవ్య. సుమ్మా, నిశ్చయార్థకం. భార. విరా. 1.250.

సుమ్ము రూ. సుమ, సుమా, సుమి. సుమీ, సుమ్మ, సుమ్మా, సుమ్మి, సుమ్మీ. అవ్య. నిశ్చయార్థకం. భార. సభా, 2.18, భార. విరా. 5.320.

సుర[1] వి. గాలిసుడి.

సురకరువలి వి. సురగాలి, సుడిగాలి. భార. భీష్మ. 1.267. కొలా. చురగాలి. సుడిగాలి ; నా. సురఘాళి. సుడిగాలి ; పో. చూ. త. చురి. చుబల్, చుఋ.

సుర[2] వి. చిన్నకత్తి.

సురకత్తి రూ.చూ. చూరకత్తి. వి. చురకత్తి, చిన్నకత్తి.

సుర[3] విణ. పెద్ద.

సురకాని వి. కానిలో నాలగవభాగం. పాండు. 4.136.

సురకానియంత(-అంత) వి. కానంత. పాండు 4.136.

సురకాయ రూ.చూ. సొరకాయ. వి. సొరకాయ, ఆనపకాయ.

సురకాయలుపడుకు స.క్రి. కోతలుకోయు.

సురకొలి రూ.చూ. సుర్రకోవి. వి. ఒకరకం ఫిరంగి.

సుర[్రోలి రూ. సురకొాలి. వి. ఒకరకం ఫిరంగి. ఆం. భా. 2.218.

సురగజ్జెలు వి.బ.వ. చిరుమువ్వలు, ఒకరకం గజ్జెలు. కు. సం. 8.22.

సురగడ వి. ఒకరకంచెట్టు. (Gelonium lancatum).

సురగాడ్పు వి. సుడిగాలి. అచ్చ. రా. కిష్కిం. 60.

సురగాలి చూ. సురకరువలి. వి. 1. సుడిగాలి. హ.న. 3.35 ; 2. వేటకుక్క కియబడినపేరు. రాజవా. 3.54.

కొలా. చురగాలి ; నా. సురఘూళి- సుడిగాలి ; పో.చూ. త. చురి, చుఱల్, చుఙ్ఙు.

సురగి రూ.చూ. సురిగి. వి. శిఖరిణి, సురిగి, మల్లె.

సురంగమగు చూ. సురంగము[1].

సురంగము[1] వి. ప్రకాశం.

క. సురంగ. మంచిరంగు, ప్రకాశవంతమైనరంగు, ప్రకాశం.

<క. సురంగ.

సురంగమగు అ.క్రి. మనోహరమగు. కు. సం. 3.76.

<సురంగము[1]+అగు.

సురంగము[2] రూ.చూ. సొరంగము. వి. భూగర్భమార్గం.

సురఁగ వి. వృక్షవిశేషం. రక్తచందనవృక్షం. రం. రా. ఉ. 109పు. 8పం.

సం, సురంగా. రక్తచందనం.

<సం. సురంగా.

సురటి వి. రాగవిశేషం.

క. సురటి. ఒకానొకరాగం ; త. చురటి.

సురంటి రూ.చూ. సురంతి. వి. వీవన. కవిరాజ. 3.108.

సురంటీ రూ.చూ. సురంతి. వి. విసనకర్ర. చంద్రాంగ. 4.163.

సురంతి రూ. సురంటి, సురంటీ, సురఁటి, సురఁటీ. వి. చామరం. ద. హిం. కా.సంపు. 5. శా. సం.1212. క్రీ.శ. 1208.

సురఁటి రూ.చూ. సురంతి. వి. 1. వట్రువ, విసనకర్ర. గౌ. హరిశ్చ. 782, విక్ర. 6.67 ; 2. మల్లవిద్యావిశేషం. మల్లు. 3.69 ; 3. పారావతవిశేషం, పారావతం. ఆం. భా. 2.86 ; 4. గళవరం ఆం. పద. నానా. 72.

సురఁటితానము వి. విసనకర్రే పుట్టుకగా గలది. భార. ఆది. 3.134. సురఁటివీవనలఁబుట్టు(-పుట్టు) వి. వాయువు. సాంబ. దేవ. 13.

సురఁటీ రూ.చూ. సురంతి. వి. 1. వట్రువ, విసనకర్ర ; 2. మల్లవిద్యావిశేషం ; 3. పారావతవిశేషం, పారావతం ; 4. గళవరం.

సురతాణ రూ.చూ. సురతాణి. వి. పాదుషా, చక్రవర్తి. కాశీ. 6.309.

సురతాణి రూ. సుంతాను, సురతాణ, సురతాన్, సురతాని, సురతాను, సురత్రాణ, సురత్రాణి, సురత్రాణుండు. సురదాణి, సురధాన్, సురధాణ, సురధాణి, సురధాణు, సురధాని. సురదానీ, సురధాను, సులతా, సులుతాన్, సులతాను, సులతాని. సులతాను, సుల్త్రాణు, సులితాను, సుల్తాను, సుల్తారి. వి. 1. నవాబు. పిల్లలమఱ్రిశాసనం. 7.9 క్రీ.శ. 1357, భీమ. 1.38 ; 2. రాజి, స్వతంత్రు రాలు. క్రీడా. 1.50 ; 3. చక్రవర్తి, రాజు, సామంతరాజు. చంద్రాంగ. 4.179 ; 4. ఇంద్రాణి. శశా. 4.50 ; 5. ఇంద్రుడు ; విణ. మేలైనది. హంస. 5.356.

హిం. సుల్తాన్. ప్రభువు, చక్రవర్తి. మరా. సుల్తాన్. పాదుషా, ప్రభువు ; ఉ. సుల్తాన్. శాసకుడు, రాజు ; పార. సుల్తాన్, పరిపాలకుడు, ప్రభువు ; అర. సుల్తాన్. చక్రవర్తి, ప్రభువు.

<ఉ. సుల్తాన్.

సురత్రాణాదిశబాలు కృతకప్రామాణికాలు

సురతాణీలగ్గ వి. నాల్గుమూలలనుండి లగ్గపట్టటం. శుక. చ. 3.12. సురతాణిసలాము వి. నమస్కారభేదం. ప్రబంధ. 1.880.

సురతాన్ రూ.చూ. సురతాణి. వి. 1. ఖడ్గవిశేషం. వై.భా. పీఠి. 32 ; 2. వాద్యవిశేషం. ప్రబంధ. 605.

సురతాని రూ.చూ. సురతాణి. వి. వాద్యవిశేషం. ఒకరకం వీణ.

సురతాను రూ.చూ. సురతాణి. వి. పాదుషా. జైమినిభా. పీఠి. 32.

సురతిచెక్క వి. దక్కను అడువుల్లోనూ, కృష్ణానుండి మైసూర్ వరకూనూ. కోయంబత్తూర్‌లోనూ పెరిగే ఒకరకంతీగ, దీనివేరునుండి రంగుతయారుచేస్తారు. (Ventilago mandraspatana).

సురత్రాణ రూ.చూ. సురతాణి. వి. పాదుషా, చక్రవర్తి నె.శా. 1. సంపు. 23. క్రీ.శ. 1697, కాశీ. పీఠి. 58. భీమ. 1.29.

సురత్రాణి రూ.చూ. సురతాణి. వి. ప్రభువు. నె.శా. రాపూరు శాసనం. 78. క్రీ.శ. 1401.

సురత్రాణులు వి.బ.వ. సుల్తానులు. నె.శా. తామ్ర. 4.10. క్రీ.శ. 1528. < సురత్రాణి+-లు.

సురత్రాణుండు రూ.చూ. సురతాణి. వి. ప్రభువు. యయా. 1.15.

సురత్రాణులు చూ. సురత్రాణి.

సురదాణి రూ.చూ. సురతాణి. వి. పాలకుడు. ఏలిక. నవనాథ. పు.10.

సురధాన్ రూ.చూ. సురతాణి. వి. పాలకుడు, ప్రభువు. కాశీ. 5.339.

సురధాణ రూ.చూ. సురతాణి. వి. తురకదొర. భీమ. 1.74. హర. 1.22.

సురధాణి రూ.చూ. సురతాణి. వి. పాలకుడు, ఏలిక. A.R. No. 469 of 1915, 3వ పంక్తి. క్రీ.శ. 1496, హర. పీఠి. 22.

సురధాణు రూ.చూ. సురతాణి, వి. పాలకుడు. ఏలిక. శ్రీ. కూర్మశాసనం. A.L. No. 289 of 1896. 4.5పం. క్రీ.శ 1402.

సురధాని రూ.చూ. సురతాణి. వి. పాలకుడు, ఏలిక. కాశీ. 1.35.

**సురధానీ** రూ.చూ. సురతాణి. వి. ప్రభువు. ద.శా. 4.126.

**సురధాను** రూ. సురతాణి. వి. చక్రవర్తి. ద.శా. 4.122.

**సురపాది** వి. ఒకానొకచెట్టు, కాకాంగం, కాకిదొండ అని కొందరు.

**సురపొన్న** వి. సురపున్నాగం, నమేరువృక్షం. భార. ఆది. 5.20 (Gongifolium).

సం. సురపున్నాగ-. వృక్షవిశేషం.

క. సురహొన్నె. సురపొన్న.

<సం. సురపున్నాగ-.

**సురభిమాడ** వి. ఒకరకంమాడ. ద.హిం.శా. సంపు. 10.శా. సం. 713.క్రి.శ. 1205.

**సురమా** రూ.చూ. సురుమా. విణ. మిక్కిలి నల్లనిది.

**సురమాయి** రూ.చూ. సురుమా. విణ. చాలానల్లనిది. భాను. 3ఆ. వి. కాటుక.

**సురమాలి**[1] వి. ఎర్రరంగువస్తువు. నీలా. 3.90.

ఉ. సూర్ మాల్, సూర్. ఎర్రరంగు,మాల్. వస్తువు;

పార. సూర్. ఎర్రనిరంగు, మాల్. వస్తువు.

<ఉ. సూర్ మాల్.

**సురమాలి**[2] చూ. బాలీసు. వి. గాలినింపినది, బాలీసు (ఒకరకం తలగడ).

**సురయాళు** రూ.చూ. సురియాళు. వి. హరిజనుడు.

**సురళించు** రూ.చూ. సురాళించు. స.క్రి. దిగదుడుచు, చుట్టు తిప్పు.

**సురవన్నెలు** వి.బ.వ. వస్త్రవిశేషం. సిం.ద్వా. 3.206.

**సురవలకొట్టు** స.క్రి. మొట్టమొదట కుదం నలపతో వాటను గట్టిగా కొట్టు.

**సురసుర** రూ.చూ. సుఱసుఱ. వి. సుక్కటంలోని ధ్వనికి అనుకరణం. గౌ.హరి. పూ. 2232.

**సురసురలాడు** రూ.చూ. సుఱసుఱలాడు. అ.క్రి. 1. చికాకు కలుగు. 2. చికాకుపడు. <సురసుర+-లు+ఆడు. **సురసురస్రుక్కు** రూ. సుఱసుఱస్రుక్కు. అ.క్రి. బాధపడు. కాశ. 3. 155.

**సురాటము** వి. మల్లబంధవిశేషం. హంస. 1.206.

**సురాయి** రూ. సురై[1]. వి. తాగేనీళ్ళు చల్లగా ఉండటానికి వాడేకూజా, బుడిగి.

**సురాళము** వి.1. భూతాద్యావేశ జనిత శిరోభ్రమణం; 2. కోపావేశం.

**సురాళించు** రూ. సురళించు. స.క్రి. 1. దృష్టిదోషపరిహారం కోసం దిగదుడుపుతీయు. యయా. 2.4; 2. చుట్టుకొను, చుట్టుముట్టు, ద.శా. 8.48; 3. అలక్ష్యం చేయు, విదిలించు. <సురాళము+ఇంచు[3].

**సురాళించు** చూ. సురాళము.

**సురి**[1] రూ.చూ. చురియ. వి. చిన్నకత్తి.

**సురి**[2] రూ.చూ. సుడి. వి. దారపుపోగు మెలిదిరిగినప్పుడు వచ్చేగట్టితనం.

**సురినూలు** రూ.చూ. సుడినూలు. వి. పోగులు కలిపి పురిపెట్టిన నూలు. **సురిపట్టు** వి. రెండుమూడు పోగులు కలిపి వడిపెట్టిన పట్టు. **సురిపెటు** అ.క్రి. దారపు పోగును గట్టితనం రావడానికి పేను. **సురిబద్ద** వి. వాసాల మీద పూతపెండికి వేసినబద్ద.

**సురికి** రూ.చూ. సురికీ. వి. ఇటికగుండు, ఇటుకరాతిపొడి.

**సురికీ** రూ. సురిక, సురిఖి, సుర్కి, సుర్ఖీ. వి. ఇటుకగుండు, ఇటికరాతిపొడి.

హిం. సుర్ఖీ. ఎర్రని.

<హిం. సుర్ఖీ.

**సురిఖి** రూ.చూ. సురికీ. ఇటికగుండు, ఇటికరాతిపొడి.

**సురిగ** రూ.చూ. సురిగి. వి. చిన్నకొమ్మ, ఉపశాఖ, చెట్టు లేత కొమ్మ.

**సురిగి** రూ.సురగ, సురిగి, సురిగె, సులగ, సులిగె. వి. శిఖరిణి, ఒకజాతి మల్లెతీగ. గౌ. హరి. పూ. 47పు.

సం. శిఖరిణీ.

**సురిగిముంతలు** రూ.చూ. సురుగుముంతలు. వి.బ.వ నాగవల్లిపిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు.

**సురిగె** రూ.చూ. సురిగి.వి. 1. చిన్నకొమ్మ; 2. నేసిన గొంగడి బిగింపుకోసం ఉన్నిమగ్గం దోనెగాడిలో పెట్టినకర్ర; 3. ఒకజాతి మల్లెతీగ.

**సురి(గిపోవు** చూ. సురు(గు.

**సురిటికర్ర** వి. సురిటిగూడ (ఒకమనిషి తోడే గూడ) కు వేసిన పంగలకర్ర.

**సురిటిగూడ** రూ. సిరిటిగూడ. వి. చేగూడ, సించగూడ, ఒక మనిషి మాత్రం వేసే గూడ.

**సురిటెద్దు(-ఎద్దు)** వి. కడెద్దు, బంతిలో చివరిఎద్దు, బంతి తిప్పే ఎద్దు.

**సురియ** రూ.చూ. చురియ. వి. చురకత్తి. భార. అరణ్య. 2.88, కు. సం. 11.178.

**సురియకా(డు** వి. జెట్టి. సిం. ద్వా. 7.47.

**సురియాళు** రూ. సురయాళు, సురియాళువు, సురెయాళు, సురెయాళువు. వి. మాలవాడు. ఆము. 6.6.

**సురియాళువు** రూ.చూ. సురియాళు. వి. మాలవాడు.

**సురీపట్టము** వి. సూరత్‌దేశ సంబంధమైన పట్టుకాలువ. మను. 5.89.

**సురుకారు** రూ.చూ. సర్కారు. వి. ప్రభుత్వం.

**సురుకు**[1] రూ.చూ. చుఱుకు. వి. అముకాల్పుయొక్క వేడి.

**సురుకు**[2] రూ.చూ. జులుకు. వి. నాగటిమోకు చివర వేసే ముడి.

**సురుగాడ్పు** వి. సుడిగాలి. రసిక. 4.47.

**సురుగిముంతలు** రూ. సురిగిముంతలు. వి.బ.వ.నాగవల్లిపిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టి పాత్రలు.

**సురుగు** రూ.చూ. సొరుగు[2]. వి. చందువాపెట్టె.

**సురుగుడు** వి. ఒకానొక ఎర్రచాయచెట్టు. సురుగుడుచెట్టు. గౌ. హరి. పూ. 725 (Ventilago madras palatama).

**సురుగుడుకాయ** వి. 1. అర్కలత; 2. ఒకానొక ఎర్రచాయమొక్క. **సురుగుడుపట్ట** వి. సురుగుడుచెట్టు పట్ట.

**సురు(గంబడు** చూ. సురు(గు.

**సురు(గ(బడు** చూ. సురు(గు.

**సురు(గు** చూ. సొరుగు[1]. అ.క్రి. **1**. దాగు. భార. ఆరణ్య. 2.53 ; **2**. పారిపోవు. భార. కర్ణ. 2.82 ; **3**. తప్పించుకొను. భార. శాంతి. 5.203 ; **4**. తగ్గు, నశించు. కాశీ. 3.84 ; **5**. వాడు, మ్లానమగు. పల్నా. 2.68 ; **6**. బాధపడు. హ.న. 3౮ ; **7**. వెనుదీయు. గౌ.హరి. పూ. 1198 ; **8**. తప్పించుకొనిపోవు, గౌ.హరి. పూ. 1293 ; **9**. భగ్నమగు, విరుగు. వరాహ. 5.25 ; **10**. మరలు, పరాఙ్ముఖమగు. నార. పంచ. 1,30 ; **11**. మృతినొందు. వాశి.రా. 2.255 ; **12**. అదృశ్యమగు, కనబడకపోవు. విక్ర. 3.77 ; **13**. దొచ్చు, ప్రవేశించు. కావ్యా. చూ. 6.109 ; **14**. జారగా పోవు. కళా. 7.151 ; **15**. నిష్క్రమించు, తొలగు. యయా. 5.22 ; **16**. చలించు హ.న. 3.34.

క. సుర్కు, సుక్కు. సంకోచించు, తగ్గు, క్షీణించు, వెలసిపోవు, సుర్కు. సుక్కు, సుంకు, సొక్కు. మఃణుగు తగ్గు, క్షీణించు, సొరగు. వడలిపోవు, వాడు, ఎండిపోవు, సురుళ్. సంకోచించు, భయపడు ; తు. సురుంతుని, సురుతుని, సిర్లెటుని, సిరుందుని. సంకోచించు, మణుగు ; త. చురుంకు. తగ్గు, మునుగు, వణుకు, క్షీణించు, ముడుచుకొను, చురుక్కు. తగ్గు, ముడుగు, మూసుకొను, ముడతపడు, చురుళ్. వణకు, ముడుచుకొను, వంగు ; మ. చురుఙ్ఙక. వణకు, మునుగు, తగ్గు, క్షీణించు, చురక్కమ్. సంకోచం, చురుక్కు. జారు ముడి, చురుక్కుక. సంకోచించు, చుక్కుక. ఎండిపోవు, శుష్కించు, చుక్కు. పొడి, చూళుక. సంకోచించు, తగ్గు ; కో. చుర్గ్. మితంలోపెట్టు, నిలబెట్టు. చుర్క్. మణుగు ; తొ. తుడ్. తగ్గు, క్షీణించు ; గోం. సూర్ - ; పర్జి. చుర్క్. వణుకు, మునుగు ; కొలా. సుక్. వెలియు.

మూ.ద.ద్రా. *చుర్ -. ఉక్., చూ. స్రుక్కు.

**సురి(గిపోవు** స.క్రి. తగ్గిపోవు. కాశీ. 3.86. <సురుగు +-.ఇ[13]+పోవు. **సురు(గంబడు** రూ. సురు(గ(బడు. అ.క్రి. అదృశ్యమగు. హరి.ఉ. 5.20. <సురు(గు+ -.అ[7]+పడు. **సురు(గ(బడు** రూ.చూ. సురు(గంబడు. అ.క్రి. అదృశ్యమగు.

**సురుటిలెవిలి** రూ.చూ. సిరిట్‌లెవలు. వి. మట్టం సరిచూడటానికి తాపీపనివాళ్ళువాడే చిన్న పరికరం.

**సురుడు** వి. తెల్లటిపూలు పూసే ఒకరకం తీగ (Symphorema involucratum).

సం. సూర్య -. సూర్యుడు.

**సురుప్ప(-ఉప్పు)** వి. సురక్షారం, సురేకారం. ఆం.భా. 2.256.

**సురుమా** రూ. సురమా, సురమాయి, సురుమాయి, సుర్మా. వి. కాటుక. చంద్రభా. 2.131.

హిం. ఉ. సుర్మా. కళ్ళకు పెట్టుకునే ఒకరకం పొడి ; మరా. సురమా ; పార. సుర్మ ;

త. చురుమా.

< ఉ. సుర్మా.

**సురుమాయి** రూ.చూ. సురుమా. వి. కాటుక.

**సురుము** వి. చూర్ణం, పొడి.

సం. చూర్ణ -. పొడుము.

<సం. చూర్ణ -.

**సురుముకొను** స.క్రి. పొడిచేయు. **సురుముచేయు** అ.క్రి. **1**. నిప్పుసెగకు వెంట్రుకలుకాలి చుట్టచుట్టుకొనిపోవు ; **2**. ఓటిగడ్డి బాగా ఎండిపోవు.

**సురుస** వి. ఎదురాకుతాపి, సన్నగా పొడుగ్గా కోలగాఉండే సన్నపనులకు వాడే రేకుగల చిన్నతాపి.

**సురుసుకొను** అ.క్రి. **1**. నిప్పుసెగకు వెంట్రుకలుకాలి చుట్టచుట్టుకొనిపోవు ; **2**. ఓటిగడ్డిబాగా ఎండిపోవు.

**సురూదూ** వి. తెల్లనిపూలుపూసే ఒకరకంతీగ (Symphosema involucratum).

**సురె** రూ.చూ. చురియ. వి. కత్తి. బసవ. 136పు. 16పం.

**సురెకారము** రూ.చూ. సురేకారము. వి. ఒకరకం ఉప్పు, పెట్లుప్పు.

**సురెయాళు** రూ.చూ. సురయాళు. వి. మాలవాడు.

**సురెయాళువు** రూ.చూ. సురియాళు. వి. మాలవాడు.

**సురేకారము** రూ. సురెకారము, సూరెకారము, సూరేకారము వి. ఒకరకం ఉప్పు, పెట్లుప్పు.

సం. సూర్యక్షార -. తీక్ష్ణమైన ఉప్పుదినుసు.

<సం. సూర్యక్షార -.

**సురై**[1] రూ.చూ. సురాయి. వి. తాగేనీళ్ళు చల్లగా ఉండటానికి వాడేకూజా.

**సురై**[2] రూ.చూ. చురియ. వి. చిన్నకత్తి.

**సుర్కి** రూ.చూ. సురికీ. వి. ఇటికగుండు, ఇటికరాతిపొడి.

**సుర్కిపని** వి. ఫ్లోరింగు, నేలనున్నబరిచే పని.

**సుర్ఖ్** రూ.చూ. సురికీ. వి. ఎరుపువన్నె, తివాసీ నేతపనివాళ్ళ వాడుక.

**సుర్మా** రూ.చూ. సురుమా. వి. కాటుక.

**సుర్లచెక్క** రూ. సుర్లసెక్క. వి. తంగుతయారు చెయ్యటానికి వాడే ఒకరకం చెట్టుబెరడు.

**సుర్లసెక్క** రూ.చూ.సుర్లచెక్క. వి. రంగుతయారుచెయ్యటానికి వాడే ఒకరకం చెట్టుబెరడు.

**సులసుల** రూ. సురసుర. వి. స్రుక్కటంలో అయ్యేధ్వనికి అనుకరణం. నిర్వ. రా. 7.84.

**సులసులలాడు** రూ. సురసురలాడు. అ.క్రి. **1**, చికాకుపడు ; **2**. చికాకుకలుగు. **సులసులస్రుక్కు** రూ.చూ. సురసుదస్రుక్కు. అ.క్రి. బాధపడు.

**సులియ** రూ.చూ. చురియ. వి. చురకత్తి. కు. సం. 9.25.

**సుల్లు** వి. స్రుక్కటంలో అయ్యేధ్వనికి అనుకరణం, సిం.ద్వా. 2.160.

**సులగ** రూ.చూ. సురిగి. వి. చెట్టులేతకొమ్మ, సువ్వ.

**సులగలు** రూ.చూ. సెనగలు. వి బ.వ. బరికెలు, తినే. సెలగలు.

**సులతా** రూ.చూ. సురతాణి. వి. **1**. తురష్కప్రభువు ; **2**. ప్రభువు.

**సులతాన్** రూ.చూ. సురతాణి. వి. **1.** తురుష్కప్రభువు ; **2.** ప్రభువు.
**సులతాని** రూ.చూ. సురతాణి. వి. ప్రభువు. ద.హిం.శా.
**సులతాను** రూ.చూ. సురతాణి. వి. **1.** ప్రభువు. కాశీ. 1.35 ; **2.** తురుష్క ప్రభువు.
**సులత్రాణు** రూ.చూ. సురతాణి. వి. 1. తురుష్కప్రభువు ; **2.** ప్రభువు.
**సులప** వి. గొంగడి నేతలో పొడుగ్గా ఒకపక్కన వచ్చిన తెల్ల దారం.
**సులబు** రూ.చూ. శ్లాబు. వి. పడతరం, సిమెంటు పోత పోసి తయారు చేసిన కప్పు.
**సులభము** వి. సులువు, అల్పయత్నం. కవిక 2.46.
నం. సులభ -. సుఖంగా లభించేది, తేలికగా చేయదగిన, సహజమైన.
<నం. సులభ - (అర్థవిపరి.).
**సులాంకం** వి. తేలిక, సులభం.
**సులిగిరి** వి. చర్మవ్యాధి, నల్లచుండు. (ఇది రేగుముల్లు తాకిస్తే పోతుందని వైద్యులు).
**సులిగె** రూ.చూ. సురిగి. వి. నేసిన గొంగడి బిగింపు కోసం ఉన్నిమగ్గం దోనుగాడిలో పెట్టిన కర్ర.
**సులితాను** రూ.చూ. సురతాణి. వి. **1.** తురుష్కప్రభువు ; **2.** ప్రభువు.
**సులుగు** వి. సన్నటికర్ర, వంచితే వంగే లాంటిది. బడి పిల్లల్ని కొట్టటానికి ఉపయోగించే సువ్వ. బెత్తం.
**సులుతాను** రూ.చూ. సురతాణి. వి. ప్రభువు.
**సులుపు** రూ.చూ. సొల్పు[1]. వి. **1.** వాటం, ఒరపు, జారుడు ; **2.** నీళ్ళు పోయేదారి.
**సులుపుతాడు** వి. అచ్చు వడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. **సులుపుదారం** రూ. సొలుపుదారం. వి. అచ్చు వడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అనివెంబడి దూర్చిన దారం.
**సులుపుచేయు** అ.క్రి. పాత్రలకు నునుపుగా వంపు తీర్చు.
ఇం. *Slope*. వాలు.
<ఇం. Slope +చేయు.
**సులువు** రూ.చూ. సుళువు. విశ. **1.** చులకనైంది. ఆం.నా. శే. 27 ; **2.** శీఘ్రం ; **3.** ఆరోగ్యం ; వి. **1.** సులభం ; **2.** సమపాళం.
**సులేమాని** వి. ఒకవిధమైనరాయి.
హిం. సులేమానీ. తెలుకండ్ల గుర్రం, ఒకతరహా రాయి, సులేమాన్‌కు సంబంధించిన ; ఉ. అర. సులై మాని. సులేమానుకు సంబంధించిన, ఒకవిధమైన మణి, లేదా గోమేధికం.
<ఉ. సులైమాని.
**సులోచన** వి. లేతపచ్చరంగు.
నం. సులోచన -. లేడి. సులోచనా. అందమైన కన్నులు కలది.
<నం. సులోచన - (అర్థవిపరి.).
**సులోచనచీర** వి. లేత ఆకు పచ్చరంగు నూలుపెట్టి నేసిన చీర.
**సులోపు** రూ.చూ. సొల్పు[1]. వి. వాటం, ఒరపు, జారుడు.
**సులోబి** రూ.చూ. సులోబు. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.
**సులోబు** రూ. సులోబి. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య.
**సుల్‌కొమ్ము** వి. సన్నటి అందమైన కొమ్ములు.
**సుల్తాని** విశ. గవర్నమెంటుకు సంబంధించిన.
హిం. ఉ. సుల్‌తానీ. రాజసమైన. రాజసంబంధమైన ఎర్రని, ఒకవిధమైన పట్టుగుడ్డ ;
త. సుల్తాని. సుల్తాను కుమార్తె.
<ఉ. సుల్‌తానీ.
**సుల్తాను** రూ. సురతాణి. వి. ఒకానొక తురక పేరు. యయా. 3.1.
**సుల్తాను బహద్దరు** వి. పేర్లకు ముందుగాని వెనక గాని చేర్చబడే బిరుదు వాచకం.
**సుల్తారి** రూ.చూ. సురతాణి. వి. **1.** ప్రభువు ; **2.** మహమ్మదీయ ప్రభువు.
**సుల్ల** రూ.చూ. చుల్లి. వి. శిశ్నం, మగగురి.
**సుల్లకూత** వి. అబద్ధం. **సుల్లచుండి** రూ. సుల్లజుండు, వి. ఎంగిలిదద్దు. **సుల్లజుండు** (-చుండు) రూ.చూ. సుల్ల చుండి. వి. గుండ్రంగా దురదతో ఏర్పడే చర్మవ్యాధి (Ringworm). **సుల్లాయికూతలు** వి.బ.వ. **1.** ఎత్తిపొడుపు, ఎగతాళి, చూడలేనితనం, కలగలుపుగా ప్రదర్శించే మాటలు ; **2.** అపనిందావాక్యాలు.
**సుల్లాయి కూతలు** చూ. సుల్ల.
**సుల్వు** రూ.చూ. సుళువు. వి. సులభం . విశ. **1.** చులకనైన ; **2.** శీఘ్రం ; **3.** ఆరోగ్యమైన.
**సుళి** వి. బుకారం.
**సుళిగవ** (-కవ) వి. బుకారం, బూకారం. అప్ప. 3.45.
**సుళువి** రూ.చూ. సుళువు. వి. **1.** కిటుకు ; **2.** సులభం.
**సుళువు** రూ. సులువు, సుల్వు, సుళువి, సుళ్వు. విశ. లేత అయినది. చంద్రికా. 1.107.
నం. సులభ-. తేలికయినది ; ప్రా. సులహ- ;
క. సుళువు. సౌకర్యం, తేలిక, చులక, చులుకు. ప్రవర్తనలో తేలికదనం ; త. చుళువు. సౌకర్యం, చపుకదనం ; మ.చుళు. కో. చుళ్వ్. తేలిక, తేలికైనపని.
<ప్రా. సులహ-.
**సుళ్ళ** రూ.చూ. చుల్లి. వి. సుల్లాయిమాట, అసూయతో కూడిన ఎత్తిపొడుపు మాట.
**సుళ్ళకూతలు** వి.బ.వ. ఎత్తిపొడుపు మాటలు.
**సుళ్ళమారి** చూ. సుడి.
**సుళ్ళబెట్టు** చూ. సుడి.
**సుళ్ళు** చూ. సుడి.
**సుళ్ళగుక్కు** చూ. సుడి.
**సుళ్వు** రూ.చూ. సుళువు. వి. వీలు, అవకాశం. ప్రబంధ. 1.64.

సువర వి. చిట్టె, నాగటి మోకు చివర వేసేముడి.

సువర్ణరేఖ వి. ఒకరకం మామిడి పండు.

సం. సువర్ణరేఖా -. బంగారపు గీత.

<సం. సువర్ణరేఖా (అర్థవిపరి.).

సువలే(డు వి. శివుడు.

సం. శివ -. శివుడు ; ప్రా. సివ -.

<ప్రా. సివ- + ఱే(డు.

సువా రూ. జువ్వ³. వి. ఒకరకమైన బాణసంచు, తారాజువ్వ.

సువామి వి. అధికారి.

సం. స్వామిన్. ప్రభువు, యజమాని.

<సం. స్వామిన్.

సువార వి. పరక, పలచన.

సువారము వి. వంట. బహులా. 8.4, రామాభ్యు. 7.107.

సం. సూపకార-. వంటవాడు ; ప్రా. సూఅగార-, సూఅ యార-, సూఅర-, సూవయార-, సూవార-. వంట వాడు ; అ.మా. సుయార-, సూవార- ; క. సువార.

<ప్రా. సూఅగార-.

సువారంపుటిల్లు(-ఇల్లు) వి. అడసాల, సదనం. బహులా. 8.4. సువారంపు వా(డు విణ. అడబాల, సూపకారుడు, వంటవాడు.

సువారంపుటిల్లు(-ఇల్లు) చూ. సువారము.

సువారంపువా(డు చూ. సువారము.

సువా(రు యా.చూ. సుమారు. వి. సుమారు.

సువార్త వి. క్రీస్తుబోధ.

సం. సువార్తా. మంచివార్త, మంచి సమాచారం.

<సం. సువార్తా (అర్థవిపరి.).

సువాల రూ. సువ్వలాల, సువ్వాల, సువ్వాలు. వి. ఆడవారు పెళ్ళిళ్ళలో సువ్వి అనే పదంతో ఆలాపంచేసి పాడే పాట. పాంచాలీ. 4.24.

క. సుబ్బతె-, సువ్వలి-, సువ్వాతె-. ముత్తైదువులు పాడే పాట.

సువాళించు స.క్రి. తిప్పు. కళా. 7.68.

సువ్వ రూ.చూ. చువ్వ. వి. 1. పొడుగ్గా, సన్నగాఉండే కట్టె, దోటి ; 2. పొడవుగా సాగిన లేతకొమ్మ, సెలగ.

సువ్వమానె వి. శారాకిల్లీ మసాలాలో వేసేమానె.

సువ్వలాల రూ.చూ. సువాల. వి. ఆడువారు పెళ్ళిలో సువ్వి అనే పదంతో ఆలాపన చేసి పాడేపాట.

సువ్వానుడు చూ. సువారము. వి. అలబాల, వంటవాడు. ఆం. పదా. నరా. 24.

సువ్వాల రూ.చూ. సువాల. వి. ఆడవారు పెళ్ళిళ్ళలో సువ్వి అనే పదంతో ఆలాపన చేసి పాడేపాట. శుక. 1.523.

<సువ్వి + అలతి. రూ.చూ. సువాల.

సువ్వాలు రూ.చూ. సవాలు. వి. పాటలో విశేషం

సువ్వి వి.1. దంచటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. చా.మం. 1.134 ; 2. (శుభకార్యాలలో ముత్తైదువులు) ధాన్యాన్ని దంపుతూపాడేపాటలోని పదాంతపదం.

సం. శుల్బ-. తాడు ; ప్రా. సువ్వ-.

<ప్రా. సువ్వ.

సువ్విపాట వి. ప్రథమ రజస్వలకు వేడుకగా పాడేపాట.

సువ్వె అవ్య. సుమా.

సుష్టు అవ్య. 1. బాగా, చక్కగా ; 2. ఎక్కువగా ; 3. నిజంగా, యుక్తంగా.

సం. సుష్ఠు.

<సం. సుష్ఠు.

సుష్టుపట్టు స.క్రి. 1. చక్కజేయు ; 2. సవరించు.

సుసరభేత్తు వి. సులువుగా అధోరోమాల్ని తొలగించే మందు. క్రీడా. 77.

సుసరము విణ. సూక్ష్మం, సున్నం. సిం.ద్వా. 8.20.

సుసలాయించు రూ. సుసాయించు. స.క్రి. పొసగించు.

సుసాయించు రూ.చూ. సుసలాయించు. స.క్రి. పొసగించు.

సుస్తి రూ.చూ. సుస్తీ. వి. 1. జబ్బు, రోగం ; 2. సోమరితనం ; 3. ఆలస్యం, విలంబనం.

సుస్తీ రూ.సుస్తి, సుస్తు. వి. 1. జబ్బు ; 2. ఆలస్యం ; 3. అలసట.

హిం. ఉ. సుస్తీ. సోమరితనం, నిర్లక్ష్యం, పనిలేని తనం, ఆలస్యం, మాంద్యం, సాధ్యమైనంత త్వరలో పంపించేటట్లు ; పార. సుస్తీ. విశ్రాంతి, సోమరితనం, మాంద్యం, తామసం, నిర్లక్ష్యం, అల్పత్వం ;

క. సుస్తి, సుస్తు. ఆలస్యం, మాంద్యం, అలసట, సోమరితనం ; త. సుస్తు. నిర్లక్ష్యం.

<ఉ. సుస్తీ.

సుస్తీచేయు అ.క్రి. 1. జబ్బుచేయు ; 2. నిర్లక్ష్యంచేయు.

<ఉ. సుస్తీ + చేయు.

సుస్తు రూ.చూ. సుస్తీ. వి. ఆలస్యం, జబ్బు.

సుహ్ర వి. నెల. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 753, 2. క్రీ.శ. 1600.

ఉ. షహ్ర్. నెల, శుహూర్. నెలలు ; పార. షహ్ర్. నెల ; అర. షహ్ర్.

<ఉ. షహ్ర్.

సుహ్రసన్ వి. మహమ్మదీయ శకసంవత్సరాన్ని సంఖ్యా పదాలతో సూచించటానికి ముందు చెప్పబడే పదం. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 753. క్రీ.శ. 1600.

ఉ. షహ్ర్. నెల, సన్. సంవత్సరం ; అర. షుహూర్ సన్.

<ఉ. షహ్ర్సన్.

సూ రూ.చూ. చూ. అవ్య. నిశ్చయార్థకం, సుమీ. విక్ర. 2.175.

సూక¹ రూ. చూక. వి. 1. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం ; 2. నేతపడుగులో పైపోగులకు క్రిందిపోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద.

సూక² వి. వేపుడు, ఇగురు.

సం. శుష్క-. ఎండినది ; హిం. సూఖా-. ఎండిన. రసంలేని, కఠోరమైన.

<హిం. సూఖా.

సూకరాలు వి. బ. వ. 1. సుకుమారతలు ; 2. విడ్డూరాలు,

సం. సుకుమార-. మృదువైనది, అందమైనది, లేతది.

<సం. సుకుమార- + -ము + -లు.

**సూగుర్లు** వి.బ.వ. పాతనాణాలు.

**సూచినుకు** చూ. సూ. వి. అల్పధారావర్షం. ఆం. భా. 1.74

**సూజీ** వి. రవ్వ, నూక, సోజి, సొజ్జి.

హిం. సూజీ-. నూక.

<హిం. సూజీ.

**సూటి** వి. **1**. విధం. నిర్వ. రా. 8.74 ; **2**. గురి, లక్ష్యం. పి. శకు. 3.225 ; **3**. ప్రసిద్ధి. తాళ్ల. సం. 8.133 ; **4**. ప్రతి. విజయ. 1.150 ; **5**. తిన్నన ; **6**. వెరవు.

క. సుటి-. తెలివిగల, శక్తివంతమైన ; తు. చుటి-, సుటి-. తెలివైన, చురుకైన ; త. చుట్టి-. తెలివైనవ్యక్తి, చూట్టికై్క-. చురుకుదనం, తెలివి, చూట్టుక్కారణ్-. హాస్యగాడు : మ. చుట్టి-. చురుకుదనం.

**సూటికాఁడు** వి. **1**. గురికాడు ; **2**. అందగాడు. **సూటిగా** క్రి.విశ.ప్రదు. సరిగా. <సూటి + అగు + -అ[7]. **సూటిగొను** (-కొను) అ.క్రి. **1**. లెక్కచేయు, లక్ష్యపెట్టు. తంగా. చ 2.137 ; **2**. సరిపడు. **సూటిచేయు** రూ.చూ. సూటిసేయు. స.క్రి. గురిచేయు. **సూటించు** స.క్రి. **1**. సాటితెచ్చు ; **2**. పోల్చు. <సూటి + ఇంచు[3]. **సూటిపడు** రూ. సూటివడు. అ.క్రి. **1**. జరుగు, సంభవించు. పండి. చ. 2.122 ; **2**. సరితాకు, సరిపడు. వసు 2.98. **సూటిమాటలు** వి.బ.వ. ఎత్తిపొడుపు మాటలు. **సూటివడు**(-పడు) రూ.చూ. సూటి, పడు. అ.క్రి. **1**. జరుగు, సంభవించు ; **2** సరితాకు, సరిపడు. **సూటిసేయు**(-చేయు) రూ. సూటిచేయు. స.క్రి. గురిచేయు. రాజగో. 310.

**సూదరి** చూ. సూదు[1].

**సూడిగము** వి. **1**. ఆడుదాని చేతిగాజు. ఉ. హరి. 5.206, కాశీ. 5.145 ; **2**. చేతికడియం, ఆభరణ విశేషం. కళా. 7.66.

సం. చూడా. వలయవిశేషం ; ప్రా. చూడ-. వలయావళి, బాహుభూషణం ;

క. సూడగ, సూడిగ. చేతికడియం ; తు. చూడ, చూడగ. బంగారు చేతికడియం ; త. చూటకమ్, చూటా. చేతికడియం.

<ప్రా. చూడ-.

**సూడించు** చూ. సూదు[1].

**సూడిద** చూ. సూడు[2].

**సూడిదఁబెట్టు** చూ. సూడు[2].

**సూడిదసేయు** చూ. సూడు[2].

**సూడిదె** చూ. సూడు[2].

**సూడు**[1] వి. **1**. విరోధి. శత్రువు. కు. సం. **4**.86 ; **2**. ఈర్ష్య. ఉ. హరి. 4.209 ; **3**. వైరం, పగ, కసి, కక్ష, విరోధం. రం. రా. ఉ, 99పు. 12పం ; స.క్రి. **1**. కాల్చు, అంటించు. ఉ. హరి. 1.36 ; **2**. నాటించు. వేంక. పంచ. 3.260.

సం. సూద్. చంపు ; ప్రా. సూడ-. భంజించు, నశింపచేయు, సూడణ-. వినాశం ;

త. ఊటు (ఊటి-). కోపం చూపించు, ఊటుల్. కోపించటం, ఊటుల్ (ఊటల్వ్-, ఊటుణ్) జగడం, తగవు, ఊటుఱు (ఉటఱి-). కోపించు, ఊత్తు, (ఉత్తి-). కోపం పుట్టించు.

<ప్రా. సూడ-.

**సూడరి** వి. పగకలవాడు, ఈసుకలవాడు. కావ్యా. చూ. 6.123. <సూడు[1] + -అరి. **సూడించు** అ.క్రి. పగగొను. వి.క్ర. 8ఆ. <సూడు[1] + -ఇంచు[3]. **సూడిపట్టు** రూ.చూ. సూడుపట్టు. అ.క్రి. పగగొను. అష్టమ. క. 6337. **సూడుకాఁడు** వి. పగవాడు, శత్రువు. ఆం. భా. **సూడుకొను** అ.క్రి. **1**. పగగొను, ద్వేషించు. భోజ 3.37 ; **2**. అసహనపడు ; **3**. మచ్చరికించు ; **4**. గర్భంధరించు. **సూడుపట్టు** రూ. సూడిపట్టు, సూడువట్టు. అ.క్రి. పగగొను. భాస్క. రా.యు. 1238. **సూడుపట్టె** వి. క్రీడావిశేషం. శివత. సా. 334పం. **సూడుపడు** అ.క్రి. జతపడు. భార. శల్య. 2.262. **సూడుపోతు** వి. మాంత్రికుడు. **సూడుబంటు** వి. పగతీర్చుకునే శూరుడు. తాళ్ల. సం. 13.127. **సూడుఁబాడు** (-పాడు) వి. శత్రుత్వం. తాళ్ల. సం. 14.43. **సూడువట్టు** (-పట్టు) రూ.చూ. సూడుపట్టు. స.క్రి. విరోధించు. శృం. నై. 8.50.

**సూడు**[2]. వి. కానుక. తాళ్ల. సం. 14.37.

**సూడిద** రూ. సూడిదె. వి. కానుక. హరి. ఉ. 2.330. సం. సూతి-. పుట్టుక, ప్రసవం, బిడ్డ, జన్మస్థానం, సోమరసం పిండేచోటు, సూతిద-. పుట్టుక కారణంగా ఇచ్చేది 'సూడిద' శబ్దం నుంచి 'సూడు' పశ్చాన్నిర్మాణం వల్ల ఏర్పడి ఉండవచ్చు. <సం. సూతిద-. **సూడిదఁబెట్టు** (-పెట్టు) స.క్రి. కానుక ఇచ్చు. జైమినిభా. 3.76 **సూడిదసేయు**(-చేయు) స.క్రి. కానుక ఇచ్చు. విజయ. 1.53, **సూడిదె** రూ.చూ. సూడిద. వి. కానుక.

**సూడ్దేకు**(-ఆకు) వి. గుదేకు, ఎన్నును గుదిగా ఆవరించి ఉన్న ఆకు.

**సూతకము** వి. మృతాశౌచం, జాతాశౌచం, మైల. విజ్ఞా. ఆచా. 19.

సం. సూతక-. పుట్టుక, పురుడు, జాతాశౌచం.

<సం. సూతక- (అర్థవిపరి.).

**సూతకంబద్ద** వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకుకప్పును కుట్టటానికి వాడే పరికరం.

**సూతరికాడు** వి. సాంచెకాడు, ఇటిక అచ్చు తీసేపనివాడు.

**సూతిని** వి. దేశవిశేషం.

**సూతు** వి. పత్తిదారం.

హిం. సూత్. పత్తి, పట్టు మొ. వాటిదారం.

<హిం. సూత్.

**సూత్రంసెత్రం** చూ. సూత్రము.

**సూత్రకొయ్య** చూ. సూత్రము.

**సూత్రంకట్టె** చూ. సూత్రము.

**సూత్రంకమ్మి** చూ. సూత్రము.

**సూత్రంచెక్రం** చూ. సూత్రము.

**సూత్రంతాడు** చూ. సూత్రము.

**సూత్రందారం** చూ. సూత్రము.

**సూత్రపకట్టె** చూ. సూత్రము.
**సూత్రపట్టు** చూ. సూత్రము.
**సూత్రపడు** చూ. సూత్రము.
**సూత్రపబండి** చూ. సూత్రము.
**సూత్రపఱుచు** చూ. సూత్రము.
**సూత్రపుకర్ర** చూ. సూత్రము.
**సూత్రపుకొండి** చూ. సూత్రము.
**సూత్రపుకొయ్య** చూ. సూత్రము.
**సూత్రపుగుండు** చూ. సూత్రము.
**సూత్రపుతాడు** చూ. సూత్రము.
**సూత్రపుబడిత** చూ. సూత్రము.
**సూత్రపుబద్ద** చూ. సూత్రము.
**సూత్రపుబల్ల** చూ. సూత్రము.
**సూత్రపుల్ల** చూ. సూత్రము.
**సూత్రపెట్టు**. చూ సూత్రము.
**సూత్రబడె** చూ. సూత్రము.

**సూత్రము** వి. **1**. పన్నుగడ. భార. ఉద్యో. 1.90 ; **2**. శత మానం ; **3**. అచ్చును వేలాడదీసే పొడుగు తాడు.

నం. సూత్ర- దారం, తాడు, యజ్ఞోపవీతం, నియమం, నిబంధన.

<నం. సూత్ర- (అర్థవివరి).

**సూత్రంసెక్రం** రూ.చూ. సూత్రం చెక్రం. వి. మగ్గం. మీద అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పి. <సూత్ర. ము+చెక్క. **సూత్రకొయ్య** వి. నేతనేసే టప్పుడు అచ్చు కర్రలు సులువుగా లేవటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. <సూత్రము+ కొయ్య. **సూత్రంకట్టె** వి. మరమగ్గం నిలువుపట్టెకు మేరువ పలక బిగించి తాడు వడి పెట్టేపుల్ల. <సూత్రము+కట్టె. **సూత్రంకమ్మి** వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్యలు. <సూత్రము+ కమ్మి. **సూత్రంచెక్రం** రూ. సూత్రంసెక్రం. వి. మగ్గం మీద అచ్చుగుదులు తగిలించే కొయ్య కప్పి. నం. చక్ర-. బండి మొ. వాటి తిరిగే గుండ్రటి భాగం, విష్ణుచక్రం. <సూత్రము+నం. చక్ర-+ము. **సూత్రంతాడు** రూ. సూత్రంతాడు, సూత్రపుతాడు. వి. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు. <సూత్రము+తాడు[2]. **సూత్రందారం** రూ. సూత్రదారం. వి. మరమగ్గం నిలువ పట్టెను మేరువుపలకకు బిగించి సన్నపుల్లతో వడిపెట్టిన దారం. <సూత్రము+దారము. **సూత్రపకట్టె** వి. **1**. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె ; **2**. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర. <సూత్రము+-అ[11]+కట్టె. **సూత్రపట్టు** అ.క్రి. **1** సూత్రంవేసి తిన్నగా ఉండేట్లు చేయు. ఆము. 1.53 ; **2**. ముడివేయు. విప్ర 4.28 ; వి. నూలునేత. రామాభ్య. 9.62. <సూత్రము+పట్టు[1]. **సూత్రపడు** అ.క్రి. జతపడు. భార. అను. 1.134. <సూత్రము+పడు. **సూత్రపబండి** వి. నేతనేసేటప్పుడు అచ్చు కర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడ దీసిన కొయ్యపుల్ల. <సూత్రము+-అ[11] + బండి **సూత్రపఱుచు** స.క్రి. సూత్రించు, సూత్రంగా చేయు. వరాహ 1.6. <సూత్రము+పఱచు. **సూత్రపు కర్ర** వి. **1**. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర ; **2**. పుల్లిగునుతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చినకర్ర. <సూత్రము +కఱ్ఱ. **సూత్రపుకొండి** వి. అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ. <సూత్రము+కొండి. **సూత్రపు కొయ్య** వి. నేత బయలులో చివర పాతినకొయ్య. <సూత్రము+కొయ్య. **సూత్రపుగుండు** రూ. సూత్రపు గుండు. వి. **1**. మగ్గంమీద అచ్చుతాళ్ళ తగిలించిన రోకలి వంటి గుండ్రటి పొడుగుకర్ర ; **2**. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన రాయి. <సూత్రము+ గుండు. **సూత్రపుతాడు** రూ.చూ. సూత్రంతాడు. వి. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు. <సూత్ర ము+తాడు. **సూత్రపుబడిత** వి. మగ్గంతాళ్ళ కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్ర ము+బడిత. **సూత్రపుబద్ద** వి. **1**. మగ్గంతాళ్ళ కట్టిన ఇరవలదండిని సూత్రాలకట్టెకు కలపటానికి నిలువుగా బిగించిన బద్ద ; **2**. రాటి ఆకులను కలిపే నిలువుపుల్ల. <సూత్రము+బద్ద. **సూత్రపుబల్ల** వి. మగ్గంతాళ్ళ కట్ట టానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+బల్ల **సూత్రపుల్ల** రూ. సూత్రంపుల్ల, సూత్రపుల్ల. వి. మరమగ్గం నిలువు పట్టెకు మేరువుపలక బిగించి తాడు వడిపెట్టే పుల్ల. <సూత్రము+పుల్ల. **సూత్రపెట్టు** అ.క్రి. ముడివేయు. గౌ.హరి. ఉ. 2714. <సూత్రము+పెట్టు. **సూత్రబడె** రూ. సూత్రబడె. వి. మగ్గంతాళ్ళ కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+బడె **సూత్రంపుల్ల** రూ.చూ. సూత్రపుల్ల. వి. నేతనేసేటప్పుడు అచ్చు కర్రలు సులువుగా లేపటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. **సూత్రంబుడ్డి** రూ. సూత్రం బుడ్డి. వి. గారడీ ప్రదర్శనలో వాడే మట్టిపాత్ర <సూ త్రము+బుడ్డి. **సూత్రాలకట్టె** రూ. సూత్రాలకట్టె. వి. **1**. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె ; **2**. మగ్గంతాళ్ళ కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర. <సూత్రము+-లు-అ[11]+కట్టె. **సూత్రాలకర్ర** వి. మగ్గంతాళ్ళ కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కర్ర. <సూత్రము+-లు+- అ[11]+కఱ్ఱ, **సూత్రాలకుచ్చు** వి. మరమగ్గంలో ఒకసొరుగు లోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేపిడి. <సూత్రము+-లు+-అ[11]+ కుచ్చు. **సూత్రాలదండె** సూత్రాలదండె. వి. మగ్గంతాళ్ళ కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+-లు+-అ[11]+ దండె. **సూత్రాలపట్టె** వి. డాబీ బొమ్మను పట్టుకొని ఉండే కొయ్యపట్టె. <సూత్ర ము+-లు+-అ[11]+ పట్టె. **సూత్రాలబడితె** రూ. సూత్రాల

బడితె. వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+-లు+-అ[11]+ బడితె. **సూత్రాలబద్ద** వి. మగ్గంతాళ్ళు కట్టిన ఇరవలదండిని సూత్రాలకట్టెకు కలపటానికి నిలువుగా బిగించినబద్ద. <సూత్రము+-లు+-అ[11]+ బద్ద. **సూత్రాలబుడ్డి** రూ. సూస్త్రాలబుడ్డి. వి. గారడీ ప్రదర్శనలో వాడే ఒక మట్టిపాత్ర. <సూత్రము+-లు+-అ[11]+ బుడ్డి. **సూత్రాలబొంగు** వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+-లు+-అ[11]+ బొంగు. **సూత్రాలమాకు** రూ. సూస్త్రాలమాకు. వి. మగ్గతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య. <సూత్రము+-లు-అ[11]+ మ్రాఁకు.

**సూత్రంపల్ల** చూ. సూత్రము.

**సూత్రంబుడ్డి** చూ. సూత్రము.

**సూత్రాలకట్టె** చూ. సూత్రము.

**సూత్రాలకర్ర** చూ. సూత్రము.

**సూత్రాలకుచ్చు** చూ. సూత్రము.

**సూత్రాలదండె** చూ. సూత్రము.

**సూత్రాలపెట్టె** చూ. సూత్రము.

**సూత్రాలబడితె** చూ. సూత్రము.

**సూత్రాలబద్ద** చూ. సూత్రము.

**సూత్రాలబుడ్డి** చూ. సూత్రము.

**సూత్రాలబొంగు** చూ. సూత్రము.

**సూత్రాలమాకు** చూ. సూత్రము.

**సూదంటు** చూ. సూది.

**సూదంటురాయి** చూ. సూది.

**సూదంటుఱాయి** చూ. సూది.

**సూదనం** వి. చూరుకుట్టుబద్ద, పూరింటిఆకుకప్పును కుట్టటానికి వాడే పరికరం.

సం. సూదన-. చంపేది, చెరిచేది.

<సం. సూదన-. (అర్థవిపరి.).

**సూదనంబద్ద** వి. చూరుకుట్టుబద్ద. పూరింటిఆకుకప్పును కుట్టటానికి వాడే పరికరం,

**సూది** రూ. చూది. వి. **1**. సూచి, బట్టలుకుట్టే సాధనం. భార. శల్య. 2.74 ; **2**. మొన, చూరుకుట్టుబద్ద చివరి పదునైన అంచు ; **3**. ముల్లు, తూగ్గుండు చివరి మొనదేలినభాగం ; **4**. పెంకు కోతకు వాడే మొనగల సాధనం ; **5**. గోడు, ఇటుకను తారసను వెడల్పుమీద నిలబెట్టినపేర్పు ; **6**. నేతనేసే టప్పుడు గుడ్డను బిర్రు పెట్టటానికి అచ్చుచివర గుచ్చే సన్నటి లోహపుముక్క. పేడుములు ; **7**. ఇంజెక్షను.

సం. సూచి-,సూచీ. సూది, కుట్టేది, గుచ్చేది ; ప్రా. సూఈ ; అ.మా. సూఈ ; పా. సూచి, సూచికా ;

క. సూజి, సూజె ; తు. దూజి, సూజి ; త. ఊచి, చూచి ; మ. తూశి, సూచి ; కొం. సూజి ; కుఇ. సుని, సూన, సూనీ ; కువి. జూజి, సూజి ; పర్జి చూమజ్ ; కొలా. నా. సూది ; మరియాగోం. ఉజి, సుజి, హుజి ; ఒరయాన్. సుయ్‌తు. సూటియైన ఒల్లా సుజి.

<సం. సూచీ.

**సూదంటు** వి. అయస్కాంతం. ప్రభు. 3.75 ప. 13పం. <సూది+అంటు[1]. **సూదంటురాయి** రూ. సూదంటుఱాయి. వి. అయస్కాంతం. **సూదంటుఱాయి** రూ.చూ. సూదంటురాయి. వి. అయస్కాంతం. **సూదికని** వి. కడియ, బావికి వరలకు బదులుగా అమర్చిన రాతిపలక. **సూదికొమ్ము** వి. చక్కగా కొనదేరిన కొమ్ము. **సూదిగునపం** వి. సోగగడ్డపార, చివర కొసు ఉగాన్న గడ్డపార. **సూదిగొంటు** వి. ఒకదినుసు పోక, లతాపూగం. **సూదిగొంతు** వి. సన్నగా ధ్వనినిచ్చేగొంతు. **సూదిచేయు** స.క్రి. పన్నె ఊనెలకొసలు మొనదేలేటట్లు కత్తితో గీరు **సూదితోక** వి. మోటఉద్దినిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటిబండ. **సూదిపొట్ట** వి. చిరిపొట్టు, ఆకులమరుగున ఏర్పడుతున్న ఎన్ను. **సూదిమందు** కవి, డాక్టరు ఇంజెక్షనుద్వారా ఇచ్చేమందు. **సూదిమల్లిక** వి. సూదుల్లా సన్నగా ఉండేమల్లె. (Jasminum auriculatum). **సూదిమల్లె** వి. సువాసన కలిగిన, తెల్లనిపూలు పూసే ఒకరకం మొక్క, ఒకరకంమల్లె. (Jasminum auriculatum). **సూదిమాకు** వి. బొరవ మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి బండ. **సూదిమొక్క** వి. కోరమొక్క, నేల చీల్చుకుని పైకివచ్చిన మొలక. **సూదిమొన** వి. **1**. సూది చివరిభాగం ; **2**. కోరమొక్క, నేలచీల్చుకొని పైకివచ్చిన చిన్న మొలక. **సూదిరాయి** రూ. సూదిఱాయి. వి. **1**. దూలం రాళ్ళమధ్య బిగువుకోసం నిలిపిన చిన్నఇటిక ; **2**. చిన్న పాత్రల్ని నర్పటానికిఉపయోగించేరాయి ; **3**. కోపురాయి, ఒకవైపు కోసుగాఉండేటట్లు మలచబడిన మొనతేరినరాయి ; **4**. మోటఉద్ది నిర్మాణాకి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటిబండ ; **5**. అయస్కాంతం. **సూదిఱాయి** రూ.చూ. సూదిరాయి. వి. అయస్కాంతం. **సూదివడ్లు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**సూదినీ** రూ.చూ. సుదినీ. వి. నేతలో నిలువుకు అడ్డానికి రెండేసి పోగుల చొప్పున పెట్టివేసిన దుప్పటి.

**సూదినెంకట్టె** వి. చూరుకుట్టుబద్ద, పూరింటిఆకుకప్పును కుట్టటానికి వాడే పరికరం.

**సూదుకడ్డీ** వి. **1**. సూదికనీ, సూదుగుడ, మోటఉద్ది నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటిబండ, ఇటువంటివి రెండుగాని మూడుగాని ఉంటాయి ; **2**. మొనదేలిన పొడుగాటిరాయి.

**సూదుకర్ర** వి. నాగటిమోకు చివరవేసేముడి.

**సూదెంబరిక** వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకుకప్పును కుట్టటానికి వాడే పరికరం.

**సూనగాఁడు**[1] వి. చంపేవాడు, కట్టికుడు. కటికవాడు. విజ్ఞా. ఆచా. 58.

సం. సూనా. వధ, నాశనం.

<సం. సూనా+-కాఁడు (మిశ్రస.).

సూనగాఁడు[2] వి. పూలమ్మేవాడు.

సం. సూన-. పుష్పం, పువ్వు.

<సం. సూన-+- కాఁడు, (మిశ్రస.).

సూనగాఁడు[3] వి. సున్నంపూసేవాడు.

సం. చూర్ణ-. పొడుం ; ప్రా. చుణ్ణ-. పొడుం, పిండి, ధూళి, సున్నం.

<ప్రా. చుణ్ణ- + - కాఁడు.

సూనరి[1] విణ. చంపేవాడు, కటికవాడు. భార. సభా. 1.118.

సం. సూనాకర- కసాయివాడు ; ప్రా. సూణా. వధస్థానం, సూణవయి. కసాయివాడు. సూణాఅర. కసాయివాడు ; అ.మా. పా. సూణా. కసాయివాని ఇల్లు ; పా. సూనకార-.

<ప్రా. సూణ-+- అరి.

సూనరి[2] వి. పూలమ్మేవాడు.

సం. సూన- పువ్వు.

<సం. సూన-+-అరి.

సూనరి[3] వి. సున్నంపూసేవాడు,

సం. చూర్ణ-. పొడుము ; ప్రా. చూణ్ణ-. పొడుం, పిండి, ధూళి, సున్నం.

<ప్రా. చుణ్ణ-+-అరి.

సూనిగ్నం వి. మేలురకంతారు.

సూను[1] వి. పొలంలో ఒకమూలతో కలిసిఉన్న చదరపు ముక్క.

సూను[2] వి. శనగపిండితో చేసేవ్యంజనవిశేషం.

సూనెగాఁడు వి. కసాయివాడు. బసవ. 292పు.

సం. సూనిక-. కసాయివాడు, వేటగాడు ; ప్రా. సూణియ- ;

క. సూనె. కబేలా, సూనెగార. కసాయివాడు. సూనగి, సూనిగి. ఒకరకంకత్తి ; తు. సూన, వధస్థానం.

<ప్రా. సూణియ-+-కాఁడు.

సూంతి వి. అపనింద, కళంకం. లోకువ.

సూన్యము వి. చేతబడి.

సం. శూన్య-. వట్టిది, ఉనికిలేనిది.

<సం. శూన్య-.

సూపనారాయణులు వి.బ.వ. ఒకరకం వడ్లు.

సూపరపొయ్యి వి. ఒకరకం మట్టిపొయ్యి.

ఇం. *Super*. శ్రేష్ఠమైనది.

<ఇం, Super. + పొయ్యి.

సూపు రూ.చూ. చూపు. వి. దృష్టి.

సూబా రూ,చూ. సుబా. వి. సుబా, దేశంలోని పెద్దభాగం.

సూమంతకాహళి వి. కాహళివాద్యవిశేషం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1052. క్రీ.శ. 1350.

సూయాణము వి. శత్రుభయంకరమైన దండయాత్ర. భార. విరా, 5.320,

సం. సుయాన, మంచిప్రయాణం ;

క. సూయాణ.

<సం. సుయాన-,

సూర వి. ఉంట. కట్టుబడిలో పనికిరాని చిన్న రాతిముక్క.

సూరకత్తి రూ.చూ. చూరకత్తి. వి, చురకత్తి.

సూరకత్తిపొగాకు వి. కోలగా ఉండే ఆకు.

సూరకరుంజు రూ. సూరకరుఁజు. వి. పక్షివిశేషం. చంద్రాంగ, 6.93.

సూరకరుఁజు రూ.చూ. సూరకరుంజు. వి. పక్షివిశేషం.

సూరటి వి. నిట్రాడి, ఇంటిమధ్యపాతే పొడుగాటి కొయ్య స్తంభం.

సూరతు వి. 1. స్థితి ; 2. గుజరాతు రాష్ట్రంలోని ఓడరేవు కల ఒకపట్టణం.

హిం. సూరత్. ఆకృతి. ముఖవైఖరి, రూపం ,స్థితి, జ్ఞాపకం, అందం, విధం, ఖురానులో ఒక అధ్యాయం ; ఉ. సూరత్. రూపం,ఆకృతి. స్థితి ; పార. సూరత్, చిత్రం, ఆకృతి, విధం; అర. సూరత్. స్థితి, రూపం, వర్ణన ; ఆకారం, ముఖవైఖరి, పద్ధతి, విధం

<ఉ. సూరత్.

సూరత్‌సిల్కు వి. సూరత్ప్రాంతం నుంచివచ్చే మంచి రకం తెల్లనిపట్టు. హిం.గు. సూరత్. గుజరాతులో ముఖ్యమైన రేవుపట్టణం. <గు. సూరత్ + సిల్కు.

సూరత్‌సిల్కు చూ. సూరతు.

సూరబాణం వి. సన్నమూతి ఉండే చిచ్చుబుడ్డి.

సూరలు రూ. సూర్లు. వి.బ.వ. నీళ్ళుపోవటానికి పెట్టే మట్టి గొట్టాలు.

సూరి[1] వి. 1. పెంకుటింటికప్పుకు గోడకు మధ్యవేసినచెక్క ; 2. ద్వారబంధపు పైకమ్మీమీద కంసూరిని నిలిపే చిన్న నిలుపుకమ్మీ.

సూరి[2] రూ.చూ. చురియ. వి. చిన్నకత్తి. ఆము. 4.151.

సూరిపేటుఅంచు వి. పావు అంగుళం వెడల్పు జరీపట్టెలు మధ్య మధ్య పట్టుగీరలు పడేట్టు నేసిన అంచు.

సూరీగుమ్మడి వి. పొట్టిగుమ్మడి.

సం. సూర్య- సూర్యుడు.

<సం. సూర్య-+ గుమ్మడి.

సూరు రూ.చూ. చూరు[1]. వి. 1. ఇంటికప్పు మొ. వాటి అంచు. శాళ్ల. సం. 15.238 ; 2. తాటాకుతో ఇంటికప్పు కట్టినప్పుడు బిగించటానికి సూరుకోటు దబ్బకు కిందనుంచి అందించే గట్టినారనట్ట.

సూరుకోటుదబ్బ వి. ఇళ్ళుకప్పేటప్పుడు ఆకును బిగించటానికి గుచ్చి కట్టేతడపను పైకిలాగే (కంట్యాణిలా) ఇనుపకోల. సూరుగడ వి. జడ్డిగపు కర్రల్లో కుడివైపుకర్ర. సూరుపోయు అ.క్రి. తలను కిందగా ఉంచి నీటిలోకి దూకు.

సూరుసూరు వి. తుంపలు తుంపలు.

సూరె[1] చూ. చూరు[1]. వి. పార్శ్వం. భార. ఆది. 2.198.

సం. సూరీ దారి, పక్క.

<సం. సూరీ.

సూరెలువాఱు అ.క్రి. పక్కకి ఒదుగు. కు. సం. 8.124.

సూరెగిలు రూ.చూ. సూరెగిల్లు. అ.క్రి. పక్కకొదుగు.

భోజ. 7.34. సూరెగిల్లు రూ. సూరెగిలు అ.క్రి. పక్క కొరుగు. నిర్వ. రా. 6.103

**సూరె[2]** రూ. సుబిరె. వి. **1.** పన్నుకట్టుబడిలో ఈనెల బిగింపు కోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం ; **2.** అచ్చు కట్టే టప్పుడు అని వెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్న బెత్తం ; **3.** మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం ; **4.** దండెదగ్గరి పడుగు పోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేత పడుగులో దూర్చిన సన్నబెత్తం.

**సూరె[3]** రూ.చూ. చురియ. వి. కటారు. సూరకత్తి.

**సూరెకమలం** రూ.చూ. సూర్యకమలం. వి. విచ్చిన తామర పువ్వుఆకారంలో వేసే డిజైను.

**సూరెకారము** రూ. సూరెకారము. వి. ఒకరకంపేలే ఉప్పు. పెల్లుప్పు.

**సూరెపాను** రూ. సూరేపాను. వి. అలవట్టం, వస్త్రంతో గుండ్రంగా చేసిన విసనకర్ర.

**సూరెపుటము** వి. మేలుతరం మొకమల్, సూర్యపటం. రాజవా. 1.62.

సం. సూర్యపటు- మంచిరకం మొక్మల్లు.

<సం. సూర్యపట-.

**సూరేకారము** రూ. సూరెకారము, ఒకరకం తెల్లని ఉప్పు.

**సూరేపాను** రూ.చూ. సూరెపాను. వి. అలవట్టం, వస్త్రంతో గుండ్రంగా చేసిన విసనకర్ర.

**సూర్యకమలం అంచు** వి. విచ్చిన తామరపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు.

సం. సూర్యకమల- సూర్యసంబంధిపద్మం.

<సం. సూర్యకమల-+-ము+-అంచు[3].

**సూర్యకమలంచీర** వి. అంచులో తామరపువ్వు డిజైను నేసిన చీర.

సం. సూర్యకమల- సూర్య సంబంధి పద్మం, చీర- వస్త్రం.

<సం. సూర్యకమల+-ము+సం. చీర-.

**సూర్యకాంత** వి. పొద్దుతిరుగుడు పూలచెట్టు (Helianthus annus).

సం. సూర్యకాంత- సూర్యకాంతమణి, శిల, స్ఫటికశిల

<సం. సూర్యకాంత- (అర్థవిపరి ).

**సూర్యగుడి** వి. సూర్యునిచుట్టూ ఏర్పడే పరివేషం. సూర్య మండలం.

సం. సూర్య-సూర్యుడు.

<సం. సూర్య-+గుడి (మిశ్రస.).

**సూర్యగుమ్మడి** వి. పొట్టిగుమ్మడి, సర్వతోభద్ర.

సం. సూర్య- సూర్యుడు.

<సం. సూర్య-+గుమ్మడి. (మిశ్రస.).

**సూర్యగూడు** వి. సూర్యుడు చుట్టూ ఏర్పడే పరివేషం.

సం. సూర్య-సూర్యుడు.

<సం సూర్య-+గూడు. (మిశ్రస.).

**సూర్యనాట్లు** వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం.సూర్య-సూర్యుడు.

<సం. సూర్య-+నాటు+-లు. (మిశ్రస.).

**సూర్యపారవ** వి. పడమటివైపున కూచాలసంఖ్య హెచ్చు కావటం అనే వాస్తుదోషం.

సం. సూర్య- సూర్యుడు.

**సూర్యమండలం** వి. సూర్యుడిచుట్టూఉన్న పరివేషం.

సం. సూర్యమండల- సూర్యునిమండలం.

<సం. సూర్యమండల-. (అర్థవిపరి.).

**సూర్యహారం** వి. ఒకరకం కంఠహారంమాదిరిగా అంచులో నేసిన డిజైను.

సం. సూర్యహార-సూర్యాకృతిగల డిజైను కల నగ.

<సం. సూర్యహార-. (అర్థవిపరి ).

**సూర్యుడుచంద్రుడు** వి పాపటకు ఈవల, ఆవల పెట్టుకునే నగలు.

సం. సూర్య-సూర్యుడు, చంద్ర-చంద్రుడు.

<సం. సూర్య-+సం. చంద్ర-. (అర్థవిపరి.).

**సూర్లు** రూ.చూ. సూరలు. వి.బ.వ. నీళ్ళు పోవటానికి పెట్టే మట్టి గొట్టాలు.

**సూల[1]** వి. రోగవిశేషం. దశకు. 6.163 ; **2.** వెన్నుపోటు.

సం, శూల-రోగవిశేషం ; ప్రా. సూల-, సూలి. సూల రోగం కలవాడు ; అ.మా. సూల- ; పా సూల, సూలా ; క. సూల, తీవ్రబాధ ; తు. సూల, సూలె : మ. చూల.

<ప్రా. సూల-.

**సూల[2]** వి. తలమీది భూషణం, సూలదండ. హంస. 4.79.

సం. చూడా. అలంకారం, భూషణవిశేషం ; ప్రా. చూలా.

<ప్రా. చూలా.

**సూలకన్ను** వి. తెల్లటికన్ను, పశువులకు మంచిలక్షణం. **సూలచేకటులు** రూ. సూలచేకట్లు. వి.బ.వ. కంకణవిశేషం. శుక. 1.148. **సూలచేకట్లు** రూ.చూ. సూలచేకటులు. వి.బ.వ. కంకణవిశేషం. **సూలలదండ** వి. ఒకరకం కంఠభూషణం. హంస. 4.101.

**సూల[3]** రూ. శూల. వి. **1.** బట్టీ, ఇటుక, సున్నం, పెంకు కాల్చే కట్టడం ; **2.** సున్నంమాత్రమే కాల్చేకట్టడం ; **3.** పోటీ, నిర్మాణంలో రాకూడనితప్పు ; **4.** పూన, ఇది పాటి నేలలో దొరుకుతుంది ; **5.** ఇటికరాయి కాల్చటానికి పొడుగ్గా కింద మంట వేయటానికి కంతలు పెట్టి పేర్చింది ; **6.** కుండలు కాల్చటానికి నిర్మించిన కట్టడం.

**సూలగుంట** వి. మోటదోనె నుంచి వచ్చిన నీరు నిలిచే చోటు, ఈఅరదగ్గరనుండి పొలానికి నీళ్ళుపోయేకాలవ ఉంటుంది. **సూలగోడ** వి. పొయ్యి పెట్టటానికి ఆముకు ఒకవైపు మట్టితోగాని ఇటికతోగాని కట్టిన గోడ. **సూలపొయ్యి** వి. ఆముగోడకు మధ్యభాగంలో మంటపెట్టటానికి గుండ్రంగా ఏర్పరచిన సందు.

**సూల[4]** రూ.చూ, సూలం. వి. **1.** రాటితిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; **2.** డబ్బారాట్నం బొమ్మలకుగాని దొడ్డి నిలువులకు గాని బిగించే మందపుకడ్డీ ; **3.** తొవరరాటి తిరగటానికి ఆధారంగా ఉన్న నిలువుకర్ర ; **4.** నాడెలో

పేకదారం కండెగుచ్చే ఇనపపుల్ల.

**సూలం** రూ. శూలం, సూల[4]. వి. **1**. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; **2**. డబ్బారాట్నం బొమ్మలకు గాని దొడ్డినిలువులకు గాని బిగించే మందపుకడ్డీ ; **3**. తొవరరాటి తిరగటానికి ఆధారంగాఉన్న నిలుపుకఱ్ఱ ; **4**. సారెను వంచటానికి వీలుగా అడుగుభాగం లావుగా పైభాగం సన్నగా చేసిన కఱ్ఱదిమ్మ.

సూలంసారి వి. ఆరుచేతుల సారె సూలాలసంబరం వి. **1**. కార్తీక పౌర్ణమినాడు గౌరీదేవి పూజకు దేవాంగులు చేసే పండుగ ; **2**. కార్తీకపూర్ణిమ నాడు దేవాంగులు చేసే వీర భద్ర స్వామి సంబరం.

**సూలము** వి. **1**. త్రిశూలం ; **2**. ఈటె.

సం. శూల-. త్రిశూలం, ఈటె, మాంసం కాల్చే ఇనప కాడ ; ప్రా.సూల-.

<ప్రా. సూల-.

**సూలాము** వి. ఆరుబయలులో ఎఱ్ఱకాల్పుకు ఏర్పరచేఆము.

**సూలాలసంబరం** చూ. సూలం.

**సూళ** వి. రాగవిశేషం. చంద్రాంగ. 6.131.

**సూళకేరి** రూ.చూ. సూళెగేరి. వి. వేశ్యావాటిక.

**సూళగేరి** రూ.చూ. సూళెగేరి. వి. నాగవాసం, వేశ్యావాటిక. చంపూరా. 5.83.

**సూళెకేరి** రూ.చూ. సూళెగేరి. వి. వేశ్యావాటిక

**సూళెగేరి** రూ' సూళకేరి, సూళగేరి, సూళెకేరి. వి. వేశ్యావాటిక. చంద్ర. 3.37.

క. సూళగేరి, సూళకేరి, సూళెగేరి, సూళెకేరి.

<క. సూళెగేరి.

**సూళ్లు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. ప్రబంధ. 1.950.

**సూవాసి** వి. భూమిని సేద్యంచేసే కవులుదారు. ద.హిం.శా. సంపు. 10.శా. సం. 422. క్రీ.శ. 1269.

త. చోవాచి.

**సూవె** అవ్య. సుమా.

**సూసకతురాయి** చూ. సూసకము.

**సూసకము** వి. **1**. స్త్రీలు తలకు ధరించే తిరుగుడుబిళ్ళ. రం. రా. ఉ. 65ప. 5పం; **2**. వివాహ సమయంలో వధువు తలమీద అలంకరించే పూవులకూర్పు.

సం. చూషా. ఏనుగు నడుమపట్టీ, తోలుమోకు, చూషక-.

<సం. చూషా.

సూసకతురాయి వి. స్త్రీలు తలమీద పెట్టుకునే తిరుగుడు బిళ్ళ. <సూసకము+తురాయి.

**సూసరి** వి. సున్నం పూసేవాడు, లేపకుడు, తాపీవాడు.

**సూసీ** వి. తురకల ఆడవాళ్ళు కట్టుకునే పరికిణీ.

**సూత్రదారం** రూ.చూ. సూత్రదారం. వి. మరమగ్గం నిలువు పట్టెను మేరువుపలకకు బిగించి సన్నపుల్లతో వడిపెట్టిన దారం.

**సూత్రంతాడు** రూ.చూ. సూత్రంతాడు. వి. అచ్చునుపైనుంచి వేలాడదీసే పొడుగుతాడు.

**సూత్రందారం** రూ.చూ. సూత్రందారం. వి. **1** అచ్చుకఱ్ఱకు పైన కట్టినదారం ; **2**. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగు తాడు.

**సూత్రపుగుండు** రూ.చూ. సూత్రపుగుండు. వి. **1**. మగ్గంమీద అచ్చుతాళ్ళు తగిలించిన రోకలివంటి గుండ్రటి పొడుగు కఱ్ఱ ; **2**. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి.

**సూత్రపుల్ల** రూ.చూ. సూత్రపుల్ల. వి. మరమగ్గం నిలుపుపట్టెకు మేరువు పలక బిగించి తాడు వడిపెట్టే పుల్ల.

**సూత్రబడె** రూ.చూ. సూత్రబడె. వి మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య.

**సూత్రంబుడ్డి** రూ.చూ. సూత్రంబుడ్డి. వి. గారడీ ప్రదర్శనలో వాడే ఒక మట్టిపాత్ర.

**సూస్త్రాలకట్టె** రూ.చూ. సూత్రాలకట్టె. వి. **1**. మరమగ్గం చట్రంలో నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె ; **2**. మగ్గం తాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కఱ్ఱ.

**సూస్త్రాలదండె** రూ.చూ. సూత్రాలదండె. వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికిపైన అమర్చినకొయ్య.

**సూస్త్రాలబడితె** రూ.చూ. సూత్రాలబడితె. వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య.

**సూస్త్రాలబుడ్డి** రూ.చూ. సూత్రాలబుడ్డి. వి. గారడీ ప్రదర్శనలో వాడేఒకరకం మట్టిపాత్ర.

**సూస్త్రాలమాకు** రూ.చూ. సూత్రాలమాకు. వి. మగ్గంతాళ్ళు కట్టటానికి ఆధారంగా మగ్గానికి పైన అమర్చిన కొయ్య.

**సూస్మారము** వి. మొసలి.

సం. శింశుమార-. మొసలి, నీరుకోతి, ఒకానొక జ్యోతిర్మండలం.

**సూస్రాలబుడ్డి** రూ.చూ. సూత్రాలబుడ్డి. వి. గారడీ ప్రదర్శనలో వాడే ఒకమట్టిపాత్ర.

**సెక**[1] రూ.చూ. సెగ. వి. **1**. జ్వాల, ఉక్కా. చ. 4.43 ; **2**. తాపం, కాక, వేడిమి, సెగ పరమ. 2.46 ; **3**. ఆము కాల్పు యొక్క వేడి.

సెకకంటి వి. ఫాలాక్షుడు, శివుడు. హ.న. 4.16. సెకకన్నేటి వి. ఫాలాక్షుడు, శివుడు. సెకలుచల్లు అ.క్రి. మంటలుచెల్లు. రాజగో. 3.9. సెకవెలుఁగు వి. సూర్యుడు. యయా. 1ఆ.

**సెక**[2] వి. చెవి, స్తంభంపై అంచున రెండువైపులా మేకు బందీచేసిన చెక్కలు.

**సెకను** వి. **1**. నిముషంలో అరవయ్యోవంతు, రెప్పపాటు.

ఇం. *Second*. నిముషంలో అరవయ్యోవంతు.

<ఇం. Second.

సెకనుసెకను వి. అనుక్షణం.

**సెకలింపు** రూ.చూ. సెకళింపు. వి సకిలించటం, హేష. ద్వి. పరమ వి. 5.440.

**సెకళింపు** రూ. సెకలింపు. వి. సకిలించటం, హేష. ద్వి. పరమ. వి. 3.236.

**సెకిలించు** రూ.చూ. సకిలించు. అ.క్రి. వికారపు నవ్వు నవ్వు.

**సెకాళీ** వి. వికారం, వెకిలితనం.

**సెకునేల** వి. గడ్డిబలిసి దున్నటానికి కష్టమైననేల.

**సెకె** వి. గింజల్నిరాల్చి, చిక్కుపడని వరిగడ్డి మట.

**సెక్కరేవులు** చూ. చెక్కు. వి.బ.వ. ఆముపక్కన మసిగాడి గట్టిన వారగా ఉన్న ఖాళీభాగంలో పెట్టిన రేవులు.

**సెక్కలు** చూ. చెక్కు. వి.బ.వ. ఆము పక్కలో మసిగాడి దగ్గరగా గట్టునవారగా ఉండే కాళీభాగం.

**సెగ** రూ. సెక[1], సెవ. వి. **1**. తాపం, గ్రీష్మం. పండి.చ. 5.524 ; **2**. వేడి, వేడిమి. శృం. నై. 7.53 ; **3**. అగ్ని. కవిరాజ. **2.17**. నీలా. 1.109 ; **4**. ఆముకాల్పుయొక్క వేడి ; **5**. సెగరోగం, ఒకరకం సుఖవ్యాధి, గనేరియా.

సం. శిఖా. జ్వాల, మంట ; ప్రా. సిఖా, సిహా ; అ.మా. సిహా. జ్వాల ;

క. సకె, సగె, సెకె, సెగె. తాపం, వేడి ; తు. సీకె, సెకె, సెగె. తాపం,

<ప్రా. సిఖా.

**సెగకంటి** వి. శివుడు, ఫాలాక్షుడు. చంద్రికా. 2.58. **సెగకంటిజోదు** వి. ఫాలాక్షుడు, శివుడు. **సెగకంటిస్వామి** వి. శివుడు, ఫాలాక్షుడు. నీలా. 1.109. **సెగగడ్డ** రూ. సెగ్గడ్డ, వి. కాకచేత లేచిన కురుపు. **సెగపావఁడు** వి. కుమారస్వామి, అగ్గిచూలి. **సెగపెట్టు** రూ. సెగబెట్టు. అ.క్రి. **1**. తగాదాపెట్టు ; **2**. వేడిని కలుగచేయు. **సెగబెట్టు(-పెట్టు)** రూ.చూ. సెగపెట్టు. అ.క్రి. **1**. ఆము పొయ్యిదగ్గర అగ్గిరాజేసి ఆము అంతామంట వ్యాపించటానికి చేటతోగాని తడికతోగాని విసరు ; **2**. నిప్పువేడిని ఉంచు. **సెగరోగము** వి. (గనేరియా) సుఖవ్యాధి. సం. రోగ-.జబ్బు, తెగులు. <సెగ-+సం. రోగ-+-ము. **సెగతేఁడు** వి. శివుడు. యయా. 1.52. **సెగసంకటం** వి. ఒకరకం సుఖరోగం, గనేరియా. **సెగ్గడ్డ** రూ.చూ. సెగగడ్డ. వి. కాకచేత లేచిన కురుపు. <సెగ+గడ్డ.

**సెగటు** వి. పక్కలో బల్లెం.

**సెగము** రూ.చూ. సెగ్గము. వి. **1**. రోత ; **2**. నింద.

**సెగ్గడ్డ** చూ. సెగ.

**సెగ్గము** రూ. సెగము, సెగ్గు. సెగ్గెము. వి. రోత. నిర్వ.రా. 5.103 ; విణ. నింద్యం. ఉ.హరి. 5.92.

**సెగ్గించు** స.క్రి. **1**. రోయు, అసహ్యపడు. కు.సం. 8.146, హరి.ఉ. 1.113 ; **2**. నిందించు, తెగడు, దూరు. రం.రా.ఉ. 131పు. 22పం. <సెగ్గము+-ఇంచు[3]. **సెగ్గింపు** వి. **1**. రోత, ఏవగింపు ; **2**. అపవాదం.

**సెగ్గించు** చూ. సెగము.

**సెగ్గింపు** చూ. సెగ్గము.

**సెగ్గు** రూ.చూ. సెగ్గము. వి. రోత.

**సెగ్గెము** రూ.చూ. సెగ్గము. వి. నింద్యం. రోత. శాఌ. సం. 16.2.13.

**సెంక** వి. సందేహం. నిర్వ.రా. 9.11.

సం. శంకా. సందేహం, అనుమానం ; ప్రా. సంకా. శంక ; అ.మా. సంకా ;

క. సంకె.

<ప్రా. సంకా.

**సెంకు** చూ. సంకు. వి. మట్టలోని చివరిఆకు.

**సెజ్జ**[1] వి. **1**. శయ్య, పాన్పు. నిర్వ.రా. 8.32, భార. విరా. 2.239 ; **2**. సెజ్జ వేసేవాడు.

సం. శయ్యా. ఉపాశ్రయం, విడిది ; ప్రా. సెజ్జా, జై. మహా. సెజ్జా ; మా. శెయా ; అ. మా. సిజ్జా, సెజ్జా. పరుపు, వసతి. శిబిరం ; పా. సెయ్యా ;

క. సెజ్జె. పాన్పు ; త. చెజ్జై ; కుఇ. సెజ్జొ.

<ప్రా. సెజ్జా.

**సెజ్జఅవసరము** వి. శయ్యా భోగసమయం. ద.హిం. శా. సంపు. 6. శా.సం. 789. క్రీ.శ. 1381. **సెజ్జతీర్చు** అ.క్రి. పడక సిద్ధంచేయు. కళా. 6.252. **సెజ్జపైపైఁడి** వి. చేతికందుబాటులో ఉన్నధనం. **సెజ్జమేనుసేర్చు(-చేర్చు)** స.క్రి. పరుండు. భార. ద్రోణ 2.340.

**సెజ్జ**[2] రూ.చూ. సజ్జ[2]. వి. సన్‌షేడు, ఎండ, జల్లు తగలకుండా కిటికీలమీద రక్షణగా దించిన పలక.

**సెజ్జకట్టె** వి. చిలుకువాటం, అటక నిర్మించటానికి గోడలో పాతినకొయ్య.

**సెట్** రూ.చూ. షెడ్డు. వి. పక్కగోడలులేనిరేకుకప్పుగలపాక.

**సెటి** రూ.చూ. సెట్టి. వి. **1**. కుమ్మర కులజుని నామాంతరం. నె.శా. దర్మి. 11 ; **2**. వైశ్యుడు, కోమటి.

**సెటిసాని** రూ. సెట్టిసాని. వి. **1**. వైశ్యుని భార్య. వేంక. పంచ. 5.39. <సెట్టి+సాని.

**సెట్టగు** చూ. సెట్టు.

**సెట్టి** రూ. సెటి. వి. **1**. వైశ్యుడు, వర్తకుడు. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 6. క్రీ.శ. 1043, కేయూ. 3.191 ; **2**. కోమట్లు మొ. వారి పట్టంపేరు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 82. క్రీ.శ. 1124 ; **3**. తెలికకులంవారు నామాంతంలో పెట్టుకునే బిరుదు. ద.హిం.శా సంపు. 10. శా.సం. 209. క్రీ.శ. 1202.

సం. శ్రేష్ఠిన్. శ్రేష్ఠి ; ప్రా. సెట్ఠి. గ్రామముఖ్యుడు, సెట్ఠి. వర్తకుడు, ఉత్తముడు, సెట్ఠిణీ. సెట్టిభార్య ; శాసన. ప్రా. సేఠ- ; శౌ. సెట్ఠి. అ.మా. సిట్ఠి, సెట్ఠి ; పా. సెట్ఠి. కోశాధ్యక్షుడు. కోశాధిపతి ;

క. చట్టి, సెట్టి ; తు. శెట్టి ; త, ఎట్టి. వైశ్యుల్లో ఉత్తములైనవారికి ప్రసాదించే బిరుదు, చెట్టి ; మ. చెట్టి ; తొ. సిట్య్ ; మరియాగోం. సెటి వ్యాపారి.

<ప్రా. సెట్ఠి.

**సెట్టిగణాధీశుడు** వి. వర్తక సంఘం నాయకుడు, ద. హిం. శా. సంపు. 6. శా.సం. 136. క్రీ.శ. 1149. **సెట్టింగనిపొడిచినట్లు** అవ్య. అతిసులువుగా. శుక. 1.528. **సెట్టిశ్రేష్ఠి** వి. పెద్దకోమటి. **సెట్టిసాని** రూ.చూ. సెటిసాని. వి. వైశ్యునిభార్య.

**సెట్టిగ** చూ. సెట్టి. వి. సెట్టిబలిజె.

**సెట్టిపల్లిగొడలు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**సెట్టు** వి. కొన్నివస్తువులమొత్తం ; స.క్రి. **1**. దాచు ; **2**. ఉంచు ; **3**. రహస్యంగా ఉంచు.

ఇం. *Set*. కొన్ని వస్తువులమొత్తం, అమరు.

< ఇం. Set.

సెట్టగు(-అగు) అ.క్రి. దమ్ముకొను, బిగియు, గట్టిపడు.

సెట్టి వి. డాబీగొలును బద్దకు బిగించిన కొయ్యముక్క.

సెట్టిసెలంనేయు అ.క్రి. బట్ట మొదట బద్దెనేయు.

సెడ్డు రూ.చూ. పెడ్డు. వి. పక్కగోడలు లేని రేకుకప్పుగల పాక.

సెణం వి. క్షణం.

సం. క్షణ -. అత్యల్పకాలం, ముహూర్తం, గడియలో ఆరోభాగం.

< సం. క్షణ -.

సెంటరింగు రూ.చూ. సెంట్రింగు. వి. మూసకట్టు, పోత పోయవలసిన ద్రవ్యానికి ఆకారమిచ్చే తాత్కాలికపు నిర్మాణం.

సెంటరు రూ. చెంటరు, సంటరు, సెంట్రు. వి. మధ్య వస్తువులోని కేంద్రం, కేంద్రభాగం.

ఇం. *Centre*. మధ్య, కేంద్రం.

< ఇం. Centre.

సెంటు[1] వి. $\frac{1}{10}$ కుంచెడుభూమి, $\frac{1}{100}$ ఎకరంభూమి.

ఇం. *Cent*. ఎకరంలో నూరోవంతు భూమి.

< ఇం. Cent.

సెంటు[2] వి. అత్తరు.

ఇం. *Scent*. వాసన, గంధం.

< ఇం. Scent.

సెంటెన్సు వి. 1. శిక్షావిధి ; 2. వాక్యం.

ఇం. *Sentence*. వాక్యం, వచనం, ఉక్తి, నీతి సూత్రం, నిశ్చయం, తీర్పు, విధి, శిక్ష, నిర్ణయం.

< ఇం. Sentence.

సెంట్రింగు రూ. సెంటరింగు. వి. మూసకట్టు, పోతపోయ వలసిన ద్రవ్యానికి ఆకారమిచ్చే తాత్కాలికపు నిర్మాణం

ఇం. *Centring*. మధ్యగా చేయటం.

< ఇం. Centring.

సెంట్రు రూ.చూ. సెంటరు. వి. మధ్య, వస్తువులోని కేంద్రం, కేంద్రభాగం.

సెండిగి వి. మెరగ్గా వెడల్పుగా గుండ్రంగా అంచులేకుండా చదరంగా మూకుడులాగా ఉండేమట్టిపాత్ర.

సెద[1] వి. 1. రుసుం ; 2. లంచం ; 3. లాభం.

సెద[2] వి. మిట్టరొమ్ము, చెరువులోపలివైపు మిట్టగా ఉన్న భాగం, ఇదికూడా మునిగితే చెరువు పూర్తిగా నిండినట్టు.

సెన వి. 1. చేపలగుడ్లు ఒకటిగా కలిసుండే కోపు ; 2. కంటి గుడ్డులోని పదార్థం ; 3. కోడిగుడ్డులోనిపాగు.

సెనక్కాయ చూ. సెనగ.

సెనగ రూ.చూ. చెనగ. వి. మెట్టనేలల్లో పండే ఒకరకం పప్పుదినుసు. ఆం.భా. 2.236.

సెనక్కాయ రూ. సెలక్కాయ. వి. వేరుసెనగ, మెట్టల్లో పండే ఒకరకం పప్పుదినుసు, వేళ్ళకుకాసే కాయల పప్పుతో నూనె తయారుచేస్తారు. దక్షిణ అమెరికా నుంచి 19వ శతాబ్దంలో మనదేశానికి ఈపైరువచ్చింది.

< సెనగ + కాయ. సెనగనుము వి. గుండ్రటి గింజరకం.

< సెనగ + అనుము. సెనగనూనె రూ. చెనగనూని. వి. వేరుసెనగనూనె, పడుగుకు పెట్టే గంజిలో కలుపుతారు.

సెనగపూలాకు వి. మెట్టనేలల్లో పెరిగే కలుపుమొక్క.

సెనగపొట్టు వి. సెనగలపొట్టు, వేరుసెనగపొట్టు, వేరుసెనగ కాయలతొక్క, బాగామురిగితే ఎరువుగా ప్రశస్తం (Aractis Lypogaca). సెనగలుతినిచెయి కరుక్కోడం వి. ఏమీ మిగల్చక పోవటం.

సెనగలు రూ. శనగలు, సనగలు సెనెగలు. వి.బ.వ. ధాన్య విశేషం, మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు. భీమ. 5.67.

సం. శణకా -, చణక -, చణ -. సస్యవిశేషం ; ప్రా. చణగ - చణ -, చణఅ ; అ.మా. చణగ -, చణఐయా, ఛలగ - ; పా. ఛణక - ;

క. చణంగ.

< ప్రా. చణగ- + -లు.

సెనిగ[1] రూ.చూ. చెనగ. వి. సెనగ, ఒకరకంధాన్యం. ఆం. భా. 2.236.

సెనిగ[2] వి. తెల్లనిపూలు పూసే ఒకరకం చెట్టు, దీంతో గృహోపకరణసాధనాలు, వ్యవసాయ పనిముట్లు తయారు, చేస్తారు (Lagerstroemia parviflora).

సెనిగె రూ.చూ. చెనగ. వి. సెనగ, ఆం.భా. 2.236.

సెనిసెట్లగోత్రము వి. ఒకనొక వైశ్య వంశగోత్రం. ద.హిం. శా. సంపు. 5. శా. సం. 1237. క్రి.శ. 1350.

సం. గోత్ర -. వంశం, ధనం, పర్వతం.

సెనెగలు రూ.చూ. సెనగలు. వి.బ.వ. సెనగలు.

సెందారులు వి.బ.వ. మృగయా సాధన విశేషం, వేటపని ముట్లు. రుక్మా. చ. 3.90.

సెపించు రూ.చూ. సెపియించు. స.క్రి. శపించు, తిట్టు.

సెపియించు రూ. సెపించు. స.క్రి. శపించు. భార. శాంతి. 4.157.

సం. శాప-. తిట్టు, శపథం, ఆక్రోశం ; ప్రా. సప-, సవ-. శపించు, ఆక్రోశించు, సావ. ఆక్రోశం, శపథం ;

క. సాప.

< ప్రా. సప-. + -ఇంచు[3].

సెబాసు రూ.చూ. సేబాసు. విణ. ఆశ్చర్యకరమైన. ఇందు. 2.56 ; వి. ఆశ్చర్యం ; అవ్య. ప్రశంసార్థకం,

సెబాసురె అవ్య. ఆశ్చర్యాన్ని తెలిపే అవ్యయం. శుక. 4.40.

సెబ్బర రూ.చూ. సెబ్ర. విణ. చెడ్డది, వి. చెడుగు.

సెబ్బి వి. తెరిపి.

సెబ్ర రూ. సబ్బర, సెబ్బర. విణ. చెడ్డది. హంస. 5 111.

సం. శ్వభ్ర -. రంధ్రం, బిలం, గుహ.

< సం. శ్వభ్ర -.

సెబ్రచంచడము వి. చెడ్డదేగ, ప్రాణహింస చేసేవాడు. పాండు. 4.195. సెబ్రసెంబడపుచేత వి. పాడుపని. ఏలామా. 2.17.

సెమము చూ. సరము. వి. శ్రమ. అచలా. 2.91.

నం. శ్రమ -. కష్టం, కష్టపడటం, అలసట, గ్లాని ; ప్రా. సమ -. ప్రయత్నం, శ్రమించు ; పా. సమ -. అలసట, ప్రయత్నం.

< ప్రా. సమ -.

సెమాల్ రూ.చూ. చెవాల. వి. పొడుగాటి కామగల ఒకరకం పార, మట్టి తవ్వకానికి గుల్లగా ఉన్న నేలను ఎత్తిపోయటానికి పనికివచ్చే పరికరం.

సెమిరె వి. పరినాటిన తరువాత మూడోరోజు పెట్టిన నీరు.

సెమీఆటోమెటిక్‌మగ్గం వి. ఒకరకం మరమగ్గం. దీంట్లో పలక జరిపితే అని తెరచుకొని నాడె దానంతట అదే ఆడుతుంది.

ఇం. *Semiautomatic.* అర్ధస్వయంప్రవర్తకం.

< ఇం. Semi automatic + మగ్గము.

సెంబళి రూ.చూ శంబళి. వి. ఒకజాతిచెట్టు.

సెంబెల్లి వి. ఒకరకం డిజైను నేతచీర.

సెమ్మి రూ.చూ. శెమ్మె. వి. దీపస్తంభం.

సెమ్మె రూ. శెమ్మె. దీపస్తంభం.

సెమ్లు రూ.చూ. షెమ్లా. వి. తలకు చుట్టుకోవటానికి నేసిన బట్ట.

సెమ్లా రూ.చూ. షెమ్లా. వి. తలకుచుట్టుకోవటానికి నేసిన బట్ట.

సెయికిలురాటం రూ.చూ. సైకిలురాటం. వి. డబ్బాలకు నూలు తోడే రాట్నం.

సెయికోలు వి. కుడిపక్క.

ఇం. *Cycle.* చక్రం, ఆవృత్తి, పర్యాయం, తొక్కుడు బండి కాలచక్రం.

< ఇం. Cycle.

సెయిలరు రూ.చూ. సైలరు. వి. ఓడమీద పనిచేసేవాడు.

సెర వి. రేఖ, కంటిలోని జీర. భార. ఉద్యో. 2.132.

నం. శిరా. నరం, ఈనె ; ప్రా. సిరా. నాడి, ధార, ప్రవాహం.

< ప్రా. సిరా.

సెరగు రూ. సెఱగు, సెఱవు. వి. ఆపద, ఇక్కట్టు. భార. ఆది. 8.118.

క. సెరగు. ఆపద, పాపం, తప్పు.

సెరబడి వి. స్నేహం, చెలిమి.

సెరబత్ వి. పుచ్చ, నీరింకిన వాగుల్లో పోగుచేసి పండించే తీగపైరు (Citrullas vulgaris).

హిం. ఉ. షర్‌బత్. తీపిపానీయవిశేషం.

< ఉ. షర్‌బత్.

సెరబము వి. శరభమృగం. పురుషోత్తమ కవీయము. 136.

నం. శరభ-. శరభమృగం ; ప్రా. సరభ-; సరహ- ; పా. సరభ- ; అ.మా. పా. సరభ-.

< ప్రా. సరభ-.

సెరవకుండ వి. రాగి సెరవల్లాగా ఉండే మట్టిపాత్ర.

నం. శరావ-. మూకుడు, పళ్ళెం, మట్టిపాత్ర ; ప్రా. సరావ-. పళ్ళెం ; పా. సరావ-, సరావక-. చిన్న పళ్ళెం.

< ప్రా. సరావ- + కుండ.

సెరవంజి రూ.చూ. సరవెంద. వి. తీక్ష్ణగంధం, ఒకరకం మొక్క, ఆకలి పుట్టించే మొక్క.

సెరవు వి. 1. మద్దతు ; 2. సాయం, తోడ్పాటు.

సెరవుసేయు(-చేయు) అ.క్రి. జాగుచేయు. కు.నం. 10.139.

సెరిగిడ్డ చూ. గిడ్డి. వి. వట్టగొట్టినా పొగరుగా ఉండేఎద్దు.

సెరింత వి. హాస్యం. ఆం.భా. 1.162.

సెరువులు చూ. చెఱువు. వి.బ.వ. విరేచనాలు.

సెరెణ్ణం వి. నూలుతాడు.

సెఱగు రూ.చూ. సెరగు. వి. ఆపద, హాని.

సెఱవు రూ.చూ. సెరగు. వి. ఆపద, హాని. కు.నం. 9.147.

సెల[1] రూ. సిల[3] వి. 1. రాయి. హర. 5.36 ; 2. సెలయేరు, కొండవాగు. నిర్ఝరం. మను. 4.134 ; 3. చరియ.

నం. శిలా. కొండ, రాయి ; ప్రా. సిలా ;

క. సెలె. ఊట, చెలమ.

< ప్రా. సిలా.

సెలబుగ్గ వి. చిన్న సెలయేరు. ద్వి. పరమ. వి. 4.303. సెలయూట(-ఊట) వి. కొండఊట. సెలయేరు రూ.చూ. సెలయేఱు. వి. ఏరు, కొండల్లో పుట్టి వేగంగా ప్రవహించే కాలవ. సెలయేఱు(-ఏఱు) రూ. సెలయేరు. వి. పర్వతం నుండి పారేది, నిర్ఝరం. భార.ఆది. 3.155. సెలలు వి.బ.వ. 1. దారులింగాలు ; 2. సంపార్ల అపరక్రియల్లో పూజకోసం పెట్టే ఇటుకరాతిలింగాలు ; 3. దేవతలనే భావంతో ఉంచినరాళ్ళు.

సెల[2] వి. 1. బాణంములికి. భార. ఉద్యో. 4.192 ; 2. పశురోగవిశేషం. నవనాథ. 1.41పు.4పం ; 3. వ్రణంలో చీము వ్యాపించే రంధ్రం. పారి. 2.88 ; 4. ఏదుపంది ముల్లు. చంద్రాంగ. 2.80 ; 5. ఏదుపంది ; 6. (బాణాల) పొది.

నం. శల్య-. బాణంములికి ; ప్రా. సల్ల-. అస్త్రవిశేషం, తోమరం, సెల్ల-. బాణం, బరిసె. కుంతం ; అ.మా. సల్ల-, సల్లగ-. బాణం, ముల్లు, ఆయుధవిశేషం ; పా. సల్ల-. బాణం ;

క. సల్లెహ, సెల్లెహ, బరిసె, ఈటె, బల్లెం : తు. సెలె. బీట, పగులు ; మ. చిల విల్లు, ధనస్సు, వంగిన ; కుఇ. సలరి. ఈటె, చిలై. విల్లు, వంగిన, ధనస్సు ; కురు. చఖ్లనా. విప్పు ; మాల్తొ. చల్గె. విడదీయు, పగలగొట్టు ; బ్రా. చలింగ్, చలెంగింగ్. పగులు, చిట్లు.

< ప్రా. సల్ల-.

సెలకట్టియ రూ.చూ. సెలకట్టె. వి. 1. బాణం. భాస్క.రా.యు. 977, ఉ.హరి. 6.50 ; 2. బాణంలా వేగంగా వెళ్ళే శ్యేనవిశేషం. అష్టమ. క.5ఆ. 22పు. 29పం. సెలకట్టు అ.క్రి. 1. మొనకట్టు. లక్ష్మీవి. 2.89 ; 2. ఆయత్తపడు ; 3. అమ్ములపొదికట్టు. సెలకట్టె రూ. సెలకట్టియ, సెలగట్టె. 1. బాణం. భార. భీష్మ. 3.91 ; 2. బాణంలా వేగంగా వెళ్ళే శ్యేనవిశేషం. మను. 4.57. సెలకొయ్య వి. వృక్షవిశేషం. (తిరుపతిమాండలికం) వడ్రంగి ఉపయోగించేది. సెలగట్టె(-కట్టె) రూ.చూ. సెలకట్టె వి.

సెలగొయ్య, గుదికర్ర, మెదలోకట్టేకర్ర. భీమ. 4.53. సెలగత్తి(-కత్తి) వి. కల్లుగీసేవాడికత్తి. అచ్చ.రా.యు. 2.89. సెలగొట్టు(-కొట్టు[1]) అ.క్రి. ముల్లు ఒకచోటగుచ్చుకొని అందులో కొన్నిదినాలుండి మరొకచోటునుంచి బయటకు వచ్చు. సెలగోల(-కోల) వి. 1. తవ్వటం మొ. వాటికోసం దొంగలుపయోగించే సాధనం, ఆయుధవిశేషం. బసవ. 128పు. 1పం ; 2. పశువులు మేపేగొల్లవాడు ధరించేకోల (చేతికర్ర). భార. విరా. 1.276 ; 3. బాణవిశేషం. లక్ష్మీవి. 2.76 ; 4. కొరడా, చెలకోల. సెలపంది వి. ఏదుపంది, ముళ్ళపంది. సెలపారు అ.క్రి. సెలవారు, రంధ్రం పడు. సెలపుండు వి. నారికురుపు, నాడీవ్రణం. సెలపెయ్యి వి. కట్టుకారుపెయ్య. సెలపోయు అ.క్రి. పుండుగండిపడు. సెలబాఱు(-పాఱు[2]) అ.క్రి. పుండుచుట్టూ గుల్లలు మొలచి పండువ్యాపించు. సెలలువాఱు(-పాఱు[2]) అ.క్రి. సెలలు వేయు. ప్రబోధ. 5.31. సెలవడు(-పడు) అ.క్రి, (కురుపు) రంధ్రంపడు, సెలవారు. చంద్రాంగ. 5.75. సెలవారు వి. గోడ కట్టేటప్పుడే కొన్ని రాళ్ళలోపలకు, కొన్ని బయటకు ఉండేటట్లు పేర్చి చివరలు వదలిన రాళ్ళలో లోపలకున్న రాయి. సెలవాఱు(-పాఱు[2]) అ.క్రి. సెలవేయు. మను. 3.40. సెలవేయు అ.క్రి. కురుపు చీముతో నిండి నొప్పి కలిగించు. సెలసేయు(-చేయు) అ.క్రి. పుండు గండిపడు.

సెల[3] వి. చిన్నకొమ్మ.

క. సెలె. శాఖ, చిన్నకొమ్మ, (చిన్నపిల్లల్ని శిక్షించే) బెత్తం, చళ్ళు, చెళు, సెల్లు పొదవు కొమ్మ ; కొడ. జళె. సన్నటి పొడవు కర్ర ; కో. చెళ్. పొడవుగా, గుండ్రంగా ఉండే పెద్ద కర్ర.

సెలగొమ్మ (-కొమ్మ) వి. ఉపశాఖ.

సెల[4] వి. పళ్ళు, కాయలు కొన్నప్పుడు నూటికి పైన లెక్కలోకి రాకుండా వేసే కొసరు కాయలు, కొసరు.

సెల[5] వి. ఆవు, ఏనుగు, గుఱ్ఱం, దేవత మొ. వాటి మట్టి ప్రతిమ.

సెల[6] రూ. సిల, సెళ. వి. గుండె ఆగిపోవటం, శరీరంలో ఎక్కడైనా బిగదీయటం.

సెలం రూ. సెలవ[2]. సెవలు. వి. పంగలాగా తీసినిగాడి.

సెలక రూ. సెలిక, సెలకె. వి. 1. సాగు చెయ్యటం మాని పశువుల మేతకు బీడుగా మార్చిన నేల ; 2. చిక్కిపోయే రోగం, క్షయ.

సెలకపార రూ. సలకపార, సెలికెపార. వి. ఎరువు చిమకటానికి, మట్టి తట్టల కెత్తటానికి, గనిమలు చెక్కటాని. ఉపయోగించే పెడల్పు రేకు అమర్చిన తవ్వ పనిముట్టు

సెలక్కాయ రూ.చూ. సెనక్కాయ వి. వేరుసెనగకాయ.

సెలగ[1] రూ. సెలవ[1], సెలిగె. వి. అమ్మేవాడు కొనేవాడికి అదనంగా ఇచ్చే సరుకు. ద్వి. పరమ. వి. 66.480 ; 2. ధాన్యాన్ని కొలిచే మాన విశేషం. సాంబ. మాన. 52 ; 3. ఉపశాఖ, రెమ్మ. ఆం.భా. 2.37 ; 4. దోసెడు గింజలు.

సెలగ దోసిలి వి. కొలతలో ధాన్యానికి నూటికొక సారిగాని ఇరవైకి ఒకసారిగాని వ్యవహరించ బడేమాట. ఇలా అన్న తరవాత మొత్తం లెక్క తెలియటం కోసం చేరుగా పోసిన దోసెడు గింజలు. విప్ర. 3.28.

సెలగ[2] రూ.చూ. సలువ. వి. 1. ధాన్యం కొలిచేటప్పుడు 20,30 మొ. సంఖ్య వచ్చినప్పుడు ఆసంఖ్యకు బదులుగా చెప్పే సంకేత పదం ; 2. 80 కుంచాలు ; 3. బర్రె.

సెలగనిపించు స.క్రి. సమృద్ధి చేయు. కకుత్థ్స. 1.129. < సెలగ[2] + అనిపించు.

సెలగ[3] రూ.చూ. చెనగ. వి. మెట్ట నేలల్లో పండే ఒకరకం పప్పుదినుసు.

సెలగపార రూ. చెలగపార, చెలికెపార, చెల్కపార, సనికిపార, సెలకపార, సెలంకపార, సెలపార. వి. ఎరువు పార, బడ్డెరపార, గనెంపార, పావడా, పెద్దపార, బుర్ర పార, ఎరువు చిమ్మటానికి, మట్టి తట్టలకెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే పెడల్పు రేకు అమర్చిన తవ్వ పనిముట్టు. సెలగ(బాఱు (-పాఱు[2]) అ.క్రి. 1. పుచ్చు బుట్టు ; 2. వంశం అతిగా విస్తరిల్లు. సెలగలు వి.బ.వ సెనగలు.

సెలగా క్రి. విణ. శలాక లాగ, వంకర లేనట్లుగా.

సం. శలాకా. ముక్క.

సెలగు రూ. చెలగు, చెలవు[1], సెలవు. అ.క్రి. ధ్వనించు, మారుమ్రోయు. భాస్క. రా. అరణ్య. 174 ; స.క్రి. 1. ఖండించు. యయా. 2.32 ; 2. మట్టిలో నీళ్ళు పోసి తొక్కుతూ పారతో కలుపు.

త. సెలె. పగులు, బీటలువారు ; కుఱు. చల్దెనా, విప్పు ; మాల్తో. చల్గె. పగలగొట్టు ; బ్రా. చలింగ్· చలేగింగ్· విడ గొట్టు, విడదీయు.

సెలగులు వి.బ.వ. చిక్కులు.

సెలగోయనిపించు చూ. సెలగు. అ.క్రి. జిలోస్మి అనిపించు. నలచ. 2.131.

సెలగోసెలగ చూ. సెలగు. వి. యుద్ధంలో పదాతులనుకొనే మాట. లక్ష్మీ వి. 2.79.

సెలంకపార రూ.చూ. సెలగపార. వి. ఎరువు చిమ్మటానికి, మట్టి తట్టల కెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే పెడల్పు రేకు అమర్చిన తవ్వ పనిముట్టు.

సెలపార రూ.చూ. సెలగపార. వి. ఒకరకం పార.

సెలంబులవారు విణ. బ.వ. చేతి అందెలతో నర్తిస్తూ కావడి పాటలు పాడేవారు.

త. సిలంబు. అందియ.

సెలయ్ వి. కవురు, కంబానికి చెక్కినగాడి.

సెలయు రూ. చెలయు. స.క్రి. 1. కొమ్ములు మొ. వాటితో పొడుచు. పాండు. 1 ; 2. చిమ్ము. చంద్రాంగ. 1.75 ; 3. ఖండించు, నరుకు, తరుగు ; అ.క్రి. విజృంభించు. నవనాథ. 1.12పు. 3పం. వరాహ. 12.32.

సెలసికొను స.క్రి. చిమ్ముకొను. చంద్రాంగ. 2.92. < సెలయు + -ఇ[13] + కొను.

సెలర్చు అ.క్రి. ఉత్సహించు. కు.సం. 6.99.

సెలవ[1] రూ.చూ. సెలగ[1]. వి. అమ్మేవాడు కొనేవాడికి అదనంగా ఇచ్చే సరకు ; 2. ధాన్యాన్ని కొలిచే మాన

విశేషం ; **3.** ఉపశాఖ, రెమ్మ ; **4.** దోసెడు గింజలు.

సెలవ[2] రూ.చూ. సెలం. వి. **1.** పాదు, గుంజలు మొ. వి. పాతటానికి గడ్డ పలుగుతో తవ్విన లోతైనగుంట ; **2.** గాడి, గొడ్లకు మేత వేసే స్థలం ; **3.** పంగలాగ తీసిన గాడి.

సెలవి వి. పెదవి మూల. శృం.నై. 7.88.

సం. సృక్క-, సృక్కణీ, సృక్కిన్, సృక్వణీ, సృక్వ-, సృక్విణీ. పెదవిమూల.

సెలవివాఱనవ్వు అ.క్రి. నోరు తెరచినవ్వు. మను. 2.40. <సలవి+పాఱు[2]+-అ[7]+నవ్వు.

**సెలవిచ్చు** చూ. సెలవు[1].

**సెలవిండ్లు** చూ. సెలను.

**సెలవిల్లు** చూ. సెలను.

**సెలవు**[1] రూ. శలవు, శల్వు, సెలువు, సెల్వు. వి. **1.** ఉపయోగం. భార. విరా. 1.141 ; **2.** సత్యం. భార. కర్ణ. 3.343 ; **3.** అజ్ఞ. హరి. ఉ. 2.98 ; **4.** చోటు, స్థలం. ఉ.హరి. 5.313 ; **5.** అనుజ్ఞ.రం.రా. బాల. 81పు.1పం ; **6.** విడుదల. వేంక. పంచ. 4.235 ; **7.** వీలు. సారంగ. 2.90 ; **8.** పోటు, దెబ్బ ; **9.** విరామం. స.క్రి. సెలగు. ఉ.హరి. 2.161.

క. సల్ (సంద్-) ప్రవేశించు, అనుమతించు, వెళ్ళు, చెల్లించు. సల. ప్రవేశించటం, కాలం. సలవు, సలవు. సలహు. ముందుకు వెళ్ళు, నిలవచేయు, తెప్పించు, సలవు. ప్రవేశం. అనుమతి, సలహువికె. పోషించెడు. రక్షించెడు, సలికె. చెల్లించు, చెల్లింపు. సలిగె, సలుగె. చనువు, అధికచనువు, ఇష్టప్రకారంగా విడచుట, స్వాతంత్రం, సలిసు. ప్రవేశింపచేయు, ఉపయోగం, ఇచ్చు. వెచ్చించు, ఖర్చుపెట్టు. సలుహ. ప్రవేశం, సాధారణమగు. సలె. సాధారణంగా, చెల్లింపు, సల్లిసు, భోజనం వడ్డించు, సెలవు. అనుమతి, సెలవు, అజ్ఞ ; తు. సల్లుని. అనుమతించు, సరిపోవు, సందుని. కాలం చెల్లు, చచ్చు, చెల్లించు, సందావుని. చెల్లించు, చేయుగ నెరవేర్చు, సందాయ. చెల్లించటం, అనుమతించు, సలసుని. జాగ్రత్తపడు, రక్షణ కల్పించు, సలాయిసుని. శుభ్రంచేయు. సలిగె. మిత్రత్వం, శత్రుత్వం, స్వాతంత్ర్యం చనువు ; త. చెల్ (చెల్వ్-, చెణ్జ్-). వెళ్ళు, ప్రవాహం, లభించు, సరిపోవు, జరిగిపోవు, (కాలం), చనిపోవు, భవిష్యత్తు, బాకీ ఇచ్చు. చెలవు. వెళ్ళటం, పరుగెత్తటం, ప్రవహించటం, ప్రయాణం, దారి, చావు, అనుమతి, సెలవు, చెలుత్తు (చెలుత్తి-). పంపించు, ముందుకు తోయు, గమనించు, చలికై. అనుబంధం, అధికమైన చనువు మ. చెలమ పంపించు, వెళ్ళు, చెల్లు, ధర, అవసరమైన, చెలవు-. రాబడి ఖర్చు, చెలవన్-. ఖర్చుచేసే మనిషి, చెలవి-, చెలుత్తుక. పంపించు ; కో. చల్- (చద్-). (ప్రార్థన) దేవునికి అనుమతించబడినది, (నాణెం) నాణ్యమైనది, నిక్కచ్చిఅయినది, చల్చ్-. (చల్చ్-). ఇవ్వవలసినది ఇచ్చు, తెలియపరచు, చల్వ్, చెల్వ్. ఖర్చుకోసం డబ్బు, అమ్మటానికి వస్తువులు ; తొ. సల్-. (సద్-). చెందు. సల్ఫ్). ఖర్చులు, అవసరాలు, తల్చ్-. (తల్చ్-). తెలియజేయు ; గోం. హందానా, సోందానా (సోన్-) ; కొం. సోల్-. (సోన్-, సోత్-) ; కుఇ. సల్బ-. (సస్-). వెళ్ళు ; కువి. హజ్జలి-. వెళ్ళు, హన్నై- ; పర్జి. చెని-. (చెంద్)- ; కొలా. సెర్-. వెళ్ళు, సెర్ప్-. (సెరెప్త్-). తుదముట్టించు ; నా. చ-. (చంద్-, చమ్-). వెళ్ళు, శెర్-, (శెద్-). వెళ్ళు ; గ. సెన్-. (సెయ్-, సెంఙ్-), చెన్-. (చెయ్-) : కురు. చల్ర్నా-, పొడిగించు, వెళ్ళు, ప్రవర్తించు, చలాబఅనా-. ఒకస్థలానికి దారిచూపించు, నడుపు, చలా-. అవతలి పక్కనున్న.

సెలవిచ్చు రూ. సెల్విచ్చు. అ.క్రి. అర్పించు. కుప.చ. 1.91 ; స.క్రి. ఆజ్ఞాపించు, జైమినిభా. 8.4. <సెలవు[1]+ఇచ్చు. సెలవుదీర్చు(-తీర్చు) అ.క్రి. మాటనిలుపుకొను. గౌ.హరి. ప్రథ. 1494. సెలవుపెట్టు రూ. సెలవువెట్టు. అ.క్రి. విరామంకోసం విజ్ఞప్తిచేయు. ద్వి. పరమ. వి. 6.463. సెలవువెట్టు(-పెట్టు) రూ.చూ. సెలవుపెట్టు. అ.క్రి. విరామానికి విజ్ఞప్తిచేయు సెలవుసేయు[1](-చేయు) స.క్రి. **1.** బోధించు. సానంద. 4 ; **2.** అర్పించు.

సెలవు[2] రూ.చూ. సెలగు. స.క్రి. ఖండించు. మను. 4.17.

సెలవు[3] అ.క్రి. పైకిచిమ్ము. ఉ. హరి. 2.160.

సెలవు[4] వి. వ్యయం.

సెలవుకాఁడు రూ.చూ. సెలవుగాఁడు. వి. దూబర తిండి. సెలవుగాఁడు రూ. సెలవుకాఁడు. వి. తినేవాడు, దూబర తిండి. సెలవుదురాయి వి. వెచ్చం. సెలవువిడుపు వి. వెచ్చం. సెలవుసేయు[2](-చేయు) స.క్రి. **1.** వ్యయంచేయు, ఖర్చుచేయు.

సెలసికొను చూ. సెలయు.

సెలసు వి. ఒకానొకచెట్టు. వేంక. పంచ. 4.471.

సెలవిండ్లు వి.బ.వ. ఒకరకం విల్లులు. మను. 4.14. <సెలను+విల్లు+-లు. సెలవిల్లు రూ.చూ. సెలనువిల్లు. వి. సెలనుబద్దలతో చేసినవిల్లు. రాజవా. 3.35. <సెలను+విల్లు. సెలసువిల్లు రూ. సెలవిల్లు. వి. సెలను బద్దలతో చేసిన విల్లు. వరాహ. 4.72.

సెలిక రూ.చూ. సెలక. వి. సాగుచెయ్యటంమాని పశువుల మేతకు మార్చిన నేల.

సెలికె రూ.చూ. సెలక. వి. సాగుచెయ్యటం మాని పశువుల మేతకు బీడుగా మార్చిననేల.

సెలికెపార రూ.చూ. సెలకపార. వి. ఎరువు చిమ్మటానికి, మట్టితట్టలకెత్తటానికి, గనిమలు చెక్కటానికి ఉపయోగించే వెడల్పు రేకుఅమర్చిన తవ్వ పనిముట్టు.

సెలిగె రూ.చూ. సెలగ[1]. వి. **1.** అమ్మేవాడు కొనేవాడికి అదనంగా ఇచ్చేసరకు ; **2.** ధాన్యాన్ని కొలిచే మానవిశేషం ; **3.** ఉపశాఖ, రెమ్మ ; **4.** దోసెడు గింజలు.

సెలియు రూ.చూ. సెలయు. స.క్రి. **1.** చిమ్ము ; **2.** ఖండించు, నరకు.

సెలుకాలుది వి. ఒకరకం కోడిపుంజు.

సెలుగు చూ. చెలఁగు. అ.క్రి. మిక్కిలి గట్టిగా అరచు.

సెలుపుకొమ్ము రూ. సెల్పుకొమ్ము. వి. నేతలో డిజైన్లుపడ,

టానికి చేతితో విసురుతూ నేసే ఒకరకం నాడె.

సెలుపుజుట్టు రూ. సెల్వుజుట్టు. వి. డిజైన్లు నేసే చేతిమగ్గంలో అడ్డబేలునుంచి పడుగులోకి వేలాడే దారాలు.

సెలుపునేత రూ. సెల్వునేత. వి. చీర కొంగులో పట్టెలు పట్టెలుగా నేసిన నేత.

సెలుపుపలక రూ. సెల్వుపలక. వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు అని తొక్కగా లేచిన పోగులను నిలిపి ఉంచ టానికి పడుగులోగాని అడ్డబేలులోగాని దూర్చే కొయ్య చెక్క.

సెలువు రూ.చూ. సెలవు[1]. వి. **1.** దీర్ఘకాలానంతరం ; **2.** విరామం.

సెల్వు వి. అర, అలమరలో అడ్డుచెక్కచేత వేరుచేయబడిన భాగం.

ఇం. *Shelf.* అలమర, అర.

<ఇం. Shelf.

సెల్వుకొమ్ము రూ.చూ. సెలవుకొమ్ము. వి. నేతలో డిజైన్లు పడటానికి చేతితో విసురుతూ నేసే ఒకరకం నాడె.

సెల్వుజుట్టు రూ.చూ. సెలపుజుట్టు. వి. డిజైన్లునేసే చేతి మగ్గంలో అడ్డబేలునుంచి పడుగులోకి వేలాడే దారాలు.

సెల్వునేత రూ.చూ. సెలుపునేత. వి. చీరకొంగులో పట్టెలు పట్టెలుగా నేసిన నేత.

సెల్వుపలక రూ.చూ. సెలుపుపలక. వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు అనిదొక్కగా లేచిన పోగులను నిలిపి ఉంచటానికి పడుగులోగాని అడ్డుబేలులోగాని దూర్చే కొయ్య.

సెల్ల రూ.చూ. శెల్లా. వి. **1.** పట్టువస్త్రం ; **2.** కండువా, ఉత్తరీయం.

సెల్లా రూ.చూ. శెల్లా. వి. **1.** అంచుకమ్ములులేని తెల్లవస్త్రం. భాను. 4 ; **2.** భుజాలమీద కప్పుకోవటానికి నేసిన చిన్న బట్ట ; **3.** ఒంటిమీద కప్పుకోవటానికి నేసిన ఒకరకం ముతకబట్ట ; **4.** ఆడపిల్లలు నడుముకు చుట్టుకొని పైన కప్పుకొనే బట్ట, రెండుమూడు మూరల పొడుగుది ; **5.** పట్టువస్త్రం.

సెల్లి రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు.

సెల్లియ రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు. ద హిం.శా. సంపు. 10. శా. నం. 650.

సెల్లియము రూ.చూ. సెల్లెము. వి. బాణంములికి.

సెల్లియలు రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు.

సెల్లుఁడు వి. శల్యుడు. భార. ఆది. 7.202.

సం. శల్య-. శల్యుడు ; ప్రా. సెల్ల-, సల్ల-. ఒకానొక రాజు.

<ప్రా. సెల్ల-.

సెల్లుపెట్టు రూ. చెల్లుపెట్టు. అ.క్రి. సరిపెట్టు. నె. శా. కావలి. (25). క్రీ.శ. 1244.

సెల్లె రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు

సెల్లెము రూ. సెల్లియము. వి. బాణంములికి. విక్ర. 4.104.

సం. శల్య-. బాణం, ఈటె, ములికి ; ప్రా. సల్ల-. ; పా. సల్ల-, బాణం, లోనికి దొచ్చుకొని పోయేది ; హిం. సాల్-. మల్లు, భూరంధ్రం,

<ప్రా. సల్ల-.

సెల్లెలు రూ.చూ. చెలియలు. వి. చెల్లెలు.

సెల్విచ్చు చూ. సెల్వు.

సెల్వు రూ.చూ. సెలవు[1]. వి. ఆజ్ఞ. ఉ.రా. 7.258.

సెల్విచ్చు రూ.చూ. సెలవిచ్చు. స.క్రి. సెలవిచ్చు. ఉ.రా. 6.175. <సెల్వు+ఇచ్చు.

సెవ రూ.చూ. సెగ. వి. మంట, శిఖ.

సెవత్తకారి వి. నెరజాణ, చమత్కారి.

నం. చమత్కారిన్. చమత్కారం చేసేవాడు.

<నం. చమత్కారిన్.

సెవలు రూ.చూ. సెలం. వి. పంగలాగా తీసినగాడి.

సెవ్వ వి. ఆడవాళ్ళు ఇంకొక స్త్రీని సంబోధించేపదం.

<సే+అవ్వ.

సెస వి. శుశ్రూష. ఆం. భా. 2.173.

సం. శుశ్రూషా. సేవ.

<నం. శుశ్రూషా.

సెహతునామా వి. ఆరోగ్యసంబంధమైన వివరాలు.

ఉ. అర. సిహ్హాత్. ఆరోగ్యం, పరిపక్వం, సరళత, పూర్ణత్వం, శుద్ధత ; పార. నామా. ఉత్తరం, చరిత్ర, అకౌంటు, పుస్తకం, సమాసాలలో రాత, సిహ్హాత్‌నామా. ఆరోగ్యసంబంధమైన రిపోర్టు.

<ఉ. సిహ్హాత్+నామా.

సేకము చూ. సెక[1]. వి. సెగ. వేంక. పంచ. 1ఆ. 688.

క. సేక. తాపం.

సేకడా రూ.చూ. శెకడా. విశ. శాతం.

సేకరము వి. **1.** సంగ్రహం. నార. పంచ. **1.308** ; **2.** స్వీకారం.

సం. స్వీకార-. గ్రహించటం, అంగీకారం ;

త. చేకరమ్. సేకరణ, నిలవ, చేకరి (-ప్పు-,-త్తు-) చేర్చు, కూర్చు. సంగ్రహం ; మ. శేఖరమ్. కుప్ప. రాశి, పోగు, శేఖరిక్క. కుప్పచేయు.

<సం. స్వీకార-.

సేకరించు స.క్రి. **1.** సంగ్రహించు. మను. **4.115** ; **2.** రాబట్టి. ప్రబంధ. **1.794.** త. చేకరి-. (ప్పు-. -త్తు-). సేకరించు. <సేకరము+- ఇంచు[3]. సేకరించుకొను అ.క్రి. **1.** అలసటతీర్చుకొను. మను. 4.115 ; **2.** కూడబెట్టుకొను.

సేకరించు చూ. సేకరము.

సేకరించుకొను చూ. సేకరము.

సేకు[1] వి. అధికారి. నె.శా. కనిగిరి. 22. క్రీ.శ. 1586.

హిం. శేఖ్, మహమ్మదీయులబిరుదు, శ్రేష్ఠమైన. గొప్ప. ఉ. షేఖ్.

<ఉ. షేఖ్.

సేకు[2] వి. **1.** గోవ, పేననినార, గోగునార. **2.** జనపనార.

సేకుమాను వి. బొగ్గునిచ్చే ఒకరకంచెట్టు (Trema orientalis).

**సేగ** రూ. సేగు. వి. **1.** చేవ, గట్టిభాగం ; **2.** చేవమాను, ఎర్రని కలప కలిగి, కొయ్యమేకులవంటి పరికరాల తయారీలో పనికివచ్చే చిన్నచెట్టు (Sandoricum indicum).

**సేగి** వి. **1.** నష్టి. భార. విరా. 3.140 ; **2.** కీడు, అపాయం, ఆపద, చేటు, భార. ఉద్యో. 2.250 ; **3.** దుస్థితి. ఉ.హరి. 5.280 ; **4.** అమంగళం. కాశీ. **2.45.**

నం. ఛిద్రక-. రంధ్రం, అపరాధం, దూషణం ; ప్రా. ఛిడ్డ-. రంధ్రం.

**సేగిగడ్డి** రూ. సేగ్గడి. వి. చచ్చుగడ్డి, కళ్ళంలో మెదిగినగడ్డి గింజలురాలినగడ్డి. **సేగిపోవు** అ.క్రి. చెడిపోవు. విష్ణుపు. 2.243. **సేగ్గడ్డి** రూ.చూ. సేగిగడ్డి. వి. చచ్చు గడ్డి. కళ్ళంలో మెదిగినగడ్డి, గింజలు రాలినగడ్డి.

**సేగు** రూ.చూ. సేగ. వి. చేవ, గట్టిభాగం.

**సేగ్గడ్డి** చూ. సేగి.

**సేటిన్** వి. ఒకరకం సిల్కుబట్ట.

ఇం. *Satin*. ఒకవిధమైన పట్టుబట్ట.

< ఇం. Satin.

**సేటిన్‌లంగా** వి. ఒకరకం సిల్కులంగా.

**సేటినువన్నె** చూ. సేటిన్. రూ. సాటిన్‌వన్నె. వి. ఒకరకం నీలంరంగు ; **2.** ఒకరకంలేతనీలంరంగు ; **3.** రామనీలం కంటె లేతరంగు ; **4.** నీలంరంగులో మధ్యరకంగా ఉండేది.

**సేటిన్‌పేటంచు** చూ. సేటిన్. రూ.చూ. సాటింగుపేటంచు. వి. రిబ్బను మాదిరిగా నేత అయిమూలగా కనబడేట్టునేసిన అంచు.

**సేటు** రూ.చూ. షేటు. వి. యజమాని, ఇంటిసొంతదారు.

**సేడి** రూ. సీడ, సీడె. వి. **1.** బండిజల్ల తెరచిఉన్న వైపు ; **2.** ఎరువు, కంకులు తోలే బండిజల్ల తెరచి ఉన్నవైపు అడ్డం పెట్టిన తడిక లేక చొప్పకట్ట ; **3.** ఎక్కువ కంకులు పొయ్యటానికి బండి జల్ల అంచుల్ని నిలవేసిన చొప్పకట్ట.

**సేడితాడు** వి. బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంకట్టే తాడు.

**సేడుకఱ్ఱ** రూ.చూ. చెముడుకర్ర. వి. సాలెవాని సాధన విశేషం.

**సేడుగీరు** చూ. చేడు. అ.క్రి. నేతనేసేటప్పుడు బట్ట అంచులకు చేడుముక్కు గుచ్చిన చోట గంజిపూసి సాపుచేయు.

**సేడెగొట్టు(-కొట్టు[1])** రూ.చూ. చేడెకొట్టు. అ.క్రి. మట్టిపాకం వల్లగాని, కాల్పులోపంవల్లగాని ఆముకాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

**సేడెలెగురు** చూ. చూడాలెగురు. అ.క్రి. మట్టిపాకంలోపం వల్లగాని కాల్పులోపంవల్లగాని ఆముకాల్పులో కుండలు పేళ్ళుపేళ్ళుగా పగిలిపోవు.

**సేత** రూ.చూ. సేద. వి. వ్యవసాయం.

**సేతకుండ** రూ.చూ. సీతకుండ, వి. సున్నంపూసి నల్లచుక్కలు పెట్టిన దిష్టికుండ.

**సేతబడి** రూ.చూ. చేతబడి. వి. చేతబడి, చిల్లంగి.

**సేతవ** రూ.చూ. సేద. వి. **1.** కృషి ; **2.** ఏదైనాపని సేదవ.

**సేతాను** రూ. సాతాను, సైతాను, వి. భూతం. విశ్వేశ. 53.

హిం. శైతాన్. దయ్యం ; మరా. సైతాన్. శని భూతం, దయ్యం ; ఉ. షైతాన్. భూతం ; పార. సైతాన్. శని, భూతం, ఒకరకంపాము.

< ఉ. షైతాన్.

**సేతాళము** వి. చేతబడి.

**సేతురాయి** వి. నర్సేటప్పుడు ఎడమచేత్తో వాటలోపలిభాగంలో మోపు పెట్టటానికి ఉపయోగించేరాయి.

**సేత్‌సింద్‌ఇనాం** వి. తలారికి ఇచ్చేఇనాం.

**సేద** రూ. శేద, సేత, సేతవ. సేదవ వి. **1.** శ్రమం, అలసట, కు.సం. 4.89 ; **2.** మూర్ఛ. భార. ద్రోణ. 1.95 ; **3.** మ్లానం.

**సేంతమూకుడు** రూ.చూ. శాంతమూకుడు. వి. రజస్వల అయినప్పుడు అమ్మాయిలు అన్నం తినటానికి, పెళ్ళిలో నవధాన్యాలు పెట్టటానికి వాడే మూకుడు.

**సేంతొట్టి** చూ. చేయి. తొట్టి. వి. కుండల్ని నర్సేటప్పుడు కుమ్మరి కుడివైపు పెట్టుకునే నీళ్ళతొట్టి.

వాడటం. విక్ర. 1.158 ; 4. పూనిక.

నం. స్వేద-. చెమట ; ప్రా. సేద-, సేఅ-. చెమట పోయటం ; జై.మహా. సేఅ ; అ.మా. సేఅ, సేయ. చెమట ; పా. సేద-. చెమట ;

క. సేదె. అలసట, శ్రమ.

< ప్రా. సేద-.

**సేదకమ్ము** అ.క్రి. చెమటపట్టు. **సేదగొను (-కొను)** అ.క్రి. బడలు, శ్రమనొందు. అచ్చ.రా. అయోధ్యా. **సేదదేరు** రూ.చూ. సేదదేఱు. అ.క్రి. శ్రమనుండి తెప్పరిల్లు, దశకు. 2.251. **సేదదేర్చు (-తేర్చు)** స.క్రి. శ్రమతీర్చు. మార్క. 1.103. **సేదదేఱు(-తేఱు)** రూ. సేదదేరు. అ.క్రి. శ్రమతొలగు, ఆయాసం వదలు తెప్పరిల్లు. నిర్వ.రా. 7.117. **సేదలువోవు(-పోవు)** అ.క్రి. అలయు, బడలు.

**సేదరం మాదరం** వి. చిరాకు.

**సేదాడుబోలె** వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకునే నీళ్ళకుండ.

**సేదాల్తొట్టి** రూ.చూ. సాదాలతొట్టి. వి. కుండలు వానేటప్పుడు సారెపక్కన పెట్టుకునే నీళ్ళపాత్ర.

**సేద్యకాఁడు** చూ. సేద్యము.

**సేద్యగాఁడు** చూ. సేద్యము.

**సేద్యము** వి. **1.** వ్యవసాయం వేంక. పంచ. 1.999 ; **2.** పైరు పెట్టటం.

నం. సీత్య-. దున్నబడ్డది, బియ్యం, ధాన్యం ;

క. సేద్య. వ్యవసాయం.

< నం. సీత్య-.

**సేద్యకాఁడు** రూ. సేద్యగాడు. వి. **1.** సేద్యం చేసే వాడు, కృషీవలుడు ; **2.** వ్యవసాయంలో జీతగాడు.

**సేద్యగాడు** రూ.చూ. సేద్యకాఁడు. వి. **1**. వ్యవసాయదారుడు **2**. వ్యవసాయంలో జీతగాడు.

**సేన** రూ.చూ. చాల. అవ్య. **1**. ఎక్కువ, పెద్ద. పాంచాలీ. 5.75 ; **2**. మిక్కిలి.

**సేనం** రూ. శాణం, శానం, షేనం, సానం, సీనాం, సేనాం. వి. రాతిముక్కలు కొట్టటానికి పనికివచ్చే, ఒకఅంచు పదునుగా ఉండే ఉక్కుముక్క.

నం. శాణ-. సాన, గీటురాయి, రంపం.

**సేనము** వి. బంగారం నరికే ఉలి, చిన్న సేనం. ఆం. భా.

నం. ఛేదన-. శస్త్రం, ఛేదించేది, ఆయుధవిశేషం ; ప్రా. ఛేఅణ- ; అ. మా. జైంమహా. చేఅణ-. శస్త్రం, ఛేదించేది ;

క. చాణ, చాన, చేణ. చిన్న ఉలి ; తు. వేణు, చేను.

< ప్రా. ఛేఅణ-.

**సేనముదలియారి** రూ సేన మొదలియారి. వి. విష్వక్సేనుడు. పాండు. 1.7. వ్యు. సేనల అధిపతి.

నం. సేనా. సేన. దండు.

**సేనమొదలియారి** రూ.చూ. సేనముదలియారి. వి. విష్వక్సేనుడు. తాళ్ల. సం. 9.222.

**సేనా** రూ.చూ. చాల. అవ్య. **1**. ఎక్కువ, మిక్కిలి. ప్రభు. 2.55 , **2**. పెద్ద.

సేనాసేన అవ్య. మిక్కిలి ఎక్కువ. తాళ్ల. సం. 8.221.

**సేనాం** రూ.చూ. సేనం. వి. రాతిముక్కలు కొట్టటానికి పనికివచ్చే ఒకఅంచు పదునుగా ఉండే ఉక్కుముక్క.

**సేనాపతి** వి. **1**. బట్టలునేసేవారిలో ఒకతెగవాడు ; **2**. దేవాంగులలో కులపెద్ద.

నం. సేనాపతి-. సైన్యాధ్యక్షుడు.

< నం. సేనాపతి- (అర్థవిపరి.).

**సేనాపతులు** వి.బ.వ. చేనేత పనివాళ్ళలో ఒకతెగ.

**సేనాపతులు** చూ. సేనాపతి.

**సేనికమ్మి** వి. దంతె.

**సేను** రూ.చూ. చేను. వి. చేను. ద.హిం. శా. సంపు. **10**. శా. నం. 103. క్రీ.శ. 1137.

**సేనుచేయు** న.క్రి. **1**. కుప్పచేయు ; **2**. కరిపిచ్చు, అంటు కొనేటట్లు చేయు.

**సేనెదోన** వి. తియ్యదోన.

**సేపు** వి. కాలం. భార. అరణ్య. 3.394.

నం. క్షేప-. తోయటం, అటుఇటు తిరగటం, వదిలించుకోవటం, క్షేపణ- కాలక్షేపం చేయటం ; ప్రా. అ.మా. ఖేవ-, ఖేవణ-. విలంబం, పంపటం, తోయటం, కాలం, సమయం.

< నం. క్షేప-.

**సేపోర్చు** అ.క్రి. కాలంనిల్పు. హరి. పూ. 8.49.

< సేపు+ఓర్చు.

**సేపోర్చు** చూ. సేపు.

**సేబాసు** రూ. శబాసు, శహబాసు, శాబాస, శాబాసి, శాబాసు, శాబాసె, సబాసు, సాబాసు, సెబాసు. అవ్య. ఆశ్[1]ర్యార్థకం, ప్రశంసార్థకం, బళి, బళా. హర. 7.64.

హిం. శాబాశ్. వాహ్వా ; ఉ. షాబాష్. ప్రశంసార్థక పదం ; హిం. శాబాశ్. వాహ్వా ; మరా. శాబాస ; పార. షహ్-. బాష్. స్తుతి, మేలు మేలని ఎలుగెత్తి కొనియాడటం.

< ఉ. షాబాష్.

**సేమంతిపాలు** చూ. సేవంతి. వి. కొంచెం నిప్పు సెగమీద కాచిన పాలు. ద.హిం. శా. సంపు. 6.శా.సం. 1124. క్రీ.శ. 1388.

**సేమము** వి. **1**. శుభం. భార. అరణ్య. 4.77 ; **2**. కుశలం. క్షేమం, నిర్వ.రా. 2.8 ; **3**. ప్రయోజనకారి. నృసింహ, 2.136 ; **4**. క్షేమవార్త. జైమినిభా. 3.52.

నం. క్షేమ-. శుభం, మేలు ; ప్రా. అ.మా. పా. ఖేమం ; అప. ఖేఉ, క్షేమం, ఖేడం. కౌగిలింత ;

క. కేమ, చేమ, సేమ ; త. ఏమమ్, చేమమ్. ఆనందం, భోగం, రక్షణ ; మ. క్షేమం. నేర్పు, గెలుపు, ఉన్నతి, శరీరదార్ఢ్యం, మనోబలం, ఆరోగ్యం ; ఒరయాన్. ఖేమ్. ఆరోగ్యం. శుభం.

< నం. క్షేమ-.

**సేమల్నారరొడ** వి. కాకవచ్చినప్పుడు ఆము కాల్చటానికి వాడే ఒకరకం కంప.

**సేమ్యా** రూ.చూ. సేవియ. విణ. సేమ్యా ఆకారం కలది ; వి. భక్ష్యవిశేషం.

**సేయు** రూ.చూ. చేయు. న.క్రి. కావించు. తాళ్ల. సం. 14.195.

**సేరవకుండ** వి. రాగి సేరవమాదిరి ఉండే మట్టి పాత్ర.

**సేరి** రూ.చూ. సేరీ. వి. **1**. ఈనాం కాని పొలం ; **2**. హెచ్చు పరిమితి ఉన్న సాగుబడి.

**సేరిఖత్తు** వి. భాగస్వామిత్వం. విశ్వే. శ. 55.

హిం. శిర్కత్. భాగం, ఏదో ఒకపనిలో కలసి పని చేయటం ; ఉ. షిర్కత్. సమ్మేళనం, భాగ స్వామిత్వం. పార. షిర్కత్. భాగస్వామిత్వం.

< ఉ. షిర్కత్.

**సేరిదారు** రూ.చూ. సేరిదారుడు. వి. భూస్వామి భూముల్ని సాగుచేసేవాడు. (పండించిన పంటలో ఇతనికి భాగం ఉంటుంది).

**సేరిదారుడు** రూ. సేరిదారు. వి. భూస్వామి భూముల్నిసాగు చేసేవాడు. (పండించిన పంటలో ఇతనికి భాగం ఉంటుంది). నెల్లూరిలో తలమనిషి లాంటివాడు

హిం.ఉ. సేరిదార్. తుష్టుడు.

**సేరీ** రూ. సేరి. వి. **1**. ఈనాం కాని పొలం ; **2**. హెచ్చు పరిమితిగల సాగుబడి ; **3**. వ్యవసాయం.

హిం. ఉ. సేరీ. తృప్తి, తుష్టి.

**సేరీసంది** < ఉ. సేరీ. వి. అరసందు. రెండిళ్ళమధ్య ఉన్న సందు.

**సేరు**[1] రూ. శేరు. వి. **1**. 80 తులాల మాన విశేషం, ఎనభై తులాలఎత్తు, 24 తులాలఎత్తు (కొన్నిచోట్ల) ; **2**. ఎనిమిదిగిద్దలు, ఇరవైనాలుగు తులాలు.

నం. సేతు -. ఒకనొక తూనిక ; ప్రా. సేర - ; పా. సేర -. ఒకానొక పరిమాణం, సేరు ;

క. సేరు. మానవిశేషం, తు. సేరు ; త. చేర్

మ. సేర్ ; తా. సేర్.

<ప్రా. సేర -.

**సేరుకుండ** రూ.చూ. శేరుకుండ. వి. శేరుబియ్యం ఉడికేకుండ. **సేరుకునవాశేరు** వి. ఎత్తుకు పైఎత్తు. **సేరుకోల** వి. దూదితూచే ఒకరకం తక్కెడకట్టె, దీనికి సన్నగా ఉన్నపైపు గాట్లుచేసి సేర్లగుర్తులు కొన్నిచోట్ల వీసెల గుర్తులు పెడతారు. **సేరుతాడు** వి. సేరుకోలకు పైన వేసినతాడు. **సేరుబద్దలు** వి.బ.వ. దూది తూచటానికి త్రిభుజాకారంలో తాళ్ళతో బిగించి సేరుకోలకు వేలాడదీసిన బద్దలు. **సేరుముంత** రూ.చూ. శేరుముంత. వి. 1. కల్లు అమ్మకంలో వాడే మట్టిపాత్ర ; 2. సేరు కొలత కల పదార్థం పట్టే పాత్ర. **సేరులు** రూ. సేర్లు. వి.బ.వ. సేరుకోలకు సేరుబద్దలు వేలాడదీసిన తాళ్ళు. **సేర్లసట్టి** వి. కుండలు చేసేటప్పుడు కుమ్మరి సారెపక్కన పెట్టుకొనే నీళ్ళపాత్ర. **సేర్లు** రూ.చూ. సేరులు. వి.బ.వ. కావడి మట్టుతాళ్ళు.

**సేరు²** వి. పశువుల మగగురి ; 1. లావుమోకు, చెరగు ; 2. గర్భకోశం.

**సేరుహూన** వి. లోహభేదం.

**సేర్లసట్టి** చూ. సేరు¹.

**సేర్లు** చూ. సేరు¹.

**సేర్వాలు** రూ.చూ. సారవాలు. వి.బ.వ. ఆము పడుగులో కుండల పేర్పుమధ్య కట్టెకంప వేయటానికి వదిలిన సందులు.

**సేల** వి. వస్త్రం. యమా. 2.98 ; 2, జామారు.

నం. చేల -. వస్త్రం.

<నం. చేల -.

**సేలంపజాకమ్మి** వి. ఒకరకం చీరకమ్మి, చీరకొంగులో పూలు, డిజైన్లు పడేట్లు నేసిన చీరకమ్మి.

నం. చేల -. వస్త్రం.

<నం. చేల-+-ము+వజాకమ్మి.

**సేలంకమ్మి** వి. 1. ఒకరంగు పచ్చదారం పదికొలుకులు, తెలుపుదారం ఒకకొలికిచొప్పున రెండువరసల్లో నేసి తరువాతరంగు తెలుపు పదేసి కొలుకులూ పచ్చ ఒకకొలికి చొప్పున మూడేసి పట్టెలుగా నేసినకమ్మి ; 2. అరంగుళం వెడల్పు పట్టెకు రెండువైపులా గీరలుపెట్టి నేసినకమ్మి.

నం. చేల -. వస్త్రం.

<నం. చేల-+-ము+కమ్మి.

**సేలంకుంచి** రూ.చూ. సేలంకుంచె. వి. ఒకరకం కుంచె, పురి అడుగుభాగం గుండ్రంగా ఉన్నది.

**సేలంకుంచె** రూ. సేలంకుంచి. వి. ఒకరకం కుంచె, పురి అడుగుభాగం గుండ్రంగా ఉన్నది.

నం. చేల -. వస్త్రం.

<నం. చేల-+-ము+కుంచె.

**సేలమంచు** రూ. చేలమంచు. వి. కడ్డీమాదిరిగా పంచెలకు నేసేఅంచు.

నం. చేల -. వస్త్రం.

<నం. చేల-+-ము+-అంచు³.

**సేలు¹** రూ.చూ. సాలువ. వి. సన్నవస్త్రం, శివరా 4.72.

**సేలు²** వి. పురుషార్థం.

**సేలువ** రూ.చూ. సాలువ. వి. శాంకవం, మృగరోమజం. ఉ. రా. 4.178.

**సేలువు** రూ.చూ. సాలువ. వి. సాలువ. బహుళా. 5.110, ఇందు. ప. 1.35.

**సేళము** వి. 1. కొర్రలు, సస్యవిశేషం ; 2. వృక్షవిశేషం.

**సేవ** రూ.చూ. సేవియ. వి. గోధుమనూకతో సన్నగా తావికలు చేసి పాలుపోసి పంచదారతో వండే భక్ష్య విశేషం. హంస. 1.105.

**సేవంతి** రూ. చామంతి, చేమంచి, చేమంతి. వి. సేమంతి. పండి. చ. 5.355, భోజ. 3.165.

నం. సేమంతీ. చామంతి.

<నం. సేమంతీ.

**సేవంతివిరులు** వి.బ.వ. చేమంతిపూలు. హంస 1.184.

**సేవపట్టొల్లె** వి. పెళ్ళికూతురికి అత్తవారుపెట్టే ఒకరకం చీర.

నం. సేవ -. పరిచర్య, పూజ, ఆసక్తి, ఉపయోగం. భోగడ్త.

<నం. సేవ-+పట్టు¹+ఒల్లె.

**సేవలు** రూ.చూ. సేవియ. వి.బ.వ. భక్ష్యవిశేషం. హంస. 1.105.

**సేవియ** రూ. శేమ్యా, సేమ్యా సేవ, సేవలు, సేవె. వి. 1. భక్ష్య విశేషం, జంతిక. కాశీ. 7.186 ; 2. గోధుమనూకతో సన్నగా చేసినతాలికలు (పాయసాదుల కుపయోగించేవి)

నం. సేవికా. తీయని భక్ష్యవిశేషం, గోధుమపిండి. పాలు, పంచదారతో చేసేది ; ప్రా. సేవిఅ ; మరా. శేవఇ ;

క. శావిగె, సావిగె, సేవిగె, సేవిగె ; తు. సేమె . త. చేమియ ; మ. సేవ ; గోం. సేవ్యా.

<ప్రా. సేవిఅ.

**సేవు** వి. దొంతికుండ.

**సేవె** రూ.చూ. సేవియ. వి. 1. గోధుమనూకతో సన్నగా తాలికలు చేసి పాలుపోసిన పన్నెండు భక్ష్యవిశేషాలు. భీమ 1.60 ; 2. సేమియా.

**సేన** వి. 1. తలంబ్రాలు, సేసబ్రాలు. భార. ఆది. 4.17 ; 2. దీవించేటప్పుడు వేసే అక్షంతలు. కు.సం. 8.52 ; 3. అక్షతలబొట్టు. మను. 6.5 ; 4. పాపట. రసిక. 1.2, నీలా. 3.52 ; 5. పుష్పాంజలి. దశా. 4.187 ; 6. ఒకరకంవడ్లు.

నం. శేష -, శేషా. తలంబ్రాలు, సేసబ్రాలు ; ప్రా సెసా. నిర్మాల్యం ; అ.మా. సేస - ;

క, సాసే, సేస, సేసె ; త, చేఆమ్ ; మ. శేషం.

<ప్రా. సేసా.

**సేనకొప్పు** వి. కొండెసిగ. శృం.నై. 5.92. వ్యు. సేసలు చల్లేటప్పటికొప్పు. **సేసన్రాలు** రూ.చూ. సేసబ్రాలు వి.బ.వ.తలంబ్రాలు. లక్ష్మీ వి. 5.83. **సేసపెట్టు** రూ. సేసవెట్టు. స.క్రి. పెళ్ళాడు. తాళ్ల.సం. 7.51. **సేసపెండ్లికూతురు** వి.

శాస్త్రోక్తంగా వివాహమాడే కన్య. తాళ్ల.సం. 17.515. **సేసప్రాలు** రూ.చూ. సేసఁబ్రాలు. వి.బ.వ. తలంబ్రాలు. ద్వి. పరమ. వి. 4.344. **సేసబుడ్డి** వి. పెళ్ళిలో సేసలు పోయటానికివాడే మట్టిపాత్ర. **సేసబొట్టు** వి. 1. అక్షతలతో పెట్టిన తిలకం. మను. 6.55 2. పాపటబొట్టు. య యా. 4.134. **సేసముత్తియములు** రూ. సేసముత్తెములు. వి.బ.వ. ఆశీర్వదించేటప్పుడు చల్లే అక్షతలకు మారుగా వేసే ముత్యాలు. నృసింహ. 2.85. **సేసముత్తెములు** రూ.చూ. సేసముత్తియములు. వి.బ.వ. ఆశీర్వదించేటప్పుడు చల్లే అక్షతలకు మారుగా వేసే ముత్యాలు. పారి. 5.43. **సేసఁబ్రాలు** రూ. సేసన ప్రాలు, సేసప్రాలు. వి.బ.వ. తలంబ్రాలు. విక్ర. 4.140. < సేస + ప్రాలు. **సేసయిడు (-ఇడు)** స.క్రి. సేసపెట్టు. ద్వి. పరమ. వి. 5.424. **సేసలలికినభంగిన్** అవ్య.ద్రు. అక్షతలు చల్లినట్లు. కు.సం. 6.108. < సేస + -లు + అలికినభంగిన్. **సేసలు** వి బ.వ. అక్షతలు. భార. విరా. 5.232. **సేసలుబోయు (-పోయు)** స.క్రి. వధూవరులకు, పెళ్ళిపీటల మీదనే కంకణాలు విప్పేముందు పెళ్ళిపెద్దలు ముగ్గురు మూడేసి పిడికిళ్ళ తలంబ్రాలు వధూవరుల ముందు పోయు. **సేసలువెట్టు (-పెట్టు)** స.క్రి. పెళ్ళాడు. హరి.పూ. 3.133. **సేసలు సల్లు (-చల్లు)** అ.క్రి. అక్షతలు చల్లు. భార. అను. 4. 45. **సేసపెట్టు (-పెట్టు)** రూ.చూ. సేసపెట్టు. స.క్రి. పెళ్ళాడు. తాళ్ల.సం. సం. 13.61 ; అ.క్రి. అక్షతలు మొ. వాటిని చల్లు. పాండు. 1.41. **సేసాడు** స.క్రి. పెళ్ళాడు. తాళ్ల.సం, 14.226. < సేస + ఆడు.

**సేసనము** వి. రాజాజ్ఞ సూచకమైన దానశాసనం. ద హిం.శా. సంపు. 10.శా.సం. 73. క్రీ.శ. 1161.

సం. శాసన-. శిక్షించటం, ఏలుబడి, అజ్ఞ, ఒప్పుదల, విధి, దానశిలాఫలకం, దానపత్రం ; ప్రా. సాసణ-. శాసనప్రా. సాసన-; అ.మా. సాసణ-;

తు. సాసన-.

< ప్రా. సాసణ-.

**సేసనాలు** వి.బ.వ. శాసనాలు. తాళ్ల.సం. 14.78.

**సేసనాలు** చూ. సేసనము.

**సేసరేసి** రూ.చూ. చేతరాసి. వి. ఒకరకం అకుకూర (Pharnaceum mollugo diffusa).

**సేసాడు** చూ. సేస.

**సై** రూ. సయి. అవ్య. సహశబ్దార్థకం. సైదోడు మొ. వాటిలోని మొదటిరూపంసయి, కూడ. నీలా. 1.109.

సం. స్వ, సహ, కూడినది ; ప్రా. సఇస, సహ.

< ప్రా. సఇస.

**సైకొట్టు** రూ. సైగొట్టు. స.క్రి. అంగీకరించు, ఊకొట్టు. **సైగొట్టు (-కొట్టు[1])** రూ.చూ. సైకొట్టు. స.క్రి. అన్నది కాదనకుండా అంగీకరించు. **సైదోడు (-తోడు)** రూ. సయిదోడు. వి. 1. తోబుట్టువు. భీమ. 1.31 ; 2 సహోదరుడు. చిత్రభా. 55. **సైయను (-అను)** అ.క్రి. ఏదో ఒకదానికి సరే అను ; స.క్రి. అంగీకరించు.

**సైకము** రూ.చూ. సయికము. విణ. స్వల్పం, సూక్ష్మం, చిన్నది. కాంత ఉ.హరి. 1.53 ; వి. సూక్ష్మత్వం. ద్వి. పరమ. వి. 3.228.

**సైకా** వి. వస్త్రవిశేషం. నిరంకు. 216.

**సైకిలు** రూ.చూ. సయికిలు. వి. రెండుచక్రాల బండి (సైకిల్).

**సైకిలురాటం** రూ. సెయికిలురాటం. వి. డబ్బాలకు నూలు తోడే రాట్నం.

**సైకిల్లు** వి బ.వ. ఒకటి అడ్డంగా ఒకటి నిలువుగా మోసుకుపోవటానికి వీలుగా పేర్చినది.

ఇం *Cycle*. ఆవృత్తి, పర్యాయం. కాలచక్రం.

< ఇం. Cycle + -లు

**సైక్లోను** వి. తుపాను, గాలివాన.

ఇం. *Cyclone*. గాలివాన, తుపాను.

< ఇం. Cyclone.

**సైగ** రూ. సయిగ. వి. 1. జాడ, నన్న. ఇందు. 5.116 ; 2. సంజ్ఞ, హస్తాదుల సంజ్ఞ వేం.మా. 4.260.

సం. సంజ్ఞా. చేతనబుద్ధి, తెలివి, హస్తచాలనారులచే అర్థాన్ని సూచించటం ;

క. సయ్‌గ. సంజ్ఞా.

< సం. సంజ్ఞా.

**సైగగా** రూ. సైగ్గా, సైయిగా. క్రి. విణ. ద్రు. నిశ్శబ్దంగా, తెలియకుండా. < సైగ + అగు + -అ[7]. **సైగ్గా** రూ.చూ సైగగా. క్రి.విణ. నిశ్శబ్దంగా, తెలియకుండా.

**సైగ్గా** చూ. సైగ.

**సైజు** వి. ప్రమాణం, పరిమితి.

ఇం. *Size*. కొలత, పరిమాణం.

< ఇం. Size.

**సైజురాయి** వి. కంది పొడరాయి, కట్టుబడికిగాని నేలపై పరవటానికి గాని, స్తంభాలు నిఃపటానికిగాని వాడే చెక్కిన లేక మలచినరాయి. **సైజురాయి కట్టుబడి** వి. కట్టురాయి కట్టుబడి, రాతిని చెక్కి కట్టే పద్ధతి. **సైజేయు** స.క్రి. సిద్ధపరచు. < సైజు + వేయు.

**సైజేయు** చూ. సైజు.

**సైఁచు** రూ. సయిచు. స.క్రి. ఓర్చుకొను, సహించు. భార. ఆది. 5.56 ; అ.క్రి. 1. సహించు, ఓర్చు. భార. అరణ్య. 2.330 ; 2. ఇష్టమగు. భాస్క.రా. అరణ్య. 4.345 ; 3. రుచించు. మను. 3.16.

క. సయిసు. సహిసు, సైసు. సహించు. ఓర్చు ; త. చకి. భరించు, సహించు, క్షమించు ; పర్జి. సహతి ; కురు. సహ్. బాధపడు ;

పో.చూ. సం. సహత్ -. సహించు, ఓర్చు ; ప్రా. సహై; హిం. సహ్‌నా ; గు, సహ్వుఁ ; మరా. సాహ్ణేఁ.

**సైటు[1]** వి. 1. దృష్టి ; 2. దృష్టిదోషం.

ఇం. *Sight*. దృష్టి. చూపు, చూచేశక్తి, దర్శనం.

< ఇం. Sight.

**సైటు[2]** వి. స్థలం, చోటు.

ఇం. *Site*. ఏదోపని కోపం ఎంచుకున్న చోటు, స్థలం. ఇల్లు మొ. ఉండే చోటు.

< ఇం. Site.

సైడు చూ. సైడ్డు. వి. 1. పక్క ; 2. పక్షం.
ఇం. *Side*. పక్క, ఓర, అంచు. పక్షం.
< ఇం. Side.
సైడుకట్టు వి. తట్టు, కిటికీలోని పైరెక్కా కిందిరెక్కా కలిసేచోట పట్టెల్లో తీసినగాడి. సైడుకాలువ వి. మురిక్కాలవ, మురుగునీళ్ళుపోయేదారి. సైడుకొయ్య వి. పళ్ళచక్రం గూటంపై పట్టెకు ఆధారంగా పక్కగా బిగించిన కొయ్య. సైడుతాడు వి. మగ్గం ఉడతకు పైన కట్టినదారం. సైడుపింజెర వి. ఒకరకం డాబీ. నడబద్దల గొలుసుదిండుకు తగిలించింది.
సైడ్డు రూ.చూ. సైడు. వి. 1. పక్క ; 2. పుట.
సైతము రూ.చూ. సయితము అవ్య. కూడా. కాశీ. 6.225.
సైతాను రూ.చూ. సేతాను వి. 1. పిశాచాల అధిపతి ; 2. వెంటనంటి వదిలేవాడు.
సైతి రూ.చూ. సవతి. వి. ఏరాలు, సపత్ని.
సైదము రూ.చూ. సైంధము. వి. 1. గోధుమపిండి ; 2. జొన్న పిండికాని గోధుమపిండిగాని నానబెట్టి ఉప్పు కలిపి పెట్టే దాణా.
సైదాపురం వి. మొద్దుమనిషి, మందబుద్ధి, 'సైదాపురం' ఊరు పేరుకావచ్చు.
సైదు రూ. సయ్యదు. వి. మహమ్మదీయులల్లో ఒకతెగ. చంద్రాంగ. 4. 208.
హిం. ఉ. సైదీ, సైయిద్. మహమ్మదీయులలో సయ్యదుజాతి వ్యక్తి ; మరా. సయ్యద్ ; పార. సైయద్. ప్రభువు, మహమ్మదీయుల్లో ఒకతెగ ; అర. సైయిద్. ప్రభువు, యువరాజు.
క. సయ్యద.
< ఉ. సైయిద్.
సైను[1] రూ. సయిను[1]. వి. ఒకరకంబట్ట.
సైను[2] రూ.చూ. సన. వి. సంవత్సరం. ద.హిం.సా. సంపు. 10.శా. సం. 799.44. క్రీ.శ. 1663.
సైను[3] రూ. సయిను[3]. వి. గుర్తు.
ఇం. *Sign*. గుర్తు.
< ఇం. Sign.
సైను[4] రూ. సయిను[3]. వి. చేవ్రాలు.
ఇం. *Signature*. సంతకం, చేవ్రాలు.
< ఇం. Signature.
సైన్సు వి. విజ్ఞానశాస్త్రం.
ఇం. *Science*. విజ్ఞానశాస్త్రం.
< ఇం. Science.
సైంధము రూ. సయిదము, సైదము. వి. 1. మధురం. భాగ. 10పూ. 808 : 2. గోధుమపిండి.
సం. సహిత.-కూడినది, స్వాదుతా. తియ్యదనం.
సైపు రూ. సైబు. వి. ఖడ్గం, కత్తి. అని. 3.19.
హిం.ఉ. సైఫ్-. కత్తి.
< ఉ. సైఫ్-.
సైబు రూ.చూ. సైపు. వి. ఖడ్గం. పుల్లు. 2.48.
సైంపు చూ. సైంచు. రూ. సయింపు, సయింపు. అ.క్రి, సహించు, ఓర్చు. భార. సభా. 2.59 ; వి. సహనం, ఓర్పు, తాల్మి. భార. ఉద్యో. 3.75.
సైంపుడు రూ. సయింపుడు. వి. సహనం.
సైయిగా రూ.చూ. సైగగా. క్రి. విణ నిశ్శబ్దంగా, తెలియకుండ, సైగగా.
సైరణ రూ. సయిరణ. వి. సహనం, శాంతం, ఓర్మి. కు. సం 5.45, భార. విరా. 4,230.
సం. సహిత-. కూడి ఉన్నది, సహించటం, సహిత్ర-. సహనం ; ప్రా. సహిర-. సహిష్ణువు ;
క. సయ్‌రణె, సైరణె. ఓర్పు, సహనం, సయిరిసు, సైరిసు. సైరించు ; తు. తైరణె, సైరణె. క్షాంతి. సహనం.
< ప్రా. సహిర-.
సైరణచేయు రూ. సైరణసేయు. అ.క్రి. సహించు, సహనంచూపు. నిర్వ.రా. 3.78. సైరణసేయు(-చేయు) రూ.చూ. సైరణచేయు. అ.క్రి. సహించు. భార. ఉద్యో. 1.325.
సైరించు చూ. సైరణ. రూ. సయిరించు. స.క్రి. 1. సహించు, ఊరకుండు. కు. సం. 10.125 ; 2. క్షమించు. శృం.నై. 7.88 ; అ.క్రి. సహించు, ఓర్చు, సైరణచేయు. హర, 7.134.
సం. సహిత్ర-. సహనం ; ప్రా. సహిర- ;
క. సయ్‌రిసు, సైరిసు. సైరించు, సహించు.
< ప్రా. సహిర- + -ఇంచు[3].
సైరను రూ. సైరేను. వి. 1. నిర్దిష్టవేళకు కాలాన్ని సూచించటానికి కూసే యంత్రం ; 2. హెచ్చరికకై కూసే యంత్రం.
ఇం. *Siren*. హెచ్చరికకై పెద్దధ్వని చేసే యంత్రం.
< ఇం. Siren.
సైరేను రూ.చూ. సైరను. వి. 1. నిర్దిష్టవేళకు కాలాన్ని సూచించటానికి కూసేయంత్రం ; 2. హెచ్చరికకై కూసే యంత్రం.
సైలరు రూ. సెయిలరు. వి. ఓడమీదపనిచేసేవాడు.
ఇం. *Sailor*. నావికుడు.
< ఇం. Sailor.
సైలన్‌గుడ్డ వి. మహమ్మదీయులు కట్టుకోవటానికి నేసిన గళ్ళ లుంగీగుడ్డ.
సైసిక వి. వాద్యభేదం. ప్రబంధ. 1.100.
సైసు వి. మాలిష్ చేసేవాడు.
సైహూచు స.క్రి. రుచిచూచు. చవిచూచు.
< చవి[1] + చూచు.
సొకదీపము వి. దేవాలయంలో దీపం. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 210. క్రీ.శ. 1260.
సం. సుఖ. సౌఖ్యం. దీప. దివ్వె, సుఖదీప. సుఖాన్ని కలిగించే దీపం.
< సం. సుఖదీప-.
సొకనాసి వి. దేవాలయ ముఖద్వారమార్గం, గుడిముందరిరి ప్రదేశం. పండి.చ. 2.378.
సం. శోకనాశిని. దుఃఖాన్ని పోగొట్టేది.

<సం. శోకనాశినీ.

**సొకంపలక** రూ.చూ. సగంపలక. వి. దోనెకూ చేతిపలకకూ మధ్య సగంవరకూ నేసిన నేత.

**సొక్కటాలు** రూ.చూ. సొగటాలు వి.బ.వ. పాచికలు. శాల్ల. సం. 4. 163.

**సొక్కించు** చూ. సొక్కు.

**సొక్కు** చూ. చొక్కు[1]. వి. 1. కొంచెం శరీరసుఖం. పండి. చ, 2.122 ; 2. పారవశ్యం. దశా. 9.155 ; 3. సుఖం ; అ.క్రి. పరవశమగు. శివరా. 1.93.

క. సొరుక్క, సొక్కు. పిచ్చెత్తు, మత్తెక్కు, మూర్ఖుడగు కంగారుపడు ; కొడ. చొక్క. మత్తు, మైకం, లావు ; తు. సొర్కు. బలం, అభిమానం, గర్వం, స్వాతిశయం ; త. చెరుక్కు (చెరుక్క). గర్వపడు, స్వాతిశయం కలిగి ఉంట. గర్వించు, మైకంతోఉండు, చెరుక్కమ్. మత్తు, మైకం ; మ. చొరుకుక, చురుకుక, మూర్ఖంగాఉండు. చొరుక్కు. కొద్దిమైకం. (కడుపులో ) తిప్పినట్లుండు ; కో. చొక్. కునుకుతీయు, కంగుమార్చు ; కువి. హూచలి. తాగ దగిన ; కుఇ. సొస. మత్తు, మైకం ; పర్జి. చొక్. తాగ దగిన ; గ. జోంగేర్. తాగదగిన ;

పో.చూ. సం. సుఖ-. సుఖం.

**సొక్కించు** అ.క్రి. 1. మత్తు కలిగేటట్లుచేయు ; 2. మైమరపించు. <సొక్కు+-ఇంచు[3].

**సొగటము** వి. ఒకరకం జూదమాట ఆడటానికి ఉపయోగించే సారెలు (పాచికలు).

**సొగటాలు** రూ. సొక్కటాలు, సొగడాలు. వి.బ.వ. 1. పాచికలు, జూదమాడే సారెలు. భోజ. 5.76 ; 2. పగడ సాలాట. నిరంకు. 3.8 ; 3. పాచికలు. సారెలుగల సొగటాల పలక. బహుళా. 5.179 ; 4. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

ఒ. సొగటా. పాచికలు ; మరా. సొగడీ, సొగడా. శకటసంబధమైన.

<మరా. సొగడా.

**సొగటు** వి. మ్లానం, వాడటం. అని. 3.121.

సం. శుష్. వాడిపోవు, శుష్క-. ఎండినది.

**సొగటులుపోవు** అ.క్రి. సోలిపోవు. విజయ, 3.4.

**సొగడాలు** రూ.చూ. సొగటాలు. వి.బ.వ. పాచికలు. అష్టమ. క. 2.2433.

**సొగపు** చూ. సొగయు.

**సొగయిక** చూ. సొగయు.

**సొగయించు** చూ. సొగయు.

**సొగయు** రూ. సొగియు. అ.క్రి. 1. పరవశమగు, చొక్కు. కు.సం. 5.37 ; 2. నొచ్చు. భార. ఉద్యో. 3.301 ; 3. మూర్ఛిల్లు. భార. ద్రోణ. 1 136 ; 4. విహరించు. కాశీ. 1.93 ; 5. సుఖించు. వాల్మీ. 3.92 ; 6. ఇష్టపడు.

క. సొగయిసు, సొగసు. ప్రకాశించు, అందంగా కన్పించు, అందంగా ఉండు, సంతోషించు ; పో. చూ త. తొయ్-. క్షీణించు, కృశించు, వాలిపోవు, తొయ్యల్. మూర్ఛపోవటం, చోర్. మూర్ఛపోవు, వాలిపోవు.

<*చొయ్-.అ/- *చొవ్-అ-.

**సొగపు** వి. చొక్కు, పారవశ్యం. హరి.పూ. 8.26. **సొగయిక** వి. చొక్కు, పారవశ్యం, సొగపు. **సొగయించు** రూ. సొగియించు. స.క్రి. సుఖింపచేయు. భార. ఆరణ్య. 1.58 ; అ.క్రి. సుఖించు. నిర్వ.రా. 6.62. <సొగయు +-ఇంచు[3].

**సొగసరి** చూ. సొగసు.

**సొగసు** రూ. సొగుసు. వి. 1. ఒయ్యారం. క్రీడా. పీఠి. 63 ; 2. ఆనందం. ఆము. 5.58 ; 3. విధం, రీతి. వసు. 2.140 ; 4. సౌఖ్యం. శుక. 2.208 : 5. వృష్టివిశేషం. ప్రబంధ. 1.106 ; 6. అంచం. చా.మం. 1.122 ; 7. శ్రావ్యం, త్యాగయ్య కీర్తన ; విణ. ఇంపుపుట్టించు.

క. సొగస, సొగసు. అందం, ఆనందం ; త. చొకుచు. నైర్మల్యం పరిశుభ్రత, అందం, సౌందర్యం ; మ. చొక్షమ్. అందం, చొంకు. సొంపు, సొగసు, సొగయిసు, సొగసు, శించు, మెరయు, అందంగా ఉండు, సొగస. సొగసు. ప్రకాప్రకాశించు, అందం, సంతోషం, ఆనందం, చొక్క. చొక్కటు, చొక్కళ. నైర్మల్యం, అందం, శుభ్రత. చొక్కటు. అందం, శుభ్రత, చొక్కళతన. మంచిదైన. మనోహరమైన ; త. సొగపుని. సొగసుని, రుచికరంగా ఉండు, సమ్మతం, సంతోషం, సొగసు. పొగడ్త, సమ్మతం, మంచిరుచి, ఇష్టం, చొక్క. శుభ్రమైన, యథార్థమైన, చొక్కటు. శుభ్రమైన, సమ్మతమైన ; త. చొకుచు. శుభ్రమైన, మంచిరకం, చొక్కమ్, చొక్కు. శుభ్రమైన, మంచి, అందం. చొక్కణ్. అందమైన మనిషి ; మ. చొక్కమ్. అందం, చొంకు. అందం, సొంపు, సొగసు ;

పో. చూ. సం. శృంగార-. తొమ్మిదిరసాల్లో ఒకటి, వలపు, రతి, సొగసైనవేషం.

**సొగసరి** వి. 1. అందగాడు ; 2. మన్మథుడు. **సొగసుకత్తియ** రూ. సొగసుకత్తె. వి. 1. అందమయినస్త్రీ ; 2. 2. విటకత్తె. **సొగసుకత్తె** రూ.చూ. సొగసుకత్తియ. వి. 1. విటకత్తె ; 2. అందమైనస్త్రీ. **సొగసుకాఁడు** వి. 1. అందగాడు. చెన్నబసవ. 4.269 ; 2. విటకాడు. **సొగసుగాంచు** (-కాంచు) అ.క్రి. 1. ఇంపొందు ; 2. అందగించు. **సొగసులాఁడి** వి. సౌందర్యవతి. ఉ.రా. 6.130. <సొగసు+-లు+ఆఁడి.

**సొగాడులు** వి.బ.వ. కక్కరాలు, ఒకపిండివంట.

**సొగియించు** చూ. సొగియు.

**సొగియు** రూ.చూ. సొగయు. అ.క్రి. సుఖించు, ఆనందపడు. కు.సం. 5.41. కేయూ. 4.9.

**సొగియించు** రూ.చూ. సొగయించు. అ.క్రి. సుఖాన్ని పొందు. హరి.ఉ. 4.992 ; స.క్రి. సుఖింపచేయు, చొక్కించు. భార. ఉద్యో. 2.111. <సొగియు+-ఇంచు[3].

**సొగిలి** వి. తిక్కమనిషి.

**సొగుసు** రూ.చూ. సొగసు వి. 1. అందం ; 2. ఆనందం ; 3. విధం, రీతి ; 4. వయ్యారం ; 5. సౌఖ్యం ; 6. దృష్టివిశేషం.

**సొంకర** వి. మూతిపొడవుగా కడుపు ఉబ్బుగా ఉండే మట్టి

పాత్ర.

సొంకా వి. రోడ్డుపక్కన సిమ్మెంటుతో కట్టే గట్టు.

ఒ. సోంకా.

< ఒ. సోంకా.

సొంకాయ వి. గంజాయి పీల్చటానికి వాడే మట్టి గొట్టం.

సొంగ రూ.చూ. చొంగ. వి. 1. పొగపీల్చే మట్టి గొట్టం; 2. లాలాజలం, చొల్లు; 3. కదం, మోటబానకు అడుగున తొండం కలిపే చోటు.

సొంగబొక్కెన వి. పొడుగ్గా కుంచం మాదిరిగా ఉన్న ఇనపబొక్కెన.

సొచ్చు రూ.చూ. చొచ్చు. అ.క్రి. కడగు, ఉద్యమించు, ప్రారంభించు. ద.హిం.శా.సంపు. 5 శా,సం. 59.

సొచ్చెము[1] వి. పెచ్చు, అధికం. శశా. 2.18.

సం. చోచ-.వల్కలం, చెట్టుపట్ట, తోలు, టెంకాయ, దాల్చినచెక్క.

< సం. చోచ-.

సొచ్చెము[2] వి. నిర్మలం. పురుషోత్తమకవీయము. 137.

సం. స్వచ్ఛ-. తేటఅయినది, నిర్మలమైనది; ప్రా. సచ్ఛ-.

< సం. స్వచ్ఛ-.

సొజ్జ[1] వి. మూస, ఆర్చీలు, శ్లాబులు మొ. వాటి నిర్మాణానికి పనికివచ్చే తాత్కాలికపు కట్టు.

సొజ్జ[2] రూ.చూ. సజ్జ[1]. వి. అహారధాన్యంగానూ, పశుగ్రాసం గానూ, పంటచెరకుగాను, ఇళ్ళు కప్పటానికి ఉపయోగించే తృణవిశేషం (Eleusine indica).

సొజ్జ[3] వి. వరిపిండితోగాని గోధుమరవ్వతోగాని తయారుచేసే భక్ష్య విశేషం. అష్టకు. క. 5. 235పు. 5పం.

సొజ్జప్పము వి. గోధుమనూక పంచదారతో తయారు చేసిన భక్ష్యవిశేషం. < సొజ్జ[3] + అప్పము.

సొజ్జము రూ.చూ. సొజెము. వి. చోద్యం, వింత, సోద్దెం.

సొజ్జి రూ.చూ. సొజె. వి. నూక, రవ్వ.

సొజ్జిబూరె వి. ఒకరకం తినుబండారం.

సొజె రూ. సొజ్జి, సోజి. వి. 1. వేయించిన బియ్యంతో వండినఅన్నం. భీమ. 2.139; 2. వేయించిన బియ్యంతో చేసిన పిండి మొ. ది, వేపి వండిన బియ్యపునూక.

సం. శోధ్యక-. శోధనీయం, శుద్ధియోగం; ప్రా. సొజ్ఝ-; జై. మహా. సొజ్ఝ-; అ. మా. సొజ్ఝ-; క. సజ్జిగె, సొజ్జి-. గోధుమనూక.

< ప్రా. సోజ్ఝ-.

సొజెపిండి వి. వేపినబియ్యంతో చేసినపిండి. భీమ 2.140. సొజెబూరియ రూ.చూ. సొజెబూరె. వి. భక్ష్య విశేషం, బూరె. ప్రభు. 5.82. సొజెబూరె రూ. సొజె బూరియ. వి. భక్ష్యవిశేషం. ప్రభు. 4.150పు. 24పం, కళా. 7.82.

సొజెము రూ. సొజ్జము. వి. వింత, ఆశ్చర్యం. పురుషోత్తమ కవీయం.

సం. చోద్య-. ఆశ్చర్యం, ప్రశ్న; ప్రా. చోజ్జ-. విస్మయం, ఆశ్చర్యం; జై. మహా. చోఇజ్జ-; దే. ప్రా. చుజ్జం; అ.మా. చోజ్జం;

క. చోజిగ, సోజిగ. ఆశ్చర్యం, విస్మయం.

< ప్రా. చోజ్జ-.

సొంచ వి. స్వయంపాకం.

ఒ. సొంచ-. స్వయంపాకం.

< ఒ. సొంచ.

సొటసొట వి. 1. (నెత్తురు మొ.వి) కారటంలో అయ్యేదానికి అనుకరణం; 2. నన్నగిలటం, నకనక.

సం. శుష్క-. ఎండినది.

సొటసొటలాడు న.క్రి. నకనకలాడు. (ధ్వన్యను.). < సొటసొటలు + అడు. సొటసొటలు వి.బ.వ. 1. కార టంలో అయ్యే అనుకరణం. క్రీడా. 1.229; 2. కార్శ్యం. సానంద. 5ఆ; 3. నెత్తురు చిందటంలో అయ్యే అనుకరణం. సింహ. నార. 14. సొటసొటలువోవు(-పోవు) అ.క్రి. కృశించు, చిక్కు. విజయ. 3.62. సొటసొటవడియు అ.క్రి. జొటజొటకారు. క్రీడా. 74. సొటసొటవోవు(-పోవు) అ.క్రి. కృశించు, చిక్కు.

సొట్ట రూ. చొట్ట, సొత్త. విణ. రోగాదులచేత నొక్కుపడేది; గుంటపడేది. పండి. చ. 1.6పు; వి. 1. వంకర. పార్వ. 1.8; 2. చెంబు మొ. వాటికి దెబ్బతగిలినప్పుడు పడే నొక్కు; 3. రోగాదులవలన దేహంలో కలిగే నొక్కు; 4. మారు, గోడలోనిగతుకు, గుంట. వ్య. చూ. చొట్ట.

సొట్టకాల్పు వి. ఆములో కుండలు మొ. వి ఎక్కువగా కాలటం. సొట్టపడు రూ.చూ. సొట్టవడు. అ.క్రి. 1. నొక్కు పడు; 2. కుంటుపడు. సొట్టపోవు రూ. సొట్టిపోవు. అ.క్రి. కుండలు మొ. వి ఎక్కువ కాల్పువల్ల వంగిపోవు. సొట్టలు పోవు అ.క్రి. కుండలు మొ.వి ఎక్కువకాల్పువల్ల వంగిపోవు. సొట్టవడు(-పడు) రూ. సొట్టపడు. అ.క్రి. 1. నొక్కు పడు; 2. కుంటుపడు. సొట్టిపోవు రూ.చూ. సొట్టపోవు. అ.క్రి. కుండలు మొ. వి ఎక్కువ కాల్పువల్ల వంగిపోవు.

సొట్టనలు చూ. సొట్ట. వి.బ.వ. పరిహాసాలు, వంకరమాటలు. పార్వ. 1.72.

సొట్టిపోవు చూ. సొట్ట.

సొట్టు రూ.చూ. సొడ్డు. వి. 1. నెపం, సాకు, సొడ్డు 2. లొట్ట.

సొట్టులెంచు రూ. సొడ్డులెంచు. అ.క్రి. సొడ్డులుపెట్టు. తాళ్ల. సం. 5.322. < సొట్టు + -లు + ఎంచు.

సొడలుసొడలువోవు చూ. సొడసొడ.

సొడసొడ వి. 1. కమ్మటంలో అయ్యే అనుకరణం. హరి. ఉ. 4.28; 2. జొటజొట, నెత్తురు మొ. వి కారటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

సొడలుసొడలువోవు(-పోవు) అ.క్రి. ఆకలితో సొక్కి సోలి పడు. సొడసొడల్వోవు(-పోవు) న.క్రి. మూర్ఛిల్లు, ఎదు ర్కొను. పండి. చ. 4.2.78.

సొడ్డు రూ. సొట్టు. వి. 1. ఆటలో ఒకనిమీద వేసినదెబ్బ. వేమ. 2.59; 2. కొరత, న్యూనత. సారంగ. 2.108; 3. సాకు, నెపం; 4. ముందు భోజనంచేసినవారు అనే మాట.

నం. శాఠ్య-. కపటం. మోసం. ఛలోక్తి. శఠ-. లోప పూరితమైన, మోసమయిన; పా. సఠ-. మోసం;

త. చొట్టు-. కొరత. ఎత్తిపొడుపు. చొంటు-. అప నింద, తప్పు.

<పా. సఠ-.

సొడ్డుకొట్టు అ.క్రి. లేవిడీకొట్టు. సొడ్డుపెట్టు రూ.చూ. సొడ్డుపెట్టు. అ.క్రి. తప్పుపట్టు. సొడ్డులెంచు రూ చూ. సొట్టు లెంచు. అ.క్రి. సాకుపెట్టు. సొడ్డువెట్టు(-పెట్టు) రూ. సొడ్డు పెట్టు. అ.క్రి. తప్పుపెట్టు. పండి. చ. 4.214.

సొడ్లమర వి. మత్స్యవిశేషం. (ఒకరకం చేప).

సొంట వి. పొగపీల్చే మట్టిగొట్టం.

సొంటలు రూ.చూ. నంటలు. వి. బ. వ. ఆము పడుగులో కుండలపేర్పు మధ్య కట్టె కంప తేవటానికి వదిలిన సందులు.

సొంటి రూ.చూ. శొంఠి. వి. ఎండిన అల్లం. ఆం. భా. 2.249.

సొంటికొమ్ము రూ. శొంఠికొమ్ము. వి. ఎండిన సొంటి నిడుపాటిగడ్డ. శుక. 3.20.

సొంటిదూలం వి. మూలవాసాలను కాసే దూలం.

సొంటిపిక్క వి. పిక్క, తొడ మొ. చోట్ల నొక్కి కదుం కట్టేట్టు చేయటం.

సొంటిపోవు రూ. సొండిపోవు. అ.క్రి. తండలు మొ. వి ఎక్కువ కాల్పువల్ల వంగిపోవు.

సొంటు[1] వి. తప్పు, దోషం, పాండు. 3.30.

నం. శుంఠ-. మూర్ఖుడు, ఉబ్బిన గ్రంథి.

సొంటులుసోదించు స.క్రి. బాగా పరీక్షించు. తాళ్ల. నం. 10.273.

సొంటు[2] వి. తృణవిశేషం.

సొంటె[1] వి. గరికలో ఒకరకం, సాధారణంగా మెట్టనేలల్లో మొలుస్తుంది, అల్లంగడ్డి (Panicum repens).

సొంటెకుందురు వి. తృణవిశేషం. హంస. 5.45.

సొంటె[2] రూ.చూ. సుండు. వి. 1. తొంటి, తొండం; 2. వామి కట్టుబడిలో మధ్యభాగం. అడుగుకు కప్పుకు మధ్యనున్నది.

సొంతా వి. లాఠీకర్ర.

నం. శుండా-. ఏనుగుతొండం, ముఖం.

సొంఠి వి. ఆకుపచ్చని పూలు పూసే ఒకరకం మొక్క (పూత సామాన్యంగా ఉండదు). (Zingiber officinale).

నం. శొంఠీ-. అల్లం.

సొండిగలు వి.బ.వ. వడియాలు.

సొండిపోవు రూ.చూ. సొంటిపోవు. అ.క్రి. తండలు మొ. వి. ఎక్కువ కాల్పువల్ల వంగిపోవు.

సొండు రూ చూ. సుండు. వి. 1. వ్యవసాయపనులకోసం నీరు పారించటానికి ఉపయోగించే తోలుచేదకుండే గొట్టం; 2. తొండం.

సొండుతాడు వి. తొండంతాడు.

సొండెం వి. తొండం.

నం. శుండా, శొండా. ఏనుగు తొండం, ముఖం; ప్రా. సుండా. ఏనుగు తొండం.

<ప్రా. సుండా.

సొండెంతాడు వి. తొండంతాడు.

సొండెలు వి.బ.వ. తిరగమోత (పోపు) వేసిన శనగగుగ్గిళ్ళు, శుండలు.

సొండేలుగొడ్డు వి. అప్రయోజకుడు.

సొతంతరము వి. 1. స్వాతంత్ర్యం; 2. లక్ష్యం లేకపోవటం. నిర్లక్ష్యం.

నం. స్వతంత్ర-. ఆత్మీయమైనది, స్వేచ్ఛకలది, యుక్త వయస్సు కలది.

<నం. స్వతంత్ర-.

సొతిక వి. పడిలో నాల్గోభాగం.

సొత్త రూ.చూ. సొట్ట. వి. 1. గింజలు లేనికాయలు; 2. పల్లం, సొట్ట.

సొత్తికూర వి. ముల్లంగి ఆకు, దీనికూర దినుసుగా ఉపయోగిస్తారు.

సొత్తిదుంప రూ.చూ. సొత్తుదుంప. వి. ముల్లంగి దుంప.

సొత్తు వి. సొమ్ము. వేమ. 3.188; 2. హక్కు.

నం. స్వత్వ-. సొమ్ము, స్వామ్యం. స్వేచ్ఛాజీవితం; క. సొత్తు. ఆస్తి, వస్తువులు.

<నం. స్వత్వ-.

సొత్తుదుంప రూ. సొత్తిదుంప. వి. ముల్లంగిదుంప.

సొద రూ. సోద[1]. వి. 1. చితి, భార. ఉద్యో. 4.308; 2. గొడవ; 3. వృత్తాంతం; 4. ఒకరికష్టాల్ని ఇంకొకరితో వినుగు పుట్టేట్టు చెప్పు కోవటం.

నం. చితా. చితి, చితి-. కట్టెలపేర్పు; ప్రా. చిఆ, చియయా; చీయా; పా. చితకా, చితి. గుట్ట.

<నం. చితా.

సొదగొను (-కొను) అ.క్రి. సొదజొచ్చు. పండి. చ. 4.256. సొదజొచ్చు (-చొచ్చు) అ.క్రి. అగ్నిప్రవేశం చేయు. సొదపనులు వి.బ.వ. చిల్లరపనులు. వర. రా.బాల. 55.52. సొదపెట్టు అ.క్రి. సోదచెప్పు. సొదంబోవు(-పోవు) అ.క్రి. ప్రాణాలు సొమ్మసిల్లిపోవు. సొదవేయు అ.క్రి. చుట్టుకొని మండు.

సొద్దెము రూ.చూ. సోద్దెము. విశ. ఆశ్చర్యకరమైంది. ప్రబంధ. 1.514.

సొన రూ. సోన[2]. వి. 1. ఆకులు మొ. వాటినుంచి వచ్చే ద్రవం, మను. 6.27; 2. నూగు. పాండు. 5.295; 3. గుడ్డులోని ద్రవం; 4. ఊట, కాలవ; 5. చేపలగుడ్లు ఒకటిగాకలసిఉండే కోపు; 6. కంటిగుడ్డులోని పదార్థం; 7. సముద్రతీరాన (సాగర్తన) ఇసక తిన్నెల నుండి పుట్టి, బుగ్గలా నిరంతరంగా జాలువారే నీటి జల; 8. మామిడి మొ. కాయల తొడిమి తుంచగానే కారే వననీరు; 9. పుండు నుండి కారేరసి; 10. కోడిగుడ్డు నుండి కారే నీరు లాంటి ద్రవం; 11. పనస మొ. వాటి తొన; 12. నవ, జివ. అ.క్రి. సొనస్రవించు.

క. సొనె. జీడిమామిడి మొ. కాయలు కోయగానే కారే ద్రవం; మ. చున. మామిడికాయ మొ.వి. కోయగానే కారేద్రవం.

సొనచిక్కుడు వి. ఉలవకాయలాంటి కాయలున్న చెట్టు. సొనపెట్టు అ.క్రి. అదేపనిగా గొణుగు.

**సౌనాముఖి** వి. ఒకరకం అంగడిదినుసు.

సం. స్వర్ణముఖీ. బంగారుముఖం కలది.

<సం. స్వర్ణముఖీ.

**సౌనాయి** రూ. సన్నాయి. వి. సన్నాయి. పద్మ. యు. 272.

**సౌనాయించు** స.క్రి. అమర్చు.

**సౌనారి** రూ.చూ. సౌన్నారి. వి. కంసాలి. నార. పంచ. 1.515, రామలిం. శ. 86.

**సౌనుగొయ్య(-కొయ్య)** వి. పలగడ కొమ్ము, వసిగొయ్య.

**సొంతకమతం** చూ. సొంతము.

**సొంతకాస్త** చూ. సొంతము.

**సొంతపని** చూ. సొంతము.

**సొంతము** రూ. సంతము[2]. విణ. స్వకీయం. సమాసంలో పూర్వ పదంగా వున్నప్పుడు అంతిమాక్షరం లోపిస్తుంది.

సం. స్వతంత్ర-. స్వేచ్ఛ, కోరిక, స్వతా, స్వత్వ-. ధనం, స్వామ్యం, స్వేచ్ఛాజీవితం; ప్రా. సుఅంత-.

క. సొంత; తు. సొంత; త. చొంతమ్ ; మ.సొంతం.

<ప్రా. సుఅంత-.

**సొంతకమతం** వి. సొంతసేద్యం, తనభూమిని తానే సాగు చేసుకోవటం. **సొంతకాస్త** వి. సొంతసేద్యం, తన భూమిని తానే సాగుచేసుకోవటం. **సొంతపని** వి. వ్యక్తిగతమైన పని. **సొంతవ్యవసాయము** వి. స్వయంగా చేసుకునే పొలంపని. **సొంతశేరీ** వి. శేరీసేద్యం, జమీందారు కింద ఉన్న పెద్ద ఉద్యోగస్థుడు సొంతంగా చేసుకునే వ్యవసాయం. **సొంతసాగు** వి. సొంతసేద్యం, తనభూమిని తానే సాగు చేసుకోవటం. **సొంతసేద్యం** వి. జాతీజిరాయి, సొంతకమతం, సొంతకాస్త తనభూమిని తానే సాగు చేసుకోవటం.

**సొంతవ్యవసాయము** చూ. సొంతము.

**సొంతశేరీ** చూ. సొంతము.

**సొంతసాగు** చూ. సొంతము.

**సొంతసేద్యం** చూ. సొంతము.

**సౌన్న** రూ.చూ. సౌన్నము. వి. 1. బంగారం ; 2. బంగారం మాడ. పద్మ. ఉ. 109.

**సౌన్నటంకము** రూ. సౌన్నాటంకము. వి. బంగారు టంకం. ద.హిం. శా. సంపు. 6. శా. సం. 806. క్రీ.శ. 1391.

**సౌన్నము** రూ. సౌన్న, సౌన్నా. వి. 1. మాడ, అరవరహా. జైమినిభా. 8.54 ; 2. బంగారం. విజయ. 2.84.

సం. సువర్ణ-, సౌవర్ణ-, స్వర్ణ-. బంగారం; ప్రా. సొణ్ణ-, సువణ్ణ-, సువన్న-, సొఅణ్ణ-: శౌ. ప్రా. సువణ్ణ-, సోవణ్ణ-, అ.మా. సువణ్ణ-, సువన్న- సొణ్ణ- ; ప్రా. సువఁణ్ణ, సొణ్ణ- ; మా. శువణ్ణక- :

క. సొన్న, సొన్నె ; తు. సొణ్ణం ; త. చువర్ణమ్, చున్నమ్ ; మ. చొర్ణం. సొర్ణం ; ఒరయాన్. సొనొ సొనొ ; కుఇ. సున. బంగారం, బంగారునాణెం ; పర్జి, చోన్. బంగారు ; కొలా. మరియాగోం. సున్, సొన్, ఒరయాన్ సౌనా, సౌనో.

<ప్రా. సౌణ్ణ-.

**సౌన్నా** రూ.చూ. సౌన్నము. వి. బంగారం. క్రీడా. 97.

**సౌన్నాటంకము** రూ.చూ. సౌన్నటంకము. వి. మాడ అనే నాణెం. **సౌన్నా పెట్టెరుమాలు** వి. ఒకరకం రుమాలు.

**సౌన్నాయి** రూ.చూ. సనాయి. వి. సన్నాయి.

**సౌన్నారి** రూ. సౌనారి. వి. బంగారంపనిచేసేవాడు, సువర్ణకారుడు. కేయా. 2.61.

సం. స్వర్ణకార-. కంసాలి ; ప్రా. సొన్నార-, సుణ్ణయార-, సుణార-, సొన్నయార-, సోణార-; పా. సువణ్ణకార- ; అ.మా, సువణ్ణగార-, సొణ్ణార- ; అప. సొణ్ణార- ; ఒ. సునారి ; బెం. సునారి ;

క. సొన్నగార, సొన్నార ; తు. సొణగారె, సొణ్ణారె, సొణ్ణగారె, సొన్నగారె ; కుఇ. సునరెంజు. స్వర్ణకారుడు ; పర్జి. చోనర్ ; మరియాగోం. సొనార్.

<ప్రా, సౌన్నార-.

**సౌప్వ** వి. బికట్‌తాడు, కాడిని పోలుగర్రకు కలిపికట్టేతాడు.

**సౌప్వతాడు** రూ.చూ. సౌప్పర్తాడు. వి. 1. ఏతంబావి లోతునుబట్టి గైకట్టె పొడుగు మార్చటానికి వీలుగా వార్నకు కట్టినతాడు ; 2. గొబ్బరితాడు. **సౌప్వర్తాడు** రూ. సౌప్పతాడు. వి. 1. కొబ్బరితాడు ; 2. ఏతంబావిలోతును బట్టి గైకట్టె పొడుగు మార్చటానికి వీలుగా వార్నెకు కట్టినతాడు. **సౌప్వపెట్టు** స.క్రి. వరసగా పేర్చు.

**సౌప్పోవు** రూ.చూ. సప్పవాపు. వి. జెబ్బవాపు.

**సొబగారు** చూ. సొబగు.

**సొబగు** వి. 1. చక్కదనం. భార. విరా. 2.80 ; 2. స్వారస్యం. కాశీ. 7.185 ; 3. విధం. శోభ. భాగ. 10. పూ ; 765 ; 4. ఒప్పిదం. దశా. 1.43 ; విణ. సుందరం. హర. 3.62,

సం. సౌభాగ్య-. ధన్యత్వం, అదృష్టం, వైభవం ; ప్రా. సోభగ-, సొబ్బగ-, సుభగ-, సోహగ్గ-. సుభగత-. లోకప్రియత్వం ; పా. సోభగ్గ-. అందం, వైభవం ;

క. సొబగు. సౌందర్యం, యోగ్యం, సౌభాగ్యం ; తు. సొబగు. ప్రియమైంది.

<ప్రా. సోభగ-.

**సొబగారు** స.క్రి. సొంపొందు, సొగసును వహించు. కావ్యా. చూ. 1.82. <సొబగు+ఆరు[1]. **సొబగుగాఁడు (-కాఁడు)** విణ. చక్కనివాడు. కు.సం, 7.15. **సొబగుమించు** అ.క్రి. శోభిల్లు. ఇందు. 1.45. **సొబగుమీఱు** అ.క్రి. ఒప్పు. విక్ర. 1.8. **సొబగులాఁడి** వి. అందకత్తె, స్త్రీ. చంపూరా. 3.115. **సొబగొందు** అ.క్రి. అందాన్ని పొందు.

**సొబగుఁడు** వి. 1. చక్కనివాడు, అందగాడు. కు.సం. 7.15 ; 2. విటుడు, పల్లవుడు. భార. విరా. 2.281 ; విణ. చక్కనివాడు, రూపరి, అందగాడు. భార. ఆరణ్య. 6.160.

సం. సుభగ-. అదృష్టంకలది, అందమైనది, ప్రియమైనది, ఇష్టమైనది, ప్రసిద్ధిమయినది, అభివృద్ధికలది ; ప్రా. పా. సుభగ-. అదృష్టవంతమయిన ; ప్రా. సుహయ-.

<సం. సుభగ-.

**సొబగొందు** చూ. సొబగు.

**సొబసు** వి. ఆడగుర్రంకడుపు, బడబచూలు. ఆం.భా. 2.197.

సం. శోభన-. ప్రకాశించేది, శుభప్రదమైనది, సుందరమైనది, బాగా అలంకరించబడినది ; ప్రా. సోభణ-, సోహణ-. అందమైనది ; పా. సోభన-. సోభణ-, ప్రకాశించేది.

<ప్రా. సోభణ-.

**సొబిక** వి. కల్లుతాగటానికి ఉపయోగించే గ్లానులాంటి మట్టి పాత్ర.

సం. శోభికా. ప్రకాశించేది, మెరిసేది.

<సం. శోభికా.

**సొమక** వి. శ్రమ.

సం. శ్రమ-. శ్రమక-. కష్టం, అలసట, బాధ, వ్యాయామం, పాపపరిహారార్థం చేసే కాయక కష్టం ; ప్రా. సమ-. గ్లాని.

<సం. శ్రముక-.

**సొమరు** అ.క్రి. వికాసంతప్పు, వెలవెలబారు. కు.సం. 6.3.

**సొంపగు** చూ. సొంపు.

**సొంపరి** చూ. సొంపు.

**సొంపారు** చూ. సొంపు.

**సొంపిరి** చూ. సొంపు.

**సొంపిలు** చూ. సొంపు.

**సొంపిల్లు** చూ. సొంపు.

**సొంపు** వి. **1**. సౌందర్యం, మనోజ్ఞం. భార. ఆరణ్య. 2.310 ; **2**. సమృద్ధి. నిర్వ.రా. 1.4 ; **3**. విశేషం. భార. ద్రోణ. 1.179 ; **4**. సుఖం. భీమ. 1.95 ; శృం.నై. 2.4 ; **5**. విధం, రీతి. వసు. 1.17 ; **6**. సంతోషం. ప్రభా. 1.102 ; **7**. కాంతి, ప్రకాశం, దశా. 1.14 ; **8**. శీవి. దశా. 7.443 ; 9. దృష్టివిశేషం. ప్రబంధ. 1.106 ; **10**. అతిశయం.

క. సొంపు, సంపు. సౌందర్యం, సొంపు, సొగసు ; త. చొంపు. అందం, సొంపు.

సొంపగు అ.క్రి. **1**. ఒప్పు ; **2**. తగు. <సొంపు+అగు. **సొంపరి** వి.సొగసరి. మల్లభూ. వైరాగ్యశ. 32. <సొంపు+-అరి. **సొంపారు** అ.క్రి. **1**. మనోహరమగు. భార. ఆరణ్య 1.358 ; **2**. ప్రకాశించు. శృం.నై. 1.95. <సొంపు+ఆరు[1]. **సొంపిరి** వి. ఆనందాతిశయం, ఉత్సాహం. పరమ. 5.161. **సొంపిలు** రూ.చూ సొంపిల్లు. అ.క్రి. సొంపగు శోభిల్లు. **సొంపిల్లు** రూ, సొంపిలు. అ.క్రి. సొంపగు, శోభిల్లు. **సొంపుగను(-కను[3])** అ.క్రి. సొంపగు, ఒప్పు. **సొంపెడుగోల(-కోల)** వి. చేతిలో ధరించే ఒకరకమైనకర్ర. ద్వి. పరమ. వి. 3.224. **సొంపుమీఱు** అ.క్రి. అతిశయించు, అందమగు. కళా. 2.10. **సొంపులటెంకి** వి. సౌందర్యరాశి. హంస. 1.81. **సొంపెనయు** అ.క్రి. సొంపగు. జాహ్నవీ. 3.8 ; స.క్రి. సొంపొందు. <సొంపు+ఎనయు. **సొంపొందు** అ.క్రి. ఒప్పిదమగు, ఎసగు. దసా. 2.438. <సొంపు+ఒందు. **సొంపొనరించు** అ.క్రి. సొంపొందు, సొంపగు. ఇందు. 2.31. <సొంపు+ఒనరించు.

**సొంపెనయు** చూ. సొంపు.

**సొంపొందు** చూ. సొంపు.

**సొంపొనరించు** చూ. సొంపు.

**సొమ్మ** రూ.సోమ[1]. వి. **1**. మూర్ఛ. కు.సం. 5.107; **2**. దొమ్మ, ఊపిరితిత్తులిజబ్బు, ప్రమాదకరమైనజబ్బు ; **3**. చుట్టబద్దు, మట్టిపాత్రలకింద గుడ్డచుట్ట.

సం. సౌమ్య-. శాంతస్వభావంకల, శాంతస్వభావంకల వ్యక్తి ; ప్రా. సొమ్మ-. శాంతస్వభావంగలవ్యక్తి. జైమహా. సొమ్మ-, సోమ-; శౌ. సొమ్మ- ; మా. శోమ- ; అ.మా. సోమ- ;

క. జొంపిసు, జోంపిసు. మైకంకమ్ము, మత్తెక్కు ; తు. సోమారి. సోమరి, బద్ధకస్తుడు ; త. చొంపు. సోమరిపోతైన, ఒళ్ళువంగని, బద్ధకస్థుడైన, చోంపల్. బద్ధకం, సోమరితనం, చోపమ్. మూర్ఛపోవు, సొమ్మసిల్లు, అలసిపోవు, చోపలమ్. బద్ధకం, సోమరితనం ; కో. చొమరై, చొమ్బరై. సోమరిపోతు ; కువి. జోమలి, విశ్రమించు.

<ప్రా. సొమ్మ-.

సొమ్మగొను(-కొను) అ.క్రి. మూర్ఛిల్లు. అచ్చ. రా.యు. 191. **సొమ్మటవోవు(-పోవు)** అ.క్రి.చొ, మైమరచుక్కు. **సొమ్మబోవు(-పోవు)** రూ. సొమ్మ వోవు. అ.క్రి. మూర్ఛనొందు, సొమ్మసిల్లు. భాస్క.రా. ఆరణ్య. 2.301. సొమ్మల వి. సొమ్మసిల్లటం. కావ్యా. చూ. 2.32. సొమ్మలబోవు(-పోవు) అ.క్రి. మూర్ఛిల్లు, దశకు. 2.36. సొమ్మలువోవు(-పోవు) అ.క్రి. మూర్ఛిల్లు. కు. సం. 5.113. సొమ్మవోవు(-పోవు) రూ.చూ సొమ్మబోవు. అ.క్రి. మూర్ఛిల్లు. **సొమ్మసిలినవాఁడు** విఙ.. అంగవికలుడు. **సొమ్మసిలు** రూ.చూ. సొమ్మసిల్లు. అ.క్రి. మూర్ఛిల్లు. భార. ద్రోణ. 1.95. సొమ్మసిల్లు రూ. సొమ్మసిలు అ.క్రి. మూర్ఛిల్లు. కు.సం. 5.110.

**సొమ్మలగోలెం** చూ. సొమ్ము.

**సొమ్ము** వి. **1**. ఆభరణం, తొడవు. పండి. చ. 2.19 ; **2**. ద్రవ్యం. ధనం. నిర్వ. రా. 10.139 ; **3**. అధీనం. వస్తువు, హక్కు. భార. ఉద్యో. 4.234 ; **4**. సొంతం. నృసింహ. 1.21 ; **5**. అలంకారం. నృసింహ. 2.124 ; **6**. వస్తువు. ఉ. హరి. 4.100 ; 7. కానుక. కళా. 2.79 ; **8**. గోధనం, ఆభరణం. అచ్చ. రా. బాల ; 9. పశువు.

సం. స్వమ్-. సొమ్ము, అహంకారం, స్వభావం, తాను, తనది, తనజాతికి చెందినది ;

క. సొమ్ము. సొంతం, ఆస్తి, సంపద ; కువి. హెుమ్ము. ధనం.

<సం. స్వమ్.

**సొమ్ములగోలెం** వి. పశువులకు దానా పెట్టటానికి వాడే మట్టితొట్టి. **సొమ్ముగాఁజేసికొను** అ.క్రి. తనదిగా చేసికొను. తాళ్ల. సం. 4.30. **సొమ్ముచేసికొను** అ.క్రి. ధనం గడించు. **సొమ్ముఁజేయు(-చేయు)** అ.క్రి. లాభపడు. కువ. చ. 3.37. **సొమ్ముతిను** స.క్రి. ఇతరుల డబ్బుమీద బ్రతుకు. పరమ. 5.11. **సొమ్ముదాఁచు** వి. వివాదం, వ్యాజ్యం, **సొమ్ములకాపు** వి. పశువులకాపరి. **సొమ్ములగొర్జె** వి. పాలబాట.

ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి మెరుస్తూ ఉండే చుక్కలబారు, పసులదారిలాగా చుక్కల్ని పోల్చుకోవటానికి ఇది ఆనవాలుగా ఉంటుంది. సొమ్ములు వి.బ.వ. ఆవులు, గేదెలు, ఎడ్లు మొ. పశువులు, గోధనం.

సొయము వి. 1. ఆత్మీయం. 2. తనంతటతాను.

సం. స్వయమ్. తనంతటతాను ; ప్రా. అ.మా. సయ-.

<సం. స్వయమ్.

సొయ్యక వి. వాద్యవిశేషం. బలరా. 5.24.

సొర[1] రూ. సొఱ, సోర. వి. 1. సొరకాయ. (Cucurbita lagenania) ; 2. దానం చేసేటప్పుడు నవధాన్యాలు లేదా నూనె పోసి ఇచ్చే పళ్ళెం.

క. సొరె. సొరకాయ ; కొడ. తొరె. సొరకాయ ; తు. తురె, సురె, గుమ్మడికాయ ; త. చురై. సొరకాయ ; మ. చుర. గుమ్మడికాయ.

సొరకాకర వి. ఒకరకం కాకర. సొరకాయ రూ. సురకాయ. వి. ఆనపకాయ. సొరకాయలుకోయు అ.క్రి. 1. అబద్ధాలు కల్పించి గొప్పగాచెప్పు ; 2. డంబాలు చెప్పుకొను.

సొర[2] వి. 1. వ్యాకులత. ఆం. భా. 2.424 ; 2. సొద ; 3. ప్రాణం శోషపోవటం ; 4. గాయం తడిసినప్పుడు చేసేనొప్పి.

సం. స్వర-. ధ్వని, గుఱ్ఱుపెట్టటం. ఉదాత్తాదిస్వరం కంఠమాధుర్యం, షడ్జాదికం, అచ్చు ; ప్రా. సర-. పాట, అచ్చు ; పా. సర-. ధ్వని, పిట్టలకూత.

<సం. స్వర-.

సొర[3] రూ.చూ. సొఱ.[2] వి. పెద్ద సముద్రపు చేప. దీని ముకుగా రెండుపక్కలా పళ్ళు కలిగిన ఒకరంపంలా పొడవ్కు ఉంటుంది. ఇది ఈముక్కుతో మిగతా చేపల్ని నరికివేసే భయంకరమైన జలజంతువు. దీని చమురు మందులకు ఉపయోగిస్తారు. దీనితోకకరకైన కొరడాలా ఉపయోగ పడుతుంది (Shark).

సొరకోవ వి. ఒకరకంచేప. (Carcharious maelofi)

సొరక వి. ముళ్ళకంప.

సొరగు చూ. సురుఁగు. రూ. సొరఁగు, సొరుగు[1]. అ.క్రి, లీనమగు, ప్రవేశించు, నృసింహ. 2.75 ; వి. 1. మూర్ఛ ; 2. ఎండాకు.

సొరంగ రూ.చూ. సొరంగము. వి. సురంగ, సొరియు; రంధ్రం.

సొరంగం రూ.చూ. సొరంగము. వి. 1. రాతిగని లోపలకు ప్రవేశించటానికి ఏలుగా మలచిన గుండ్రటిరాయి ; 2. సన్నగాలోతుగా ఉండేగుంట.

సొరంగము రూ. సురంగము2, సొరంగ, సొరంగం, సొరంగి, వి. గుహలా తొలచిన రంధ్రం. ఆం. భా. 1.145.

సం. సురంగా, సురుంగా. భూగర్భమార్గం, కన్నం రంధ్రం ; ప్రా. సురంగా, సురుంగా. భూమిలో తొలిచిన రంధ్రం ; పా. సురంగ- ; హిం. సురంగ్ ;

త. సరంగు, సొరంగ ; బ్రా. సులుంగ్.

<ప్రా. సురంగా.

సొరంగి రూ.చూ. సొరంగము. వి. గాడి, గానుగరాతి చక్రంతిరిగే సన్నటి గుండ్రటి కాలవ.

సొరఁగు రూ.చూ. సొరగు. వి. 1. మూర్ఛ ; 2. ఎండాకు ; స.క్రి. లీనమగు.

సొరట రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు.

సొరద వి. 1. చిన్నతొడకురుపుగడ్డ ; 2. ఒకటే ధోరణిలో చెప్పిన విషయాన్నే చెప్పటం.

సొరపియ్య వి. సముద్రఫేనం, సముద్రంనురుగు.

సొరపియ్యి రూ.చూ. సొఱ్ఱపియ్య. వి. సొరచేప ఎముక.

సొరపే రూ.చూ. సొఱ్ఱపియ్యి. వి. సొరచేప ఎముక.

సొరపు[1] రూ.చూ. సొరము. వి. కంఠధ్వని.

సొరపు[2] రూ. సొరబు. విశ, కృశం, సన్నం. ఉ. హరి. 5.100.

సొరపేటు వి. ఒకరకండిజైను, అంచుకు పొరవేస్తే రకరకాలుగా వచ్చేడిజైను.

సొరపొయ్యి వి. మధ్యమంట పెట్టినప్పుడు ఇటూ అటూ ఉన్న రెండు పొయ్యిల్లోకి మంట వ్యాపించటానికి వీలుగా మధ్య సొరంగం అమర్చి చేసిన జాయింటుపొయ్యి.

సొరపోతపోయు అ.క్రి. నిండాపోయు.

సొరపోవు అ.క్రి. 1. చుట్ట మొ. వాటికి ఒకవైపు నిప్పు ఎ. బాకిపోవు ; 2. గుంపులో నెట్టుకొనిపోవు ; 3. వానసీళ్ళకు పొలం కాలవలుగా కోసికొనిపోవు ; 4. గొంతుఎండిపోవు.

సొరబడి వి. 1. వంశక్రమం ; 2. స్వభావం.

సొరబు రూ.చూ. సొరవు[2]. విశ. కృశం. ప్రభువు. 3.87, వ. 6పం.

సొరమన్ను వి. సొరంగంలోనుంచి తోడితీసినమట్టి.

సొరము రూ. సొరపు[1], వి. 1. కంఠధ్వని, నాదం. నాగస్వరం. క్రీడా. వ. 70 ; 2. అచ్చు, అమొ. న అక్ష రాలు. పాండు. 4.72 ; 3. షడ్జాది స్వరం.

సం. స్వర -. గీతాదికధ్వని, సంగీతస్వరం ; ప్రా. పా. సర-.;

క. సర, సొర; తు. సొర; మ. సొరం. ప్రా.పా.సర-

<సం. స్వర -.

సొరవటి రూ.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు.

సొరవేయు అ.క్రి. 1. చుట్ట మొ. వాటికి ఒకవైపు నిప్పు ఎగబాకి పోవు ; 2. గుంపులో నెట్టుకొనిపోవు ; 3. వానసీళ్ళకు పొలం కాలవలుగా కోసికొనిపోవు ; 4. గొంతు ఎండిపోవు.

సొరవోయు(-పోవు) అ.క్రి. మెలికలు తిరుగు.

సొరసి వి. వాలుకపూత, దీనివల్ల పశువుమేత తినలేదు.

సొరాట యా.చూ. సరాట. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్యపనిముట్టు.

సొరాటకాలు రూ.చూ. సరాటకాలు. వి. నేలమీద మోపే ఊత్తెకొయ్య. సొరాటపట్టె రూ.చూ. సరాటపట్టె. వి. ఊత్తెపైవైపున బిగించిన అడ్డపట్టె.

**సొరాటుగుంజ** రూ.చూ. సరాటగుంజ. వి. ఆరుబయట చాపిన పడుగు రెండో వైపు కట్టటానికి పాతినకొయ్య.

**సొరి** చూ. సొరంగము. వి. **1**. సొరంగం ; **2**. కన్నం.

**సొరికె** వి. **1**. గుహ ; **2**. కన్నం.

**సొరిది** వి. **1**. వరుస, పంక్తి. హర. 6.78 ; **2**. క్రమం. భాగ. 1.60 ; **3**. శీఘ్రం. పారి. 5.11 ; **4**. యుక్తంగా. వసు. 2.115.

**సొరిద్రోహి** వి. దురాచారుడు. ఉ.హరి. 5.141 ; **2**. క్రూరుడు.

సం. *సురద్రోహిన్*. దేవతలకు అపకారం చేసేవాడు.

**సొరియ** వి. సొరంగం.

సం. *సురుంగా*. సొరంగం, కన్నం ; ప్రా. *సురుంగా*, *సురంగా* ; పా. *సురంగ* -; హిం. *సురంగ్*.

**సొరుగాకు** చూ. సొరుగు[2].

**సొరుగు**[1] రూ.చూ. సురుఁగు. అ.క్రి. మూర్ఛిల్లు. భార. ఆది. 2.46 ; వి. మూర్ఛ. మను. 3.173.

క. *సొరగు*. మూర్ఛపోవు, బలహీనంగా పెరుగు ; కొడ. *చొ.ల్*. అలసిపోవు ; త. *చోర్ (-వ్-,న్-)*. వదులగు, పట్టుతప్పు, జారు, వంగిపోవు ; మ. *చోరుక*. జారిపోవు ; కో. *చొ.వ్*. వదులగు, జారు, సోలు. అలసిపోవు.

సొరుగుడు వి. ఒకరకంతిక్క. సొరుగువోవు(-పోవు) అ.క్రి. మూర్ఛపోవు. వి.శకు. 3.132.

**సొరుగు**[2] రూ. చొరుగు, సొరువు వి. **1**. అర, అలమరలో అడ్డు చెక్కచేత వేరుచేయబడిన భాగం ; **2**. మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య ; **3**. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు గూడు మాదిరిగా బిగించిన చెక్కలు ; **4**. చూరుకిందభాగం ; **5**. టేబుల్‌లో నిడ్రాయరు.

సొరుగాకు వి. ఎండాకు. <సొరుగు[2] + ఆకు. సొరుగు కర్ర వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క. సొరుగుగుమ్మం రూ. సొరుగ్గుమ్మం. వి. మట్టిగాది అడుగునున్న తలుపు. సొరుగు చెక్క వి. **1**. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కగూడు ; **2**. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క. సొరుగుచెయ్యి రూ. సొరుగుసెయ్య. వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించినకర్ర. సొరుగుదాపు వి. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క. సొరుగుపలక వి. **1**. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క ; **2**. కొట్టులోని విడిచెక్క, గాడిపలక. సొరుగుపేటు వి. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క. సొరుగుబల్ల వి. **1**. రాట్నం అడ్డపట్టె, దీన్ని ఒకకాలితో తొక్కిపట్టి రాట్నం తిప్పుతారు ; **2**. మరమగ్గం చట్రంలో పానుపుపట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. సొరుగుసెయ్య(-చెయ్యి) రూ.చూ. సొరుగుచెయ్యి. వి. మరమగ్గం బొమ్మకు, నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. సొరుగ్గడి వి. అర దండ, తలుపురెక్కల్లో ఒకదానికి బిగించిన పంగటిలిన కొయ్య, రెండవదానికి కదలటానికి వీలుగా ఉన్న కొయ్య ముక్కగల గడియ. సొరుగ్గుమ్మం రూ.చూ. సొరుగుగుమ్మం. వి. మట్టిగాది అడుగున ఉన్న తలుపు.

**సొరుగు**[3] రూ.చూ. సొరగు. స.క్రి. చొచ్చు, ప్రవేశించు ; **2**. దూరు.

**సొరుగ్గడి** చూ. సొరుగు[2].

**సొరుగ్గుమ్మం** చూ. సొరుగు[2].

**సొరుపు** వి. అంటు, పొరుపు.

సొరుపుతాడు వి. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం.

**సొరువు** రూ.చూ. సొరుగు. వి.ఎండిన (ఆకు), అరటిసొరుగు.

**సొరెక్కు** చూ. సొరము. స.క్రి. ఏదైన ఘాటుగా గొంతు లోకి పోయినప్పుడు దగ్గువచ్చు.

**సొరెలుపోవు** అ.క్రి. పళ్ళలో బెజ్జాలుండి నీళ్ళుతాగేటప్పుడు బాధకలుగు.

**సొర్గం** వి. స్వర్గం.

సం. *స్వర్గ* -. స్వర్గలోకం, దేవలోకం.

<సం. *స్వర్గ* -.

**సొర్పు** వి. చిట్టచివర ఒకటిరెండు వేళ్ళు వెడల్పున కచ్చి. రెండు వైపులా నేసిననేత.

సొర్పునేయు వి. చిట్టచివర ఒకటిరెండువేళ్ళ వెడల్పున కచ్చికి రెండు వైపులా నేసిననేత.

**సొర్రె** వి. కొండలనుంచి పారే నీళ్ళప్రవాహం, కొండవాగు.

**సొర్లి** వి. వంటకువాడే చిన్నమట్టిపాత్ర.

**సొల**[1] రూ. సొళ్ళ[1]. వి. తుంబి, అనుగు (వృక్షవిశేషం).

సొలపుంగాయ వి. తుంబి, అనుగపుకాయ. హర. 1.29.

**సొల**[2] రూ.చూ. సొళ్ళ[2]. వి. సొరచేప.

సొలచేప వి. కట్టిటిచేప.

**సొళ్ళ**[1] రూ.చూ. సొల[1]. వి. తుంబి, అనుగు (వృక్షవిశేషం).

సొళ్ళకాయ వి. అనపకాయ, సొరకాయ.

**సొళ్ళ**[2] రూ. సొర[3], సొల[2]. వి. ఒకరకం చేప. వేంక. పంచ. 1.467.

క. *చొల*. చేప ; త. *చుళవమ్, చుళవు, చుళ, చుళా*. ఒకరకం చేప ; మ. *చిరాకు, చుళా, తుళావు*. సావు. ఒకరకం చేప.

సొళ్ళపియ్యి రూ. సొరపియ్య, సొరపీ, సొళ్ళపీ. వి. సొరచేప ఎముక, సొళ్ళపీ రూ.చూ. సొళ్ళపియ్యి. వి సొరచేప ఎముక.

**సొలఁగు** రూ.చూ. సొలపు. అ.క్రి. పరవశాన్ని పొందు. తాళ్ల. సం. 14.258 ; వి. మూర్ఛ.

**సొలచు** అ.క్రి. **1**. విజృంభించు, చెలరేగు. కు.సం. 1.2, 124 ; **2**. వైముఖ్యం పొందు. కువ.చ. 5.39 ; **3**. తగ్గు. విష్ణుపు. 7.176.

**సొలనుగొర్రె** వి. ఒకరకం చిన్నచెవులు గల గొర్రె.

**సొలపు** చూ. సోలు. రూ. సొలఁగు. వి. **1**. శ్రమ, బడలిక. గౌ. హరి.పూ. 1806 ; **2**. పారవశ్యం. ద్వి. పరమ. వి. 3.183 ; **3**. పంక్తి. యయా. 5.104 ; **4**. దీనభావం. వసు. 4.84 ; **5**. మూర్ఛ. రాఘవ. 2.6 ; **6**. విలాసం.

కువ.చ. 4.98 ; **7**. మృదుత్వం. చంద్రికా. 2.107 ; **8**. వైముఖ్యం. విజయ. 3.13 ; **9**. విధం. లక్ష్మీవి. 1.74 ; **10**. దృష్టి విశేషం. ప్రబంధ. 1.106 ; అ.క్రి. వెనుదీయు, జంకు. యయా. 5.78 ; విణ. పరవశత కలిగేది. దశా. 2.34.

సొలపుతనము వి. మ్లానభావం. ఖిన్నత.

**సొలయిక** చూ. సొలయు.

**సొలయించు** చూ. సొలయు.

**సొలయు** చూ. సొరుగు[1], సోలు. అ.క్రి. **1**. వైరస్యం పొందు, వైముఖ్యం పొందు. భార. ఆది. 4.270 ; **2**. విసుగుపడు. భార.ఆది. 7.3 ; **3**. మూర్ఛపోవు, హరి. ఉ. 1.130 ; **4**. మిక్కిలి అలసటనొందు, బాధపడు. భాస్క.రా. బాల. 488 ; **5**. వెనుదీయు, జంకు. యయా. 3.7 ; **6**. ఒప్పు. కృష్ణరా. 4.84 ; **7**. వ్యాపించు. రాజవా. 3.57 ; **8**. పరిమళించు, వలచు. ఉ.రా. 6.166.

సొలయిక వి. వైముఖ్యం. కళా. 6.224. సొలయించు స.క్రి. సొలయచేయు. అష్టమ. క. 2.115పు. 13పం. <సొలయు+-ఇంచు[3].

**సొలిపె** వి.-జున్న తెగులు, దీనివల్లకంకి ఈచబోయి గింజ పట్టదు.

**సొలిమిడి** చూ. సొలయు. వి. మూర్ఛ. సొలపు.

**సొలుగు** అ.క్రి. నశించు, తీరు. రంగా. చ, 2.240.

**సొలుపు** చూ. సొలయు. రూ. సొల్పు[2]. వి. **1**. గర్భిణీ స్త్రీ. లక్షణ విశేషం, వాతరోగం. గొ.హరి.ఉ. 2.92 ; **2**. విధం. యయా. 4.149.

సొలుపుగాలి వి. చలిగాలి.

**సొలుపుదారం** రూ.చూ. సులుపుదారం. వి. అచ్చు వడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అనివెంబడి దూర్చిన దారం.

**సొలుపుసుబిరె** వి. అచ్చుపోగుల్లో అనివెంబడి పోగులు చెదరకుండా దూర్చిన సన్న బెత్తం.

**సొలోపు** రూ.చూ. సొల్పు[1]. వి. వాటం, ఒరుపు, జారుడు.

**సొల్పు[1]** రూ. సులుపు, సులోపు, సొలోపు, సోపు, స్లోపు. వి. **1**. వాటం, ఒరవు, జారుడు ; **2**. వాలుగా ఉన్న ఆకుకప్పు.

ఇం. *Slope*. వాలు, ఏటవాలు.

<ఇం. Slope.

**సొల్పు[2]** రూ.చూ. సొలుపు. వి. **1**. గర్భిణీస్త్రీ లక్షణ విశేషం ; **2**. విధం.

**సొల్యూషను** వి. **1**. ద్రవద్రవ్యం ; **2**. సమస్యా పరిష్కారం, చిక్కుతీయటం.

ఇం *Solution*. ద్రవపదార్థంలోకరిగిపోవటం, ద్రవద్రవ్యం ; చిక్కు తీయటం, తేటపరచటం.

<ఇం. Solution.

**సొల్లు** వి. ఖాళీ, వట్టి.

క. జొళ్ళు. ఖాళీ, డొల్ల. నిరుపయోగమైన ; త. చొల్ల్. పాడైన, కుళ్ళిన, పనికిరాని ; మ. చొల్లు. చెడిపోయిన, పురుగు పట్టిన.

సొల్లుకట్టులు వి.బ.వ. ఆటప్రారంభించేటప్పుడు నట్టువకాడు తధిక్కు తకదైదై అని చెప్పేది. సొల్లుకబుర్లు వి.బ.వ. పనికిరాని మాటలు. సొల్లుబాలు (-పాలు[2]) వి. వెన్న తక్కువగా ఉండే పల్చటి పాలు. సొల్లుబీర వి. ఒకరకం బీర. సొల్లురేవడి వి. గుల్లరేగడి, గుల్లగా ఒదులుగా ఉండే రేగడినేల.

**సొల్లువాన** చూ. చల్లు. రూ. సల్లువాన, సల్లోన. వి. జల్లువాన.

**సొల్లెము** రూ. సొళ్ళియము, సొళ్ళెము. వి. నెమలి ఈకలు చుట్టిన పాగ.

**సొళ్ళియము** రూ.చూ. సొల్లెము. వి. నెమలి ఈకలు చుట్టిన పాగ.

**సొళ్ళెము** రూ.చూ. సొల్లెము. వి. నెమలి ఈకలు చుట్టిన పాగ.

**సొవ** వి. **1**. నవ్వడి. హంస. 5.158 ; **2**. గుసగుస ; **3**. జాడ, ఆచూకీ.

సం. సూచనా. పొడవటం, కుట్టటం, నిర్దేశించటం, అభినయించటం, వర్ణనం.

సొవసొవ వి. నేర్పుగలమాట.

**సొసాయించు** స.క్రి. **1**. మందలించు ; **2**. హెచ్చరించు ; **3**. నెరవేర్చు.

సం. సంస్కరణ - సిద్ధంచేయటం, చక్కజేయటం.

**సోకు** రూ. షోకు. వి. నాజూకు, చక్కదనం,

సోకుమొకాలు వి.బ.వ. రాచరీవులు.

**సోగ[1]** రూ. సొవ[1]. విణ. దీర్ఘమైంది, పొడవైంది. శృం.నై. 1.48 ; వి. **1**. దైర్ఘ్యం, పొడవు. భార. విరా. 2.83 ; **2**, రేఖ. గొ హరి. పూ. 2876 ; **3**. ఎండిన చెరుకాకు ; **4**. రాతి బండలోని పగుల గొట్టబడిన పల్చటిభాగం, పేలిక.

క. సొగె. (కంటిదగ్గర పెట్టుకొనే నల్లని) రేఖ.

సోగకన్ను వి. **1**. పొడుగైన కన్ను ; **2**. అందమైన కన్ను ; సొగెగణ్ణు. సోగ కన్ను. సోగగడ్డపార వి. సూదిగునపం, చివర కోసుగా ఉన్న గడ్డపార. సోగగుమ్మడి రూ. సొగ్గుమ్మడి. వి. బూడిదగుమ్మడి. సోగచిలక వి. ఒకజాతి చిలక. ప్రబంధ. 1.135. సోగచీల వి. సోగమేడిలో దూర్చి కొట్టే మేకు. సోగతనము వి నిడుపు. కళా. 3.66. సోగపుల్ల వి. దున్నేటప్పుడు పట్టుకోవటానికి మేడిచివర బిగించిన అడ్డపుల్ల. సోగబాన వి. మూతి చిన్నగా ఉండి మధ్యభాగం వెడల్పుగా ఉండే పెద్దమట్టి పాత్ర. సోగలాగలు వి. కిరాతావయవ విశేషం. ప్రబంధ. 1.130. సోగాకు వి. వాడాకు, చెరకుగడ చిట్టచివర ఉండే సన్నటి పొడుగాటి ఆకు. దీన్ని ఇంటి కప్పుకు కూడా వాడతారు. <సోగ[1]+ఆకు. సోగ్గబ్బ వి. ఎండిన చెరుకాకు. <సోగ[1]+గబ్బ. సోగ్గుమ్మడి రూ.చూ. సోగగుమ్మడి. వి. బూడిదగుమ్మడి, <సోగ[1]+గుమ్మడి.

**సోగ[2]** రూ. సోవ[2]. వి. **1**. తొడ్మె, పట్టుకంబం, పట్టుగాను, పట్టుజెయ్యి, పట్టుసోగ, సాలెసోగ, పిడి, పిడికట్టె, పిడిచిల్ల, మేడిచిల్ల, మేడిసోగ. సోగచీల సోగపుల్ల, దున్నేటప్పుడు పట్టుకోవటానికి మేడిచివర బిగించిన అడ్డపుల్ల ; **2**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట ; **3**. కోల ; **4**. చిన్నకొమ్మ.

సం. శాఖా. చెట్టుకొమ్మ, భాగం, బాహువు, తెగ.

జాతి ; ప్రా. సాహ్. కొమ్మ ; పా. సాహ్.
  < సం. శాఖా.

**సోగాకు** చూ. సోగ[1].

**సోగులు** చూ. సోగ[1]. వి.బ.వ. భక్ష్య విశేషం. హంస 1.105.

**సోగ్గబ్బ** చూ. సోగ[1].

**సోగ్గుమ్మడి** చూ. సోగ[1].

**సోంకు** రూ.చూ. సోఁకు. వి. స్పర్శ, తాకుడు. కు.సం. 8.89.

**సోఁకనాడు** చూ. సోఁకు.

**సోఁకించు** చూ. సోఁకు.

**సోఁకు** రూ. సోఁకు. స.క్రి. **1**. స్పృశించు, తాకు. కు. సం. 1.100 ; **2**. ఆవేశించు. శృం.నై. 2. 138 ; అ.క్రి. **1**. తగులు, సక్తమగు. విజ్ఞా. ఆచా. 54, హర. 5.16 ; 2. ప్రవేశించు, చొచ్చు. ఉ. హరి. 3.138 ; **3**. ఆవేశించు. గౌ. హరి. పూ. 1.485 ; **4**. ప్రసరించు. ఆము. 5.153 ; **5**. ఘటిల్లు, రగులు. వసు. 3.145 ; వి. **1**. స్పర్శ, తాకుడు, భార. శాంతి. 4.306, భాగ. 3.655 ; **2**. కష్టం, ఇక్కట్టు. ఆము. 4.285 ; **3**. మేళనం, కలపటం. వసు. 5.121 ; **4**. రాక్షసుడు. అచ్చ. భా. 2.29పు.

క. సోకు, సోక్కు, సొంకు, సుంకు. స్పృశించు, తాకు, సొగుడు. తాకటం, స్పర్శ ; తు. సోకుని, సోంకుని, సోంక్కుదుని, సోంకుని. వ్యాధిలాగా పట్టుకొను, తాకు, స్పృశించు ; త. చోకు. మనిషిని పీల్చి పిప్పిచేసేవాడు, రాక్షసుడు ; మ. చోకు. రాక్షసుడు ; గోం. సోకానా. మందు, వేడినీళ్ళు మొ. వాటిని శరీరానికి రుద్దు, రాయు పర్జి. చొక్కు. కలిగిఉండు.

**సోఁకనాడు** స.క్రి. ఆవేశంతో మాట్లాడు. తాళ్ల. సం. 14. 40. < సోఁకు + -అ[7] + ఆడు. **సోఁకించు** స.క్రి. సోకజేయు. తగిలించు, కొట్టు, తాకించు. మార్క. 5.126, ద్వి. భార. విరా. 3.52. < సోఁకు + -ఇంచు[3]. **సోఁకుఁజుక్క(-చుక్క)** వి. మూలానక్షత్రం. **సోఁకుటింతులు** వి.బ.వ. రాక్షసస్త్రీలు. చంపురా 5.76. < సోఁకు + ఇంతి + -లు. **సోఁకుటొజ్జ** వి. శుక్రాచార్యుడు. యయా. 4.83. < సోఁకు + ఒజ్జ. **సోఁకుడు** వి.**1**. స్పర్శ, తాకుడు, దెబ్బ. విప్ర. 2.53 ; **2**. ఆవేశం, ఆగ్రహావేశం. విజయ. 3.35 ; **3**. రాక్షసుడు. రసిక. 4.39; **4**. పిశాచం. శుక. 1.285 ; **5** దెయ్యం మొ. వి. పట్టటం. **సోఁకుడుతనము** వి. రాక్షసత్వం. అచ్చ.రా. బాల. 68. **సోఁకుడుముడుఁగు** వి. ఓషధివిశేషం, అత్తపత్తి, సిగ్గాకు. **సోఁకుదయ్యము** వి. వాయువు, గాలి. అచ్చ.రా. యు. 369. **సోఁకుదొర** వి. రాక్షసరాజు(రావణుడు). అచ్చ.రా.యు. 39. **సోఁకుబూచి** వి. వాయువు. **సోఁకుమూకలగొంగ** వి. విష్ణువు. ఆం.నా.సం. 1.7. **సోఁకుమూకలదణి** వి. నైరృతి. **సోఁకుమూఁకలఱేఁడు** వి. నైరృతి. **సోఁకులఱేఁడు** వి. నైరృతి. మూలరేడు. **సోఁకులస్రూడు** వి. విష్ణువు. **సోఁకోర్చు** అ.క్రి. **1**. బాధలకోర్చు, డీకొని నిలుచు. భాగ. 3.655 ; **2**. సంభాషణాదుల్ని పెట్టుకోవటానికి ఇష్టపడు. పాండు. 3.24. < సోఁకు + ఓర్చు.

**సోఁకోర్చు** చూ. సోఁకు.

**సోఁగు** వి. సరం. హారం కాశీ. 1.138.

**సోజరు** రూ.చూ. సోల్జరు. వి. సైనికుడు.

**సోజి** రూ.చూ. సొజ్జె. వి. రవ్వ, నూక.

**సోజికాలు** వి. సొంతం. E.C. సంపు. 12. తుంకూర్ శాసనం. 52. క్రీ.శ. 1447.

**సోజిరా** వి. ఒకవిధమైన మేలురకపు జీలకర్ర.
  ఉ. అర. షాహ్. రాజు ; ఉ. జార. జీరహ్.
  < ఉ. షాహ్ + ఉ. జీరహ్.

**సోటా** రూ. చోటా. వి. చేతివేత్రం, శెంగోలు.
  హిం. ఉ. సొట. దండం, వేత్రం.
  < ఉ. సొట.

**సోటిక** వి. న్యాయం.
  సం. సుష్ఠుక్రియా. మంచిపని.

**సోటుచేయు** చూ. చోటు. స.క్రి. భోజనానికి సిద్ధంచేయు, పీటలు వేయు.

**సోట్లుశోధించు** అ.క్రి. పరిశీలనగా చూచు. శుక. 2.15.
  సం. శోధ్. శోధించు.
  < చోటు + -లు + సం. శోధించు.

**సోడంబు** వి. బ్రహ్మరంధ్రం, మాడపట్టు. బసవ. 201పు. 6 పం.

**సోడా** వి. **1**. ఒకరకం ఉప్పు ;**2**. వాయువుతో కూడిన తాగే నీరు.
  ఇం *Soda*. క్షారం, స్వర్జిక ;
  *సం. క్షార-. ఉప్పు.
  < ఇం. Soda.

**సోడాతొట్టి** రూ. షోడాతొట్టి. వి. సోడాలు పెట్టటానికి నీళ్ళుపోసి వాడే మట్టితొట్టి. **సోడానీరు** వి. ఒకరకం తాగేనీరు.

**సోడాపూర్‌కంది** వి. కందిలో ఒకరకం, సోడాపూర్ ఊరుపేరు కావచ్చు.

**సోడావాటరు** వి.సోడానీరు.
  ఇం. *Soda water*. సోడానీరు.
  < ఇం. Soda water.

**సోడాషాపు** వి. సోడాఅమ్మేదుకాణం.
  ఇం. *Soda Shop*. సోడాకొట్టు.
  < ఇం. Soda Shop.

**సోడిదేవు** వి. **1**. జూదం మొ. వాటిలో సర్వస్వం వెచ్చబెట్టి బీదపడినవాడు ; **2**. అప్రయోజకత ; స.క్రి. పనినుంచి నిలిపివేయు.
  పో. సోర్తి. లాటరీ ; స్పా. స్వోర్‌తా. చెట్టు పుట్ట కొట్టి కొత్తగా సాగిన భూఖండంలో చెట్లువేసి పంచుకొన్న భాగం, లాటరీ ; మరా. సోడిత. లాటరీ.
  < పో. సోర్తి.

**సోడీచేయు** స.క్రి. వదలివేయు.
  **హిం.** ఛోడ్‌నా. వదలివెయ్యటం, రాజీనామాచెయ్యటం, తీసివెయ్యటం, డిశ్చార్జిచేయటం, ఖాళీచెయ్యటం, క్షమించటం, నిర్లక్ష్యంచెయ్యటం, చెల్లించటం, విడిచిపెట్టడం; ఉ. ఛోడ్‌నా. వదలివెయ్యటం, నిప్పులు కక్కటం, క్షమించటం, వదులు చెయ్యటం, బంధవిముక్తుని చెయ్యటం,

పక్కన పెట్టివెయ్యటం, తుపాకీపేల్చటం, గాలిపిల్చటం, డిశ్చార్జిచెయ్యటం, తప్పించటం ;

క. సోడి.

<హిం.ఛోడ్(నా) + చేయు.

సోడు[1] రూ.చూ. సోఁడు. వి. సోలప్రమాణంకల.

సోడు[2] వి. బ్రహ్మరంధ్రం, మాడపట్టు. శార. అను. 2.452.

సం. శీర్షస్థ-.మాడపట్టు, తలమీదిది.

సోడుముట్టు స.క్రి. బ్రహ్మరంధ్రం స్పృశించు, తాకు. కు. సం. 7.148 ; అ.క్రి. 1. అతిశయించు, తలమునకలగు. శేయా. 1.70 ; 2. వ్యాపించు. వరాహ. 10.132.

సోడెంరంగు వి. బొగ్గుమాదిరి నల్లరంగు.

ఇం. *Sodium Colour*. సోడియంరంగు.

<ఇం. Sodium + రంగు.

సోడ్డు చూ. సోడు2. వి. మొట్టికాయ.

సోణము వి. నాసామూలం, ముక్కుమొదలు. కాశీ. 7.84.

సం. నాసా. ముక్కు.

సోండమ్ రూ.చూ. సుండు. వి. వ్యవసాయ పనులకోసం నీరు తోడటానికి ఉపయోగించే తోలు చేదకుండే గొట్టం.

సోండేలుగాడు వి. వృద్ధుడు.

సోద[1] రూ.చూ. సొద. వి. 1. సంగతి. హంస. 1.128; 2. ఒకరి కష్టాలను ఇంకొకరితో చెప్పుకోవటం ; 3. దుఃఖం.

సోద[2] వి. గచ్చు, గార.

సం. సుధా-. సున్నం.

<సం. సుధా.

సోదకులు వి.బ.వ. జ్ఞానులు.

సం. శోధక-. పవిత్రంచేసే మనుష్యుడు, శుభ్రంచేసే మానవుడు.

<సం. శోదక- + -లు.

సోదన వి. 1. శకునార్థం రామాయణాది గ్రంథాల్లో దారం వేసి శోధించటం. రుక్మా. చ. 3.223, 2. గాలింపు. తాళ్ల. సం. 13.230.

సం. శోధన-. పవిత్రం చేసేది, శుభ్రం చేసేది, శాస్త్రి. శుద్ధిచేయటం ; ప్రా. సోధణ-, సోహణ- ; అ.మా. సోహణ-. వెదకటం ; పా. సోధన-. శుద్ధిచేయటం, వెదకటం ;

క. సొదనె-, సోదిసు-, సోదించు ; మ. చోదన-. అన్వేషణ, శుద్ధిచేయటం.

<ప్రా. సోదణ-.

సోదనదివియ రూ.చూ. సోదనదీవె. వి. ఇరుకు ప్రదేశాల్ని శోధించే దివ్వె. విక్ర 1.67. సోదనదీవియ రూ.చూ. సోదన దీవె. వి. ఇరుకు ప్రదేశాల్ని శోధించే దివ్వె. సోదనదీవె రూ. సోదన దివియ, సోదనదీవియ. వి. ఇరుకు ప్రదేశాల్ని శోధించే దివ్వె. ఉ. హరి. 2.94.

సోదా[1] వి. వెదకటం, అన్వేషణ.

సం. శోద-. వెదకటం ; హిం. ఉ. సోధ్. పరిశోధించటం ; ఒ. సోదా-.

<ఒ. సోదా.

సోదా[2] వి. పనిపాటా లేక తిరిగేవాడు, నీతిలేని విలాస పురుషుడు.

హిం. ఉ. సౌదా-. సామాన్యమైన.

సోది రూ.చూ. సోదె. వి. ఎరుక. అష్టమ. క. 2.83ప. 27పం.

సోదికత్తియ రూ.చూ. సోదికత్తె. వి. సోదిచెప్పేది. సోదికత్తె రూ. సోదికత్తియ, సోదియకత్తియ, సోదియకత్తె, సోదెకత్తియ, సోదెకత్తె. వి. సోదెచెప్పేది. పార్వ. 4.100. సోదిగొను(-కొను) రూ.చూ. సోదెగొను. స.క్రి. సోది చెప్పించుకొను. సోదులసాని రూ.చూ. సోదెలసాని. వి. ఎరుక చెప్పే స్త్రీ, ఎరుకత.

సోదిచ్చు రూ.చూ. సోదించు. స.క్రి. వడగట్టు.

సోదించు రూ. సోదిచ్చు. స.క్రి. 1. శోధనచేయు. తాళ్ల. సం. 6.200 ; 2. మట్టిలోని రాళ్ళను తీసివేయు ; 3. వడగట్టు.

సం. శోధ-. శుభ్రపరచటం, పవిత్రం చేయటం, దిద్దటం, (అప్పు మొ. వాటిని) తీర్చటం, ప్రతిక్రియ.

<సం. శోధ- + -ఇంచు.[3]

సోదియ రూ.చూ. సోదె. వి. రాగల మేలుకీడును గూర్చి చేసే ప్రశ్న.

సోదియకత్తియ రూ.చూ. సోదికత్తె. వి. సోదిచెప్పే స్త్రీ. సోదియకత్తె రూ.చూ. సోదికత్తె. వి. సోదిచెప్పే స్త్రీ. సోదియగొను(-కొను) రూ.చూ. సోదెగొను. స.క్రి. సోది చెప్పించుకొను. సోదియలసాని రూ.చూ. సోదెలసాని. వి. ఎరుకచెప్పే స్త్రీ, ఎరుకత.

సోదుమనోహరము వి. భక్ష్యవిశేషం. ద.హిం.శా. సంపు. 6. శా. సం. 695. క్రీ.శ. 1519.

సం. స్వాదు-. తియ్యని, మనోహర-. మనోజ్ఞమయినది.

<సం. స్వాదు- + సం. మనోహర- + -ము.

సోదులసాని చూ. సోది.

సోదె రూ. సోది, సోదియ. వి. 1. రాగల మేలు కీడుల్ని గురించి చేసేప్రశ్న. (స్మృతివిశేషం). ప్రభా. 5.122 ; 2. వినుగెత్తించే మాటలు.

సం. శోధిత-. శోధించబడింది, సుపరీక్షితం ; ప్రా. సోధిఅ ;

తు. సోదియుని ; కొడ. చోది ; త. చోతి-. వెదకటం, కనుగొనటం ; మ. చోతి.

<ప్రా. సోధిఅ-.

సోదెకత్తియ రూ.చూ. సోదికత్తె. వి. సోదిచెప్పే స్త్రీ. సోదెకత్తె రూ.చూ. సోదికత్తె. వి. సోదిచెప్పే స్త్రీ. సోదెగొను (-కొను) రూ. సోదిగొను, సోదియగొను. స.క్రి. సోదె చెప్పించుకొను. ప్రభా. 5.120. సోదెలసాని రూ. సోదులసాని, సోదియలసాని. వి. ఎరుక చెప్పేది, ఎరుకత. వేంక. మా. 5.16.

సోదెము రూ. సోద్దెము. వి. ఆశ్చర్యం, చోద్యం. ఉ. రా. 7.390.

సోద్దెం రూ.చూ. సోద్దెము. వి. 1. చిరుతిండి ; 2. చోద్యం.

సోద్దెము రూ. సొద్దెము, సోదెము, సోద్దెం. వి. ఆశ్చర్యకరం.

బసవ. 185.పు ; విణ. ఆశ్చర్యకరం.

సం. చోద్య-. వింత, ఆశ్చర్యం ; ప్రా. చోజ్జ- ; జై. మహా. చోఇజ్జ- ; దే. ప్రా. చుజ్జ- ; అ.మా. చోజ్జ- ; తు. సోద్య- శ్లాఘింపదగినది, సోధ్య-. ఆపిని. పొగడు ; త. చోత్తియమ్.

<సం. చోద్య-.

**సోన**[1] వి. **1**. వర్షం. భార. విరా. 3.168 ; **2**. బిందువు, బొట్టు. హర. 3.92 ; **3**. అల్పవర్షం. రామాభ్యు. 4.95 ; **4**. ప్రవాహం. రాజ. వి. 4.108 ; **5**. ధార. కాశీ. 5.167.

క. సోనె. ఎడతెగనివాన ; త. చోణై-. కారుమబ్బులు, పెద్దవర్షం, ఎడతెరపిలేనివాన. చోనమ్. మబ్బు, మేఘం, చోనా-మారి. ఎడతెరిపిలేని వాన.

**సోనవాన** వి. ముసురువాన. పాండు. 4.28.

**సోన**[2] రూ.చూ. సొన. వి. **1**. చేపలగుడ్లు ఒకటిగాకలసి ఉండే కోవు ; **2**. కంటిగుడ్డులోని పదార్థం ; **3**. కోడిగుడ్డులో పాగు.

**సోనంగి** రూ. జోనంగి. వి. శునకజాతి విశేషం.

సం. శునక-. కుక్క, శౌనక-. కుక్కకు సంబంధించినది ; ప్రా. సుణగ-, సుణయ-, సుణహ-. శునకం, సోణిహిఅ. వేటకాడు ; జై.మహా. సుణగ-, సుణహ- ; అ.మా. సుణ-, సుణక-, సుణగ-, సుణయ, సుణీ ; పా. సునఖ-, సూన-, సోణ-, సోన-. కుక్క, సోణీ. ఆడకుక్క ; మా. శుణ హక ;

క. సొణక, సొణగ, సొణగు. కుక్క ; తు. చుణంకన్-. సొణంగు ; త. చుణంకి, మ.చుణంగి.

<ప్రా. సుణగ-.

**సోనబల్లి** వి. సాలెపురుగు. సాంబ. తిర్య. 8.

**సోనరు** వి. డే చెక్క బోల్టులను బిగించే ఇనప పనిముట్టు.

ఇం. *Wrench.* బోల్టుల్ని బిగించే పనిముట్టు.

**సోనహుము** వి. వెల్లుల్లి.

**సోనామణి** రూ.చూ. సునామణి. వి. సవరణ.

**సోనె** చూ. సోన[1]. వి. చదువుతో స్త్రీలను అనే మెత్తటి తిట్టు.

**సోప** వి. క్షోభ.

సం. క్షోభ-. కలత ; ప్రా ; ఖోభ-. ఖోహ- ; పా. ఖోభ-. పాకు, కదలటం ; ప్రా. భోహ-. గుంపు ; హిం. ఛోహ్. భయం, కలత.

<సం. క్షోభ-.

**సోపనము** వి. మెట్టు, సోపానం. భార. శాంతి. 5.87.

సం. సోపాన-. మెట్టు, నిచ్చెన ; ప్రా. సోవాణ-. పా. సోపాన-.

<సం. సోపాన-.

**సోపా** వి. **1**. పాక, మూడువైపుల మూసినదూలాలులేని పొడుగాటి ఇల్లు ; **2**. పంచ, ఇంటిముందున్న కప్పువేసిన అరుగు.

**సోపాదూలం** వి. చూరుదూలం, ముంజూరు దగ్గరకు పొడుచుకొని వచ్చిన దూలం. **సోపాపాక** వి. పొడుగాటి పాక. **సోపాబండి** వి. గూడుబండి, పైన గూడున్న ప్రయాణం బండి.

**సోపారం** రూ.చూ. చప్పరము. వి. వాలుగా ఉన్న ఆకు కప్పు.

**సోపిపుచ్చు** స.క్రి. పారదోలు. కు.సం. 7.91.

**సోపు**[1] రూ.చూ. సొల్పు[1]. వి. వాటం, ఒరపు, జారుడు.

**సోపు**[2] రూ.చూ. సో(పు[1]. వి. జీలకర్రలా ఉండే ఒకరకం మసాలాదినుసు (Carum carin).

**సోపు**[3] రూ.చూ. సో(పు[2]. వి. పొద, బొల్లి.

**సోపు**[4] వి. అంసు పోగులు దూర్చే చిన్నపన్నె.

**సోపుదారీకేక** వి. జాగ్రత్తకోసం వేసేకేక.

**సోపుదారీవా(డు** విణ. జాగ్రత్తకోసం కాపలా ఉండేవాడు.

**సోపుదారు** వి. కావలివాడు.

**సోపులాడు** (-ఆడు) అ.క్రి. ఊగులాడు. తాళ్ల.సం. 7.12.

**సోప్‌జాన్‌రుమాలు** వి. ఒకరకం తలపాగ, మూడుచారలు పడేట్టు నేసిన తలపాగ.

**సోబ**[1] వి. కాంతి. వేంక. పంచ. 1.643.

సం. శోభా, కాంతి.

<సం. శోభా.

**సోబ**[2] రూ. సోబు[2]. వి వ్యాధివిశేషం, వాపురోగం.

సం. శోఫ-. వాపురోగం ; పా. సోఫ-.

<పా. సోఫ-.

**సోబ**[3] వి. ఒకపక్కకాలి మరోపక్కకాలని రేగాల్పిటుక.

**సోబకాల్పు** వి. ఆములో కుండలు బాగా కాలనిస్థితి. **సోబకుండ** వి. కాలీకాలని కుండ. **సోబయిటిక** (-ఇటిక) రూ. శోబయిటిక, స్తోబిటిక. వి. చాలా తక్కువగాకాలిన ఇటిక. **సోబిటిక** రూ.చూ. సోబయిటిక. వి. చాలా తక్కువగా కాలిన ఇటిక.

**సోబతు** రూ.చూ. సోబత్తు. వి. తోడుగా ఉండటం.

**సోబత్తు** రూ. సోబతు. వి. సహవాసం, తోడు.

సం. సహవృత్. కూడినది, తోడున్నది.

**సోబనము** వి. **1**. మంగళం. భార. శాంతి. 5.587 ; **2**. ముగ్గు. ప్రబంధ. 1.566.

సం. శోభన-. ప్రకాశించేది, అందమైనది, శుభప్రదమైనది, సుగుణాలుకలది, ప్రా. శోభణ-, సోహణ-. శోభాయుక్తం, మంగళకరం ; అ.మా. పా. సోభణ-. పవిత్రం, శుభం, ప్రశస్తం.

<ప్రా. శోభణ-.

**సోబనలు** వి.బ.వ. మంగళగానాలు. కువ. చ. 3.131.

**సోబనలు** చూ. సోబనము.

**సోబపడు** అ.క్రి. వెతనొందు, క్షోభిల్లు.

సం. క్షోభ-. కలత, అలజడి, కలవరం ; ప్రా. ఖోభ- ; ఖోహ- ; పా. ఖోభ-.

<సం. క్షోభ- + పడు.

**సోబాన** వి. శోభనంపాట, ఒకరకం పెళ్ళిపాట. తాళ్ల.సం. 8.21.

సం. శోభన-. మంగళప్రదమైనది, సుగుణాలుకలది, సుందరమైనది ; ప్రా. సోభణ- ;

క. సోబానె- ; తు. సోబాన-. శుభకార్యాల్లో పాడే పాట.

<ప్రా. సోభణ-.

**సోబి**[1] వి. చాకలి ఉతికినప్పుడు చేసేశబ్దం. ధ్వన్యను.

**సోబి**[2] రూ. సోబు[1]. వి. దేహంమీదవచ్చే బూజర లాంటి చర్మవ్యాధి. ఈవ్యాధి వల్ల దేహంపై తెల్లమచ్చలు వస్తాయి.

సం. శోభిన్. ప్రకాశించేది, సుందరమైనది.

<సం. శోభిన్.

**సోబిటిక** చూ. సోబ[3].

**సోబియ**[1] రూ.చూ. సోబె[1]. వి. దేహంలో కలిగే ఒకరకం పొడ.

**సోబియ**[2] రూ. సోబె[2]. వి. వాపు.

సం. శోఫ-. వాపు.

**సోబిలి** వి. ఇద్దరుచేరి ఆడే ఒకరకం ఆట.

**సోబు**[1] రూ.చూ. సోబి[2]. వి. దేహం మీదవచ్చే తెల్లమచ్చలు కలవ్యాధివిశేషం.

**సోబు**[2] రూ.చూ. సోబ[2]. వి. వాపు.

**సోబె**[1] రూ. సోబియ[1]. వి. సోపు, దేహంలో కలిగే ఒకరకం పొడ. వేంక. ఆం. 71.

సం. శోభిత-, శోఫ-. ప్రకాశించేది ; ప్రా. సోభియ-; క. చిబ్బు, చిబ్బు, సిబ్బు, సిబ్బు, సిబ్బె, సోబె శరీరం మీదవచ్చే మచ్చ; తు. చిబ్బు. శరీరంమీద తెల్లమచ్చలు, శిబ్బ, శిబ్బు, సుబ్బ, సుబ్బు. శరీరంమీద చర్మంరంగు మారటం, శిడిబు, శిడుబు. మఱుచికం మచ్చలు ; చోవై;గోం. సిపోవా. మనిషి చర్మంమీద తెల్ల మచ్చలు, సుబ్బా.

<ప్రా. సోభియ-.

**సోబెవా(డు** విశ. సిబ్బెము కలవాడు. కలాసి. సిధ్మలుడు.

**సోబె**[2] రూ.చూ. సోబియ[2]. వి. వాపు.

**సోబె**[3] వి. అందంకోసం పెట్టుకునే చుక్క.

సం. శోభా. కాంతి, శోభిత-. ప్రకాశించేది ; ప్రా. సోభా.

<ప్రా. సోభా.

**సోమ**[1] రూ.చూ. సొమ్మ.

వి. శ్రమ. గౌ. హరి. పూ.

**సోమ**[2] రూ.చూ. సోమము. వి. **1**. పరాక్రమం. రం. రా. యు. ; **2**. శ్రమ. గౌ. హరి. పూ. 1618 ; **3**. సొమ్మ. పద్మ. 7.44.

**సోమించు** స.క్రి. నమంగా పంచుకొను. భార. ఉద్యో. 3.295 ; అ.క్రి. **1**. పరాక్రమించు, విజృంభించు. రం.రా. సుం. 262పు ; **2**. సరిపోలు. ఉ.హరి. 2.152 ; **3**. వ్యాపించు. కవిక. 6 ; **4**. తృప్తినొందు. విష్ణుపు. 8.168. <సోమ[2]+-ఇంచు[3].

**సోమగడ్డి** వి. చవిటినేలల్లో ఎక్కువగా పెరిగేగడ్డి, పశువుల మేతకు ప్రశస్తం (chrysopogon montanus).

**సోమము** రూ. సోమ[2]. వి. పరాక్రమం. భార.ఆది. 3ఆ.

సం.సౌమ్య-. సమ్మతమైనది, అందమైనది, శాంతమైనది, ప్రకాశవంతమయినది ; ప్రా. సోమ-. ప్రశస్తం, శ్లాఘ్యం.

<ప్రా. సోమ-.

**సోమయాది** రూ.చూ. సోమాసి. వి. సోమయాగంచేసినవాడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 232. క్రీ.శ. 1235.

**సోమరి** రూ. సోమారి, సోంబేరి. వి. **1**. అలసుడు, చురుకు లేనివాడు. విజయ. 1.86 ; **2**. పనిచేయక కాలం గడిపే వాడు. రాజవా. 1.76 ; విశ. మందం, అలసం. గౌ.హరి. పూ. 434.

సం. సుకుమార-. మృదువైనది, అందమైనది, లేతది, ప్రా. సోమార-, సఉమార-. సుకుమారుడు ; జై.మహా. సోమాల- ; శౌ. సుఉమార- ; అ. మా. సుమాల-, సోమాల-. సుకుమారం ;

క. సోమారి ; తు. సోమారి ; త. చోంపేరి.

<ప్రా. సోమార-.

**సోమరిగాలి** వి. మలయమారుతం. గౌ.హరి. 1.340.

**సోమరించు** అ.క్రి. అలసత్వం చూపించు, బద్ధకించు. తాళ్ల. సం. 17.595. <సోమరి+-ఇంచు[3]. **సోమరితనము** వి. అలసత్వం. శ్రీరం. మా. 2.43. **సోమరిపాటు** వి. సోమరితనం. శ్రీరంగ. 3.130. **సోమరిపోతు** వి. అలసుడు, సోమరి. శృం.నై. 1.17.

**సోమసత్తెర** వి. చారు, పరమాన్నం వడ్డించటానికి ముక్కుపెట్టి చేసిన మట్టిపాత్ర.

సం. సోమ-. చంద్రుడు, సోమలత, శివుడు.

**సోమసూర్యవీథులగు** అ.క్రి. వేరుపడి విడిపోవు. కాశ.మా. 2.42.

సం. సోమసూర్యవీథి-. చంద్రసూర్యలదారి,

<సం. సోమసూర్యవీథి-+-లు+అగు.

**సోమాది** రూ చూ. సోమాసి. వి. సోమయాగంచేసినవాడు. బసవ. 494పు.

**సోమారి** చూ.రూ. సోమరి. వి. **1**. పనిదొంగ ; **2**. సోమరిపోతు.

**సోమాలమ్మ** వి. **1**. మహాలక్ష్మి ; **2**. శివశక్తి.

సం.శ్యామలాంబా. పార్వతి.

<సం. శ్యామలాంబా.

**సోమాసి** రూ. సోమయాది, సోమాది. వి. సోమయాగం చేసినవాడు. పండి.చ. 4.83.

సం. సోమయాజిన్. సోమయాగం చేసినవ్యక్తి ; మ. చోమాదిరి. సోమయాజి.

<సం సోమయాజిన్.

**సోమాసిపెట్టు(జెట్టు** వి. ఇంద్రుడు. **సోమాసిసాని** వి. సోమయాగం చేసినవ్యక్తిభార్య.

**సోమి**[1] వి. ఒకరకంచెట్టు, దీనిబెరడు రంగులు తయారు చెయ్యటానికి వాడతారు.

సం. సోమ-. సోమలత.

<సం. సోమ-.

**సోమి**[2] రూ. సోమిడి[1]. వి. సేగ, ఎర్రని కలప కలిగి కొయ్యమేకుల లాంటి పరికరాల తయారీకి పనికివచ్చే చిన్నచెట్టు (Sandoricum indicum).

**సోమించు** చూ. సోమ[2].

**సోమిడి**[1] రూ.చూ. సోమి[2]. వి. ఎఱ్రని కలప కలిగి కొయ్య మేకులలాంటి పరికరాల తయారీకి ఉపయోగించే చిన్న చెట్టు.

**సోమిడి**[2] వి. **1**. ఒక బాలవ్యాధి ; **2**. చిన్నపిల్లలు ఏదో గాలితాకుడువల్ల సన్నగా అవటం, పక్షిదోషం.

**సోమిద** రూ.చూ. సోమింద. వి. తిప్పతీగ.

**సోమిదమ** రూ.చూ. సోమిదమ్మ. వి. సోమయాజిభార్య.

**సోమిదము** రూ.చూ. సోమింద. వి. శణపర్ణి.

**సోమిదమ్మ** చూ. సోమాసి. రూ. సోమిదమ. వి. సోమయాజి భార్య. కాశీ. 4.99.

**సోమింత** రూ.చూ. సోమింద. వి. వృక్షవిశేషం (సోమికఱ్ఱ అని విజయనగరం ఏలూరు, నెల్లూరు ప్రాంతాల వాడుక. వడ్రంగి ఉపయోగించే చెట్టు).

**సోమింద** రూ. సోమిద, సోమిదము, సోమింత, సోమెద. వి. తిప్పతీగ, సోమవల్లరి, సోమెద. హంస. 4.11. (Coronilla Seabah).

సం. సోమలతా. సోమవల్లరి.

<సం. సోమలతా.

సోమిందపత్తిరి వి. తిప్పతీగ పత్రి. పండి.చ. 5.535.

**సోమిసాని** చూ. సోమాసి. రూ. సోమెసాని. వి. సోమయాజి భార్య ఆం.భా. 2.107.

**సోము** అ.క్రి. **1**. ఆసక్తమగు. కు.సం. 6.704 ; **2**. సుఖపడు ; విణ. **1**. ఆసక్తం. భోజ. 2.26.

సం. సుఖ-. సుఖం, ఆనందం, హాయి ; ప్రా. సుఘ-, పా. సుఖ- ; అప. నాగర. అప. సుఘ-.

<ప్రా. సుఘ-.

సోమెక్కు అ.క్రి. **1**. మత్తిల్లు ; **2**. సొమ్మసిల్లు <సోము+ఎక్కు.

**సోమెక్కు** చూ. సోము.

**సోమెద** రూ.చూ. సోమింద. వి. ఒకరకం కూరాకు, సోమవల్లరి (coronilla seabah).

సోమెదకూర వి. ఒకరకం కూరాకు.

**సోమెసాని** రూ.చూ. సోమిసాని. వి. సోమయాజిభార్య. ఆం. పదా. సం. 11.

**సోంపు** రూ.చూ. సోఁపు[1]. వి. మసాలాలో వేసే జీలకఱ్ఱ లాంటి దినుసు.

**సోంబేరి** రూ.చూ. సోమరి. వి. సోమరిపోతు.

**సోఁపు**[1] రూ. సోపు[1]. సోంపు. వి. ఒకానొక సంబారపుదినుసు, నఱ్ఱజీలకఱ్ఱ. ఆం.భా. 2.249.

ఇం. సొంప్. సోపు.

<ఇం. సౌంప్.

సోఁపుబిండి(-పిండి) వి. చణకపిష్టం, సెనగపిండి.

**సోఁపు**[2] రూ. సోపు[2]. వి. **1**. పొడ, బొల్లి. తాళ్ల.సం. 17.123 ; **2**. వాపు.

సం. శోభా. కాంతి.

**సోయగము** వి. **1**. సౌందర్యం, చక్కదనం, కుసం. 7.122 ; **2**. విధం, రీతి. భాగ. 12.48 ; **3**. విలాసం. వసు. 3.116.

సం. సౌందర్య-. అందం, సొగసు ; ప్రా. సోఅరిఅ, సొఅరిఅ.

<ప్రా. సోఅరిఅ.

**సోయింబరకడ్డి** వి. కంసాలి పనిముట్టు (నెల్లూరు, రాయలసీమ వాడుక).

**సోర** రూ.చూ. సొర[1]. వి. సొరకాయ, ఆనపకాయ (Lagenaria valgaris).

**సోరంగి** వి. మత్స్యవిశేషం.

**సోరణ** రూ.చూ. సోరణము. వి. చిన్నకిటికీ.

**సోరణగంటె** రూ.చూ. సోర్ణగండి. వి. కిటికీ.

**సోరణగండి** రూ.చూ. సోర్ణగండి. వి. గవాక్షం, జాలకం. రం. రా బాల. 64పు. 8పం, పండి. చ. 5.250.

**సోరణగండె** రూ.చూ. సోర్ణగండి. వి. గవాక్షం, జాలకం.

**సోరణగెండె** రూ.చూ. సోర్ణగండి. వి. గవాక్షం, కిటికీ.

**సోరణము** రూ. సోరణ, సోర్ణము. వి. గవాక్షం, కిటికీ, యయా. 1.25.

సం. చతురాననీ-. నాలుగు ముఖాలుకలది, సొరాయనీ- సూర్యమార్గం ; ప్రా. చఉరాణణ-. నాలుగు ముఖాలు కలది, సొరాణ-, సొరాయణ.

<ప్రా. సోరాణ-.

**సోరతము** వి. బలి, ఆహారం. కు. సం. 11.6.

సం. సువ్రత-. మంచివ్రతం.

<సం. సువ్రత-.

**సోరి** చూ. సొరిది. వి. **1**. వరస ; **2**. రీతి ; **3**. అంచె.

**సోరు** వి. సోరుప్పు, పెట్లుప్పు.

సం. క్షార-. లవణం, ఉప్పు ; ప్రా. ఖార-.

<సం. క్షార-.

సోరుప్పు వి. క్షారం, పెట్లుప్పు. <సోరు+ఉప్పు.

**సోరువా** వి. మాంసపుచారు.

**సోర్ణగండి** చూ. సోరణము. రూ. సోరణగంటె, సోరణగండి, సోరణగండె, సోరణగెండె. వి. గవాక్షం, జాలకం. భార. ఉద్యో. 2.112.

**సోర్ణము** రూ.చూ. సోరణము. వి. గవాక్షం, కిటికీ.

**సోర్పు** చూ. చేర్పు. వి. గూనలను ఎండబెట్టటానికి ఒకదాని తరవాత ఒకటి పేర్చేతీరు.

**సోల** రూ. సోళి. వి. ధాన్యాన్ని కొలిచే సాధనం, తవ్వలో సగం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1015. క్రీ.శ. 1084. ఉ. హరి. 4.160.

సం. షోడశ-. పదహారోది, పదహారు ; ప్రా. షోలస-, షోలసిఅ. రసమానవిశేషం ; జై. మహా. షోళస-, పా. షోళస-, సోలసి. పదహారు, ఒకానొక కొలగారం ; అ.మా. సోలస-, సోళస-. పదహారు ; పా. షోళస-. పదహారు ;

కుఇ. సోలలో. పదహారు ; కువి. సాడొ.

<ప్రా. సోలస-.

సోలజొన్న వి. జొన్నలో ఒకరకం. **సోలటికె(-అటికె)** వి. సోలెడు బియ్యంఉడికే మట్టిపాత్ర. **సోలబొక్కెన** వి. పొడుగ్గాఉండే బొక్కెన. **సోలవెల్లి** వి. నైచ్యం, తక్కువ.

బసవ. 97పు. 14పం. సోలవెల్తిగ(జూచు అ.క్రి. తక్కువగా చూచు. బసవ. 4.104. <సోలవెల్తి+అగు+-అ[7]+ చూచు. **సోలుడుకుండ** రూ.చూ. సోలె(డుకుండ. వి. సోలెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర. **సోలె(డు** రూ.సోడు[1]. వి. సోలప్రమాణంకల <సోల+-ఎ(డు. **సోలె(డుకుండ** రూ. సోలుడుకుండ. వి. సోలెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర.

**సోలకము** వి. సముద్రంగాలి.

**సోలగించు** చూ. సోలము.

**సోలగిలు[1]** చూ. సోలము.

**సోలగిలు[2]** చూ. సోలు[1].

**సోల(జేయు** చూ. సోలు[1].

**సోలము** వి. **1**. మదం, మత్తు. కు. సం. 1.90 ; **2**. వివశత్వం, పారవశ్యం. నిర్వ.రా. 8.80 ; **3**. మాంద్యం, అలసత. విక్ర. 1.166 ; **4** సొక్కు. విక్ర. 1.186 ; విణ. మందమయిన. కవిక. 3.164.

సం. శ్రమ-. కష్టం, అలసట, దుఃఖం, బాధ.

**సోలగించు** అ.క్రి. పరవశించు. విప్ర. 2.38. <సోలము+-ఇంచు[3]. **సోలగిలు[1]** అ.క్రి. పరవశం. పొందు. తాళ్ల. సం. 15.14.

**సోలాడు** చూ. సోలు[1].

**సోలి** చూ. సోలు[1].

**సోలిగా(డు** చూ. సోలు[1].

**సోలిగో(చి** చూ. సోలు[1].

**సోలించు** చూ. సోలు[1].

**సోలింత** చూ. సోలు[1].

**సోలింపు** చూ. సోలు[1].

**సోలివ్రాలు** చూ. సోలు[1].

**సోలు[1]** చూ. సొక్కు, సొగయు, సొలయు. అ.క్రి. **1**. వివశత్వంపొందు, పరవశమగు. భార. ఆది. 2.46 ; **2**. వేలాడు. కు.సం. 4.112 ; **3**. ప్రసరించు, వ్యాపించు. వరాహ. 3.96 ; **4**. వాలు, ఒరగు. కవిక. 2.200 ; **5**. నశించు, చెడు. కువ. చ. 2.35 ; **6** ఓడిపోవు ; **7**. చెత్తాచెదారం తీసివేయటాకి మట్టిని జల్లించు; **8**. మెల్లగా వీచు.

క. సోలు. ఓడిపోవు, గౌరవహీనమగు, సోల. ఓడిపోవు[1] సోర్. వదులగు ; కొడ. చొ.వ్. అలసిపోవు ; తు. సొపుని. ఓడిపోబడు, అధిగమించు, సోల. ఓటమి ; త. చోర్. (-వ్-,-న్త్-). వదులగు, జారిపోవు, మూర్ఛపోవు, తోల్. (తోఱ్-ఱ్-). ఓడిపోబడు, తొయ్. మూర్ఛపోవు తొయ్యల్. మూర్ఛపోవటం, చోర్. మూర్ఛపోవు ; మ. చోరుక. అలసిపోవు, తోల్క. ఓడిపోబడు ; కో. చొ.వ్. అలసిపోవు. చోల్. (చోత్-). తక్కువగు, ఓడిపోవు ; తొ. స్వీల్- (స్వీట్-). ఓడిపోబడు, ట్వీల్-. (ట్వీట్-). ఓడిపోబడు ; పో.చూ. త. తొయ్, చోర్.

మూ. ద.ద్రా. *చోల్-/*చోర్-, *చోల్-వ్-, *చొర్-వ్-, *తో-ల్ < *చొయ్-అల్-.

**సోలగిలు[2]** అ.క్రి. **1**. మొక్కు ; **2**. తలవంచు

**సోల(జేయు** స.క్రి. **1**. మాటలతో, చేతలలో ఎదుటివానిని మేలుపుచ్చు, లోబరచుకొను, సోలించు ; **2**. ఓడించు ; **3**. వదులుచేయు ; **4**. ఉబ్బించు, పెద్దదిచేయు. <సోలు. +-అ[7]+ చేయు. **సోలాడు** స.క్రి. వ్యాపించు, హంస. 4.124. <సోలు[1]+ఆడు. **సోలి** వి **1**. వినోదం. అష్టమ. క. 2.83పు. 16పం ; **2**. మైమరపు, తన్మయత్వం. **సోలిగా(డు** వి. అనామకుడు. **సోలిగో(చి** వి. నన్న్యాసులు దండానికి కట్టే పచ్చని గోచిలాంటిగుడ్డ. ద్వి. పరమ. వి. 4.308పు. **సోలించు** స.క్రి. సోలచేయు. రాజవా. 3.114. <సోలు[1]+-ఇంచు[3]. **సోలింత** వి. వివశత్వం చెంది వాలటం. ఉ. హరి. 5.100. **సోలింపు** వి. మైమరపు, వివశత్వం. **సోలివ్రాలు** అ.క్రి. అలసివాలిపోవు. రాధా. 4.103. <సోలు+-ఇ[13]+ వ్రాలు. **సోలు(దనము** (-తనము) వి. మూర్ఛ. పారవశ్యం. విప్ర. 1.72. **సోలుపు[1]** రూ. సోల్పు. వి. మైమరపు, పారవశ్యం. **సోలువట్టు(-పట్టు[2])** అ.క్రి. వివశత్వంచెందివాలు. కవిక. 4.166. **సోల్పు** రూ.చూ. సోలుపు[1]. వి. **1**. మైమరపు, పారవశ్యం ; **2**. గోడమె. వాటి ఒరుపు, తూలు.

**సోలు[2]** వి. **1**. చెక్కలోని గుంటలుపడ్డ భాగం ; **2**. చండాలుడు.

**సోలుడుకుండ** చూ. సోల.

**సోలుదాదు** రూ.చూ. సోల్దాదు. వి. కాలిబంటు, సిపాయి.

**సోలుదారు** రూ. సోల్దారు. అవ్య. వి. యుద్ధభటుడు, సిపాయి. రంగా. చ. 1.147.

ఫ్రెం. సోల్ద. సైనికుడు.

<ఫ్రెం. సోల్ద.

**సోలుపు[2]** వి. **1**. పంక్తి, వరుస ; **2**. రీతి.

**సోలుపుగా** క్రి. విణ. వరసగా.

**సోలె(డు** చూ. సోల.

**సోలె(డుకుండ** చూ. సోల.

**సోలోపు** రూ.చూ. సొల్పు. వి. ఏటవాలు ప్రదేశం.

**సోల్కట్లు** వి. నట్టువకాడు ఆటమొదలైనప్పుడు తధిక్కు తకదైదై అని చెప్పేది. ఇలా. 2.17.

**సోల్జరు** రూ. సోజరు. వి. సైనికుడు.

ఇం. *Soldier*. సైనికుడు.

<ఇం. Soldier.

**సోల్దాదు** రూ. సోలుదాదు. వి. సైనికులు.

పో. సోల్దాదు. సైనికుడు ; స్పా. సోల్దాదో. సిపాయి, సోల్దాదు. జీతాలు, సోల్దాదేరా. సిపాయి అయిన భర్త ననుసరించి పోయే భార్య ; ఫ్రెం. సోల్ద ; డచ్చి. సోల్దాతో.

<పో. సోల్దాదు.

**సోల్దారు** రూ.చూ. సోలుదారు. వి. సిపాయి, కాల్బంటు.

**సోల్పు** చూ. సోలు[1].

**సోళాదొప్పి** రూ. సోళాందొప్పి. వి. ద్యూతవిశేషం. జైమినిభా. 3.42.

హిం. సోలహ్, సోరహ్ ; మరా. సోళా. పదహారు, పదహారవ, ఢోపా. దెబ్బ, కత్తి.

<మరా. సోళాఢోపా.

**సోళాందొప్పి** రూ.చూ. సోళాదొప్పి. వి. ద్యూతవిశేషం.
**సోళి** రూ.చూ. సోల. వి. రంగు కొలుచుకొనే చిన్నపాత్ర.
**సోళు** వి. శూన్యం.
సం. శూన్య-. పట్టిది, ఏమీలేనిది, సత్తారహితం,
**సోవ**[1] రూ.చూ. సోగ[1]. విణ. పొడవైనది.
**సోవ**[2] రూ.చూ. సోగ[2]. వి. చిన్నకొమ్మ.
**సోవతము** వి. ఎర, ఆహారం.
**సోవార్లు** వి.బ.వ. అశ్వసైనికులు.
హిం. సవార్. స్వారీచేసేవాడు, గుర్రపువాడు. ఒక వస్తువు మీద కూర్చోవటం ; ఉ. పార. సవార్. స్వారీ చేసేవాడు, వాహనాన్ని ఎక్కినవాడు, ఓడ, ఒంటె దళం, తగిన, తాగిన మైకంలో ఉండే తురుపు సవారు.
< ఉ. సవార్ + -లు.
**సోస** వి. శోష.
సం. శోష-. ఎండటం, ఇగిరిపోవటం, వాడటం. క్షయ రోగం ; ప్రా. పా. సోస-. ఎండిపోవటం.
< ప్రా. సోస-.
**సోహము** వి. రక్షణకీయవలసిన సొమ్ము. కాళ. 4.53.
సం. సోऽహమ్. అతడే (దేవుడే) నేను అనేవేదాంత భావన. నిజమైన ధనం భగవంతుడే.
< సం. సోऽహమ్ (అర్థవిపరి).
**సౌకండిల్లు(-ఇల్లు)** రూ. సౌకాండిల్లు. వి. చౌకపిల్లు, పొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిట్రాడిల్లు.
**సౌకాకు** చూ. చవుకు చెట్టు. రూ. సవుకాకు. వి. చౌకు చెట్టు ఆకు.
**సౌకాండిల్లు** రూ.చూ. సౌకండిల్లు. వి. చౌకపిల్లు, పొడుగు వెడల్పులు సమానంగా ఉన్న నిట్రాడిల్లు.
**సౌకార్** రూ.చూ. సాహుకారు. వి. వ్యాపారి.
**సౌకారు** రూ.చూ. సాహుకారు. వి. వ్యాపారి.
**సౌకుకంప** వి. సరివికంప.
**సౌకుంచె** వి. పడుగుమీద ఒకవైపునుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతో దువ్వటం.
**సౌకుంచెఈడ్చు** అ.క్రి. పడుగు మీద ఒకవైపు నుంచి మరొకవైపుకు ఆపకుండా కుంచెతో దువ్వు.
**సౌటు** రూ.చూ. సగటు[2]. వి. సరాసరి.
**సౌటం** రూ.చూ. సవుటం. వి. తొలికలుపు, పల్లపు భూమిలో తీసే మొదటి కలుపు.
**సౌడు** రూ.చూ. సవెడు. వి. **1**. నూలు పోగులలెక్క ; **2**. మూడు పోగులదారం ; **3**. నాలుగు పోగుల దారం, కొన్నిచోట్ల పట్టుదారం.
**సౌండు**[1] వి. ఆబోతు.
ఒ. సాండొ. ఆబోతు.
< ఒ. సొండొ.
**సౌండు**[2] వి. ధ్వని, చప్పుడు.
ఇం. *Sound*. ధ్వని.
< ఇం. Sound.
**సౌతు**[1] వి. గ్రామ ఉమ్మడి పనికిరాని వానికి పెట్టేవెలి, ఆంక్ష.
మరా. సౌథ్. ఒకవిధమైనపన్ను.
< మరా. సౌథ్
**సౌతు**[2] వి. గడివిడిచి గడి డిజైను పడేపట్టెమార్పు నేతకు వ్యాపారసంస్థ నిర్ణయించిన నమూనా.
**సౌతుబద్దె** వి. నమూనాబద్దె, తురకల గళ్ళలుంగీలు నేయటానికి నేతపనివాళ్ళకు ఇచ్చే డిజైను.
**సౌదా**[1] వి. సామగ్రి.
హిం. ఉ. సౌదా. సామగ్రి.
< ఉ. సౌదా.
**సౌదా**[2] వి. సొమ్మ, మూర్ఛ.
**సౌదాగర్** రూ.చూ. సౌదాగరు. వి. వ్యాపారి.
**సౌదాగరు** రూ. సవుదాగర్, సవుదాగారు, సౌదాగర్. వి. **1**. గుర్రాల బేరగాడు ; **2**. వర్తకుడు.
హిం. సౌదాగర్ వ్యాపారి : ఉ.పార. సౌదాగర్. సౌదా. వ్యాపారం, వాణిజ్యం, ట్రాఫిక్ ;
త. చవుతాకర్. గుర్రాలడీలరు.
< ఉ. సౌదాగర్.
**సౌపానము** వి. సోపానం, మెట్టు.
సం. సోపాన-. మెట్టు.
< సం. సోపాన-.
**సౌర** రూ.చూ. సవర[3]. వి. ఆరు పోగుల దారం.
**సౌరము** రూ.చూ. సవరము[1]. వి. చమరీమృగం తోక. హంస. 2.145.
**సౌరముగా** వి. ఒక క్రమంలో.
**సౌరు** రూ. సవురు. విణ. మనోజ్ఞం. కాశీ. 1.125 : వి. **1**. చక్కదనం. హంస. 1.137 ; **2**. విధం ; **3**. చుట్టిల్లు, గుండ్రటి ఇల్లు
సం. చారు-. మనోహరమయినది, అందమైనది.
< సం. చారు-.
**సౌరులాడె** చూ. సౌరు. వి. పడుగు పైపోగులకు, కింది పోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చి చేత్తో విసిరేనాడె.
**సౌలక్షగుండు** రూ.చూ. సవలక్షగుండు. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టిదండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.
**సౌశేరులోవి** వి. ఒక్కశేరుబియ్యం ఉడికే మట్టిపాత్ర.
**సౌహృదయము** వి. స్నేహం.
సం.సౌహృద-,సౌహార్ద-. చెలిమి, స్నేహం, సుహృదయ. మంచి హృదయం.
< సం. సౌహృద-.
**సౌహృద్యము** వి. స్నేహం.
సం. సౌహృద-, సౌహార్ద-. చెలిమి, స్నేహం,సుహృదయ-. మంచిహృదయం.
< సం. సౌహృద-.
**స్కాలరు** వి. పండితుడు.
ఇం. *Scholar*. విద్యార్థి, శిష్యుడు, పండితుడు, ఉపకారవేతనం ఇవ్వబడే విద్యార్థి.
< ఇం. Scholar.

స్కాలర్‌షిప్ వి. 1. విద్యార్థికిచ్చే ఉపకారవేతనం ; 2. పాండిత్యం.

ఇం. *Scholarship*. విద్య, చదువు, పాండిత్యం, విద్యార్థికిచ్చే ఉపకారవేతనం.

< ఇం. Scholarship.

స్కీము వి. 1.పద్ధతి ; 2. పథకం.

ఇం. *Scheme*. పథకం, ఉపాయం, యుక్తి.

< ఇం. Scheme.

స్కూటరు వి. వేగంగా పోయే రెండు చక్రాలుకల ప్రధానంగా పెట్రోలుతో నడిచే వాహన విశేషం.

ఇం. *Scooter*. పరుగెత్తేది, ద్విచక్రవాహన విశేషం.

< ఇం. Scooter.

స్కూలు వి. బడి, పాఠశాల.

ఇం. *School*. పాఠశాల, పిల్లలబడి, శిష్యబృందం, సమూహం, సంప్రదాయం,దర్శనం;

< ఇం. School.

స్కేటింగు వి. పాదాలకింద ఇనపచక్రాలతో కూడిన సాధన విశేషంతో గడ్డకట్టిన మంచుపై వేగంగా జారుతూ పోయే క్రీడా విశేషం.

ఇం. *Skating*. అడుగుల కిందభాగంలో ఇనప చక్రాలతో కూడిన సాధనవిశేషంతో గడ్డకట్టిన మంచుపై వేగంగా జారుతూ పోయే క్రీడా విశేషం.

ఇం. Skating.

స్కేలు వి. 1. కొలత ; 2. కొలబద్ద.

ఇం. *Scale*. త్రాసు, తక్కెడ, త్రాసుసిబ్బి, పొర, నిచ్చెన, శ్రేణి, కొలబద్ద.

< ఇం. Scale.

స్కోపు వి. అవకాశం.

ఇం. *Scope*. ఉద్దేశం, అభిప్రాయం, అవకాశం, ఎడము.

< ఇం. Scope.

స్కోరు వి. 1. ఇరవై ; 2. ఆటలోని లెక్క.

ఇం. *Score*. గీటు, గుర్తు, పాటాగుర్తు, ఇచ్చిపుచ్చుకొనేగుర్తు, బాకీ, కారణం, హేతువు, ఇరవై.

< ఇం. Score.

స్కౌటు వి. పౌరశిక్షకుడు.

ఇం. *Scout*. చారుడు, వేగుచూచేవ్యక్తి.

< ఇం. Scout.

స్క్రిప్టు వి. రాతప్రతి.

ఇం. *Script*. చేతిరాతలాగా ఉండే అక్షరాలు.

< ఇం. Script.

స్క్రూ వి. తిరుగుడు మేకు, మరమేకు.

ఇం. *Screw*. మరమేకు., చీల.

< ఇం. Screw.

స్క్రూటినీ వి. బాగా పరిశీలించటం.

ఇం. *Scrutiny*. సూక్ష్మపరిశీలన, పరిశోధన.

< ఇం. Scrutiny.

స్టాకు వి. నిలవ.

ఇం. *Stock*. చెట్టుబోదె, ముఖ్యభాగం, స్తంభం, వంశం, మూలధనం, రాశి.

< ఇం. Stock.

స్టాఫు వి. ఉద్యోగుల గుంపు.

ఇం. *Staff*. కచేరీ మొ. వాటిలోని ఉద్యోగుల సముదాయం.

< ఇం. Staff.

స్టాంపు వి. 1. తపాలాబిళ్ళ ; 2. ముద్ర.

ఇం. *Stamp*. ముద్ర, సికా, గుర్తు, ముద్రవేయటం, ముద్రకాగితం, గుణం, రకం.

< ఇం. Stamp.

స్టారు వి. 1. నక్షత్రం, 2. సినిమా తార.

ఇం. *Star*. నక్షత్రం, చుక్క, నక్షత్రాకారపుగుర్తు, ఒకని గ్రహస్థితి.

< ఇం. Star,

స్టార్టు 1. వి. బయలుదేరటం ; 2. కదలిక.

ఇం. *Start*. అదరు, బెదరు, బయల్దేరటం, నిర్గమనం.

స్టాలు వి. కొట్టు, దుకాణం.

ఇం. *Stall*. అంగడి, దుకాణం, కొట్టం, లాయం, కొట్టంలో ఒకోజంతువును కట్టేచోటు.

< ఇం. Stall.

స్టిఫ్ విశే. 1. బిరుసయినది ; 2. గట్టి.

ఇం. *Stiff*. బిరుసైన, గట్టి, వంగని.

< ఇం. Stiff.

స్టీప్ వి. నిట్టనిలువు.

ఇం. *Steep*. నిట్రమయిన, నిలువుగాఉన్న, నిట్రమైన కొండ మొ. వాటిస్థలం.

< ఇం. Steep.

స్టీమరు. వి. పొగఓడ.

ఇం. *Steamer*. పొగఓడ.

< ఇం. Steamer.

స్టూడియో వి. కళాకారులు బొమ్మలు మొ. వాటిని వేయటానికి లేదా తీయటానికి ఉపయోగించేచోటు.

ఇం. *Studio*. చిత్రాలుగీయటం మొ. పనులు చేయటానికి ఉపయోగించే స్థలం.

< ఇం. Studio.

స్టూడెంటు వి. 1. విద్యార్థి : 2. విద్యార్థిని.

ఇం. *Student*. చదువుకొనే వ్యక్తి.

ఇం. Student.

స్టూల్‌సైడుకెళ్ళు అ క్రి. దొడ్డికివెళ్ళు

ఇం. *Stool*. ముక్కాలిపీట, చేకాలిపీట, మరుగుదొడ్డిలో ఉండేబల్ల, *Side*. వైపు, పక్క.

< ఇం. Stool. + ఇం. Side + - కున్ + వెళ్ళు.

స్టెప్ వి. 1. అడుగు, పాదం ; 2. ఉపాయం ; 3. జాగ్రత్త చర్య.

ఇం. *Step*. అడుగు, అంగ. అడుగుచప్పుడు, నడక, రీతి, తరగతి, అభివృద్ధి, ఉపాయం.

<ఇం. Step.

స్టెప్పల్ రూ. డెబల్, టేబిల్, స్టైబల్. వి. 1. కృత్రిమపు పట్టు ; 2. నూలు కలిసిన ఒకరకం దారం, దీనిపోగు మెత్తగా మెరుస్తూ ఉంటుంది.

ఇం. *Staple*. ఒకదేశంలోని ముఖ్యమైన సరుకు, ప్రధానమైన వర్తకం వస్తువు.

<ఇం. Staple.

స్టైబల్ రూ.చూ. స్టెప్పల్. వి. 1. కృత్రిమపుపట్టు ; 2. నూలుకలిపిన ఒకరకం దారం.

స్టేజి వి. 1. రంగస్థలం ; 2. అంతస్తు ; 3. దశ ; 4. వేదిక.

ఇం. *Stage*. రంగస్థలం, వేదిక. అంతస్తు, దశ, మజిలీ.

<ఇం. Stage.

స్టేండు వి. 1. బళ్ళు, బస్సులు మొ. వి నిలిచే చోటు ; 2. ఏదైనా వస్తువును పెట్టుకొనే చట్రం మొ. ది.

ఇం. *Stand*. నిలుపు, ఆపు, బళ్ళు మొ. వి నిలిచే చోటు, వసతి అయినస్థలం, ఏదైనా ఉండే చట్రం.

<ఇం. Stand.

స్టేండుగోలెం వి. చిన్నపూలతొట్టి పెట్టటానికి చేసిన స్టేండులో పెట్టే చిన్నతొట్టి.

స్టేషను వి. 1. రైలుమొ. వి ఉండేతావు ; 2. (పోలీసులు) ఉండేతావు.

ఇం. *Station*. స్థానం, స్థలం, స్థితి, చౌకీ, ఠాణా,

<ఇం. Station.

స్టైలు వి. శైలి.

ఇం. *Style*. శైలి, శయ్య, పదుగుంఫనం, రీతి, విధి.

స్టోరీ వి. కథ.

ఇం. *Story*. వృత్తాంతం, చరిత్ర, కథ.

<ఇం. Story.

స్టౌ వి. వంట వండుకోవటానికి కిరోసిన్, గాస్ మొ. వాటిని ఉపయోగించి వాడుకొనే ఇనుప పొయ్యి.

ఇం. *Stove*. ఇనుపపొయ్యి.

<ఇం. Stove.

స్ట్రయికు రూ.చూ. స్ట్రైకు. వి. సమ్మె.

స్ట్రైకు రూ. స్ట్రయికు. వి సమ్మె.

ఇం. *Strike*. పనివాళ్ళు పనికిపోకుండా చేసుకొనే కట్టుబాటు.

<ఇం. Strike.

స్తంబం రూ. తంబం, తమ్మం. థంబం, సంబం, స్తంభం. వి. 1. పిల్లరు, ఇటుకతో రాళ్ళతో కట్టికాని కొయ్యతోచేసి కాని నిటారుగా నిలిపి పైనున్న వస్తువులకు ఆధారంగా వాడబడే సన్నటి పొడుగాటి నిర్మాణం ; 2. ఆములో రెండుపొయ్యిలకు మధ్య పెట్టేరాయి లేదా రాతికట్టడం ; 3. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; 4. మరాను ఇరుసును మోసే పొడుగుకొయ్య ; 5. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతినకొయ్యరాట ; 6. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె ; 7. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

సం. స్తంభ -. గుంజ. కంబం, పడినమాను, అడ్డు పాటు, ఆధారం. మొద్దు.

<సం. స్తంభ -.

స్తంబంపూజ వి. కంబు స్తంభానికి చేసేపూజ.

సం. స్తంభ-. గుంజ, కంబం, పూజా. అర్చించటం, అర్చన.

<సం. స్తంభ- + సం. పూజా.

స్తంబంబల్ల వి. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువు కొయ్య.

సం. స్తంభ-. గుంజ, కంబం.

<సం. స్తంభ- + -ము + బల్ల.

స్తంబాలరాటి వి. ఒకరకం రాటి.

సం. స్తంభ -. కంబం, గుంజ.

<సం. స్తంభ- + -ము + -లు + -అ[13] + రాటి.

స్తంబాళము వి. పళ్ళెం.

స్తంభం రూ.చూ. స్తంబం, వి. 1. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; 2. మరాను ఇరుసును మోసే పొడుగుకొయ్య ; 3. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట ; 4. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె ; 5. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట ; 6. పిల్లరు, ఇటుకతో రాళ్ళతో కట్టి కాని కొయ్యతో చేసికాని నిటారుగా నిలిపి పైనున్న వస్తువులకు ఆధారంగా వాడబడే సన్నటి పొడుగాటి నిర్మాణం.

స్తలసుంఖకటనము వి. దేవాలయానికి చెల్లించవలసిన సుంకం, కానుక. ద.హిం.శా. సంపు. 7. శా.సం. 573.

సం. స్థల -. చోటు, తావు.

<సం. స్థల- + సుంకము + కట్నము.

స్తితి వి. అంతస్తు, పరిస్థితి మొ. వి. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 598. క్రీ.శ. 925-50.

సం. స్థితి -. ఉనికి, కూర్చోవటం, మర్యాద. బతుకు, నిలకడ.

<సం. స్థితి-.

స్థరం రూ.చూ. స్తలం. వి. తావు, ప్రదేశం, ఆవరణ.

స్థలం రూ. స్థరం. వి. 1. ఆవరణ : 2. తావు, ప్రదేశం.

సం. స్థల -. చోటు, మెట్టభూమి, జలశూన్యమై సహజంగా చదరమైననేల, తీరం, దిబ్బ, క్షేత్రం, చర్చ నీయాంశం, శిబిరం, గ్రంథాదులలోని భాగం.

<సం. స్థల -. (అర్థవిపరి.).

స్థానమాన్యాలు వి.బ.వ. దేవస్థాన మాన్యాలు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 936. క్రీ.శ. 1531.

సం. స్థాన -. చోటు.

<సం. స్థాన- + మాన్యము + -లు.

స్థానము వి. పట్టణం.

సం. స్థాన -. చోటు, ఇల్లు, ఉనికి.

<సం. స్థాన -. (అర్థవిపరి.).

**స్థానసమ్మతి** వి. స్థానంవారి అనుమతి. ద.హిం.శా. సంపు. 5, శా.సం. 34. క్రీ.శ. 1434.

సం. స్థాన -. చోటు, ఇల్లు, ఉనికి, సమ్మతి -. అంగీకారం.

<సం. స్థానసమ్మతి -. (అర్థవిపరి.).

**స్థానాచార్యులు** వి.బ.వ. స్థానపతి. స్థానికాధికారి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1164. క్రీ.శ. 1647.

సం. స్థానాచార్య ,,. ప్రదేశంలోని ఆచార్యులు.

<సం. స్థానాచార్య-+-లు (అర్థవిపరి.).

**స్థానాపతి** వి. స్థానికుడైన అధికారి. E. 1. 24.35.

సం. స్థానాపతి -. మధ్యవర్తి, దూత.

<సం. స్థానాపతి (అర్థవిపరి.).

**స్థానావంతులు** వి.బ.వ. స్థానపతులు. నె.శా. పొదిలి. 9. క్రీ.శ. 1257.

సం. స్థానవత్. ప్రదేశం కలవాడు.

<సం. స్థానవత్+-లు. (అర్థవిపరి.).

**స్థానికుడు** వి. గుడి పారుపత్తెకాడు. నె.శా. ఒంగోలు. 67.

సం. స్థానిక-. స్థానాధ్యక్షుడు, ప్రదేశంలో ఉండేవాడు.

<సం. స్థానిక- (అర్థవిపరి.).

**స్థాంబాలం** రూ. తాంబోళం. వి. దసలికాయలు మొ. వాటిని పోసే పెద్ద ఇత్తడి పళ్ళెం.

**స్థావరంమడి** వి. ఇల్లు, వాకిలి, దొడ్డి మొ. వాటికిచ్చిన పరాధీనం చేయవీలుకాని భూమి. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 280. క్రీశ. 1556.

**స్థాహి** వి. స్థాయి, స్థిరం. నిలకడ. ద.హిం.శా. సంపు 5. శా.సం. 1194. క్రీ.శ. 1455.

సం. స్థాయిన్. నిలకడ అయినది, స్థిరమైనది, మారనిది.

<సం. స్థాయిన్.

**స్థితిమంతుడు** వి. బాగా డబ్బున్నవాడు.

సం. స్థితిమత్, స్థిరత్వకల, శాశ్వతమైనది.

<సం. స్థితిమత్ (అర్థవిపరి.).

**స్థిరపడు** చూ. స్థిరము.

**స్థిరపఱచు** చూ. స్థిరము.

**స్థిరము** విణ. నిశ్చయం.

సం. స్థిర- కదలనిది, నిలకడ అయినది, శాశ్వతమైనది, బలమైనది, నిశ్చితమయినది.

<సం. స్థిర- (అర్థవిపరి.).

**స్థిరపడు** అ.క్రి. కుదురుకొను. **స్థిరపఱచు** స.క్రి. కుదుర్చు, నిశ్చయం చేయు.

**స్న** రూ.చూ. సన. వి. సంవత్సరం. నె.శా. శా్రమ. 4. క్రీ.శ. 1746.

**స్నానగది** వి. స్నానాలగది, స్నానం చేసేగది.

సం. స్నాన-. నీళ్ళుపోసుకోవటం, నీళ్ళలో మునగటం. స్నానయోగ్య జలం, నలుగుపిండి.

<సం. స్నాన-+గది (మిశ్రన.).

**స్పాష్ట్యనము** వి. నిబంధం, నె.శా. రాపూరు. 49. క్రీ.శ. 1637.

**స్పిరిట్‌లెవెలు** రూ.చూ. సిరిట్ లెవలు. వి. మట్టం సరి చూడటానికి తాపీపనివాళ్ళు వాడే చిన్న పరికరం.

**స్పేరితుసాంతు** వి. పరిశుద్ధాత్మ.

పో. సాంక్తస్పిరితి. సత్పురుషుడు, సాంక్తుడు. మహాపురుషుడు అనే వాడుకలు కలవు.

<పో. సాంక్తస్పిరితి.

**స్పూను** వి. చెమ్చా.

ఇం. *Spoon*. గరిటె, చెమ్చా.

<ఇం. Spoon.

**స్పోర్టు** వి. 1. ఆట ; 2. నవ్వులాట.

ఇం. *Sport*. ఆట, క్రీడ, వినోదం, నవ్వులాట.

<ఇం. Sport.

**స్పోర్ట్స్** వి. ఆటలు.

ఇం. *Sports*. ఆటలు, వినోదాలు.

<ఇం. Sports.

**స్ప్రింగు** వి. జోరుతీగ.

ఇం. *Spring*. కమాను, జోరుతీగ, వసంత రుతువు, ఊట.

<ఇం. Spring.

**స్యాదతు** వి. ఆధిక్యత, గొప్పతనం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 759. క్రీ.శ. 1663.

ఉ. సియాదత్.హిం. ఉ. పార. సియాదత్.

**స్రగ్గు** చూ. తగ్గు. రూ. సగ్గు[1]. అ.క్రి. 1. అడగు. నిర్వ. రా. 9.75 ; 2. తగ్గు. పారి. 2.30.

<మూ.ద్రా. *సర్-వ్.

**స్రావణము** రూ.చూ. శ్రావణము. వి. 1. కంసాలి సాధనాల్లో ఒకటి ; 2. సేనం, రాతిని ముక్కలుగా కొట్టటానికి నునుపు చేయటానికి పనికి వచ్చే పరికరం.

**స్రావి** రూ.చూ. సరవి[1]. వి. 1. క్రమం ; 2. మార్గం.

**స్రాహి** వి. సంవత్సరం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 702. క్రీ.శ. 1149.

**స్రుక్కజేయు** చూ. స్రుక్కు.

**స్రుక్కబడు** చూ. స్రుక్కు.

**స్రుక్కించు** చూ. స్రుక్కు.

**స్రుక్కు** చూ, సురుగు. రూ. సుక్కు. అ.క్రి. 1. సొలుచు. కు.సం. 2.81 ; 2. వెనుదీయు. నిర్వ.రా. 5.122 ; 3. భయపడు. నిర్వ.రా. 7.12 ; 4. సంకోచించు. భార. విరా. 1.303 ; 5. మూర్ఛిల్లు. భార. ద్రోణ. 2.32 ; 6. వాడు, మ్లానమగు. హరి. పూ. 7.51 ; 7. చింతించు. శృం.నై. 4.104 ; 8. తగ్గు. భోజ. 1.101 ; 9. ముడుగు. భోజ. 1.132 ; 10. మడతపడు. భోజ. 6.169 ; 11. చుట్టుకొను. ఆము. 5 ; 12. దుఃఖించు. పారి. 1.16 ; వి. 1. చిక్కు, ముడులు పడటం. భార. విరా. 4.46 ; 2. దుఃఖం, శోకం. భార. శాంతి. 2.233 ; 3. కార్శ్యం. మను. 4.59 ; 4. వళి, కడుపు మీది మడత. నీలా. 2,17 ; 5. అధైర్యం.

క. సుర్క్. సుక్క్. ముడుచుకొని పోవటం, సంకోచించటం, వాడి పోవు ; తు. సిర్కు. బలహీనం, మడతలు పడటం, సిర్కుని. వాడిపోవు, బలహీనమగు ; త. చురుంకు. కుంగిపోవు, తగ్గిపోవు, చురుక్కు. తగ్గిపోవు ; మ. చురుణ్ణక. ముడతలుపడు, తగ్గిపోవు, చురుక్కుక. ముడుచుకొనిపోవు, తగ్గిపోవు ; గోం. సూర్. ఎండిపోయిన జనపనార కాడలు ; పర్జి. చుర్క్ -. వాడి పోవటం, బుగ్గలు లోపలికి పోవు ; పో.చూ. కొలా. సుక్ -. వాడిపోవు.

మూ.ద.ద్రా. & మూ.మ.ద్రా. *చుర్ - ఉంక్-/*చుర్-ఉక్క్-.

స్రుక్కచేయు స.క్రి. స్రుక్కించు, స్రుక్కేట్లు చేయు. భార. ద్రోణ. 3.223 <స్రుక్కు+-అ[7]+చేయు. స్రుక్కబడు అ.క్రి. శోకించు, దుఃఖించు. భార. విరా. 1.133. <స్రుక్కు+-అ[7]+పడు. స్రుక్కించు స.క్రి. స్రుక్కచేయు. భార. ద్రోణ. 4.9. <స్రుక్కు+-ఇంచు[3]. స్రుక్కులు వి.బ.వ. కడుపుమీది మడతలు. స్రుక్కుళ్లు రూ.చూ. సుక్కుళ్లు. వి.బ.వ. మడతలు.

స్లాపు రూ.చూ. శ్లాబు. వి. పదతరం, సిమ్మెంటు పోత పోసి తయారు చేసిన కప్పు.

స్లేటు వి, పలక.
  ఇం. *Slate*. పలక.
  <ఇం. Slate.

స్లేట్‌కలర్ రూ. సిలేటు కలర్. వి. బలపం. రాయిరంగు.
  ఇం. *Slate Colour*. పలకరంగు.
  <ఇం. Slate Colour.

స్లేంటింగ్ వి. ఏటవాలు.
  ఇం. *Slanting*. ఏటవాలైనది.
  <ఇం. Slanting.

స్లేబు రూ.చూ. శ్లాబు. వి. పదతరం, సిమెంటుపోత పోసి తయారు చేసిన కప్పు.

స్లేంపు రూ.చూ, శ్లాబు. వి. పదతరం, సిమెంటుపోత పోసి తయారుచేసిన కప్పు.

స్లోపు రూ.చూ. సొల్పు[1]. వి. వాటం.
  స్లోపురాయి వి. ఒకవైపుకు వాలిపోతున్నట్లు అమర్చిన రాయి.

స్వతహా అవ్య. నిసర్గంగా, సహజంగా.
  నం. స్వతః. తనంతటతాను.
  <నం. స్వతః.

స్వదేశంఅంచు రూ. సుదేసెం అంచు. వి. లోపలి అంచు అయిదు కొలుకులు తెలుపు, అయిదు కొలుకులు పది పదిహేను కొలుకులు గోటు, అయిదు కొలుకులు రంగు, తరవాత చిగురు చొప్పున వరసగా వచ్చేట్టు నేసిన అంచు.
  నం. స్వదేశ-. తనదేశం.
  <నం. స్వదేశ-+-ము+అంచు[3].

స్వదేశంచీర వి. రెండురంగుల్లో పదేసి కొలుకులు పెట్టినేసిన చీర.
  నం. స్వదేశ-. తనదేశం.
  <నం. స్వదేశ-+-ము+చీర.

స్వదేశిబేహారులు వి. బ. వ. దేశస్థులైన వర్తకులు.
  నం. స్వదేశిన్. తనదేశానికి చెందిన.
  <నం. స్వదేశిన్+బేహారి+-లు (మిశ్రస.).

స్వప్నసుందరిపేటు వి. అంచులో పిందెలు, ఆకులు గొలుసు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. 'స్వప్నసుందరి' అనే సినిమాను బట్టి వచ్చినపదం.

స్వరూపాలు వి.బ వ. ఇంటికట్టుబడిలో వాడే కిటికీలు, దర్వాజాలు మొ. వాటిమొత్తం
  నం. స్వరూప-. తనరూపం.
  <నం. స్వరూప-+-ము+-లు.

స్వర్గంబాట రూ. సొరగంబాట. వి. పాలబాట, ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి మెరుస్తూ ఉండే చుక్కలబారు.
  నం. స్వర్గ-. నాకం, దేవలోకం.
  <నం. స్వర్గ-+-ము+బాట.

స్వర్ణసంబావులు రూ. స్వర్ణసాంబావులు. వి. బ. వ. రెండో పంటగా వేసే తెలికరకం ధాన్యం, 'కిచిడీ సాంబా'కు కూడా ఈపేరు వాడతారు.
  నం. స్వర్ణ-. బంగారం.
  <నం. స్వర్ణ-+సంబావులు (మిశ్రస.).

స్వర్ణసాంబావులు రూ.చూ. స్వర్ణసంబవులు. వి బ వ. ఒకరకం వడ్లు.

స్వస్తిక్‌పేటి రూ.చూ. స్వస్తిక్‌పేటు. వి. అంచులో రంగులో నేసిన స్వస్తిక డిజైను.

స్వస్తిక్‌పేటు రూ. స్వస్తిక్‌పేటి. వి. అంచులో రంగులో నేసిన స్వస్తిక డిజైను.
  హిం. స్వస్తిక్. ఇదొక చిహ్నం.
  <హిం. స్వస్తిక్+పేటు[3].

స్వస్త్య వి. స్వాస్త్యం. ద.హిం శా. సంపు. 7. శా. సం. 569. క్రీ.శ. 1580.
  నం. స్వాస్థ్య-. స్వస్థత, ప్రసాదం, స్థిరత్వం, ఆత్మవిశ్వాసం, తృప్తి, ఆరోగ్యస్థితి.
  <నం. స్వాస్థ్య-.

స్వాతి వి. కార్తీకమాసం (అక్టోబరు చివరిభాగం)లో వచ్చే కార్తె.
  నం. స్వాతి-, స్వాతీ. సంజ్ఞాదేవి, ఒకానొక నక్షత్రం, ఖడ్గం.
  <నం. స్వాతి- (అర్థవిపరి.).
  స్వాతికొంగ వి. స్వాతికార్తెలో వచ్చి వరిచేలల్లో వాలి ఉండే తెల్లటి జాతికొంగ. ఇది జనవరితో ఎక్కడికో ఎగిరి పోతుంది. కోకిల, ఆరేటిబాతు, నీరుకాకి మొ. జలపక్షుల్లా ఇది రుతువును బట్టి దేశాంతరాలకు ఎగిరిపోయి తిరిగివచ్చే పక్షిజాతికి సంబంధించింది (Climate Changing Bird).

స్వాధీనాదుమానము వి. భూమిని అదుమాన (తాకట్టు) పెట్టి తనఖా డబ్బు తీసుకొని, రుణం తీరేవరకు రుణదాత స్వాధీనంలో ఆస్తిని ఉంచే పద్ధతి, తీరుభోగ్యం.
  నం. స్వాధీన-. స్వవశమయినది.

స్వామదారు వి. యజమాని, సొంతదారు.

ఉ. పార. స్వాన్‌దార్. యజమాని,
త. చువాన్-తార్.
<ఉ. స్వాన్‌దార్.

స్వారి యా.చూ. అసివారు. వి. 1. వాహ్యాళి. విహారం. ఉ.రా. 1; 2. గుర్రపు సవారి.

స్వారీ రూ.చూ. అసివారు. వి. 1. వాహ్యాళి. విహారం; 2. గుర్రపు సవారి.

స్వాస వి. ఆశ.
సం. స్వాశా. ఎక్కువ ఆశ.
<సం. స్వాశా.

స్విచ్చి వి. విద్యుత్ప్రవాహ నియామక సాధన విశేషం.
ఇం. *Switch*. వంగేచువ్వ, చిన్నకొయ్య, విద్యుత్ప్రవాహ నియామక సాధన విశేషం.
<ఇం. Switch.

స్విచ్చిబోర్డు వి. స్విచ్చి లేదా స్విచ్చులున్న గోడ మొ. వాటికి అమర్చబడే బల్ల.
ఇం. *Switch - Board*. స్విచ్చి లేదా స్విచ్చులున్న బోర్డు.
<ఇం. Switch - board.

స్విమ్మింగు వి. ఈత.
ఇం. *Swimming*. ఈదటం, ఈత.
<ఇం. Swimming.

స్విమ్మింగ్‌పూల్ వి. ఈతకొలను, ఈదటానికి వీలుగా ఏర్పాటు చేసిన అల్ప జలాశయం.
ఇం. *Swimming Pool*. అల్ప జలాశయం, నీటి మడుగు, ఈదటానికి వీలుగా ఏర్పరచిన నీటికొలను.
<ఇం. Swimming Pool.

స్వొస్థ వి. చౌక.
ఒ. సొస్థ-. చౌక.
<ఒ. సొస్థ.

హ వి. కంఠ్యోష్మ నాద మహాప్రాణ వర్ణం.

హంవీర రూ.చూ. హంబీర. వి. 1. బిరుదు. యామినీ. 6.172, ద.హిం.శా. సంపు. 6. శా.సం. 248. క్రీ.శ. 1515; 2. శూరులు కట్టుకునే తాయెతు. ప్రబంధ. 605; 3. రాగవిశేషం.
హంవీరతాయెతు వి. 1. శూరత్వానికి చిహ్నమైన అలంకార విశేషం. చంద్రాంగ. 5.124; 2. ఒకరకం ఆభరణం. హంస. 5.356. హంవీరనాట వి. రాగవిశేషం (సంగీతంలోని ముప్పై రెండు నపుంసకరాగాల్లో ఒకరాగ). ప్రబంధ. 97.

హంవీరు(డు రూ.చూ. అమీరు. వి. 1. శూరుడు. శశా. 5.72; 2. పుంజుపేరు. హంస. 3.21.

హంష వి. ఇంటిమీద అలంకారంగా పెట్టటానికి మట్టితో చేసిన హంస.
సం. హంస-. ఒకపక్షి.
<సం. హంస-.

హంసకళీలు వి. బ. వ. భక్ష్యవిశేషం. ద.హిం. శా. సం. 6.695. క్రీ.శ. 1519.
సం. హంస.- ఒకపక్షి.

హంసకూజా రూ. అంసకూజా. వి. హంస ఆకారంలాగ చేసిన నీళ్ళకూజా.
సం. హంస-. పక్షివిశేషం.
<సం. హంస-+కూజా.

హంసతీగెపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను.
సం. హంస-. పక్షివిశేషం.
<సం. హంస-+తీగె+పేటు³.

హంసనత్తు వి. హంస ఆకారంలో చేసి కింద ముత్యాలు వేలాడ గట్టిన నగ.
సం. హంస-. పక్షివిశేషం.
<సం. హంస-+నత్తు.

హంసపాదాకు చూ. హంసపాది.

హంసపాది వి. ఒకానొక చిన్నచెట్టు. హంస. 4.10.
హంసపాదాకు వి. మెత్తటి ఆకులు, తెల్లటి పూలుగల అల్లుడుతీగ. (Vifis Pedafa). <హంసపాది+ఆకు.

హంసపాదు వి. 1. బావిగోడ: 2. బావిమీద గిలక పెట్టే అడ్డదూలం; 3. ఉయ్యాలలాగా ఉండే బావిదగ్గరి కొయ్య చట్రం; 4. గుంజలమీద అడ్డవాసాలను నిలపటానికి వీలుగా పీటలాగ తగిలించిన కొయ్యముక్క; 5. దబ్బా రాట్నం ఇరుసు బిగించిన నిలుపుకొయ్య; 6. అధ్యాహారం, హంసపాదం.
సం. హంసపాద-. హంసయొక్క కాలు.
<సం. హంసపాద-.
హంసపాదుబావి రూ. అమనపాదు బాయి. వి. బావిగోడ లకుపక్కన దిమ్మలకు బదులు కర్రచట్రాలు వేసి గిలక బిగించిన ఉయ్యాలలాగా ఉండేబావి.

హంసపేటు రూ.చూ. హంసపేటె. వి. అంచులు హంసల ఆకారంలో పడేట్టు నేసిన డిజైను.

హంసపేటె రూ. అంసపేటె, అమనపేటె, హంసపేటు.వి. అంచులు హంసల ఆకారంలో పడేట్టు నేసిన డిజైను.
సం. హంస-. పక్షివిశేషం
<సం. హంస-+పేటె.
హంసపేటెచీర వి. అంచులో హంస డిజైన్లు వచ్చేట్టు నేసినచీర.

హంసబేలు వి. రెండాకులు, తీగ, హంస వరసగా పడేట్టు నేసిన డిజైను.
సం. హంస. పక్షివిశేషం.
<సం. హంస-+బేలు.

హంసబోర్డరు వి. హంస ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు.
సం. హంస-. పక్షివిశేషం;
ఇం. *Boarder*. అంచు.
<సం. హంస-+ఇం. Boarder.

హంసరాజు వి. ఒకరకం నేతడిజైను
సం. హంస-. పక్షివిశేషం, రాజన్. రాజు.
<సం. హంసరాజ-. (అర్థవిపరి.)

హంసలంచు రూ. అంసలంచు, అమనలంచు. వి. హంస

ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు.

సం. హంస-. పక్షివిశేషం.

<సం. హంస-+-లు+-అ[13]+అంచు[3].

**హంసలపేటు** రూ. హంసలప్లేటు. వి. అంచులో హంస ఆకారంలో బొమ్మలు పడేట్టు నేసిన డిజైను.

సం. హంస-. పక్షివిశేషం.

<సం. హంస-+-లు+-అ[13]+పేటు.

**హంసలప్లేటు** రూ.చూ. హంసలపేటు. వి. అంచులో హంస ఆకారంలో బొమ్మలు పడేట్టు నేసిన డిజైను.

**హంసవల్లి** వి.బ.వ. వస్త్రవిశేషం. ప్రబంధ. 272.

సం. హంస-. పక్షివిశేషం.

<సం. హంస-+-వడి+లు.

**హంసాయి** వి. 1. ఇరుగుపొరుగు వాడు; 2. పెత్తనం కలిగి ఉండటం; 3. సరిహద్దు దారు.

హిం. హమ్‌సాయా. ఇరుగుపొరుగు వాడు; ఉ. హమ్‌సాయహ్; పార. హమ్‌సాయహ్;

త. హంచాయి.

<ఉ. హమ్‌సాయహ్.

**హంసావళి** వి. వస్త్రవిశేషం. ద్వి. భార. విరా. 596ప.

**హకాడా** వి. పన్నెండుండెల బిగింపుకు దారాలు కట్టిన జంత్రం నిలుపుకొయ్య.

**హకిం** రూ.చూ. హకీం. వి. వైద్యుడు.

**హకీం** రూ. హకిం, హకీము, హక్కీం, హాకీము. వి. వైద్యుడు.

హిం. హకీమ్. జ్ఞాని, యూనానీ విధానాన్ని అనుసరించే వైద్యుడు; ఉ. హకీమ్; అర. హకీమ్. సన్యాసి, వేదాంతి, డాక్టరు, చికిత్సకుడు;

క. హకీమ; త. హకీమ్; మ. హకీమ్.

<ఉ. హకీమ్.

**హకీకత్తు** రూ. హకీఖత్తు. వి. 1. వృత్తాంతం, కథనం, వివరం; 2. వ్యవహారాలు సంఘటనలు.

హిం. ఉ. హకీకత్. వాస్తవం, యథార్థం.

<ఉ. హకీకత్.

**హకీఖత్తు** రూ.చూ. హకీకత్తు. వి. వృత్తాంతం.

**హకీము** రూ.చూ. హకీం. వి. వైద్యుడు.

**హక్కసు** రూ.చూ. అక్కసము[2]. వి. పగ.

**హక్కస్సు** రూ.చూ. అక్కసము[2]. వి. 1. పగ; 2. కోపం,

**హక్కీం** రూ.చూ. హకీం. వి. వైద్యుడు.

**హక్కు** రూ. హాక్కు. వి. 1. సొంతం; 2. బాధ్యత; 3. స్వామ్యం, అధికారం.

హిం. హక్. తగిన, సరైన, అధికారం, ధర్మమైన. న్యాయమైన, న్యాయం, సమర్థత, కర్తవ్యం, సత్యం; ఉ. అర. హక్క్. న్యాయం, నిజమైన, న్యాయమైన, మొత్తం, భాగం, దేవత, సమానత, అధికారం, స్వత్వం;

క. హక్కు. అధికారం, బిరుదు, సత్యం, న్యాయం, రివిన్యూ మొ. వాటిలో రావలసిన భాగం, చట్టబద్ధమైన అధికారం;

త. అక్కు. ఒకవిధమైన వ్యాపారం.

<ఉ. హక్క్.

**హక్కుదారు** రూ.చూ. హక్కుదారు(డు. వి. ఆస్తికర్త. బాధ్యతకలవాడు, స్వామ్యం కలవాడు. **హక్కుకాయి** వి. తోటిహక్కుదారుడు.

**హక్కుదారు(డు** రూ. హక్కుదారు. వి. హక్కు కలిగిన వాడు.

హిం. హక్‌దార్. యజమాని, సొంతదారు, హక్కు గలవాడు; ఉ. అర. హక్క్. పార. దార్. మతుబ్ ప్రత్యయం;

క. హక్కుదార. హక్కుగలవాడు, భాగస్వామ్యం గలవాడు; త. అక్కుతార్.

<ఉ. హక్క్+పార.- దార్.

**హంకరించు** అ.క్రి. గర్వించు, అభిమానంవహించు.

సం. అహంకృ-. గర్వించు, అహంకరించు.

<సం. అహంకృ-+-ఇంచు[3].

**హంకారము** వి. అభిమానం, అహంకారం. చంద్రాం... 2.10.

సం. అహంకార-. గర్వం, క్రోధం; ప్రా.పా, అహంకార-. గర్వం; అ. మా. హంకార-;

క. హంకార. మదం, హంకరిసు. అహంకరించు; తు. హంకార.

<సం. అహంకార-.

**హంగామా** రూ. అంగామా, హంగామి, హంగామీ. విణ. తాత్కాలికమైన; వి. 1. ఒకరకం అధికారం; 2. నిగా.

హిం. హంగామ్. కలకలం, కోలాహలం, పోట్లాట; ఉ. పార. హంగామా. కోలాహలం.

<ఉ. హంగామా

హంగామాచేయు స.క్రి. గోలచేయు, అల్లరిచేయు.

**హంగామి** రూ.చూ. హంగామా. విణ. తాత్కాలికమైన.

**హంగామీ** రూ.చూ. హంగామా. విణ. 1. తాత్కాలికమైన; 2. పెత్తందారీ.

**హంగాము** రూ. అంగాము. వి. ఋతువు.

ఉ. పార. హంగామ్. ఋతువు, కాలం, నిర్ణీతమైన;

క. హంగామి. ఋతుసంబధమైనది; త. హంకామ్.

<ఉ. హంగామ్.

**హంగు** రూ. అంగు[3]. వి. 1. ఒనరు, ఆనుకూల్యం. వేమ. 262; 2. కార్యసిద్ధికోసం. వెనకనుండి చేసే ప్రయత్నం; 3. అలంకరించిన అలంకారం; 4. రీతి, విధం; 5. వస్తు సంగ్రహం.

ఉ. హంగ్. బలం, సైన్యం;

క. అంగ. పద్ధతి, విధం; త. హంగు. పొందిన ఉపకారానికి బద్ధుడై ఉండటం.

<ఉ. హంగ్.

హంగుచేయు స.క్రి. నటనచేయు. హంగుపరచు స.క్రి. అనుకూలపరచు.

**హంగుదారు** వి. 1. ప్రోత్సాహకుడు; 2. సాయంచేసేవాడు.

ఉ. హంగ్, బలం, సైన్యం; పార. -దార్. మతుబ్ ప్రత్యయం.

<ఉ. హంగ్+పార.-దార్.

**హజంచేయు** స.క్రి. దాచివేయు.

హిం. హజం. జీర్ణం చేసుకోవటం ; ఉ. హజ్మ్. దాచివేయటం, జీర్ణించుకోవటం ; అర. హజ్మ్. జీర్ణం కావటం, హజ్మ-కర్మా. తీసివేయటం.

< ఉ. హజ్మ్.

**హజరత్** రూ. హజరతి, హజరతు, హజరత్తు. వి. పూజనీయుడు, మాన్యుడు, గౌరవసూచకంగా పేరుముందు చేర్చబడే బిరుదు. ద. హిం.శా. సంపు 5.శా. సం. 1312. క్రీ.శ. 1591.

హిం. హజరత్. మహమ్మదు, మహాశయుడు ; మరా. హజరత. పవిత్రత ; ఉ. హజ్రత్. పాదుషా మొ. వారిపేర్లకి ముందు గౌరవార్థంగా చేర్చే శబ్దం, హజారు ; పార. హజ్రత్. ధర్మదేశికులు. దైవభక్తులు, చక్రవర్తులు, ప్రభువులు మొ. వారిపేర్లకు ముందు చేర్చే పూజ్య వాచకం ; అర. హజరత్. పేర్లకి ముందు గౌరవార్థం చేర్చే శబ్దం.

< ఉ. హజ్రత్.

**హజరతి** రూ. చూ. హజరత్. వి. పూజనీయుడు, మాన్యుడు. గౌరవసూచకంగా పేరుముందు చేర్చబడేది.ద.హిం. శా. సంపు. 10. శా. సం. 751. క్రీ.శ. 1592.

**హజరతు** రూ.చూ. హజరత్. వి. గౌరవార్థం వాడేపద౦. నె.శా. 3సం. వేంకటగిరి శాసనం. 23. క్రీ.శ. 1659.

**హజరత్తు** రూ.చూ. హజరత్. వి. గౌరవార్థం వాడే పదం. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 771. 4: క్రీ.శ.1661.

**హజారము** రూ. అజారము, హజారు, హజూరు, హజ్జారము, హాజరు, హాజారము, హాజూరు, హుజురు, హుజూర్, హుజూరు, వి. 1. ఆస్థానమండపం, కొలువుకూటం. కాశీ. 1.125 ; 2. మొగసాల, ముఖశాల. పారి. 4.63.

హిం. హాజిర్, హాజర్. హుజూర్. ఉన్న, సమక్షం, సన్నిధి, సామీప్యం ; మరా. హాజర, హాజరీ, సమక్షం, సన్నిధిలో ఉండటం ; ఉ. హాజిర్, ఉన్న, సమక్షం, హుజూర్. శ్రీమంతుడు, రాజస్థానం. కచేరి ; పార. హాజిర్. హుజూర్. సమ్ముఖం, అస్తిత్వం ; క. హజిర, హాజరి, హాజరు ; త. అజిర్ ; మ. హాజర్.

< ఉ. హాజిర్.

**హజురు** రూ.చూ. హజారము. వి. 1. ఆస్థానమండపం. రాజవా. 5.37 ; 2. సమక్షం.

**హజూరు** రూ.చూ. హజారము. వి. 1. ఆస్థానం. రాజవా. 5.36 ; 2. సభ.

**హజేఖాను** వి. మక్కాకు వెళ్ళివచ్చినవాడు. ద.హిం. శా. సంపు. 10. శా. సం. 772. 9. శ. 1697.

హిం. హాజీ. మక్కా వెళ్ళివచ్చిన మహమ్మదీయుడు ; మరా. హాజీ. మక్కాయాత్ర చేసి వచ్చినవాడు ; మహమ్మదీయునికిచ్చే బిరుదు ; ఉ. హాజీఖాన్, హాజీ. మక్కా వెళ్ళివచ్చినవాడు ; పార. హాజీ. మక్కాయాత్ర చేసివచ్చినవాడు.

< ఉ. హాజీఖాన్.

**హజ్జ** రూ.చూ. అజ్జ[1]. వి. 1. అడుగు, జాడ, పాదముద్ర. భార. శాంతి. 2.236 ; 2. కాలు. ఉ.రా. 7.390 ; 3. పాదం, అడుగు. పార్వ. 4. 174 :

**హజ్జారము** రూ.చూ. హజారము. వి. 1. ఆస్థానమండపం, కొలువుకూటం. శకుం. 3.16 ; 2. మొగసాల, ముఖశాల.

**హంజ** రూ.చూ. అజ్జ[1]. వి. 1. పాదం 2. పాదముద్ర.

**హంజాబిలీ** వి. స్వర్ణోత్సవం.

**హఠము** వి. పట్టుదల. గౌ.హరి. 2 430పం.

సం. హఠ-. బలాత్కార ౦ మొండితనం.

< సం. హఠ- (అర్థవిపరి.).

**హఠముచేయు** అ.క్రి. మంకుపట్టు పట్టు.

**హఠాత్తు** వి. దబ్బాటు, అకస్మాత్తు. ద్వన్యను.

**హఠాత్తుగా** అవ్య. ద్రు. ఉన్నట్లుండి. నిరంకు. 4.63.

**హడపము** రూ.చూ. అడపము. వి. 1. వక్కలాకులుంచు కొనేపెట్టె. తాంబూలకరండం. వేంక. పంచ. 1.579 ; 2. మంగలిపొది.

**హడపు** రూ.చూ. అడపు[1]. వి. ఉపదర్శనం కనిపెట్టిచూడటం. ద.హిం.శా. సంపు. 4. క్రీ.శ. 1111.

**హడలు** రూ.చూ. అడలు[1]. వి. భయం.

**హడావిడి** రూ.చూ. అడావడి. వి. తొందర.

**హడావుడి** రూ.చూ. అడావడి. వి. సంభ్రమం, తొందర, వేగిరపాటు.

**హణిక** వి. అవధానం. హెచ్చరిక. ఆం.పదా. చర.12.

**హణిగలు** చూ. హణిగె, వి.బ.వ. నతివిశేషం, నమస్కారాలు, ఏటికోళ్ళు, దేవళానమస్కారం.

**హణిగె** వి. వంగి నమస్కరించటం. హంస. 4.214.

క. హణి, హణె, పణ. నందురు, హాణిగె. వంగు.

< క. హణిగె.

**హండ** రూ.చూ. అండా[1]. వి. వెడల్పుమూతఉన్న పెద్దగిన్నె.

**హండగె** రూ.చూ. అండా[1]. వి. లోహపుగుండిగ.

**హండా** రూ.చూ. అండా[1]. వి. వెడల్పుమూతిఉన్న పెద్దగిన్నె.

**హండి** రూ.చూ. హండీ. వి. వెడల్పుమూతిఉన్న పెద్దగిన్నె.

**హండీ** రూ. హండి. వి. పెద్దగిన్నె.

సం. భాండికా. చిన్నకుండ ; హిం. హండీ. చిన్నపాత్ర ; ఒ. బెం. హండీ. కుండ.

< హిం. హండీ.

**హత్త** చూ. హత్తు.

**హత్తము** వి. హస్తం, చేయి.

సం. హస్త-. చేయి. కరం ; ప్రా. హత్థ-. అ.మా. పా. హత్థ. చేయి, ఒకానొకకొలత, హతక-. చేయెడు ; ఒ. హత్తా ; బెం. హత్తా ; హిం. హాథ్ ; క. హత్త. చేయి, హత్తా, హత్తి, హస్తా హస్తి.

< ప్రా. హత్థ-.

**హత్తి** రూ.అత్తి[3]. హాథి. వి. ఏనుగు. వేంక. పంచ.93, చందాంగ. 2.88 ; 2. కుంజరాదిశబ్దాలా కర్మధారయ సమాసంలో ఉత్తరపదమై శ్రేష్ఠతా వాచకమవుతుంది.

బహుళా. 3.30.

సం. హస్తిన్. ఏనుగు ; ప్రా. హత్థి ; జై. మహా. హత్తి ; అశోక ప్రా. హథి ; (కాల్సి. ధౌలీ) ; అ.మా. హత్థి- ; నాగరఅప. హత్తి ; పా. హిత్థిన్ ; మా. హత్తి, బెం. ఒ. హత్తి ;

క. హత్తి ; కుఇ. అతి : కువి. హత్తి. చెంచు హాతె ; ఒరయాన్. హదీ, హంధీ.

< ప్రా. హత్థి,

హత్తిగొంగ వి. సిం.హం. కవిచా. సీ. 10.

**హత్తించు** చూ. హత్తు.

**హత్తింపు** చూ. హత్తు.

**హత్తు** రూ. అత్తు. అ.క్రి. **1**. అంటు, సక్తమగు. భార. విరా. 2.15, కాశీ. **1.138** ; **2**. కలుగు, నార.పంచ. 1.117 ; **3**. పొందుపడు, అనుకూలించు. మను. 3.68 ; **4**. కలియు, కూడు. ఆము. 4.251 ; **5**. ఉండు, వర్తించు. పాండు. 2,225 ; **6**. నాటుకొను, లగ్నమగు. కళా. 4.105 ; **7**. గుచ్చుకొను, నానుకొను. శశా. 3.108 **8**. చేరు, సమీపించు. చంపూరా. 3.25 ; **9**. సంభోగ. కోసం పైపడు, పైకొను. దశా. 8.41 ; స.క్రి. **1**. తాకు అంటు. నిర్వ.రా. 1.42 ; **2**. చేరు, అధిరోహించు మను. 5.60 ; **3**. కౌగిలించు, ఆలింగనంచేయు. ఆము 5.104 ; **4**. పొందు. పాండు. 1.75. **5**. ఉంచు, నిలుపుకొను. పాండు. 5.218 ; **6**. తగులుకొను. కళా, 3.184 ; వి. మైనంగుడ్డ.

క. హత్తు. అతుక్కొను, తాకు, చేరు, పట్టు, అంటుకొను, హత్తుకొను ; తు. హత్తుని. అతుక్కొను.

< క. హత్తు.

**హత్త** వి. చిక్కుకోవటం, తగులుకోవటం. **హత్తించు** స.క్రి. **1**. కూర్చు, కలుపు. భార. విరా. 1.78 ; **2**: చేర్చు. ఉ.హరి. 3.62 ; **3**. ఉంచు, సెట్టు. ఉ.హరి. 3.86 ; **4**. అతకచేయు, అతికించు. భాస్క.రా. బాల. 512 ; **5**. పూయు. పట్టించు హర. 4.11 ; **6**. చు[illegible]. వసు. 6.32 ; **7**. కలిగించు ; చంపూరా. 3.98, < హత్తు + -ఇంచు$^3$. **హత్తింపు** వి. కలయిక, కూటమి. సురతం. శశా. 4.68. **హత్తుకొను** అ.క్రి. **1**. నెలకొను, ఉండు. వరాహ. 10.160 ; **2**. కలుగు, పుట్టు. ఉ.రా, 3.333 ; **3**. నాటుకొను, లగ్నమగు. శుక. **4.64** ; స.క్రి. **1**. తగులుకొను, కూడుకొను. రాధికా. 8.102 ; **2**. కూడు, కలియు. హంస. 2.45 ; **3**. చేరు, ఆశ్రయించు శుక. 1.174. **హత్తుకొలుపు** స.క్రి. హత్తుకొనేటట్లు చేయు. పొందుపర్చు. వైజ. 4.30. **హత్తుగడ** రూ. అత్తుగడ. వి, **1**. పొందిక, చేరిక. బహుళా. 5.81 ; **2**. కలయిక. భాస్క.శ. 11. **హత్తోస** వి. ఏకేటప్పుడు కమాను దండెను పట్టుకోవటానికి అనువుగా చుట్టిన గుడదిండు.

**హత్తె** వి. హత్య, వధ. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 745. క్రీ.శ. 1530.

సం. హత్యా. వధ, చంపటం.

< సం. హత్యా.

**హత్తోస** చూ. హత్తు.

**హత్యారు** వి. ఆయుధం.

హిం.ఉ. హథ్యార్, హథియార్ పనిముట్టు, ఆయుధం, సాధనం, పరికరం, చేతులు, హాథ్. చేయి, యార్. స్నేహితుడు ;

క. హత్యారు. ఆయుధం, పనిముట్టు.

< ఉ. హథియార్.

**హథి** రూ.చూ. హత్తి. వి. ఏనుగు.

**హదను** రూ.చూ. అదను. వి.జా. అనా. **1**. యుక్తసమయం, తరి. శృం.నై. **3.14** : **2**. సమయం, వేళ. ఆము. **4.83**.

**హదిరి** వి. అరచేతికి సంబంధించిన.

హిం. హథేరీ, హథేలీ. అరచేయి, అరచేతికోసంబంధించినది.

< హిం. హథేరీ.

**హదు** రూ.చూ. హద్దు. వి. ఎల్ల, పొలిమేర.

**హదుబందు** హద్దుబందు. వి. హద్దురాయి, పొలాని. హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి.

**హద్దు** రూ. అద్దు$^2$. హదు వి. అవధి, మేర, మర్యాద. ద.హిం.శా. సంపు.7. శా.సం. 790.12. క్రీ.శ. 1774. నె.శా. 1సం, 8.శా.సం. క్రీ.శ. 1652, నె.శా. 3సం. ఒంగులు. క్రీ.శ 1517.

నే.హిం. హద్. అవధి, సీమ ; మరా. హద్. హద్ద, మితి, మేర, మర్యాద ; పార.ఉ. హద్, హర్ద్. మేర ; అర. హద్. మితి, మేర ;

క. హద్దు. మితి, సరిహద్దు, కొన ; త. హత్తు. పొలిమేర.

< ఉ. హద్.

**హద్దుపత్రికె** వి. హద్దుల్ని నిర్ణయించే పత్రిక లేదా శాసనం. నె. శా. 8. క్రీ.శ. 1661. **హద్దువద్దూ** వి. నీతినియమం, అద్దూపద్దూ. **హద్దుబందు** రూ. హదుబందుకి హద్బంద్, హద్బందు. వి. హద్దురాయి, పొలానిక హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి. **హద్దుమద్దులు** వి.బ.వ. అన్నిపక్కలు. ద. హిం. శా. 10. 759. క్రీశ. 1663. హిం, హద్. మితి, మేర ; పార. హద్ద్. **హద్దురాయి** రూ. అద్దురాయి. వి. గుమ్మంరాయి, గ్రామాలకు చివర, పొలాలకు, స్థలాలకు, వీధులకు మధ్య హద్దులను సూచిస్తూ పాతిపెట్టినరాయి. **హద్దురౌతు** వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి. **హద్బాంద్** రూ.చూ. హద్దుబందు. వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి. **హద్బందు** రూ.చూ. హద్దుబందు. వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి.

**హద్బంద్** చూ. హద్దు.

**హద్బందు** చూ. హద్దు.

**హనాఫీ** వి. ముస్లిం తెగలతో ఒకతెగపేరు.

ఉ. హనఫ్. ముస్లిం తెగపేరు.

< ఉ. హనఫ్.

**హనుమ** రూ. అనుమఁడు, హనుమఁడు. వి. హనుమంతుడు, ఆంజనేయుడు. భార. అరణ్య. 3.314.

సం. హనుమత్-, హనూమత్ ఆంజనేయుడు; ప్రా. హణుమ- హణుమంత-,

క. అణువ, హనుమ, తు. అనుమంతె, హనుమంతె, త. అణుమణ్. అణుమాన్, హణుమాన్; మ. అను- మాన్, అనువాన్.

< ప్రా. హణుమ-.

**హనుమఁడు** రూ.చూ. హనుమ వి. ఆంజనేయుడు. భాస్క. రా. సుందర. 456.

**హనుమంతబీఱ** వి. వృక్షవిశేషం, ఒకజాతిచెట్టు. హంస. 4.11.

సం. హనుమంత-. హనుమచ్ఛబ్ద ద్వితీయైకవచనాంతరూపం.

< సం. హనుమంత- + బీఱ. (మిశ్ర స.)

**హంత** వి. దుష్టురాలు. శుక. 1.117.

సం. హంతృ-. చంపేవాడు, చంపేది, హంతీ. చంపేది.

< సం. హంతృ- (అర్థవిపరి.).

**హంతలాఁడి** వి. మాయలాడి, మోసకత్తె. శుక. 3.636.

**హందస్తు** వి కోయటం.

ఉ. పార. హమ్-దస్త్. చేతిలోని, హమ్‌దస్త్-కర్దా. పొందు, తీసుకొను, సంపాదించు, జాగ్రత్తచేయు.

< ఉ. హమ్-దస్త్.

**హన్నీకోంబ్** వి. ఒకరకం తువ్వాలు.

**హఫ్తా** వి. వారం.

హిం. హఫ్‌తా. ఏడు; ఉ. పార. హఫ్త్. ఏడు హఫ్తహ్. ఏడుకలిగినది, వారం;

క. హప్తె. వారం, ఒకవాయిదా, అప్పులోకొంత చెల్లించాల్సిన నిర్ణీతమైన గడువు, అట్లా చెల్లించినమొత్తం; త. హప్తా.

< ఉ. హఫ్తహ్.

**హఫ్తావారి** ప్రత్య. వారక్రమప్రకారంగా.

ఉ. పార. హఫ్త్-వార్. వారక్రమం.

< ఉ. హఫ్‌వార్.

**హబాయి**[1] వి. అశ్వాలంకారవిశేషం. ప్రబంధ. 51.

**హబాయి**[2] వి. ధూళి.

ఉ. హబా. దుమ్ము; పార. హబా. దుమ్ము, గాలిలో ఎగిరే అణువులు; అర. హబా.

< అర. హబా.

**హబిశీ** రూ. అబిసీ, హబిసీ. వి. అబిసీనియాదేశీయుడు.చారు. 4.46.

మరా. హబ్, వ్, శీ, అబిసీనియా; ఉ. హబ్‌షీ. అబిసీనియా దేశస్థుడు; పార. హబ్శీ. అబిసీనియా దేశీయుడు; అర. హబ్‌శ్. అబిసీనియా దేశీయుడు, నీగ్రో.

< ఉ. హబ్‌షీ.

**హబిసీ** రూ.చూ. హబిశీ. వి. అబిసీనియా దేశీయుడు. పెద ప.59.

**హమరావు** చూ. ఉమ్మరావులు. వి. అంగరక్షకుడు, సహచరుడు. ఆనంద. పీఠి. 14.

ఉ. హమ్రవ్. సహయాత్రికుడు; పార. హమ్రవ్. సహయాత్రికుడు, హమ్‌రాహీ. మిత్రుడు, హమ్. అన్యోన్యం, రవ్. దారి, పయనం.

< ఉ. హమ్రవ్.

**హమలు** రూ.చూ. అమలు[1]. వి. ఆచరణలోకితేవటం.

**హమా** విణ. సర్వం, సమస్తం. హంస. 2.131.

మరా. హమ్. సర్వం, సమస్తం; ఉ. హమా, సమస్తం, మొత్తం, అంతా; పార. హమా. పూర్ణం. సమస్తం, హమ్‌జిన్సీ. సజాతీయవస్తురాశి హమ్‌జిన్స్. అన్నిదినుసులు.

< ఉ. హమా.

**హమాము** వి. స్నానంచేసే ప్రదేశం, స్నానద్రోణి. విశ్వే. ప.89.

ఉ. హమామ్. స్నానంచేసే ప్రదేశం, పార. హమామ్. వేడినీటితో చేసేస్నానం, హమ్మామీ. స్నాపకుడు; అర. హమామ్. వేడినీటిలో చేసే స్నానం.

< ఉ. హమామ్.

**హమాంబాపతు** రూ.చూ. అమాంబాపతు. వి. 1. అన్నిరకాలు; 2. అన్నిసంగతులు; 3. అనేకవస్తువులు.

**హములు** రూ.చూ. అమలు[1]. వి. ఆచరణలోకి తేవటం.

**హమేశా** రూ. అమేష, అమేషా, హమేషా. అవ్య. ఎల్లప్పుడు.

హిం. హమేశా. ఎల్లప్పుడు, నిరంతరం, శాశ్వతం; మరా. హమేశా. నిరంతరం, శాశ్వతం; ఉ. హమేషా. ఎల్లప్పుడు, నిరంతరం, శాశ్వతం; పార. హమీషహ్. ఎల్లప్పుడు; అర. హమీషె. ఎల్లప్పుడు, నిరంతరం, శాశ్వతం.

< ఉ. హమేషా.

**హమేషా** రూ.చూ. హమేశా. అవ్య. ఎల్లప్పుడు.

**హంబీర** రూ. అమీరు, అమీరుఁడు, హంవీర, హమ్వీర. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 1088. క్రీ.శ. 1469.

హిం. మరా. ఉ. పార. అర. అమీర్. ధనవంతుడు, నాయకుడు, ముఖ్యుడు, ఉదారుడు, శాసకుడు, సర్దారు.

< ఉ. అమీర్.

**హయాము** వి. 1. అధికారం, ఏలుబడి; 2. కాలం.

ఉ. అర. వియామ్. దినాలు, కాలాలు, ఋతువు, వాతావరణం.

< ఉ. వియామ్.

**హయిరాను** రూ.చూ. హైరాణ. వి. విసుగుదల, తికమక.

**హయిరానుచేయు** అ.క్రి. గిలాభాచేయు, తారుమారుచేయు. హిం. హైరాన్. కలతచెందిన, దుఃఖపూరితమైన, కల్లోలపడిన, తారుమారైన; ఉ. అర. హైరాన్. నిశ్చేష్టమైన, అలసట చెందిన, కలతచెందిన, చీకాకుపడిన,

తారుమారు చెందిన ; క. హైరాను. తారుమారు, కష్టం, గలాభా, దుఃఖకరమైన స్థితి. < ఉ. హైరాన్ + చేయు.

**హయినరే** రూ.చూ. హైసరే. అవ్య. ప్రశంసార్థకం. కువ.చ. 4.153.

**హర** వి. ప్రతి.

హిం. ఉ. పార. హర్. ప్రతి, యొక్క.

< ఉ. హర్.

**హరకతు** రూ. అరకతు, అరకత్తు, హరకత్తు. వి. 1. మోసం ; 2. అడ్డు.

హిం. హర్‌కత్. గతి, మోసం, విలంబం ; మరా. హర్‌కల్. విరోధం, విలంబం ; ఉ. హర్‌కత్. గతి, మోసం, చెడ్డపని ; పార. హర్‌కత్. కదలిక, ప్రవర్తన, చెడునడత ; అర. హార్‌కత్. పని, నడవడి, పద్ధతి.

< ఉ. హర్‌కత్.

**హరకత్తు** రూ.చూ. హరకతు. వి. ఆటంకం, అడ్డు.

**హరకత్తుచేయు** స.క్రి. అడ్డగించు.

**హరకారా** రూ.చూ. హరకాలా. వి. వార్తాహరుడు.

**హరకాలా** రూ. హరకారా, హర్కరా, హర్కార్, హర్కారా. వి. వార్తాహరుడు. వేగువాడు. రంగా. చ. 2.144.

హిం. హర్‌కారా. వార్తాహరుడు, ఉత్తరాలు తెచ్చేవాడు : మరా. హరకారా. వార్తాహరుడు, సందేశాన్ని లేదా ఆజ్ఞను తీసుకొని వచ్చేబాలుడు ; ఉ. హర్‌కారా. వార్తాహరుడు ; పార. హర్‌కార. వార్తాహరుడు, నియోగి, ఆజ్ఞప్తికారుడు.

< పార. హర్‌కార.

**హరకిరి** రూ.చూ. హరాకిరీ. వి. 1. పొట్టచీల్చుకొని ఆత్మహత్య చేసుకోవటం ; 2. ఆత్మహత్య చేసుకోవటం.

**హరబి** రూ.చూ. అరబీ. వి. 1. దేశవిశేషం ; 2. అరబీ దేశపుగుర్రం ; 3. హరబీదేశభాష.

**హరబ్బి** రూ.చూ. అరబీ. వి. 1. దేశవిశేషం ; 2. హరబీ దేశపుగుర్రం 3. హరబీదేశభాష.

**హరబ్బీ** రూ.చూ. అరబీ. వి. 1. ఒకదేశం ; 2. అరబ్బి దేశపుగుర్రం.

**హరబ్బు** రూ.చూ. అరబీ. వి. 1. దేశవిశేషం ; 2. అరబీ దేశపుగుర్రం ; 3. హరబీదేశభాష.

**హరసమవాయి** వి. ఒకానొక స్వరస్థాయి. బ.స.వ. 3.941.

**హరసము** రూ.చూ. హరునము. వి. హర్షం.

**హరాకిరీ** రూ. హరకిరి. వి. 1. పొట్ట చీల్చుకొని ఆత్మహత్య చేసుకోవటం ; 2. ఆత్మహత్య చేసుకోవటం.

జపానీ. హరా. పొట్ట, కిరీ. చీల్చుకోవటం.

< జపానీ. హరాకిరీ.

**హరాంకోరు** రూ. హరాంఖోర్, హరాంఖోరు, హరాముఖోర్. వి. అన్యాయంగా డబ్బు ఆర్జించేవాడు, దుష్టసేవకుడు, దుర్జనుడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 751. క్రీ.శ. 1492.

హిం. హరాంఖోర్. అన్యాయార్జననుఅనుభవించేవాడు ; మరా. హరాంఖోర్. కృతఘ్నుడు, నీచుడు ; ఉ. హరామ్‌కోర్. వ్యభిచారి, హరామ్‌ఖోర్. అన్యాయార్జననుభవించేవాడు, కృతఘ్నుడు, పార. హరామ్‌కోర్. జారుడు, హరామ్‌ఖ్వార్, హరామ్‌ఖ్వోర్. లంచం తీసుకొనేవాడు.

< ఉ. హరామ్‌కోర్.

**హరాంఖోర్** రూ.చూ. హరాంకోరు. వి. అన్యాయంగా డబ్బు ఆర్జించేవాడు.

**హరాంఖోరు** రూ.చూ. హరాంకోరు. వి. అన్యాయంగా డబ్బు ఆర్జించేవాడు.

**హరాంఖోర్లు** వి.బ.వ. దుష్టమతులు, కపటవర్తనులు.

**హరాంఖోర్లు** చూ. హరాంఖోరు.

**హరాజవేయు** అ.క్రి. ఏలంవేయు.

ఉ. అర. హరాజ్, హ్రాజ్. వేగంగా దౌడు తీసే గుర్రం, వేలం, వేలంద్వారా బహిరంగమైన అమ్మకం.

< ఉ. హరాజ్ + వేయు.

**హరామి** విశ. దుష్టమయిన.

ఉ. హరామ్. అను చితమయిన, విధి విరుద్ధమయిన.

< ఉ. హరామ్.

**హరాముఖోర్** రూ.చూ. హరాంకోరు. వి. 1. అన్యాయంగా డబ్బు ఆర్జించేవాడు : 2. దుష్టసేవకుడు.

**హరాయించు** రూ. అరాయించు. స.క్రి. 1. జీర్ణించుకొను ; 2. దొంగిలించు.

సం. హ్రార్. దొంగిలించు ; హిం. హరానా. ఓడించు, అలసిపోయేటట్లుచేయు.

< హిం. హరా(నా) + -.ఇంచు[3].

**హరాయించుకొను** రూ. అరాయించుకొను. స.క్రి. 1. అపహరించు ; 2. దక్కించుకొను.

**హరాల్‌కోరు** విశ. 1. దుష్టుడు. హంస. 5.113 ; 2. సర్వభక్షకుడు 3. నీచుడు.

హిం. ఉ. హలాల్‌ఖోర్. దుష్టుడు, నీచుడు.

< ఉ. హలాల్‌ఖోర్.

**హరికేన్‌లాంతరు** రూ.చూ. అలికిర్లాంతరు. వి. పెద్దగాలిలో కూడ ఆరిపోకుండా ఉండే లాంతరు.

**హరిగ** రూ. అరిగ. వి. 1. ఖేటం, డాలు. జైమినిభా. 6.120 ; 2. ఎండ తగలకుండ పట్టే కేడెం లాంటి సాధన విశేషం. కువ.చ 4.200.

క. అరిగె, అలిగె, పరిగె, వలిగె, హరిగె, హలసె, హలిగె. డాలు ; త. పరం. కవచం, ఒక రకం డాలు ; మ. ఫరా, ఫరగ, ఫలగ. డాలు ;

పోచూ. సం. ఫలక –. పలక, బల్ల.

< క. హరిగె.

**హరిగిలి** రూ.చూ. హరిగోలు. వి. పుట్టి, తుంగభద్రమీద మనుష్యుల్ని సరకుల్ని దాటించే పెద్దతోలు బుట్టలు.

**హరిగోలు** రూ. అరిగలు, అరిగోలు, హరిగిలి. వి. ఏరుదాటే సాధన విశేషం. శక. 3.323.

క. పఱు. ఎగరటం, పరుగోల్, పఱిగోల్, హఱగల్, హఱగోల్, హఱిగల్, హఱిగోల్, హఱుగల్, హఱుగోల్. హఱుగోలు. తోలుచుట్టూ ఉంచి తయారుచేసిన గుండ్రని చోటు.

<క. హటిగోల్.

**హరిచ** రూ.చూ. హరిచె. వి. పక్షివిశేషం. శుక. **1.246**.

**హరిచిన్నీ** వి. తెల్లఉన్నికి వేసిన ఆకుపచ్చవన్నె.

సం. హరిత-.ఆకుపచ్చ.

**హరిచె** రూ. హరిచ. వి. పక్షివిశేషం. శుక. 1.222.

**హరిణవళ్లు** వి.బ.వ. వస్త్రవిశేషం. హంస. **5.359**.

సం. హరిణ-.లేడి.

<సం. హరిణ-+వడి+లు. (మిశ్రస.).

**హరితాళము** రూ.చూ. హరిదళము. వి. వేషగాళ్ళు నోటికి పూసుకొనే బంగారు రంగులో ఉన్న లేపనం. (Arsenicum flavum).

**హరిదళము** రూ. అరిదళము, హరితాళము. వి. వేషగాళ్ళు నోటికి పూసుకొనే బంగారు రంగులో ఉన్న లేపనం. కాశీ. 1 123. (Arsenicum flavum).

సం. హరితాల-.పసుపుపచ్చని ధాతువిశేషం ; ప్రా. హరితాల-, హరఅల-హరిఅలీ ; మా. హరి అల- ; అ.మా. హరిఆల-, హరియాల- ;

క. హరతాల. హరిదళం.

<ప్రా. హరితాల-.

**హరిదాసు** వి. హరికథ చెప్పేవాడు. భాగవతారు.

సం. హరిదాస-. విష్ణుభక్తుడు.

<సం. హరిదాస-. (అర్థవిపరి.).

**హరిపదముముట్టు** అ.క్రి. చచ్చు.

సం. హరిపద-. ఆకాశం.

<సం. హరిపద-+-ము+ముట్టు.

**హరిబీ(క** రూ.చూ. హరిబీ(కె. వి. అశ్వశిరోలంకారవిశేషం హంస. **5.411**, ప్రబంధ. 163.

**హరిబీ(కె** రూ. హరిబీ(క. వి. అశ్వశిరోలంకారవిశేషం. ఇందు, 2.54.

**హరిబువ్వము** వి. వివాహసమయంలో నాలుగోనాటి రాత్రి బంధువులైన స్త్రీపురుషులందరు ఒకటిగా కలసి వేడుకగా భోజనంచేయటం.

**హరివాణము** వి. **1**. పళ్ళెరం. వరాహ. **3.98** ; **2**. పాత్రం. అచ్చ.రా. బాల. **74** ; **3**. భోజనపాత్రం. ఆం. నా. సం. మాన. 30.

క. అరివాణ, పరియణ, పరివాణ, హరియణ, హరియాణ, హరివాణ. కంచుతోగాని లోహంతోగాని చేసిన గిన్నెలాంటి పళ్ళెరం ; తు. హరియాణ, హరివాణ, అరివాన. లోహపాత్ర ; త. అరువాణమ్. రాగి పళ్ళెం : క.త. అరివాణవు, హరివాణవు. పళ్ళెరం.

<క. హరివాణ.

**హరివిల్లు** వి. చినుకులగుండా ప్రసరించే సూర్యకిరణాల వల్ల ఎదురుగాఉన్న మబ్బులమీద కనబడే ఏడురంగుల విల్లు, ఇంద్రధనుస్సు.

సం. హరి-. విష్ణువు, ఇంద్రుడు.

<సం. హరి-+విల్లు.

**హరిహరి** అవ్య. అయ్యో, అక్కటా. పాపపరిహారసూచకంగా పలికే పదయుగళం. రాధికా. 2.9.

సం. హరి. విష్ణువు.

**హరీఅను** అ.క్రి. చనిపోవు.

సం. హరి. విష్ణువు.

**హరియనకహరాఅనక** అవ్య. మౌనంవహించు. సారంగ. 2. 238.

**హరువగు** చూ.హరువు.

**హరువరి** చూ. హరువు.

**హరువు** రూ. హర్వు. విణ. **1**, మనోజ్ఞం, చక్కనిది. రం.రా. బాల. 78పు. 10పం ; **2**. యోగ్యం, తగినది. రామాభ్యు. 8.175 ; **3**. నాణెమైనది. అచ్చ. రా. కిష్కిం ; వి. **1**. చక్కదనం, సౌందర్యం. పాండు. 1.76 ; **2**. నాణెమైన పని, మేలిపని. ఘటికా. 2.87 ; **3**. తగినపని. విప్ర. 5.24 ; **4**. ఏర్పాటు. విజయ. **3.179** ; **5**. విలాసం. రాజవా. **3.104** ; **6**. విధం. భోజను. 3.41.

క. హరువు, హర్వు. విధం, విధానం.

<క. హరువు.

**హరువగు** అ.క్రి. చక్కనగు, అందగిలు. <హరువు+అగు. **హరువరి** వి. నేర్పరి, ఉపాయశాలి. రాజవా. **5.68**. <హరువు+-అరి **హరువుకా(డు** రూ. హర్వుకా(డు. వి. కర్మదక్షుడు, వ్యవహర్త.

**హరుసము** రూ. అరుసము, హరసము. వి. హర్షం, సంతోషం. ఉ.రా. 2.196.

సం. హర్ష-. సంతోషం, ఆనందం, సుఖం ; ప్రా. హరిస-, హరిసణ-, హర్షణం ; జై. మహా. అ.మా.,శౌ. హరిస- ; పా. హాస-.హర్షం ;

క. హరిస, హరుష, హరుస ; త. అరిచమ్. ఆనందం, హాయి ; మ. హరిషం.

<ప్రా.హరిస-.

**హరుసించు** అ.క్రి. ఇష్టపడు, సంతోషించు. ద్వి.భాగ. **2.31**. <హరుసము+-ఇంచు[3].

**హరుసించు** చూ. హరుసము.

**హర్కారా** రూ.చూ. హరకాలా. వి. **1**. జాబులుతెచ్చేవాడు, **2**. వేగులవాడు.

**హర్కార్** రూ.చూ. హరకాలా. వి. వేగులవాడు, దూత. జాబులుతెచ్చేవాడు.

**హర్కారా** రూ.చూ హరకాలా. వి. వేగులవాడు.

**హర్జకారు** వి. వ్యర్థకార్యకారి, పనికిరానిపనులు చేసేవాడు. విశ్వే.శ. 44.

ఉ.హర్జాకార్. వ్యర్థమైన పనిచేసేవాడు.

<ఉ.హర్జాకార్.

**హర్తాల్.** వి. సమ్మెకట్టటం.

హిం. హర్ తాల్. సమ్మెచేయటం.

<హిం. హర్ తాల్.

**హర్వు** రూ.చూ. హరువు. వి. **1**. చక్కదనం, సౌందర్యం. ఇందు. 5.82 ; **2**. నాణెమైనపని, మేలుపని ; **3**. విలాసం ; **4**. విధం ; **5**. ఏర్పాడు ; **6**. తగినపని, విణ. **1**. మనోజ్ఞం, చక్కనిది ; **2**. యోగ్యం, తగినది. ; **3**. నాణెమైనది.

హర్వుకా(డు రూ.చూ. హరువుకా(డు. వి. కర్మదక్షుడు, పనిలోనేర్పరి, ఉపాయశాలి,

హలది రూ.చూ. హళ(ది. వి. పసుపు.

హలా రూ.చూ. హవాలు. వి. 1. స్వాధీనం ; 2. అధీనం.

హలాకి రూ. హలాఖ్. వి. వినాశం.

హిం. హలాకీ. విధ్వంసం, వినాశం ; గు. హలాకీ. విధ్వంసం ; మరా. హలాకీ. వినాశం, విధ్వంసం ; పార. హలాకీ.

<హిం. హలాకీ.

హలాకు వి. గాజురాయి. ఆం.భా. 3.29.

హిం. హల్కా. గుండ్రనితనం, వృత్తం ; మరా. హల్కా. తేలికైన, తక్కువైనబరువుగల ; ఉ. హల్కా. గుండ్రనితనం. వృత్తం ; పార. హలక. వృత్తం.

హలాఖ్ రూ.చూ. హలాకి. వి. వినాశం.

హలాలిచేయు స.క్రి. మహమ్మదీయమతం నిర్దేశించినట్లు జంతువులను నరుకు.

హిం. హలాల్. చట్టనిర్దేశమైన, చట్టానికి లోబడిన, ధర్మబద్ధమైన, సరైన, హలాల్-కర్‌నా. నరకటం, జంతువును చంపటం ; ఉ.అర. హలాల్. చట్టబద్ధమైన, శాస్త్రీయమైన, సరైన, ధర్మబద్ధమైన, హలాల్-కర్నా. ఖూనీ చేయు, వివాహంచేసుకొను, మహమ్మదీయ మతనిర్దేశ ప్రకారం జంతువులను నరకటం ;

త. హలాల్. చట్టబద్ధమైన, మతం నిర్దేశించిన.

<ఉ. హలాల్ + చేయు.

హలాలీఖోరు రూ.చూ. అలాల్కోరు. వి. వీథులూడ్చేవాడు.

హలాలుఖోరు రూ.చూ. అలాల్కోరు. వి. వీథులూడ్చేవాడు.

హలాల్కోరు రూ.చూ. అలాల్కోరు. వి. వీథులూడ్చేవాడు.

హలాల్ఖోరు రూ.చూ. అలాల్కోరు. వి. వీథులూడ్చేవాడు.

హలి రూ. అళి, హాళి. వి. ఒడ్డెబండి చక్రంలో ఇరుసుకు తగిలించిన చెక్కకు రెండువైపులా ఉండే అర్ధ చంద్రాకారపు చెక్కలు.

క. హళి.

<క. హళి.

హలికము వి. సేద్యగాండ్రు, వ్యవసాయదార్లు. E.I. V, 9 క్రి.శ. 1430.

సం. హలిక-. కర్షకుడు, రైతు.

<సం. హలిక-.

హలిఖత్తా రూ.చూ. హల్‌కత్తు. వి. ఎస్టేటు వ్యవహారాలున్న కాగితం.

హలీఖత్తు రూ.చూ. హల్‌కత్తు. వి. ఎస్టేటు వ్యవహారాలున్న కాగితం.

హలేకార్లు వి.బ.వ. ఉద్యోగస్థులు.

నే. అహల్‌కార్ ; హిం. ఉ. అహల్కార్. ఉద్యోగి ; పార. అహ్లె-కార్.

<ఉ. అహల్‌కార్ + -లు.

హలో అవ్య. పిలిచేటప్పుడు ఉపయోగించే 'ఓయి' అనే అర్థంలో ప్రయుక్తమవుతున్న పదం.

ఇం. *Hallo*. అరచిపిలుచు, బొబ్బపెట్టు, ఓయి, ఓసి.

<ఇం. Hallo.

హల్‌కత్తు రూ. హలిఖత్తా, హలీఖత్తు, హల్‌ఖిత్తు. వి. ఎస్టేటు వ్యవహారాలున్న కాగితం.

హిం. హల్‌కా. మండలం, అసెంబ్లీ ; మరా. హల్‌కా, క్షుద్రం, ప్రాముఖ్యంలేనిది ; ఉ. హల్‌కా. సముదాయం. మండలం, క్షేత్రం ; పార. హల్‌కల్, హల్‌క. మండలం ; అర. హల్‌కత్. మండలం.

<ఉ. హల్‌కా.

హల్కా క్రి. విశ. 1. నీచమైన ; 2. అల్పమైన ; 3. తేలికైన ; 4. క్షుద్రమైన.

హిం. ఒ. హల్కా. తేలికయిన, సాధారణమైన.

<హిం. హల్కా.

హల్కి క్రి. విశ. 1. నీచమైన ; 2. క్షుద్రమైన ; 3. తేలికైన ; 4. అల్పమైన.

హిం. హల్కి. తేలికైనది.

<హిం. హల్కీ.

హల్‌ఖిత్తు రూ చూ. హల్‌కత్తు. వి. ఎస్టేటు వ్యవహారాలున్న కాగితం.

హల్లకల్లోలము రూ. అల్లకల్లోలము. విశ. తారుమారైనది, వ్యత్యస్తం, సంక్షుభితం, కలతనొందినది. రం. రా. యు. 339పు. 1పం. వి. గందరగోళం.

క. అల్ల, అల్లోల, హల్ల. గందరగోళం, కలత, అల్లకల్లోల. సంక్షోభం ; త. అల్లోలకల్లోలమ్. పెద్దధ్వని ; మ. అల్ల. కలత ;

పో. చూ. సం. కల్లోల-. కెరటం, గంతు, ఉల్లాసం, ప్రతికూలం.

<తె. అల్ల[1] + సం. కల్లోల -. (అర్థవిపరి.).

హల్లా రూ. అల్లా[3]. వి. 1. లగ్గపట్టటం, కోలుకెగ ప్రాకటం. రంగా. చ. 2.247 ; 2. సందడి.

దే. ప్రా. హల్లా ; ఒ. హల్లా. చప్పుడు, సందడి ; హిం. ఉ. హల్లా. సందడి ; గు. హల్లో. శబ్దం ; మరా. హల్లా. అల్లరి, సందడి.

<ఉ. హల్లా.

హల్లాసేయు(-చేయు) స.క్రి. లగ్గయెక్కు.

హల్వా వి. మెత్తగా ఉండే తియ్యని పదార్థం.

హిం. హల్వా. గంజి, తీపుపదార్థం ; ఉ. అర. హల్‌వా ;

క. హలువ, హల్వా ; త. హల్వా. పాలు, చక్కెరతో తయారుచేసిన పదార్థం.

<ఉ. హల్‌వా.

హళ(ది రూ. అళ(ది[1], హలది, హాళిది. వి. పసుపు, పసుపురంగు. వరాహ. 10.106, బహుళా. 1.105.

సం. హరిద్రా. పసుపు ; ప్రా. హరిద్దా, హలిద్దీ, హలిద్దా, హలద్దా, హలద్దీ. పసుపురంగు ; జై. మహా. హలిద్దా ; శౌ. మా. హలిద్దా ; పా. హలిద్దా, హలిద్దీ, హాలిద్ద ; అ.మా. హలిద్ద, హలిద్దా, హాలిద్ద, హాలిద్దా ; ఒ. హళది ;

క. అళది, హళది ; త. అరిత్తిరమ్.

< ప్రా. హలిద్దీ.

**హళహళి** రూ.చూ. హళాహళి. వి. 1. సంభ్రమం, తొందర ; 2. ఆటోపం ; 3. సమ్మర్దం సందడి ; 4. కలకలధ్వని ; 5. శౌర్యం.

**హళహళిక** రూ.చూ. హళాహళి. వి. 1. సంభ్రమం, తొందర ; 2 ఆటోపం ; 3. సమ్మర్దం, సందడి ; 4. కలకలధ్వని 5. శౌర్యం.

**హళాహళి** రూ. హళహళి, హళహళిక. వి. 1. శౌర్యం. రాజ. చ. 2.82 ; 2. సంభ్రమం, తొందర. యయా. 5.143 ; 3. ఆటోపం. సారంగ. 2.175 ; 4. సమ్మర్దం, సందడి. విజయ. 1.115 ; 5. కలకలధ్వని. రసిక. 3.172 ; విణ. వ్యాప్తం, అతిశయించునది. అష్టమ. క. 4.20పు. 8పం.

క. హాళహాళ, హాళహాళి. చలిస్తున్న వెలుగు, కదలిక.

< క. హళహళి.

**హళాహళిసేయు(-చేయు)** స.క్రి. భగ్నంచేయు, పడగొట్టు. వరాహ. 4.153.

**హళి** రూ. చూ. హలి. వి. నాగలికి రెండువైపుల అమర్చి అర్ధాకారంలో ఉన్న చెక్కలు.

**హళిది** రూ.చూ. హళది. వి. పసుపు.

**హళువాయి** వి ఒకానొక స్వరస్థాయి. బసవ. 3.941 పం.

**హళ్ళి** వి. సున్న.

క. హళ్ళి. చుట్టూ అడవిఉన్న పల్లెటూరు, వ్యవసాయానికి పనికిరాని భూములుకల పల్లెటూరు.

< క. హళ్ళి.

**హళ్ళికిహళ్ళి** వి. సున్నకుసున్న. **హళ్ళికిహళ్ళిసున్నకుసున్న** వి. 1. ఒకరు చేసేదానికి తగిన ప్రతిక్రియ ; 2. ఏమీ మిగలకపోవటం.

**హవణి** వి. 1. అశ్వశిక్షావిశేషం. పి.శకు. 1.112 ; 2. అలంకారం. కృ శకు. పీఠి. 26.

క. హవణి. అంగీకార యోగ్యమయిన

**హవణింపు** వి. 1. అలంకారం. శశా. 2.69 ; 2 మనోజ్ఞం, హృద్యం. **హవణిల్లు** అ.క్రి. 1. ప్రకాశించు. వేంక. పంచ. 1.70 ; 2. విజృంభించు. **హవణిక** రూ. హవళికె. వి. 1. జాగరూకత. రాజవా. 4.129 ; 2. అలంకారం, ఒప్పు. విజయ. 3.179 ; 3. విధం. చంపూరా. 3.98 ; 4. అవధానం. క. హవణికె. ఆలోచన, కోరిక.

< క. హవణికె.

**హవణించు** రూ. హవనించు, హవళించు. స.క్రి. 1. చక్కబర్చు. జైమినిభా. 6.28 ; 2. తాల్చు, ధరించు. పాండు. 1.52 ; 3. ఆరాధించు. సుద. 3.67 ; 4. రచించు. రఘు. 2పు. 9పం ; 5. ఉంచు. ప్రబంధ. 78, సత్యా. సా. 3.57 ; 6. అలంకరించు. శశా. పీఠి. 65 ; 7. పొందు. చంపూరా. 5.52 ; అ.క్రి. విజృంభించు, చెలగు. వాల్మీ. 3.125.

క. హవణిసు, అవణిసు. తయారుచేయు, సిద్ధం చేయు, సంక్షిప్తం చేయు.

< క. హవణిసు.

**హవణు** వి. 1. ఒప్పిదం. కువ.చ. 4.155 ; 2. జాగరూకత. నిరంకు. 2.29 ; విణ. అలవి, శక్యం. వరాహ. 4.3. 3. విలాసం, విజయ. 1.29 ;

క. హవణు, హవణ్. కొలత, సరైనకొలత, పద్ధతి, తగినది ;

సం. ప్రమాణ. కొలత, పరిమాణం.

< క. హవణు.

**హవణుపడు** అ.క్రి. పొందుపడు, చక్కబడు. **హవణుపఱుచు** స.క్రి. పొందుపర్చు. చక్కబర్చు. పాండు. 2.8.

**హవనించు** రూ.చూ. హవణించు. స.క్రి. 1 చక్కబర్చు ; 2. రచించు ; 3. తాల్చు, ధరించు ; 4. అలంకరించు ; 5. పొందు ; 6. తిరస్కరించు ; 7. ఉంచు ; అ.క్రి. విజృంభించు, చెలగు.

**హవలదారు** రూ.చూ హవాలాదారు. వి. సైన్యంలో చిన్న ఉద్యోగి. నె.శా. 2సంపు. కందుకూరు. 47. క్రీ.శ. 1650.51.

**హవలా** రూ.చూ. హవాలు. వి. 1. వశం, స్వాధీనం , 2. కాపలా.

**హవలుదారు** రూ.చూ. హవాలాదారు. వి. స్థానిక సైనికోద్యోగి.

**హవల్దారు** రూ.చూ. హవాలాదారు. వి. సైన్యంలో చిన్న ఉద్యోగి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 789. క్రీ.శ. 1691.

**హవళికె** రూ.చూ. హవణిక. వి.అందం. ఠీవి, ఒప్పిదం. రాధికా. .131.

**హవళించు** రూ.చూ. హవణించు. అ.క్రి. ఒప్పు. శ్రీరం. మా. 4.164.

**హవా**[1] వి. బైబిల్లో పూర్వనిబంధన ప్రకారం ఆదిమ స్త్రీ. విశ్వే.శ. 67.

హిం. యూవా. మనుష్యులందరికి మొదటితల్లి ; ఉ. హవ్వా, మానవమాత, ఆదం భార్య ; పార. హౌవా. మానవమాత.

< ఉ. హవ్వా.

**హవా**[2] వి. గాలి.

హిం. ఉ పార. హవా. గాలి.

< ఉ. హవా.

**హవాల** రూ.చూ. హవాలు. వి. 1. స్వాధీనం ; 2. కాపలా.

**హవాలతుచేయు** అ.క్రి. ఒకరికి బదులుగా పూచీపడు.

హిం. హవాలత్. రక్షణ, రక్షణలో ఉంచటం ; గు. హవలో. వశం, బాధ్యత, సాపేక్షం ; ఉ. హవాలత్. రక్షణ, అధీనంలో ఉంచటం ; అర. హవాలత్. పూచీపడటం, బాధ్యత తీసుకోవటం ;

క. హవాలతె. హవాలత్తె. ఒకనికి బదులుగా పూచీ పడిన వ్యక్తికి అప్పు మార్చటం. త. అవాలత్తు.

< ఉ. హవాలత్ + చేయ.

**హవాలదారు** రూ.చూ. హవాలాదారు. వి. సైన్యంలో చిన్న ఉద్యోగి.

**హవాలా** రూ.చూ. హవాలు. వి. 1. శరీరబలం ; 2. కావలా : 3. అధీనం.

**హవాలాదారు** రూ. హవలదారు, హవలుదారు, హవల్దారు, హవాలదారు. హవాలుదారు , హవిల్దారు. వి. సైన్యంలో చిన్న ఉద్యోగి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 748.3. క్రీ.శ. 1577.

హిం. హవాల్‌దార్, హవల్‌దార్. రాజోద్యోగి, సైన్యంలో చిన్న ఉద్యోగి ; ఉ. హవాలాదార్, హవల్‌దార్. చిన్న సైనికోద్యోగి.

<ఉ. హవల్దార్.

**హవాలు** రూ. హలా, హవలా, హవాల, హవాలా. వి. 1. స్వాధీనం : 2. కావలా.

హిం. హవాల్. స్థితి, అవస్థ, పరిణామం, వృత్తాంతం ; ఉ. హవాలా. జాడ, ప్రయాణం, ఉదాహరణం, అప్పగించటం, స్వాధీన మొనర్చటం, హవాలా. మార్పు, స్వాధీనం.

<ఉ. హవాలా.

**హవాలుదారు** రూ.చూ. హవాలాదారు. వి. సైన్యంలో చిన్న ఉద్యోగి. పద్మ.యు. 14.

**హవిబలిఅర్చనలు** వి. హోమద్రవ్య సమర్పణం. ద.హిం. శా. సంపు. 10. శా.సం. 85. క్రీ.శ. 1127.

సం. హవిస్. హోమద్రవ్యం, బలి -. పూజాదికం, అర్చనా. పూజ.

<సం. హవిస్ + సం.బలి- + సం. అర్చనా + -లు.

**హవిల్దారు** రూ.చూ. హవాలాదారు. వి. 1. సైన్యంలో సుబేదారు కింది హోదాకు చెందిన సైనికోద్యోగి ; 2. జిల్లాలో సుబేదారు కింది అధికారం.

**హవుజు** రూ.చూ. అవుజు[1]. వి. 1. నీటికుండీ ; 2. దీర్ఘిక.

**హవుబుపలుచు** స. క్రి. అమర్చు. నిరంకు. 2.74.

**హవుదా** రూ.చూ. హౌదా. వి. ఏనుగు మీద వేయబడిన పీఠం.

**హవుదు** రూ. హౌదు. అవ్య. ప్రశంసార్థకం. వైజ. 1.128. విణ. అవ్వటం, అది, అవును. విజయ. 1.128.

క. ఔదు, హవ్వదు, హౌను. అదౌతుంది, అది, అదిఅలాగా, అవును.

<క. హవుదు.

**హవురా** రూ.చూ. అగురా. అవ్య. 1. ఆశ్చర్యార్థకం ; 2. ప్రశంసా సూచకం.

**హవురా** రూ.చూ. అగురా. అవ్య. 1. ఆశ్చర్యార్థకం ; 2. ప్రశంసా సూచకం.

**హవుసు** రూ.చూ. హౌసు. వి. సొగసు. ఇందు. 5.27, కృష్ణరా. 4.116.

హవుసుకత్తియ రూ.చూ. హౌసుకత్తె. వి. అందగత్తె; సౌందర్యవతి. హవుసుకత్తె రూ.చూ. హౌసుకత్తె. వి, అందగత్తె, సౌందర్యవతి. హవుసుకాఁడు రూ.చూ. అవుసుకాఁడు. విణ. 1. సౌందర్యవంతుడు ; 2. విటుడు 3. భోగి.

**హవెల** రూ.చూ. హవేలి. వి. భవనం, నగరు.

**హవెలి** రూ.చూ. హవేలి. వి. నగరు, రాజగృహం. విణ రాజుకు చెందిన.

**హవెలు** రూ.చూ. హవేలి. వి. భవనం, నగరు.

**హవేలి** రూ. హవెల, హవెలి, హవెలు, హవేళి. వి. 1. నగరు, రాజగృహం. విశ్వే. శ. 61 ; 2. పంచలో వేసే కూచం ; విణ. రాజుకి చెందింది.

హిం. ఉ. హవేలీ. ప్రాసాదం, భవనం, భార్య ; పార. హవిలీ. గృహం.

<ఉ. హవేలీ.

**హవేళి** రూ.చూ. హవేలి. వి. రాజగృహం, నగరు ; విణ. రాజుకి చెందిన.

**హవ్వీర** రూ.చూ. హంబీర. వి. 1. ధనవంతుడు ; 2. శూరుడు.

**హళిం** వి. ప్రభుత్వం రాబడిలో కొంతభాగం. HAS. 19.32 క్రీ.శ. 1550.

**హళిలి** రూ.చూ. హసలి. వి. గొంతుచుట్టూధరించే బంగారు కంటెలాంటి ఆభరణం.

**హషం** వి. అప్పుతాలూకు నానాతరగతులు.

హిం. హష్మత్. ఆనందం, గొప్పతనం, ఆడంబరం, గౌరవం, రాజసం ; ఉ. అర. హషమ్. వాహనం, సవారీ, ఆడంబరం, సూటు.

<ఉ. హషమ్.

**హషంఖానీ** వి. తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను. పెర్షియన్ డిజైను.

**హసదు** రూ.చూ. హసాదు. విణ. దొడ్డ, గొప్పవాడు.

**హసన్** రూ. అస్సన్, హస్సన్ విణ. అందమైన.

హిం, హసన్. నవ్వటం, వినోదించటం, జోకు ; ఉ. అర. హసన్. మంచి, అందమైన, సున్నితమైన. అలీకొడుకులలో పెద్దవానిపేరు.

<ఉ. హసన్.

**హసము** వి దండకూచి చేసినప్పుడు రత్న సరంజామాను మోసి తెచ్చే పరిచారకులు. అని. 3.19.

మరా. హషమ్. అనుయాయి, తైనాతి ; ఉ. హషమ్, హష్మల్. సేవకులగుంపు, సేవకాళి, యుద్ధ సామగ్రి ; పార. హషమ్. సామగ్రి, హష్మల్. సేవకులు ; అర. హష్మ్. సామగ్రి, హష్మల్. పరివారం.

<ఉ. హషమ్.

**హసల్** రూ.చూ. హాసలు. వి. 1. పన్ను ; 2. సుంకం ; 3. ముద్రవట్టం ; 4. తపాలాఖర్చు.

**హసలి** రూ. అసిలీ. హాశిలి వి. గొంతూచుట్టూ ధరించే బంగారు కంటెలాంటి ఆభరణం ;

హిం. హంస్‌లీ. మెడఎముక, ఒకవిధమైన కంఠాభరణం, బోరఎముక ; ఉ. హస్‌స్‌లీ. మెడకొంకులు గొంతు చుట్టూ ఆభరణంలాగా వేసుకునే బంగారు లేదా వెండితో చేయబడిన కంటె లేక పట్టెడ.

<ఉ. హస్‌స్‌లీ.

**హసాదు** రూ. అసాదు, హసదు. అవ్య. 1. గొప్పవారిఆజ్ఞ

అంగీకరించటాన్ని తెల్పటంకోసం విధేయులనే మాట. సారంగ. 1.30 ; 2. జయజయశబ్దంలో గొప్పవారిని సంబోధించేపడం.

క. హసాద, పసాద, పసాయ. వస్త్రాలు లేదా ఇతరమైన కానుకలు ;

సం. ప్రసాద-. విధేయత, ఆజ్ఞాబద్ధత మొ. వి.

<క. హసాద.

**హసావళి** వి. 1. కప్పుకునే దుప్పటి ; 2. తొడుగు.

**హస్కా** వి. రింగులాంటి ముక్కుపోగు.

హిం. హల్‌కా. పరిధి, హద్దు, గుండ్రం, రింగు, గుంపు, అవధి, ఏనుగులసమూహం ; ఉ. హల్‌కా. గుండ్రని.

**హస్తంతరము** వి. మారు, పర్యాయం

సం. హస్త-. చేయి, అంతర-. తేడా.

<సం. హస్త-+అంతర-+-ము.

**హస్తపుపారువ** మి. వి. మల్లబంధవిశేషం. హంస. 1.206.

సం. హస్త-. చేయి.

<సం. హస్త+-ము+-పారువము.

**హస్తమస్తక సంయోగముచేయు** అ.క్రి. 1. నమస్కారంచేయు, తలమీద చేయిపెట్టు. జైమినిభా. 8.116 ; 2. తల నిమురు (ఆదరవాత్సల్యాదులతో., కాశ. 1.51.

సం. హస్త-. చేయి, మస్తక-. శిరస్సు, సంయోగ-. కూడిక.

<సం. హస్త-+ మస్తక-+సంయోగ-+-ము+ చేయు.

**హస్తమి** వి. అష్టమి.

సం. అష్టమీ. పక్షంలో ఎనిమిదోరోజు.

<సం. అష్టమీ.

**హస్తము** వి. 1. చేత, నిర్వహణం. ద.హిం. శా. సంపు. 10. శా. సం. 580. క్రీ.శ. 1414 ; 2. అయిదుమూపాయలు.

సం. హస్త-. చేయి.

<సం. హస్త-+-ము (అర్థవిపరి.)

**హస్తములకుసిరికాయలు** వి. బ.వ. సులభంఅనటం. కాశీ. 6.125. **హస్తవాని** వి. చేయివాడి.

**హస్తవాని** చూ. హస్తము.

వి. పునాది. పెద.పు54.

**హస్తిభారము** రూ.చూ. అస్తిభారము.

**హస్సన్** రూ.చూ. హసన్. విణ. అందమైన.

**హస్సల్** రూ.చూ. హాసలు. వి. 1. పన్ను ; 2. సుంకం ; 3. ముద్రపట్టం ; 4. తపాలాఖర్చు.

**హస్సీలు** రూ.చూ. హాసలు. వి. ఉపలబ్దం, పన్ను.

**హస్సుమానగిరి** రూ. అస్మాన్‌గిరి. వి. ఉయ్యాలపందిరి.

హిం. ఉ. ఆస్మాన్. ఆకాశం.

**హా** అవ్య. 1. సంతాపాన్ని తెల్పుతుంది. భార. ద్రోణ. 2.242. ; 2. గడచిన విషయాన్ని జ్ఞప్తికితెచ్చుకోవటాని. సూచిస్తుంది. ఆము. 6.31 ; 3. ఆశ్చర్యార్థకం. పాండు 4.57 ; 4. గుర్రం. మొ వాటినితోలటానికిచేసే, ధ్వని. సారంగ. 1.85 ; 5. సుఖాదులవల్ల పారవశ్యాన్ని తెల్పుతుంది. విజయ. 1.52 ; 6. రోషాన్ని, ఆక్షేపణని తెలుపుతుంది. విజయ. 3.148 ; 7. ఆక్రోశార్థకం. దశా. 2.402.

**హాహా** అవ్య. సంతాపార్థకం. భార. శల్య. 2.248. ధ్వన్యను.

**హాకము** రూ.చూ. హాకీము1. వి. శాసకుడు, రాజు.

**హాకీము1** రూ. అక్కామియ్యా, ఎకిమీఁడు. హాకము. వి. 1. యజమానుడు. రంగా.చ. 2.218 ; 2. ప్రభువు ; 3. రాజు.

హిం. హాకిమ్. శాసకుడు, అధికారి ; మరా.హాకిమ్. పరిపాలకుడు, యజమానుడు, అధికారి, శాసకుడు, రాజప్రతినిధి ; ఉ. హాకిమ్. శాసకుడు, యజమానుడు, రాజు, సర్దారు ; పార. హాకిమ్. పరిపాలకుడు, న్యాయాధిపతి, ఆజ్ఞాపకుడు ; అర. హాకిమ్. న్యాయాధీశుడు, పరిపాలకుడు, న్యాయాధిపతి, ఆజ్ఞాపకుడు.

<ఉ. హాకిమ్.

**హాకీము2** రూ.చూ. హకీం. వి. వైద్యుడు.

**హాక్కు** రూ.చూ. హక్కు. వి. అధికారం.

**హాజ్** రూ.చూ. హాజు. వి. మక్కాయాత్ర.

**హాజరు** రూ. చూ.హజారము. వి. ఉనికి, సమక్షం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1192. క్రీ.శ. 1866.

**హాజరుచేయు** స.క్రి. ప్రవేశపెట్టు. **హాజరుజామీను** వి. నేరస్థుణ్ణి హాజరు పరచటానికిచ్చే జామీను. **హాజరుపట్టీ** వి. 1. (అటెండెన్సు రిజిష్టరు) వచ్చినపనివాళ్ళ కోసం ఏర్పరచిన మస్తరు పుస్తకం ; 2. బడికి వచ్చిన బాల బాలికల హాజరుపుస్తకం.

**హాజరుబాకీ** వి. 1. అటెండెన్సు రిజిష్టరు, హాజరుపుస్తకం ; 2. హాజరు.

ఉ. హాజిర్-బాష్. ఎడతెగకుండా ఉండే సేవకుడు, హాజర్-బాషీ. ఎప్పుడూ ఉండటం.

**హాజరుభాక్షీగా** క్రి. విణ. ప్రత్యక్షంగా.

**హాజరుభాక్షీగా** చూ. హాజరుబాకీ.

**హాజారము** రూ.చూ. హజారము. వి. ఆస్థానమండపం. రామాభ్యు. 2.77.

**హాజితు** వి. అవసరం. ద.హిం. శా. సంపు. 10.శా.సం. 759. క్రీ.శ. 1663.

హిం. ఉ. హాజత్. ఆవశ్యకత, ఆశ, కోరిక.

<ఉ. హాజత్.

**హాజీ** వి. మక్కాయాత్ర చేసిన వ్యక్తికి సంక్రమించే బిరుదు.

హిం. ఉ. పార. అర. హాజీ. మక్కాయాత్ర పూర్తి చేసిన పుణ్యమూర్తి.

<ఉ. హాజీ.

**హాజు** రూ. హాజ్. వి. మక్కాయాత్ర.

ఉ. అర. హాజ్ మహమ్మదీయుల మక్కాయాత్ర ; ఉ. హాజ్.

<ఉ. హాజ్.

**హాజూరు** రూ.చూ. హజారము. వి. సన్నిధి, సమ్ముఖం.

**హాటీ** రూ. ఆత, ఫాటీ. వి. పన్నె కట్టేటప్పుడు బద్దలమధ్య

పల్లలను సమంగా ఒత్తే కొయ్యబిళ్ళ.

**హాట్కము** వి. బంగారం. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 919. క్రీ.శ. 1750.

సం. హాటుక-. బంగారం.

<సం. హాటక-.

**హాధిరా** అవ్య. గుర్రాలు మొ. జంతువుల్ని అపటానికి సారథులు ఉపయోగించే మాట. కకుత్స్థ. 2.42, ధ్వన్యను.

**హానికాఁడు** వి. అపకారి.

సం. హాని-. నష్టం, కీడు, లోపం, గతి.

<సం. హాని-+కాఁడు.

**హామి** రూ.చూ. హామీ. వి, పూచీ, బాధ్యత, జామీను.

**హామితకాని** వి. జామీనుమీద ఇచ్చేవారకం, మధ్యవర్తి పూచీమీద పంట మొ. వి. పండించుకోవటానికి ముందుగా ఇచ్చిన సొమ్ము. **హామిదారు** రూ. హామీదారు. వి. పూచీ ఉండేవాడు. పార. -దార్. మతుబ్ప్రత్యయం. <హామి+ పార. -దార్. **హామిపడు** రూ. హామీపడు. అ.క్రి. పూచీపడు. **హామియిచ్చు (-ఇచ్చు)** రూ. హామీయిచ్చు. స.క్రి. దేనినైనా ఎవరికైనా పూచీగా ఇచ్చు.

**హామిక** రూ. ఆమిక, హామికె. వి. కొవ్వు, సర్వం, మదం. రాధికా. 3.3, అని. 3.126.

సం. అహమహమికా. నేనుముందునేను ముందు అని ఒకరితో ఒకరు రోషంగా అనటం ; ప్రా. అహమ హమిఅ, అహమహమియా, అహమహమియా.

<సం. అహమహమికా.

**హామికె** రూ.చూ. హామిక. వి. కొవ్వు, గర్వం, మదం.

**హామీ** రూ. హామి. వి. పూచీ, బాధ్యత, జామీను.

హిం.హామీ, అంగీకారం, సమ్మతి ; మరా. హామి, హామీ ; ఉ. అర. హామీ. రక్షించేవాడు, సంరక్షకుడు.

<ఉ. హామీ,

**హామీదారు** రూ.చూ. హామిదారు. వి. పూచీఉండేవాడు. **హామీపడు** రూ.చూ. హామిపడు. అ.క్రి. పూచీపడు **హామీయిచ్చు (-ఇచ్చు)** రూ.చూ. హామియిచ్చు. స.క్రి. ఎవరో ఒకరికి దేనినైనా పూచీగా ఇచ్చు.

**హాయి** వి. 1. సుఖం. ఇందు. ప. 4.37 ; 2. సంతోషం. చంద్రాంగ. 2.142, పార్వ. 4.102 ; 3. నెమ్మది.

క. పీ, హే. హాయి, సంతోషం, మంచి, ఆనందకరం.

<క. హాయి.

**హాయిమను(-అను)** అ.క్రి. సుఖించు. కువ. చ. 4.136.

**హాయిరె** అవ్య. సంతోషాన్ని తెల్పుతుంది. అహల్యా. 2.67.

**హారతి** రూ.చూ. ఆరతి. వి. నీరాజనం, ఆరతి. వల్నా పు.71.

**హారతికర్పూరము** వి. హారతికోసం ఉపయోగించే తెల్లని సుగంధద్రవ్యం.

**హారాముఖోర్** రూ.చూ. హరాంకోరు. వి. అన్యాయంగా డబ్బు ఆర్జించేవాడు, దుష్టసేవకుడు, దుర్జనుడు. ద. హిం. శా. 5. 1312. 5. క్రీ.శ. 1599.

**హాలీ** వి. ప్రకృతం.

హిం. ఉ. హాలీ. ఆధునికం, ప్రస్తుతం ; పార. హాల్. ప్రకృతానికి చెందింది.

**హాలీహూటీలు** వి.బ.వ. ఒకవిధమైన పూపం. ద. హిం. శా. సంపు. 10. శా.సం. 503. క్రీ.శ. 1312.

క. హోళిగె. పిండివంట.

**హాలు**[1] రూ. హాళ్. వి. 1. పరిస్థితి, చాటుపద్యమణిమంజరి. పు. 146 : 2. ప్రస్తుతం.

హిం. హాల్. ప్రస్తుతం, చెలామణిలోఉన్న, ఇప్పటి ; ఉ. అర. హాల్, హాలీ. ఆధునికమైన, కొత్త, ప్రస్తుతం, ఇప్పుడు, త్వరలో, చలామణిలోనినాణెం, సర్కారు బేరీజు ;

క. హాలి, హాలు. ప్రస్తుతం, ఇప్పుడు, చలామణిలో ఉన్న ; త. హాల్.

<ఉ. హాల్.

**హాలుసాలు** రూ. హాల్సాలు. వి. నడిచే సంవత్సరం, ఈసంవత్సరం. **హాలుసాలుమక్తా** వి. ఈ సంవత్సరం పంట. **హాల్సాలు** రూ.చూ. హాలుసాలు. వి. నడుస్తున్న సంవత్సరం.

**హాలు**[2] రూ. ఆలు[5]. వి. విశాలమైనగది.

ఇం. *Hall.* విశాలమైనగది.

<ఇం. Hall.

**హాలునామా** వి. వర్తమాన సంవత్సరం. పద్మ. యు. 42.

మరా. హాల్‌సాల్. నడుస్తున్న ఏడు ; ఉ. హాల్‌సాల్. వర్తమాన సంవత్సరం ; పార. హాల్‌సా, హాల్‌సాల్. వర్తమాన సంవత్సరం.

<ఉ. హాల్‌సాల్.+పార. నామా.

**హాల్సాలు** చూ. హాలు[1].

**హాళ్** రూ.చూ. హాలు[1]. వి. ప్రస్తుతం.

**హాళి**[1] వి. 1. ఒయ్యారం, విలాసం. శ్రీనాథునిచాటువు ; 2. సంతోషం. పాండు. 2.211 ; 3. ఆసక్తి. పాండు. 5.162 ; 4. పరిహాసం. కళా. 6.281 ; 5. ఉత్సాహం. హంసిక. రసిక. 2.7 ; 6. ప్రేమ, స్నేహం. రసిక. 5.172.

క. హాళె. స్త్రీద్యోతక పరప్రత్యయం.

**హాళి**[2] వి. నిజాందేశపునాణెం.

**హాళి**[3] రూ. ఆళి. వి. పద్ధతి, సర్దుబాటు. యయా. 1.106, పాండు. 2.217.

క. హాళి, హాటి. పద్ధతి, సర్దుబాటు, దాటి.

<క. హాళి.

**హావడి** రూ.చూ. హావళి. వి. ఉపద్రవం. ఆము. 4.245.

**హావళి** రూ. ఆవడి[1], ఆవళి, రావడి, హావడి. వి. ఉపద్రవం. వరాహ. 10.17, పాండు. 5.309.

క. హావళి. ఉపద్రవం, పీడ, బాధ.

<క. హావళి.

**హాశ్మిలు** రూ.చూ. హాసలు. వి. ఉపలబ్ధం, పన్ను.

**హాష్యాజముఖానా** వి. నాలుగుపక్కల ఒకరంగు మధ్య వేరొక రంగునూలు పెట్టి నేసిన జంపఖానా.

**హాస** విణ. కొత్త. అం.బా. 3.23 ; వి. కన్య.

సం. హాస-. నవ్వు.

<సం. హాన- (అర్థవిపరి.).

**హాసలు** రూ. హసల్, హన్సల్, హస్సీలు, హాశ్శీలు, హాసీలు, హాస్సల్. హాస్సలు, హాస్సీల్, హాస్సీలు. వి. **1**. ఉపలబ్ధం, పన్ను ; **2**. తపాలాఖర్చు.

హిం. హాసిల్· లబ్ధం, పంట ; మరా. హాశిర్. అద్దె, రెవెన్యూ ; ఉ.అర. హాసిల్. ప్రాప్తం, లాభం ; పార. హాసిల్. పన్ను.

క. హాసలు, హాసిలు. శిస్తు, తపాలాఖర్చు, సుంకం, పన్ను ; త. అచీల్, హాచిల్, హాచీల్.

<ఉ. హాసిల్.

**హాసీలు** రూ.చూ. హాసలు, వి. **1**. పన్ను ; **2**. పంట ; **3**. తపాలాఖర్చు.

**హాస్యగాడు** వి. శారదకాడు, పరిహాసకుడు.

సం. హాస్య-. నవరసాల్లో ఒకటి.

<సం. హాస్య-+-కాఁడు.

**హాస్సల్** రూ.చూ. హాసలు. వి. **1**. పన్ను ; **2**. తపాలాఖర్చు

**హాస్సలు** రూ.చూ. హాసలు. వి. **1**. పన్ను ; **2**. తపాలా ఖర్చు.

**హాస్సీల్** రూ.చూ. హాసలు. వి. **1**. పన్ను ; **2**. తపాలా ఖర్చు.

**హాస్సీలు** రూ.చూ. హాసలు. వి. **1**. పన్ను ; **2**. తపాలా ఖర్చు.

**హాహులు** వి. బ. వ. హెూహెూ అనేమాటలు, ఆడంబరాలు. ధ్వన్యను.

**హింశ** వి. నష్టం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 149. క్రీ.శ. 1161.

సం. హింసా. పీడ, మోసం, చంపటం, దొంగతనం.

<సం. హింసా.

**హిగ్గడికత్తియ** రూ. హిగ్గడికత్తె. వి. సైరంధ్రి.

**హిగ్గడికత్తె** రూ.చూ. హిగ్గడికత్తియ. వి. సైరంధ్రి.

**హిగ్గు** రూ.చూ. ఇగ్గు.[1] స.క్రి. వెనుకకు పంపు. శాల్ల.సం. 15.13.

**హిజర** రూ.చూ. హిజరి. మహామ్మదీయశకం.

**హిజరి** రూ. హిజర, హిజరీ. వి. మహమ్మదు మక్కానుండి మదీనాకు తన నివాసాన్ని మార్చిన సంవత్సరం.

అ. హిజ్రత్. ఇస్లామీ సంవత్సరం ; హిం.ఉ. పార. హిజ్‌రీ మహమ్మదీయశకం ; మరా. హిజ్‌రీ. అరబీ సంవత్సరం.

<ఉ. హిజ్‌రీ.

**హిజరీ** రూ.చూ. హిజరి. వి. మహమ్మదీయశకం.

**హిజారా** రూ.చూ. ఇజార్డా. వి. అదె.

**హిజారు** రూ.చూ. ఇజారు. వి. **1**. నర్తకి ధరించే నగంతొడ వరకు ఉండే చట్టలాగు, అర్ధోరుకం. కువ.చ. 1.186, శుక. 1.249 ; **2**. పురుషులు తొడుక్కునే లాగు, చల్లటం. శుక. 2.427.

**హిజుగు** వి. చిక్కు, బంధం. సత్య.సాం. 4ఆ.

ఉ. హజ్‌క్. చిక్కు ; పార. హజ్‌క్. తాడుతో కట్టడం, అదమటం, నొక్కటం.

<ఉ. హిజ్‌కి.

**హిజుహైనెస్సు** వి. ఇది ఆంగ్లప్రభుత్వం విధేయులైన మహా రాజులకిచ్చే బిరుదు. ద.హిం.శా. సంపు. 5.శా.సం. 1286.

ఇం. *His Highness*. ఆంగ్లబిరుదు.

<ఇం. His Highness.

**హిట్లరుమీసాలు** వి.బ.వ. ఫ్రెంచ్ కట్ మీసాలు

ఇం. *Hitler*. జర్మనీ నియంత.

<ఇం. Hitler+మీసము+-లు.

**హితవగు** చూ. హితవు.

**హితవరి** చూ. హితవు.

**హితవు** రూ. ఇతము, ఇతవు. వి. **1**. ప్రియం. మేలు కలిగించే మాట. భార.ఆది. 8.40 ; **2**. సఖ్యం, చెలిమి, యుక్తం. భార. శాంతి, 3.247 ; **3**. శ్రేయం సత్య. సాం. పు. 57 ; **4**. ఇష్టం, ప్రీతి.

సం. హిత-. తగిన, ఉపయోగకరమైన ; ప్రా. హిఅ-. మంగళం, ఉపకారం, హితకారం ; శౌ. హిద- ; పా. హిత-. ప్రయోజనకారి, అర్థం, శ్రేయం, ఆశీస్సు.

<సం. హిత-.

**హితవగు** అ.క్రి. నయించు. <హితవు+అగు. **హితవరి** రూ. ఇతవరి. విణ. మేలు చేసేవాడు, మేలు చేసేది. విక్ర. 3.96. <హితవు+-అరి. **హితవుఁడు** రూ.చూ. ఇతవుఁడు. వి. హితకారి. **హితవుపడు** అ.క్రి. ఇష్టపడు, ఆశపడు. హంస. 2.147.

**హింది** రూ.చూ. హిందీ. వి. ఉత్తరదేశభాషల్లో ఒకటి.

**హిందీ** రూ. హింది. వి. హిందీభాష.

హిం. ఉ.పార. హిందీ హిందూ దేశసంబంధమైన, హిందువు, హిందువుల భాషలో ఒకమాండలికంపేరు ;

త. ఇంతునీ. హిందీ, హిందూదేశసంబంధమైన, హిందువు, హిందూస్థాన నివాసి, హిందూభాష, ప్రధానంగా ఉత్తరహిందూదేశానికి సంబంధించి హిందూస్తాన్ కంతటికీ సామాన్యభాషగా వ్యవహరించబడేది.

<ఉ. హిందీ.

**హిందు** రూ.చూ. హిందూ. వి. భారతదేశంలో అక్షధర్మావ అంపనమొనర్చే సజ్జనుడు, అనవేమునిగూర్చి చెప్పిన చాటుపద్యం.

హిందురాజులు వి.బ.వ. హైందవప్రభువులు. ద.హిం. శా. సంపు. 10. శా.సం. 745 క్రీ.శ. 1530.

**హిందువు** రూ.చూ. హిందూ. వి. హిందూదేశస్థుడు. రంగా.చ. 2.39.

**హిందుస్తానము** రూ.చూ. హిందూస్తానము. వి. హిందూదేశం, భారతదేశం.

**హిందుస్తాని** రూ.చూ. హిందుస్తానీ. వి. హిందూస్తానీభాష.

**హిందుస్తానీ** రూ. ఇందుస్తానీ, హిందుస్తాని, హిందూస్తానీ. వి. హిందూస్తానీభాష.

హిం. హిందూస్తానీ. హిందూదేశసంబంధమైన, హిందూదేశభాష, భారతదేశంలో వ్యవహారంలో ఉండే సామాన్యభాష ; ఉ.పార. హిందూస్తానీ. హిందూ దేశపుభాష, హిందూదేశానికి సంబధించిన, హిందూ

దేశనివాసి.

<ఉ. హిందూస్తానీ.

**హిందుస్థానము** రూ.చూ. హిందూస్తానము. వి. హిందూదేశం, భారతదేశం.

**హిందూ** రూ. హిందు, హిందువు. వి. 1. హిందూదేశం. మను. 3.176. క్రీ.శ. 1470. ప్రాంతానికి చెందిన అనవేముని గూర్చిన చాటువు; 2. భారతదేశంలో అర్ష ధర్మావలంబన మొనర్చే సజ్జనుడు. మను. 3.142, ద. హిం. శా. సంపు. 10. క్రీ.శ. 1496.

హిం.ఉ. హిందూ. విగ్రహారాధకుడై వేదమతావలంబి యై హిందూదేశవర్తి అయిన వ్యక్తి; మరా. హిందూ, హిందవి, హిందీ, హిందువులకు సంబంధించిన; పార. హిందూ. భారతీయుడు, బానిస, గస్తీ తిరిగే వాడు, సేవకుడు, విగ్రహారాధకుడు, నలుపు, ప్రేయసీ వదనార విందస్థలాంఛనం;

సం. సింధు-. ఒకనదిపేరు, హిందు-. భారతీయుడు, మేరుతంత్రంలో ఈపదం ప్రయుక్తమైనా ఆప్రయోగాన్ని వాచస్పత్యకారుడు అంగీకరించలేదు.

<ఉ. హిందూ.

హిందూదేశము వి. భారతదేశం. హిందూరావుసురధాణి వి. ఒకరకం బిరుదు. ద.హిం. శా. సంపు. 10. శా. సం. 731. క్రీ.శ. 1496. హిందూవారు విణ. బ.వ. హైంద వులు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 753. క్రీ.శ. 1600.

**హిందూస్తాన్** రూ.చూ. హిందూస్తానము. వి. భారతదేశం.

**హిందూస్తానము** రూ. హిందుస్తానము, హిందుస్థానము, హిందూస్తాన్, హిందూస్థాన్, హిందూస్థానము. వి. హిందూదేశం, భారతదేశం. ఖడ్గ. 45.

హిం. హిందూస్తాన్, భారతదేశం. ఉత్తరంలో ఢిల్లీ నుంచి పాట్నాదాకా వ్యాపించిన భారతభూభాగం; ఉ. హిందూస్తాన్. భారతదేశం; పార. హిందూ-స్తాన్-; త. ఇందుస్తాన్.

<ఉ. హిందూస్తాన్.

**హిందూస్తానీ** రూ.చూ. హిందుస్తానీ. వి. హిందూస్తానీభాష: విణ. హిందూదేశసంబంధమైనది.

**హిందూస్థాన్** రూ.చూ. హిందూస్తానము. వి. హిందూదేశం, భారతదేశం.

**హిందూస్థానము** రూ.చూ. హిందూస్తానము. వి. హిందూదేశం, భారతదేశం.

**హిప్నోటిక్‌పవర్** వి. సమ్మోహనశక్తి.

ఇం. *Hypnotic power*. కృత్రిమ పద్ధతుల ద్వారా నిద్రను కల్పించే శక్తి.

<ఇం. Hypnotic power.

**హిప్నోటిజమ్** వి. సమ్మోహనం, యోగనిద్ర.

ఇం. *Hypnotism*. కృత్రిమ పద్ధతులద్వారా కల్పించేనిద్ర.

ఇం. Hypnotism.

**హిమ్మతు** రూ. హిమ్మతు. వి. ధైర్యం.

హిం. హిమ్మత్. ధైర్యం, శక్తి, సాహసం, పరాక్రమం; ఉ. అర. హిమ్మత్. ధైర్యం, పరాక్రమం, శకునం, యత్నం, దాతృత్వం, సాహసం, మొగ్గు;

క. హిమ్మత్తు. రక్షణ, గాలి, సంరక్షకత్వం, ప్రాపకం.

<ఉ. హిమ్మత్.

**హిరాకి** రూ. ఇరాకి, ఇరాకీ, ఇలాకి, హిరాకీ. వి. 1. గుర్రం. అని. 3.16; 2. వస్త్రవిశేషం. హంస. 5.356.

ఉ. ఇరాకీ, ఇరాక్. ఇరాకు సంబంధమైన, అరేబియాదేశం, బాగ్దాదు దీని రాజధాని; పార. ఈరాక్. ఇరాకీదేశం, ఈరాకీ. ఇరాక్ సంబంధమైన,-అ-ఈరాకీ.

<ఉ. ఇరాకీ.

**హిరాకీ** రూ.చూ. హిరాకి. వి. 1. గుర్రం; 2. వస్త్రవిశేషం.

**హిరాణి** రూ.చూ. హిరాణీ. వి. తురకల్లో. ఒకజాతి, పారశీదేశంవ్యక్తి. రంగా. చ. 2.38.

**హిరాణీ** రూ. హిరాణి. వి. తురకల్లో ఒకజాతి, రంగా.చ. 1.38.

ఉ. పార. ఈరాకీ. పారశీకుడు.

<ఉ. ఇరానీ.

**హిరాన్** యా. హిరాది. విణ. ఇరాన్‌దేశ సంబంధమైనది. ఖడ్గ. 69.

హిం. ఉ. పార. ఈరాన్. పారసీదేశం.

<ఉ. ఈరాన్.

**హివాలాశిలేదారు** వి. హవల్దారుకు కింది ఉద్యోగి. నె.శా. ఒంగోలు. 37.

**హిషారా** వి. సలహా, ప్రమేయం.

హిం. ఇశారా. గుర్తు, జాడ, సంజ్ఞ, సలహా, ఆజ్ఞ కన్నుకొట్టటం; ఉ. అర. ఇషారా. జాడ, సైగ; క. ఇషారె, హిషారె, సైగ, జాడ, సంజ్ఞ.

<ఉ. ఇషారా.

**హిసాబు** రూ. హిస్సాబి, హిస్సాబు. వి. లెక్క. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 767. క్రీ.శ. 1680.

హిం. ఉ. హిసాబ్. గణితం, లెక్క, రీతి, దశ. హిసాబీ. లెక్కలనెరిగినవాడు, నియమానుసారం, పార. హిసాబ్. లెక్కించటం, లెక్క, వెల, కొలత, పరిపాలనం, వ్యాపారం, హిసాబీ. లెక్కింపదగిన, విలువైన: అర. హిసాబ్. లెక్క.

<ఉ. హిసాబ్.

**హిస్స** రూ.చూ. హిస్సా. వి. భాగం.

**హిస్సా** రూ. హిస్స, హీస్సా వి. భాగం.

హిం. ఉ. హిస్సా. భాగం, మొత్తం, కోటా, ముక్క, తునక, మరా. అర. హిస్స. భాగం మొత్తం, విభాగం; క. హిస్సె. భాగం: త. ఇస్సా.

<ఉ. హిస్సా.

హిస్సాశ్రోత్రియం వి. ఎక్కువమందికి ఉమ్మడిగా ఇచ్చిన శ్రోత్రియం.

**హిస్సాదారు** వి. భాగస్వామి.

హిం. ఉ. అర. హిస్సాదార్. వ్యాపారంలో భాగ స్వామి ;
క. హిస్సె -. దార.
< ఉ. హిస్సా+పార-దార్.
**హిస్సాబి** రూ. హిసాబు. వి. లెక్క.
**హిస్సాబు** రూ.చూ. హిసాబు. వి. లెక్క.
**హిహి** రూ.చూ. ఇహిహి. అవ్య. పరిహాస సూచక ధ్వన్యను కరణ శబ్దం.
**హీనవాది** వి. దిక్కులేనివాడు, నీచుడు. ద.హిం.శా. సంపు. 4. శా. సం. 797. క్రీ.శ. 1553
సం. హీనవాదిన్. హీనభూయిష్ఠమైన వాదం చేసేవారు, నిరుత్తరుడు, న్యాయస్థానంలో ఓడినవాడు.
< సం. హీనవాదిన్. (అర్థవిపరి).
**హీమ్మతు** రూ.చూ. హిమ్మతు. వి. ధైర్యం.
**హీరతు** వి. ఆఫ్ఘనిస్థానంలోని హీరత్ నగరానికి చెందిన వారు.
ఉ.అర. హీరత్. ఆఫ్ఘన్‌స్తాలోని పట్టణవిశేషం.
< ఉ. హీరత్.
**హీరాది** రూ.చూ. హిరాన్. విశ. ఇరాన్‌దేశ సంబంధమైన.
**హీరింగు** వి. వాయిదా.
ఇం. *Hearing*. వినటం.
< ఇం. Hearing.
**హీస్సా** రూ.చూ. హిస్సా. వి. భాగం.
**హీహి** రూ.చూ. ఇహిహి. అవ్య. ఆశ్చర్య, తిరస్కార, హాస్యాదుల్లో ఉపయోగించే ధ్వనికి అనుకరణం.
**హీ హీ** రూ. చూ. ఇహిహి. వి. పరిహాస సూచక ధ్వన్యనుకరణ శబ్దం.
**హుకం** రూ.చూ. హుకుము. వి. ఉత్తర్వు, ఆజ్ఞ, అధికారి ఆజ్ఞాపత్రం.
**హుకు** రూ.చూ. హుక్కు. వి. కిటికీరెక్కలు గాలికి వాలకుండా పట్టిఉంచే, ఒకవైపున వంగిఉండే పరికరం.
**హుకుం** రూ.చూ. హుకుము. వి. 1. ఆజ్ఞ ; 2. ఒకపేట పేరు.
ఒ. హుకుమ్. ఆజ్ఞ, ఆదేశం.
**హుకుంనామా** వి. ఆజ్ఞాపత్రిక.
ఉ. హుకుమ్‌నామా. ఆజ్ఞాపత్రిక ; పార. హుకుమ్. నామహ్.
< ఉ. హుకుమ్‌నామా.
**హుకుమతి** రూ.చూ. హుకూమత్తు. వి. ఆజ్ఞ.
**హుకుము** రూ. పుకుము, హుకం, హుకుం, హుకూం, హుక్కుము, హుఖుమ్ము. వి. 1. ఉత్తర్వు, ఆజ్ఞ. రంగా. చ. 2.258 ; 2. శాసనం. విశ్వే.శ.
ఒ. హుకుమ్ ; అ. హుకుమ్. శాసనం ; హిం.ఉ. హుకుమ్. హుక్‌మ్. ఆజ్ఞ, ఆదేశం, శాసనం, అత్యాచారం ; మరా. హుకుమ, హుకుమ్మ. ఆజ్ఞ, శాసనం ; హుక్‌మ్. అనుమతి, తీర్పు, శాసనం అర. హుక్‌మ్.
< ఉ. హుకుమ్.
**హుకూం** రూ.చూ. హుకుము. వి. 1. ఆజ్ఞ ; 2. ఒకపేట పేరు.
**హుకూమత్తు** రూ. హుకుమతి. వి. శాసనం, ఆజ్ఞ.
ఉ. హుక్‌మత్. శాసనం.
< ఉ. హుక్‌మత్.
**హుక్క** రూ.చూ. హుక్కా. వి. పొగపీల్చే సాధనం.
**హుక్కా** రూ. పుక్క, పుక్కా, హుక్క. వి. పొగపీల్చే సాధనం. సింహ. శ. 25, భద్రశ. 50.
హిం. హుక్కా. పొగాకు పీల్చేగొట్టం ; మరా. హుక్కా. పొగతాగేసాధనం ; ఉ. అర. హుక్‌క, హుక్కా. పొగాకుపీల్చే గొట్టం, గైనేడు ; పార. హుక్‌క. పొగపీల్చే గొట్టం, నగలుకాని మందులుకాని కొనిపెట్టే పెట్టె అర. హుక్కాహ్. పెట్టె, భాండం.
< ఉ. హుక్కా.
**హుక్కు** రూ. ఊకు, హుకు. వి. కిటికీ రెక్కలు గాలికి వాల కుండా పట్టిఉంచే, ఒకవైపున వంగి ఉండే పరికరం.
ఇం. *Hook*. కొక్కెం.
< ఇం. Hook.
**హుక్కుమ్ము** రూ.చూ. హుకుము. వి ఆజ్ఞ, శాసనం. ఆనంద. పీఠి. 105.
**హుఖము** రూ.చూ. హుకుము. వి. 1. ఆజ్ఞ ; 2. ఒకపేట పేరు.
**హుంకించు (-ఇంచు)** అ.క్రి. హుమ్మని ధ్వనిచేయు. పల్నా. వ. 147. ధ్వన్యను.
**హుజత్తు** వి. 1. వ్యర్థ కలహం. నిరంకు. 139 ; 2. మోసం.
హిం. హుజ్జతె. వ్యర్థతర్కం, వివాదం, జగడం ; ఉ. హుజ్జత్. వివాదం. జగడం పార. హుజ్జత్. వాగ్వివాదం, వ్యర్థకలహం, జగడం ; అర. హుజ్జత్. తర్కం,జగడం.
< ఉ. హుజ్జత్.
**హుజుబిక్కొమరుడు** చూ. హుజుబెక్.
**హుజుబెక్** వి. ఉజ్‌బెక్ దేశసంబంధి, ఉజ్‌బెక్ జాతికి చెందినవారు.
**హుజుబిక్కొమరుడు** వి. తురకవాడు.
**హుజురు** రూ చూ. హజారము. వి. సన్నిధి, సమ్ముఖం. కువ. చ. 1.98, ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759.52. క్రీ.శ. 1663.
**హుజూర్** రూ.చూ. హజారము. వి. కలెక్టరాఫీసు.
**హుజూరు** రూ.చూ. హజారము. వి. 1. సమ్ముఖం, సన్నిధి. రాజ వా. 5.36 ; 2. ఆస్థానం, కొలువుకూటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 367.47. క్రీ.శ. 1680.
**హుజ్జ** వి. తార్కాణం.
**హుటాహుటి** విశ. అతిత్వరతం. మను. 1.76 : 2. గమన వేగం. విజయ. 3.142. ధ్వన్యను.
**హుడయరి** వి. ప్రభువు. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 50.
త. ఉడైయార్. ప్రభువు, యజమాని.
< త. ఉ.డైయార్.
**హుడుక** రూ. చూ. ఉడుక్క. వి. వాద్యవిశేషం, తోలు

వాద్యం.

**హుడుకు** రూ.చూ. ఉడుక్క. వి. చిన్న డమరుకం, వాద్య విశేషం, డబుడక్క. అం. భా. 1.128.

సం. హుడుక్క-, హుడుక్కా. చిన్నడోలు ; ప్రా. పా. హుడుక్కా, హుడుక్క-. వాద్యవిశేషం.

< ప్రా. హుడుక్కా.

**హుండా** వి. విభాగం.

మరా. హుండా. పెళ్ళికొడుకుగాని పెళ్ళికూతురు గాని ఇచ్చినసొమ్ము.

**హుండి** రూ. ఉండి[2], హుండీ. వి. 1. సొమ్ము ఇవ్వటానికి ఆజ్ఞాపత్రం ; 2. మొక్కుబళ్ళకోసం డబ్బు మొ. వి వేసే పాత్రవిశేషం 3. పిల్లలు డబ్బు దాచుకోవటానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిబుడ్డి.

హిం. ఉ. హుండి. మార్పిడిపత్రం, ప్రామిసరీ నోటు ; మరా. హుండీ.

< ఉ. హుండి.

**హుండీ** రూ.చూ. హుండి. వి. 1. సొమ్ము ఇవ్వటానికి ఆజ్ఞాపత్రం ; 2. మొక్కుబళ్ళకోసం డబ్బు మొ. వి. వేసే పాత్రవిశేషం ; 3. పిల్లలు డబ్బులు దాచుకునే గుండ్రని చిన్న మట్టి బుడ్డి.

**హుండ్రిక్కు** వి. డీ కొలపటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. అష్టమ. క. 2.124పు. 10పం. ధ్వన్యను.

**హునర్** వి. డిజైను, తివాసీనేతలో వచ్చిన పనివరస.

హిం. ఉ. హునర్. శిల్పం ; మరా. హున్నర్ నైపుణ్యం ; పార. హునర్ ;

సం. సుందర -. అందమైన.

< ఉ. హునర్.

**హుందా** వి. దర్జా.

**హుందాతనము** వి. గొప్పతనం.

**హుప్పనియూదు(-ఊదు)** స.క్రి. గట్టిగాఊదు, ధ్వన్యను.

**హుమా** రూ. హుమాయి, హుమాయీ, హుమావు. వి. 1. గుర్రం, అచ్చ.రా. బాల. 20, యామినీ. 4.74; 2. వాహనం.

హిం. ఉ. హుమా. పక్షివిశేషం, ఈ పక్షి ఎవరి శిరస్సుమీద ఎగిరితే వారు పాదుషా అవుతారని విశ్వాసం ; మరా. హుమ్యా. పక్షివిశేషం ; పార. హుమామ్. హుమా పక్షి, టెక్కెం, హుమా. భూమిమీద వాలకుండానిరంతరం ఎగిరే పక్షివిశేషం.

< ఉ. హుమా.

**హుమాయి** రూ.చూ. హుమా. వి. 1. గుర్రం. ఉ.రా. 5.191 ; 2. వాహనం.

**హుమాయీ** రూ.చూ. హుమా. వి. 1. వాహనం. దశా. 2.62 ; 2. గుర్రం.

**హుమారము** చూ. హుమా. వి. సవారి. అచలా. 1.20.

**హుమావు** రూ.చూ. హుమా. వి.పక్షివిశేషం .విశ్వే.శ. 43.

**హుంబాళిలు** వి.బ వ. నిట్టూర్పులు. ద్వి. పరమ. వి. 1943.

**హుమ్మను** అ.క్రి. హుంకరించు. భార. ద్రోణ. 2.25 ధ్వన్యను.

**హుమ్మరంచు** అవ్య. ద్రు. 'హుమ్' అనే ధ్వని చేస్తూ. శకుం. 2.227.

**హురుమంజ** రూ.చూ. హురుమంజి. వి. 1. పారశీకదేశంలోని ఒకమండలం ; 2. పారశీకదేశసంబంధి సముద్రం ; 3. ఆణిముత్యం.

**హురుమంజి** రూ. ఉరుమంజి[1] హురుమంజ, హురుముంజి, హురుముంజీ, హుర్మంజి, హుర్మ్మంజి, హుర్మ్మంజీ. వి. 1. పారశీకదేశంలోని ఒకమండలం. హర. 7.4 ; 2. ఆణిముత్యం, శ్రేష్ఠమైనముత్యం. చా.మం.1.122 ; 3. పారశీక సంబంధిసముద్రం.

ఉ.పార. హుర్ ముజ్. ఒకరేవుపట్టణం.

< ఉ. హుర్ ముజ్.

**హురుమత్తు** రూ. హన్మత్తు, హుర్మత్తు, హుర్మ్మత్తు. విశ. 1. అధికమైంది, గొప్పది. కృష్ణరా. 1.53 ; 2. పెద్దది : వి. అతివేగం. ప్రబంధ, 788.

అ. హుర్మత్. గౌరవం, పవిత్రత, సచ్ఛీలం ; హిం. ఉ. హుర్మత్. ప్రతిష్ఠ, గొప్పతనం ; మ.రా. హుర్మత్ ప్రతిష్ఠ, ప్రఖ్యాతి, గౌరవం ; అర. హుర్మత్.

< ఉ. హుర్మత్.

**హురుముంజీ** రూ.చూ . హురుమంజి. వి. 1. పారశీక దేశంలోని ఒకమండలం ; 2. పారశీకదేశ సంబంధి సముద్రం ; 3. ఆణిముత్యం.

**హురుముంజి** రూ.చూ. హురుమంజి. వి. 1. పారశీకదేశంలోని ఒకమండలం ; 2. పారశీకదేశ సంబంధిసముద్రం ; 3, ఆణిముత్యం, శ్రేష్ఠమైన ముత్యం.

**హుర్మంజి** రూ.చూ. హురుమంజి. వి. 1. పారశీకదేశంలోని ఒకమండలం ; 2. పారశీక దేశ సంబంధి సముద్రం ; 3. ఆణిముత్యం.

**హుర్మ్మంజీ** రూ.చూ. హురుమంజి. వి. 1. ఆణిముత్యం, శ్రేష్ఠమైన ముత్యం. పాండు. 4.234 ; 2. పారశీకదేశంలో ఒక మండలం ; 3. పారశీకదేశ సంబంధి సముద్రం.

**హుర్మ్మంజిపూస** వి. మంచిముత్యం. చంద్రాంగ. 2.37.

**హుర్మ్మంజి** రూ.చూ. హురుమంజి. వి. పారశీకదేశంలోని ఒక మండలం ; 2. పారశీకదేశ సంబంధి సముద్రం ; 3. ఆణి ముత్యం.

**హుర్మత్తు** రూ.చూ. హురుమత్తు. విశ. 1. అధికమైంది. గొప్పది. చంద్రాంగ. 3.86 ; 2. పెద్దది ; వి. అతివేగం.

**హుర్మ్మత్తు** రూ.చూ. హురుమత్తు. విశ. పెద్దదైన ; 2. అధికమైన ; వి. 1. అతివేగం ; 2. ఒకదుర్గంపేరు.

**హుళికి** రూ.చూ. హుళక్కి. వి. 1. నాస్త్యర్థకం, ఆ భావాన్ని తెల్పేపదం. హంస 5.3 ; 2. అసత్యం, కల్ల.

**హుళక్కి** రూ. హుళకి. హుళి, హుళికి, హుళిక్కి. వి. 1. నాస్త్యర్థకం, ఆభావాన్ని తెలుపుతుంది. కాశీ. 4.111 ; 2. అబద్ధం, అసత్యం.

క. పొళ్ళు, హొళ్ళు. కాళీ, అబద్ధం, చెత్త, అక్క. పొట్టుతీసిన ధాన్యం, విత్తనం, హుళక్కి. అబద్ధం.

< క. హుళక్కి.

**హుళి** రూ.చూ. హుళక్కి. వి. 1. నాస్త్యర్థకం, ఆ భావాన్ని తెలుపుతుంది. ; 2. కల్ల, అబద్ధం.

మాగాణిగా మార్చటానికి గట్లుకట్టి మడిగాచేయు. వైజ. 1.85.

**అచ్చుబాటు** రూ. అచ్చబాటు. వి. **2**. బాగాగురి.

**అచ్చా** విణ. బాగు, మంచిది.

హిం.ఉ. అచ్చా. బాగు, మంచిది.

త. అచ్చా. బాగు, మంచిది.

<ఉ. అచ్చా.

**అజారము** రూ.చూ. హజారము. వి. **1**. కొలువుకూటం; **2**. మొగసాల.

**అజ్జ**[1] రూ. హంజ.

**అంచనాదారుడు** రూ.చూ. అంచనదారుడు. వి. **1**. చేనుమీద పంటను చూచి విలువకట్టేవ్యక్తి; **2**. గుట్టమీద ఉప్పువిలువకట్టేవ్యక్తి.

**అంచె**[1]

**అంచెకలు** వి. వేరేచోటినుండి గుర్రాలపై వచ్చేకల్లు.

**అంజ**[3] క. అంజు. భయం.

<క. అంజు.

**అంజడు** వి. భయం లేనివాడు.

< అంజ[3] + - అండు.

**అటానా** వి. రాగవిశేషం.

ఉ. అదానా ఒకప్రత్యేకమైన స్వరమాధుర్య పద్ధతి.

త. అటానా. ఒక ప్రత్యేకమైన స్వరమాధుర్యపద్ధతి.

< ఉ. అదానా.

**అటిక** రూ. ఆటిక. రాజ. చ. 2.128.

**అటికె** వేసు.

**అటువ** వి. అటక.

**అట్టబండ** వి. అటక.

**అట్లనె** చూ. అట్లు[2].

**అట్లనే** చూ. అట్లు[2].

**అట్లు**[2]

**అట్లనె** రూ.చూ. అట్లనే. అవ్య. ఆవిధంగానే. **అట్లనే** రూ. అట్లనె. అవ్య. ఆవిధంగానే. కృష్ణరా 3.108.

**అడ**[3] రూ.చూ. వడి[1].

**అడలు**[1] రూ. హడలు.

**అడావడి** రూ. హడావడి.

**అడి**[4] రూ.చూ. వడి[1].

**అడిఅతుకు** రూ.చూ. వడి అతుకు. స.క్రి. బద్దెపోగులకు పడుగుపోగులు కలిపి వడిపెట్టు. **అడికట్టు** రూ.చూ. వడికట్టు. అ.క్రి. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు పురిదారం కట్టు; వి. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రలకు కట్టిన వడిదారాలకు లంకె పడేటట్లు వేసిన అల్లిక. **అడికట్టుజరుపు** రూ.చూ. వడికట్టు జరుపు. అ.క్రి. అచ్చతికినపడుగులో అతుకు పోగులు అచ్చులోనుంచి పన్నె ఇవతలికి జరుపు. **అడికట్టుబద్ద** రూ.చూ. వడికట్టుబద్ద. వి. అచ్చుకట్టేటప్పుడు వడిదారాల లంకెల్లో దూర్చిన బద్ద. **అడకత్తెర** రూ.చూ. వడికత్తెర. వి. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడిదారాలకు వేసిన లంకె. **అడికెపీట** రూ.చూ. వడికెపీట. వి. ఉన్ని వడికేటప్పుడు ఆడవాళ్ళు కూర్చోటానికి వేసుకొనే పీట. **అడికోల** రూ.చూ. వడికోల. వి. అచ్చులో వడిదారం కట్టిన కర్ర. **అడిగుది** రూ.చూ. వడిగది. వి. అచ్చుకర్రకుపైన కట్టినదారం. **అడిబద్దె** రూ.చూ. వడిబద్దె. వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం.

**అడుకు**[3] రూ.చూ. వడుకు. స.క్రి. కదురు మొదలైన వాటిని తిప్పి దూదిని నూలుగాతీయు.

**అడ్డ**[1]

**అడ్డెడు** వి. అరకుంచెడు.

<అడ్డ[1] +-ఎండు.

**అడ్డ**[2]

**అడ్డతిప్పలు** వి.బ.వ. వరుసగా ఉన్న చిన్నగుట్టలు.

**అడ్డగోలుగా (-కోలుగా)** క్రి. విణ. **3**. అస్తవ్యస్తంగా.

**అడ్డమిటియు** అ.క్రి. **1**. అడ్డును తొలగించు; **2**. దారివదలు.

**అడ్డా** రూ.చూ. అడ్డ[5]. వి. **1**. కూడలి; **2**. చోటు.

**అడ్డు**[2] రూ.చూ. వడ్డు. వి. ప్రధానమైన ఆహారధాన్యం ఇంటికివ్వకు వరిగడ్డి మంచి వాడుకలో ఉంది.

**అడ్డెడు** చూ. అడ్డ[1].

**అంట**[1] వి. భార.విరా: 4.20.

**అంటసాల** రూ.చూ. వంటసాల. వి. మహానసం, వంటిల్లు.

**అంటాకు**[1] రూ.చూ. అరిటాకు.

**అంటి**

**అంటిబొద్దులు** వి.బ.వ. పచ్చిబొంత అరటికాయను తరిగి తాలింపుపెట్టి చేసినకూర.

**అంటిల్లు** రూ.చూ. వంటిల్లు. వి. వంటచేసేగది.

**అంటు**[1]

**అంటించు** స.క్రి. **7**. దెబ్బలుకొట్టు. **అంటుసొంటు** వి. **1**. పొత్తు, సంబంధం ; **2**. మడి, ఆచారం.

**అండా** హండ, హండగె, హండి, హండీ.

**అండెం** చూ. అండా[1]. వి. మిరపకాయలు, పొగాకు మొ. వాటిని ఒకచోట ఉంచి కట్టిన పెద్దమూట.

**అతిశయము** వి. గర్వం.

సం. అతిశయ-. గొప్పగుణం కలిగి ఉన్న, విశేషమైన గుణం ఉన్న.

<సం. అతిశయ- (అర్థవిపరి.).

**అత్తరబుత్తర** చూ. అత్తరము.

**అత్తరము**

**అత్తరబుత్తర** విశ. మామూలు, సాధారణమయిన.

**అత్తరు**

**అత్తరుసాహెబు** వి. 1. అత్తరు అమ్మే సాయిబు; 2. సంతోషపెట్టేవాడు; 3. శృంగారపురుషుడు.

**అత్తరుదాను** రూ. అత్తర్‌దాన్. వి. పరిమళద్రవ్యాల పెట్టె.

ఉ. అత్ర్-దాన్. పరిమళద్రవ్యాలపెట్టె.

త. అత్తర్. గులాబిరేకుల నుండి తీసిన పరిమళ ద్రవ్యసారం.

<ఉ. అత్ర్ + దాన్.

**అత్తుగడ** రూ.మా. హత్తుగడ. వి. సామీప్యం. శ్రీరం.మా. 8.28.

**అదులాయించు** చూ. అదమాయించు. స.క్రి. 1. భయపెట్టు; 2. మందలించు.

**అదృష్టం** వి. భాగ్యం, మేలు (Luck).

సం. అదృష్ట-. చూడబడనిది, ఎరుగబడనిది, కర్మ-జన్యములై సుఖదుఃఖ హేతువులైన ధర్మాధర్మాలు.

<సం. అదృష్ట- (అర్థవిపరి.).

**అద్దము**

**అద్దములో ముడుపు** వి. అనిశ్చితంగా ఉన్నట్లూ లేనట్లూ స్పష్టంగా తెలియని ఏ విషయాన్నయినా 'అద్దములో ముడుపు' అని వ్యవహరిస్తారు. 'ముడుపు' అంటే 'మూట' అని అర్థం. అద్దంలో మాత్రమే చూపిన మూటలో ఏముందో చూచే వారికి తెలియదు.

**అద్దరించు** క. అద్దయిసు. ముంచు, పీల్చుకొను.

**అద్దు**[2] రూ.చూ. హద్దు.

**అద్దురాయి** రూ.చూ. హద్దురాయి. వి. గుమ్మంరాయి, గ్రామాలచివర పొలాలకు స్థలాలకు వీథులకు మధ్యహద్దులను సూచిస్తూ పాతిపెట్టినరాయి.

**అద్వైతము** వి. 3. చాదస్తం ; 4. అయోమయం

**అద్భుతము** వి. చాలాబాగు.

సం. అద్భుత-, అబ్బురం, ఆశ్చర్యం, శృంగారాది రసాల్లో ఒకటి.

<సం. అద్భుత- (అర్థవిపరి.).

**అధమం** వి. కనీసం.

సం. అధమ-. నీచమైనది, నింద్యమైనది, మిక్కిలిచెడ్డది.

<సం. అధమ- (అర్థవిపరి.).

**అనరుహుఁడు** వి. తగనివాడు. తాళ్ల. సం. 9.167.

సం. అనర్హ-. తగనివాడు.

<సం. అనర్హ -.

**అనాడీ** వి. చులకన.

హిం. అనాడీ. చదువుకోనివాడు, నిపుణుడుకానివాడు.

<హిం. అనాడీ.

**అనాడీచేయు** స.క్రి. చులకనచేయు.

**అనారుగ** క్రి. విశ. 1. పైపైన; 2. పదులుగా.

**అనాసొసం** వి. సిగ్గాశరం.

**అనిగెపుకాయ** వి. సొరకాయ, ఆనపకాయ.

**అనుకొల** రూ. అనుక్కోల.

**అనుకోల** రూ.చూ. అనుకొల. వి. చేపలు పట్టేవలలో ఒకరకం.

**అనుమండు** రూ.చూ. హనుమ.

**అనుశ్రుతము** వి. వంశపారంపర్యం.

సం. అనుశ్రుత. నిరాఘాటంగా, ఖాళీలేకుండా.

<అనుశ్రుత-. (అర్థవిపరి.).

**అనూరాగ** రూ. ఆరాద. వి. ఒకానొకకార్తె.

సం. అనూరాధా. ఒకానొక నక్షత్రం.

<సం. అనూరాధా.

**అంతరియామి** వి. అంతర్యామి. తాళ్ల. సం. 7.98.

సం. అన్తర్యామిన్. పరమాత్మ.

<సం. అన్తర్యామిన్.

**అంతలక్క** క్రి. విశ. అన్నిచోట్ల.

**అంతస్తు** వి. 7. పరువు; 8. హోదా.

**అందాజ** రూ.చూ. అందాజు. వి. 1. సుమారు, దాదాపు; 2. అంచనా; 3. ఊహ.

**అందాజు** రూ. అందాజ, అందాద.

**అందాద** రూ.చూ. అందాజు. వి. 1. సుమారు, దాదాపు; 2. అంచనా; 3. ఊహ.

**అన్నము** వి. 1. భోజనం ; 2. వండిన వరి అన్నం.

సం. అన్న -. వరి మొ. ధాన్యం.

<సం. అన్న- (అర్థవిపరి.).

**అన్నమోరామచంద్రా** వి. పేదవారి ఆర్తనాద-విశేషం.

సం. అన్న-. అన్నం; రామచంద్ర-. రాముడు.

< సం. అన్న - + - ము[1] + -ఓ[2] + సం. రామచంద్ర - + - ఆ[2].

**అన్నమోరామచంద్రా !** చూ. అన్నము.

**అన్యాలం** వి. అన్యాయం.

సం. అన్యాయ-. న్యాయంకానిది.

< సం. అన్యాయ-.

**అన్యోన్యము** వి. 1. ప్రేమ; 2. ఇష్టం.

సం. అన్యోన్య. పరస్పరం, ఇతరేతరం, ఒక అర్థాలంకారం.

< సం. అన్యోన్య. (అర్థవిపరి.).

**అప** రూ.చూ. అప్ప[1].

**అపరాధము** వి. జరిమాన, శిక్ష, తప్పు.

సం. అపరాధ-. ఆటంకం, అతిక్రమణం, ఉల్లంఘన.

< సం. అపరాధ-. (అర్థవిపరి.).

**అపృచ్ఛపుమాటలు** వి.బ.వ. ప్రశ్నించటానికి అనర్హుడైనవాడు. అపృచ్ఛుడు. అలాంటివాడిమాటలు, అలాంటి తప్పుడు మాటలు.

సం. అపృచ్ఛ-. అడగదగనిది.

< సం. అపృచ్ఛ - + మాట + -లు.

**అపేక్ష** వి. ప్రేమ, ఆదరం.

సం. అపేక్షా. అపేక్ష కాంక్ష, కోరిక.

< సం. అపేక్షా. (అర్థవిపరి.).

**అపోదొళ్ళ** వి. అవాయకుడు.

**అప్ప**[1] రూ. అప. అప్పా[1].

**అప్ప**[2] రూ.చూ. లప్ప. వి. గానుగచక్రం బెనగకుండ బిగించే కొయ్యముక్క.

**అప్ప**[3] వి. 4. అత్త.

**అప్పచ్చి** వి. 3. రొట్టె.

**అప్పణిచ్చు** చూ. అప్పణ. స.క్రి. అనుమతించు.

క. అప్పణే-.

**అప్పనములు** రూ.చూ. అప్పాలు. వి.బ.వ. భక్ష్యవిశేషాలు.

**అప్పము**

**అప్పలు** రూ.చూ. అప్పాలు. వి.బ.వ. భక్ష్య విశేషాలు. **అప్పాలు** రూ. అప్పనములు, అప్పాలు. వి.బ.వ. భక్ష్యవిశేషాలు.

**అప్పలు** చూ. అప్పము.

**అప్పా**[1] రూ.చూ. అప్ప[1].

**అప్పా**[2] క్రి. విశ. అప్పటివేళ.

**అప్పాలు** చూ. అప్పము.

**అప్పిసెం** అవ్య. ఎల్లప్పుడూ.

**అప్రాచ్యుడు** వి. ఒక తిట్టు.

సం. అప్రాచ్య. ప్రాచ్యదేశానికి చెందనివాడు.

< సం. అప్రాచ్య-. (అర్థవిపరి.).

**అఫ్సర్** రూ.చూ. ఆఫీసరు. వి. అధికారి, పెద్ద ఉద్యోగి.

**అబ్బ** వి. తండ్రితండ్రి.

అబ్బి రూ. అబ్బీ. వి. వాత్సల్యసూచకశబ్దం. **అబ్బీ** రూ.చూ. అబ్బి. వి. 1. తనయుడు; 2. వాత్సల్యం కలవాడిపట్ల ఉపయోగించేపదం. **అబ్బోడు** వి. కుటుంబంలో తక్కువ వయసు పిల్లవాడు.

**అబ్బి** చూ. అబ్బ.

**అబ్బీ** చూ. అబ్బ.

**అబ్బురపోవు** చూ. అబ్బురము.

**అబ్బురము**

**అబ్బురపోవు** అ.క్రి. ఆశ్చర్యపడు.

**అబ్బోడు** చూ. అబ్బ.

**అభిప్రాయము** వి. ఉద్దేశం.

సం. అభిప్రాయ-. లక్ష్యం, ప్రయోజనం, కోరిక, ఉద్దేశం.

< సం. అభిప్రాయ-. (అర్థవిపరి.).

**అభిమానము** వి. ఇష్టం, అనురాగం.

సం. అభిమాన-. అహంకారం, గర్వం, ఆత్మగౌరవం.

< సం. అభిమాన- (అర్థవిపరి.).

**అభ్యంతరము** వి. అడ్డు, ఆటంకం.

సం. అభ్యంతర-. లోపలిది, తెలిసినది, నడిమిచోటుదగ్గర సంబంధం కలది.

< సం. అభ్యంతర-. (అర్థవిపరి.).

**అభ్యర్థి** వి. 1. ఎలక్షన్లలో పోటీ చేసే వ్యక్తి; 2. ఉద్యోగానికి దరఖాస్తు చేసుకునేవ్యక్తి (candidate).

సం. అభ్యర్థిన్-. అభ్యర్థించేవాడు, కోరేవాడు.

< సం. అభ్యర్థిన్- (అర్థవిపరి.).

**అమడ** తాళ్ల. సం. 6.14.

**ఆమడబిడ్డలు** వి.బ.వ. కవలపిల్లలు.

**ఆమడాలపిల్లలు** చూ. ఆమడ. వి.బ.వ. కవలపిల్లలు.

**అమలు**[1] రూ. హమలు, హాములు.

**అమస** వి. అమావాస్య.

**అమసపాదుబాయి** రూ.చూ. హంసపాదుబావి. వి. బావిగోడలకు పక్కన దిమ్మలకు బదులు కర్రచక్రాలు వేసి గిలకబిగించిన ఉయ్యాలలాగా ఉండేబావి.

**అమసపేటి** రూ.చూ. హంసపేటి. వి. అంచులు హంసల ఆకారంలో పడేట్టు నేసిన డిజైను.

**అమసలంచు** రూ.చూ. హంసలంచు వి. హంస ఆకారంలో డిజైన్లు పడేటట్లు నేసిన అంచు.

**అమాతం** రూ.చూ. అమాంతము. అవ్య. అకస్మాత్తుగా, హఠాత్తుగా.

**అమానీ** వి. **1.** ప్రభుత్వ యాజమాన్యం; **2.** ప్రభుత్వ యాజమాన్యం కింది భూమి.

**అమానీదారు** వి. భూమిని ప్రభుత్వాధీనంలో ఉంచుకొనే ఉద్యోగి.

ఉ. అమానీ-ఎ-దార్. ప్రభుత్వయాజమాన్యం కలవాడు.

త. అమాని. ధర్మ కర్తృత్వం, న్యాసం, హక్కు-దారు అధీనంలో లేనిది.

< ఉ. అమానీదార్.

**అమాంతము** రూ. అమాంతం.

**అమాంబాపతు** రూ. హమాంబాపతు. వి. **1.** అన్నిరకాలు; **2.** అన్నిసంగతులు; **3.** అనేక వస్తువులు.

**అమీన్** రూ.చూ. అమీన. వి. **1.** శిస్తువసూలుచేసే చిన్న అధికారి; **2.** న్యాయాధికారి, తీర్పులలోని ఆస్తిజప్తులు వేలం మొ. వి. అమలు జరిపే ఉద్యోగి.

**అమీన్‌సాబ్** వి. సబ్ ఇన్‌స్పెక్టర్.

**అమీనా** రూ.చూ. అమీన. వి. **1.** శిస్తువసూలు చేసే చిన్న అధికారి; **2.** న్యాయాధికారి తీర్పులలోని ఆస్తిజప్తులు వేలం మొ వి. అమలుజరిపే ఉద్యోగి.

**అమీను** రూ.చూ. అమీన. వి. **1.** శిస్తువసూలు చేసే చిన్న అధికారి; **2.** న్యాయాధికారి తీర్పులలోని ఆస్తి జప్తులు వేలం మొ. వి. అమలు జరిపే ఉద్యోగి.

**అమీరు** రూ.చూ. హంబీర. వి. ధనికుడు.

**అమీరుండు** రూ.చూ. హంబీర. వి. ధనికుడు.

**అముర్తం** వి. అమృతం.

సం.అమృత- పీయూషం, సుధ.

< సం. అమృత-.

**అమోఘం** విణ. **1.** అద్భుతం; **2.** బాగు.

సం. అమోఘ-. వ్యర్థంకానిది, సఫలమైంది.

< సం. అమోఘ- (అర్థవిపరి.).

**అంపు**[3] రూ.చూ. వంపు. వి. **1.** తడవ, పర్యాయం; **2.** బండి చక్రానికి వేసేది.

**అంబ** వి. పశువు. 'అంబా' అనే పశువుల అరుపును బట్టి ఈ శబ్దరూపం కలిగి ఉంటుంది. ధ్వన్యను.

**అంబటేల** రూ. అమ్మటాల.

**అంబట్లతెడ్డు** చూ. అంబలి.

**అంబలి**

**అంబట్లతెడ్డు** వి. ఆటలో రెండు పక్షాల ఉండే-వ్యక్తి. అంబలిలోని తెడ్డు కుండలోపలకుండ బయట ఉన్నవిధంగా, ఉండేవిధంగా ఉన్నవ్యక్తి అని వ్యుత్పత్తి.

**అంబాజీపేట ఆముదం** వి. **1.** దొరక్కుండా తిరిగే-వ్యక్తి; **2.** పట్టుకుంటేవదలనివ్యక్తి. వ్యు. అంబాజీపేట తూర్పుగోదావరిజిల్లాలోని ఊరు. ఇక్కడ ఆముదాలు మంచివి.

**అంబేద** చి. భా. 3.93.

**అమ్మ**

**అమ్మక్క** వి. పెద్దమ్మ. < అమ్మ[1] + అక్క. **అమ్మతల్లి** వి. **2.** స్ఫోటకం **అమ్మయ్య** వి. **3.** పై తరగతి స్త్రీ. **అమ్మాయి** వి. ముసలావిడ.

**అమ్మలాట** రూ.చూ. అంబటేల. వి. అంబలి తాగేవేళ.

**అమ్మి** రూ. అమ్మి.

**అమ్మి** రూ.చూ. అమ్మి. వి. ఆడపిల్ల.

**అమ్మోరు** వి. **2.** బ్రాహ్మణస్త్రీ; **3.** స్ఫోటకం.

**అయ**

**అయగారు** వి. **3.** పురోహితుడు; **4.** అర్చకుడు.

**అయిడర్‌రాతు** రూ.చూ. హైదర్‌రాతు. వి. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళను మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి.

**అయితారం** రూ.చూ. ఐతారం. వి. ఆదివారం.

**అయిదుగుడు** వి. బెంగ.

**అయిసిరాలు** వి.బ.వ. సంపదలు.

సం. ఐశ్వర్య-. సంపద, భాగ్యం.

< సం. ఐశ్వర్య + -ము + -లు.

**అయిహిక** రూ.చూ. ఆహికము. వి. ఈ లోక సంబంధమైనది.

**అయ్య**

**అయ్యగారు** వి. **5.** పురోహితుడు; **6.** అర్చకుడు.

**అయ్యవారు** రూ. అయ్యోరు, ఐవారు.

**అయ్యోరు** రూ.చూ. అయ్యవారు. వి. **1.** ఉపాధ్యాయుడు; **2.** బ్రాహ్మణుడు.

**అర**[1]

**అరచెయ్యి** రూ. అరిచెయ్యి.

**అరుకు** వి. **2.** ద్రవరూపంలో ఉండేమందు.

**అరఖు** రూ. అరకు, అరుకు. వి. **3.** ద్రవరూపంలో ఉండే మందు.

**అరట** వి. మంట.

సం. అరటి-. ధ్వని చేయుటం.

**అరటి ఊచ** వి. అరటి బొందె. 'అరటి' కింది ఉపారోపం.

**అరటిబొందె** వి. అరటి ఊచ. 'అరటి' కింది ఉపారోపం.

**అరబీ** రూ. హరబి, కరబ్బి, హరబ్బీ.

**అరమర**[1]

**అరమరపునకుండా** అవ్య. చప్పుడు కాకుండా.

**అరయు**

అరసికొను రూ. అర్చుకొను, అర్సుకొను. స.క్రి. యోగక్షేమాలు తెలుసుకొను, భార. సౌప్తి.2.168.

**అర్చుకొను** రూ.చూ. అరసికొను. స. క్రి. 1. యోగక్షేమాలు తెలుసుకొను. 2. దెబ్బలువేయు.

**అర్సుకొను** రూ.చూ. అరసికొను. స.క్రి. యోగక్షేమాలు తెలుసుకొను.

**అరవ**[1]

**అరవ ఏకాంతం** వి. రహస్యం లేకుండా అందరికీ తెలిసిపోవటం. అరవలు రహస్యంగా గుసగుసలతో మాట్లాడుకున్నా అందరికీ తెలిసి పోతుందనే భావన తెలుగువారికి ఉంది. ఈ భావనానుగుణంగా ఏర్పడిన పదబంధమిది. **అరవ ఏడుపు** వి. దొంగ ఏడుపు. తమిళనాట మృతులతరఫున ఏడవటానికి కూలికి కొందరుంటారు. తమకేమీ సంబంధం లేకపోయినా కూలికోసం తెచ్చి పెట్టుకొన్న (దొంగ) ఏడుపును అరవ ఏడుపు అంటారు.**అరవగోల** వి. సంతగోల. భాష అర్థం కానప్పడు ఇతర భాషా వ్యవహర్తల మాటలు గోలగానే ఉంటాయి. **అరవచాకిరి** వి. గొడ్డుచాకిరి, ఎంత పని చెప్పినా వినయంగా చేసే సేవ.

త. అరవ-. తమిళం.

సం. రవ -. ధ్వని.

సం. రవ-. శబ్దానికి అజాదిత్వం కలిగి అరవ శబ్దమేర్పడి ఉండవచ్చు.

"అరవకుండా చేసే చాకిరీ" అని కృత్రిమ పదవ్యుత్పత్తి. అరువుగాచేసే చాకిరి అనికొందరు.

**అరసికొను** చూ. అరయు.

**అరసు** రూ.చూ. అఱచు. స.క్రి. మందలించు.

**అరాయించు** రూ.చూ. హరాయించు. స.క్రి. 1. జీర్ణించుకొను; 2. దొంగిలించు.

**అరాయించుకొను** రూ.చూ. హరాయించుకొను. స.క్రి. 1. అపహరించు; 2. దక్కించుకొను.

**అరి**[1]

**అరిగోస** వి. మిక్కిలి బాధ.

సం. ఘోష-. ధ్వని, గోల.

**అరి**[5] రూ.చూ. వరి[2]. వి. 1. శాలిధాన్యం; 2. శాలిసస్యం.

**అరిగ** వ్యుత్పత్తి భాగాన్ని తొలగించండి.

**అరిచెయ్యి** రూ.చూ. అరచెయ్యి. వి. చేతిమధ్య భాగం.

**అరిటాకు** రూ. అంటాకు[1]. వి. కదళీ పత్రం.

<అరిటి + ఆకు

'అరిటి'కి ఉపారోపం.

**అరిపొలం** రూ.చూ. వరిపొలం. వి. మాగాణి, వరి పండించే నేల.

**అరుకు** రూ.చూ. అరఖు. వి. ద్రవ రూపంలో ఉండే మందు.

**అరుగులు** చూ. అరఁగు. వి.బ.వ. సమాధులు.

**అరుణము** వి. రక్తం. భార. ఆరణ్య. 2.260.

సం. అరుణ-. కొంచెం ఎర్రనిది; ఎర్రనిది కపిల వర్ణం (కలరా), ఎరుపు, కొంచెం ఎరుపు, సంధ్యారాగం, కుష్ఠ విశేషం, పొన్న, జిల్లేడు, బంగారం, సిందూరం, రాగి.

<సం. అరుణ-. (అర్థవిపరి.).

**అరుపాకు (-ఆకు)** వి. తలస్నానానికి ఉపయోగించే పచ్చగా ఉండే చెక్కపొడి.

**అరుప్పొడి(-పొడి)** వి. తలస్నానానికి ఉపయోగించే పచ్చగా ఉండే చెక్కపొడి.

**అరువందంచేయు** స.క్రి. పాడుచేయు.

**అరుహము** వి. తగినది. తాళ్ల. సం. 7.79.

సం. అర్హ-. తగినది.

<సం. అర్హ-.

**అరుహానరుహాహములు** వి.బ.వ. తగినవి తగనివి. తాళ్ల. సం. 6.170.

సం. అర్హానర్హ-. తగినవి తగనివి.

<సం. అర్హానర్హ- + -ము + -లు.

**అర్క వివాహము** వి. దొంగపెళ్ళి, తృతీయ వివాహం చేసుకోదలచినవాడు 'జిల్లేడు'ను పెళ్ళిచేసుకోవాలి. కాబట్టి ఈ పలుకుబడి.

సం.అర్క-. జిల్లేడు; వివాహ-. పెళ్ళి.

<సం. అర్క వివాహ-. (అర్థవిపరి.).

**అర్కీన్** అవ్య. 1. బొత్తిగా; 2. ఏమాత్రం.

ఉ.హర్గిజ్-. బొత్తిగా.

<ఉ. హర్గిజ్.

**అర్చుకొను** చూ. అరయు.

**అర్జీ**

**అర్జీదావా** వి. ఫిర్యాదు పత్రం, అర్జీ.

**అర్థ** వి. అర్థరూపాయి, 50 పైసలు.

సం. అర్థ-. సగం.

<సం. అర్థ- (అర్థవిపరి.).

**అర్రిబర్రి** వి. తొందర.

ఇం. *Hurry*. తొందర;

*Worry*. చింత, విచారం.

<ఇం. Hurry + ఇం. Worry.

**అర్రై** రూ. చూ. వర్రై[3]. వి. వాగు, చిన్నవాగు, వానకురిసి పారేకాలవ.

**అర్సుకొను** చూ. అరయు.

**అఱచు** రూ. అరసు.

**అఱ్ఱ**[3] వి. 1., సిం. ద్వా. 4.270.

**అలం** చూ. అలమ్[2]. వి. 1. మెట్టపైరులో మొలచిన గడ్డిమొక్క; 2. తీగగా విస్తరించే ఒక రకమైన కలుపుమొక్క.

**అలక**[1] రూ. అల్కా[1].

**అలకంగా** రూ. అలక[1]. క్రి. విఱ. సులభంగా.

**అలక్ష్యం** వి. అగౌరవం.

సం. అలక్ష్య-. కన్పించనిది, చూడలేనిది, గమనించనిది.

<సం. అలక్ష్య- (అర్థవిపరి.).

**అలగ్** రూ. అలాగ. విఱ. వేరు.

హిం. ఉ. అలగ్. వేరు.

<ఉ. అలగ్.

**అలగ్‌సలగ్** క్రి. విఱ. వేరుగా.

**అలపొద్దు (-ప్రొద్దు)** రూ. అలబొద్దు. వి. సాయంకాలం భోజనం.

**అలబొద్దు (-ప్రొద్దు)** రూ. చూ. అలపొద్దు. వి. 2. సాయంకాలం భోజనం.

**అలబ్బండ (-బండ)** వి. వస్తువులను ఉంచటానికి గోడకు అమర్చిన రాతి పలక.

**అలాగ** రూ. చూ. అలగ్. క్రి. విఱ. వేరుగా.

**అలాయిబలాయి** వి. 2. ఒకరినొకరు కౌగలించుకొని పరస్పరం అభినందనలు తెలుపుకోవటం.

**అలాల్** వి. ఏటలగొంతు కోయుటం.

హిం. ఉ. హలాల్-. ఏట.

<ఉ. హలాల్.

**అలాల్కోరు** రూ. హలాలీఖోరు, హలాలు ఖోరు, హలాల్కోరు, హలాల్ఖోరు. వి. వీధులూడ్చేవాడు.

**అలికిర్లాంతరు** రూ. హరికేన్‌లాంతరు.

**అలితి** వి. కొలత.

**అలుకలు** వి.బ.వ. ముంగురులు. తాళ్ల. సం. 4.11.

**అలుకు**[2] వి. 2. కళ్ళాడి. అ.క్రి. విత్తనాలుచల్లు.

**అలుకుడు** వి. పొలంలో విత్తనాలు చల్లటం. **అలుకుడుచేయు** అ.క్రి. పొలంలో విత్తనాలుచల్లు.

**అలుసు** వి. మిక్కిలి సౌమ్యం, సరళత.

సం. అలస-. చురుకులేని, మందమయినది.

<సం. అలస-.

**అల్కా**[1] రూ.చూ. అలక[1]. విఱ. 1. తేలికయిన; 2. నీచమయిన.

**అల్కా**[2] రూ.చూ. ఇలాకా. వి. అధికారానికి లోబడి ఉండే ప్రదేశం.

**అల్పము** వి. 2. గర్వం.

సం. అల్ప-. తక్కువ.

<సం. అల్ప- (అర్థవిపరి.).-

**అల్లిరము** చూ. అల్లుఁడు. వి. అల్లుడికి చేసే విందు.

**అల్లు**[1]

**అల్లించు** స.క్రి. 2. ఎడ్లు మొ. వాటిని సరిగా నడిచేటట్లు అలిరించు.

**అలి** రూ. చూ. హలి. వి. ఒడ్డెబండి చక్రంలో ఇరుసుకు తగిలించిన చెక్కకు రెండువైపులా ఉండే అర్థ చంద్రాకారపు చెక్కలు.

**అవగాహన** వి. అర్థంచేసుకోవటం.

సం. అవగాహన-. (నీళ్లలో) మునగటం, స్నానం, ప్రవేశం, గ్రహించటం, తెలుసుకోవటం, స్నానం చేసేచోటు.

<సం. అవగాహన- (అర్థవిపరి.).

**అవతకాన** రూ.చూ. ఔదుఖానా. వి.1. పశువులు నీరుతాగే తొట్టినీరు నిలవచేయుటానికీ కట్టిన రాతికట్టడం; 2. నీటి తొట్టి.

**అవలోఢన** వి. చక్కగా విమర్శించటం.

సం. అవలోఢన-. అడుగంటూ కదల్చటం, కలియబెట్టటం.

<సం. అవలోఢన- (అర్థవిపరి.).

**అవశిష్టాలు** వి. కాలకృత్యాలు.

సం. అవశిష్ట-. మిగిలినది, పరిశిష్టం.

<సం. అవశిష్ట-. + - ము - లు (అర్థవిపరి.).

**అవాలా** రూ. చూ. హవాలా. వి. అధీనం, వశం.

**అవాల్తు** వి. పూచీ.

ఉ. హవాలాత్-. రక్షణ, రక్షణంలో ఉంచడం.

త. అవాలత్తు-. ఒకరికి బదులు పూచపడటం.

<ఉ. హవాలాత్.

**అవిటి** వి. 2. ఆషాఢమాసం.

**అవిశరములు** వి.బ.వ. 1. సంపదలు ; 2. భోగాలు.

సం. ఐశ్వర్య-. సంపద, భోగం.

<సం. ఐశ్వర్య-.

**అవుజు**[1] రూ. హవుజు, హౌజు. వి. 5. నీటితొట్టి.

**అవుజుఖానా** రూ. చూ. ఔదుఖానా. వి. 1. స్నానాల తొట్టి; 2. నీటితొట్టి.

**అవుదుఖానా** రూ.చూ. ఔదుఖానా. వి. 1. స్నానాల తొట్టి; 2. నీటితొట్టి.

**అవుషధము** వి. మందు. తాళ్ల. సం. 10.65.

సం. ఔషధ-. మందు.

<సం. ఔషధ-.

**అవును**[1]

**అవుసుకత్తియు** రూ.చూ. హౌసుకత్తె. వి. అందగత్తె, సౌందర్యవతి. **అవుసుకత్తె** రూ.చూ. హౌసుకత్తె. వి. అందగత్తె, సౌందర్యవతి. **అవుసుకాఁడు** రూ. హవుసుకాఁడు, హౌసుకాఁడు.

**అష్టం** రూ. అష్టమి. హస్తమి. వి. సెప్టెంబరు రెండోభాగంలో వచ్చేకార్తె.

సం. హస్తా-. ఒకానొక నక్షత్రం.

<సం. హస్తా.

**అష్టకష్టాలు** వి.బ.వ. అపరిమితమైన కష్టాలు, లెక్కలేనన్ని కష్టాలు.

సం. అష్టకష్ట-. ఎనిమిదిరకాలైన కష్టాలు (1. దేశాంతర గమనం, 2. భార్యవియోగం, 3. ఆపత్కాలబంధుదర్శనం, 4. ఉచ్ఛిష్టభోజనం, 5. శత్రుస్నేహం, 6. పరాన్నప్రతీక్షణం, 7. అప్రతిష్ఠ, 8. దారిద్ర్యం.)

<సం. అష్టకష్ట- + - ము + - లు (అర్థవిపరి.)

**అష్టమి** రూ.చూ. అష్టం. వి. సెప్టెంబరు రెండోభాగంలో వచ్చేకార్తె.

**అసర్** వి. 1. శక్తి; 2. ప్రభావం.

హిం. ఉ.అసర్-. ప్రభావం.

< ఉ. అసర్.

**అసలుప్రతి** వి. 1. మొదటిప్రతి; 2. మేలుప్రతి.

ఉ. అస్ల్. మూలం, నిజం, ఆధారం.

త. అచల్-. పిరతి, మూలం, మేలుప్రతి.

<ఉ. అస్ల్ + సం. ప్రతి.

**అసల్‌దారు** వి. యజమాని, స్వామి.

హిం.ఉ. అసల్‌దార్-. యజమాని.

<ఉ. అసల్‌దార్.

**అసామీవారి** రూ. ఆసామీవారి. అవ్య. వేరువేరుగా.

ఉ. అసామీ - వ -వార్-. వ్యక్తిగతమైన రెవిన్యూ సెటిల్మెంట్.

త. అచామి వారి-. వేరువేరుగా.

<ఉ. ఆసామీ + పార.వార్.

**అసిమి** తాళ్ల. సం. 8.176.

**అసిలి** రూ. అసిలేరు. వి. ఆగస్టు మధ్యభాగంలో ప్రవేశించే ఆశ్లేషకార్తె.

సం. ఆశ్లేషా. ఒక నక్షత్రం.

<సం. ఆశ్లేషా.

**అసిలీ** రూ.చూ. హసలి. వి. గొంతుచుట్టూ ధరించే బంగారుకంటెవంటి ఆభరణం.

**అసిలేరు** రూ.చూ. అసిలి. వి. ఆగస్టు మధ్యభాగంలో ప్రవేశంచే ఆశ్లేషకార్తె.

**అసివారు** రూ. స్వారీ.

**అసుంట** క్రి. విశ. అటుపక్కగా.

<అటు + ఉంట.

**అసుంటి** విశ. అటువంటి.

<అటు + వంటి

**అస్తము** వి. 2. చెయ్యి, హస్తం.

**అస్మాన్ గిరి** రూ.చూ. హస్సమానగిరి. వి. ఉయ్యాలపందిరి.

**అస్సన్** రూ.చూ. హసన్. విశ. అందమైన, ఒకవిధమైన.

**అహంకారం** వి. క్రోధం, గర్వం, విప్ర.

సం. అహంకార-. నేను అనే అభిమానం, గర్వం, తత్త్వభేదం.

<సం. అహంకార- (అర్థవిపరి.).

**ఆకడము** రూ.చూ, ఆగడము. వి. అవివేకం.

**ఆకాశ-**

**ఆకాశరామన్న ఉత్తరం** వి. ఊరూపేరూ (చిరునామా) లేకుండా రాసిన లేఖ (Anonymous letter).

**ఆకిలి** రూ.చూ. వాకిలి. వి. ఇంటి ముందటి స్థలం. 2. బట్టీపొయ్యికి ఎదురుగా ఉన్నస్థలం.

**ఆకు** వి. 17. పేకముక్క.

**ఆగంచేయు** చూ. ఆగడము. స.క్రి. నిరాశ్రయునిగాచేయు, దిక్కులేనివానిగాచేయు.

**ఆగడము** రూ. ఆకడము.

**ఆగతి**

సం. ఆగతి-. రాబోయేది.

<సం. ఆగతి- (అర్థవిపరి.).

**ఆగభోగాలు** వి.బ.వ. సంపదలు.

సం. అంగభోగ-. దేహాంగాలకు జరిపే భోగం.

<సం. అంభోగ - + - ము + - లు.

**ఆగమాలు** వి.బ.వ. గంగమ్మపై గొల్లవారు ఆరవీడు జాతరలో పాడేపాటలు.

సం. ఆగమ-. శ్రుతి, వేదం.

<సం. ఆగమ - + - ము + - లు (అర్థవిపరి.).

**ఆగు**$^2$ రూ.చూ. వాంగు. వి. ఉరవడిగా పారే వాననీటి కాలవ, వానకురిసి పొలంలో పారే నీటిజాలు, చెరువుకు నీళ్ళు వచ్చేకాలవ.

**ఆంకొమ్ములు** రూ.చూ. వామికొమ్ములు. వి.బ.వ. ఆములో కుండల్ని పేర్చినపుడు రెండోవైపు కుండలకు మధ్య ఏర్పడే భాగం.

**ఆక్షేపణము** వి. హేళన.

సం. ఆక్షేపణ-. అడ్డంకి, దూరు, ఆకర్షించటం.

<సం. ఆక్షేపణ- (అర్థవిపరి.).

**అచాపురి** వి. బాధ్యతారాహిత్యం.

సం. **అశాపర-**. ఆశపోతు.

<సం. ఆశాపర-.

**ఆట**[1]

**ఆటగొర్రు** రూ.చూ. వాటుగొర్రు. వి. భూమిదున్నేగొర్రు నాగలితో దున్నిన తర్వాత పెళ్ళలు నలగడానికి దీంతో దున్నుతారు, మామూలుగా మూడుచెక్కలుంటాయి. **ఆటవిడుపు 2**. విరామం, విశ్రాంతి; **3**. అనులుకాకపోవటం.

**ఆటిక** రూ.చూ. అటిక. వి. పాత్రవిశేషం.

**-ఆడ**[3] రూ.చూ. వాడ[1]. వి. ఊరు.

**అడికె** వి. చాంచల్యం.

క. **అడికె-**. గమనం.

<క. అడికె.

**అత** రూ.చూ. హాటీ. వి. పన్నెకట్టేటపుడు బద్దల మధ్య పుల్లలను సమంగా ఒత్తేకొయ్యదిళ్ళ.

**ఆత్మారాముడు** వి. **3**. జీవుడు.

**ఆదర్శం** వి. **1**. ఉదాహరణాత్మకమైన నడవడిక; **2**. ఉన్నతభావం.

సం. **ఆదర్శ-**. అద్దం.

<సం. ఆదర్శ (అర్థవిపరి.).

**ఆదాయము** వి. రాబడి, సంపాదన, ఆర్జన. శేష.భా.4.

సం. **ఆదాయ-**. తీసుకోవటం, గ్రహించటం.

<సం. ఆదాయ- (అర్థవిపరి.).

**అధ్వర్యము** రూ.చూ. అధ్వర్యవము. వి. పర్యవేక్షణ.

**అధ్వర్యవము** రూ. అధ్వర్యము. వి. పర్యవేక్షణ.

సం. **అధ్వర్యవ-**. అధ్వర్యునకు సంబంధించినది యజుర్వేదానికి సంబంధించినది.

<సం. అధ్వర్యవ- (అర్థవిపరి.).

**ఆనక** రూ. అనాక, ఆనంక, ఆనిక.

**ఆనంక** రూ.చూ. ఆనక, అవ్య. తర్వాత.

**ఆనిక** రూ.చూ. ఆనక. అవ్య. తర్వాత.

**ఆను** రూ.చూ. వాను. స.క్రి. సారెమీద కుండలు మొ. వాటిని చేయు.

**ఆందోళనం** వి. ఆత్రుత, కంగారు, అలజడి.

సం. **ఆందోళన-**. ఊగటం, ఊయాలు.

<సం. ఆందోళన- (అర్థవిపరి.).

**ఆన్రె** రూ.చూ. వాన్రె. వి. వారిటె, కాడికుంటెనా, కాణితల, కాణిగొలుసు, కుంటెన, అరకకట్టినప్పుడు కాడిని నొగలపై చేర్చి కట్టేవారు, మోకుదూర్చడానికి వీలుగా కట్టినతాడు.

**ఆపతి** వి. ఆపద. భాగ. 12.27.

'ఆపతి మొక్కులు, సంతతి కుంట్లు' అని సామెత.

సం. **ఆపత్తి-**. ఆపద.

<సం. ఆపత్తి-.

**ఆపాటిచెయ్యి** వి. అంతవాడు, వ్యంగ్యంగా అనేటప్పటి పలుకుబడి.

**ఆపిద్దె** వి. దేవునిగది.

**అప్‌గోర** రూ.చూ. అపుకోరా. వి. పానపాత్ర.

**ఆఫీసరు** రూ. అఫ్సర్.

**అభరణం** వి. బేడ.

సం. **ఆభరణ-**. నగ, అలంకారం.

<సం. ఆభరణ-. (అర్థవిపరి.)

**అమడాలు** చూ. అమడ. వి.బ.వ. జంట.

**అమవడ**

త. **అమవలై-**. అవడ.

<త. ఆమవలై.

**ఆమి**[2] రూ.చూ. వామి. వి. గడ్డిమేటు.

**అమిక** రూ.చూ. హోమిక.

**అము**[6] రూ.చూ. వామి. వి. గడ్డిమేటు.

**అముకు** స.క్రి. నిప్పురాజేసి చేటతోగాని, తడికతోగాని విసురు.

**ఆముదము** రూ. ఆయిందం.

**ఆముదాలు పంచు** స.క్రి. దివాళాతీసి అప్పుతీసుకొన్న దానికంటె తక్కువ ఇచ్చు.

**ఆముదాలుపంచు** చూ. ఆముదము.

**ఆమె** రూ. వామె.

**ఆమోదము** వి. అంగీకారం.

సం. **ఆమోద-**. సంతోషం, పరిమళం.

<సం. ఆమోద-. (అర్థవిపరి.).

**ఆయువారము** రూ. యాయవారము, యాయివారము.

**ఆయి**[6] వి. **1**. నాయనమ్మ; **2**. అమ్మమ్మ ; **3**. అమ్మ.

మరా. **అమ్-**. అమ్మ.

<మరా. అమ్.

**ఆయికుండ** రూ.చూ. వాయికుండ. వి. గంజిపోసుకునే మట్టిపాత్ర.

**ఆయితారం** రూ.చూ. ఐతారం. వి. ఆదివారం.

**ఆయిదం** రూ.చూ. వాయిదం. వి. కుంచెపురి అడుగుభాగం.

**ఆయిదారి** రూ.చూ. వాయిదారి వి. **1**. కుంచెపురి అడుగుభాగం; **2**. మగ్గం దోనెకూ దండెకూ మధ్య నేతభాగం.

**ఆయిద్యంకుండ** రూ.చూ. వాయిద్యం కుండ. వి.

భజన్లకి బుర్రకథలకి ఘటవాయిద్యంగా వాయించడానికి వాడే కుండ.

**అయిందం** రూ.చూ. అముదము. వి. **1.** అముదం చెట్టు; **2.** అముదం నూనె.

**అయిపిడస** రూ.చూ. వాయిపిడచ. వి. నేతనేసేటప్పుడు బట్ట ముందు భాగం.

**అయిల** రూ.చూ. వావిలి. వి. శేఫాలిక, నిర్గుండి.

**అయుష్యము** వి. ఆయుప్ప్రమాణకాలం, జీవితకాలం. కాశీ. 6.60.

సం. అయుష్య-. అయుస్సాధనం, అయుర్వృద్ధికరం, దీర్ఘజీవనం, దీర్ఘాయువు.

<సం. అయుష్య-. (అర్థవిపరి.).

**అరటము**

**అరటిలు** అ.క్రి. బాధపడు. తాళ్ల. సం. 8.224

**అరటిలు** చూ. అరటము.

**అరాద** రూ.చూ. అనూరాగ. వి. ఒకానొకకార్తె.

**అరిక్కూటి** చూ. అరిక వి. అరికలు అనే బియ్యాన్నివండి వార్చిన అన్నం. అరికధాన్యం రాయలసీమలో పండే ధాన్యవిశేషం.

**అరిగం** వి. కుంపటి.

**అరు**[5]

**అరుమూడైనా మూడు ఆరైనా** అవ్య. పరిస్థితి పూర్తిగా తలకిందులైనా, వ్యత్యస్తమైనా.

**ఆరె**[3]

**ఆరెమాట** వి. మరాఠీభాష.

**అర్నె** వి. **1.** ఒకరకం పగ్గం; **2.** వేటకుపయోగించే సాధనవిశేషం.

**అర్బుత్‌నాట్‌క్షౌరం** వి. సర్వనాశం.

ఇం. అర్బుత్‌నాట్ కంపెనీ-. ద్వితీయప్రపంచయుద్ధకాలం ఏర్పడ్డ అర్బుత్‌నాటెకంపెనీలో అనేకులు పెట్టుబడి పెట్టారు. ఇది అకస్మాత్తుగా దివాలా తీసింది. దీన్నిబట్టి అర్బుత్‌నాట్ క్షౌరం అనే పలుకుబడి ఏర్పడింది. తిరుపతిక్షౌరం కంటే ఇది తీవ్రమయిన పదబంధం.

**అర్సట్టి** రూ.చూ. వారసట్టి. వి. సారిపక్కన కుమ్మరి పెట్టుకునే చిన్న నీళ్ళపాత్ర.

**అలయం** వి. గుడి, కోవెల.

సం. అలయ-. ఇల్లు, స్థానం, తావు, చోటు.

<సం. అలయ-. (అర్థవిపరి.).

**అలస్యము** వి. జాగు.

సం. **అలస్య-.** అలసత్వం, మందగొడితనం, మాంద్యం.

<సం. అలస్య -. (అర్థవిపరి.).

**అలు**[5] రూ.చూ. హోలు[2]. వి. విశాలమైనగది.

**అళి** రూ.చూ. హోళి[3]. వి. పద్ధతి, సర్దుబాటు.

**అవరణ** రూ.చూ. ఆవరణము. వి. ఇంటిచుట్టూ ఉండేస్థలం.

**అవరణము** రూ. ఆవరణ. వి. ఇంటిచుట్టూ ఉండేస్థలం.

సం. అవరణ-. అచ్ఛాదనం, మూత, చుట్టి ఉండేది.

<సం. అవరణ -. (అర్థవిపరి.).

**అవల** రూ. అవల్ల.

**అవల్ల** రూ.చూ. అవల. వి. అపక్క.

**అవు**

**అవుదేవతలు** వి.బ.వ. అవుదూడలను అవుదేవతలంటారు. వీటిని పూజిస్తారు. ఈపూజించటాన్ని 'అవులపబ్బ' మంటారు. **అవుపబ్బము.** వి. అవుదూడలను అవుదేవతలంటారు. వీటిని పూజించటాన్ని 'అవులపబ్బ' మంటారు.

**ఆవేదన** రూ.గ్రా. ఆవేదనము. వి. బాధ.

**ఆవేదనము** వి. బాధ.

సం. ఆవేదన-. తెలపటం, వ్యక్తంచేయటం, వ్యాజ్యంతేవటం, వ్యాజ్యం.

<సం. ఆవేదన.

**అశీలు** రూ. ఆసీలు. వి. పన్ను.

**అశువు** వి. అప్పటికప్పుడు చెప్పే కవిత్వం.

సం. అశు-. వేగంకలది, చురుకైంది.

<సం. అశు-. (అర్థవిపరి.).

**అషామాషి** రూ. అషామాషి. వి. **2.** ఉబుసుపోక.

ఉ. అషమ్-. వ్యక్తి ; మౌసమ్. కాలం, వాతావరణం.

<ఉ. అషమ్ + ఉ. మౌసమ్.

**అషామాషీ** రూ.చూ. అషామాషి. వి. **1.** నిర్లక్ష్యం, తేలిక, **2.** ఉబుసుపోక.

**అషామాషీకబుర్లు** వి.బ.వ. కాలక్షేపంకోసం మాట్లాడుకునే మాటలు.

**అసం** రూ.చూ. హసము. వి. దూలాలకు అడ్డంగా కప్పుకింద చాలుగా పరచిన పొడుగాటి కొయ్య.

**అసపరుపు** రూ.చూ. వాసపరుపు. వి. ఇంటికి వాసాలు ఎత్తటం.

**అసపోత** రూ.చూ. వాసపోత. వి. ఇంటికి వాసాలు ఎత్తటం.

**అసామీవారి** రూ.చూ. అసామీవారి. అవ్య. వేర్వేరుగా.

**అసీలు** రూ.చూ. అశీలు వి. పన్ను.

**అసు**

**అసుదాడద** వి. పేకాటలో అసు, రాజు, రాణి,

జాకీ, మొత్తాన్ని కలిపి ఆసుదాడద అనిపేరు.

**అసువుచ్చు** రూ.చూ. వాసవుచ్చు. అ.క్రి. ఇంటికి వాసాల్ని వేయు.

**అసుబుచ్చు** రూ.చూ. వాసవుచ్చు. అ.క్రి. ఇంటికి వాసాల్ని వేయు.

**అసులోకండె** వి. **1.** అసులో ఉన్నకండె; **2.** అటూ-ఇటూ ఊపిరాడకుండా తిరిగే వ్యక్తి; **3.** విధిలేని పరిస్థితుల్లో మాత్రమే తిరిగి పనిచేసేవ్యక్తి; **4.** కలుపుకోరుమనిషి.

**ఆసోదకత్తి** చూ. ఆసోదము.

**ఆసోదకాడు** చూ. ఆసోదము.

**ఆసోదము** రూ.చూ. ఆసోద్యము. వి. శరీరంలో కన్పించే గాఢభావన. 15.225.

**ఆసోదకత్తె** వి. గాఢభావనకలస్త్రీ. తాళ్ల. సం. 3.126. **ఆసోదకాడు.** వి. గాఢభావనకలవాడు. తాళ్ల. సం. 3.514.

**ఆసోద్యము** రూ. ఆసోదము. వి. శరీరంలో కన్పించేగాఢ భావన. తాళ్ల. సం. 2.141.

సం. చోద్య-. ఆశ్చర్యం. సంస్కృతచోద్యపదానికి సమంతతః అనే అర్థంలో 'ఆ' అనేది చేరగా ఆచోద్య పదం ఏర్పడి దానినుండి తద్భవంగా 'ఆసోద్యము' తెలుగులో ఏర్పడి ఉంటుంది.

**అస్మాన్‌గిరి** రూ.చూ. హస్సుమానగిరి.

**ఆహికము** రూ. అయిహిక. వి. ఈలోకసంబంధమైనది. తాళ్ల. సం. 5.138.

సం. ఐహిక-. ఈలోకసంబంధమైనది.

<సం. ఐహిక-.

**ఆహుతి** వి. బలైపోవటం.

సం. ఆహుతి-. హోమం, హోమద్రవ్యం.

<సం. ఆహుతి-. (అర్థవిపరి.).

**-ఇ**[9] **2.** మతుబర్థంలో ఔపవిభక్తికాలకు వచ్చే ప్రత్యయం.

ఉదా. తెఱగంటి.

**-ఇ**[15] ప్రత్య. కృత్ప్రత్యయం.

**ఇంస** వి. హింస. తాళ్ల. సం. 6.6.

సం. హింసా-. హింస.

<సం. హింసా.

**ఇకమతు** వి. ఉపాయం, ఎత్తు.

ఉ. ఇకామత్-. నివసించటం, ఉండటం.

<ఉ. ఇకామత్.

**ఇక్క**[2] వి. పిక్క.

**ఇగటాలు** వి. హాసజం.

**ఇగలుపగలు** వి. బ. వ. మనఃస్పర్థలు, ద్వేషాలు.

**ఇగ్గు**[1] రూ. హిగ్గు. స.క్రి. వెనక్కిపంపు.

**ఇగ్గం** రూ. చూ. ఇంగలము[1]. వి. నిప్పు.

**ఇంగలము**[1] రూ. ఇగ్గం.

**ఇంగిలికము** రూ. ఇంగిలీకం.

**ఇచ్చుకపోవు** రూ. చూ. విచ్చుకు పోవు. అ. క్రి. కొత్త-కుండలు మొ. వి. నీళ్ళు పోసిన వెంటనే కాల్పులోపం వల్ల పగిలిపోవు.

**ఇచ్చిపోవు** రూ. చూ. విచ్చిపోవు. అ. క్రి. కొత్తకుండలు మొ. వి. నీళ్ళు పోసిన వెంటనే కాల్పులోపం వల్ల పగిలిపోవు.

**ఇచ్చు**[2] రూ. చూ. ఇంచు[1]. వి. సంతోషం.

**ఇచ్చు**[3] రూ. చూ. -ఇంచు[3]. ప్రత్య. ప్రేరణా-ర్థంలో '-ఇంచు[3]'కు మారుగా కొన్ని ధాతువులపై వచ్చే ప్రత్యయం.

**ఇచ్చులు** చూ. ఇచ్చు[1]. వి. బ. వ. వివరాలు.

**ఇచ్చులు కచ్చకాయలు** వి.బ.వ. వివరాలు.

**ఇజాఫా** రూ. యిజాఫా.

**ఇజారా** రూ. యిజాడా.

**ఇజారాదారుడు** రూ. యిజారాదారుడు.

**ఇజారు** రూ. యిజారు.

**ఇజార్‌నామా** వి. కౌలుకు లేదా అద్దెకి ఇవ్వబడేప్పుడు రాసుకునే దస్తావేజు.

ఉ. ఇజార్‌నామా-. కౌలుదస్తావేజు.

త. ఇజార్-నామా.

<ఉ. ఇజార్*నామా.

**ఇజ్జద్దారు** వి. గౌరవ ప్రతిష్ఠలున్న వ్యక్తి.

ఉ. ఇజ్జత్‌దార్-. గౌరవం ఉన్న వ్యక్తి.

<ఉ. ఇజ్జత్‌దార్.

**ఇంచు**[1] రూ. ఇచ్చు[2].

**-ఇంచు**[3] రూ. ఇచ్చు[3].

**ఇంజాత** అవ్య. ఇంతకుముందు.

**ఇంజాపు** రూ. చూ. వెంజాపు. వి. ఇంటి నడికొప్పను మోసే కర్ర.

**ఇట్కి** రూ. చూ. ఇట్టిక. వి. ఇటిక.

**ఇట్టిక** రూ. ఇట్కి.

**ఇట్ల** చూ. ఇట్లు.

**ఇట్లనె** చూ. ఇట్లు

**ఇట్లనే** చూ. ఇట్లు.

**ఇట్లు**

**ఇట్ల** అవ్య. ఈ విధంగా. తాళ్ల. సం. 5.67.

**ఇట్లనె** రూ. చూ. ఇట్లనే. అవ్య. ఈ విధంగానే.

ఇట్లనే రూ. ఇట్లనె. అవ్య. ఈ విధంగానే.

ఇడదీసుడు రూ. చూ. విడదీసుడు. వి. కత్తిరించిన ఉన్నికి ఏ రంగుకారంగు విడదియ్యటం.

**ఇడ్బడు** రూ. చూ. విడఁబడు. అ. క్రి. సరిచేసిన పడుగు పోగులు అరివిడిగా అగు.

**ఇడవామడవా** చూ. ఇడు. అవ్య. అన్ని విధాలా.

**ఇడిముంత** రూ.చూ. విడిముంత. వి. దొడ్డికి వెళ్ళేటప్పుడు నీళ్ళు పట్టుకొని వెళ్ళేముంత.

**ఇంటి**

**ఇంటిముఖంచూచు** అ. క్రి. ఇంటిని చూచు, ఇంటికి వెళ్ళు. **ఇంటి రాజులు** వి.బ.వ. ఇంటిలోని వారందరు.

**ఇతము** రూ. చూ. హితవు.

**ఇతవు** రూ. చూ. హితవు.

**ఇతవుండు** రూ. హితవుండు. వి. హితకారి.

**ఇతిల్లా** రూ. ఎతిల్లా. వి. తెలియజేయటం.

ఉ. ఇత్తిల్లా.

<ఉ. ఇత్తిల్లా.

**ఇత్తనంకుండ** రూ. చూ. విత్తనంకుండ. వి. జొన్నలు, సజ్జలు. మొ. విత్తనాల గింజలు పోసి పెట్టడానికి వాడే మట్టిపాత్ర.

**ఇత్తల** రూ. చూ. ఈతల. వి. ఇటుపక్క; విశ. తర్వాత.

**ఇదంమాలినవాడు** విణ. బుద్ధిలేనివాడు.

సం. విధ-. పద్ధతి, రీతి, విధానం.

**ఇనండి** వి. కిరసనాయిలు.

**ఇనాకమయ్యె పండుగ** రూ. చూ. వినాకమయ్య పండుగ. వి. వినాయక చవితి పండుగ. భాద్రపద శుద్ధ చవితి నాడు నేతపనివాళ్ళు మగ్గంసామానులన్ని కడిగి బొట్లు పట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు.

**ఇనాకమయ్యె పండుగు** రూ. చూ. వినాకమయ్య పండుగ. వి. వినాయక చవితి పండుగ, భాద్రపదశుద్ధ చవితినాడు నేతపనివాళ్ళు మగ్గంసామానులన్నీ కడిగి బొట్లు పెట్టి పూజ చేసి పండుగ చేసుకొంటారు.

**ఇనామ్** రూ. యినాం, యినాము.

**ఇనాయుక సవితి** రూ. చూ. వినాయక చవితి. వి. గణపతి చవితి. నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజచేసి పండుగ చేసుకొంటారు.

**ఇనుమడి** రూ. యిన్మడి.

**ఇంతజామ్** వి. ఏర్పాటు.

హిం. ఉ. ఇంతేజామ్, ఇంతజామ్-. ఏర్పాటు, వ్యవస్థ, బందోబస్తు.

<ఉ. ఇంతజామ్.

**ఇంద్రాణి** వి. విధవ.

సం. ఇంద్రుని భార్య, ఇంద్రాణీవావిధవా, అని తైత్తిరీయ బ్రాహ్మణం.

<సం. ఇంద్రాణీ (అర్థవిపరి.).

**ఇప్ప**[2] రూ.చూ. విప్ప. వి. పొట్టిగా నిటారుగా ఉండే చోటె; సున్నగా దళసరిగా బూడిదరంగులో ఉండే బెరడుకలచెట్టు (Isonandra Candollena Man)

**ఇప్ప** రూ. చూ. విప్ప. స.క్రి. కమానుతో దూది పింజె పింజెలుగా విప్పకొనేటట్లు చేయు.

**ఇమానంగా** క్రి. విణ. నిజంగా.

**ఇమ్మతు** రూ. చూ. హిమ్మతు. వి. 1. ధైర్యం; 2. శక్తి.

**ఇమ్మలు** వి.బ.వ. రెండింతలు.

**ఇయ్యక** చూ. ఈ[3];

**ఇయ్యపుడు** రూ. చూ. వియ్యంకుడు. వి. వియ్యం పొందిన వాడు, పెళ్ళికుమార్తె లేదా పెళ్ళికొడుకు తండ్రి.

**ఇయ్యం పొత్తు.** రూ. చూ. వియ్యంపొత్తు. వి. పెండ్లికి పిల్లలకు ఇచ్చి పుచ్చుకొనే అనుకూల్యం.

**ఇరకత్తి** రూ. చూ. వీరకత్తియు. వి. వియ్యంకురాలు.

**ఇరకాడు** రూ. చూ. వీరకాఁడు. వి. వియ్యంకుడు.

**ఇరగుంచె** రూ. చూ. విరగుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం.

**ఇరగుద్దు** రూ. చూ. విరగుద్దు. స. క్రి. పడుగు పోగులు విడబడేట్టు తట్టు.

**ఇరగుప్పొడు** రూ. చూ. విరగుప్పొడు. స.క్రి. ఆరిన నూలును విడిపించు.

**ఇరగుబ్బు** రూ. చూ. విరగుబ్బు. స.క్రి. రంగులద్దిన నూలు లడీలు పిడుపు కర్రతో దులుపు.

**ఇరదీయు(-తీయు)** రూ. చూ. వీరదీయు. స.క్రి. సరిచేసేటప్పుడు పడుగు పోగులు విప్పు.

**ఇరమాట** చూ. ఇరు. వి. రెండుసార్లు.

**ఇరంపరం** వి. వితరణ, ఈవి, దానం.

**ఇరాకి** రూ. చూ. హిరాకి. వి. 1. గుర్రం; 2. వస్త్ర విశేషం

**ఇరాకీ** రూ. చూ. హిరాకి.

**ఇరాద** రూ. చూ. ఇరాదా. వి. 1. ఉద్దేశం; 2. సూచన.

**ఇరాదా** రూ. ఇరాద. వి. 1. ఉద్దేశం; 2. సూచన.

ఉ. ఇరాదా-. సంకల్పం, అభిప్రాయం.

<ఉ. ఇరాదా.

**ఇరుగుబ్బొడు** రూ.చూ. ఇరుగుప్పొడు. స.క్రి. ఆరిన నూలును విడిపించు.

**ఇరుచు** రూ. చూ. విరుచు. స.క్రి. **1.** పడుగును రెండేసి గజాలకు ఒక్కొక్క మడతగా విడదీయు; **2.** విరబడేటట్లు చేయు.

**ఇరుతట్టు** వి. ఇబ్బంది, ఇరుకు, 'ఇరు'కు ఉపారోపం.

**ఇరుపు** రూ. చూ. విఱుపు. వి. **1.** పడుగులో కొలతను బట్టి వేసిన మడత; **2.** కొలతను బట్టి పడుగు మడిచిన చోట ఎక్కించిన కఱ్ఱ ; **3.** జొన్న మొ. వాటిని కోయటం.

**ఇరుపుగుది** రూ. చూ. విరుపుగుది. వి. పెడకోలకు తగిలించే మలకఱ్ఱ - కొన్నిచోట్ల మలబద్ద దారం.

**ఇరుపుసివ** రూ. చూ. విరుపు చివ్వ. వి. కొలతను బట్టి పడుగు మడిచిన చోట ఎక్కించిన కఱ్ఱ.

**ఇరువు** వి. **8.** పరపతి, పరువు, సామాజిక స్థాయి.

**ఇర్లంజాప** వి. రెండంగుళాల పొడవుండే చేప.

**ఇర్లబడు** రూ. చూ. విర్లబడు. అ. క్రి. ఏకేటప్పుడు దూది విచ్చుకొను.

**ఇర్లుకుంచె** రూ. చూ. విర్లుకుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు అరుబదునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం.

**ఇలాక** రూ. చూ. ఇలాకా. వి. రెవెన్యూ సర్కిలు, భూభాగం.

**ఇలాకా** రూ. అల్కా[2], ఇలాక.

**ఇలాజ్** వి. చికిత్స.

ఉ. ఇలాజ్-. చికిత్స.

<ఉ. ఇలాజ్.

**ఇలికత్తి** రూ.చూ. ఈలకత్తి. వి. కత్తిపీట.

**ఇల్లంబు** రూ. చూ. విల్లంబు. వి. తాడు కట్టిన వింటిబద్ద. దీనికి దాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు.

<విల్లు + అంబు.

**ఇల్లిటం** చూ. ఇల్లు[1].

**ఇల్లింటం** చూ. ఇల్లు[1].

**ఇల్లు**[1]

**ఇల్లాక** వి. పెరడు. **ఇల్లిటం** రూ. ఇల్లింటం. వి. ఇల్లరికం. **ఇల్లింటం.** రూ. చూ. ఇల్లిటం. వి. ఇల్లరికం.

**ఇల్లు**[2] రూ. చూ. విల్లు. వి. తాడుకట్టిన వింటిబద్ద; దీనికి తాడుతో కమాను వేలాడగట్టి దూది ఏకుతారు.

**ఇషార** రూ. చూ. ఇషారా. వి. సైగ, సంజ్ఞ.

**ఇషారా** రూ. ఇషార.

**ఇష్ణుకాంతరంగు** రూ. చూ. విష్ణుకాంతరంగు. వి. ఒక రకం లేత నీలం రంగు.

**ఇసక**

**ఇసక పొతర** వి. **1.** దండుగ మారి పని; **2.** ఎడతెగని శ్రమ, ఇసక పొతర ఎంత తవ్వినా మళ్లీ పూడిపోతూ౦టుంది.

**ఇసనకఱ్ఱ సీరె** రూ. చూ. విసినెకఱ్ఱ చీరె. వి. అంచుల మధ్య పడుగులో విసినెకఱ్ఱ మాదిరి డిజైన్లు నేసిన చీర.

**ఇసికి** రూ. చూ. ఇసుక. వి. **1.** ఇసక. **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డరాళ్ళపొడి.

**ఇసికె** రూ. చూ. ఇసుక. వి. **1.** ఇసక; **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్ళపొడి.

**ఇసిర్నిపడుగు** రూ. చూ. విసిరిన పడుగు. వి. మరాసుకు చుట్టిన పడుగు నూలు.

**ఇసుక** రూ. ఇసికె, ఉసిక, ఉస్క, ఉస్కె.

**ఇసురుకొట్టు** రూ. చూ. విసిరికొట్టు. స.క్రి. అముకు నిప్పరాజేసి చేటతోగాని తడికతోగాని విసరు.

**ఇసురుచేట** రూ. చూ. విసురుచేట. వి. అము రాజేయడానికి విసిరే చేట.

**ఇసురుతడిక** రూ. చూ. విసురుతడిక. వి. వెదురు బద్దల్తో అల్లిన తడిక.

**ఇసురురాయి** రూ. చూ. విసరుఱాయి. వి. పిండి తయారుచెయ్యడానికి వాడే సాధనం.

**ఇసుర్తడిక** రూ. చూ. విసురుతడిక. వి. వెదురు బద్దల్తో అల్లిన తడిక.

**ఇస్క** రూ. చూ. ఇసుక. వి. **1.** ఇసక; **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్లపొడి.

**ఇస్కె** రూ. చూ. ఇసుక. వి. **1.** ఇసక; **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్ళపొడి.

**ఇస్తఫా** రూ. చూ. ఇస్తీఫ. వి. రాజీనామా.

**ఇస్తిరి** రూ. యిస్త్రీ.

**ఇస్తిహోరు** రూ. యిస్తిహరు, యిస్తిహోరు, యిస్త్యారు.

**ఇస్తీఫ** రూ. ఇస్తఫా, యిస్తిఫా, యిస్తీఫా.

**ఇస్వీ** వి. క్రీస్తుశకం.

హిం. ఉ. ఈస్వీ-. క్రీస్తుశకం.

<ఉ. ఈస్వీ.

**ఇస్పదార్** రూ.చూ. ఇస్పాదార్. వి. భాగస్వామి.

**ఇస్సా** రూ.చూ. హిస్సా. వి. భాగం.

**ఇస్సాదార్** రూ. ఇస్సదార్, ఇస్సెదార్, హిస్సాదారు. వి. భాగస్వామి.

**ఇస్సెదార్** రూ.చూ. ఇస్సాదార్. వి. భాగస్వామి.

**ఇహీహి** రూ. హిహి, హిహీ, హీహీ.

**ఈ**[2]

**ఈకె**[1]. ఈడంగ. క్రి. విఠ. ఇక్కడనుంచి.

**ఈతాప** రూ.చూ. ఈతేప. వి. ఈ పర్యాయం,

ఈసారి. **ఈతేప** రూ. ఈతాప, ఈపాత. వి. ఈసారి, ఈ పర్యాయం. **ఈన** సర్వ. ఈయున రాఘవాభ్యుదయము 5.94.4. **ఈపాత** రూ.చూ. ఈతేప. వి. ఈసారి, ఈ పర్యాయం. **ఈవఱకు** అవ్య. ద్రు. ఇంతసేపటికి. కృష్ణ. రా. 270; ఉ.రా. 2.197.

**ఈ**[3]

**ఇయ్యక** అవ్య. ఇవ్వక, ఇచ్చు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థక రూపం. శుక. 3.35.

**ఈగురం** వి. **1.** పనిలోచూపే జాగ్రత్త; **2.** పొందిక.

**ఈచ**

**ఈచపడు** రూ.చూ. ఈచవడు. అ.క్రి. **1.** వాడు; తాళ్ల. సం. 11.3 ; **2.** బడలు ఈచవడు (-పడు) రూ. ఈచవడు.

**ఈజె** రూ.చూ. ఊజ. వి. చేపలుపట్టేసాధనం, ఇదిబోర్లించిన వెదురుగంపలా ఉంటుంది.

**ఈడు**[2]. రూ.చూ. వీడు[1]. అ.క్రి. పడుగుపోగులు ఆరి విడివిడిగా అగు.

**ఈడుమిగులు** అ.క్రి. వయసుకువచ్చు.

**ఈత**[2]

**ఈతవులి** వి. కొడవలి.

**ఈతల** రూ. ఇత్తల.

**ఈదర** వి. **2.** చలిగాలి.

**ఈదరగాలి** వి. **2.** చలిగాలి.

**ఈది** రూ.చూ. వీధి. వి. **1.** మొదటి అసుపీట కొయ్యలకు, చివరి అసుపీట కొమ్మలకు మధ్యభాగం; **2.** విశాలమయినబాట.

**ఈదిరేవు** రూ.చూ. వీధిరేవు. వి. అముకుమధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

**ఈదు**

**ఈదులు** రూ.చూ. వీధులు, వి.బ.వ. అములో కుండలు కట్టేటప్పుడు ఏ వరుసకావరస కన్పించేటట్లు గాలిపోవడానికి ఉంచే కొంచెం విశాలమైనసందులు. పొయ్యికి రేవుకు మధ్యలెవెల్ గా ఉండే సందులు.

**ఈదురి** రూ.చూ. వీధి. వి. విశాలమైనబాట.

**ఈప** రూ.చూ. వేప. వి. పెద్దవానయ్యేచెట్టు, దీనికలపను దూలాలుగా దర్వాజాకమ్ములుగా తలుపుచెక్కలుగా వాడ్తారు.

**ఈరగుంచె** రూ.చూ. విరగుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబడునులో ఉండగా అంటుకొన్న పోగులు విడబడేటట్లు కంచెతో దువ్వటం.

**ఈరముట్టులు** రూ.చా. వీరముష్టులు. వి.బ.వ వీరముష్టులు.

**ఈరముస్టులు** రూ.చా. వీరముష్టులు. వి.బ.వ. శివమతస్థులగు కుమ్మర్లను సంవత్సరానికొకసారి యాచించే ఒకజాతివారు.

**ఈరిగుంచె** రూ.చా. విరగుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబడునులో ఉండగా అంటుకొన్నపోగులు విడబడేటట్లు కుంచెతో దువ్వటం.

**ఈర్లకుండలు** రూ.చూ. వీర్లకుండలు. వి.బ.వ. ఈర్లదేవతకు ఊరుబయట జాతరచేసేటపుడు ఒకే గుడ్డను ఆలుమగలు చుట్టగా బెట్టుకొని నీళ్ళు తీసుకొచ్చే కుండలు.

**ఈర్వాన** చూ. ఈర్వెన. వి. ఈళ్ళు ఈర్చే దువ్వెన.

**ఈలకతి** రూ. ఇలికత్తి.

**ఈలపీట** వి. కత్తిపీట.

**ఈవలి** వి. **2.** వేడిగాలి.

**ఈశ్వరవేరు** వి. **2.** వశీకరణశక్తి (ఇతరుల్ని లోబరుచుకొనే శక్తి) నిచ్చే మూలిక; **3.** బుర్రఖరాబుచేసేవ్యక్తి.

**ఈసంబుడ్డ** రూ.చూ. - వీసం బుడ్డి. వి. సుమారు 15 శేర్లు పట్టేకల్లుకుండ.

**ఈసురుపోవు** అ.క్రి. గేదెలు ఆవులు మొదలైన వాటికి గర్భంపోవు.

**ఈహో** క్రి. విశ. పూనికతో, యత్నంతో.

క. ఈహె. యత్నం, పూనిక.

<క. ఈహె.

**ఉక్కిరి** వి. **2.** గుడ్డుతోచేసిన వంటకం.

**ఉంగరము**

**ఉంగరాలచేయి** వి. **1.** అధికారచిహ్నమైన ఉంగరం ఉన్నచేయి; **2.** ఉంగరం ఉన్న చేయి.

**ఉంగరాలచేయి** చూ. ఉంగరము.

**ఉంగిటి** వి. కపటం. తాళ్ల. సం. 15.210.

**ఉంగుటము** వి. **2.** కాలిబొటనవేలు దూర్చటానికి అమర్చబడ్డ చెప్పులోనిభాగం.

**ఉచ్చ**

**ఉచ్చగత్తువాసన** వి. మూత్రపువాసన.

**ఉచ్చాటము** వి. ఎక్కువ వేడిచేసి నిలువలేక వచ్చేపూనకం.

సం. ఉచ్చాట-, ఉచ్చాటన-. పెల్లగించటం, పిశాచాదుల్ని విడిపించటం, తనస్థానాన్నుంచి వెళ్ళగొట్టటం.

<సం. ఉచ్చాట- (అర్థవివరి.).

**ఉచ్చితార్థం** చూ. ఉచితము. వి. నిష్ప్రయోజనం.

సం. అర్థ - ప్రయోజనం, ధనం, వస్తువు.

**ఉచ్చిలం** వి. **1.** అల్లరి; **2.** చిలిపితనం.

సం. ఉచ్చల-. ఎక్కువ కదలటం.

<సం. ఉచ్చల-.

**ఉచ్చిలి** రూ.చూ. ఎచ్చిడి. వి. అల్పం.

**ఉచ్చిళ్ళు** రూ. ఉచ్చీలు. వి.బ.వ. మడతలు. తాళ్ల. సం. 11.3/2.

**ఉచ్చేలు** రూ.చూ. ఉచ్చిళ్ళు. వి.బ.వ. మడతలు.

**ఉంచము** వి. విలాసం. తాళ్ల. సం. 15.67.

క. ఉంచ విలాసం.

<క. ఉంచ.

**ఉంచు** చూ. ఉమియు. అ.క్రి. ఉమ్మివేయు.

**ఉట్లతిరనాల** చూ. ఉట్టు[5], తిరునాళ్లు. వి. కోరికలు తీరటానికి ఉట్లను వేపచెట్టుకు కట్టే జాతర్లు లేదా తిరునాళ్ళు.

**ఉఠాణీ** వి. **2.** గోడలకు సిమ్మెంటుపూత వేసేటప్పుడు, గోడకు అంటుకోగా మిగిలి కిందపడ్డ ఇసక.

**ఉడికీ** వి. రెండోపెళ్ళి.

**ఉడుకు** విశ. ఉక్క.

**ఉడుము**[1]

**ఉడుంపట్టు** వి. గట్టిపట్టుదల. వ్యు. కోటగోడలు ఎక్కవలసినప్పుడు ఉడుము నడుముకు మోకులేదా మోకులు కట్టి పైకి విసిరేవారు. ఉడుము ఎంత జారుడుగోడలైనా పట్టుకొని వదలకుండా ఉంటుంది. ఈతాడు సాయంతో భటులు కోటగోడపైకి ఎక్కేవారు. కాబట్టి గట్టిపట్టుదల అనే అర్థం 'ఉడుంపట్టు' కు వచ్చింది.

**ఉడుంపట్టు** చూ.. ఉడుము[1].

**ఉడ్డ** వి. నాలుగు కాయలగుంపు.

**ఉడ్డోలము** వి. అధికం.

**ఉడ్డోలుడు** వి. **1.** నిపుణుడు; **2.** పండితుడు.

సం. ఉద్దాలక- మహాపండితుడయిన ఒక ఋషి.

**ఉండ** వి. **3.** బోండా.

**ఉండి**[2] వి. **3.** వరకట్నం.

**ఉతారు** వి. **3.** పల్లం.

హిం. ఉ. ఉతార్-. కిందికిదిగటం, కిందికి దిగటానికి యోగ్యమైన స్థానం.

<ఉ. ఉతార్.

**ఉతుకు** స.క్రి. **3.** కోపంతో బాగా కొట్టు.

**ఉత్కము** వి. నీరు.

సం. ఉద-, ఉదక-. నీరు.

<సం. ఉదక-.

**ఉత్తరసాల** వి. జనవరి మొదటిభాగంలో ప్రవేశించే కార్తె.

సం. ఉత్తరాషాఢా-. ఒకానొక నక్షత్రం.

<సం. ఉత్తరాషాఢా.

(2) **ఉత్తరాషాఢ పూర్వాషాఢలు** వి.బ.వ. వాంతులు విరోచనాలు.

సం. ఉత్తరాషాఢ-. ఒకనక్షత్రం. పూర్వాషాఢ-. ఒకనక్షత్రం.

<సం. ఉత్తరాషాఢపూర్వాషాఢ-. (అర్థవిపరి.).

**ఉత్వడుజ్జులు** వి.బ.వ. పుంస్త్వం, మగతనం. సంస్కృతప్రాతిపదికలకు తెలుగులో ప్రథమావిభక్త్యేకవచన రూపాలేర్పడేటప్పుడు ఉత్వడుజ్జులు 'పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుదియత్వంబున కుత్వంబగు పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు' (బాలవ్యా. తత్సమ. సూ. 21.22) అనే సూత్రాల వల్ల వస్తాయి. అదంతపుంలింగ సంస్కృతశబ్దాలకు మహత్తులగు మగాడులకు ఉత్వడుజ్జులు పై సూత్రాలవల్ల వస్తాయి. కాబట్టి ఉత్వడుజ్జులు అంటే 'మగతనం' అనే అర్థం కలిగి ఉంటుంది.

**ఉత్సవవిగ్రహం** వి. **1.** శక్తిహీనుడు; **2.** స్వతంత్రంగా వ్యవహరించలేనివ్యక్తి.

సం. ఉత్సవవిగ్రహ-. పండగలువచ్చినప్పుడు మూలదైవా (విరాడ్విగ్రహ్) నికి మారుగా ఊరేగింపు (ఉత్సవం) లో ఊరేగే విగ్రహం (ప్రతిమ) ఉత్సవ విగ్రహమని వ్యవహరించబడుతుంది.

<సం. ఉత్సవవిగ్రహ-.

**ఉదయము** వి. పొద్దున్న (Morning).

సం. ఉదయ-. సూర్యుడు మొ. పైకి లేవడం, పుట్టటం.

<సం. ఉదయ-. (అర్థవిపరి.).

**ఉదాత్తము** విశ. ఉన్నతమైనది, గొప్పది.

సం. ఉదాత్త-. స్వరభేదం, దానం, పెద్దమద్దెల, అలంకార భేదం.

<సం. ఉదాత్త-. (అర్థవిపరి.).

**ఉద్దార్కం** వి. ఉద్ధరించటం, మేలు.

సం. ఉద్ధారక-. ఉద్ధరించేది.

<సం. ఉద్ధారక-.

**ఉద్దిపప్పు** వి. మినప్పప్పు 'ఉద్ది' కింది ఉపారోపం.

**ఉద్దెర** వి. అరువు అప్పుగా వస్తువుల్ని తెచ్చుకోవటం,

హిం. ఉ. ఉధార్ అరువు

<ఉ. ఉధార్.

**ఉద్యమము** వి. అలజడి, విప్లవం.

సం. ఉద్యమ-. పూనిక, ప్రయాస సిద్ధమవటం, పైకెత్తటం

<సం. ఉద్యమ-. (అర్థవిపరి.)

**ఉద్యాపనచెప్పు** చూ. ఉద్యాపనము

**ఉద్యాపనమంత్రం పఠించు** చూ. ఉద్యాపనము.

**ఉద్యాపనము** వి. పూజానంతరం పునఃపూజకోసం మళ్ళీ

రమ్మని పిలవటం.

సం. ఉద్యాపన-. కడగటం

<సం. ఉద్యాపన-. (అర్థవిపరి.)

**ఉద్యాపనచెప్పు** అ.క్రి. పొమ్మనిచెప్పు **ఉద్యాపనమంత్రంపఠించు** స.క్రి. పొమ్మనిచెప్పు. 'పూజార్థంపునరాగమనీయచ' అనే మంత్ర భాగార్థం మరుగుపడిపోయింది.

**ఉద్యోగము** వి. జీవనోపాధి, పని, జాబ్.

సం. ఉద్యోగ-. ప్రయత్నం, పూనిక.

<సం. ఉద్యోగ-. (అర్థవిపరి.)

**ఉద్యోగరాఘవుడు** వి. పట్టుదల కలవాడు.

సం. ఉద్యోగ-. పని.

సం. రాఘవ-. రాముడు.

<సం. ఉద్యోగరాఘవ-. (అర్థవిపరి.).

**ఉద్యోగస్థుడు** వి. ఉద్యోగి, ఉద్యోగం చేసే పురుషుడు.

సం. ఉద్యోగస్థ-. పూనికలో ఉన్నవ్యక్తి.

<సం. ఉద్యోగస్థ-. (అర్థవిపరి.).

**ఉద్యోగస్థురాలు** వి. ఉద్యోగిని, ఉద్యోగం చేసే స్త్రీ.

సం. ఉద్యోగస్థ-. ప్రయత్నం చేసే వ్యక్తి.

<సం. ఉద్యోగస్థ- + అలు$^2$.

**ఉద్యోగి** వి. ఉద్యోగం చేసే వ్యక్తి.

సం. ఉద్యోగిన్-. వ్యాపారం గలవాడు, పూనికగలవాడు, పాటుపడేవాడు.

<సం. ఉద్యోగిన్- (అర్థవిపరి.).

**ఉద్యోగిని** వి. ఉద్యోగం చేసే స్త్రీ.

సం. ఉద్యోగినీ-. ప్రయత్నం చేసే స్త్రీ.

<సం. ఉద్యోగిని (అర్థవిపరి.).

**ఉద్రేకము** వి. ఆవేశం.

సం. ఉద్రేక-. విజృంభణ, అతిశయం, ప్రారంభం, మిక్కిలి.

<సం. ఉద్రేక- (అర్థవిపరి.).

**ఉద్వాసన** వి. పంపివేయటం.

వ్రతాదులను పూర్తి చేసినపుడు చేసే కార్యక్రమాన్ని సంస్కృతంలో ఉద్వాసన అంటారు. దాన్ని బట్టి వ్యవహారంలో పై అర్థం వచ్చింది.

<సం. ఉద్వాసన- (అర్థవిపరి.).

**ఉపసమ్మతి** వి. తృప్తి.

సం. ఉపసమ్మతి-. అంగీకారం.

<సం. ఉపసమ్మతి- (అర్థవిపరి.).

**ఉపారము** వి. 1. తాళ్ళ.సం. 12.220.

**ఉప్పగించు** స.క్రి. అంగీకరించు.

**ఉప్పటించు** అ.క్రి. 1. తీవ్రమగు; 2. ఒరయు.

**ఉప్పలమ్మ** చూ. ఉప్పలి$^2$.

**ఉప్పలి$^2$**

**ఉప్పలమ్మ** వి. ఒకానొక దేవత. ఈ దేవత ఇళ్ళగోడలపై పుట్ట ఆకారంలో వెలుస్తుంది.

<ఉప్పలి$^2$ + అమ్మ.

**ఉప్పిడి** రూ. చూ. ఉప్పఁబిండి. వి. 1. ఉప్ప వేసివండిన పిండి; 2. ఉప్మా.

**ఉప్పిండి$^2$** రూ.చూ. ఉప్పఁబిండి. వి. 1. ఉప్పవేసి వండిన పిండి; 2. ఉప్మా.

**ఉప్పీసం** చూ. ఉప్ప$^2$.

**ఉప్పీసం** చూ. ఉప్ప$^2$.

**ఉప్ప$^2$**

**ఉప్పీసం** రూ. ఉప్పీసం. వి. ఉప్ప చాలా ఎక్కువగా ఉండటం. <ఉప్ప$^2$ + ప్రా. విస-. **ఉప్పీసం** రూ.చూ. ఉప్పీసం. వి. ఉప్ప చాలా ఎక్కువగా ఉండటం. **ఉప్పపిరికి** వి. బాగా పిరికివాడు. యుద్ధరంగంలో ప్రతిపక్షాల దెబ్బలు తప్పించుకొంటూ గెలుపు సాధించటం ఉప్పతేవటమంటారు. దీనికి భయపడేవాణ్ణి "ఉప్ప పిరికి" అంటారు. ఉప్పను కప్పంగా స్వీకరించటం పూర్వకాలంలో రాజాచారం. **ఉప్పరియు** రూ. ఉప్పారు. అ.క్రి. మట్టిగోడల కిందిభాగమంతా ఉప్ప మట్టిగా మారి రాలిపోవు. **ఉప్పారు** రూ.చూ. ఉప్పరియు. అ.క్రి. మట్టిగోడల కింది భాగమంతా ఉప్ప మట్టిగా మారి రాలిపోవు.

**ఉప్పారు** చూ. ఉప్ప$^2$.

**ఉప్పెకుండ** రూ.చూ. వెప్పకుండ. వి. దసలికాయలను అవిరి మీద ఉడక బెట్టే కుండ.

**ఉబ్బరము** వి. 3. ఉక్కపోత.

**ఉబ్బరించు** అ.క్రి. 4. ఉక్కపోయు. **ఉబ్బరింత** వి. 1. ఉక్కపోత; 2. అతిశయం.

**ఉబ్బరింత** చూ. ఉబ్బరము.

**ఉమదు** విణ. అధికం.

క. ఉమరు-. వేడి, అధికం.

**ఉమరబడి** వి. వేడిమి. తాళ్ల. సం. 13.402.

క. ఉమరు-. వేడిమి. చిరచిరమనటం.

**ఉమరబెట్టు (-పెట్టు)** స.క్రి. మగ్గబెట్టు, మగ్గజేయు. తాళ్ల. సం. 13.401.

క. ఉమరు-. వేడిమి, చిరచిరలాడటం.

**ఉంబరము** వి. 2. చెమట.

**ఉంబళి**

**ఉంబళిచ్చు** అ. క్రి. (అగ్రహారాదుల్ని) ఇచ్చు. తాళ్ల. సం. 11.3/37.

**ఉమ్మడి**

**ఉమ్మడిసెట్టి** వి. పెళ్ళిళ్ళకుఅందరినీపిలిచేవ్యక్తి.

**ఉమ్మాయుజగ్గాయులు** వి.బ.వ. ప్రవర్తనలో భిన్నంగా కనిపించి కార్యసాధనలో ఏకోన్ముఖంగా ఉన్న వ్యక్తులు.

సం. ఉమామహేశ్వర-. శివుడు.

జగన్నాథస్వామి-. విష్ణుమూర్తి.

<సం. ఉమామహేశ్వర జగన్నాథస్వామి - + -లు (అర్థవిపరి.).

**ఉరస** రూ.చూ. వరుస. వి. **1.** వంతు; **2.** పంక్తి; **3.** పర్యాయం, తడవ.

**ఉరుకు**

**ఉరుకులాడు (-అడు)** అ.క్రి. తొందరపడు.

<ఉరుకు + - లు + అడు.

**ఉరుటు**[2] వి. **2.** అతిక్రమణం.

**ఉరుందిగు** రూ.చూ. ఉరుముదిగు. అ.క్రి. కాలికి దెబ్బ తగిలినప్పుడు గజ్జల్లో వాపు ఏర్పడు.

**ఉరుము**[1] వి. **2.** వాద్య విశేషం, అ.క్రి. **1.** గర్జించు, **2.** గద్దించు.

**ఉరుముదిగు** రూ. ఉరుందిగు. అ.క్రి. కాలికి దెబ్బ తగిలినప్పుడు గజ్జల్లో వాపు ఏర్పడు.

**ఉరులు** వి. వస్తువులు లెక్కబెట్టటంలో వాడే పదం.

**ఉర్లిపడు** చూ. ఉర్లు.

**ఉర్లు**

**ఉర్లిపడు** అ.క్రి. తుళ్ళిపడు.

**ఉర్స** రూ.చూ. వరుస[1]. వి. **1.** వంతు; **2.** పంక్తి; **3.** పర్యాయం, తడవ.

**ఉర్లాంబసవరాజుగారి సంభావనలు** వి.బ.వ. శ్రీకాకుళం జిల్లా ఉర్లాంగ్రామంలోని శ్రీమంతుడైన బసవరాజుగారు వేదవేత్తలకు, పండితులకు పరీక్షించి పట్టాలను దానం జేసేవారు. ఆ వంశం వారిచ్చిన పట్టాలను పరీక్ష అక్కరలేకుండా దేశమంతా గౌరవించేవారు. అలాగే సాక్ష్యానికి చెప్పే విషయంలోని అధిక్యం చెప్పే వాని నేర్పు నిర్ణయం అయి నాటికి రేట్లు నిర్ణయమయి ఉన్నాయని భావం.

**ఉలాల్** వి. బండి వెనుక భాగం బరువెక్కువైనప్పుడు ముందు భాగం పైకి లేచిపోవటం.

హిం. ఉలాల్-. వెనుక భాగం బరువువల్ల కిందికి వంగిపోవటం.

<హిం. ఉలార్.

**ఉల్లబుర్ర** వి. ఈతచెట్టుగీసే కత్తులు పెట్టుకొనే సంచి.

**ఉల్లికాయ** వి. ఉల్లిగడ్డ. 'ఉల్లి' కి ఉపారోపం.

**ఉల్లెక్కమాటలు** వి.బ.వ. **2.** అస్తవ్యస్తమైన మాటలు; **3.** పిచ్చిమాటలు.

**ఉల్లెంగడ్డ (-గడ్డ)** వి. ముల్లంగి.

**ఉవాచ** వి. మాట, పలుకు.

సం. ఉవాచ. 'చెప్పాడు, చెప్పింది' వచ్ ధాతువు యొక్క ప్రథమైక వచన లిడ్రూపం.

సం. ఉవాచ-. (అర్థవిపరి.).

**ఉసిక** రూ.చూ. ఇసుక, వి. **1.** ఇసక; **2.** జలప్రవాహగతిలో ఏర్పడ్డ రాళ్ళపొడి.

**ఉసివోవు** రూ. హసివోవు. అ.క్రి. వ్యర్థమగు, తప్పిపోవు.

**ఉసురు**[2] రూ. ఉసూరు[2].

**ఉసురుకొట్టు** అ. క్రి. ఇతరుల్ని బాధించటం వల్ల పాపం తగులు. **ఉసురుతగులు** అ.క్రి. ఉసురు కొట్టు, ఇతరుల్ని బాధించటం వల్ల పాపం తగులు. **ఉసురుపోసికొను** రూ. ఉసురుబోసుకొను. **ఉసురుబోసుకొను** రూ. చూ. ఉసురు పోసికొను. అ.క్రి. ఒకరిని అన్యాయంగా బాధించి పాపం కట్టుకొను. **ఉసురుముట్టు** అ.క్రి. పాపం తగులు.

**ఉసూరు**[2] రూ.చూ. ఉసురు[2]. వి. ప్రాణం.

**ఉస్క** రూ.చూ. ఇసుక. వి. ఇసుక.

**ఉస్కె** రూ.చూ. ఇసుక. వి. ఇసుక.

**ఊకు**[2] రూ.చూ. ఊంకు. స.క్రి. చిమ్ము, ఊడ్చు.

**ఊకు**[3] రూ. హకు. వి. కిటికీ రెక్కలు గాలికి వాలకుండా పట్టి ఉంచే, ఒక వైపున వంగి ఉండే పరికరం.

**ఊకుంచు** చూ. ఊంకు. స.క్రి. ఊరుకునేటట్లుచేయు.

**ఊకె** రూ.చూ. ఊరక. అవ్య. **1.** మాటిమాటికి, ఎల్లప్పుడు; **2.** కారణం లేకుండా; **3.** ఉచితంగా, డబ్బులేకుండా.

**ఊగ్రాలు** వి.బ.వ. అమ్మవారు పూనకం రావటం వల్ల ఊగటం.

సం. ఉగ్ర-. తీవ్రమయినది, తీక్ష్ణమైనది.

<సం. ఉగ్ర- + -ము + -లు.

**ఊంకు** రూ. ఊకు[2].

**ఊజ** రూ. ఈజె. వి. **2.** చేపలు పట్టే సాధనం, ఇది బోర్లించిన వెదురుగంపలా ఉంటుంది.

**ఊట** క్రి. విశ. ఎక్కువగా.

**ఊటగ** క్రి. విశ. **1.** గట్టిగా; **2.** ఎక్కువగా, బలంగా.

**ఊదు** వి. పొగవేయటానికి ఉపయోగించే సంభారవిశేషం.

హిం. ఉ. ఊద్. పరిమళద్రవ్య విశేషం.

<ఉ. ఊద్.

**ఊదుకొలివి** చూ. ఊదు[1]. వి. పొగ ఊదే గొట్టం.

**ఊదుపొగ** వి. నిప్పుకి ఊదువేసినప్పుడు వచ్చే పొగ.

**ఊపురము** రూ.చూ. మూపురము. వి. ఎద్దు మూ.

వాటి మెడపై ఉండే మూపురం.

**ఊరపొద్దాకు** చూ. ఊరు[1].

**ఊరబిండి** చూ. ఊరు[2].

**ఊరికె** చూ. ఊరు[5].

**ఊరు**[1]

**ఊరపొద్దాకు** అ.క్రి. అప్పుడప్పుడే సూర్యాస్తమయమగు.

**ఊరు**[2]

**ఊరబిండి** రూ.చూ. ఊరుఁబిండి. వి. పచ్చడి. **ఊరుపిండి** రూ.చూ. ఊరుఁబిండి. వి. అంబలి కోసం నానబెట్టిన రాగిపిండి. **ఊరుఁబిండి** రూ. ఊరబిండి, ఊరుపిండి, ఊర్మిండి. **ఊర్మిండి** రూ.చూ. ఊరుఁబిండి. వి. పచ్చడి.

**ఊరు**[5]

**ఊరక** రూ. ఊకె, ఊరికె, ఊర్కె. **ఊరికె** రూ.చూ. ఊరక. అవ్య. **1.** మాటిమాటికి; **2.** ఏ పనీలేకుండా. **ఊర్కె** రూ.చూ. ఊరక. అవ్య. **1.** మాటిమాటికి; **2.** ఏ పనీలేకుండా.

**ఊర్కె** చూ. ఊరు[5].

**ఊర్పు** వి. **2.** ఊరగాయలో గుజ్జు.

**ఊర్మిండి** చూ. ఊరు[2].

**ఊల**[3] వి. **1.** ఆశ; **2.** ఉత్కంఠ. నల్లగొండ జిల్లాలో నిందార్థంలో మాత్రమే ఈపదం ప్రయోగించబడుతోంది.

**ఊసు**[4] వి. నేత్రమలం, పుసి.

**ఊసులు** వి.బ.వ. పుసి, నేత్రమలం.

ఎకరము రూ. ఎకురం.

ఎకాయుకి రూ.చూ. ఎకాయుకు. క్రి. విణ. అకస్మాత్తుగా, హఠాత్తుగా.

ఎకాయుకు రూ. ఎకాయుకి, యకాయుకి.

ఎకిమీఁడు రూ.చూ. హకీము[1] వి. రాజు, పాలకుడు.

ఎకురం రూ.చూ. ఎకరము. వి. **4,840** చదరపు గజాల స్థలం.

ఎక్కా[1] రూ. చూ. ఎక్కా[1]. వి. చిన్న కిరసనాయిల్ దీపం.

ఎక్కా[2] రూ. చూ. ఎక్కా[2]. వి. పేకముక్కల్లో ఆసుముక్క.

ఎక్కరార్‌నామా వి. ఒడంబడిక పత్రం.

ఉ. ఏక్-. ఒక
కరార్‌నామా . ఖరారు పత్రం.
<ఉ. ఏక్ కరార్‌నామా.

ఎక్కా[1] రూ. ఎక్క[1]. వి. చిన్న కిరసనాయిల్ దీపం.

ఎక్కాబుడ్డి వి. గాస్‌నూనెతోవెలిగేగాజుబుడ్డీదీపం.

ఎక్కా[2] రూ. ఎక్క[2]. వి. పేకముక్కల్లో ఆసుముక్క.

ఎక్కిరాలు చూ. ఎక్కు[1]. వి.బ.వ. చెప్పడుమాటలు.

ఎక్కిలి[2] రూ.చూ. వెక్కిలి. వి.బ.వ. ఎక్కిళ్ళు.

ఎక్కు

ఎక్కుడు వి. ఎక్కటం. రం. రా **3.170** పం.

ఎఖలాసు వి. నిశ్చలత, నిష్కపటత.

ఉ. ఇఖ్‌లాస్ . నిశ్చలత, నిష్కపటత.

త. ఇకలాచు . నిష్కపటత, విశ్వాసం, నిజమైన ప్రేమ.

<ఉ. ఇఖ్‌లాస్.

ఎగఁన్

**ఎగపోత** రూ.చూ. ఎగఁబోఁత. వి. ఎక్కువగా వచ్చే దమ్ము (ఊపిరి). **ఎగబెట్టు** రూ.చూ. ఎగఁబెట్టు. స.క్రి. **1.** దాచిపెట్టు; **2.** తీసుకొన్నడబ్బు ఇవ్వకపోవు; **3.** పనిమానుకొను. **ఎగఁబెట్టు** రూ. ఎగబెట్టు. **ఎగఁబోఁత** రూ. ఎగపోత. వి . **4.** ఎక్కువగా వచ్చే ఊపిరి (దమ్ము), ఎగ ఊపిరి. **ఎగవేయు** రూ. ఎగేయు. **ఎగేయు** రూ.చూ. ఎగవేయు. స.క్రి. **1.** అప్పు మొ. వాటిని ఎగగొట్టు; **2.** రెచ్చగొట్టు; **3.** అపహరించు.

**ఎగపోత** చూ. ఎగ(న్).

**ఎగబెట్టు** చూ. ఎగ(న్).

**ఎగేయు** చూ. ఎగ(న్).

**ఎగ్గిదాము** రూ.చూ. వేకువజాము. వి. ఉదయం.

**ఎగ్సం** వి. వ్యవసాయం, సేద్యం.

సం. వ్యవసాయ-. ప్రయత్నం.

ఎంక రూ.చూ. ఎముక. వి. అస్థి.

ఎంకపురంగు రూ.చూ. వెంకప్పురంగు. వి. ముదురు మామిడిచిగురు రంగు.

ఎంకయ్యపీట రూ.చూ. వెనకయ్యపీట. **1.** రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; **2.** రాట్నం అడ్డపట్టె.

ఎంకయసవితి రూ.చూ. వెనకయచవితి. వి. భాద్రపదశుద్ధ చవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లు పెట్టిపూజచేసి పండుగ చేసుకొంటారు.

ఎంకాయపీట రూ.చూ. వెనకయ్యపీట. వి. **1.** రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య; **2.** రాట్నం అడ్డపట్టె.

ఎంకులాడు అ.క్రి. వెదుకు, వెదుకులాడు.

**ఎంగటికొయ్య** రూ.చూ. వెనకటికొయ్య. వి. ఆసువెన-కపీటకు బిగించిన పుల్ల.

**ఎంగటిపీట** రూ.చూ. వెనకపీట. వి. ఆసుపీటల్లో చివరది.

**ఎంగిలి**

**ఎంగిలిపువ్వు** వి. భాద్రపద అమావాస్యనాడు చేసుకొనే బతకమ్మ పండుగ.

**ఎంగటికొయ్య** రూ.చూ. వెనకటికొయ్య. వి. ఆసువెన-కపీటకు బిగించిన పుల్ల.

**ఎంగటిపీట** రూ.చూ. వెనకపీట. వి. ఆసుపీటల్లో చివరిపీట.

**ఎచ్చదుక్కి** రూ.చూ. వెచ్చదుక్కి. వి. అముకాల్వలో వాడే కర్రముక్క లేక తూడు.

**ఎచ్చిడి** రూ. ఉచ్చిలి. వి. అల్పం.

**ఎచ్చిరిల్లు** రూ. హెచ్చరిలు, హెచ్చరిల్లు, హెచ్చిరిలు, హెచ్చి-రిల్లు.

**ఎచ్చిలు** రూ. హెచ్చిలు, హెచ్చిల్లు. అ.క్రి. అతిశయించు, పెంపొందు.

**ఎజ్ఞాలు** వి.బ.వ. యజ్ఞాలు.

సం. యజ్ఞ-. యజ్ఞం.

<సం. యజ్ఞ- + -ము + -లు.

**ఎంచు** రూ.చూ. వెలంచు. వి. బయటవైపున ఉండే అరుగు అంచు.

**ఎంచుడు** వి. వాయించడం.

**ఎంజాపు** రూ.చూ. వెంజాపు. వి. ఇంటిపెడికొప్పను మోసేకర్ర.

**ఎంజాప్పోటి** రూ.చూ. వెన్జాపుపోటి. వి. ఒక ఇంటి వాకిలి కెదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటమనే తప్పు, వెన్నుపోటు.

**ఎటామెుటి** చూ. ఎటు. వి. విభేదం.

**ఎటికలు** వి.బ.వ. పెండ్రుకలు.

**ఎట్టులు**

**ఎట్లెట్లా** అవ్య. వివిధంగా అనే అర్థంలో ప్రయో-గించబడే ఆశ్చర్యార్థకపదబంధం.

**ఎట్టెట్లా** చూ. ఎట్టులు.

**ఎడము** రూ. యడం.

**ఎడలుపు** రూ.చూ. వెడల్పు. వి. **1.** పొట్టిగా ఉండే వైపు; **2.** పొట్టిగా ఉండే దాని కొలత.

**వెడల్పు** రూ.చూ. వెడల్పు. వి. **1.** పొట్టిగా ఉండే వైపు; **2.** పొట్టిగా ఉండే కొలత.

**ఎడెల్పు** రూ.చూ. వెడల్పు. వి. **1.** పొట్టిగా ఉండే వైపు; **2.** పొట్టిగా ఉండే కొలత.

**ఎడ్డెమడ్డె** రూ. యడ్డామడ్డి.

**ఎంటి** రూ.చూ. వెంటి. వి గడ్డితో పేనినతాడు.

**ఎంటిదుప్పు** రూ.చూ. వెంటిదుప్పు. వి. వెంటితో బిగించిన పెద్ద గడ్డికుప్ప.

**ఎండ**

**ఎండకన్ను** వి. సూర్యుడు. తాళ్ల. సం. 5.240.

**ఎండిజరీ** రూ.చూ. వెండిజరీ. వి. వెండినుంచి తీసిన సన్నదారం, దీని మీద బంగారం పూత పూస్తారు.

**ఎండుగలు** చూ. ఎండు. వి.బ.వ. కళ్ళంనుంచిరాగానే ఎండబెట్టిన ధాన్యం.

**ఎతిల్లా** రూ.చూ. ఇతిల్లా. వి. తెలియజేయటం.

**ఎత్తు**[1] వి. **15.** గొడుగు ఆకారంలో ఉన్నవల.

**ఎత్తుకపోవు** స.క్రి. ఎత్తుకొనిపోవు. మైరా. 44.పు.

**ఎత్తుడుగుళ్ళు** వి.బ.వ. పల్లెల్లో పిల్లలు ఆటకు వాడే చిన్నరాళ్ళు.

**ఎద**

**ఎదవడు** రూ. యదబడు.

**ఎదటిబద్ద** రూ.చూ. వెదురుబద్ద. వి. **1.** రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద; **2.** కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద.

**ఎదటిలాక** రూ.చూ. వెదురులాక. వి. **1.** పడుగులో అని వెంబడిదూర్చిన వెదురుబద్ద; **2.** కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద.

**ఎదదుదబ్బ** రూ.చూ. వెదదుదబ్బ. వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలా వేసికట్టిన వెదురుబద్ద.

**ఎదుదుదబ్బ** రూ.చూ. వెదదుదబ్బ వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండు పక్కలా వేసికట్టిన వెదురుబద్ద.

**ఎదురిచ్చిచదరంగమాడు** చూ. ఎదురు[2].

**ఎదురు**[1] రూ.చూ. వెదురు. వి. మేదరి నిర్మాణద్రవ్యంగా సర్వసాధారణ వాడుకలో ఉన్న తృణ విశేషం.

**ఎదురుకర్ర** రూ.చూ. వెదురుకర్ర. వి. సారెను తిప్పడానికి కుమ్మరి ఉపయోగించేకర్ర.

**ఎదురు**[2]

**ఎదురిచ్చిచదరంగమాడు** అ.క్రి. జ్ఞానంలేకుండా పనిచేయు. **ఎదురుచుక్క** వి. **2.** శత్రుత్వం. **ఎదురుపెట్టిచదరంగమాడు** చూ. ఎదురిచ్చిచదరంగ-మాడు. అ.క్రి. జ్ఞానం లేకుండా పనిచేయు. **ఎదురుపో-తులు** వి.బ.వ. దున్నపోతులు, మేకపోతులు, పొట్టేళ్ళు మొదలైనవి అమ్మవారు గుడిగి వచ్చేటప్పుడు ఎదురుగా బలి ఇస్తారు. కాబట్టి వీటికి ఎదురుపోతులని పేరు. **ఎదురెక్కిచదరంగమాడు**[1] అ.క్రి. ఎదురుదెబ్బలాడు. ప్రతిపక్షికి సొమ్మిచ్చి చదరంగ మాడటం తెలివైన పని-కాదు. చదరంగానికి సంబంధించిన పలుకుబడి.

**ఎదురుకఱ్ఱ** రూ.చూ. వెదురుకఱ్ఱ. వి. నూలుచిలపలు ఆరేసేబొంగు.

**ఎదురుగుండు** రూ.చూ. వెదురుగుండు. వి. పట్టుపడుగు సరిచెయ్యటానికి నిలబెట్టే ఊడ్తైకుపైన బిగించిన అడ్డకట్టె.

**ఎదురునాడె** రూ.చూ. వెదురునాడి. వి. వెదురుగొట్టంతో చేసిననాడె.

**ఎదురుపేటు** రూ.చూ. వెదురుపేటు. వి. వాటతయారీలో సమదళసరిని మన్నులేపడానికి చీల్చిన వెదురుబద్ద.

**ఎదురుబద్ద** రూ.చూ. వెదురుబద్ద. వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలావేసి కట్టిన వెదురుబద్ద

**ఎదురురివ్వలు** రూ.చూ. వెదురురివ్వలు. వి.బ.వ. సారె తయారీలో లోపల పెట్టే వెదురుచువ్వలు.

**ఎదురులాక** రూ.చూ. వెదురులాక. వి. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద.

**ఎదురెక్కిచదరంగమాడు**[2] చూ. ఎదురు.

**ఎదురేయు** రూ.చూ. వెదురేయు. అ.క్రి. వెదురుబద్దతో సారెమీద వాటను నునుపుచేయు.

**ఎదుర్లు** రూ.చూ. వెదుర్లు. వి.బ.వ. పెండెకట్టులో వాడడానికి చీల్చిన వెదురుబద్దలు.

**ఎద్దు**

**ఎద్దులగాటి** వి. ఎద్దుల్నికట్టివేసే స్థలం.

**ఎనకటిపీట** రూ.చూ. వెనకపీట. వి. అసుపీటల్లో చివరిపీట.

**ఎనకమాత్రేవులు** రూ.చూ. వెనకమాత్రేవులు. వి.బ.వ. ఆములో వెనుకభాగానికి మంట వచ్చిందీ లేనిదీ తెలుసుకోడానికి ఆము వెనుక పెట్టిన కన్నాలు.

**ఎనకరేవుల** రూ.చూ. వెనకరేవులు. వి.బ.వ. ఆములో వెనకభాగానికి మంట వచ్చిందీ లేనిదీ తెలుసుకోడానికి ఆమువెనకపెట్టిన రంధ్రాలు.

**ఎనకఱ్ఱ** రూ.చూ. వెన్నుకఱ్ఱ. వి. ఇంటినడికొప్పును మోసే కఱ్ఱ.

**ఎనక్కొయు** రూ.చూ. వెనకటి కొయ్య. వి. అసువెనుక పీటకు బిగించిన పుల్ల.

**ఎనక్కొయ్య** రూ.చూ. వెనకటికొయ్య. వి. అసు వెనుక పీటకు బిగించిన పుల్ల.

**ఎనగఱ్ఱ** రూ.చూ. వెన్నుకఱ్ఱ. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ.

**ఎనగాటెదురు** రూ.చూ. వెనుగాటెదురు. వి. ఒక ఇంటి వాకిలికి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటమనే తప్పు. ఒకే వరసలో రెండిళ్ళ వెన్నుగాళ్ళు ఉంటే ఈ తప్పపోతుంది.

**ఎనగాడి** రూ.చూ. వెన్నుఁగాడి. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ.

**ఎనబద్ద** రూ.చూ. వెనుబద్ద. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ.

**ఎనమ** రూ.చూ. ఎనుము[1]. వి. గేదె, బఱ్ఱె.

**ఎనిక**[3] రూ.చూ. ఎమ్ము[1]. వి. ఎముక, అస్థి.

**ఎనికపీట** రూ.చూ. వెనకపీట. వి. అసుపీటల్లోచివరిది.

**ఎనికిపట్టె** రూ.చూ. వెనకపట్టె. వి. అసుపీటల్లో చివరిది.

**ఎనికిపట్టె** రూ.చూ. వెనుకపట్టె వి. అసుపీటల్లో చివరిది.

**ఎనికిపీట** రూ.చూ. వెనకపీట. వి. అసుపీటల్లో చివరిది.

**ఎనికిబల్ల** రూ.చూ. వెనకబల్ల. వి. అసుపీటల్లోచివరిది.

**ఎనికిసివర (-చివర)** రూ.చూ. వెనకచివర. వి. దండెదగ్గర నేతపడుగులో దూర్చినచువ్వ.

**ఎనిక్కొయ్య** రూ.చూ. వెనకటికొయ్య. వి. అసువెనకపీటకు బిగించిన పుల్ల.

**ఎనిగఱ్ఱ** రూ.చూ. వెన్నుకఱ్ఱ. వి. ఇంటి నడికొప్పును మోసేకఱ్ఱ.

**ఎనుకయ్యపీట** రూ.చూ. వెనకయ్యపీట. వి. **1.** రాట్నంపీటకు ఎడమవైపునకదురుబిగించే నిలువుకొయ్య; **2.** రాట్నంఅడ్డవట్టె.

**ఎనుగఱ్ఱసాలు** రూ.చూ. వెనుగఱ్ఱసాలు. వి. కూనలను వెన్నుగాడి వెంటనే కప్పేతీరు.

**ఎనుగాడి** రూ.చూ. వెన్నుఁగాడి. వి. ఇంటినడికొప్పును మోసేకఱ్ఱ.

**ఎనుగాడిగుజ్జు** రూ.చూ. వెనుగాడిగుజ్జు. వి. వెనుగాడిని మోసే పెద్దగుజ్జు.

**ఎనుగాడిదోషం** రూ.చూ. వెనుగాడిదోషం. వి. ఒక ఇంటివాకిలి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటమనే తప్పు (ఒకే వరుసలో రెండిండ్ల వెన్నుగాళ్ళు ఉంటే తప్పపోతుంది).

**ఎనుగాడిపోటే** రూ.చూ. వెనుగాడిపోటే. వి. ఒక యింటి వాకిలి ఎదురుగా మరొక యింటి వెన్నుగాడి ఉండటమనే తప్పు.

**ఎనుగాడిల్లు** రూ.చూ. వెనుగాడిల్లు. వి. వెన్నుగాడిగల ఇల్లు.

**ఎనుగానిల్లు** రూ.చూ. వెనుగానిల్లు. వి. వెన్నుగాడిగల ఇల్లు.

**ఎనుగు** వి. ముళ్ళకంచె.

**ఎనుంగుడ్డు** రూ.చూ. ఎలుంగుగొడ్డు. వి. ఎలుగుబంటి, భల్లూకం.

**ఎనుపెంక** రూ.చూ. వెన్నుపెంక. వి. ఇంటి వెన్నుగాడి మీద పరిచేపెంకు.

**ఎనుబద్ద** రూ.చూ. వెనుబద్ద. వి. ఇంటి నడికప్పును మోసేకఱ్ఱ.

**ఎనుబద్దగుజ్జు** రూ.చూ. వెనుబద్దగుజ్జు. వి. వెనుగాడిని-మోసే పెద్దగుజ్జు.

**ఎనుము**[1] రూ. ఎనమ.

**ఎన్కయ్యపీట** రూ.చూ. వెనకయ్యపీట. వి. **1.** రాట్నంపీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువు కొయ్య; **2.** రాట్నం అడ్డపట్టె.

**ఎన్కూన** రూ.చూ. వెన్నుకూన. వి. వెన్నుమీద పరిచేకూన.

**ఎంతటెల్లం** వి. ఎంతసేపు. < ఎంతటి + ఎల్లన్.

**ఎన్నపూసకుండ** రూ.చూ. వెన్నపూసకుండ. వి. వెన్న-కరగబెట్టడానికి వాడే మట్టిపాత్ర.

**ఎన్నలమడుగు** రూ.చూ. వెన్నెలమడుగు. వి. చిచ్చుబుడ్లల్లో ఒక రకం.

**ఎన్ను**[4] రూ.మూ. వెన్ను[1]. వి. ఇంటి నడికొప్పను మోసేకఱ్ర.

**ఎన్నుకఱ్ర** రూ.చూ. వెన్నుకఱ్ర. వి. ఇంటి నడికొ-ప్పను మోసేకఱ్ర. **ఎన్నుగాడి** రూ.చూ. వెన్నుగాడి. వి. ఇంటి నడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుగాడి దోషం** రూ.చూ. వెన్నుగాడిదోషం. వి. ఒక ఇంటివాకిలి ఎదురుగా మరొక ఇంటి వెన్నుగాడి ఉండటమనే తప్పు (ఒకే వరుసలో రెండిళ్ళ వెన్నుగాళ్ళు ఉంటే ఈ తప్పు-పోతుంది.) **ఎన్నుగూటం** రూ. చూ. వెన్నుగూటం. వి. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్య-గూటం. **ఎన్ను గోటం** రూ.చూ. వెన్నుగూటం. వి. ఉన్నిమగ్గం దోనుగను మోసే ఎడమవైపు కొయ్య-గూటం. **ఎన్నుచెక్క** రూ.చూ. వెన్నుచెక్క. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుజావు** రూ.చూ. వెంజావు. వి. ఇంటి నడికొప్పను మోసేకఱ్ర. **ఎన్ను-దూలం** రూ.చూ. వెన్నుదూలం. వి. ముఖ్యమైన దూలం. **ఎన్నుపట్టి** రూ.చూ. వెన్నుపట్టె. వి. ఇంటి నడికప్పను మోసేకఱ్ర. **ఎన్నుపట్టె** రూ.చూ. వెన్ను-పట్టె. వి. ఇంటి నడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుపెంక** రూ. చూ. వెన్నుపెంక. వి. ఇంటి వెన్నుగాడి మీద పరిచే పెంకు. **ఎన్నుపోటు** రూ.చూ. వెన్నుపోటు. వి. ఒక ఇంటి వాకిలి కెదురుగా మరో ఇంటి వెన్నుగాడి ఉండటమనే తప్పు. ఒకే వరసలో రెండిళ్ల వెన్నుగాళ్ళు ఉంటే ఈ తప్పు పోతుంది. **ఎన్నుబద్దగుజ్జు** రూ. చూ. వెనుబద్దగుజ్జు. వి. వెనుగాడినిమోసే పెద్దగుజ్జు. **ఎన్ను-బాజు** రూ. చూ. వెన్నుబాజు. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుమాను** రూ.చూ. వెన్నుమాను. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నురవ్వ** రూ.చూ. వెన్నురవ్వ. వి. ఇంటి నడికొప్పను మోసేకఱ్ర. **ఎన్ను-వాసం** రూ.చూ. వెన్నువాసం. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుసరం** రూ.చూ. వెన్నుసరం. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నుసాలు** రూ.చూ. వెన్నుసాలు. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్ను-సూల** రూ.చూ. వెన్నుసూల. వి. ఒక ఇంటి వాకిలికెదురుగా మరో ఇంటివెన్నుగాడి ఉండటమనే తప్పు. (ఒకే వరసలో రెండిళ్ళ వెన్నుగాళ్లు ఉంటే ఈ తప్పు పోతుంది.) **ఎన్నుసోపు** రూ.మూ. వెంజావు. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర. **ఎన్నోసం** రూ.చూ. వెన్నువాసం. వి. ఇంటినడికొప్పను మోసేకఱ్ర.

**ఎన్ను**[2] రూ. వెన్ను[2].

**ఎన్నెలపంతులు** రూ.చూ. వెన్నెలపంతెలు. వి. దీపం ప్రమిదెలాగా గుంతగాఉండే చిచ్చుబుడ్డి.

**ఎన్నెలబంతెలు** రూ.చూ. వెన్నెలపంతెలు. వి.బ.వ. దీపం ప్రమిదెలాగా గుంతగా ఉంటుంది.

**ఎన్నోసం** చూ. ఎన్ను[4].

**ఎప్పకుండ** రూ.చూ. వెప్పకుండ. వి. దసరికాయలను ఆవిరి మీద ఉడకబెట్టే కుండ.

**ఎప్పవేయు** రూ.చూ. వెప్పవేయు. అ.క్రి. నీళ్ళువెచ్చ-బెట్టు.

**ఎబ్బిడి** వి. తక్కువదనం.

క. ఎబ్బు. పైకి లేచు.

< క. ఎబ్బు + ఇడి.

**ఎముస** వి. యమున. తాళ్ల.సం. 9.210.

సం. యమునా. యమునానది.

<సం. యమునా.

**ఎమ్డెన్** వి. **1.** అద్భుతం, ఆశ్చర్యకరం; **2.** మహత్తరం, గొప్పది.

జర్మన్ ఎమ్డెన్-. జర్మనీ దేశపు జలాంతర్గామి పేరు. దీన్ని ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జర్మనీ దేశస్థులు వాడారు. ఇది మద్రాసు మీద బాంబులు వేసింది.

<జర్మన్ ఎమ్డెన్.

**ఎంపు** రూ.మూ. వైపు. వి. పక్క.

**ఎంబ**[1] రూ. యంబ.

**ఎంబెన్న** రూ.చూ. యంబ్రహ్మ. వి. **1.** తెలివి తక్కువ మనిషి; **2.** అసమర్థుడు; **3.** అజ్ఞాని.

**ఎమ్ము**[1] రూ. ఎంక, ఎనిక[3].

**ఎమ్రాలపచ్చ** రూ. చూ. యమరాళ్ళపచ్చ. వి. **1.** ఒకరకం పచ్చరంగు; **2.** పసిమితో నలుపుచాయ; **3.** దమయంతి పచ్చకంటె లేతరంగు; **4.** రేలపువ్వు, పచ్చవన్నెలు కలిసిన రంగు.

**ఎయ్యిగండ్లకోక** రూ.చూ. వెయ్యిగండ్లకోక. వి. ఒక రకం గళ్ళచీర, ఊళ్ళో జాతరలకు కట్టుకునే చీర.

**ఎరవలగా** చూ. ఎరవలి[2]. క్రి. విశ. తేరగా.

**ఎర్క** రూ.చూ. ఎఱుక, వి. **1.** తెలివి; **2.** స్మృతి;

3. జోస్యం; 4. గుర్తు; 5. పరిచయం.

ఎర్రెద్దు చూ. ఎఱ్ఱి. వి. ముదురు గోధుమ రంగులో ఉన్న ఎద్దు.

ఎఱుక రూ. ఎగ్గ్ర.

ఎఱ్ఱుము రూ. యట్టము.

ఎల[6] రూ.చూ. ఎల్ల[1]. వి. హద్దు, సరిహద్దు, గిరి.

ఎలకలేసుకొను చూ. వెనుక, వేసికొను. అ.క్రి. వెనుకకు తిప్పివేసుకొను.

ఎలగ రూ.చూ. వెల్ల. వి. ఒక రకం మొక్క. తినడానికి, మొక్కలు కంచె మీద అల్లిక పెడ్తారు (elephant apple).

ఎలడుప్ప రూ.చూ. వెడల్పు వి. పొట్టిగా ఉండే దానివైపు, దానికొలత.

ఎలబారు రూ.చూ. వెళ్లఁబాఱు. అ.క్రి. బయల్దేరు.

ఎలమ రూ.చూ. వెలమ[3] వి. నిర్మాణ ద్రవ్యంగా ఉత్తమజాతికి చెందిన కలప నిచ్చేచెట్టు.

ఎలాయ్యం రూ.చూ. వెలాయం. వి. బయటికొలత.

ఎలిగోడ రూ.చూ. వెలిగోడ. వి. బయటిగోడ.

ఎలితికట్టు రూ.చూ. వెలితికట్టు. అ.క్రి. పన్నెకట్టుబడిలో దండెల మధ్య పుల్లలు దూరదూరంగా పెట్టి పుల్లలు మధ్యసందులు వెడల్పుగా ఉండేటట్లు కట్టు.

ఎలిపిరి రూ.చూ. వల్పిరి. వి. వానజల్లు.

ఎలిబెల్ల రూ.చూ. వెలిపెల్ల. వి. గోడకట్టేటప్పుడు మునుముందు వెంచుకోడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

ఎలిసె రూ. వెలిసె. వి. ఇంటి చూరుయొక్క లోపలి-భాగం.

ఎలుగు

ఎలుగువేయు రూ.చూ. వెలుగువేయు. అ.క్రి. (తోట మొ. వాటికి) కంచెవేయు.

ఎలుగ్గొడ్డుతంటసం చూ. ఎలుఁగు[2].

ఎలుంగుడ్డు(-గొడ్డు) రూ.చూ. ఎలుఁగుగొడ్డు. వి. ఎలుగుబంటి.

ఎలుఁగు[2]

ఎలుగ్గొడ్డుతంటసం రూ.చూ. ఎలుఁగు గొడ్డు-తంటసము. వి. వృథాశ్రమ. ఎలుగుబంటి వెంట్రుకలను ఒక్కోదాన్నీ తంటసంతో పీకటం వృథాశ్రమ. కాబట్టి ఈ పలుకుబడి కలిగింది. ఎలుంగుగొడ్డుతంటసము రూ. ఎలుగ్గొడ్డు తంటసం. వి. వృథాశ్రమ. ఎలుగుబంటు వెంట్రుకలను ఒక్కోదాన్నీ తంటసంతోపీకటం వృథా-శ్రమ. కాబట్టి ఈ పలుకుబడికలిగింది. ఎలుఁగుతంటసము వి. వృథాశ్రమ. ఎలుగుబంటి వెంట్రుకలను ఒక్కోదాన్నీ తంటసంతోపీకటం వృథాశ్రమ. కాబట్టి ఈపలుకుబడి కలిగింది.

ఎలుఁగుగొడ్డు రూ. ఎనుంగుడ్డు, ఎలుంగుడ్డు.

ఎలుపు రూ.చూ. వెడల్పు. వి. 1. వైశాల్యం; 2. వంకెకుగాని, డబ్బాకుగాని నూలు చుట్టటం; 3. పోగులు విడదీయుటం.

ఎలుముగుడ్డం చూ. ఎలుఁగు గొడ్డు. వి. ఎలుగుబంటి.

ఎలెడుప్ప రూ.చూ. వెడల్పు. వి. పొట్టిగా ఉండే వైపు, కొలత.

ఎల్తిర రూ.చూ. వెడతుఱు. వి. బంజరునేలల్లో 6-7 అడుగుల ఎత్తున పెరిగే చిన్న ముళ్ళచెట్టు (Dichrostachys cinerca).

ఎల్తి రూ.చూ. వెలితి. వి. 2. రాళ్ల వరసల మధ్యనున్న స్థలం.

ఎల్తినేత రూ.చూ. వెల్తినేత. వి. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిననేత.

ఎల్తురు రూ.చూ. వెడతుఱు. వి. బంజరు నేలల్లో 6-7 అడుగుల ఎత్తున పెరిగే చిన్న ముళ్ళ చెట్టు (Dichrostachys cinerca).

ఎల్ది రూ.చూ. వెలితి. వి. 1. న్యూనత, కొరత; 2. రిక్కు వరసలో మధ్య నున్న స్థలం; విశ. 1. తక్కువైనది, న్యూనం; 2. పూర్ణంకానిది, నిండనిది; 3. తరచుదనం లేనిది.

ఎల్దు రూ.చూ. వెలితి. వి. రాళ్లవరసల మధ్యనున్న స్థలం.

ఎల్ల[1] రూ. ఎల[6].

ఎల్లగడ్డ వి. ఒక రకం దుంపమొక్క.

ఎల్లడి రూ.చూ. వెల్లడి[2]. వి. వెడల్పు, పొట్టిగా ఉండే వైపు దానికొలత.

ఎల్లడిపట్టి రూ.చూ. వెల్లడిపట్టి. వి. దూలం మీద వేసిన ముట్టి పట్టెమీద వేసే పట్టి.

ఎల్లాటిశని వి. చెడ్డకాలం, జన్మ నక్షత్రంపై శని దుష్ప్ర-భావం కల కాలం.

సం. శని-. నవగ్రహాల్లో ఒక దుష్టగ్రహం.

ఎల్లుడు రూ.చూ. వెల్లుడు. వి. తోకుడు, గోడకట్టేటప్పుడు మునుముందు పెంచుకోవడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

ఎల్లెము చూ. వైశము. అవ్య. తొందరగా.

ఎళవు రూ. యళవు.

ఎవ్వారం వి. వ్యాపారం, పని.

సం. వ్యవహార-. నడవడి, పని, జీవిక, వ్యాపారం, వాణిజ్యం, వర్తకం, వాడుక.

<సం. వ్యవహార-.

ఎళ్ళీరుకాయ వి. కొబ్బరిబొండాం.

<ఎల[1] + నీరు + కాయ.

**ఏకనాదం** వి. తంబూర.

సం. ఏకనాద-. ప్రత్యేకధ్వని, ప్రముఖ ధ్వని.

<సం. ఏకనాద- (అర్థవిపరి.).

**ఏకరువుపెట్టు** రూ. యాకరపెట్టు.

**ఏకాణము** రూ.చూ. ఏకాండము.

**ఏకాండము** రూ. ఏకాణము, యాకాణము.

**ఏకు** స.క్రి. ఈడ్చు, లాగు.

**ఏకులు** వి.బ.వ. వరికోతలు అయిపోయిన తర్వాత పొలంలో మిగిలిపోయిన వరిఎన్నులు.

**ఏకువ** రూ.చూ. వేకువ. వి. ప్రభాతం, తెల్లవారుజాము.

**ఏకువజాము** రూ.చూ. వేకువజాము.

**ఏగర్ర (-కట్టు)** రూ. యాగర, యాగట్టు. వి. **2.** రెగ్యులేటరు; **3.** గొర్రుకు వెనక చేర్చిన అక్కడను కలిపి ఉంచేకర్ర.

**ఏగిరం** రూ.చూ. వేగిరము. వి. తొందర.

**ఏగిరపడు** రూ.చూ. వేగిరపడు. అ.క్రి. తొందరపడు.

**ఏగిరపడు** చూ. ఏగిరం.

**ఏగురు** సవరణ.

**ఏచ** రూ. యాస. వి. **3.** ఉచ్చారణదోషం.

**ఏటవాలు** రూ. యాటోలె.

**ఏటావలిగిలిగింత** చూ. ఏఱు$^2$.

**ఏటావలిగిలిగింతలు** చూ. ఏఱు$^2$.

**ఏటిఅవలిగిలిగింత** చూ. ఏఱు$^2$.

**ఏడతర** రూ.చూ. వెడతుఱు. వి. బంజరు నేలల్లో 6-7 అడుగుల ఎత్తున పెరిగే చిన్న ముళ్ళచెట్టు (Dichrostechys Cinerca).

**ఏడు**$^1$

**ఏడుకట్లసవారీ** వి. పాడె, కటుం, శవవాహనం. శవవాహనానికి (పాడెకు) ఏడు ఊర్ధ్వ లోకాలను ఆత్మ-దాటి పరమాత్మలోకలవాలనే ఉద్దేశంతో ఏడుకట్లు కడతారు. కాబట్టి పాడెకు ఏడుకట్ల సవారీ అని పేరు వచ్చింది. **ఏడుమందిఅక్కమ్మగార్లు** వి. బ. వ. గ్రామంలో జరిగే జాతర్లలో జానపదులచే పూజించబడే గ్రామదేవతలు. వీరు ఏడుగురు. 1. గంగమ్మ, 2. ఎల్లమ్మ, 3. అంకాలమ్మ, 4. పోలేరమ్మ, 5. మాతమ్మ, 6. చౌడమ్మ, 7. నూకాలమ్మ. లేదా 1. పెద్దవీర మల్లమ్మ, 2. కోడెనాగమ్మ, 3. నాగముసెమ్మ, 4. చంద్రకన్యక, 5. సూర్యకళక, 6. అగ్నిదేవత, 7. చిన్నవీర మల్లమ్మ.

**ఏడ్నెర్థం** రూ.చూ. ఏణ్ణర్థము. వి. సంవత్సరన్నర.

**ఏణ్ణర్థము** చూ. ఏఁడు$^1$ రూ. ఏడ్నెర్థం.

**ఏతావతా** అవ్య. **1.** ఇంతకూ; **2.** ఈ విధంగా; **3.** చివరకు.

సం. ఏతావతా-. ఇంతకూ.

<సం. ఏతావతా.

**ఏతు**

**ఏతులు** వి.బ.వ. నిందలు. తాళ్ళ. సం. 11.2.

**ఏదుం** వి. అయిదుకుంచాలు. <ఏను$^2$ + తూము$^2$.

**ఏనుగు**

**ఏనుగుదాహము** వి. **2.** దురాశ. ఏనుగు దాహమైనప్పుడు ఎక్కువ నీళ్ళను తాగుతుంది. కాబట్టి అత్యాశకు, దురాశకు 'ఏనుఁగుదాహము' అనే పదబంధాన్ని ప్రయోగించారు. **ఏనుగుపాడి** వి. **2.** సమృద్ధి, సంపద. ఏనుగు పెద్ద జంతువు. కాబట్టి 'ఏనుఁగుపాడి' అంటే సమృద్ధి, సంపద అనే అర్థాలు వచ్చి ఉంటాయి.

**ఏంది** చూ.ఏమి.

**ఏప** రూ.చూ. వేప. వి. పెద్ద మానయ్యేచెట్టు. దీని కలపను దూలాలుగా దర్వాజాకమ్ములుగా తలుపు చెక్కలుగా ఉపయోగిస్తారు.

**ఏపు** రూ.చూ. వైపు. వి. పక్క, వంక, వెంట.

**ఏమి**

**ఏంది** సర్వ. ఏమిటి ? < ఏమి + ఇది. **ఏమిటికి** అవ్య. ఎందుకు. ఉ.రా. 6.206 కాశ. 3.91.

**ఏఁబది** రూ.యాబై, యాభై.

**ఏరిశెనగ** రూ.చూ. వేరుసెనగ. వి. వేరుసెనగ, దక్షిణ అమెరికా నుంచి 19వ శతాబ్దిలో తేబడిన వాణిజ్యపుపంట.

**ఏరు**$^1$ వి. **4.** కాడి.

**ఏరుడు** వి. నిచ్చెన.

క. ఏణి . నిచ్చెన; ఏఱు-. ఎక్కు.

**ఏరుసెనగ** రూ.చూ. వేరుసెనగ. వి. వేరుసెనగ, దక్షిణ అమెరికా నుంచి 19వ శతాబ్దిలో తేబడ్డ వాణిజ్యపు పంట.

**ఏర్చనగ** రూ.చూ. వేరుసెనగ. వి. నేలసెనగ. దక్షిణ అమెరికా నుంచి 19వ శతాబ్దిలో తేబడిన వాణిజ్యపు పంట.

**ఏఱు**$^2$

**ఏటావలిగిలిగింత** రూ.చూ. ఏటి అవలి గిలి-గింత. వి. **2.** ఉన్నా లేనివాటితో సమానమైన సుఖం. **ఏటావలిగిలిగింతలు** వి.బ.వ. నిష్ప్రయోజన కార్యాలు. **ఏటిఅవలిగిలిగింత** రూ. ఏటావలిగిలిగింత. వి. **2.** ఉన్నాలేనివాటితో సమానమైన సుఖం.

**ఏలము**$^1$ రూ. యాలం, యాలము, యాలాం, యెలాం, యేలము.

**ఏలుపట్టు** రూ.మా. వేలుపట్టు. అ.క్రి. పాత్రకు అంచు పట్టడానికి ముందు వేళ్ళతోను బద్దతోను కుత్తిక ఏర్పడేటట్లు పట్టు.

**ఏవ** రూ.యావ. వి. **6.** అసహ్యం.

**ఏసంగిఉన్ని** రూ.మా. వేసంగి ఉన్ని. వి. ఏరువాక పున్నమికి కత్తిరించే ఉన్ని.

**ఐతారం** రూ. అయితారం, ఆయితారం. వి. ఆదివారం. సం. ఆదిత్యవార-. ఆదివారం.

<సం. ఆదిత్యవార-.

**ఐదు**

**ఐదుదక్షిణలు** వి.బ.వ. **1.** ఐదు రూపాయి నాణేలు; **2.** ఐదు పావలా నాణేలు.

**ఐవారు** రూ.మా. అయ్యవారు. వి. ఉపాధ్యాయుడు.

**ఒక్క**

**ఒక్కబిగిని** అవ్య. ద్రు. ఏకపర్యాయం. విరామం లేకుండా.

**ఒంకతాడి** రూ.మా. వంకతాడి. వి. **1.** దక్షిణాన వరుసగా నిలువుగా కనబడే అయిదు చుక్కలు; **2.** (కొందరు) పది పన్నెండు మోచేయి వంపు మాదిరిగా ఉండేచుక్కలు.

**ఒంకతిప్పినకోక** రూ.మా. వంక తిప్పిన కోక. వి. ఒక రకం నేత చీర.

**ఒంకర పేటి అంచు** రూ.మా. వంకర పేటంచు. వి. భుజానికి పెట్టుకొనే వంకి మాదిరి డిజైను నేసిన అంచు.

**ఒంకాయ** రూ.మా. వంగకాయ. వి. వార్తాకం, వంకాయ.

**ఒంకేం** రూ.మా. వంకి[3]. వి. **1.** ఊడ్లెతాడు తగిలించి బిర్రుపెట్టే పంగలకొయ్య; **2.** అంకెన, గొర్రుభాగం, దండెగాడి తాడుకు కట్టి గొర్తి చెక్కపై ఉన్న కొక్కేనికి తగిలించే ఇనప వంకీ.

**ఒంచు**[1] శశా. 3.43.

**ఒడంగుండు** రూ.మా. వడంగుండు. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం.

**ఒడంబగుండు** చూ. ఒడంబము.

**ఒడంబము**

**ఒడంబగుండు** రూ.మా. వడంబగుండు. వి. తాపీ పనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం.

**ఒడి**[3] రూ.మా. వడి[1].

**ఒడికట్టు**[2] రూ.మా. వడికట్టు. అ.క్రి. అచ్చు కట్టేటప్పుడు అచ్చు కర్రలకు పురిదారం కట్టు. వి. అచ్చుకట్టేటపుడు రెండు అచ్చు కర్రలకు కట్టిన పురిదారాలకు లంకె పడేటట్లు నేసిన అల్లిక. **ఒడికొలికె** రూ.మా. వడికొలికి. వి. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల వడిదారాలకు వేసిన అంకె. **ఒడితాడు** రూ.మా. వడితాడు. వి. **1.** రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టి దారం; **2.** డబ్బారాట్నం చక్రాన్ని గంటాన్ని కలిపే గట్టిదారం; **3.** అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టేపురి దారం; **4.** అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుకర్ర మీద మెలికల్లో దూర్చిన లావుదారం. **ఒడిదారం** రూ.మా. వడిదారం. వి. **1.** రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం; **2.** డబ్బారాట్నం చక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టిదారం; **3.** అచ్చు కట్టేటపుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం; **4.** అచ్చు కట్టేటపుడు వడిదారాల బిగింపుకు అచ్చు కర్రమీది మెలికలో దూర్చిన పురిదారం; **5.** ఉన్నిపడుగు మీద అచ్చుకోలకు అనులువేస్తూ అల్లిన లావుపాటి పోగులు. **ఒడిబండి** రూ.మా. ఒడిబండి. వి. గంటానికి బిగించిన రీలుదారం ఒండి. **ఒడిమెలికి** రూ.మా.. వడిమెలికె. వి. అచ్చుకట్టేటపుడు రెండు అచ్చుకర్రల వడి దారాలకు వేసినలంకె.

**ఒడిపిపటవ** రూ.మా. వడుపుపట్వ. వి. కీతకుండ, తాడి చెట్టెక్కి లొట్టిలోని కల్లును వంచుకోడానికి వాడే మట్టిపాత్ర.

**ఒడిపేలు** రూ.మా. వరిపిలి. వి. వరిమొక్కలాగా ఉండి, మాగాణి నేలల్లో పెరిగే గడ్డి.

**ఒడుకు**[1]

**ఒడుకుడుకుండి** రూ.మా. వడుకుడుకుండె. వి. రాట్నం మీద వడికి చుట్టిన నూలు. **ఒడుకుడుదారం** రూ.మా. వడుకుడుదారం. వి. రాట్నం ఆకులతాడును కదురును కలిపే గట్టిదారం. **ఒడుకునూలు** రూ.మా. వడుకుడునూలు. వి. రాట్నం మీదగాని చేతికదురు మీదగాని వడికిన నూలు. **ఒడుకురాట్నం** రూ.మా. వడుకురాట్నం. వి. నూలు తీసే రాట్నం. **ఒడుక్కట్టె** రూ.మా. వడుకుకట్టె. వి. వడకటానికి నారకట్టిన కర్ర.

**ఒడుక్కట్టె** చూ. ఒడుకు[1].

**ఒడుపుపటవ** రూ.మా. వడుపుపట్వ. వి. కీతకుండ, తాడిచెట్టెక్కి లొట్టిలోని కల్లును వంచుకోవడానికి వాడే మట్టిపాత్ర.

**ఒడ్డోల్లు** రూ.మా. వడ్లవాళ్ళు. వి.బ.వ. కొయ్యపనిచేసేవాళ్ళు.

**ఒడ్లవాల్లు** రూ.మా. వడ్లవాళ్ళు వి.బ.వ. కొయ్యపనిచేసేవాళ్ళు.

**ఒడ్లవాళ్ళు** రూ.మా. వడ్లవాళ్ళు. వి.బ.వ. కొయ్యపనిచేసేవాళ్ళు.

**ఒంటి**

**ఒంటిమిద్దె** వి. ఒకే గది ఉన్న ఇల్లు.

**ఒత్తడి** రూ. వత్తడి, వత్తిడి, వత్తుడు.

**ఒత్తు** రూ. వత్తు².

**ఒదటి** రూ.చూ. వాదట్టు. వి. మగ్గంచట్రం కిందిభాగం, నేత నేసేటప్పుడు ముందుకు వెనక్కు జరగటానికి అనువుగా చేసిన పల్లపుహోటు.

**ఒద్దిబేడలు** చూ. ఒద్దక. వి.బ.వ. చాయమినపపప్పు.

**ఒనఁ గూడు** రూ. వనగూడు.

**ఒప్పు²** వి. 2. అరటికాయు, ము. వాటిముక్క.

**ఒప్పెం** చూ. ఒప్పు¹. వి. వేలిముద్ర.

**ఒమ్ము¹** రూ. హొమ్ము.

**ఒయ్యారము** రూ. వయారము, వయ్యారము.

**ఒయ్యి** వి. పుస్తకం.

**ఒరలమన్ను** రూ. వర్లమన్ను. వి. ఒండ్రుమట్టి, వరిపొట్ట, మసికలిపి తొక్కి మాగవేసి ఒరలకు ఉపయోగించే మట్టి.

**ఒరి²** రూ.చూ. వరి² వి. 1. శాలిధాన్యం; 2. శాలిసస్యం.

**ఒరిగెంజ** రూ.చూ. వరిగంజి, వి. బియ్యం గంజి.

**ఒరిపూస** రూ.చూ. వరిపూస. వి. వడ్లపూస, పావిలో ఒక రకం, వరిచేలలో ఏటాలేచి అడుగు అడుగున్నర ఎత్తు పెరిగే గడ్డిమొక్క. **వరిపూసగడ్డి** రూ. వరిపూసగడ్డి. వి. వరిచేలలో ఏటాలేచి అడుగు లేక అడుగున్నర ఎత్తు పెరిగే గడ్డిమొక్క. **ఒరిపూసలగడ్డి** రూ.చూ. వరిపూసలగడ్డి. వి. వరిచేలలో ఏటాలేచి అడుగు అడుగున్నర ఎత్తు పెరిగే మొక్క. **ఒరేకంచు** రూ.చూ. వరేకంచు వి. 1. అంచులో చివర పది కొలుకుల రంగు పోగులు పెట్టిపైన ఒక కొలికి తెలుపు. ఒకకొలికి రంగు చొప్పున మారుస్తూ నేసిన అంచు; 2. జరీ పెట్టి నేసిన ఒక రకం అంచు. <వరి² + ఆకు + అంచు³.

**ఒరిగె** రూ. చూ. వరువు. వి. వరిగ, సస్యవిశేషం.

**ఒరిగెలు** రూ. చూ. వరిగెలు. వి.బ.వ. ఒక రకం ధాన్యం.

**ఒరువు** వి. 2. విత్తడానికి తగిన సమయం; 3. కాలివేళ్ళ మధ్య పుండు పడటం.

**ఒరువడి** రూ. చూ. వరువడి. వి. విధం.

**ఒరేకంచు** చూ. ఒరి².

**ఒఱ్ఱె¹** రూ. చూ. వరి². వి. 1. శాలిధాన్యం; 2. శాలిసస్యం.

**ఒఱ్ఱె²** రూ. చూ. వఱద. వి చిన్నవాగు.

**ఒర్లు** రూ. చూ. ఒఱలు. అ. క్రి. అరచు, ధ్వనిచేయు.

**ఒఱలు** రూ. ఒర్లు.

**ఒఱ్ఱు** రూ. వఱ్ఱ, వఱ్ఱు.

**ఒలంద** రూ.చూ. ఒలాందా.

**ఒలపక్షము** వి. కుడివైపు. తాళ్ల. సం. 11.97.

**ఒలపఎద్దు (-ఎద్దు)** రూ.చూ. వలపఎద్దు. వి. కడపఎద్దు, బంతిలో చివరి ఎద్దు, బంతిలో కుడివైపున ఉండి బంతి తిప్పే ఎద్దు.

**ఒలాందా** రూ. ఒలంద, వలంద, వలందా, వలందు. వళంద.

**ఒలికి** రూ.చూ. వలికి¹. వి. 1. బెగ్గురు, గోవర్ధనం. 2. సారస పక్షి.

**ఒలికి²** రూ. వలికి². వి. శ్మశానం.

**ఒలింపంటె** రూ.చూ. వలింపంటె. వి. గుమ్మటంలాంటి పనిముట్టు.

**ఒల్లకుండు** చూ. ఒల్లు.

**ఒల్లియ** రూ.చూ. వల్లియ. వి. 1. వల్లెతాడు, పశువుల్నికట్టే తాడు; 2. ఆకర్షకం, వశీకరణం.

**ఒల్లు** అవ్య. వద్దు.

**ఒల్లకుండు** అ.క్రి. 1. మాట్లాడకుండు; 2. నోరు మూసుకొను.

**ఒల్లె**

**ఒల్లెకోక** రూ.చూ. వల్లెకోక. **ఒల్లెచీర** రూ.చూ. వల్లెచీర.

**ఒల్లెక్కెం** వి. అబద్ధం.

**ఒళవు³** రూ.చూ. వళవు¹. వి. 1. వెరవు, ఉపాయం; 2. విధం.

**ఒళివు** రూ.చూ. వళవు¹.

**ఒళువు¹** రూ.చూ. వళవు¹.

**ఒళ్ళకట్టె** రూ.చూ. వళ్ళకట్టె. వి. 1. డిజైన్లు నేసే మగ్గంలో పేటు దారాలను పైకి ఎత్తడానికి వాడే కొయ్య పనిముట్టు; 2. నవారు మగ్గానికి వడిదారాలు అల్లేకర్ర.

**ఒళ్ళికిపోసుకొను** చూ. ఒళ్ళు.

**ఒళ్ళు.**

**ఒళ్ళికిపోసుకొను** అ.క్రి. స్నానం చేయు.

**ఓకె** వి. అంగీకారం.

ఇం. *Okay, Okey, O.K.* అంగీకృతి.

<ఇం. O.K.

**ఓగు** రూ.చూ. వాంగ్రు². వి. ఉరవడిగా పారే వాన నీటి కాలవ, వానకురిసి పొలంలో పారే నీటి జాలు, చెరువుకు నీళ్ళు వచ్చే కాలవ.

**ఓగు³** రూ. ఒప్పు². వి. వేసిన వరికంకుల కుప్ప.

**ఓంకుండ** రూ.చూ. హోమంకుండ. వి. పెళ్ళిళ్ళలో హోమంచేసేటప్పుడు కొన్ని కులాలవారు వాడే మట్టిపాత్ర.

**ఓటిబర్ని** వి. శోభనం.

**ఓదటి** రూ.చూ. వాదట్టు. వి. 1. మగ్గంచట్ర

కిందభాగం నేత నేసేటప్పుడు ముందుకు వెనక్కు జరగటానికి అనువుగాచేసిన పల్లపు చోటు; **2.** నేతనేసేటప్పుడు మగ్గంచట్రం ముందుకూ వెనకకూ ఆడటానికి అనువుగా ఒక వైపు గోడలో చేసినకంత; **3.** మగ్గం దోనెకు దండెకు మధ్య ఉన్న నేత పడుగు; **4.** నవారు నేసేటప్పుడు పడుగులో వేసిన పేక పోగు దట్టించే కొయ్యకత్తికింది అంచు.

**ఓదట్టు** రూ.చూ. వాదట్టు. వి. **1.** మగ్గంచట్రం కింది భాగం నేతనేసేటపుడు ముందుకు వెనక్కు జరగటానికి అనువుగా చేసిన పల్లపుచోటు; **2.** నేత నేసేటపుడు మగ్గంచట్రం ముందుకూ వెనక్కు ఆడటానికి అనువుగా ఒక వైపు గోడలో చేసినకంత; **3.** మగ్గందోనెకు, దండెకు మధ్య ఉన్ననేత పడుగు; **4.** నవారు నేసేటప్పుడు పడుగులో వేసిన పేక పోగు దట్టించే కొయ్య కత్తి కింది అంచు.

**ఓదాడుచేయు** రూ.చూ. వాదాడిచేయు. అ.క్రి. బట్ట నెయ్యటం మొదలు పెట్టే ముందు ఒకటి రెండు వేళ్ళ వెడల్పున బద్దెనేసి నేతబాగా రావటానికి అచ్చుతాళ్ళు పలకతాళ్ళు సర్దుకొను.

**ఓది** రూ. వద్ది.

**ఓమను** స. క్రి. మొదలు పెట్టు, ప్రారంభించు.

సం. ఓ. బ్రహ్మ కంఠం నుంచి పుట్టిన మొట్టమొదటి శబ్దం.

<సం. ఓమ్ + అను.

**ఓమసంచారీలు** రూ. చూ. వామసంచారీలు. వి.బ.వ. ఒక రకం వడ్లు.

**ఓరు**[2] రూ. హోరు. వి. **1.** ధ్వని; **2.** వర్షం కురిసేటప్పుడు అయ్యేధ్వని.

**ఓరుసట్టి** రూ.చూ. వారసట్టి. వి. సారెపక్కన కుమ్మరి పెట్టుకొనే చిన్న నీళ్ళ పాత్ర.

**ఓర్నె** వి. **1.** ఒక రకం పగ్గం; **2.** వేటకుపయోగించే సాధన విశేషం.

**ఓర్రె** వి. లోయ.

**ఓవసన్నం** రూ. వావసన్నం. వి. ఒక రకం వడ్లు.

**ఓవు**[2] రూ. చూ. ఓగు[3]. వి. **2.** జనుముకట్ట.

**ఓస** రూ. చూ. వాసము. వి. **1.** ఇంటిమీద పరిచే పట్టె; **2.** గుంటక మొ.వి. దిండుకు బిగించి కాడిమీద మోసే పొడుగుకొయ్య; **3.** నూలు చిలపలు ఆరవేసే వెదురు బొంగు; **4.** దూలాలకు అడ్డంగా కప్పుకింద చాలుగా పరచిన పొడుగాటి కొయ్య.

**ఓసం** రూ. చూ. వాసము. వి. **1.** ఇంటిమీద పరిచే పట్టె; **2.** గుంటక మొ. వి. దిండుకు బిగించికాడిమిద వేసే పొడుగు కొయ్య; **3.** నూలు చిలపలు తీసే వెదురుబొంగు; **4.** దూలాలకు అడ్డంగా కప్ప కింద చాలుగా పరిచిన పొడుగు కొయ్య.

**ఔజుఖానా** రూ. చూ. ఔదుఖానా. వి. **1.** స్నానాల తొట్టె; **2.** నీటి తొట్టి.

**ఔదుఖానా** రూ. అవతకాన, అవుజుఖాని, అవుదుఖానా, ఔదుఖానా, హవుజుఖానా, హవుదుఖాన, హౌదుఖానా.

**కక్క**[3] వి. **4.** చేపలు మొ. కూరలలోని ముక్క.

**కక్కసు**

**కక్కసుదొడ్డి** వి. మరుగుదొడ్డి, పాయిఖానా.

**కక్కి**[2]

<ఉ. కాకీ.

**కగ్గాలు** చూ. కగ్గము. వి.బ.వ. పగ్గాలు.

**కంక**[3] వి. కోడె, గిత్త.

**కంగు**[3] అ.క్రి. **3.** ఆటలలో అనుకొన్నదికాక వేరొకటి కదలు.

**కచ్చ**[2]

**కచ్చలు** వి.బ.వ. చెవిటివాళ్ళు, బధిరులు.

**కచ్చడము**[1] రూ. కచ్చురం, కచ్చులం.

**కచ్చురం** రూ.చూ. కచ్చడము[1]. వి. ఎడ్లబండి.

**కచ్చులం** రూ.చూ. కచ్చడము[1]. వి. ఎడ్లబండి.

**కంచపుంబెండ్లి** చూ. కంచము.

**కంచము**

**కంచపుంబెండ్లి** వి. సులభసాధ్యమయిన వివాహం, వడ్డించిన విస్తరివంటి ప్రయోగం. తాళ్ల.సం. 15.129.

**కంచు**

**కంచుడు** వి. **2.** గిన్నె.

**కంజ** వి. పిసినారి.

హిం.ఉ. కంజూస్. పిసినిగొట్టు.

<ఉ. కంజూస్.

**కంజరు** వి. కత్తి. ఖడ్గ. 13.

ఉ. ఖంజర్. ఛురిక, పెద్దవాకు.

<ఉ. ఖంజర్.

**కటాక్షము** వి. దయ.

సం. కటాక్ష-. కడగంటి చూపు.

<సం. కటాక్ష-. (అర్థవిపరి.).

**కటిక**[1]

**కటికకూర** వి. మాంసం.

**కటిక్కట్రలు** రూ.చూ. కట్టిక్కట్రలు. వి.బ.వ. నార ఒలిచి వేసిన జనపకట్రలు.

**కట్‌కరా** వి. చెక్క కటకటాలు.

ఉ. కట్‌కరా. కటకటాలు, ఆవరణం.

<కట్‌కరా.

**కట్టావిప్పాసవర్థుడు** చూ. కట్టు.

**కట్టిక్క్రలు** చూ. కట్టు, కఱ్ఱ. రూ. కటిక్క్రలు. వి.బ.వ. నార ఒలిచి వేసిన జనప కఱ్రలు.

**కట్టు**

**కట్టావిప్పాసమర్థుడు** వి. ఆలోచన చేయడానికి భంగపరచడానికి నేర్పరి అయినవాడు; **కట్టుబానిస** వి. ఒప్పందం ప్రకారం తరతరాలుగా వెట్టిచాకిరీ చేసేవ్యక్తి.

**కట్టుమస్తు** రూ. కట్‌మస్తా. విశ. బలిష్ఠమైన.

ఉ. **కట్‌మస్తా.** లావైన, గర్వంతోనిండిన, బలిష్ఠమైన.

<ఉ. కట్‌మస్తా.

**కట్‌మస్తా** రూ.చూ. కట్టుమస్తు. విశ. బలిష్ఠమైన.

**కట్ల** చూ. కట్టు. వి.బ.వ. 1. భార్యా పుత్రులు; 2. భార్య.

**కట్లపొడి** చూ. కట్లు.

**కట్లు** చూ. కట్టియ. వి.బ.వ. కఱ్రలు.

<కట్టె + -లు.

**కట్లపొడి** వి. పొగాకు ఈనెలపొడి.

**కడ** రూ. కల్ల[4].

**కడచు**

**కడుపుమాను** వి. గడప.

**కడమ** రూ. కడువుఁ.

**కడశక్కరి** వి. కండచక్కెర.

సం. **ఖండశర్కరా.** పటికబెల్లం.

<సం. ఖండశర్కరా.

**కడీ**

హిం. **కడీ-.** కడీ, కళ్ళెం.

<హిం. కడీ.

**కడుపు**

**కడుపులోచల్ల కదలకుండా** అవ్య. శ్రమపడకుండా.

**కడుపుమాను** చూ. కడచు.

**కడువుఁ** రూ.చూ. కడమ. విశ. మిగిలినది, మిగతాది.

**కంటము** వి. మెడ. తాళ్ల.సం. 12.84.

సం. **కణ్ఠ-.** మెడ.

<సం. కణ్ఠ-.

**కంట్రాక్టరు** రూ. కాంట్రాక్టరు.

**కంట్రాక్టు** రూ. కాంట్రాక్టు.

**కండవి** రూ.చూ. కండువా. వి. తువాలు, టవలు.

**కండువా** రూ. కండవి. వి. 3. ఓణీ.

**కండ్రా** విశ. సీలుచేయబడిన.

**కతక్కన** రూ.చూ. కతక్కిన. క్రి.విశ. వెంటనే.

**కతక్కిన** రూ. కతక్కన. క్రి.విశ. తొందరగా. ధ్వన్యను.

**కతిక** రూ.చూ. కత్తిక. వి. మేనెల రెండోభాగంలో ప్రవేశించే కార్తె.

**కత్తరాలు** వి.బ.వ. చీకట్లు.

క. **కత్తలిసు.** చీకటి అగు.

< కత్తలిసు.

**కత్తవ**[2] వి. 3. పెద్దబొరిగె.

**కత్తి**[1]

**కత్తిమీదసాము** రూ.చూ. కత్తిమీఁదిసాము. వి. కష్టమైన పని. **కత్తిమీఁదిసాము** రూ. కత్తిమీదసాము. **కత్తివాదర** వి. 1. కత్తి అంచు; 2. పదును. **కత్తివాదరు** వి. పదును.

**కత్తిక** రూ. కతిక, కర్తిక, కిటికె, కిరికతి. వి. మేనెల రెండోభాగంలో ప్రవేశించే కార్తె.

సం. **కృత్తికా.** ఒకానొక నక్షత్రం, ఒకానొక కార్తె.

<సం. కృత్తికా.

**కదరు** విశ. మురికైన.

ఉ. **కద్ర్, కదర్.** మురికైన, కలుషమైన.

<ఉ. కద్ర్.

**కనాసు** వి. కల, స్వప్నం.

క. **కనాసు.** స్వప్నం, కల.

<క. కనాసు.

**కంద**

**కందవిత్తు** వి. అధిక పరిశ్రమ లేకుండా అభివృద్ధి పొందటం. కందదుంపే కందవిత్తు. కందదుంపను నాటితే కందమొక్క వస్తుంది. కందమొక్కకు దుంపలు వస్తాయి. శ్రమలేకుండా కంద అభివృద్ధి పొందుతుంది.

**కందిని** వి. 2. ఇంధనం.

**కందుబాలు** చూ. కందు[1]. వి.బ.వ. వడియాలు.

**కన్ను**[1]

**కళ్ళకుకట్టినట్లు** అవ్య. అప్రత్యక్ష విషయాన్ని ప్రత్యక్షంగా ఉన్నట్లు. **కళ్ళల్లోవత్తులుపెట్టుకొనిచూచు** స.క్రి. జాగ్రత్తగాచూచు. దూదితోచేసిన పువ్వొత్తుల్ని ఆముదంతో లేదా నువ్వులనూనెతో లేదా చనుబాలతో తడికళ్ళకు జబ్బుచేసినప్పుడు ఆకళ్ళకు పెట్టటం. ఈ నేత్రవైద్యవిధానంనుండి ఏర్పడ్డ పలుకుబడి ఇది. **కళ్ళల్లోవత్తులువేసుకొనిచూచు** స.క్రి. జాగ్రత్తగా చూచు. దూదితోచేసిన పువ్వొత్తుల్ని ఆముదంలో లేదా నువ్వులనూనెలో లేదా చనుబాలలో తడిపి కళ్ళకు జబ్బుచేసినప్పుడు ఆ కళ్ళకు పెట్టటం. ఈ నేత్రవైద్యవిధానంవల్ల కలిగిన పలుకుబడి ఇది. **కళ్ళుకాయలుకాయు** అ.క్రి. ఎక్కువగా ఎదురుచూచు.

**కన్నుగ** వి.బ.వ. కళ్ళు, నేత్రాలు.

త. కణ్. కన్ను, కణ్‌గళ్. కళ్ళు; క. కణ్. కన్ను.

<త. కణ్‌గళ్.

**కన్నె**[2] వి. **4**. సలుపుకు మారుగా పలుపు అని సవరించుకోవాలి.

**కబడ్దార్** రూ.చూ. ఖబర్దారు. వి. **1**. హెచ్చరికను తెలిపేశబ్దం; **2**. జాగ్రత్త, భద్రం; **3**. బెదిరింపు.

**కబర్‌దార్** రూ.చూ. ఖబర్దారు.

**కబురు** వి. **5**. అమంగళమైన నోటిమాట.

**కమఖాబు**

ఉ. కమ్‌ఖాబ్. బహుమూల్యంగల వస్త్రం.

<ఉ. కమ్‌ఖాబ్.

**కమాట** వి. టమోటా. ఒకరకం కూరగాయ.

ఇం. *Tomato*. టమోటా.

<ఇం. Tomato.

**కమాను**[1] రూ. కవాని.

**కమాను**[2] వి. **10**. వంతెన.

**కమాయిషీ** రూ.చూ. కమావీసు. వి. వ్యవహారం.

**కమావీసు** రూ. కమాయిషీ, ఖమాయిషు.

ఉ. కమాఇష్. వ్యవహారం.

త. కమాయిచు. వృత్తి, కూలి, సంపాదన.

<ఉ. కమాఇష్.

**కంప** వి. **6**. చిన్నపొదలు.

**కంపచెట్టు** వి. తుమ్మచెట్టు.

**కంపరా** వి. తక్కువహోదా.

ఉ. కమ్-షరాహ్. తక్కువజీతం.

<ఉ. కమ్-షరాహ్.

**కంబటిపురుగు** చూ. కంబడి.

**కంబడి**

**కంబటిపురుగు** రూ.చూ. కంబళి పురుగు. వి. గొంగళిపురుగు. **కంబడిపురుగు** రూ.చూ. కంబళిపురుగు. వి. గొంగళిపురుగు.

**కంబలి**

**కంబలిపురుగు** రూ.చూ. కంబళిపురుగు. వి. గొంగళి పురుగు.

**కంబళి**

**కంబళిపురుగు** రూ. కంబటిపురుగు, కంబడిపురుగు, కంబలిపురుగు, కమ్మడిపురుగు, కమ్మిడిపురుగు. వి. గొంగళిపురుగు.

**కంభము** తాళ్ల. సం. 5.122.

సం. స్కంభ-. స్తంభం; ప్రా. కంభ-.

<ప్రా. కంభ-.

**కమ్మడి**

**కమ్మడిపురుగు** రూ.చూ. కంబళిపురుగు. వి. గొంగళిపురుగు.

**కమ్మిడిపురుగు** రూ.చూ. కంబళిపురుగు. వి. గొంగళిపురుగు.

**కమ్ములు**[4] వి.బ.వ. సజ్జలు.

త. కంబు. సజ్జ.

<త. కంబు + -ఉ.

**కరంగు** వి. ద్రవం.

**కరణము**

**కరణముదస్త్రము** వి. **1**. బాధాకరమైన పని; **2**. స్వేచ్ఛలేనిచాకిరీ; **3**. బరువైన పని. కరణంగారి దస్త్రంలో గ్రామంలోని ఆస్తిపాస్తుల వివరాలన్నీ ఉంటాయి. వాటిని పరిశీలించటం కష్టం, తలపోటు తెప్పించే వ్యవహారం. కాబట్టి ఈ పదబంధం విశేషార్థాలలో ప్రయుక్తవౌతోంది.

**కరరావుడు** వి. వత్రువసుడి.

**కరవలోడు (-వాండు)** వి. వడ్రంగి.

**కరాపుణ్నే** అవ్య. చివరన.

**కరాశిగా** క్రి.విశ. నిజంగా.

**కరుబుజ్జకాయ** చూ. కరబూజా. వి. పుచ్చకాయ.

**కర్తిక** రూ. చూ. కత్తిక. వి. మే నెల రెండోభాగంలో ప్రవేశించే కార్తె.

**కర్రె**

**కర్రెగొడ్డు** వి. ఎలుగుబంటి.

**కలం**[2] రూ.చూ. కళ్లము. వి. **2**. ధాన్యాన్ని నూర్చేచోటు.

**కలంకారీ** రూ. కలముకారి.

**కలందాను** త. కలంతాన్-. సిరాబుడ్డీ ఉంచుకోవటానికి ఉపయోగించే పాత్ర.

**కలము**[3] వి. **3**. బలపం.

**కలముకారి** రూ.చూ. కలంకారీ. వి. వస్త్రాల మీద వేసే అద్దకం.

**కలవండు** చూ. కలవ[1]. వి. బస్తా.

**కలి**[1]

**కలోగంటో** అవ్య. ఏదోఒకటి.

**కలికము**

సం. కల్క-. చూర్ణం, పొడి.

<సం. కల్క-.

**కలీజు** రూ.చూ. గలీజు. వి. **1**. మురికి; **2**. పెంటకుప్ప.

**కలోగంజో** చూ. కలి[1].

**కల్యాణము** భాగ. 10. పూ. 1682.

**కల్ల**[1]

**కల్లబొల్లికబురులు** రూ.చూ. కల్లబొల్లికబుర్లు.

**కల్లబొల్లికబుర్లు** రూ. కల్లబొల్లికబురులు. వి.బ.వ. మాయమాటలు, అబద్ధమైన, వ్యర్థమైన పలుకులు. < కల్ల[1] + పొల్లు + కబురు + - లు.

**కల్ల**[4] రూ.చూ. కడ. వి. ఒడ్డ.

**కల్లు**[2] రూ. కెళ్ళ.

**కళ** వి. ఒకవిధమైన తేజస్సు, శోభ.

సం. కలా. భాగం, పాలు, చంద్రునిలో 16వ భాగం.

<సం. కలా. (అర్థవిపరి.).

**కళింగరకాయ** వి. పుచ్చకాయ.

సం. కళింగ-. ఇప్పటి ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌-లోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల ప్రాంతం.

**కళేబరం** వి. శవం. భాగ. 8.334.

సం. కళేబర-. శరీరం.

<సం. కళేబర. (అర్థవిపరి.).

**కళ్ళుకుకట్టినట్లు** చూ. కన్ను[1].

**కళ్ళుము** రూ. కలం[2].

**కళ్ళల్లో వత్తులు పెట్టుకొని చూచు** చూ. కన్ను[1].

**కళ్ళల్లో వత్తులు వేసుకొనిచూచు** చూ. కన్ను[1].

**కళ్ళుకాయలుకాయు** చూ. కన్ను[1].

**కవాంని** రూ.చూ. కమాను[1]. వి. కేంప్.

**కసబు** కసబు[1]గా సరిచేసుకోవాలి.

**కసబు**[2] వి. 1. వ్యాపారం; 2. వృత్తి; 3. పరిశ్రమ.

ఉ. కస్బ-కసబ్‌-. వృత్తి, ఉద్యోగం, లాభం.

త. కచవ్వ. శ్రమ, ఉద్యోగం.

<ఉ. కసబ్.

**కసబుబారీ** వి. వృత్తిప్రకారం.

ఉ. కసబ్-వారీ. వృత్తి ప్రకారం.

త. కచవ్వు. శ్రమ, ఉద్యోగం.

<ఉ. కసబ్-వారీ.

**కసబుదారు** వి. ఉత్పత్తిదారుడు.

ఉ. కసబ్-దార్. ఉత్పత్తిదారుడు.

త. కచవ్వు. శ్రమ, ఉద్యోగం.

<ఉ. కసబ్-దార్.

**కసరు**[1] వి. 7. జ్వరం.

**కసవు** వి. 3. పేడ, పెండ.

**కసాండి** రూ.చూ. కాసాండి. వి. కుండ.

**కసించు** చూ. కసువు. స. క్రి. చీపురుతో ఊడ్చు.

<కసవు + - ఇంచు[3].

**కసీదు** రూ. కసూది.

**కసూది** రూ. చూ. కశీదు. వి. గుడ్డ మీద పువ్వులు కుట్టేపని.

**కసెం** వి. 2. ఉప్పు ఎక్కువ కావటం.

సం. కషాయ-. ఒగరుకలది, ఓషధులు వేసి కాచిన నీరు, ఎర్రనిది ; ప్రా. కసాయ-.

<ప్రా. కసాయ-.

**కాక**[2]

**కాకయ్య** వి. బాబాయి. <కాక[2] + అయ్య.

**కాక**[4] రూ. చూ. కాకి, వి. కాకం.

**కాకమ్మకథలు** చూ. కాకి.

**కాకరి** విశ. వ్యక్తావ్యక్తం.

**కాకరితనము** వి. వ్యక్తావ్యక్తత.

**కాకి** రూ. కాక [4].

**కాకమ్మ కథలు** వి. బ. వ. 1. నమ్మదగని కథలు; 2. నమ్మదగని విషయాలు.

సం. కథా. కథ.

< కాకి + అమ్మ + సం. కథా + -లు.

**కాంచెట్టు** చూ. కాము[2].

**కాటికాపరియేడ్పు** చూ. కాడు[1].

**కాటిపాపడు** చూ. కాడు[1].

**కాటేయు** చూ. కాటు [1]. అ. క్రి. రంధ్రంచేయు.

<కాటు[1] + వేయు.

**కాటేరు** చూ. కాడు[1].

**కాటేరుదాటింపు** చూ. కాడు[1].

**కాడు**[1]

**కాటికాపరి యేడ్పు** వి. లోకం సుఖంగా బతుకుతున్నందుకు ఏడ్చే ఏడ్పు. **కాటిపాపడు** వి. సంవత్సరానికి ఒకసారి తన గ్రామానికి వచ్చి వెట్టివాడి నుండి సుంకాన్ని తీసుకుపోయేవాడు. **కాటేరు** వి. బహిష్టు అయిన స్త్రీలు శ్మశానమార్గం ద్వారా నడిస్తే భూతప్రేతాలు ఆస్త్రీలను ఆవహించి పిల్లలు పుట్టకపోవటం, పుట్టినా పిల్లలు చనిపోవటం మొదలైనవి జరగటం. **కాటేరుదాటింపు** వి. మిట్టమధ్యాహ్నం నల్లచీరమీద తెల్లగళ్ళు ఉన్న చీర ఒకటి, నల్లకోడిఒకటి, కొత్తకుండలో మూడుసేర్ల బియ్యాన్ని పోసి తీసుకుపోయి శ్మశానంలో ఉన్న దింపుడు కల్లం దగ్గర కొత్త కుండలో అన్నం వండి నల్లకోడి(పెట్ట)ను కోసి దాని రక్తంలో అన్నాన్ని

తడిపి అయిదు ముద్దలు చేసి అయిదు విస్తళ్ళలో పెట్టి కాటేరు అయిన స్త్రీకి నల్లచీర కట్టి ఆ ముద్దల మీద నడిపించటం. **కాంట్రాక్టరు** రూ.చూ. కంట్రాక్టరు. వి. ఒప్పందం కుదుర్చుకున్నవాడు, గుత్తగాడు.

**కాంట్రాక్టు** రూ. చూ. కంట్రాక్టు.

**కాండి** రూ. చూ. కాండి. **1.** వి. కాడిమాను.

**కాడి**[1] రూ. కాండి.

**కాతరు** వి. లక్ష్యం, లెక్క.

త. **కాతర్**. సర్వశక్తిగల.

ఉ. **ఖాతిర్**. ఆదరం, సమ్మానం.

< ఉ. **ఖాతిర్**.

**కానగమండ** వి. కానగచెట్టు కొమ్మలకున్న చిన్న మండ. వీటిని తలకు చుట్టుకుంటారు.

**కానా** వి. ఒకరకమైన మత్తుపదార్థం.

**కానికీ** వి. అనుమతి లేకుండా కోర్టునుంచి తెచ్చిన ప్రయివేటు నకలు.

**కానుగు** రూ. కాము[2].

**కాపర్సు** వి.బ.వ. పూర్వకాలంలోని రాగితోకానులు.

ఇం. *copper*. రాగి -s బహువచన ప్రత్యయం.

<ఇం. **copper + -s.**

**కాపీ**[1]

**కాపీలు** వి.బ.వ. ఉడికినగింజలు.

**కాపు**

**కాపుదారీ** వి. జాగ్రత్తకోసం చేసే ఏర్పాటు.

**కాఫరు** వి. మహమ్మదీయ మతంలో విశ్వాసం లేనివాడు.

ఉ. **కాఫిర్, కాఫిర్**. నాస్తికుడు.

త. **కాఫిరి**. దక్షిణాఫ్రికాకి చెందిన నీగ్రోవాడు.

<ఉ. కాఫర్.

**కామం** వి. శారీరకవాంఛ.

సం. కామ-. కోరిక, ఇచ్ఛ, మదం, మత్తు.

<సం. కామ-. (అర్థవిపరి.).

**కామాపు** వి. రద్దు. ఖానీ మొ. నేరాలకు ఋజువులు లేకుండా చేసే మాపు.

ఇం. *Calm, Up*-. సర్దుమణుగు.

<ఇం. Calm Up.

**కాము**[2] రూ.చూ. కానుగు.

**కాంచెట్టు** వి. గానుగచెట్టు.

**కాయ**

**కాయగూర (-కూర)** వి. ఆకుకూర. వి. **1.** కూరగాయ; **2.** ఆకుకూర.

**కామిడి** విణ. చెడ్డ.

క. **కావిణి**. చెడ్డ.

<క. **కామిణి**.

**కారపుచుట్టలు** చూ. కారము[1].

**కారపుంబూస** రూ. కారంపూస.

**కారము**[1] రూ. కారెం, కాలి. వి. **5.** పచ్చడి.

**కారపుచుట్టలు** వి.బ.వ. జంతికలు. **కారంపూస** రూ.చూ. కారపుంబూస. వి. సెనగపిండితో కారంకలిపి చమురుతో వేయించి చేసే భక్ష్యవిశేషం, కారప్పూస.

**కారంపూస** చూ. కారము[1].

**కారు**[4]

**కారుబళ్ళకసరత్తు** వి. వ్యాయామం.

**కారుబారు** రూ. కార్వారు.

**కారెం** రూ.చూ. కారము[1]. వి. కారం.

**కార్వారు** రూ.చూ. కారుబారు. వి. విషయం.

**కాలాంతకుడు** వి. అసాధ్యుడు.

సం. **కాలాంతక**-. యముడు.

<సం. కాలాంతక- (అర్థవిపరి.).

**కాలి** రూ.చూ. కారము[1]. వి. కారం.

**కాలు**[2]

**కాల్తట్టు** వి. బహిర్భూమి. **కాళ్లపీచు** వి. గోదిని కాళ్ళను తుడుచుకొనే పీచు.

**కాల్తట్టు** చూ. కాలు[2].

**కాళ్లపీచు** చూ. కాలు[2].

**కాపు**[2] వి. **4.** నల్లటి కాటుకవంటి పదార్థం. ఆదివారం అర్ధరాత్రి నల్లపిల్లిని శ్మశానంలోకి తీసుకుపోయి చంపి ఎండుజిల్లేడు కట్టెలతో కాల్చి బూడిదగా చేసి బజనికను తెచ్చి తొమ్మిది రకాల తైలాలతో కలిపి నూరి కాపుగా చేస్తారు. దీన్ని ధరిస్తే భూతభవిష్యద్వర్తమానాలు తెలుస్తాయనీ క్షుద్రశక్తులు గ్రామదేవతలు కనబడతాయనీ చెప్తారు.

**కాపు**[3] వి. **7.** పైకిలేచిన ధూళి.

**కాష్ఠం** వి. చితి, శవదహనానికి ఏర్పరిచిన కట్టెలకుప్ప.

సం. కాష్ఠ-. కర్ర.

<సం. కాష్ఠ-. (అర్థవిపరి.).

**కాసాండి** రూ. కసాండి. వి. పెద్దచెంబు.

**కాసి**[1] వి. **4.** దర్భ.

**కిక్కరించు.** రూ.చూ. కిక్కురించు. స.క్రి. మోసగించు, వంచించు.

**కిక్కురించు** రూ. కిక్కరించు.

**కిచిడీ**[2]

**కిచిడీకాయ** రూ.చూ. కిచ్చిలికాయ. వి. నారింజ-

కాయ.

**కిచ్చిలి**

**కిచ్చిలికాయ** రూ. కిచిడీకాయ. వి. నారింజకాయ.

**కిటికీ** రూ. కిరికిటి, కిరికిటీ.

**కిటికె** రూ.చూ. కత్తిక. వి. మేనెల రెండోభాగంలో ప్రవేశించేకార్తె.

**కిట్టనివారు** రూ.చూ. కిట్టు[2].

**కిట్టు**[2]

**కిట్టనివారు** విణ.బ.వ. పగవారు.

**కిత్తవ** వి. కథ.

సం. *కితవ-*. వంచకుడు, మోసగాడు, దుష్టుడు, పిచ్చివాడు. పా. *కితవ-*. జూదగాడు.

<సం. కితవ-.

**కిరికతి** రూ.చూ. కతిక. వి. మే నెల రెండోభాగంలో ప్రవేశించే కార్తె.

**కిరికిటి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిరికిటీ** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిశిమిశ్** రూ.చూ. కిస్మసు. వి. క్రిస్టమస్, క్రీస్తు జన్మదినం.

**కిసంత** చూ. కాసంత. విణ. కొంచెం.

**కిసున** వి. కృష్ణుడు. తాళ్ల. సం. 12.15.

సం. కృష్ణ-. కృష్ణుడు.

<సం. కృష్ణ-.

**కిస్మతు** వి. అదృష్టం.

ఉ. కిస్మత్. అదృష్టం.

త. కిస్మత్. విధి, అదృష్టం.

<ఉ. కిస్మత్.

**కిస్మసు** రూ. కిశిమిశ్.

**కీమా** రూ. ఖైమా. వి. చిన్నచిన్నముక్కలుగా చేయబడ్డ మాంసం.

హిం. ఉ. కీమా. చిన్న చిన్న ముక్కలుగా చేయబడ్డమాంసం.

<ఉ. కీమా.

**కీసా**[3] వి. సీసా.

**కీసు**[2] స.క్రి. లాగు.

క. కీసు. లాగుకొను.

<క. కీసు.

**కీసు**[3] వి. నిప్పు.

క. *కిచ్చు-*. నిప్పు.

కొలా. *కిస్*; నా. *కిచ్*; గ. *కిస్*; *కిచ్చు*; ఒల్లా. *కిస్*.

<క. కిచ్చు.

మూ.ద్రా. కిచ్.

**కుక్క**[1]

**కుంకుడుకాయ** రూ. కూగటికాయ.

**కుచేలసంతానం** వి. ఎక్కువమంది సంతానం.

సం. కుచేలసంతాన-. కుచేలునియొక్క సంతానం.

<సం. కుచేలసంతాన-. (అర్థవిపరి.).

**కుచ్చు**[2] వి. కడుపు, కుక్షి.

సం. *కుక్షి-*. కడుపు; పా. *కుక్షి-*, *కుచ్ఛి-*; పా. *కుచ్ఛి-*.

<ప్రా. కుచ్ఛి-.

**కుంచము**

**కుంచెడు** విణ. **1.** అయిదుకిలోలు; **2.** నాలుగుశేర్లు.

**కుంచె**

**కుంచెకోలు** ~ దేవాలయద్వారాలు తెరిచే సాధం.

**కుంచెడు** చూ. కుంచము.

**కుంజు** వి. కాకి.

**కుటారి** వి. కందిపొట్టు.

**కుడుక** వి. **4.** అన్నంతినే మట్టిపాత్ర.

**కుంట** వి. **12.** శ్మశానం.

**కుండ**

**కుండమార్పిడి** వి. **1.** కుండల్నిమార్చుకోవటం; **2.** సోదరీసోదరులు మేనరికంలో ఎదురుమేనరికం పాటిస్తూ లేదా వేరే కుటుంబానికి చెందిన సోదరీ సోదరుల్ని పెళ్ళిచేసుకోవటం. **కుండలలో గుఱ్ఱాలుతోలు** స.క్రి. ఇంట్లో కూర్చుని తాను కదలక ఇతరులకు పనులు పురమాయిస్తూ తొందరపెట్టు. వంటయింటి పరాక్రమమేకాని బయట సామర్థ్యంలేని వ్యక్తినిబట్టి వచ్చిన పలుకుబడి ఇది.

**కుప్పళించు** అ.క్రి. **2.** ప్రబలము.

క. కుప్పళిసు. కుప్పగాచేయు.

**కుంబం** వి. **2.** దేవునికి నైవేద్యంగా సమర్పించే అన్నరాశి; **3.** అమ్మవారికి బలిఇవ్వడానికి ఉద్దేశించబడ్డ కూడు.

**కుంబంకూడు** వి. బోనంకూడు, అమ్మవారికి బలిఇవ్వటానికి ఉద్దేశించబడ్డకూడు.

**కుంభం** రూ.చూ. కుంభము. వి. **2.** దేవునికి నైవేద్యంగా సమర్పించే అన్నరాశి; **3.** అమ్మవారికి బలి ఇవ్వటానికి ఉద్దేశించబడ్డకూడు.

**కుంభంకూడు** వి. దేవతలముందు గ్రామస్థులందరూ పెట్టిన అన్నంరాసి.

**కుంభకర్ణుడు** వి. ఎప్పుడూ నిద్రపోయేవాడు.

సం. కుమ్భకర్ణ-. రావణుని సోదరుడు.

<సం. కుమ్భకర్ణ-. (అర్థవిపరి.).

**కుంభబలి** చూ. కుంభము.

**కుంభము** రూ. కుంభం.

**కుంభబలి** వి. కొత్తకుండలో 11 శేర్ల జొన్నలను కుంభంకూడుగా వండుతారు. దీన్ని అమ్మవారి ముందు రాశిపోసి దున్నపోతును నరకటాన్ని కుంభబలి అంటారు.

**కుమ్ము** వి. బాధ, వ్యథ.

**కుయ్యెత్తులు** వి.బ.వ. **1.** వేళాకోళం; **2.** కుతంత్రాలు.

సం. కుయుక్తి-. చెడ్డఉపాయం.

<సం. కుయుక్తి- + -లు.

**కురుసుకొను** అ.క్రి. ఉపేక్షించు. కు.సం. 4.58.

ఉ. ఖుసూర్. ఉపేక్ష.

త. కుచూర్. అజాగ్రత, అలక్ష్యం, ఉపేక్ష.

<ఉ. ఖుసూర్.

**కురాను** రూ.చూ. ఖురాను. వి. మహమ్మదీయుల మత గ్రంథం.

**కర్రుకుర్రు చీకటి** చూ. కుర్ర. వి. మసకచీకటి.

**కుఱువ** రూ.చూ. కుఱువు[2].

**కులపంచాలకులు** వి.బ.వ. కులంలో పంచాయతీ చేసే పెద్దలు.

సం. కుల-. కులం, పంచ-. అయిదు.

**కుళ్ళ** విణ. పొట్టి.

త. కుళ్ళన్. పొట్టివాడు.

<త. కుళ్ళన్.

**కుళ్ళబడు** చూ. కుళ్లు.

**కుళ్ళు**

**కుళ్ళబడు** అ.క్రి. తిరగబడు.

<కుళ్లు + -అ[7] + పడు.

**కుశాల** రూ. చూ. కుశాలు. వి. సంతోషం.

**కుశాలు** రూ. కుశాల.

**కుసిరి** వి. కూర.

**కూకు**[2] వి. ఆర్తనాదం. తాళ్ల. సం. 12.322.

క. కూకు. చప్పట్లు చరచు.

**కూగటికాయ** రూ.చూ. కుంకుడుకాయ. వి. కుంకుడు-కాయ, తలంటుకోవటానికి ఉపయోగపడే ఒకరకం కాయ.

**కూయు** స.క్రి. పిలుచు.

**కృత్యాదవ్యవస్థ** వి. క్లిష్ట పరిస్థితి, కష్టమైనపని.

సం. కృత్యాద్యవస్థా-. గ్రంథప్రారంభస్థితి.

<సం. కృత్యాద్యవస్థా-. (అర్థవిపరి.).

**కృపణుడు** వి. లోభి.

సం. కృపణ-. దరిద్రుడు, బీదవాడు.

<సం. కృపణ-. (అర్థవిపరి.).

**కృషి** వి. శ్రమించటం, కష్టపడటం, ప్రయత్నించటం.

సం. కృషి-. సేద్యం, వ్యవసాయం.

<సం. కృషి-. (అర్థవిపరి.).

**కృష్ణార్పణం** వి. ఏదైనా పోగొట్టుకున్నప్పుడు భిక్షాటన చేసేటప్పుడు దాసర్లు వాడే మాట.

సం. కృష్ణార్పణ-. కృష్ణునికి అర్పించేది.

<సం. కృష్ణార్పణ-. (అర్థవిపరి).

**కెక్కరించు** స. క్రి. ఎదిరించు.

**కెక్కెరపండు** వి. దోసపండు.

హిం. కక్‌డీ. దోస.

<హిం. కక్‌డీ + పండు.

**కెచ్చెలి**

**కెచ్చెళ్ళు** వి.బ.వ. కంగాళీ. < కెచ్చెలి + లు.

**కెచ్చెళ్ళు** చూ. కెచ్చెలి.

**కెల్లు** వి. అట్టహాసం.

**కెళ్ళు** రూ.చూ. కల్లు[2]. వి.బ.వ. రాళ్ళు.

**కై**[1]

**కైకిత** వి. కూలి. **కైకిల్** రూ.చూ. కైకూలి. వి. ఏనాటి పనికి ఆనాడు వచ్చేకూలి, రోజుకూలి, చేకూలి. **కైకిలి** రూ. వి. కూలి. **కైకూలి** రూ. కైకిల్.

**కైమా** రూ.చూ. కీమా. వి. చిన్న చిన్న ముక్కలుగా చేయబడ్డ మాంసం.

**కొటక్కడి** వి. దక్షిణదిక్కు.

**కొటావు** రూ.చూ. కొట్టరువు. వి. గది, కొట్టడి.

**కొట్టము**[1] వి. **4.** గుడిసె.

**కొట్టరువు** రూ. కొటావు.

**కొట్టాయి** వి. **2.** సినిమా హాలు.

**కొట్టిడీ** రూ.చూ. కొట్టడి[1]. వి. ధాన్యం నిలవచేసేగది.

**కొట్టివేయు** చూ. కొట్టు[1].

**కొట్టు**[1]

**కొట్టివేయు** స.క్రి. చంపు.

**కొడంగి** చూ. కొండ. వి. కొండముచ్చు.

**కొడి**

**కొడికొట్టు** స. క్రి. భారతోత్సవాలలో స్తంభంపైన పూలు పళ్ళతో కప్పిన గుడ్డమూటను తొలగించు. **కొడెల్లా** అవ్య. చివరదాకా. <కొడి + ఎల్లన్.

**కొడెల్లా** చూ. కొడి.

**కొడేటెంకా** చూ. కొడి, టంకా. వి. ఇరవై రూపాయలు.

**కొంటెకోణంగి** రూ. కొంటె కోనంగి.

**కొంటెకోనంగి** రూ.చూ. కొంటెకోణంగి. వి. **1**. వెకిలి చేష్ట-లచే లేదా కోతి చేష్టలవంటి చేష్టలచే నవ్వు పుట్టించేవాడు; **2**. చిలిపివాడు.

**కొండ**[1]

<మూ.ద్రా. *కున్- *కొన్-.

కొండతిమ్మిరి వి. స్వల్పభూకంపం.

**కొండపోవు** చూ. కొను.

**కొండబీ** చూ. కొను.

**కొండబోవు** చూ.కొను.

**కొండి**[3] రూ.చూ. కొండియము. వి. చాడీ, ఇతరులపై లేనిపోని నేరాలు చెప్పటం.

**కొండియము** రూ. కొండి[3].

**కొత్త**

**కొత్తపాతసందు** వి. డిసెంబరు నెల. **కొత్తలు** వి.బ.వ. డబ్బులు.

**కొదం** రూ.చూ. కొదమ[1]. వి. మేకపిల్ల. విశ. **1**. చిన్న; **2**. బలమైన.

**కొదమ**[1] రూ. కొదం. వి. పశుపక్ష్యాదులపిల్ల. విశ. **1**. లేత; **2**. చిన్న; **3**. బలిష్ఠమైన.

**కొను**

**కొండపోవు** రూ. కొండబీ, కొండబోవు. స.క్రి. తీసుకొని పోవు. **కొండబీ** రూ. చూ. కొండపోవు. స.క్రి. తీసుకొనిపోవు. **కొండబోవు** రూ.చూ. కొండబోవు. స.క్రి. తీసుకొనిపోవు.

**కొబ్బరి**

**కొబ్బరిచిప్ప** వి. కొబ్బరిపెచ్చు. **కొబ్బరిపెచ్చు** వి. కొబ్బరిచిప్ప.

**కొమరక** వి. కుమార్తె, కూతురు.

సం. కుమారికా కూతురు, పుత్రి.

<సం. కుమారికా.

**కొయ్య**

**కొయ్యటాకు** వి. తోటకూర. <కొయ్య + ఆకు.

**కొర** వి. బొక్కెన.

**కొరకరానికొయ్య** చూ. కొఱకు. వి. ఒప్పించటానికి లొంగనివాడు.

**కొర్ర**

**కొర్రకంకి** రూ. కొర్రకంకు. వి. రాగిధాన్యపుకంకి. **కొర్రకంకు** రూ. చూ. కొర్రకంకి. వి. రాగిధాన్యపుకంకి. **కొర్రకూటి** వి. కొర్రలతో వండిన కూడు.

**కొర్రు** రూ. చూ. కొఱ్ఱు. వి. **3**. ఆటంకం.

**కొర్లబండి** వి. సుడిబండి, జాతర్లలో కట్టే ఒక రకం బండి.

**కొఱ్ఱు** రూ. కొర్రు.

**కొలుపు**

**కొలుపుదీపం** వి. జాతరలో కొలువైన అమ్మవారి-ముందు ఉంచిన దీపం. సం. దీప-. దివ్వె.

**కొల్లారిబండి** రూ. చూ. కొల్లారుబండి. వి. అమ్మవారి జాతర్లలో కట్టే కుంకుమ బండి.

**కొల్లారుబండి** రూ. కొల్లారిబండి.

**కొల్లు**[2]

**కొల్లుపెట్టు** స. క్రి. దోచుకోవటానికి అంగీకరించు.

**కొల్లాగ** వి. కోడెదూడ. < కొల్ల + లేగ.

**కొసకు** రూ. కొసాకు.

**కొసాకు** రూ.చూ. కొసకు. అవ్య. చివరిదాకా.

**కోట**

**కోటలోపాగావేయు** అ. క్రి. **1**. మంచి ఉద్యోగం సంపాదించుకొను; **2**. జీవితంలో సుస్థిరపడు.

సైనికులు పూర్వం యుద్ధంలో పాగాలను ధరించేవారు. సైనికులు శత్రురాజుల కోటలలో దిగటానికి ఈ పాగాలు పగ్గాలుగా ఉపయోగపడేవి. ఈ విధంగా సైనికులు శత్రువుల కోటలను స్వాధీనపరచు కొనేవారు. ఇటువంటి వీర కృత్యాల వర్ణనలు చరిత్ర పుటలలో మనకు కన్పిస్తాయి. ఈ గాథల ఆధారంగా తెలుగులో మంచి స్థానాన్ని సంపాదించుకొను అనే అర్థం "కోటలో పాగావేయు" పద బంధానికి కాలక్రమేణ కలిగింది.

**కోటి** రూ. కాటి, కాట్టి.

**కోడగు** అ. క్రి. చెడిపోవు.

హిం.ఉ. ఖోల్ తెరువు, ఖోల్‌నా తెరవటం.

**కోడంగి** రూ. కోనంగి.

**కోడమళ్ళు** చూ. కోలుబడేలు. వి.బ.వ. చేకోడీలు.

**కోడలు** రూ. కోడాలు.

**కోడాలు** రూ. చూ. కోడలు, వి. కొడుకు భార్య, స్నుష.

**కోడి**[1] రూ. కోయి[3], కోళి.

**కోడిగుడ్డుతంటసము** వి. వృథాశ్రమ. కోడిగు-డ్డుకు వెంట్రుకలుండవు. కోడిగుడ్డుకు లేనివెంట్రుకలను తంటసంతో పీకటం వృథాశ్రమ. కాబట్టి ఈ పలుకుబడి. **కోడిబూర్లు** వి.బ.వ. కోడిఈకలు.

**కోడు**[2] వి. **2**. చిన్నఏరు; **3**. పిల్లకాలవకంటె చిన్నకాలవ.

తు. కోడు. కొమ్ము; తొ. క్వీట్. కొమ్ము; కొమ్మ, పాదలలో పారే నదీప్రవాహం; క. కోడు. కొమ్మ, కొమ్ము, కోట్. కొమ్ము; త. కోటు. కొమ్మ, కొమ్ము, గుత్తి, గుచ్ఛం, జుట్టుముడి, రేఖ, ఏటిఒడ్డు, చెరువుఒడ్డు, కువటు.

కొమ్ము; కోట్టాన్, కోట్టువాన్. గుడ్లగూబ, కొడ. కొ-ట్ (కొ-ట్-)-. కొమ్ము, పర్జి; కోడ్ కొమ్ము; గ. ఒల్లా. కోర్. గోం. కోర్. పశువుల అడవిజంతువుల కొమ్ము; కుఇ కోజు. కొమ్ము.

<మూ.ద్రా. *కోట్.

**కోడు**$^{3}$

**కోడుబిళ్ళలు** రూ.చూ. కోలుబడలు. వి.బ.వ. జంతికలు. **కోడ్బెళ్ళలు** రూ.చూ. కోలుబడలు. వి.బ.వ. చేగోడీలు.

**కోడ్బెళ్ళలు** చూ. కోడు$^{3}$.

**కోవంగి** రూ.చూ. కోడంగి. వి. **1**. అంగాల్ని వికారంగాచూపి ప్రజల్ని నవ్విస్తూ బిచ్చమెత్తుకొనే దాసరి; **2**. చిలిపిచేష్టలు చేసేవాడు.

**కోవంగివేషాలు** వి.బ.వ. చిలిపిచేష్టలు.

**కోవాప** వి. కోడి.

**కోంతి**

**కోంతిపిల్లనికట్టు** వి. బాలక్రీడావిశేషం.

**కోయి**$^{3}$ రూ.చూ. కోడి$^{1}$. వి. కోడి.

**కోయి**$^{4}$ వి. పక్షవాతం.

**కోరా**

హిం. కోరా. నూతనమైన, సాదా.

<హిం. కోరా.

**కోరాస్పైను** వి. తెల్లని చేనేత ముతకగుడ్డ.

**కోరు**$^{3}$ వి. **6**. కవులు.

**కోరు**$^{6}$ వి. **1**. కలుపుమొక్క; **2**. ఒకరకం గడ్డి.

క. కోరణారిగడ్డి. ఒకరకం గడ్డి; త. చంపణ్ కోరై. జనుము, కోరై. ఒకరకం గడ్డి; మ. కోర.

**కోరుగడ్డి** రూ. కోరెగడ్డి. వి. ఒకరకం గడ్డి **(Rottedoellice)**.

**కోరెగడ్డి** రూ.చూ. కోరుగడ్డి.

**కోలి** రూ.చూ. కోడి$^{1}$. వి. కోడి, కుక్కుటం.

**కోలుబడలు** రూ. కోడుబిళ్లలు, కోడ్బెళ్ళలు. వి.బ.వ. చేగోడీలు.

**ఖట్కా** వి. స్విచ్.

**ఖత్తు** రూ.చూ. కత్తు$^{2}$. వి. సంబంధం.

**ఖపాత** విణ. విలువైన.

ఉ. ఖపత్, ఖప్తీ. వెడల్పైన, విలువైన విన్నపం, అమ్మకం, పిచ్చివాడు.

<ఉ. ఖపత్.

**ఖబడ్దార్** రూ.చూ. ఖబర్దారు. వి. **1**. హెచ్చరికను తెలిపే శబ్దం; **2**. జాగ్రత్త, భద్రం; **3**. బెదిరింపు.

**ఖబర్దారు** రూ. కబడ్దార్, కబర్దార్, ఖబడ్దార్. వి. **2**. బెదిరింపు.

**ఖమాయిషు** రూ.చూ. కమావీసు. వి. వ్యవహారం.

**ఖరా** వి. నిజం.

**ఖరీదుదారుడు** వి. కొనేవాడు.

ఉ. ఖరీద్దార్ కొనేవారు, తీసుకొనేవారు.

త. కరీతు. అసలుధర.

<ఉ. ఖరీద్దార్.

**ఖర్జీ** వి. అప్పులిచ్చే ఉద్యోగి.

ఉ. కరీజ్. అప్పులిచ్చేవాడు.

<ఉ. కరీజ్.

**ఖాతరీ** రూ. ఖాతీరు. వి. గణన, లెక్క.

**ఖాతీరు** రూ. ఖాతరీ.

**ఖావికీ** వి. సేనాపతి.

ఉ. ఖాన్గీ. సేనాపతి, రాజుయొక్క ఉంపుడుకత్తె.

<ఉ. ఖాన్గీ.

**ఖావీ** వి. కుప్ప, మొత్తం.

ఉ. ఖానీ. కుప్ప, గూడు, అధికం, గౌరవప్రదమైన.

<ఉ. ఖానీ.

**ఖానీకు** విణ. ప్రైవేటు.

**ఖుబ్బా** వి. బాడిసెలలాగ ఉండే అలంకారం.

ఉ. కుబ్జ. వంపుకట్టటం, ఆర్చి, గుమ్మటి.

<ఉ. కుబ్జ.

**ఖురాను** రూ. కురాను.

**ఖ్యాలి** వి. **3**. ధ్యాస.

హిం. ఉ. ఖ్యాల్, ఖయాల్. ధ్యాస.

<ఉ. ఖ్యాల్.

గగ్గరె రూ.చూ. గాగరా. వి. లంగా.

గంగాపూలు వి. గోదావరి వంతెన.

సం. *గంగా*. నీటిప్రవాహం, గంగానది.

ఉ. పుల్. వంతెన.

<సం. గంగా + ఉ. పుల్.

గంగాభాగీరధి సమానురాలు రూ. గంగాభాగీరథీ సమానురాలు.

గంగాభాగీరథీ సమానురాలు రూ.చూ. గంగాభాగీరధి సమానురాలు. వి. **1**. వితంతువులగురించి ప్రస్తావించేటప్పుడు వారిని ఉత్తరాలలో సంబోధించేటప్పుడు, పేరుకుముందు ఉపయోగించే పదబంధం; **2**. వితంతువు.

గచ్చు$^{1}$

గచ్చుపాద వి. ఎడతెగకుండా మాట్లాడేస్త్రీ.

గచ్చు$^{1}$ వి. **5**. రాయిపరచిననేల, రాతినేల.

గజనిమ్మ వి. **5.** బత్తాయిపండు.

గజ్జె

గజ్జెలగుఱ్ఱము వి. **1.** పెళ్ళిళ్లలో పూర్వకాలంలో భోగంమేళాలు ఉండేవి. ఆ ఖర్చు భరించలేనివారు ఆటగుఱ్ఱాలను రప్పించి ఆడించేవారు. ఈ గుఱ్ఱాల కాళ్ళకు గజ్జెలు కట్టేవారు. వీటినే గజ్జెలగుఱ్ఱాలనేవారు. ఇవి బండిలాగటానికి-కాని నాగలిలాగటానికికాని మరేవిధంగాకాని పనికివచ్చేవికావు; **2.** విలాసవంతమైన నడకకల పిల్లలను లేదా ఆడపిల్లలను గజ్జెలగుఱ్ఱాలని వ్యవహరించటం జరుగుతోంది.

గటక రూ. గట్క.

గటము వి. కుండ.

సం. ఘట. కుండ.

<సం. ఘట-.

గటారుకాలువ వి. మురికినీటి కాల్వ.

ఇం. *Gutter*. మురికినీటి కాల్వ.

<ఇం. Gutter + కాలువ.

గట్క రూ.చూ. గటక. వి. మొక్కజొన్నలతో తయారు చేసిన గంజి.

గట్టి

గట్టిపిండి వి. స్నానంలో శరీరానికి రాసుకునే సెనగపిండి.

గడీ రూ. గాడి[3].

గడ్డ[2] సవర. గడ్డ. వాగు, ప్రవాహం.

<సవర. గడ్డ.

గడ్డి

గడ్డికఱచు అ.క్రి. **2.** శరణుపొందు; **3.** లొంగిపోవు. గడ్డికఱపించు స.క్రి. అనేక కష్టాలుపెట్టు.

గణానాంత్వాచేయు స.క్రి. మర్యాదగా పిలుచు.

సం. 'గణానాంత్వామ్' గణపతి నావాహనంచేసే మంత్రంలో మొదటిభాగం.

<సం. గణానాంత్వామ్ + చేయు.

గంట[1]

గంటవాయించు స.క్రి. **3.** మోసగించు; **4.** మరచిపోవు. అ.క్రి. చనిపోవు.

గండ[1]

గండకత్తెర రూ. గండగత్తెర. గండకత్తెరపని రూ. గండగత్తెరపని. వి. ప్రాణాంతకమైనపని. గండకత్తెర రూ.చూ. గండగత్తెర. వి. **1.** మెడకత్తెర; **2.** ప్రాణాంతకం, కష్టం. గండగత్తెరపని రూ.చూ. గండకత్తెరపని. వి. ప్రాణాంతకమైన పని.

గండ[2]

గండదీయ చూ. గండదివ్వె. వి. దీపం.

గండ్ర

గండ్రగోతి వి. గండుచీమ.

గతి వి. దిక్కు, శరణం. దశా. 1.161.

సం. గతి-. ఉపాయం, విధం, రీతి, గమనం.

<సం. గతి-. (అర్థవిపరి.)

గత్తము వి. పశువుల పేడ, ఎరువు.

గదర వి. **2.** మాంసాహారం.

గదుము స. క్రి. భయపెట్టు.

గదురోడు (-వాడు) విశ. పిల్లవాడు.

గదువ వి. చుబుకం, గడ్డం.

గద్దలం చూ. గద్దరి. వి. గలాటా.

గవము విశ. గొప్ప. తాళ్లసం. 18.275.

సం. ఘన-. గొప్ప.

<సం. ఘన-.

గనిమ

గనేలు వి.బ.వ. పొలంగట్లు. <గనిమ + -లు.

గనేలు చు. గనిమ.

గంత వి. **5.** పెరడు.

గంతి క. గంతి. కంతి.

<క. గంతి.

గందకారి వి. అన్నీ తెలిసి తెలియనట్లు నటించేవాడు.

సం. గ్రంథకారిన్. గ్రంథాన్ని రచించేవాడు.

<సం. గ్రంథాకారిన్-. (అర్థవిపరి.).

గంధకారి వి. గడసరి.

సం. గ్రంథకారిన్. పుస్తకాల్ని రచించేవాడు.

<సం. గ్రంథకారిన్.

గప్‌చిప్ రూ. గప్‌చుప్.

గప్‌చుప్ రూ. చూ. గప్‌చిప్. వి. నిశ్శబ్దం.

గబ్బర వి. **1.** పొగరు; **2.** పోకడ.

గబ్బిడా రూ. గబ్బుడాయి. గబ్బువాసన కొట్టేది.

గబ్బు

గబ్బుచమురు రూ. గబ్బుసమురు. వి. కిరసనాయిలు. గబ్బుడాయి రూ.చూ. గబ్బిడా. వి. గబ్బిలం. గబ్బుసమురు (-చమురు) రూ.చూ. గబ్బుచమురు. వి. కిరసనాయిలు.

గబ్బెడు రూ.చూ. గుప్పెడు. విశ. పిడికెడు.

గమిట రూ.చూ. గమిడి. వి. సరిహద్దు.

గమిడి రూ. గమిట, గెమిన, గెమిని.

గంప

గంపశ్రాద్ధము వి. **1.** అలవిమాలిన ఖర్చు; **2.** మిక్కిలిబాధ; **3.** తలకు మించిన భారం. సం. శ్రాద్ధ-.

చకారకుక్షి అనేవారు. కాబట్టి తెలుగులో ఈ నుడికారం ఏర్పడింది. దేన్నీవదలకుండా ఉన్నదున్నట్లుగా అని అర్థం.

**తుట్ట** చూ. తుట్టియు[2].

**తుట్టమూర** అవ్య. ఏమీలేకుండా.

**తుప్ప**

**తుప్పలు** వి.బ.వ. తలవెంద్రుకలు.

**తుమాలు** రూ.చూ. తువ్వాలు. వి. తువాలు, తుండుగుడ్డ.

**తుమ్మాలు** రూ.చూ. తువ్వాలు. వి. తువాలు, తుండుగుడ్డ.

**తురక**

**తురకచామంతి** రూ.చూ. తురకచేమంతి. **తురకచేమంతి** రూ. తురకచామంతి. వి. ఒకరకం చేమంతి.

**తురుము**[2] స.క్రి. 2. అలరించు.

**తురులు**

సం. తూర-, తూర్య-. వాద్యవిశేషం. ప్రా. తూర-, తురు-. వాద్యవిశేషం. పా. తుర్హీ, హిం. తుర్హీ, తురఈ

<ప్రా. తురు-.

**తువ్వ** వి. 3. దప్పి, దాహం.

**తువ్వాలు** రూ. తుమాలు, తుమ్మాలు.

**తుశాల** వి. తమాషా.

**తూఁగు** వి. 2. నిద్ర.

**తూటా** రూ.చూ. తోటా.

**తూఫ్‌ర్** వి. బొంగరాలాటలో బొంగరాన్ని ఎగరేసి పట్టుకొనేటప్పుడు వాడేశబ్దం. ధ్వన్యను.

**తూము**[1] రూ. తూపు.

**తూపు** రూ.చూ. తూము[1]. వి. జలమార్గం, నీరుపోవటానికి ఏర్పరిచేదారి.,

**తెన్ని** వి. నీరు.

త. తణ్ణీర్-. మంచినీళ్ళు.

<త. తణ్ణీర్.

**తెర**

**తెరవెనుకనుండు** అ.క్రి. పరోక్షంగా సాయం లేదా హానిచేయడానికి ఉండు.

**తెరకువ** చూ. తెఱచు. వి. మెలకువ.

**తెల్ల**[1]

**తెల్లకల్లు** వి. మద్యం, కల్లు. **తెల్లపాయ** వి. వెల్లుల్లి.

**తేగ** వి. 2. ఒకరకమయిన దుంప.

**తేగదుంప** వి. ఒక రకమయిన దుంప.

**తేనె**

**తేనెపట్టు** రూ. తేనెపెట్టె. **తేనెపెట్టె** రూ.చూ. తేనెపట్టు. వి. తేనెపెర, మధుకోశం. **తేనెబండ** వి. నాపరాయి.

**తేభ్యం**

దానంచేసేటప్పుడు "తేభ్యః సంప్రదతే, నమమ, నమమ" అని పఠిస్తూ దానంచేస్తారు.

**తేభ్యంగాడు** రూ. దేభ్యంగాడు. వి. 1. దీనుడు. దానం పట్టేవాడు దీనుడేకదా; 2. అప్రయోజకుడు.

**తేర**[1]

**తేరగుఱ్ఱము** వి. 1. ఉచితంగావచ్చిన గుర్రం; 2. ఉచితంగా లభించిన వస్తువు.

**తైదు** రూ.చూ. తవ్విద. వి. 1. రాగి; 2. చోడి.

**తొక్కు** వి. 8. కూర.

**తొక్కుడుబండ** వి. 2. రచ్చబండ.

**తొండచెయ్యి** చూ. తొంట[2], వి. ఎడమచెయ్యి.

**తొపలు** వి.బ.వ. మెట్లు.

**తొమ్మిదోఅష్టం** వి. అష్ట అష్టాలు వేదంలోఉన్నాయి. తొమ్మిదో అష్టం అంటే బూతులు అనే అర్థంలో వ్యవహారం.

**తొలుపు** స.క్రి. 2. కడుగు.

**తోక**

**తోకపద్యము** వి. 1. ఒకవ్యక్తి పద్యంచదివినప్పుడు ఆ పద్యం చివరి అక్షరంతోకాని చివరిపదంతోకాని మొదలయ్యే ప్రాచీన పద్యాన్ని చదివితే ఆవిధంగా చదివిన పద్యాన్ని తోకపద్యం అంటారు; 2. నానుడు వ్యవహారం; 3. ఎడతెగని విషయం.

**తోచ్చి** వి. పిన్నమ్మ.

**తోటా** రూ. తూటా. వి. 1. ఒకరకం మందుసామాను.

ఉ. తోటా-. తుపాకిగుండు.

త. తోట్టా-. తోటా, తూటా, తుపాకిలో దట్టించే మందుసామాను.

<ఉ. తోటా.

**తోడి** వి. ముప్పైరెండు నపుంసక రాగాల్లో ఒకటి.

ఉ. తోడీ-. ఒక ప్రత్యేకమైన స్వరమాధుర్య పద్ధతి.

ఉ. తోటి-. ఒక ప్రత్యేకమైన స్వరమాధుర్య పద్ధతి.

<ఉ. తోడీ.

**తోడెము**[2]

<ఉ. థోడా.

**తోప** వి. చోడిపిండి ఊరబెట్టకుండా వండిన చిక్కటి పదార్థం.

**తోర్త్రము** వి. స్తుతి.

సం. స్తోత్ర-. పొగడ్త, స్తుతి.

**తౌటి** చూ. తగుడు[1]. వి. పచ్చెం.

**త్రాపు**[2] రూ. రాపు[3]. వి. దూలంమీద అడ్డంగాగాని, దూలానికి బదులుగాగాని, గోడలమీద కప్పుకు ఆధారంగావేసే చెక్కనవాసం.

త్వాష్ట్రం రూ. తాష్ట్రం. వి. 1. మూర్ఖుడు; 2. అప్రయోజకుడు. విణ. 1. మోటు; 2. మొద్దు.

సం. త్వష్ట్ర్-. విశ్వకర్మ, వడ్రంగి, స్వర్ణకారుడు, ద్వాదశాదిత్యుల్లో ఒకడు, త్వాష్ట్ర-. త్వష్ట్రకుమారుడు, త్రిశిరాసురుడు, వృత్రాసురుడు.

< సం. త్వాష్ట్ర-. (అర్థవిపరి.).

థంబం రూ.చూ. స్తంబం. వి. పిల్లరు, ఇటుకతో రాళ్ళతో కట్టికాని కొయ్యతో చేసికాని నిటారుగా నిలిపి పైనున్న వస్తువులకు ఆధారంగా ఉండే సన్నటి పొడుగాటి నిర్మాణం.

దగలాగిగలా వి. జలతారు ఉన్న వస్త్రం.

హిం. దగల్, దగ్లా వస్త్రవిశేషం.

దంగిడి వి. ఒకరకమైన ముతక వస్త్రం.

ఉ. దుంగ్‌రీ ఒకరకమైన ముతక వస్త్రం.

< ఉ. దుంగ్‌రీ.

దడి వి. 3. తడకలతో కట్టిన స్నానాలగది.

దడిగ్య వి. గోదావరి గట్టున ఉన్నపొలం.

దద్వతు వి. మూలధనం.

దండగ రూ.చూ. దణ్డు. వి. నష్టం.

దండగభాగవతము చూ. చేతిచమురు భాగవతము. వి. నిష్కారణంగా నష్టపోయిన సొమ్ము. వీథి భాగవతమాడేటప్పుడు ఆడేవారికి ఖర్చులు కూడా రానప్పుడు ఆ వీథిభాగవతాన్ని దండగభాగవతమనీ చేతిచమురు భాగవతమనీ అనేవారు.

దండి విణ. 5. చాలా.

దణ్డు రూ. దండగ.

దద్ద[1]

ఒ. ద్దద చిన్నాన్న, పినతండ్రి.

<ఒ. దద్ద.

దద్ద[2] వి. తాత.

హిం.ఉ. దాదా. తాత.

<ఉ. దాదా.

దద్దన్న వి. 1. అమాయకుడు; 2. తెలివితక్కువవాడు; 3. మందమతి.

సం. దధ్యన్న- పెరుగన్నం, పెరుగన్నంతిన్నవారు మందమతులని వాడుక.

<సం. దధ్యన్న-.

దద్దమ్మ చూ. దద్దన్న

దధ్యన్నం వి. 1. అమాయకుడు; 2. మందమతి; 3. తెలివిలేనివాడు.

సం దధ్యన్న-. పెరుగన్నం. పెరుగన్నంతిన్నవారు మందమతులౌతారని వాడుక.

<సం. దధ్యన్న-.

దధ్యోజనం వి. 1. మందమతి; 2. అమాయకుడు.

సం. దధ్యోదన- పెరుగన్నం. పెరుగన్నంతిన్నవారు మందమతులౌతారని వాడుక.

<సం. దధ్యోదన-.

దనిసి వి. గట్టు.

దఫేదార్ రూ.చూ. దఫేదారు. వి. 1. బంట్రోతు; 2. పోలీసుబృందానికి అధిపతి.

దఫేదారు రూ. దఫేదర్. వి. 1. ఒకపోలీసు సమూహానికి అధికారి ; 2. బంట్రోతు.

ఉ. దఫా-దార్ దఫే-దార్. ఒక పోలీసుగుంపుకు అధికారి.

త. తపేతార్ ప్రధానబంట్రోతు, టపేతార్.

<ఉ. దఫే-దార్.

దప్పిడి చూ. దప్పి. వి. గండి.

దమట వి. మంట.

దంపు

దంపులాట వి. పోట్లాట.

దయివము వి. దేవుడు. తాళ్ల. సం. 8.40.

సం. దైవ-. దేవుడు.

<సం. దైవ-.

దరాచక్రంగా క్రి.విణ. తిరుగులేని విధంగా.

సం. ధరాచక్ర- భూచక్రం.

<సం. ధరాచక్ర - + - ము + అగు + - అ[7].

దరిశనము రూ. దరిసెంబు.

దరిసెంబు రూ.చూ. దరిశనము. వి. దేవతాదుల్ని చూడటం. తాళ్ల.సం. 5.51.

దరువు వి. 9. పద్ధతి; 10. మద్దెలవాయించటం.

దర్గా వి. మహమ్మదీయుల మసీదు.

ఉ.దర్గా, దర్‌గాహ్ గోరీ, సన్యాసులుండే పవిత్ర స్థలం.

త తర్కా, తుర్కై - మహమ్మదీయుల మసీదు.

<ఉ. దర్గా.

దర్బాన్ రూ. దర్బాను. వి. వాకిటి కావలివాడు, ద్వారపాలకుడు.

ఉ. దర్-బాన్ కూలికి బరువులు మోసి జీవించేవాడు, ద్వారపాలకుడు.

<ఉ. దర్-బాన్.

దర్బాను రూ.చూ. దర్బాన్. వి. వాకిలికావలివాడు, ద్వారపాలకుడు.

దళితుడు వి. 1. హరిజనుడు; 2. అగ్రవర్ణాలకు చెందని పీడితుడు.

సం. దళిత- చీల్చబడ్డ, చెల్లాచెదురైన, సగంగాచేయబడ్డ.

మరా. దళిత హరిజనులు.

<మరా. దళిత.

**దశావతారాలు** వి.బ.వ. పదిరూపాయలు.

సం. దశావతార-. పది అవతారాలు.

<సం. దశావతార - + -ము+లు (అర్థవిపరి).

**దసులు** చూ. డయ్యు. వి.బ.వ. అలసట.

**దాగ్ర్ర** రూ.మా. దాంగర. వి. అన్నం చల్లారబెట్టడానికి వాడే వెడల్పయిన తట్ట.

**దాగిడి** రూ. దాగ్ర్ర, దాగిడి. వి. **2.** అన్నం చల్లారబెట్టడానికివాడే వెడల్పయిన తట్ట.

**దాంగిడి** రూ.చూ. దాంగర. వి. దీర్ఘచతురస్రాకారంలో వెదురుదబ్బలతో తయారుచేయబడ్డ తట్ట.

**దాదా** వి. **1.** పితామహుడు; **2.** పెద్దవారికి పిలిచేటప్పుడు వ్యవహరించే ఆదరవాచక శబ్దం ; **3.** అన్న.

హిం. ఉ. దాదా. పితామహుడు, వృద్ధులపట్ల వ్యవహరించే ఆదరవాచక శబ్దం.

<ఉ. దాదా.

**దాపిరము** రూ.చూ. దాపురము. వి. దాచటం. తాళ్ల.సం. 14.105.

**దాపురము** రూ. దాపిరము.

**దాబరిగించు** అ.క్రి. దాపురించు.

**దామాషా** వి. నిష్పత్తి. పద్ధతి.

హిం. దామాసాహ్ సరుకుల పంపిణీ, దీవాలాతీయబడింది.

ఉ. దామాషా ఉంచటం, తగిన నిష్పత్తిలో ఉంచటం.

<ఉ. దామాషా.

**దామాషాదారు** వి. దామాషా కలవాడు.

ఉ. దామాషాదార్ దామాషా కలవాడు.

<ఉ. దామాషాదార్.

**దాయుము** వి. **3.** పాచికల ఆటలో పడిన ఒకటి.

**దార**[1]

**దారకత్తి** వి. పదునయిన కత్తి.

**దారకం** వి. **4.** ఆధారం.

**దారావత్తులు** వి.బ.వ. పశువులు.

సం. ధారాదత్త-. ధారాపూర్వకంగా ఇవ్వబడేది.

<సం. ధారాతద్త -+-ము+-లు.

**దారువారి** వి. వ్యక్తిక్రమంగా.

ఉ. దార్‌వారి అనుభవదారుల క్రమప్రకారం.

<ఉ. దార్‌వారి.

**దాలంబరిపండు** వి. దానిమ్మపండు.

**దాసాని**

**దాసానిపూలు** వి.బ.వ. మందారపూలు. దాసానిచెట్టుపూలను పోలిన పూలు కాబట్టి మందారపూలు అనే అర్థం దాసానిపూలకు వచ్చిఉంటుంది.

**దాహము** వి. **3.** భోజనం.

**దాహముతాగు** అ.క్రి. భోజనం చేయు.

**దికడ** వి. దగ్గర. < నాది + కడ.

**దిగర్** రూ.చూ. దిగరు. అవ్య **1.** తర్వాతి; **2.** తక్కిన.

**దిగరు** రూ. దిగర్. అవ్య. **1.** తర్వాతి; **2.** తక్కిన; **3.** తక్కువ.

ఉ. దిగర్ మిగిలిన, ఇతర.

త. తికర్ మిగిలిన.

<ఉ. దిగర్.

**దింగావ** వి. అల్లరి.

హిం.ఉ. ధింగానా అల్లరిచేయటం, ఉపద్రవం.

<ఉ. ధింగానా.

**దిడ్డిమడి** చూ. దొడ్డి, వి. రోడ్డుపక్కసత్రం.

**దిండు**

**దిండుకొను** అ.క్రి. (ఆలింగనంవల్ల) కలిసికొను. తాళ్ల.సం. 13.441. క. దిండు. పోగుచేయు.

**దిన్న** వి. **2.** మిట్ట.

**దిమ్మె** వి. 14. చిన్నతప్పెట, వాద్యవిశేషం.

**దియ్యు** రూ.మా. దీవియ. వి. దీపం.

**దివిల్యా** వి. దీపావళి.

సం. దీపావళి-. దీపాలవరస, దీపావళి పండుగ.

**దివ్యం** వి. బాగు, చక్కని.

సం. దివ్య-. స్వర్గంలో పుట్టింది, స్వర్గంలో ఉన్నది.

<సం. దివ్య-. (అర్థవిపరి.).

**దిష్టి** తాళ్ల. సం. 15.92.

**దిస్టి** రూ. ద్రిష్టి.

**దీక్షితులు** వి.బ.వ. బ్రాహ్మణులలో ఒక శాఖవారి బిరుదు.

సం. దీక్షిత-. దీక్షయందున్న బ్రాహ్మణుడు.

<సం. దీక్షిత -+-లు. (అర్థవిపరి.).

**దీరట** వి. దేవుడిమూల.

**దీలె** రూ.చూ. దీళె. వి. దీపావళి.

**దీళె** రూ. దీలె. వి. దీపావళిపండుగ.

సం. దీపావళి-. దీపాలవరుస; ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు శ్రీకృష్ణుడు నరకాసురసంహారం చేసిన సందర్భంలో భారతీయులలో పెక్కుమంది చేసుకొనే పండుగ.

హిం. దీవాలీ.

<హిం. దీవాలీ.

దీవి[2] వి. 3. ధ్యాస.

దీవియు రూ. దియ్య.

దుకాణదారు రూ. దుకాణాదారు, దుకాణాందారు, దుకానముదారు, దుకానాదారు.

దుకాణాదారు రూ.చూ. దుకాణదారు. వి. అంగడివాడు.

దుకాణాందారు రూ.చూ. దుకాణదారు. వి. అంగడివాడు.

దుకానముదారు రూ.చూ. దుకాణదారు. వి. అంగడివాడు.

దుకానాదారు రూ.చూ. దుకాణదారు. వి. అంగడివాడు.

దుక్ఖం రూ.చూ. దుఖ్ఖం. వి. ఏడ్పు, విచారం.

దుఖ్ఖం రూ. దుక్ఖం. వి. విచారం, ఏడ్పు.

సం. దుఃఖ- ఏడుపు.

<సం. దుఃఖ-.

దుగ్గ వి. 5. పొగాకు ఈనెలపొడి.

దుటం విశ. దృఢం.

సం. దృఢ-. గట్టి.

<సం. దృఢ-.

దుత్త రూ. దూత్త.

దుద్దె వి. దూడ.

దువియూ వి. 2. నుంట.

దుఫసల్ రూ. దుప్పసల్, దుప్పసల్. వి. రెండుపంటలు పండే భూములు.

హిం.ఉ. దోఫసల్ రెండుపంటలు పండేభూములు.

<ఉ. దోఫసల్.

దుప్పసల్ రూ.చూ. దుఫసల్. వి. రెండు పంటలు పండేభూములు.

దుప్పసల్ రూ.చూ. దుఫసల్. వి. రెండుపంటలు పండేభూములు.

దుబాను చూ. దువ్వ[2].

దుబారా వి. 2. వ్యర్థం.

దుబారాచేయు అ.క్రి. 1. ఇళ్ళకి రెండోసారి గిలాబుచేయు; 2. వ్యర్థంగా ఖర్చుచేయు.

దుబ్బ[2] వి. 3. దుమ్ము.

దుమ్మలగొండి చూ. దుమ్ము[2].

దుమ్మలముచ్చు చూ. దుమ్ము[2].

దుమ్ము[2]

దుమ్మలగొండి రూ.చూ. దుమ్ములగొండి. వి. మృగవిశేషం. దుమ్మలముచ్చు వి. మృగవిశేషం. దుమ్ములగొండి రూ. దుమ్మలగొండి.

దురంతం వి. చెడ్డపని.

సం. దురన్త-. అంతులేనిది, విచారకరమైనది.

<సం. దురన్త-. (అర్థవిపరి.).

దుల్లడీ రూ. దుల్లరీ. వి. రెండుసరాలు బంగారునెక్లెసు.

హిం. ఉ. దుల్‌డీ దుల్‌రీ రెండుతీగలు, రెండు సరాలు, రెండుమడతలు, రెండుసరాల నెక్లెసు.

<ఉ. దుల్‌డీ.

దుల్లరీ రూ.చూ. దుల్లడీ. వి. రెండుసరాల బంగారు నెక్లెసు.

దువ్వ వి. 4. మట్టి.

దువ్వీడు వి. గూడు.

దువ్వ[2]

దుబాను రూ.చూ. దువ్వెన. వి. కేశాల్ని దువ్వటానికి ఉపయోగించేసాధనం. దువ్వెవ రూ. దుబాను. వి. 2. తూనీగ.

దుష్టచతుష్టయం వి. నలుగురు దుష్టుల్ని అనేమాట.

సం. దుష్టచతుష్టయ-. దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణుల్ని దుష్టచతుష్టయంగా మహాభారతంవల్ల ఏర్పడ్డ వ్యవహారం. నలుగురు దుష్టులు.

సం. దుష్టచతుష్టయ-. (అర్థవిపరి.).

దుశాలు రూ. దుశ్శాలు, దుశ్శాలువ, దుశ్శాలువా, దూస.

వ్యు. సన్మాన సందర్భంగా కండువావలె కప్పటానికి ఒక వస్త్రాన్ని చేతిలోపెట్టటానికి ఇంకోవస్త్రాన్ని ఇస్తారు. కాబట్టి దుశాలు శబ్దమేర్పడింది.

దుశ్శాలు రూ.చూ. దుశాలు. వి. కండువావంటినేసినబట్ట.

కండువావలె కప్పటానికి ఒక వస్త్రాన్ని చేతిలో పెట్టటానికి ఇంకో వస్త్రాన్ని సన్మానాల సందర్భంగా ఇస్తారు. కాబట్టి దుశ్శాలు శబ్దం ఏర్పడింది.

దుశ్శాలువ రూ.చూ. దుశాలు. వి. కండువా వంటి నేసినబట్ట.

దుశ్శాలువా రూ.చూ. దుశాలు. వి. కండువావంటి నేసినబట్ట.

దూత్త రూ.చూ. దుత్త. వి. మట్టికడవ.

దూది

దూదివిమ్మకాయ వి. నారింజకాయ.

దూపు వి. చూపు, దృష్టి.

దూబావి రూ.చూ. దువ్వెన. వి. దువ్వెన, పైన.

దూర వి. 2. ఎడ్లబండి పైకెత్తి పెట్టే సాధనం.

దూరవ్వ వి. అమ్మమ్మ.

సం. దూర- దవ్వ.

<సం. దూర- + అవ్వ (మిశ్రస.).

దూస రూ.చూ. దుశాలు. వి. శాలువ.

దెందు అ.క్రి. దొర్లు.

దెత్తికొను స.క్రి. కలుపుకొను.

క. తెత్తిసు దగ్గరగా చేర్చు.

దెప్పి చూ. దెప్ప. వి. ఎత్తైనప్రదేశం.

దెవంట వి. మంట.

దేభ్యం

దేభ్యంగాడు రూ.చూ. తేభ్యంగాడు. వి. **1**. దీనుడు; **2**. అప్రయోజకుడు. దేభ్యమొగం వి. దీనమయిన ముఖం.

దేభ్యమొగం చూ, దేభ్యం.

దేవర వి. **4**. జాతర.

దేవరదున్నపోతు వి. గ్రామం తరపున జాతర్లలో బలి ఇవ్వటానికి ఊరిలో వదలివేయబడ్డ దున్నపోతు. ఇదిపైర్లలో స్వేచ్ఛగామేస్తుంది.

దేవిడీమన్నా

హిం.ఉ. మనాహ్ నిషేధం.

< దేవిడీ + ఉ. మనాహ్.

దేవురు వి. దేవుడు.

క. దేవరు దేవుడు.

<క. దేవరు.

దేవులాడు స.క్రి. బతిమాలు.

దేష్ట రూ.చూ. జెట్ట. వి. డిసెంబరు మొదటిభాగంలో వచ్చేకార్తె.

దేహశుద్ధి వి. **1**. దెబ్బలుకొట్టటం; **2**. తన్నటం.

సం. దేహశుద్ధి-. శరీరశుభ్రత.

<సం. దేహశుద్ధి-. (అర్థవిపరి.).

దొంగ వి. **1**. మోసగాడు, వంచకుడు. విణ. **2**. నటించేవాడు, **3**. లేవి, **4**. నకిలీ ; **5**. రహస్యమయిన; **6**. అబద్ధమయిన, అసత్యమయిన; **7**. తప్పుడు.

దొంగవేళ వి. దాటిన సమయం.

సం. వేలా సమయం. < దొంగ + సం. వేలా.

దొడ్డి వి. **14**. పశువులశాల ముందు వాకిలి.

దొణి వి. పైట.

దొందు

దొందూదొందే అవ్య. ఇద్దరున్నప్పుడు వారిలో ఒకరి-కింకొకరు సమానం అనే భావంతో వెటకారంగా అనేటప్పటి పలుకుబడి.

దొందూదొందే చూ. దొందు.

దొప్పం చూ. దొప్ప. వి. దట్టం.

దొబ్బు స.క్రి. **6**. తీయు.

దొబ్బుడు వి. **1**. పొందటం; **2**. రమించటం; **3**, పీడించటం.

దొమ్మ వి. **4**. కాలేయం.

దొల్లగంప వి. సొద్దకంకులు జొన్నకంకులు మొ. వాటిని మోయటానికి ఉపయోగించే గంప, దీనిని వెదురుబద్దలతో అల్లుతారు.

దోపటి వి. **1**. మాయ. తాళ్ల.సం. 13.9; **2**. కపటం. తాళ్ల.సం. 15.13.

దోవతి రూ. ద్రోత.

దోస

దోసతోట వి. **1**. దోసపాదులున్నతోట; **2**. 'తామర-తంపర' వంటి పదబంధం. తామరలు నీటిపై వ్యాపించినట్లుగా దోసపాదునేలపై వ్యాపిస్తుంది.

దోహదం వి. ప్రోత్సాహం.

సం. దోహద-. ఇచ్ఛ, కోరిక, వేవిళ్ళు, ఎరువు, తరుగుల్మలతాదులకు అకాలంలో పుష్పాదులను పుట్టించే స్త్రీల పాదతాడనాది క్రియ.

<సం. దోహద-. (అర్థవిపరి.).

దౌరా చూ. డేరా. వి. కేంప్.

ద్రాపి వి. **2**. గుడ్డివాడు; **3**. పనికిరానివాడు.

సం. "నమస్తే ద్రాపే అన్ధసస్పతే" అనే మంత్రాన్ని బట్టి ఈ పద వ్యవహారమేర్పడి ఉంటుంది.

<సం. ద్రాపి-. (అర్థవిపరి.).

ద్రిష్టాంతము వి. ఉదాహరణ. తాళ్ల.సం. 9.156.

సం. దృష్టాంత-. ఉదాహరణ.

<సం. దృష్టాంత-.

ద్రిష్టి రూ.చూ. దిస్టి. వి. చెడ్డచూపు. తాళ్ల.సం. 5.277.

ద్రోత రూ.చూ. దోవతి. వి. పంచె.

ద్రోపరయుగం వి. ద్వాపరయుగం.

సం. ద్వాపరయుగ-. కృత త్రేతా ద్వాపర కలియుగాలలో మూడోయుగం.

<సం. ద్వాపరయుగ-.

ద్రోయుము వస్తువులు వి.బ.వ. పూజకు ఉపయోగించే వస్తువులు.

ద్రౌపతి వి. **2**. పంచపాండవుల ధర్మపత్ని, ద్రౌపది.

ధనియాలజాతి వి. **2**. హింసిస్తేకాని పనిచేయనివ్యక్తి.

ధర్మకన్నం వి. దరిద్రులకు పంచిపెట్టటానికిగాను అక్రమంగా ఆర్జించిన ధనవంతులనుంచి ధనాన్ని దొంగిలించటం.

సం. ధర్మ-. శ్రుతిస్మృత్యాది విహితకృత్యం, పుణ్యం, న్యాయం, ఆచారం.

<సం. ధర్మ - + కన్నము (మిశ్రస.).

ధర్మవడ్డీ వి. **1**. ప్రభుత్వం అనుమతించిన వడ్డీ; **2**. ధనాన్ని అప్పుగాఇచ్చి గడువులోగా చెల్లించవలసిన వడ్డీమొత్తాన్ని అసలులో అప్పు ఇచ్చేటప్పుడే మినహాయించుకొని తీసుకున్న వడ్డీని పత్రంలో రాయకుండా మొత్తం తిరిగి ఇచ్చేటప్పుడు ఏవిధమైన వడ్డీనీ వసూలుచేయకపోతే ఆవిధంగా అధికంగా వసూళ్లు చేయనివడ్డీ.

సం. ధర్మ-. న్యాయం, పుణ్యం.

<సం. ధర్మ - + వడ్డీ (మిశ్రస.).

**ధాటి** వి. శక్తి.

సం. ధాటీ దండయాత్ర, దాడి.

<సం. ధాటీ (అర్థవిపరి.).

**ధిక్కరించు** స.క్రి. ఎదిరించు.

సం ధిక్కార- తిరస్కారం.

<సం. ధిక్కార - + - ఇంచు[3]. (అర్థవిపరి.).

**ధోరణి** వి. పద్ధతి.

సం. ధోరణ- ఎడతెగని, అవిచ్ఛిన్నమైన, సంప్రదాయం, గుర్రంనడక, వాహనంబాగా ఉండటం.

<సం. ధోరణ-.

**నకరము**[1] రూ. నఖరు. వి. **2**. బిడారు వర్తకులు ఏర్పరుచుకొన్న శాశ్వత స్థలం లేదా ప్రాంతం.

**నకరాలుకొట్టు** అ.క్రి. బడాయికొట్టు. **నకరాలుపోవు** అ.క్రి. బడాయికొట్టు.

**నకరవాడ** వి. వ్యాపారస్థులు లేదా అంగళ్ళు ఒకేచోట ఉన్న నగర ప్రాంతం.

సం. నగర-. పెద్దపట్టణం.

<సం. నగర -. + వాడ[1].

**నకరవీడు** వి. వ్యాపారస్థులు లేదా అంగళ్ళు ఒకే చోట ఉన్న నగరప్రాంతం.

సం. నగర- పెద్దపట్టణం.

<సం. నగర - + వీడు[2].

**నకరాలుకొట్టు** చూ. నకరము[1].

**నకరాలుపోవు** చూ. నకరము[1].

**నకాషు** రూ. నఖాసు. వి. **1**. పశువుల్ని బేరం చేసేవాడు; **2**. పశువుల సంత.

ఉ. నఖ్ఖాస్ గుర్రాలను పశువులను అమ్మే బజారు, బానిసలను అమ్మేసంత.

< ఉ. నఖ్ఖాస్.

**నక్కి**[2] రూ. నక్కీ, నఖి, నఖీ, నఖ్ఖి. వి. **1**. బట్టల అంచులకు నేసిన బంగారు లేదా వెండి లేదా స్టీలు జరీ; **2**. జరీ బుటానేసినది.

ఉ. నక్కీ వెండి లేదా బంగారులేసు, సంగనేసినది.

త. నక్కీ బట్టల కర్రైన్ల అంచులకు కుట్టబడ్డలేసు.

< ఉ. నక్కీ.

**నక్కీ** రూ.చూ. నక్కి[2]. వి. **1**. బట్టల అంచులకు నేసిన బంగారు లేదా వెండి లేదా స్టీలు జరీ; **2**. జరీ బుటా నేసినది.

**నక్షత్రకుడు** వి. పదేపదే వేధించేవాడు.

సం. నక్షత్రక- హరిశ్చంద్రుడ్ని వేధించి అప్పు వసూలుచేసినవాడు.

<సం. నక్షత్రక-. (అర్థవిపరి.).

**నక్షా** రూ.చూ. నకాసీ. వి. **1**. గీత; **2** లైను.

**నఖరు** రూ.చూ. నకరము[1]. వి. వర్తకసంఘం.

**నఖాసు** రూ.చూ. నకాషు. వి. **1**. పశువుల్ని బేరం చేసేవాడు; **2**. పశువుల సంత.

**నఖి** రూ.చూ. నక్కి[2]. వి. **1**. బట్టల అంచులకు నేసిన బంగారు లేదా వెండి లేదా స్టీలు జరీ; **2**. జరీ బుటానేసినది.

**నఖీ** రూ.చూ. నక్కి[2]. వి. **1**. బట్టల అంచులకు నేసిన బంగారు లేదా వెండి లేదా స్టీలు జరీ; **2**. జరీ బుటానేసినది.

**నఖ్ఖి** రూ.చూ. నక్కి[2]. వి. **1**. బట్టల అంచులకు నేసిన బంగారు లేదా వెండి లేదా స్టీలు జరీ; **2**. జరీ బుటానేసినది.

**నగ**[1] వి. **8**. లింగం, పురుషాంగం, శిశ్నం.

**నంకి** రూ.చూ. లంకియు.

**నంగ**

**నంగనాచితుంగబుర్ర** వి. అమాయకంగా కనిపించే నెరజాణ.

**నంగి** విశ. **3**. తెలిసీ తేలీనట్లు నటించేవాడు.

**నజరు** రూ. నదురు.

**నచ్చు**[3] వి. **2**. చాదస్తం.

**నడవ** చూ. నడచు.

**నడి**

**నడికారాయన** విశ. మధ్యవయసు మనిషి. **నడిమిట్ట** వి. మధ్యభాగం.

**నతీజా** రూ. నతుజా. వి ఫలితం.

హిం. ఉ. నతీజా ఫలితం.

<ఉ. నతీజా.

**నతుజా** రూ.చూ. నతీజా. వి. ఫలితం.

**నత్త**

**నత్తనడక** వి. మందగమనం. (వ్యు.) నత్తగమనవేగం నిముషానికి మూడు అంగుళాలు. ఒక కిలోమీటరు నడవటానికి నత్తకు ఎనిమిదిరోజులు పడుతుంది. కాబట్టి 'నత్తనడక' అంటే మందగమనమనే అర్థం వచ్చింది.

**నదారతు** రూ.చూ. నదారదు. విశ. **1**. ఖాళీ; **2**. రిక్తం.

**నదారదు** రూ. నదారతు. విశ. **1**. ఖాళీ; **2**. లేకపోయిన, రిక్తం.

ఉ. నదారద్ లేని, రిక్తం.

<ఉ. నదారద్.

**నదురు** రూ.చూ. నజరు. వి. అందాజు.

**నదురుబెదురు** వి. **1**. భయం; **2**. సంకోచం.

**నంద**

ఒ. నంద ధాన్యం నిలవ ఉంచుకోటానికి కాల్చిన మట్టితోగాని, రాళ్ళతోగాని ఇంటిలో నిర్మించిన గాదె.

<ఒ. నంద.

**నమశ్శమవాయ** వి. **1**. బతుకుతెరువు నేర్చినవాడు; **2**. పరమ యాచకుడు.

సం. నమశ్శమనాయ. యముని కొరకు నమస్కారం, మృత్యుదేవత యమధర్మరాజు. నరకయాతనలను తప్పించుకోటానికిగాను బతుకుతెరువునేర్చినవాడు చేసే ప్రార్థన.

<సం. నమశ్శమనాయ. (అర్థవిపరి.).

**నలుఁగు** వి. **4**. పెళ్ళిలో పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుకును కూర్చుండబెట్టి ముత్తైదువలు చేసే ఉద్వర్తన కార్యక్రమం.

**నల్ల**[2] విశ. చెడ్డ.

**నల్లకల్లు** వి. సారా. నల్లజీవాలు వి.బ.వ. **1**. మేకలు; **2**. మేకపోతులు.

సం జీవ-. ప్రాణం.

**నల్లా** వి. పైపు.

ఉ. నాలా నీటిమార్గం.

త. నాలా నీటిమార్గం, జలసంధి, కనుమ, కొండలసందు.

<ఉ. నాలా.

**నల్లు** వి. **2**. చేటలు, జల్లెడలు గట్టిగా ఉండేందుకు అంచుల్లో వేసే అల్లిక.

**నల్లేరు**

**నల్లేరుపైబండి** వి. అత్యంత సులభం. వ్యు. నల్లేరు తీగలు పైబండి సాఫీగా సులభంగా మెత్తగా సాగిపోతుంది. కాబట్టి ఈ పదబంధానికి ఈ అర్థం కలిగింది.

**నవల**[2] వి. గద్యకథా కావ్య విశేషం.

ఇం. *Novel* నవల; ఇటాలియన్ *Novella* నవల ఫ్రెం. *Novelle*.

<ఇం. Novel.

**నవ్వు**[2] చూ. నస. వి. దురద.

**నస** వి. **4**. వేధింపు; **5**. సణుగుడు.

**నసాలచేయు** స.క్రి. పెద్ద పెద్ద మట్టిపెళ్ళలను సరిచేసి భూమిని చదునుగా చేయు.

**నాగవల్లి**

సం. నాకబలి-. వివాహాంగంగా అయిదోరోజు చేసే సంస్కార విశేషం.

ప్రా. నాగవల్లీ.

**నాగవల్లివిష్ఠూరం** వి. **1**. నాగవల్లిపూర్తి అయిన తర్వాత పరస్పరం వేళాకోళం చేసుకొంటూ పాటలు పాడేవారు. ఈ వేడుకను 'నాగవల్లి విష్ఠూరం' అంటారు; **2**. అవసరంగడిచిన తర్వాత చేసే ఆక్షేపణ.

**నాగపాని** చూ. నాగప్పాని. వి. నాగవల్లి నడిపే ముత్తైదువ.

**నాగు**[1]

**నాగులకోక** వి. నాగులచీర, ముదురు ఎరుపురంగులో ఉండి నల్లగళ్ళు ఉన్నచీర (దీనిని పుట్టమీద పెట్టుకొంటారు).

**నాదు** రూ.చూ. లాదు. వి. తారసరాలిని అతకటం.

**నాన్** వి. బ్రెడ్.

హిం.ఉ.పార. నాన్ బ్రెడ్.

<ఉ. నాన్.

**నాన్‌రొట్టి** రూ. నాన్‌రొట్టె. వి. బ్రెడ్. హిం.ఉ. నాన్ రొట్టి. <ఉ. నాన్ + రొట్టి.

**నానంబ్రాలు**[1] రూ. నానుబ్రాలు.

**నాని** చూ. నాన్న. వి. నాన్నమ్మ.

హిం.ఉ. నానీ తల్లితల్లి, మాతామహి.

**నానుబ్రాలు** రూ.చూ. నానంబ్రాలు[1]. వి. మొలక సొద్దలు.

**నాన్‌రొట్టె** రూ. చూ. నాన్ రొట్టి. వి. బ్రెడ్.

**నాప**[1]

**నాపసన్నాసి** వి. **1**. నాపల ఎదుట సన్నాసిలాగా అమాయకంగా ఉన్న పెళ్ళికొడుకు; **2**. అసమర్థుడు; **3**. అశక్తుడు; **4**. అజ్ఞాని. నాపసాని వి. **5**. మోసగత్తె.

**నాము**[1] వి. **10**. కంకి పట్టటానికిముందు జొన్నపైరును మేసిన పశువులకు కలిగే జబ్బు.

**నాము**[3] వి. శక్తిలేమి.

క. నామ్బు శక్తిలేకపోవటం.

**నాయకురాలు** వి. **1**. ఒకరినేనమ్ముకొని రెండో భార్యవలె ఉండే స్త్రీ లేదా భోగిని; **2**. జాణ, నేర్పరి.

సం. నాయక- సేనాదుల్ని నడిపేవాడు.

<సం. నాయక - + ఆలు[2] (అర్థవిపరి.).

**నార**

**నారతడప** వి. తాటాకుకాడలనుంచి తీసిన పీచు.

**నారబద్దకాయ** వి. ఉబ్బకాయ.

**నారాయణజపం** వి. బహిరంగం.

సం. నారాయణజప-. 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రాన్ని రామానుజులవారు బహిరంగంగా అందరికీ ఉపదేశించారు. అప్పటి నుంచి ఈ మంత్రజపం బహిరంగమైంది.

<సం. నారాయణజప-. (అర్థవిపరి.).

**నారాయణమంత్రం** వి. ఎంత రహస్యమో అంత బహిరంగం.

సం. నారాయణమంత్ర-. 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రాన్ని రామానుజులవారు బహిరంగంగా అందరికీ ఉపదేశించారు. అప్పటినుంచి ఈ మంత్రజపం బహిరంగమైంది.

<సం. నారాయణమంత్ర-. (అర్థవిపరి.).

**నారాయణాస్త్రం** వి. ప్రమాదరహితమయిన అస్త్రం లేదా ఆయుధం.

సం. నారాయణాస్త్ర-. నారాయణాస్త్రం నమస్కరించే వారిని బాధించదు. కాబట్టి ఎదుటి వారి దగ్గర ఇది ఉన్నా తలొగ్గి జయించ వచ్చు అని అర్థం.

<సం. నారాయణాస్త్ర-. (అర్థవిపరి.).

**నారెల్‌కాయ** వి. కొబ్బరికాయ.

హిం. ఉ. నారియల్ కొబ్బరిచెట్టు, కొబ్బరికాయ.

<ఉ. నారియల్ + కాయ.

**నాలా** వి. కాలువ.

ఉ. నాలా కాలువ, డొంక, చిన్నఏరు.

త.నాలా కాలువ.

<ఉ. నాలా.

**నాలి**[1]

నాలిముచ్చు వి. **2**. మోసగాడు.

**నాలి**[2] వి. **2**. శక్తి.

**నాలుబందు** వి. గుర్రాలకు నాడాలు కొట్టేవాడు.

ఉ.నాల్‌బంద్-. గుర్రాలకు నాడాలు కొట్టేవాడు.

<ఉ. నాల్ బంద్.

**నావికాదళం** వి. నౌకాదళం, నావికుల దళం.

సం. నావికదళ-. నౌకాదళం, నావికులదళం.

<సం. నావికదళ-.

**నాష్రు** వి. కుంకుమ.

**నాహోతు** వి. కలకంక, పటికబెల్లం.

**నిక్షేపం** విశ. చక్కని, బాగున్న.

సం. నిక్షేప- నిధి, తాకట్టు, కుదవ, త్యజించటం.

<సం. నిక్షేప-. (అర్థవిపరి.).

**నిప్ప** చూ. నిప్ప.

**నిప్పాలు** చూ. నిప్ప.

**నిప్ప**

నిప్పట్టు వి. **2**. అరిసె; **3**. బూరె. నిప్పాలు వి.బ.వ. నిప్పట్టులు, అరిసెలు.

**నిబ్బ**

నిబ్బగ రూ. నిబ్బగా. క్రి.విశ. నిజంగా. నిబ్బగా రూ.చూ. నిబ్బగ. క్రి.విశ. నిజంగా.

**నిమ్మ** రూ. నెమ్మ.

**నిమ్మకాయ** వి. **2**. బత్తాయికాయ. **నిమ్మకాయవాటము** వి. **1**. స్పష్టం; **2**. సులభసాధ్యం. వ్యు. చేతిలోని నిమ్మకాయను ఏవిధంగా కావాలంటే ఆవిధంగా దొర్లించవచ్చు. కాబటి సులభసాధ్యమనే అర్థంలో ఈ పదబంధం కలిగింది.

**నియోగిముష్టి** వి. యాచనలోకూడా దర్పం ప్రదర్శించటం.

సం. నియోగిముష్టి-. నియోగి యొక్క పిడికిలి.

<సం. నియోగిముష్టి-. (అర్థవిపరి.).

**నిరుహరణ** వి. అపహరించటం.

సం. నిర్హరణ-. అపహరించటం.

<సం. నిర్హరణ-.

**నిరుహేతుకము** వి. కారణంలేనిది.

సం. నిర్హేతుక-. కారణంలేనిది.

<సం. నిర్హేతుక-.

**నిర్ధూమధామంగా** క్రి. విశ. **1**. పూర్తిగా; **2**. గొప్పగా, ఘనంగా.

సం. నిర్ధూమధామన్ పొగచొరని ఇల్లు, పొగలేనిఇల్లు.

<సం. నిర్ధూమధామన్ + అగు + - అ[7].

**నివర్త** వి. నైపుణ్యం.

సం. నివర్త-, నివర్తన-. మరలేది, మరల్చేది, ప్రవృత్తి లేకపోవటం, నివారణం.

<సం. నివర్త-. (అర్థవిపరి.).

**నిబొద్ది** వి. నిజం, సత్యం.

సం. నిబద్ధ-. బాగా కట్టబడింది.

<సం. నిబద్ధ-.

**నిశీథి** వి. రాత్రి.

సం. నిశీథ-, నిశీథినీ రాత్రి.

<సం. నిశీథినీ.

**నిశ్చితార్థం** వి. పెళ్ళి నిశ్చయం, పెళ్ళికి ముందు జరిగే ప్రదానం.

సం. నిశ్చిత + అర్థ నిశ్చయించబడ్డ అర్థం.

<సం. నిశ్చితార్థ-. (అర్థవిపరి.).

**నిసంగి** వి. సంతానంలేని వ్యక్తి.

సం. నిస్సంగిన్ (దేనితోనూ) కలయికలేనివాడు.

<సం. నిస్సంగిన్.

**నిస్స్పృహ** వి. నిరాశ, (మానసికమైన) నిస్సత్తువ.

సం. స్పృహ- కోరిక, అసూయ, నిస్పృహ-. ఆశలేనిది.

<సం. నిస్స్పృహ-. (అర్థవిపరి.).

**నీటం** చూ. నీటు[1]. క్రి.విశ. చక్కగా.

**నీటిపిల్లి** చూ. నీరు.

**నీటిమీదివ్రాంత** చూ. నీరు.

**నీడ**[2]

నీడకన్ను వి. చంద్రుడు. తాళ్ల.సం. 5.240.

**నీరు**

నీటిపిల్లి వి. బావుల్లో ఉపయోగించే నీటిగాలం. నీటిమీదివ్రాంత వి. నమ్మరాని విషయం. నీటిమీద రాత

రాసినా విలవదు. నమ్మరాని, చెల్లని దానిని 'నీటిమీద రాత' అంటారు. నీరుగట్టోళ్ళు విణ.బ.వ. మాలకులస్థులు. వీరు తరతరాల నుండి పరిమళ్ళకు నీళ్ళు కట్టుతూ ఉండేవారు. నీళ్ల చుక్కలు వదిలేవాడు విణ. జలతర్పణం చేసే దాయాది.

నీల రూ.మా. నీలి[2]. వి. 2. కరునీలిచెట్టు. (Indigo-Feratinctoria).

నీలాలు 2. తాళ్ల.సం. 18.435.

నీలి[2] రూ. నీల.

నీలిబేరము వి. 1. నీలిమందు వ్యాపారం; 2. పరమ దౌర్భాగ్యమైన అవ్యవస్థిత వ్యాపారం.

నీళ్లచుక్కలు వదిలేవాడు చూ. నీరు.

నుగ్గురాయి రూ. నుగ్రాయి.

నుగ్రాయి రూ. చూ. నుగ్గురాయి. వి. 1. గాజువన్నెరాయి; 2. ముగ్గు వేసుకోవటానికి పనికి వచ్చే తెల్లని మెత్తని రాయి (Ooze).

నుడుగు వి. 3. పాటచరణం.

నున్న వి. 3. తౌడునుంచి తయారయ్యే పశుగ్రాసం, తవుడు.

నుసి వి. 6. దురద.

నూగు

నూగుబిండి (-పిండి)[1] వి. చిమ్మిలి.

నెమ్మ రూ. చూ. నిమ్మ. వి. జంభీరం, నిమ్మ.

నెయ్యిలు వి.బ.వ. పేలాలు.

నెరగాయలు వి.బ.వ. రేగుపళ్ళు.

నెరవ రూ. చూ. నెరవు[1]. వి. మంచిది.

నెరవు[1] రూ. నెరవ.

నేల

నేల విడిచి సాము చేయు అ.క్రి. అహంకారంతో ఆధారం విడిచి ప్రవర్తించు.

నైట్ వి. రాత్రి.

ఇం. *Night* రాత్రి.

<ఇం. Night.

నొల్లతోలు చూ. నొల్లు[2].

నొల్లు[2] స.క్రి. 4. ఊడ్చు.

నొల్లతోలు అ.క్రి. పెద్దబల్లను ఎద్దుల చేతలాగించి దున్నిన పొలాన్ని చదునుచేయు.

నోటిలోమట్టికొట్టు చూ. నోరు.

నోట్లోకి చూ. నోరు.

నోరు

నోటిలోమట్టికొట్టు అ.క్రి. జీవనం సడగొట్టు, నష్ట-పెట్టు. నోట్లోకి అవ్య. 'తాంబూలం' అనే అర్థంలో వ్యవహారం.

పకడ్బందీ వి. కట్టుదిట్టం, గట్టిదనం.

హిం. పకడ్ పట్టు, బందీ కైదీ.

<హిం. పకడ్‌బందీ.

పకడ్బందీగా క్రి.విణ. గట్టిగా.

పకాలి[2] రూ. చూ. పకాళం. వి. ఉదయం తినే వేడి అన్నం.

పకాళం రూ. పకాలి[2].

పక్షిణీ వి. ఎవరైనా దగ్గరవాళ్ళు (మేనమామ; మేనత్త మొ.) పోయినప్పుడు పట్టే మైల.

సం. పక్షిణీ రెండు పగళ్ళతో కూడిన రాత్రి.

<సం. పక్షిణీ (అర్థవిపరి.).

పగలకాడ(-కడ) చూ. పగలు.

పగలు

పగలకాడ(-కడ) అవ్య. చీకటి పడకముందే.

పంగ[1] వి. 4. పని.

పంగెము రూ. చూ. పొంగెము. వి. సంబంధం. తాళ్ల.సం. 13.166.

పచ్చ

పచ్చకూర వి. 2. తోటకూర.

పంచ[1]

పంచపాళి రూ. పంచపాళీ. పంచపాళీ రూ.చూ. పంచపాళి. వి. వసారా.

పంచకజ్జాయము వి. పప్పులు, బొరుగులు, బెల్లం, కొబ్బరి, నెయ్యి కలిసిన పదార్థం.

సం. పంచన్ ఐదు.

<సం. పంచన్ + కజ్జాయము.

పంచతీర్థం వి. బావినీరు.

సం. పఞ్చతీర్థ-. పాలు, నెయ్యి, పెరుగు, పానకం, తేనె లకు పంచ (ఐదు) తీర్థాలని వ్యవహారం.

<సం. పంచతీర్థ-. (అర్థవిపరి.).

పంచబంగాళము

'అంగ, వంగ, గౌడ, రాఢా, సమతల' అనే రీతిలో విశాల వంగదేశం 5 ముక్కలుగా శ్రీనాథునికి పూర్వమే అయిఉండవచ్చు. దీనినిబట్టి చెల్లాచెదరైనది, ముక్కలైనది, అదృశ్యమైనది మొ. అర్థాలు పంచబంగాళమయింది అనే దానికి కలిగి ఉండవచ్చు అని పండితాభిప్రాయం.

పట వి. 7. కొమ్మ.

పటము వి. చిత్తరువు, బొమ్మ. ఉ.హరి. 4.2.

సం. పట- బట్ట.

<సం. పట-. (అర్థవిపరి.).

పడత వి. 6. తల.

పడమర

పడమరోళ్ళు విణ. బ.వ. **1**. మరాఠీలు; **2**. కళింగాంధ్రులకు పడమటగా వున్నవారు.

**పడమరోళ్ళు** చూ. పడమర.

**పడసాల** <ప్రా. పడసాలా.

**పడి** వి. **6**. గడ్డిభూమి.

**పడికట్టు** క్రి. **4**. సారూప్యం.

**పడ్డ** విణ. పెద్దది.

**పత్తాలు** వి.బ.వ. పేకలు.

సం. పత్త్రి-. ఆకు.

ప్రా. పత్త-.

<పా. పత్త - + ము - లు.

**పత్తేలు** వి. ఒకవైపు, భాగం.

**పత్రం** వి. **1**. తాటాకు; **2**. కాగితం; **3**. ఋణపత్రం.

సం. పత్ర-. ఆకు, పర్ణం,

<సం. పత్ర-. (అర్థవిపరి.).

**పథ్యము** వి. జ్వరం తగ్గిన తర్వాతా మరి కొన్ని పరిస్థితుల్లోనూ తీసుకొనే ప్రత్యేక ఆహారం.

సం. పథ్య-. తగిన, ఒకరికి చెందిన, హితమైన.

<సం. పథ్య-. (అర్థవిపరి.).

**పదవి** వి. ఉద్యోగం, జాబ్.

సం. పదవి-. పదవీ అధికారం, అధికారస్థానం.

<సం. పదవి-. (అర్థవిపరి.).

**పని**[1]

**పనిమంతుడు** వి. పనితనం కలవాడు. సంస్కృత నామవాచక శబ్దాలపై కలవాడు, కలది అనే అర్థంలో ప్రయోగించవలసిన 'మతుప్' ప్రత్యయాన్ని తెలుగు మాట ఐన 'పని'కి చేర్చబడింది. **పనిమంతురాలు** వి. పనితనం కలది. సంస్కృత నామవాచక శబ్దాలపై కలవాడు, కలది అనే అర్థంలో ప్రయోగించవలసిన 'మతుప్' ప్రత్యయాన్ని తెలుగుమాట ఐన 'పని'కి చేర్చబడింది.

**పంది** రూ. పన్ని[2].

**పందుం** రూ. చూ. పన్దుంబు. వి. పదికుంచాలు.

**పన్దుంబు** రూ. పందుం.

**పన్ని**[2] రూ.చూ. పంది. వి. పంది, వరాహం.

**పప్పన్న** చూ. పప్పు.

**పప్పన్నం** చూ. పప్పు.

**పప్పు**

**పప్పన్న** చూ. పప్పన్నం. వి. **1**. అమాయకుడు; **2**. మందమతి; **3**. తెలివితక్కువవాడు. **పప్పన్నం** వి. **1**. అమాయకుడు; **2**. మందమతి; **3**. తెలివిలేనివాడు; **4**. పప్పుతో వున్న అన్నం. పప్పుతో అన్నం కలుపుకుని తిన్నవారు మందమతులౌతారని వాడుక.

**పంపు**[3] వి. **7**. వాటా.

**పంబ**[1]

**పంబలవాండు** రూ. పంబలోడు. విణ. **2**. మాలలలో ఒక తెగవాడు. ఇతడు జాతర నిర్వహణలో అమ్మవారికి క్రమపద్ధతిలో సాంఙ్యాలను నిర్వహిస్తాడు. **పంబలోడు** రూ. చూ. పంబలవాండు. విణ. **1**. పంబవాయించేవాడు; **2**. మాలలలో ఒక తెగవాడు. ఇతడు జాతర నిర్వహణలో అమ్మవారికి క్రమ పద్ధతిలో సాంఙ్యాలను నిర్వహిస్తాడు.

**పరక**[2]

**పరక్కట్ట** రూ. చూ. పారకకట్ట. వి. చీపురు.

**పరకాయించు** స.క్రి. **2**. సర్దుకొను.

**పరక్కట్ట** చూ. పరక[2].

**పరగ** వి. భూమిలోనికి చొచ్చుకొని పోయి నేల మట్టంగా కనిపించేరాయి. ఈ రాయి ఎంత కొట్టినా పెచ్చులు లేస్తుంది కాని పగలదని కొందరి వివరణ.

**పరగడ** రూ.చూ. పఱగడ.

**పరగడు** రూ.చూ.పఱగడ.

**పరడ** వి. బొద్దింక.

**పరదా** వి. **7**. దోమతెర.

**పరమంతపండు** వి. బొబ్బాస పండు.

సం. పర-. ఇతరమయినది.

<సం. పర - + ముంతపండు (మిశ్రస.).

**పరవ**[2] వి. చేలో నీళ్ళు పారేదారి.

**పరవడ** రూ.చూ. పఱగడ.

**పరశురామ ప్రీతి** వి. అగ్నిజ్వాలలవల్ల అయ్యే నాశనం.

సం. పరశురామప్రీతి-. పరశురాముని ఇష్టం.

మునుల కోరికపై పరశురాముడు గోకర్ణ క్షేత్రాన్ని సముద్రం నుంచి ఉద్ధరించ తలచి వరుణున్ని గోకర్ణ క్షేత్రాన్ని వీడిపోవలసిందిగా కోరాడు. కాని వరుణుడు మన్నించలేదు. అప్పుడు పరశురాముడు ఆగ్నేయాస్త్రాన్ని సంధించగా అగ్నిజ్వాలలు అంతటా వ్యాపించాయి. వరుణుడు గోకర్ణ క్షేత్రాన్ని వదిలి వెళ్ళి పోయాడు. మంటల వల్ల ఏది నాశనమైనా పరశురామ ప్రీతి అనే నుడికారం తెలుగులో ఏర్పడింది.

**పరాందపుపండు** చూ. పరాందప. వి. బొబ్బాయి పండు.

**పరి** వి. **12**. దురద.

**పరిగ**[2] వి. **3**. ఒక రకమయిన ధాన్యం.

**పరిపాటి** వి. **1**. అలవాటు; **2**. సామాన్యం, సాధారణం.

సం. పరిపాటి-, పరపాటీ క్రమం, పరుస, పద్ధతి, అనుక్రమం.

<సం. పరిపాటి-. (అర్థవిపరి.).

**పరిమిపండు** వి. బొబ్బాయిపండు.

సం. పరమ-. ఉత్కృష్టమైన.

<సం. పరమ - + పండు[1].

**పరుగు**

**పరుగుడ్డు** వి. నిచ్చెన.

**పరుష** రూ.మా. పరుస[1]. భక్తబృందం. తాళ్ల.సం. 6.111.

క. పరుసు భగవంతుని స్తుతించేవారు. పరసు. భగవంతుని స్తుతించు.

**పరుస[1]**. రూ. పరుష.

**పర్యవసానం** వి. ఫలితం.

సం. పర్యవసాన-. ముగింపు, సమాప్తి.

<సం. పర్యవసాన-. (అర్థవిపరి.).

**పలగడ** రూ. పరగడ, పరగడు, పరవడ.

సం. పర-. ఇతరమయినది.

<సం. పర - + కడ.

**పలక** వి. **29**. తప్పెట.

**పలకఱ్ఱ (-కట్ట)** చూ. పల్లు[2]. వి. పళ్ళుతోముకొనే పుల్ల.

**పలంగి** వి. బల్ల.

హిం.ఉ. పలంగ్ బల్ల.

<ఉ. పలంగ్.

**పలహారం** రూ.మా. ఫలహారము.. వి. అల్పాహారం.

**పలారం** రూ.మా. ఫలహారము. వి. **1**. అల్పాహారం; **2**. కొబ్బరి ముక్కలు పంచదార లేదా బెల్లం కలిపి దేవుడికి పెట్టే నైవేద్యం.

**పలేమర్స** వి. పలకరించటం.

సం. పరామర్శ-. ఇతరుల్ని పలకరించటం.

<సం. పరామర్శ-.

**పల్లటీడు** చూ. పల్లటి. వి. విలాసకాడు.

**పల్లదము** వి. **1**. తాళ్ల.సం. 18.271.

**పల్లాండు[2]** వి. నూరుసేర్ల పరిమాణం.

క. పల్లా 100 సేర్ల పరిమాణం.

<క. పల్లా.

**పల్లికి** రూ.మా. పాలకి[1]. వి. పల్లకీ, మనుషులు మోసే యానవిశేషం.

**పల్లు[2]**

**పల్లెత్తిమాట్లాడు** స.క్రి. స్పష్టంగాచెప్పు. పళ్ళు కనబడేటటు బాహాటంగా చెప్పు. < పల్లు[2] + ఎత్తు[1] + - ఇ[13] + మాట్లాడు. **పల్లెత్తుమాట** వి. **1**. స్పష్టమైన వాక్కు; **2**. నొప్పించేమాట. < పల్లు[2] + ఎత్తు[1] + మాట.

**పల్లెత్తిమాట్లాడు** చూ. పల్లు[2].

**పల్లెత్తుమాట** చూ. పల్లు[2].

**పష్టలు** వి.బ.వ. అట్లు.

సం. పిష్ట-. పొడిచేయబడ్డది, చూర్ణితం.

<సం. పిష్ట - + - లు.

**పసి[5]**

**పసెద్దు** వి. తెలుపురంగు కల ఎద్దు.

<పసి[5] + ఎద్దు.

**పసుపు**

**పసుపుబొట్టు** వి. పేరంటం.

**పసురు** వి. **2**. బాధ.

**పసెద్దు** చూ. పసి[5].

**పస్తాయించు** అ.క్రి. **3**. నిదానించు.

**పాంశువు** రూ. పాసువు. వి. మగతనం.

సం. పాంశు-, పాంసు-. దుమ్ము, రేణువు, ఎరువు, పేడ, ఒక రకం కర్పూరం, ఒక రకం ఉప్పు.

<సం. పాంశు-. (అర్థవిపరి.).

**పాకు[1]**

**పాకుమాను** వి. పోకచెట్టు.

**పాఁగెము** రూ. పంగెము.

**పాటక్** వి. గేటు.

హిం. పాటక్ గేటు.

<సం. పాటక్.

**పాటి[4]** రూ. పాటీ. వి. పలక.

మరా. పాటీ పలక.

<మరా. పాటీ.

**పాటీ** రూ.మా. పాటి[4]. వి. పలక.

**పాడ్యపులు** వి.బ.వ. గబ్బిలాలు.

**పాండవబీడు** వి. **2**. ఒకప్పుడు భోగభాగ్యాలతో విలసిల్లి ప్రస్తుతం వాటిని కోల్పోయిన స్థితి.

**పాన్[1]** వి. తమలపాకు.

హిం.పాన్ తమలపాకు, తాంబూలం.

<హిం. పాన్.

**పాన్ పరాగ్** వి. తమలపాకు పొగాకు కలిపి తయారు చేసే మత్తు కలిగించే కిళ్ళీ. ఇది ఆరోగ్యానికి హానికరం. హిం. పాన్‌పరాగ్ మాదక ద్రవ్య విశేషం. < హిం. పాన్‌పరాగ్. **పాన్‌మసాలా** వి. మాదక ద్రవ్యవిశేషం, పొగాకు తమల పాకులు కలిపి తయారు చేసే కిళ్ళీ. ఇది ఆరోగ్యానికి హానికరం. హిం. పాన్‌మసాలా మాదక ద్రవ్య విశేషం. < హిం. పాన్‌మసాలా.

**పాన్[2]** వి. **1**. న్యాసం; **2**. తాకట్టు.

ఇం. *Pawn* న్యాసం, తాకట్టు.

<ఇం. Pawn.

(5)

**పానకం** రూ.చూ. పానకము. వి. **1**. పళ్ళరసం; **2**. బెల్లం, పంచదార మొ. వాటితో తయారు చేసిన ద్రవం.

**పానకము** రూ. పానకం. వి. **1**. బెల్లం, పంచదార మొ. వాటితో తయారు చేసిన ద్రవం, **2**. పళ్ళరసం.

**పావాది** వి. **2**. బజారు.

**పాప**[1]

**పాపోడు** విణ. బాబు. <పాప[1] + వాండు.

**పాపం** వి. జాలిని, పరిహాసాన్ని తెలిపే మాట. భాగ. 6.11.

సం. పాప-. దురదృష్టం, దుష్కృతం, నీచం, అమంగళం.

<సం. పాప-. (అర్థవిపరి.).

**పాపాక్షులు** వి.బ.వ. సీతాకోక చిలుకలు.

సం. పాపాక్షి. పాప నేత్రాలు కలది.

<సం. పాపాక్షి + - లు (అర్థవిపరి.).

**పాపోడు** చూ. పాప[1].

**పామరము** రూ. పావురం.

**పామిడి**[1] చూ. పాము[2]. వి. కళ్ళాపి.

**పామిడి**[2] వి. గరుత్మంతుడు. వ్యు. పాముల్ని లేకుండా చేసేవాడు.

<పాము[1] + ఇడి.

**పామిడి తురగము** వి. పరబ్రహ్మం (శ్రీ వేంకటేశ్వర స్వామి) గరుత్మంతుణ్ణి వాహనంగా కలవాడు.

**పాము**[1]

**పాముకాళ్ళు** వి.బ.వ. **1**. కనిపించనిది; **2**. ఉన్నా-లేనట్లు లేదా లేకపోయినా ఉన్నట్లు కనిపించే విషయం. పాముకు కాళ్ళులేవు. ఇది పొలుసులతో పాకుతుంది. కాళ్ళు లేకుండా సరాసరాపాకటం సాధ్యం కాదని భావించి మనవాళ్ళు పాముకు కాళ్ళున్నా అవి మనకు కనబడవు అని తలచారు. కాబట్టి 'పాము కాళ్ళు' పదబంధ మేర్పడింది.

**పాయుకారీ** రూ. పాయుకారు.

**పాయుకారు** రూ.చూ. పాయుకారీ. వి. పని పాటులేనివాడు.

**పాయల్** వి. కాళ్ళ గొలుసు.

హిం.ఉ. పాయల్ బంగారంతో లేదా వెండితో చేయబడ్డ కాళ్ళ గొలుసు.

<ఉ. పాయల్.

**పాయా** వి. పునాది.

**పాయి**[1] రూ. బాయి[1].

వ్రాయి > వ్రాలు, రేయి > రేలు, వేయి > వేలు మొ. శబ్దరూపాల్ని చూచి సామ్యం వల్ల పాలు బహువచన రూపంగా భావించి పశ్చాన్నిర్మాణం (Back formation) వల్ల 'పాయి' శబ్దం కల్పించబడింది. ఈ 'పాయి' పదాన్ని గౌరన తన హరిశ్చంద్రోపాఖ్యానంలో 'కొడుకుఁబాయని యక్కునఁబెట్టి పొలిండ్ల నొత్తి' అని ప్రయోగించాడు.

**పాయిజెర్ల మాటలు** వి.బ.వ. విషం మాటలు.

ఇం. *Poisoner* విషం పెట్టేవాడు.

<ఇం. Poisoner + - లు + - అ[11] + మాట + -లు.

**పాలకాయితాలు** చూ. పాలు[2].

**పాలు**[2]

**పాలకాయితాలు** వి.బ.వ. తెల్లకాగితాలు.

**పాలకి**[1] రూ. పల్లికి, పాలిక[4].

**పాలతాకులు** చూ. పాలు[2].

**పాలతాలికలు** చూ. పాలు[2].

**పాలిక**[3] చూ. పాలు[1].

**పాలిక**[4] రూ.చూ. పాలకి[1] వి. పల్లకీ, మనుషులు మోసే యాన విశేషం.

**పాలిభారతము - ఆలిరామాయణము** చూ. పాలు[1].

**పాలు**[1]

**పాలిక**[3] వి. కాలు. **పాలిభారతము - ఆలిరామాయణము** వి. వంతుకోసం లేదా స్త్రీ కోసం పోట్లాడుకోవటం. పాలు (వంతు) కోసం భారతయుద్ధము ఆలు (భార్య) కోసం రామాయణ యుద్ధమూ జరిగాయి. ఈ భారత రామాయణ యుద్ధాలకథను ఈ నుడికారం తెలుపుతోంది.

**పాలు**[2]

**పాలతాకులు** రూ.చూ. పాలతాలికలు. వి.బ.వ. క్షీరాన్న విశేషం; పాయసం. **పాలతాలికలు** రూ. పాలతాకులు. వి.బ.వ. క్షీరాన్న విశేషం; పాయసం.

**పాలుమారిక** రూ.చూ. ప్రాలు మాలిక. వి. సుస్తీ, సోమరితనం.

**పాలుమాలు** రూ.చూ. ప్రాలుమాలు. అ.క్రి. జబ్బుపడు.

**పాలె**[2] వి. బడి.

**పావురం** రూ.చూ. పామరము. వి. ప్రేమ.

**పాశం** రూ.చూ. పాసెము. వి. **1**. క్షీరాన్నం, పాయసం; **2**. పులగం.

**పాసుపు** రూ. చూ. పాంశువు. వి. మగతనం.

**పాసెము** రూ. పాశం.

**పిక్కిరివాడు** చూ. పిక్కిలి. విణ. చిన్న పిల్లవాడు.

**పించము**[1] రూ. పెంచము, పెంచెము.

**పిడిమాను** వి. సిరిబండి, జాతర్లలో కట్టే ఒక రకం బండి.

**పిండి**[1]

**పిండిమిరపకాయ** వి. బజ్జీ.

**పితలాటకము** రూ. పిత్తలాటకము.

ఇత్తడిని చూపి బంగారమని మోసగించటంచేత ఈ పలుకుబడి.

సం. పిత్తల-. ఇత్తడి, హాటక-. బంగారం.

<సం. పిత్తల - +సం. హాటక-.

**పితుకుబేళ్ళు** వి.బ.వ. అనుములు.

**పిత్తలాటకము** రూ.చూ. పితలాటకము. వి. **1**. మోసం; **2**. వెనకముందాడటం; **3**. పేచీ.

**పిపాస** వి. **1**. తీవ్రవాంఛ; **2**. కోరిక.

సం. పిపాసా దాహం, దప్పిక, తాగాలనే కోరిక.

<సం. పిపాసా (అర్థవిపరి.).

**పిరదేచూ** అ.క్రి. మళ్ళీ మళ్ళీ విజృంభించు.

క. పిర, పిరె పునః పునః., మళ్ళీ, మళ్ళీ.

**పిరియం** విశ. అధిక మూల్యమయినది, ఖరీదెక్కువయినది.

సం. ప్రియ-. ఇష్టమయినది, ఖరీదెక్కువయినది.

<సం. ప్రియ-.

**పిల్ల**[1]

**పిల్లగాండ్లు** వి.బ.వ. పిల్లలు. **పిల్లగోటు** రూ. పిల్లంగోడు. వి. **1**. పిల్లలు కర్రతో ఆడుకొనే క్రీడావిశేషం. తాళ్ల.సం. 10.172; **2**. పిల్లల క్రీడా విశేషంలో ఉపయోగించే కర్ర. **పిల్లంగోడు** రూ. చూ. పిల్లకోటు. వి. **2**. పిల్లలు కర్రతో ఆడుకొనే ఒకరకం ఆట. **పిల్లదీపులు** తాళ్ల.సం. 8.179.

**పిల్లి**

**పిల్లినడక** వి. **1**. దొంగనడక; **2**. గూఢప్రవర్తన. పిల్లినడచేటప్పుడు శబ్దం వినిపించదు. కాబట్టి వినిపించకుండా ఉండేనడకను ప్రవర్తనను 'పిల్లినడక' పదబంధంతో వ్యవహరిస్తున్నారు.

**పిస**[1] వి. **4**. పిచ్చి.

**పీని** వి. తులసి.

ఒ. పీని తులసి.

<ఒ. పీని.

**పీను** వి. 2. వివాహవేదిక.

**పీలి** రూ.చూ. పెలా. వి. ఒక రకం గిన్నె, పానపాత్ర

**పుక్కిలి**

**పుక్కిటిపురాణము** వి. **2**. కల్పితగాథ. పుక్కిలించి ఉమ్మేసినట్లు ఆలోచన లేకుండా చెప్పే విషయం.

**పుగ** రూ.చూ. పుబ్బ. వి. ఆగష్టు చివరభాగంలో ప్రవేశించే కార్తె.

**పుంగి** వి. సన్నాయి.

**పుచ్చకాయ** వి. **2**. దోసకాయ; **4**. ఆనపకాయ.

**పుంజి**[1] విశ **2**. అయిదు.

**పుట్ట** రూ. పుట్ర.

**పుట్టగొడుగు** వి. తాటాకు గొడుగు. **పుట్టచెండు** రూ. పుట్టసెండు. **పుట్టసెండు** రూ.చూ. పుట్టచెండు. వి. గుడ్డతో చేసిన చిన్నబంతి.

**పుట్ర** రూ.చూ. పుట్ట. వి. (చీమల,పాముల) పుట్ట, వల్మీకం. 'పులిమీద పుట్ర' లోని నుడికారంలోని 'పుట్ర' కు పుట్ట అని అర్థం.

**పుడిగ** వి. **2**. పాట్లం.

**పుదుకు**[1] స.క్రి. **5**. వెతుకు.

**పుణ** వి. లలాటం, నుదురు, నొసలు.

**పుత్రుడు** వి. అన్నకొడుకు.

సం. పుత్ర- కొడుకు.

<సం. పుత్ర- (అర్థవిపరి.)

**పువర** వి. జూలై నెల రెండోభాగంలో వచ్చే 'పునర్వసు' కార్తె.

సం. పునర్వసు-. జూలై నెల రెండో భాగంలో వచ్చే 'పునర్వసు' కార్తె.

<సం. పునర్వసు-.

**పువ్వొత్తులు** వి.బ.వ. ఆరు అంగుళాల పొడవుండే దూదితో చేసిన వత్తులు.

<పువ్వు + వత్తి + -లు.

**పురండం** వి. పొడుపుకథ.

సం. పురాణ-. అష్టాదశ పురాణాలు, ప్రాచీనమైనది.

<సం. పురాణ-.

**పురస్తు** అవ్య. అయినాసరే.

సం. పరస్తు కాని.

<సం. పరస్తు.

**పురస్కరించుకొను** స.క్రి. దేనినో ఒకదానిని నిమిత్తంగా చేసుకొను.

సం. పురస్కృ ముందిడుకొను, పూజించు.

<సం. పురస్కృ + -ఇంచు[3] + కొను.

**పురా**

**పురాగ** రూ. పురాగా, పూరాగ, పూరాగా, క్రి.విశ. పూర్తిగా. **పురాగా** రూ.చూ. పురాగ. క్రి. విశ. పూర్తిగా.

**పురి** వి. **14**. చందా.

**పులక**

**పులకమడి** వి. నారువేసిన తర్వాత అది పెరిగాక నీరు తీసి వేసిన మడి.

**పులకాపన** చూ. పులక. వి. తమలపాకును కాని మామిడాకునుగాని నీటిలో ముంచి దేవతలపై చల్లటం, సంప్రోక్షణ.

**పులగమన్నము** చూ. పులగము.

**పులగము**

**పులగమన్నము** వి. బియ్యం, పెసరపప్పు, పసుపు

కలిపివండిన అన్నం. సం. అన్న-. ఆహారం, ఆహారపదార్థం. <పులగము + సం. అన్న -+- ము.

**పులమడం** చూ. పులుము. వి. ఉత్కటం.

**పులి**[1]

**పులిమొహరు** వి. పులిబొమ్మగల బంగారపు బిళ్ళ.

**పులి**[2]

**పులికాపు** వి. **3**. కొట్టటం; **4**. తన్నడం. **పులికాపుపెట్టు** అ.క్రి. తన్ను.

**పులి**[3] చూ. పురుగు. వి. పురుగు, పాము.

**పులిమీదిపుట్ర** వి. ఒక అపాయకరమైన దాని-కంటె ఇంకో పెద్ద అపాయకరమైనది అని చెప్పటానికి ఉపయోగించే పలుకుబడి.

**పులిక** వి. నీరసం.

**పులియోర**

క. ఓగర, ఓగరె ఉడికించిన బియ్యం అన్నం; త. ఓగరై, ఓదరై ఆహారం, పులియోతరై, పులియోరై, పుళిహోర పులిహోర, చింతపులుసు అన్నం.

**పులీగలు** చూ. పులు[2].

**పులు**[2]

**పులీగలు** వి.బ.వ. దోమలు. <పులి[2] + ఈcగ+-లు.

**పులుసన్నము** చూ. పులుసు.

**పులుసు**

**పులుసన్నము** వి. పులిహోర. <పులుసు+అన్నము. **పులుసునిమ్మ** వి. నిమ్మకాయ. **పులుసుపప్పు** వి. పప్పుచారు.

**పుల్ల**[1] వి. పులుపు.

**పుల్లకాయ** వి. **2**. చింతకాయ. **పుల్లకూర** వి. పప్పుకూర.

**పుల్లెద్దు (-ఎద్దు)** వి. తెలుపు వన్నె ఎద్దు.

**పువ్వాకు** చూ. పువ్వు.

**పువ్వు**

**పువ్వాకు** వి. పొగాకు. <పువ్వు+ఆకు.

**పుష్పవతి** వి. రజస్వల.

సం. పుష్పవతీ పుష్పించినది, పువ్వులు కలది, రజస్వల. <సం. పుష్పవతీ (అర్థవిపరి.).

**పుసాల** రూ. పుస్సి. వి. ఆగష్టు నెల మొదటిభాగంలో వచ్చే పుష్యమికార్తె.

సం. పుష్యమీ ఒకానొక నక్షత్రం.

<సం. పుష్యమీ.

**పుస్సి** రూ. చూ. పుసాల. వి. ఆగష్టు నెల మొదటిభాగంలో వచ్చే పుష్యమీకార్తె.

**పూ**

**పూలరంగడు** వి. **1**. విలాసంగా అలంకరించుకొని తిరిగేవాడు; **2**. శృంగారపురుషుడు; **3**. తిరుగుబోతు, వ్యభిచారి.

**పూజాపునస్కారాలు** వి.బ.వ. అర్చనాదులు.

సం. పూజా అర్చన, సేవ, పురస్కార-. ముందు పెట్టటం, పూజనం, పరిగ్రహించటం, మంత్రజలాదులను ప్రోక్షించటం, ఎదురు చూడటం, అభిశాపం. పునస్సంధాన పునస్సంస్కారపునశ్చరణాది శబ్దాల సామ్యం వల్ల 'పురస్కార శబ్దం' పునస్కారంగా మారింది.

<సం. పూజాపురస్కార-+-ము+-లు.

**పూజాపునస్కారాలులేకఉండు** అ.క్రి. అర్చన, నమస్కారాది గౌరవాలు లేకపోవు.

**పూజ్యం** రూ.చూ. పూజ్యము. వి. సున్న, శూన్యం.

సం. పూజ్య- పూజించ తగ్గది, గౌరవించతగ్గది, సమ్మానయోగ్యమైనది.

**పూనువేయు** అ.క్రి. ప్రవాహమార్గాన్ని మళ్ళించడానికి గడ్డిమోపులు వేయు.

**పూరాగ** రూ. చూ. పురాగ. క్రి.విశ. పూర్తిగా.

**పూరాగా** రూ.చూ. పురాగ. క్రి. విశ. పూర్తిగా.

**పూర్వసాల** వి. డిసెంబరు రెండోభాగంలో ప్రవేశించే కార్తె.

సం. పూర్వాషాఢా ఒకానొక నక్షత్రం.

<సం. పూర్వాషాఢా.

**పెగ్గ** వి. **3**. జంబం, డాంబికం.

**పెగ్గమాటలు** వి.బ.వ. హెచ్చుమాటలు.

**పెంకు** వి. **7**. పనం.

**పెచ్చితం** వి. ఇప్పుడు.

సం. ప్రస్తుత-. బాగా పొగడబడినది.

<సం. ప్రస్తుత-. (అర్థవిపరి.).

**పెంచము** రూ. చూ. పింఛము[1]. తాళ్ల.సం. 12.253.

**పెంచెము** రూ.చూ. పింఛము[1]

**పెట్ట**[1]

**పెట్టఆకు** వి. విస్తర్లు కుట్టటానికి ఉపయోగించే మోదుగ ఆకుల్లో కోలగా ఉండి ఎడమవైపుగానీ కుడివైపుగానీ వంగిన ఆకు.

**పెంట**[1]

**పెంటపెట్టు** అ.క్రి. పనికిరాని విషయాలను గురించి తగువుకల్పించు.

**పెద**

**పెదగంగ** వి. ఆకాశగంగ.

**పెద్ద**

**పెద్దజీవము** వి. దున్నపోతు. **పెద్దపాప** వి. పెద్దమనిషి ఐనపిల్ల. **పెద్దాయి** వి. పెద్దమ్మ. <పెద్ద+-అయి[4].

పెద్దాయి చూ. పెద్ద.

పెవము రూ. పెన్నము.

పెందాలకాడ క్రి.విశే. 1. ఆలస్యంకాకుండా; 2. ఉదయసమయాన.

పెందిరి వి. ఉదయం.

పెన్నము రూ. చూ. పెవము. వి. పెనం, రొట్టెలు మొ. వాటిని కాల్చటానికి ఉపయోగించే సాధన విశేషం.

పెన్నేరు

పెన్నేరుగడ్డ వి. 1. దివ్యౌషధం; 2. పెన్నేరు పెరిగేభూమి; 3. బంగారం పండే పొలం (సుక్షేత్రం).

పెయ్యి

పెయ్యాల్యాగా (-లేగ) వి. ఆవుదూడ.

పెయ్యాల్యాగ చూ. పెయ్యి.

పెరటికసి చూ. పెరడు.

పెరడు

పెరటికసి వి. పెరటివైపు. <పెరడు +-ఇ[6]- + కేసి.

పెరుగు

పెరుగుటల్లు వి.బ.వ. పెరుగు, దధి. పెరుగుబొట్టు వి. పెరుగు.

పెర్లిం వి. శరీరం.

పెలా రూ. పీలి, ప్యాలా. వి. ఒక రకం గిన్నె, పానపాత్ర, కప్పు.

ఉ. పియాలా, ప్యాలా కప్పు, ఒక రకం గిన్నె.

<ఉ. ప్యాలా.

పెల్ల[2] చూ. పెరడు. వి. దొడ్డి, పెరడు.

పెళ్ళి వి. 2. పెరడు.

పెళ్ళి ఇంటిపెరటిలోనే సాధారణంగా పూర్వం జరిగేది కాబట్టి పెళ్ళికి 'పెరడు' అనే అర్థం వచ్చి ఉంటుంది.

పేగు వి. 3. గుడ్డ.

పేగుమెలిక వి. సంతాన నిరోధానికి పురుషులు చేయించుకొనే వేసక్టమీ.

పేటి[3] వి. హార్మోనియం.

హిం.ఉ. పేటీ పెట్టి.

<ఉ. పేటీ.

పేడపురుగు చూ. పేఁడ. వి. తుమ్మెద.

పేరీఁగ చూ. పేరు[1].

పేరు[1]

పేరీఁగ వి. తేనెటీగ. <పేరు[1] + ఈఁగ.

పేలవము వి. విస్తారం.

సం. పేలవ-. మృదువైనది, పలచనిది.

<సం. పేలవ-. (అర్థవిపరి.).

పేలు[1]

పేలపిండి వి. 2. బెల్లం కలిపిన జొన్నపిండి.

పై వి. 4. శరీరం, దేహం.

పైబట్ట[2] వి. కండువా.

పైలు వి. మొదటి తేదీ.

హిం.ఉ. పహ్‌లా, పహ్‌లీ మొదటి.

<ఉ. పహ్‌లా.

పొంగు

పొంగుబాలుకూడు (-పాలుకూడు) వి. రెండు కొత్తకుండలతో గాటిపొయ్యి మీద పాలు పోసి వండిన వరి అన్నం.

పొందు వి. భార్య.

త. పెణ్ భార్య.

<త. పెణ్.

పొద్దు[1]

పొద్దుబొడి వి. సాయంత్రం.

పొప్పిడి

పొప్పిడికాయ వి. బొప్పాయికాయ.

పొరకకట్ట రూ. పరక్కట్ట.

పొలి[2]

పొలికూడు వి. బలికూడు, జొన్నకూడును లేదా వరి కూడును వేపాకులో కలిపి చేటలో ఉంచి బలిపిల్ల రక్తాన్ని అందులో పట్టి కలిపి తయారుచేసిన కూడు. బలి కార్యక్రమం తర్వాత దీనిని గ్రామం పొలిమేరలో చల్లుతారు. పొలిపాటలు వి.బ.వ. బూతు పాటలు.

పొలుకలు వి.బ.వ. జాకెట్లు.

పొల్లయి చూ. పొల్ల[1]. వి. గ్రామాలలో వివిధ వృత్తుల వారికి ఇచ్చే సంవత్సర గ్రాసం.

పోగోడ వి. ప్రహరీగోడ.

పోటకలు వి.బ.వ. టపాకాయలు.

సం. స్ఫోటక-. పేలేది.

పోతు[1]

పోతు ఆకు వి. విస్తర్లు కుట్టటానికి ఉపయోగించే మోదుగ ఆకుల్లో గుండ్రంగా వెడల్పుగా ఉండే ఆకు.

పోయ వి. అత్త.

పోరు

పోరుట వి. వేపుడు.

పోలె[2] వి. 2. బొబ్బట్టు; 3. బూరె.

పోస్టుగ్రాడ్యుయేటు వి. స్నాతకోత్తర పట్టభద్రుడు, ఎమ్.ఏ., ఎమ్.కామ్., ఎమ్.ఎస్‌సి. మొ. పట్టా లేదా పట్టాలను పొందిన వ్యక్తి.

ఇం. *Postgraduate* బి.ఏ., బి.కామ్., బి.ఎస్‌సి. మొ. పట్టాను లేదా పట్టాలను పొంది ఎమ్. ఏ., ఎమ్.కామ్. ఎమ్.ఎస్‌సి. మొ. పట్టాకోసం చదువుకొనే లేదా స్నాతకోత్తర పరిశోధన చేసే వ్యక్తి.

< ఇం. Postgraduate (భారత దేశంలో ఈ పదం అర్థవిపరిణామం పొందింది).

**పౌరుషము** వి. **3.** అభిమానం.

సం. పౌరుష-. మగతనం, పరాక్రమం.

< సం. పౌరుష-. (అర్థవిపరి.).

**ప్యాలా** రూ. చూ. పేలా. వి. ఒకరకం గిన్నె, పానపాత్ర, కప్పు.

**ప్రగల్భము** వి. డంబం, గొప్ప.

సం. ప్రగల్భ-. చతురం, నేర్పు కల, దిట్టమయిన.

< సం. ప్రగల్భ-. (అర్థవిపరి.).

**ప్రగల్భాలు పలుకు** అ. క్రి. గొప్పలు చెప్పు, డంబాలు పలుకు.

**ప్రగల్భాలు పలుకు** చూ. ప్రగల్భము.

**ప్రచారము** వి. ఒక విషయాన్ని బాగా వ్యాప్తిలోకి తీసికొని రావటాని అందరికీ తెలియజేయటం.

సం. ప్రచార-. తిరగటం, సంచరించటం, నడవడి, కన్పించటం, వ్యాప్తి.

< సం. ప్రచార-. (అర్థవిపరి.).

**ప్రభ** వి. **2.** ఎడ్లబండిని అలంకరించి 30 లేదా 40 అడుగుల ఎత్తుగా ఉండేటట్లు వెదురుకర్రలతోను బద్దలతోను రంగు రంగుల కాగితాలతో ఉన్న నిర్మాణ విశేషం. దీనిని జాతర్లలో ఉపయోగిస్తారు.

**ప్రసంగం.** వి. శుభకార్యం.

సం. శుభప్రసంగ-. మేలయిన ప్రస్తావన.

< సం. శుభప్రసంగ-. సం. 'శుభ' - శబ్దం లోపించింది.

**ప్రసారం** వి. రేడియో (ప్రసారం) కార్యక్రమం.

సం. ప్రసార-. వ్యాపనం, వ్యాపించటం.

< సం. ప్రసార-. (అర్థవిపరి.).

**ప్రస్తావన** వి. విషయం.

సం. ప్రస్తావ-. స్తోత్రం, స్తుతించటం, ఆరంభం, ఉపోద్ఘాతం, అవతారిక, ఆముఖం.

< సం. ప్రస్తావన-. (అర్థవిపరి).

**ప్రొలుమాలిక** రూ. పాలుమారిక.

**ప్రియము** వి. ఎక్కువ ఖరీదు, అధికధర

సం. ప్రియ-. ఇష్టమైనది, అనురక్తం.

< సం. ప్రియ-. (అర్థవిపరి.).

**ఫలహారము** రూ. పలహారం, పలారం.

**ఫాజీ** రూ.మా. ఫాజీ. విణ **1.** నీచమైన; **2.** దుష్టమైన.

**ఫాటీ** రూ.మా. హాటీ.

**బగిడికాడు** వి. ముదుసలి.

క. బగుడ ఎక్కువ వయస్సుకల మనిషి.

**బగీచ** రూ.మా. బగీచా. వి. గృహారామం, తోట, ఉద్యానవనం.

**బగీచా** రూ. బగీచ.

**బగ్గ** రూ.చూ. బాగుగా. క్రి.విణ. **1.** చాలా; **2.** ఎక్కువగా.

**బంకు** వి. **8.** ముఖద్వారం పక్కన ఉన్న అరుగు.

**బంగారపు పిచ్చిక** చూ. బంగారము.

**బంగారము**

**బంగారపు పిచ్చిక** వి. ధనవంతుడు.

**బచ్చిన బొమ్మ** రూ.చూ. బచ్చెన బొమ్మ. వి. క్రరబొమ్మ.

**బచ్చెన బొమ్మ** రూ. బచ్చిన బొమ్మ.

**బజ్జీమేక** చూ. బజ్జ. వి. అమ్మవారి జాతరలో సాలు ముద్దలకు ఎదురుగా మొదట బలి ఇవ్వబడే మేక.

**బజ్జీమేకపిల్ల** వి. అమ్మవారి జాతరలో సాలుముద్దలకు ఎదురుగా మొదట బలి ఇవ్వబడే మేక.

**బంజమాట** చూ. బలిజ. వి. లింగాయతుల భాష.

**బంజవాళ్ళు** చూ. బలిజ. విణ.బ.వ. లింగాయతులు.

**బటాయి** వి. కౌలు.

హిం. బాంట్‌నా పంచటం, బాంటా భాగం; బటాఈ పంచే కార్యక్రమం.

< హిం. బటాఈ.

**బటారము**

సం. పట-. బట్ట, వస్త్రం.

**బటువు**

**బటువుగా** క్రి.విణ. సమంగా.

**బట్ట**[1]

**బట్టెద్దు** వి. తెలుపు ఎరుపు, తెలుపు, నలుపు వన్నె ఎద్దు. < బట్ట[1] + ఎద్దు.

**బట్టెద్దు** చూ. బట్ట[1].

**బడబడ**

**బడబడగా** క్రి.విణ.ద్రు. సన్నగా.

**బడుగండు** చూ. బడుగు.

**బడుగు**

**బడుగండు** వి. సోమరి. క. బడ్డు మాంద్యం, చురుకు లేకపోవటం.

**బడ్డు**[3]

క. బడ్డు వాడిలేమి, మొద్దయినది, మాంద్యం, చురుకుదనం లేకపోవటం.

< క. బడ్డు.

**బంటు** వి. **7.** ఒకటి నుండి తొమ్మిది వరకు ఉండే అంకె.

**బంటుపక్క సున్న** వి. నిరర్థకుడు, నిష్ప్రయోజకుడు.

సున్నకు ఒక అంకె ఎడమ పక్కన ఉంటేనే విలువ, స్వతహాగా ఏమీలేదు. దీన్ని బట్టి ఈ పలుకుబడి ఏర్పడింది.

**బండబారు** రూ.చూ. బండఁబాఱు. అ.క్రి. స్తంభించిపోవు, మొద్దుబారు.

**బండఁబాఱు** రూ. బండబారు.

**బత్తి**[1] వి. 2. పెట్రొమాక్స్ వంటి పెద్దదీపం.

**బండారము**

సం. భాండాగార- ధనగృహం, ఖజానా; పా. భండాగార ప్రా. భండాఆర-, భండాగార-, భండార-, ఉగ్రాణం, సరకుల కొట్టు, అ.మా. భండాగార-, భండార- ఉగ్రాణం, ఖజానా.

త. పంటారం ప్రభుత్వ లేదా ప్రజాసంబంధమైనది.

<ప్రా. భండార-.

**బండారము బయటపడిపోవు** అ.క్రి. రహస్యం వెల్లడి అగు.

**బండి** వి. 9. నాగటిచాలు. ఉదా. రెండుబళ్ళు ఇటు రెండుబళ్ళు అటు.

**బద్ద**

బద్దపప్పు వి. సెనగపప్పు.

**బద్దకము** వి. 3. సోమరితనం.

**బద్ది**

బద్దిగొఱ్ఱె వి. జాతర్లలో గ్రామదేవతలకు బలిగా ఇవ్వబడే గొర్రె. బద్దిపిల్ల వి. జాతర్లలో గ్రామదేవతలకు బలిగా ఇవ్వబడే గొర్రెపిల్ల. బద్దిమేక వి. అమ్మవారి జాతరలో సాలుముద్దలకు ఎదురుగా మొదట బలి ఇవ్వబడే మేక. బద్దిమేకపిల్ల వి. అమ్మవారి జాతరలో సాలు ముద్దలకు ఎదురుగా మొదటి బలి ఇవ్వబడే మేకపిల్ల.

**బద్దు**[3] వి. రోజు, దినం.

< ప్రొద్దు.

**బద్ధుఁడు** వి. పరవశుడు.

సం. బద్ధ- కట్టబడ్డవాడు.

<సం. బద్ధ-. (అర్థవిపరి.).

**బంద**[7] వి. నాణెం.

**బంది** రూ. బందీ[1].

**బందీ**[1] రూ.చూ. బంది. వి. బంధించబడ్డ వ్యక్తి.

**బందీ**[2] వి. ఖైదీ.

హిం.ఉ. బందీ ఖైదీ.

<ఉ. బందీ.

బందీలు వి.బ.వ. నాణేలు.

**బను** రూ. చెమ.

**బమిడి** వి. బంగారం.

సం. బ్రహ్మన్. బ్రహ్మ.

'బ్రహ్మముడి' పెళ్ళిలో వధూవరుల వస్త్రాంచలాలకు పురోహితుడు వేసే ముడి. దీనిని 'బ్రహ్మగ్రంథి' అంటారు. బ్రహ్మముడిలో కొంత బంగారం కట్టి ఉంటారు.

<బ్రహ్మముడి.

**బయితాయించు** రూ. బైఠాయించు.

**బయితాయింపు** చూ. బయితాయించు. రూ. బైఠాయింపు. వి. కదలకుండాకూర్చోవటం.

**బరగొడు** వి. గేదె, ఎనుము.

<బఱ్ఱె+గొడ్డు.

**బరంతి** వి. 2. పునాదిలో వేసే మట్టి.

**బరికి** వి. 3. కొబ్బరిచిప్ప.

**బరికె** రూ. బర్గె.

**బరుగు** చూ. బరగు[1]. అ.క్రి. పైకిపోవు.

**బర్కం** వి. బీడు.

సం. భారక-. బరువైనది.

**బర్కిలాపు** రూ.చూ. ఖర్కిలాఫ్. అవ్య. వ్యతిరేకంగా.

**బర్కిలాఫ్** రూ. బర్కిలాపు.

**బర్గె** రూ.చూ. బరికె. వి. సన్ననికట్టె.

**బలపము** వి. 3. రాతిముక్క.

**బలపాలు కట్టుకొని తిరుగు** అ.క్రి. రాతి ముక్కలు కట్టుకొని తిరుగు, ఎక్కువగా నడచు.

**బలపాలు కట్టుకొనితిరుగు** చూ. బలపము.

**బలి**[1]

బలికూడు వి. పొలికూడు, జొన్నకూడు లేదా వరికూడును వేపాకుతో కలిపి చేటలో ఉంచి బలిపిల్ల రక్తాన్ని అందులో పట్టి కలిపి తయారు చేసిన కూడు. బలిగోడు వి. బర్రె. < బలి[1] + గొడ్డు. బలిపిల్ల వి. 1. గొర్రెపిల్ల; 2. మేకపిల్ల. బలిమేక వి. అమ్మవారి జాతరలో సాలుముద్దలకు ఎదురుగా మొదట బలి ఇవ్వబడేమేక. బలిమేకపిల్ల వి. అమ్మ వారి జాతరలో సాలుముద్దలకు ఎదురుగా మొదట బలి ఇవ్వబడే మేక.

**బల్లె** రూ.చూ. వల్లియ. వి. చీర.

**బస్వన్న** చూ. పసుపు, వన్నె. వి. సీతాకోక చిలుక.

**బహుమానం** <సం. బహుమాన-. (అర్థవిపరి.).

**భాగములు** రూ. భాగాలు.

**బాగు**

బాగుగా రూ. బగ్గ.

**బాడి**[2] రూ. బాడీ. వి. బనియను.

ఇం. *Body* దేహం; *Bodice* లోరవిక.

**బాడీ** రూ.చూ. బాడి[2]. వి. బనియను.

**బాడువ** వి. 2. వంపు ప్రదేశం.

**బాదరబంది** రూ. బాదరబందీ.

**బాదరబందీ** రూ. చూ. బాదరబంది. వి. **1**. తగులాటం, ఇబ్బంది; **2**. జంజాటం.

**బాదు**[2] వి. **7**. తలుపు.

**బాధ్యత** వి. పూచీ, **responsibility**.

సం. బాధ్యతా బాధించబడే వాని భావం.

<సం. బాధ్యతా (అర్థవిపరి.).

**బాపు**[2] వి. నాన్న, అయ్య, తండ్రి.

హిం.ఉ. బాప్ అయ్య, తండ్రి.

<ఉ. బాప్.

**బాబక్కరం** రూ.చూ. బాబాకరము. వి. అత్యాశ.

**బాబాకరము** రూ. బాబక్కరం.

**బాయి**[1] రూ.చూ. పాయి[1].

**బాయి**[3] వి. స్త్రీ సంబుద్ధి వాచకం.

హిం. బాఈ స్త్రీల ఆదరసూచక శబ్దం.

<హిం. బాఈ.

**బారంగి** వి. **2**. అటుక.

**బారాయి** వి. బావి.

**బారిక**

**బారికాఁడు** రూ బారికేడు, బారికేడు రూ.చూ. బారికాడు, వి. తలారి.

**బారికాఁడు** చూ. బారిక.

**బారికేడు** రూ. బారిక.

**బారు**[3] వి. **5**. బారెడుకొలత.

**బాలు**[1] వి. బంతి.

ఇం. *Ball* బంతి.

<ఇం. Ball.

**బాలు**[2] వి. జుట్టు.

హిం.ఉ. బాల్ జుట్టు.

<ఉ. బాల్.

**బాల్చీ**

**బాల్చీతన్నివేయు** అ.క్రి. చనిపోవు. **బాల్చీతన్ను** అ.క్రి. చనిపోవు.

**బాల్పెన్ను** వి. ములికి పెన్ను.

ఇం. *Ball-pen* ఒకరకం పెన్, ఊట పెన్ కాని ఒకరకమైన ములికికలపెన్.

<ఇం. Ball-pen.

**బాశాలి**[2] వి. ఐశ్వర్యవంతుడు.

సం. భాగ్యశాలిన్ ఐశ్వర్యవంతుడు, ధనికుడు.

<సం. భాగ్యశాలిన్.

**బాసంది** వి. పాలకోవ.

**బాసింపట్టు** వి. పక్క మీద వేసుకొనే దుప్పటి, బెడ్‌షీటు.

**బాసుమతి** రూ.చూ. బాస్మతి. వి. పలావు, బిర్యానీ మొ. వాటిని చేసుకోవటానికిగాను ప్రధానంగా ఉపయోగపడే శ్రేష్ఠమైన వరి ధాన్య విశేషం.

**బాస్మతి** రూ. బాసుమతి. వి. పలావు, బిర్యానీ మొ. వాటిని చేసుకోవటానికిగాను ప్రధానంగా ఉపయోగపడే శ్రేష్ఠమైన వరి ధాన్య విశేషం.

హిం.ఉ. బాస్‌మతీ ధాన్య విశేషం.

<ఉ. బాస్‌మతీ.

**బిక్క** విశ. **6**. అమాయకమయిన.

**బింగి** వి. పిచ్చి.

**బిడారు** వి. **6**. వర్తకులు మజిలీలలో తాత్కాలికంగా వేసుకొనే గుడారం.

**బిడారువర్తకుఁడు** వి. సరుకులను తీసుకొని వర్తకులతో కలిసి దేశపర్యటన చేస్తూ క్రయవిక్రయాలను చేసుకొనే వణిజుడు.

**బిడుతు** వి. మగగొర్రెపిల్ల.

**బిడువు** వి. **5**. తీరిక.

**బిన్న** రూ. బెన్న.

**బియము** రూ. బీము[2].

**బిరావ** రూ. బెరీవ.

**బిరియాని** రూ. చూ. బిర్యానీ. వి. పలావు వంటి భక్ష్య విశేషం.

**బిరియానీ** రూ. చూ. బిర్యానీ. వి. పలావు వంటి భక్ష్య విశేషం.

**బిర్యాని** రూ.చూ. బిర్యానీ. వి. పలావు వంటి భక్ష్య విశేషం.

**బిర్యానీ** రూ. బిరియాని, బిరియానీ, బిర్యాని. వి. పలావు వంటి భక్ష్య విశేషం.

హి.ఉ. బిర్యానీ పలావు వంటి భక్ష్య విశేషం.

<ఉ. బిర్యానీ.

**బిళ్ల**[1]

**బిళ్ళప్ప** వి. ఒక రకం తినుబండారం.

**బెమ** రూ.చూ. బమ. వి. ఇష్టం.

**బీడా** వి. కిళ్ళీ.

ఉ. బీడా కిళ్ళీ.

<ఉ. బీడా.

**బీమా** రూ. భీమా. వి. **2**. అభయం చీటీ.

**బీము**[2] రూ.చూ. బియము. వి. బియ్యం.

**బీరుపోవు** అ.క్రి. **2**. ఆశ్చర్యపడు.

**బుక్క**[2] వి. **2**. ముద్ద.

**బుగులు** రూ. గుబులు.

**బుట్ట** రూ. బొట్టాం, బొట్టి[3].

**బుడకు** స.క్రి. వెదుకు.

**బుడంకాయ** చు. బుడము².
**బుడబుడక** వి. డమరు కంటె చిన్నదయిన వాద్య విశేషం.
**బుడబుడకలోడు** విశ. గ్రామానికి సంవత్సరంలో జరిగే మంచి చెడ్డల్ని చెప్పేవాడు.
**బుడమ**²
**బుడంకాయ** వి. దోసకాయ. <బుడమ²+కాయ.
**బుడంబాల్** వి. ఆటలలో తాకరాదని తెలిపే నిషేధక శబ్దం.
**బుడిగ**
**బుడిగపవురు (-చమురు)** వి. మట్టిదీపం లోని చమురు.
**బుడుబుంగలు** వి.బ.వ. వేరుసెనగలు.
**బుడ్డ**¹ విశ. పొట్టి.
**బుడ్డి**¹ వి. **12**. కిరోసిన్ దీపం.
**బుడ్డి**² వి. ముసలమ్మ.
హిం. బూఢీ ముసలిది; బుఢీ
<హిం. బుఢీ.
**బుడ్డెడు** విశ. పదికిలోలు.
**బుద్ది** వి. **4**. ఇష్టం.
**బురిడీ**
**బురిడీకొట్టించు** స.క్రి. మోసపుచ్చు, మోసగించు.
**బువ్వమ్మ** వి. **2**. వృద్ధస్త్రీ
**బుస** వి. **4**. గాలి.
**బెజ్జాబువ్వ** వి. వరి అన్నం.
**బెట్ట**¹ వి. **4**. అలసట.
**బెడ్**
**బెడ్‌షీటు** ఇం. *Bed-Sheet* దుప్పటి.
<ఇం. Bedsheet.
**బెన్న** రూ.చూ. బిన్నా. అవ్య. త్వరగా.
**బెంబాడి** రూ. బొంబాడి. విశ. వ్యర్థాలయిన. తాళ్ల.సం. 6.162.
**బెయ్** రూ.చూ. వెయి. వి. వెయ్యి, సహస్రం.
**బెరీవ** రూ.చూ బిరాన. క్రి.విశ. త్వరగా.
**బెరుకు** రూ. చూ. బెఱుకు. వి. **1**. సంకోచం; **2**. భయం.
**బెఱుకు** రూ. బెరుకు².
**బెలిగించు** రూ. చూ. వెలిగించు. స.క్రి. దీపాదుల్ని జ్వలింపచేయు.
**బెల్లంకొట్టినరాయి** చూ. బెల్లము.
**బెల్లపన్నం** చూ. బెల్లము.
**బెల్లము**
**బెల్లంకొట్టినరాయి** వి. ఏమన్నా ఏం చేసినా ఉలుకూ పలుకూ లేని వ్యక్తి. **బెల్లపన్నం** వి. పరమాన్నం, క్షీరాన్నం. సం. అన్న-. వంటకం, ఆహారపదార్థం. బెల్లము + సం. అన్న -+- ము.
**బేకు**² విశ. **1**. సన్నగా ఉన్న; **2**. పొడుగ్గా ఉన్న.
**బేకు**⁴ అ.క్రి. కావాలి.
క. బేకు కావాలి.
<క. బేకు.
**బేఖూ** రూ. చూ. బేవకూఫ్. విశ. **1**. మూర్ఖుడు; **2**. చదువు రానివాడు; **3**. బుద్ధిలేనివాడు.
**బేచారా** విశ. **1**. నిస్సహాయుడు; **2**. జాలిపడతగ్గవాడు.
హిం.ఉ. బేచారా నిరుపాయుడు, నిస్సహాయుడు.
<ఉ. బేచారా.
**బేద్రి** వి. టమోటా.
**బేమాని** వి **1**. సిగ్గులేనివాడు; **2**. వ్యర్థుడు.
హిం.ఉ. బేమానీ నిరర్థకమైన, వ్యర్థమైన.
త. పేమాని సిగ్గులేనివాడు.
<ఉ. బేమానీ.
**బేరి**²
**బేరికాయలు** వి.బ.వ. సీమరేగుకాయలు.
**బేలాయకు** రూ.చూ. బేలాయఖు. విశ. తగని.
**బేలాయఖు** రూ. బేలాయకు.
**బేవకూఫ్** రూ. బేఖూ. విశ. **1**. మూర్ఖుడైనవాడు; **2**. చదువురానివాడు; **3**. బుద్ధిలేనివాడు.
హిం.ఉ. బేవకూఫ్ బుద్ధిలేనివాడు, మూర్ఖుడు.
త. పేకూప్ చదువురాని, బుద్ధిలేని, వివేకంలేని.
<ఉ. బేవకూఫ్.
**బేవారసు** రూ. బేవార్సు.
**బేవార్సు** రూ.చూ. బేవారసు. వి. అనాథ. విశ. హక్కుదారుకానివాడు.
**బేషరతు** వి. ఏ షరతులేకపోవటం.
హిం. ఉ. బేషర్త్ షరతులేకుండటం.
< ఉ. బేషర్త్.
**బేషరమ్** వి. నిర్లజ్జ, సిగ్గులేకపోవటం.
హిం.ఉ. బేషర్మ్ నిర్లజ్జ, సిగ్గులేకపోవటం.
<ఉ. బేషర్మ్.
**బేసబెల్లి** వి. **1**. సిగ్గు. తాళ్ల.సం. 18.222; **2**. జంకు; **3**. మౌగ్ధ్యం.
**బేసుమట్టం** రూ. బేస్‌మట్టం.
**బేస్‌మట్టం** వి. **1**. పునాది; **2**. భూమట్టానికి పైన పునాది గోడ మీదనుంచి శాల్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.
**బైఠక్** వి. డ్రాయింగ్ రూం.

హిం. బైఠక్ కూర్చునేచోటు, ఆసనం, ఆధారం. < హిం. బైఠక్.

బైఠాయించు రూ.చూ. బయిఠాయించు. అ.క్రి. కదలకుండా కూర్చుండు.

బైఠాయింపు రూ. బయిఠాయింపు, కదలకుండాకూర్చోవటం.

బైఠాయింపు చూ. బైఠాయించు.

బైనోళ్ళు విణ.బ.వ. హరిజన కులస్థులు, వీరు ఎల్లమ్మ, మాతమ్మ మొ. వారి జాతర్లలో పాల్గొంటారు. జమిడిక, దిమ్మె, సుతి వీరి వాద్యాలు.

బైపోతు వి. ముంగిస.

బైముకాయలు రూ.చూ. బైముక్కాయలు. వి.బ.వ. వేరుసెనగకాయలు.

బైముక్కాయలు రూ. బైముకాయలు.

బొగ్గడ చూ. బొగడ[1]. వి. ఎత్తుప్రదేశం.

బొంగు

బొంగులు వి.బ.వ. మొరమొరాలు, బొరుగులు.

బొచ్చిలిచెట్టు చూ. చొచ్చు[1]. వి. తుమ్మచెట్టు.

బొట్టాం రూ.చూ. బుట్ట వి. ధాన్యం పోసే వెదురుగంప.

బొట్టి[3] రూ.చూ. బుట్ట. వి. ధాన్యం నిల్వ ఉంచే బుట్ట.

బొట్టు[1]

బొట్లపుటిక వి. చుక్కపెట్టె. సం. పుటికా పెట్టె.

బొట్లపుటిక చూ. బొట్టు[1].

బొడ్డారు చూ. బొడ్డు.

బొడ్డి వి. 3. స్త్రీ సంబుద్ధివాచకం.

బొడ్డు

బొడ్డారు వి. బొడ్డువరకు బెల్టుగా దిగవేసే వృషభాలంకార విశేషం. < బొడ్డు + వారు[3]. బొడ్డురాయి వి. గ్రామమధ్యలో అవతరించినరాయి. మనిషికి బొడ్డు ఏవిధంగా మధ్యభాగమో ఆవిధంగా ఊరికి ఇది (బొడ్డురాయి) ఉంటుంది.

బొండి[2] విణ. మొండి.

బొండికొట్టు అ.క్రి. గిజగిజలాడు.

బొంగ్రికె వి. గొంతు.

బొద్దు

బొద్దువారు వి.బ.వ. ఎద్దులనడుములకు సన్నని చర్మం (వారు) తో తయారుచేసిన బెల్టు.

బొంద[2]

బొందలగడ్డ వి. శ్మశానం.

బొంద[3] రూ. బొంది[4].

బొంది[4] రూ.చూ. బొంద[3] వి. తూము.

బొందేలు వి.బ.వ. కాలిమట్టెలు.

బొన్నె వి. వదిన.

బొప్ప వి. 2. అన్న.

బొమ[1]

<ప్రా. భమయా.

బొంబాటం వి. బ్రహ్మాండం.

సం. బ్రహ్మాణ్డ- భువనగోళం.

బొంబాడి రూ.చూ. బెంబాడి. విణ. వ్యర్థాలయిన.

బొమ్మ[2]

బొమ్ముప్పలు వి.బ.వ. నిలువుగా ఉన్న చిన్నరాళ్ళు. < బొమ్మ[2] + ఉప్ప + - లు.

బొమ్మాళ్ళించు స.క్రి. బోర్లించు.

బొమ్ముప్పలు చూ. బొమ్మ[2].

బోకు

బోకులు వి.బ.వ. అంట్లు.

బోగట్టా రూ.చూ. భోగట్టా. వి. సమాచారం, వివరం.

బోగబంద రూ.చూ. బోగబందా. వి. తాకట్టు.

బోగబందా రూ. బోగబంద.

బోగుడ వి. మట్టిదిబ్బ.

బోడి

బొడెద్దు వి. గాడిద. < బోడి + ఎద్దు.

బోడు[1] వి. 6. చెట్లు, రాళ్ళుకల ప్రాంతం.

బోడెద్దు చూ. బోడి.

బోద[2]

బోదపుల్లలు వి.బ.వ. రెల్లుగడ్డిపుల్లలు.

బోద[4] వి. మత్తు కలిగించడం, కళ్ళుతిరగడం.

ఉ. బోదా. మత్తుకలగడం, కళ్ళుతిరగడం.

< ఉ. బోదా.

బోనగొట్టె చూ. బోనము.

బోనము

బోనగొట్టె వి. జాతరలో బోనం కూడును అమ్మవారికి ఎదురుగా ముద్దగా పెట్టి దానిముందు బలి ఇవ్వటానికి సిద్ధంగా ఉంచిన గొట్టె. < బోనము + గొట్టె. బోనాలు వి.బ.వ ఒకకొత్తకుండను పసుపు కుంకుమలతో పూజించి పసుపుకొమ్మును కట్టిన పోగుదారాన్ని ఈ కొత్తకుండకు కట్టి అందులో బియ్యం, పెసరపప్పు, బెల్లం, నెయ్యి, పాలు పోసి వండుతారు. దీన్ని బోనం అంటారు. ఈ బోనాన్ని అమ్మవారికి మెరవణిగా తీసుకుపోయి సమర్పిస్తారు.

బోనాలు చూ. బోనము.

బోబు వి. 2. కోడిపిల్ల.

బోరు[1] వి. 2. చిన్నకొండ; 3. గుట్ట.

బ్రహ్మ

బ్రహ్మకాయ వి. 2. వదరుబోతు, వాచాలుడు. సం. బ్రహ్మన్ సృష్టికర్త. వ్యు. వాగుడుకాయలోని 'కాయ' ను బ్రహ్మ పదానికి కలిపి బ్రహ్మకాయశబ్దాన్ని కల్పించి ఉంటారు.

బ్రహ్మచారి వి. పెళ్ళికాని యువకుడు.

సం. బ్రహ్మచారిన్ వేదాలు పఠించే పెళ్ళికాని బ్రాహ్మణ యువకుడు, బ్రహ్మచర్యాశ్రమాన్ని స్వీకరించినవాడు.

<సం. బ్రహ్మచారిన్. (అర్థవిపరి.).

బ్రహ్మరథం వి. వేదాలు చదివే విప్రులు రథంలాగుతుండగా సమస్త వైభవాలను అనుభవిస్తూ పయనించటం. అత్యధిక గౌరవానికి ఉపయోగించే పదం బ్రహ్మరథం.

సం. బ్రహ్మరథ- బ్రాహ్మణులచే లాగబడేరథం.

<సం. బ్రహ్మరథ- (అర్థవిపరి.).

బ్రహ్మరథంపట్టు అ.క్రి. ఘనంగా సత్కరించు.

బ్రహ్మరాత వి. అర్థంకాని రాత (లేఖనం).

సం. బ్రహ్మన్ సృష్టికర్త. బ్రహ్మప్రతిజీవితలమీద కొన్ని అక్షరాలురాస్తాడని ఆ అక్షరాలు మానవులకు కనపడవనీ పెద్దలు చెపుతుంటారు. కాబట్టి 'బ్రహ్మరాత' అంటే తెలియనిరాత అని అర్థం కలిగింది.

బ్రహ్మాండం విణ. 1. గొప్పది, భాగ. 8.572; 2. పెద్దది; 3. అద్భుతమయినది; 4. అతివిశాలమయినది.

సం. బ్రహ్మాండ భూమివంటి అనేక గోళాల సముదాయం.

<సం. బ్రహ్మాండ- (అర్థవిపరి.).

బ్రెడ్ రూ. బ్రెడ్డు. వి. నాన్‌రొట్టె.

ఇం. *Bread* నాన్‌రొట్టె.

<ఇం. Bread

బ్రెడ్డు రూ.చూ. బ్రెడ్. వి. నాన్‌రొట్టె.

బ్రోకరు వి. దళారి, మధ్యవర్తి.

ఇం. *Broker* దలారి.

<ఇం. Broker.

భడ్‌కల్ వి. ముఖద్వారానికి ఆని ఉన్న అరుగు.

హిం.ఉ. బడా పెద్ద.

<ఉ. బడా + కల్లు[2].

భరణం వి. జీవితం గడవటానికి ఇచ్చేడబ్బు, పొలం మొ.వి.

సం. భరణ- వహించేది, మోసేది, పోషణం, పోషణసాధనం, భోజనం, కూలి.

<సం. భరణ - (అర్థవిపరి.).

భరతంపట్టు

సం. భరత- నాట్యశాస్త్రకర్త భరతమహర్షి నాట్యశాస్త్రానుగుణంగా పాడేవాళ్ళ పని భరతం పట్టడం. ఆడేవాళ్ళపని నాట్యంచేయడం. అవతలి వ్యక్తిని ఆడించటానికి భరతం పట్టాలి. కాలక్రమేణ ఈ పదానికి వేధించటం, ఏడ్పించడం, బాధించటం మొ. అర్థవిశేషాలు అర్థవిపరిణామకారణంగా వచ్చాయి.

<సం. భరత - + - ము + పట్టు[11].

భరతవాక్యము వి. ముగింపు, సమాప్తి.

సం. భరతవాక్య- నాట్యశాస్త్రాన్ని సంస్కృతంలో రచించినవాడు భరతమహర్షి. ప్రతినాటకానికి చివర భరతవాక్యం ఉంటుంది. భరత వాక్యాన్ని ఎవరైనా పలకవచ్చు.

<సం. భరతవాక్య- (అర్థవిపరి.).

భరతవాక్యముచెప్పు అ.క్రి. ముగించు. భరతవాక్యముపలుకు అ.క్రి. ముగింపు చెప్పు. భరతవాక్యముపాడు అ.క్రి. ముగించు.

భరిణ

భరిణపురుగు వి. బొద్దింక.

భాగాలు రూ.చూ. బాగములు. వి.బ.వ. వక్కలు, పోకచెక్కలు.

భాగోతం వి. వీధినాటక విశేషం.

సం. భాగవత-. పద్దెనిమిది పురాణాల్లో ఒకటి అని చాలా మంది భావన. ఇది పోతన భాగవతానికి మూలగ్రంథం, భగవత్సంబంధమైనది.

<సం. భాగవత-.

భానులు వి.బ.వ. అనేక విధాలు.

సం. భాను-. ప్రకాశం, సూర్యుడు.

<సం. భాను-. (అర్థవిపరి.).

భీమా రూ.చూ. బీమా. వి.1. అభయపు చీటీ; 2. ఏ విధమైన ఆర్థిక సహాయాన్నైనా డబ్బు తీసుకొని పూర్తి చేసే బాధ్యత.

భూతద్దం వి. చిన్నవస్తువులను పెద్దగా చూపే అద్దం లేదా లెన్స్.

సం. భూత-. దయ్యం, పిశాచం.

<సం. భూత- + అద్దము (మిశ్రస.).

భోగట్టా రూ. బోగట్టా. వి. సమాచారం, వివరం.

సం. భోగపట్ట-; ప్రా. భోగవట్ట-; ఒ. భోగట్టా వివరం, సమాచారం.

<ఒ. భోగట్టా.

భౌష్యము వి. భవిష్యత్తు.

సం. భవిష్యత్ జరగబోయేది; భవిష్య-. భవిష్యం, జరగబోయేది.

<సం. భవిష్య-.

భ్రమ వి. 1. భ్రాంతి, భిన్నంగా గ్రహించటం. వాసి.రా. 1.59; 2. కామ విషయికమైన కోరిక. ఉ.ర. 4.196; 3. ఇష్టం; 4. ప్రేమ.

సం. భ్రమ- చలనం, తిరుగటం, గుండ్రంగా తిరగడం, తికమక.

<సం. భ్రమ-. (అర్థవిపరి.).

మకరి వి. కొత్తమట్టికుండ.

సం. మకరీ ఆడమొసలి.

<సం. మకరీ (అర్థవిపరి.).

మకుటం వి. శతకాల్లో పద్యం చివరి పాదంలో ఉండే పదం లేదా చివరి పాదం. ఉదా. సుమతీ, విశ్వదాభిరామ ! వినురవేమ.

సం. మకుట-; ముకుట-. కిరీటం.

<సం. మకుట-. (అర్థవిపరి.).

మక్కెండ్లు రూ.చూ. మక్కెన్లు. వి.బ.వ. మొక్కజొన్నకంకులు.

మక్కెన్లు రూ. మక్కెండ్లు. చూ. మక్కె[2]. వి.బ.వ. మొక్కజొన్నకంకులు.

మగత[2] రూ.చూ. మాక్తా. వి.1. ఒప్పందం; 2. అద్దె; 3. శిస్తు.

మగ్దూరి వి. కసిసం.

హిం. ఉ. మక్‌దూర్ శక్తి, సామర్థ్యం.

<ఉ. మక్‌దూర్.

మంగళము వి. 3. ముగింపు.

మంగళసూత్రము వి. తాళిబొట్టులు ఉంచేతాడు.

సం. మంగళసూత్ర-. శుభమైనతాడు.

<సం. మంగళసూత్ర-. (అర్థవిపరి.).

మచ్చ[1]

మచ్చనాలుక మనిషి వి. 1. మచ్చ ఉన్న నాలుక కలవ్యక్తి; 2. రహస్యం దాచలేని వ్యక్తి; 3. అబద్ధాలాడే వ్యక్తి.

మచ్చము రూ.చూ. మచ్చెము. వి. చేప. తాళ్ల.సం. 15.202.

మచ్చెము రూ. మచ్చము.

మట్టగిలబడు (-పడు) చూ. మట్టు[1]. అ.క్రి. జబ్బుపడు.

మట్టము

మట్టముగా క్రి.విణ. పూర్తిగా.

మట్టసము చూ. మట్టసము. వి. మర్యాద.

మట్టి

మట్టికరపించు స.క్రి. ఓడించు. వ్యు. కుస్తీలో గెలిచినవాడు. ఓడినవాడినోట్లో మట్టి (దుమ్ము) పెట్టేవాడు.

మట్టు[1]

మట్టేయు స.క్రి. తొక్కివేయు. < మట్టు[1] + వేయు.

మట్టేయు చూ. మట్టు[1].

మడవిలి రూ.చూ. మడివాలు. వి. చాకలి.

మడి[4] రూ.చూ. మఱి[1]. అవ్య. మరి, ఇంకా.

మడివాలు రూ. మడవిలి.

మడుగు రూ.చూ. మణుఁగు[2]. వి. మడి, పరిశుద్ధి.

మడుఁగు[1].

మడుఁగుదామర రూ. మణుఁగుదామర. వి. నమస్కారి.

మడువు వి. 12. కిలోగ్రాములు.

మడ్డోలుడు వి. చాలా సమర్థుడు.

మణియకాఁడు రూ. మణేగారు.

మణుఁగు[1]

మణుఁగుదామర రూ.చూ. మడుఁగుదామర వి. నమస్కారి. మణుఁగుపువ్వులు రూ.చూ. మణుఁగుబూవులు. వి.బ.వ. జంతికలు. మణుఁగుబూవులు రూ. మణుగుపువ్వులు. వి.బ.వ. జంతికలు.

మణుఁగు[2] రూ. మడుగు.

మణేగారు రూ.చూ. మణియకాఁడు. వి. గ్రామాధికారి, గ్రామ మునసబు.

మండు

మండేవాడు విణ. సూర్యుడు.

మండేవాడు చూ. మండు.

మతకము[1]

మతకరితనము రూ.చూ. మతకారితనము. వి. మాయ. మతకారితనము రూ. మతకరితనము. వి. మాయ.

మతకరితనము చూ. మతకము[1]

మతకారితనము చూ. మతకము[1].

మతి వి. 2. విధం, రీతి.

మదుము వి. 4. కాలిమట్టెలు.

మద్ది

మద్దిరంగం వి. పులిజూదం.

మనాది రూ.చూ. మనియాద. వి. మనోవ్యథ, మనసులోని బాధ.

మనియాద రూ. మనాది, మనేద. వి. మనోవ్యథ, మనసులోని బాధ.

సం. మనోవ్యథా మానసిక బాధ.

<సం. మనోవ్యథా.

మనీ అవ్య. ఆగు.

మను[2]

మనుపాల వి. హాలు.

మనేద రూ.చూ. మనియాద. వి. మనసులోనిబాధ, మనోవ్యథ.

మనోరంజిత రూ.చూ. మనోరంజితము వి. సంపెంగ.

**మనోరంజితము** రూ. మనోరంజిత. వి. సంపెంగ.
**మందడి**[2]
**మందడిగోడ** వి. రెండిళ్ళకు మధ్య ఉండేగోడ.
**మందల**[2]
**మందలించు** స.క్రి. **8**. పలకరించు.
**మందల**[3] చూ. ముందర. వి. **1**. చెప్పవలసిన విషయం; **2**. కబురు.
**మందిరం** వి. గుడి, దేవాలయం.
సం. మందిర-. గృహం, ఇల్లు, శరీరం, పట్నం, తొడ.
<సం. మందిర-. (అర్థవిపరి.).
**మర్నాడు** రూ.చూ. మఱునాఁడు. వి. 1 మరుసటిరోజు; **2**. ఎల్లుండి.
**మర్యాద** వి. గౌరవం. భాగ. 8.592.
**మఱి**[1] రూ. మడి[4].
**మఱు**[2] మఱునాఁడు రూ. మర్నాడు.
**మలగు** వి. దిండు.
క. మలగు తలగడ, దిండు
<క. మలగు.
**మలగులాలు** రూ. మల్లగులాలు.
**మలి**
**మలిగడుపు (-కడుపు)** వి. బంక విరోచనాలు.
**మల్లగులాలు** రూ.చూ. మలగులాలు. వి.బ.వ. **1**. అయోమయం; **2**. కష్టాలు; **3**. తనలో తాను తర్కించుకోవటం.
**మల్లగుల్లాలు** వి.బ.వ. **3**. తనలోతాను తర్కించుకోవటం.
**మల్లగుల్లాలుపడు** అ.క్రి. తర్జన భర్జన చేయు, చర్చించు.
**మల్లె**[1] వి. **4**. తెల్లగా చీము పట్టిన గుల్ల.
**మవకూపు** రూ. మొవుఖూపు, మోకూప్, మోకూఫ్, మోకూప్తు, మోకూబ్, మోకోబు, మోఖూపు, మోఖూబ్, మోఖోబు.
**మశల** వి. **2**. అటక.
**మసాబు** రూ.చూ. ముసాబు. వి. మబ్బులు.
**మసి** వి. **5**. పల్లపుభూమి, కూరగాయలు కాసే భూమి.
**మస్తి** వి. **2**. కొవ్వు.
**మహారాజు** వి. భోగి, ఏలోటు లేని వ్యక్తి.
సం. మహారాజ-. రాజులకు రాజు, గొప్పరాజు.
<సం. మహారాజ-. (అర్థవిపరి.).
**మాక్తా** రూ. మగత[2].
**మాగ**[2] చూ. మాఁగు. వి. తేమ.
**మాగి** రూ. మాఘి.
**మాఘి** రూ.చూ. మాగి. వి. చలికాలం.
**మాంగల్యం** వి. వివాహ సమయంలో వరుడు వధువు మెడలో కట్టే సూత్రం.
సం. మాంగల్య-. శుభప్రదం, శుభసూచకం, సంతోషదాయకం, శుభం, అభివృద్ధి.
<సం. మాంగల్య-. (అర్థవిపరి.).
**మాదరించు** స.క్రి. వేయించు.
**మాదరింపు** వి. పొడికూర.
**మాదిరింపు** చూ. మాదరించు.
**మానభంగం** వి. శీలాన్ని అపహరించటం, శీలకరణం.
సం. మానభంగ-. అగౌరవం, అవమానం.
<సం. మానభంగ- (అర్థవిపరి.).
**మానము** వి. **4**. సిగ్గు.
**మానావతి** వి. **2**. ముగ్ధ, గయ్యాళికి వ్యతిరేకపదం. తాళ్ల.సం. 18.224.
**మావి**[3] రూ.చూ. మావిక[1]. వి. మావిక.
**మావిక**[1] రూ. మావి[3].
**మానుషము** వి. **1**. గౌరవం, భార.విరా. 2.70; **2**. పరాక్రమం. వరాహ. 3.47; **3**. అభిమానం. విరంకు. 2.96.
సం. మానుష- మనుష్య సంబంధమైనది.
<సం. మానుష- (అర్థవిపరి.).
**మాపిడి** చూ. మాపు[1].
**మాపు**[1]
**మాపిడి** వి. రాత్రి.
**మాయి**
**మాయిటేల** వి. రాత్రి. సం. వేలా సమయం.
<మాయి + సం. వేలా.
**మార్ఫియా** వి. మాదక ద్రవ్య విశేషం. ఇది ఆరోగ్యానికి చాలా ప్రమాదం.
ఇం. *Morphia* నల్లమందు నుంచి తయారుచేసిన మాదక ద్రవ్య విశేషం.
<ఇం. Morphia.
**మార్వాణం** చూ. మాఱు. వి. పునర్వివాహం.
**మాసికం** వి. నెలనెల పెట్టే తద్దినం.
సం. మాసిక-. నెలకు సంబంధించినది.
<సం. మాసిక-. (అర్థవిపరి.).
**మిజ్జు** స.క్రి. తిను.
**మిట్ట**
**మిట్టపెత్తనము** వి. పైనుండి హంగామాచేస్తూ ఇతరులకు సూచనలను ఆజ్ఞలను జారీ చేస్తూ అధికారాన్ని చలాయించటం. 'మిట్ట' అంటే ఎత్తైన ప్రదేశం. ఏమీ చేయకుండా పైనుంచే పెత్తనాన్ని చలాయించటమన్నమాట.
**మింటిదీపము** చూ. మిన్ను.
**మిత్త**

మిత్తమ్మ వి. **2**. పిన్ని. మిత్తయ్య వి. **2**. చిన్నాన్న.

మినకరబూచి చూ. మినుకు[1]. వి. మిణుగురు పురుగు.

మిన్ను

మింటిదీపము వి. **1**. ఆకాశదీపం; **2**. తాత్కాలిక వైభవం; **3**. తాత్కాలిక సుఖం.

మిమిక్రీ వి. ధ్వన్యనుకరణం.

ఇం. *Mimicry* ధ్వన్యనుకరణం లేదా చేష్టాను కరణం.

<ఇం. Mimicry.

మిరుగు[2] రూ.చూ. మెడసరి. వి. జ్యేష్ఠమాసంలో వచ్చే మృగశిర కార్తె.

మిర్జి వి. చొక్కా.

మిసర రూ.చూ. మెడసరి. వి. జూన్ నెల రెండో భాగంలో ప్రవేశించే మృగశిర కార్తె.

మీమాంస వి. సంశయం, సందేహం.

సం. మీమాంసా లోతుగా తెలిసికోవటం, పరిశీలన, పరిశోధన.

<సం. మీమాంసా. (అర్థవిపరి.).

ముకాబిలా రూ. మొఖాబిళ్ళ.

ముకు[1]

ముకునత్తు వి. ముక్కు పుడక, ముక్కుకు పెట్టుకొనే 'నత్తు' అనే ఆభరణ విశేషం.

ముకుర దీక్ష వి. **1**. దుశ్శీలత; **2**. అలంకార ప్రియత్వం.

సం. ముకుర-. అద్దం. దీక్షా యజ్ఞ వివాహాది కార్యాలలో అవలంబించే నియమం, నియమం, గట్టిపట్టుదల మంత్రోపదేశం.

సం. ముకురదీక్షా అద్దాన్ని చూస్తూ అలంకరణ కోసం కాలక్షేపం చేయటం.

మధ్య యుగాల్లో వేశ్యాపుత్రి నియుక్త వయస్సు వచ్చినప్పుడు కన్నెరికం ఏర్పాటుచేసి వృత్తిలో ప్రవేశ పెట్టేవాళ్ళు. జన్మకారకుడని వేశ్య విశ్వసించిన వ్యక్తిని కూర్చోబెట్టి వేశ్యా కన్యకు అద్దాన్ని చూపేవారు. దీన్ని ముకురదీక్ష అనేవారు.

<సం. ముకుర దీక్షా. (అర్థవిపరి.).

ముక్క

ముక్కసినిమా వి. వార్తల సినిమా.

ముక్కు[1]

ముక్కుకుగవ్వేసి అవ్య. నిలవనీయకుండా. ముక్కుపచ్చలారని విణ. **2**. అమాయిక మయిన.

ముగ్గ[2] చూ. ముగ్గు[2]. విణ. ఎక్కువ.

ముగ్గు[1]

ముగ్గులోకిదిగు అ.క్రి. పనిలోకి ప్రవేశించు. ముగ్గులోనికిదించు స.క్రి. పనిలోకి ప్రవేశ పెట్టు.

ముంగ[3] విణ. **2**. శబ్దంకాని. తాళ్ల.సం. 11.2/20.

ముంగి[1]

ముంగిపోతు వి. **1**. మగముంగి; **2**. కదలక మెదలక మాటలాడక ఉండేవాడు.

ముచ్చొక చూ. మూ-.

ముజరా[1] రూ. ముదల[2]కు మారుగా ముదల[3].

ముజాఫరు వి. విజయి, విజేత. నె.శా. 3. సం. ఉదయగిరి. క్రీ. శ. 1661.62.

ఉ. మజఫ్ఫర్ విజయి, విజేత.

<ఉ. ముజఫ్ఫర్.

ముట్టి

ముట్టిపొగరు వి. అహంకారం.

ముట్టు[3]

ముట్టుపెట్టు అ. క్రి. ఆటలలో దాటివెళ్ళరాదనే నియమాన్ని విధించు.

ముత్తాళ్ వి. **1**. మూర్ఖుడు; **2**. వెధవ.

త. ముట్టాళ్ మూర్ఖుడు.

<త. ముట్టాళ్.

ముదుకుమెద్దు చూ. ముదుకు. వి. జబర్దస్తీ.

ముదుపు వి. **5**. లంచం.

ముత్యువ వి. చావు, మృత్యువు.

సం. మృత్యు-. చావు, మృత్యు దేవత.

<సం. మృత్యు-.

ముదనష్టము

సం. మృతనష్ట-. చనిపోవటం.

<సం. మృతనష్ట-.

ముదల[2] రూ. ముసరా.

ముది

ముదివాపపాని వి. వయసుకు మించి మాటలాడే చిరుప్రాయపుపిల్ల.

ముదుసలి

ముదుసలితనము రూ.చూ. ముసలితనము. వి. వార్ధకం, ముసలితనం.

ముద్ద[1] వి. **8**. జొన్నకూడును లేదా వరికూడును కుంబంగా రాసిపోసి కొన్ని ముద్దలుగా చేసి అమ్మవారికి ప్రతీకలుగా భావించి కుంకుమతో బొట్లు పెట్టి పూజిస్తారు. ఈ ముద్దలకు రాయలసీమలో బలుల్ని కూడా ఇస్తారు.

ముద్దర

ముద్దరసుద్దిగా క్రి.విణ. **1**. శుభ్రంగా; **2**. కచ్చితంగా. సం. శుద్ధి-. పరిశుభ్రం.

మునంగ చూ. మునుంగు. క్రి.విణ. ఎక్కువగా.

**మునగాకు** చూ. మునగ. క్రి.విణ. ఎక్కువగా.

**మునాది**

**మునాదిచేయు** అ.క్రి. 1. ప్రకటనచేయు; 2. చాటింపచేయు.

**మునాసపడు** అ.క్రి. తొందరపడు.

**ముసు**

**ముసుగొంగుమాయు** (-కొంగుమాయు) అ.క్రి. గర్భవతి అగు.

**ముంత** వి. 8. చెంబు.

**ముంత మామిడిపప్పు** వి. జీడిపప్పు.

**ముఫ్తి** వి. న్యాయాధికారి.

త. ముస్తి, మూస్తి మహమ్మదీయ న్యాయాధికారి.

ఉ. ముఫ్తీ న్యాయంచెప్పేవారు, టర్కీ తెగలో ప్రధాన న్యాయాధికారి.

<ఉ. ముఫ్తీ.

**ముబారకు** 1. ఒక బిరుదు. ద.హిం.శా. సంపు. 10.759 శా.సం. క్రీ.శ. 1663; 2. బహుమానం; 3. అభినందన.

ఉ. ముబారక్ శుభాన్వితం, ధన్యవాదం, అభినందన.

<ఉ. ముబారక్.

**మురుకు** వి. 4. జంతిక.

**ములికి**

**ములికిపెన్ను** వి. బాల్‌పెన్. ఇం. *pen* కలం.

<ములికి + ఇం. Pen.

**ముల్లు**

**ముల్లుగట్టి** వి. 2. ఎద్దుల్ని తోలటానికి ఉపయోగించే కఱ్ఱ.

**మువంచి** రూ.చూ. ముద్వంజి. వి. గంజాం మొదలు గోదావరి వరకు దక్కను కృష్ణా, కర్నూలు, మొ. ప్రాంతాల్లో పెరిగే మొక్క. (Grewia excelsa).

**మువబంతి** రూ.చూ. ముకుబంతి². వి. ముట్టిబంతి, విపరీతంగా తుమ్మటం, ముక్కుల వెంబడినీళ్ళు చీమిడికారి, రోగం ముదిరితే తుమ్మినప్పుడు ముక్కునుంచి పడేకండ.

**మువల్చు** రూ.చూ. ముద్వలసు. వి. ఉత్తర సర్కారులు, దక్కను, కర్ణాటకల్లోని అడవుల్లో పెరిగే మొక్క. (Grewia hirsuta).

**ముని** రూ.చూ. ముద్వి. వి. నీలగిరుల్లో పెరిగే చెట్టు. (Alphonsea lutea).

**మువురు** రూ.చూ. ముప్వురు. సర్వ.బ.వ. ముగ్గురు.

**ముద్వ** చూ. మూ-.

**ముద్వకోడియు** చూ. మూ-.

**ముద్వకోడె** చూ. మూ-.

**ముద్వగల వన్నెమెకము** చూ. మూ-.

**ముద్వంక** చూ. మూ-.

**ముద్వంకపట్టీసె** చూ. మూ-.

**ముద్వంకమురువు** చూ. మూ-.

**ముద్వంకమేను** చూ. మూ-.

**ముద్వంచ** చూ. మూ-.

**ముద్వంచాకు** చూ. మూ-.

**ముద్వంచు** చూ. మూ-.

**ముద్వంజి** రూ. మువంచి. వి. గంజాం నుంచి గోదావరి వరకు, దక్కను, కృష్ణా మొ. ప్రాంతాల్లో పెరిగేమొక్క (Grewia excelsa).

**ముద్వంటులనాడు** చూ. మూ-.

**ముద్వంటులు** చూ. మూ-.

**ముద్వదోనె** చూ. మూ-.

**ముద్వన్నియువేల్పు** చూ. మూ-.

**ముద్వన్నె** చూ. మూ-.

**ముద్వన్నెకాఁడు** చూ. మూ-.

**ముద్వన్నెమెకము** చూ. మూ-.

**ముద్వన్నెమెగము** చూ. మూ-.

**ముద్వన్నెవిల్లు** చూ. మూ-.

**ముద్వపసరము** చూ. మూ-.

**ముద్వము** విణ. మెత్తని, నునుపైన.

**ముద్వలసు** రూ. మువల్చు. వి. ఉత్తరసర్కారులు, దక్కను, కర్ణాటకల్లోని అడవుల్లో పెరిగేమొక్క. (Grewia hirshta).

**ముద్వి** రూ. ముని. వి. నీలగిరుల్లో పెరిగే చెట్టు (Alphonsea Lutea).

**ముద్వీసము** చూ. మూ-.

**ముప్వురు** రూ. ముగురు, ముగ్గురు, మువురు, మూగురు, మూవురు. సర్వ.బ.వ. ముగ్గురు, కలమళ్ళశాసనం క్రీ.శ. 600-625, ఛార.ఆది 309.

క. మూవర్ ముగ్గురు; కొడ. మువె ముగ్గురు; తు. ముద్వెరు ముగ్గురు; త. మూవర్ ముగ్గురు; మ. మూవర్ ముగ్గురు; కొండ. మూయెర్ ముగ్గురు పురుషులు; ముణ్డి మూడువస్తువులు, ముగ్గురు స్త్రీలు; పర్జి. మూవిర్ ముగ్గురు పురుషులు; మూయల్ ముగ్గురు స్త్రీలు; కొలా. ముగ్గుర్ ముగ్గురు; నా ముగ్గుర్ ముగ్గురు;

<మూ.ద్రా. *మూవర్.

**ముద్వెట్టి** చూ. మూ.

**ముద్వెట్టిగొను (కొను)** చూ. మూ-.

**ముద్వెత** చూ. మూ-.

**ముద్వెలఁగు** చూ. మూ-.

**మువ్వెల్గు** చూ. మూ-.

**మువ్వేలుపులయిక్క** చూ. మూ-.

**మువ్వేలుపులు** చూ. మూ.

**ముప్వేల్పుటిక్క** చూ. మూ-.

**ముశావము** రూ.చూ. ముసావము. వి. పుణ్యస్త్రీ మరణించినపుడు దినంరోజున కాలవదగ్గర ముత్తైదువలకు చేటలో ఇచ్చే అద్దం, దువ్వెన, కాటుక, కుంకుమ, మొ. వస్తువుల సముదాయం.

**ముష్జరు** రూ. ముసజ్జీ. వి. చిత్రవిచిత్రలతాయుత వస్త్రవిశేషం. హంస. 5.354.

ఉ. ముష్జర్ తీగలు మొ. వాటిని అల్లిన వస్త్రవిశేషం.

<ఉ. ముష్జర్.

**ముషయిరా** రూ. ముషైరా. వి. కవిసమ్మేళనం.

హిం. ముశాఅరా కవులు కలిసేచోటు.

ఉ. ముషాఅరా కవులు కలిసే చోటు.

<ఉ. ముషాఅరా.

**ముషిడి** రూ.చూ. ముసిండి. వి. వృక్షవిశేషం.

**ముషిడిపిక్క** వి. విషంవలె పనిచేసే ముసిడిపిక్క.

**ముషైరా** రూ.చూ. ముషయిరా. వి. కవిసమ్మేళనం.

**ముషిని** రూ.చూ. ముసిండి. వి. లేత ఆకుపచ్చరంగు పూలు పూచే చెట్టు (Strychnos nuxuomica).

**ముష్కరము** విణ. **1**. చెడ్డ, దుష్టమైన. దశా. 7.1.129; **2**. దీనమైన; **3**. మూర్ఖమైన.

సం. ముష్కర- పెద్ద వృషణాలు కల.

<సం. ముష్కర-. (అర్థవిపరి.).

**ముష్కరుఁడు** వి. **1**. మూర్ఖుడు. భార. ఉద్యో. 3.348, 4.81; **2**. కృపణుడు, దీనుడు, భార. ఆరణ్య. 6.165; **3**. దుష్టుడు.

సం. ముష్కర- పెద్ద వృషణాలుకల.

<సం. ముష్కర-. (అర్థవిపరి.).

**ముష్కీ** వి. నల్లగుర్రం. కువల. 3.147.

ఉ. ముష్కీ నల్లనిగుర్రం. కస్తూరివలె నల్లగా ఉండే అశ్వం. పా. ముష్కీ నల్లసముద్రం, నల్లని; హిం. ముశ్కీ కస్తూరివలె నల్లగా ఉండే గుర్రం, నల్లగుర్రం.

<ఉ. ముష్కీ.

**ముష్టాముష్టి** అవ్య. పిడికిళ్లతో పొడుచుకొంటూ. భార. ఆరణ్య. 3.395. 'అన్యేషామపిదృశ్యతే' (అష్టాధ్యాయీ 6-3-137) అనే సూత్రవాక్యలో 'ముష్టాముష్టి' అసాధువని సిద్ధాంతీకరించబడింది.

సం. ముష్టి- పిడికిలి ముష్టి ముష్టి- పిడికిళ్ళతో దెబ్బలాడుకోవడం, యుద్ధం. 'కేశాకేశి' సామ్యంవల్ల 'ముష్టాముష్టి' ఏర్పడింది.

**ముష్టి**[1] వి. **1**. బిచ్చం. చంద్రాంగ. 2.223; **2**. పిడికెడు బియ్యం మొ. వి. **3**. సోగ, దుస్నేటపుడు పట్టుకోటానికి మేడివివర అమర్చిన అడ్డపుల్ల; **4**. మరమగ్గంలో ఒక సారుగులోంచి మరొక సారుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళనుగుంజేపిడి.

సం. ముష్టి- పిడికిలి.

<సం. ముష్టి -. (అర్థవిపరి.).

**ముష్టితాడు** రూ. ముట్టితాడు. వి. మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టినదారం. **ముష్టియెత్తు** (-ఎత్తు[1]) స.క్రి. అడుక్కొను, యాచించు. **ముష్టియెత్తుకొను** (- ఎత్తుకొను) స.క్రి. బిచ్చమెత్తు, అడుక్కొను. **ముష్టివాఁడు** విణ. బిచ్చగాడు. **ముష్టివెట్టు** (- పెట్టు) స.క్రి. బిచ్చంవేయు. శుక. 3.346.

**ముష్టి**[2] రూ.చూ. ముసిండి. వి. లేత ఆకుపచ్చరంగుపూలు పూసే చెట్టు. (Strychnos nuxvomica).

**ముష్తయిదు** రూ.చూ. ముస్తీదు. విణ. సంసిద్ధం. ద.హిం.శా. సంపు. 10 శా. సం. 762,15 క్రీ.శ. 1668.

**ముష్తాజరి** రూ.చూ. ముస్తాజరీ. వి. గుత్తాధిపత్యం.

**ముష్తాజరీ** రూ.చూ. ముస్తాజరి. వి. గుత్తాధిపత్యం, గుత్తాధికారం.

**ముసగస** రూ. ముసగెస. వి. **1**. కోపాన కలిగే చిరచిర. రాఘవ. 4.49 కకుత్స. 3.91; **2**. గుసగుస. ధ్వన్యను.

ముసగసలాడు అ.క్రి. గుసగుసలాడు.

<ముసగస + -లు + ఆడు.

**ముసగెస** రూ.చూ. ముసగస. వి. గుసగుస.

**ముసజ్జీ** రూ.చూ. ముష్జరు. వి. చిత్రవిచిత్రల తాయుత వస్త్రవిశేషం.

**ముసదరు** రూ.చూ. ముసదరు. వి. మూడురకాలు బే.ప. 60.

**ముసద్ది** రూ. ముసద్దీ, ముసరద్ది, వి. లేఖకుడు, వ్రాయసకాడు. లక్ష్మీ. 4.17.

**ముసద్దీ** రూ.చూ. ముసద్ది. వి. లేఖకుడు. వ్రాయసకాడు.

**ముసద్దీపేచీ** వి. **1**. రాత రుసుం ముట్టని విషయంలో రాతకాడు రాతలో చూపేలోపం; **2**. మధ్యవర్తియొక్క మడత సంభాషణం; **3**. ఉభయవాదులభావాలు విడకపోవడం.

**ముసనాబు** వి. **1**. అసలు, ఉత్తమమైనది. రాజవా. 2.43; **2**. అందలం పక్కతెర. దశా. 7.129.

ఉ. ముసన్నాబిహీ మూలం, అసలు.

పార ముసన్నఫ్ రచించిన.

<ఉ. ముసన్నాబిహీ.

**ముసపు** వి. **1**. కోరిక, అభిలాష, వరాహ. 11.56; **2**. ముచ్చట.

**ముసపు** వి. ఒకరకం వరితెగులు.

హిం.ఉ. ముసీబత్ ఆపద.

**ముసముస** వి. **1.** పంది మూర్కొవటంలోని ధ్వనికి అనుకరణం. భాగ. 3.413; **2.** ముసరటం, కమ్ముకోవటంలోని అనుకరణం. కవిక. 4.166. ప్రబంధ. 186; **3.** కోపంవల్ల కలిగే చిరచిర. భాను 3.24; **4.** పడిసెం పట్టినప్పుడు బిడ్డలు విడిచేశ్వాసల ధ్వనికనుకరణం.

**ముసముసమను** రూ.చూ. ముసముసయను. అ.క్రి. 1. ముసముసమని ధ్వనిచేయు, కవిక. 4.166; 2. కోపం వలన చిరచిరలాడు. < ముసముస + అను. **ముసముసయును(-అను)** రూ. ముసముసమను. అ.క్రి. కోపంతో చిరచిరలాడు. భాగ. 10. ఉ. 1269. **ముసముసలాడు** అ.క్రి. బిడ్డలు పడిసెంతో ముసముస అని శ్వాసించు. <ముసముస + - లు + ఆడు.

**ముసంబి** రూ.చూ. మోసంబి. వి. బత్తాయి.

**ముసంమాతు** విశ. పేరుగల.

హిం. ముసమ్మీ పేరుగల, పైచెప్పబడ్డ.

ఉ. అర. ముసమ్మా పేరుగల, పైన చెప్పబడిన, అర్థమైన, పేరు పెట్టబడిన.

<ఉ. ముసమ్మా.

**ముసర**[1] రు.చూ. ముసురు[1]. వి. రుజ్జు, ఎడతెరిపిలేకుండా పడే సన్నవాన.

**ముసర**[2] వి. **1.** పశువుల కాళ్ళకి, నోటికి వచ్చేరోగం; **2.** పశువు ఎక్కువగా పారుకొనే కలరావంటి జబ్బు.

**ముసర గుండె** వి. ముసరలో వచ్చే దొమ్మవాపు. **ముసరతొట్టి** వి. పశువులకు నీళ్ళు పెట్టే మట్టితొట్టి. **ముసరవల్ల** వి. నెత్తురు పారుకొనే రోగం. **ముసరపిల్ల** వి. నెత్తురు పారుకొనే రోగం. **ముసరమూత** వి. ఒళ్ళంతా బిళ్ళలు కట్టి అవిచితికి చీముకారటం. **ముసరపాచేతు** వి. ముక్కునుండి నీరు కంటినుండి రక్తం కారేజబ్బు.

**ముసరద్ది** రూ.చూ. ముసద్ది. వి. లేఖకుడు, వ్రాయసకాడు. వేణు. 16

**ముసరా** రూ.చూ. ముదల[2]. వి. ఉత్తర్వు, ఆజ్ఞ.

**ముసరికొను** చూ. ముసరు.

**ముసరు** రూ. ముసురు[2]. అ.క్రి. **1.** పర్వు, వ్యాపించు. కు.సం. 9.119; **2.** పైబడు, భార.విరా. 4.230.

క. ముసుకు, ముసుగు, ముసుబ్ దాచు, మూయు, కప్పు. త. మూచు (మూచి-) అలుముకొను, వ్యాపించు. మూగు, మూసు, మూచల్ గుమికూడటం. మెయ్ (-ప్ప-,-త్త-) గుమికూడు, మూదు, మొయ్‌ప్పు గుంపు.

**ముసరికొను** స.క్రి. చుట్టుకొను, పరివేష్టించు. భార.-విరా. 1.300. అ.క్రి. కలియు, పర్వు, వ్యాపించు, హరి.ఉ. 6.14. < ముసరు +-ఇ[11] + కొను.

**ముసర్లతేనె** వి. పెద్దతేనెటీగలు అడవులలో పెట్టే తేనెపట్టులోని తేనె. ఇది మామూలు తేనె కంటె మధురంగా ఉంటుంది.

**ముసలంపుట్టు** అ.క్రి. అపాయం కలుగు. మహాభారతంలో యాదవ నిర్మూలనకోసం నారద శాపవశాన ముసలంపుట్టింది. దాన్నిబట్టి ఈ అర్థం కలిగింది.

సం. ముసల-. రోకలి, దుడ్డుకర్ర, శస్త్ర వైద్యంలో ఉపయోగించే పనిముట్టు.

<సం. ముసల -+- ము + పుట్టు.

**ముసలయ్** రూ.చూ. ముసలవాయి. వి. చెరువు నీళ్ళు బయటికి పోవటానికున్న తూములో పైతూము.

**ముసలవాయి** రూ. ముసలయ్, ముసలాయం, ముసలాయి. వి. చెరువు నీళ్ళు బయటికి పోవటానికి ఉన్న తూములో పైతూము.

**ముసలవాయిమొద్దు** వి. చెరువులో పై తూము మూసే మొద్దు. **ముసలవాయిరోలు** వి. చెరువు నీళ్ళు బయటికి పోవటానికున్న తూములో పైదాని రంధ్రం.

**ముసలాయం** రూ.చూ. ముసలవాయి. వి. చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూములోపైది.

**ముసలాయంపట్టె** రూ. ముసలాయి పట్టె. వి. పెడదబ్బ, రెండునొగల బండి నొగలకు వెనక వైపున బంధించిన కర్ర.

**ముసలాయి** రూ.చూ. ముసలవాయి. వి. చెరువు నీళ్ళు బయటికి పోవటానికి ఉన్న తూములో పైతూము.

**ముసలాయిపట్టె** రూ.చూ. ముసలాయంపట్టె. వి. అడ్డపట్టె, బండి పరంలోని అడ్డపట్టె.

**ముసలి**[1] రూ.చూ. ముదుసలి. విశ. **1.** వృద్ధమైన. మను. 47; **2.** వృద్ధుడు. రాజవా. 1.56.

**ముసలితనము** రూ. ముదుసలి తనము. వి. వృద్ధత్వం, ముదిమి. విక్ర. 2.157. **ముసలిది** విశ. వృద్ధురాలు. **ముసలివక్క** వి. **1.** వృద్ధజంబుకం; **2.** కుయుక్తులు పన్నే ముసలి వ్యక్తి. **ముసలివగ్గు** వి. మిక్కిలి ముసలిది (నిరసనద్యోతకం). కళా. 13.27. **ముసలివాఁడు** విశ. వృద్ధుడు.

**ముసలి**[2] వి. ఉడుం.

**ముసలి**[3] వి. ఎలుకజీడి, స్ఫోటకోఫ, నేలతాడి.

**ముసలిదా** రూ.చూ. మసుదా. వి. మతలబు.

**ముసలిమాను** రూ. చూ. ముసల్మాను. వి. మహమ్మదీయుడు. వసు. 1.45.

హిం.ఉ. ముసల్మాన్ ఇస్లాం ధర్మానుయాయి; అర. ముస్లీమ్, ముస్లీమన్ మహమ్మదీయుడు; పార. ముసుల్‌మాన్ మహమ్మదీయుడు; మరా. ముసల్‌మాన. హిం. ముసల్‌మాన్.

<ఉ. ముసల్మాన్.

**ముసల్మాను** రూ.చూ. ముసలిమాను. వి. మహమ్మదీయుడు. E.C. 9, ఆనెకల్ 13. క్రీ.శ. 1733, విశ్వే.శ. 30.

ముసళ్ళపండుగ చూ. ముసురు[1]. వి. 1. కష్టం; 2. ఆపద.

ముసాకట్లవెధవ చూ. మశానము. వి. 1. అప్రయోజకుడు; 2. ఒక తిట్టు.

ముసానము రూ. మశానము. వి. పుణ్యస్త్రీ చనిపోయి-నప్పుడు దహనానంతరకాలంలో కాలవ దగ్గర పునిస్త్రీలకు ఇచ్చే చేటతో కూడిన అద్దం, దువ్వెన, కాటుక, కుంకుమ మొదలైన వస్తువుల సముదాయం.

సం. శ్మశాన-. కాడు, శ్మశానం.

<సం. శ్మశాన-.

ముసానమ్మ వి. 1. మూగిదేవత, ఒకానొక గ్రామ-దేవత. కాశీ. 5.289; 2. ఏమీ తెలియనట్లుండేది, అమాయకురాలు. <ముసానము + అమ్మ.

ముసానమ్మ చూ. ముసానము.

ముసాపరు రూ.చూ. ముసాఫరు. వి. యాత్రికుడు.

ముసాపు రూ.చూ. ముసాబు. వి. నానుడువాన, ముసాబు.

ముసాపురిఖానా రూ. ముసాపురుఖానా, ముసాఫరుఖానా. వి. ధర్మశాల.

హిం. ముసాఫిర్‌ఖానా యాత్రికులుండే చోటు.

ఉ. ముసాఫిర్‌ఖానా పార. ముసాఫిర్‌ఖానహ్. అర. ముసాఫిర్‌ఖానా ధర్మశాల, ప్రయాణికుల సౌకర్యార్థం నిర్మితమయిన బంగళా.

<ఉ. ముసాఫిర్‌ఖానా.

ముసాపురఖానా రూ.చూ. ముసాపురిఖానా. వి. ధర్మశాల.

ముసాపురుచేయు చూ. ముసాఫరు. అ.క్రి. ప్రయాణంచేయు.

హిం.ఉ. ముసాఫిరీ ప్రయాణం.

<ఉ. ముసాఫిరీ + చేయు.

ముసాఫర్ రూ.చూ. ముసాఫరు. వి. యాత్రికుడు.

ముసాఫరి రూ. ముసాఫరీ, ముసాఫిరి. వి. 1. క్యాంపు; 2. ప్రయాణం.

హిం. ముసాఫిరీ ప్రయాణం, యాత్ర. ఉ.పార. ముసాఫిరి.

క. ముసాపరి; త. ముసాపిరి; మ. ముసావరి.

<ఉ. ముసాఫిరీ.

ముసాఫరీ రూ.చూ. ముసాఫరి. వి. 1. క్యాంపు; 2. ప్రయాణం.

ముసాఫరు రూ. ముసాపరు, ముసాఫర్. వి. యాత్రికుడు.

హిం. ఉ. ముసాఫిర్ ప్రయాణికుడు, బాటసారి;

క. ముసాఫర్ ప్రయాణికుడు, బాటసారి; త. ముచాపర్, ముచావరి ప్రయాణికుడు, ప్రయాణం, క్యాంపు పోవడం; మ. ముసావరి.

<ఉ. ముసాఫిర్.

ముసాఫరుఖానా రూ.చూ. ముసాపురిఖానా. వి. ధర్మశాల, యాత్రికులుండేశాల.

ముసాఫిరి రూ.చూ. ముసాఫరి. వి. దూరేపోయ్యేవాడు.

ముసాబు చూ. ముసురు[1]. రూ. ముషాబు, ముసాపు. వి. నానుడువాన, వేమన. 2.422.

కొండ మొసాప్ మబ్బులు కమ్మి ఉండటం.

ముసాంబరము రూ.చూ. ముసాంబ్రము. వి. దళసరి ఆకులు కలిగి కంచెల్లో పెంచబడే మొక్క (Aloe Vera Cofficinals).

ముసాంబ్రము రూ. ముసాంబరము. వి. ఒక రకం మందు వస్తువు.

హిం. ముసాంబర్, ముసబ్బర్. ఓషధి విశేషం; ఉ. ముసంబర్ ఓషధి విశేషం.

<ఉ. ముసంబర్.

ముసాయిదా రూ.చూ. మసూదా. వి. చిత్తురాత, మతలబు.

ముసార రూ.చూ. ముసురు[1]. వి. ఎడతెరిపిలేకుండా పడేవాన.

ముసి[1] వి. 1. అసత్యం, బొంకు, రామాభ్యు. 8.230; 2. బాధ.

సం. మృషా అబద్ధం, బొంకు.

<సం. మృషా.

ముసిముట్టు అ.క్రి. 1. చిక్కు; 2. బాధపడు.

ముసి[2] చూ. మసి. వి. 1. ఒళ్ళు ఏదైనా రంగులో ఉండి, మెడనల్లగా ఉండేది; 2. తెలుపు నలుపు కలిసిన రంగు; 3. వరిపైరు బాగాపెరగటం.

ముసికి మొద్దు వి. తుమ్మ, చింత, వేప మొదలైన వృక్షజాతులకు చెందిన దుంగ.

ముసికెజొన్న వి. గింజను బొంతు పూర్తిగా ఆవరించి ఉండేకంకి గల రకం జొన్న.

ముసించు అ.క్రి. 1. చెడు. ద్వి.సార.చ. 1.692. పం, 2. చెడ్డకాలానికి చెడుబుద్ధి పుట్టు.

క. ముచ్చులు కలత చెందు, స్పృహతప్పు; త. ముచి నశించు, చెడు, జీర్ణమగు; మ. ముషిక్క కుళ్ళు, చెడు.

ముసిణి రూ.చూ. ముసిడి. వి. ముష్టిచెట్టు, ఇస-కనేలల్లో బాగా పెరిగే కంచెమొక్క. (Strychnos huxvomica).

ముసిడి రూ. ముషిడి, ముషిని, ముష్టి, ముసిణి, ముసివి, ముస్టె, ముస్తి, వి. 1. ముష్టిపండు. భార.ఉద్యో. 3.333; 2. ముష్టి చెట్టు. వైజ. 3.121.

సం. ముష్టి-. వనస్పతి విశేషం; ప్రా. మూసండీ, ముసుంఢీ వనస్పతి విశేషం; అమా. ముసండీ వనస్పతి విశేషం, ముష్టి వనస్పతి విశేషం, పర్జి. మూటి.

<ప్రా. ముసండీ.

ముసిడిపండు వి. పయోముఖ విషకుంభం, పైకి

వన్నెగా ఉన్న విషప్రాయమైన పండు, నవమశ్శి. 52.
**ముసివగవు** వి. చిరునవ్వు.
**ముసిని** రూ.చూ. ముసిండి. వి. కంచెమొక్క. ఇసక నేలల్లో బాగా పెరిగే ఒక రకం మొక్క (Strychnos huxvomica).
**ముసిపు** విశ. అధికం. తాళ్ల.సం. 15.109.
**ముసిమి** వి. ప్రేమానుబంధం. వేంక.పంచ. 4.153.
**ముసిముసి** విశ. మందం, అలతి (నవ్వు), చిరునవ్వు. శృం.నై. 7.191 హర. 5.58. క్రి.విశ. మందంగా, మెల్లగ (నవ్వు) విప్ర. 4.37.
**ముసిముసివగవు** వి. చిరునగవు. **ముసిముసి నవ్వు** వి. చిరునవ్వు. తాళ్ల.సం. 17.529.
**ముసిలి** రూ. చూ. ముదుసలి. వి. వృద్ధత్వం, వార్ధకం.
**ముసుకు**[1] రూ.మూ. ముసువు. వి. కప్పడు, అవగుంఠనం.
**ముసుకుగుడ్డ** వి. అవగుంఠనంగా వేసుకునే గుడ్డ.
**ముసుకు**[2] రూ.మూ. ముసురు[1]. వి. ఎడతెరిపి లేకుండా పడేసన్నవాన.
**ముసుగ్గమ్మి** చూ. ముసుఁగు.
**ముసుగ్గుడ్డ** చూ. ముసుఁగు.
**ముసుఁగు** రూ.చూ. ముసువు[1]. వి. 1. కప్పడు, అవగుంఠనం. నిర్వ.రా. 1.65, 2. గవిసెన, పండగల్లో ఎద్దువీపు మీద వేసే చిత్ర వస్త్రం.
**ముసుగ్గమ్మి** రూ. చూ. ముసుఁగుకమ్మి. వి. చీరకట్టుకొన్నప్పుడు తలమీద కప్పు కొనే చెరగు, చీర చివరి మూరెడు భాగం. **ముసుగ్గుడ్డ** వి. లంబాడీ ఆడవాళ్ళు తలమీదకప్పుకొనేబట్ట, అంచులకు వేరే పోగులు మలిపి రకరకాల డిజైన్లలో నేసేబట్ట. <ముసుగు + గుడ్డ. **ముసుఁగుకమ్మి** రూ. ముసుగ్గమ్మి. వి. చీర కట్టుకొ-న్నప్పుడు తలమీదకప్పుకొనే చెరగు, చీరచివరి మూరెడు భాగం. **ముసుఁగుకొను** అ.క్రి. కమ్ముకొను. వైజ. 2.148. **ముసుఁగుచీర** వి. 1. ఆడవాళ్ళు తలమీద కప్పుకొనే పెద్ద కొంగుచీర; 2. ఒక రకం డిజైనుచీర. **ముసుఁగు చెక్క** వి. 1. అచ్చుపట్టి, అడుసుపలక. కుసి తగిలించడానికి రంధ్రం ఉంచి దర్వాజాపై కమ్మి మీద పరిచిన చెక్క; 2. మరమగ్గం సారుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **ముసుఁగుడు** వి. అవగుంఠనం, కప్పడు. **ముసుఁగుడువడు (-పడు)** అ.క్రి. కప్పడువడు, ఆచ్ఛాదితమగు. భార.భీష్మ. 1.240. **ముసుఁగుంట్లు** వి.బ.వ. 1. మొగమాటం; 2. ముసు-గులో గుద్దులాటలు. **ముసుఁగుదన్ను (-తన్ను)** స. క్రి. 1. మరుగుపర్చు. పాండు. 3.10; 2. ఆచ్ఛాదించు, కప్పుకొను, ముసుగు పెట్టుకొను. కళా. 7.148. **ముసుఁగుపచ్చలు** వి.బ.వ. ఒక దినుసువడ్లు. **ముసుఁగుపట్టె** వి. ముసుగుచెక్క. కుసి తగిలించడానికి రంధ్రం ఉంచి దర్వాజాపైకమ్మిమీద పరచిన చెక్క. **ముసుఁగుపడు** రూ.చూ. ముసుఁగువడు. అ.క్రి. 1. వ్యాపించు, కమ్ము. 2. ఆచ్ఛాదితమగు, కప్పబడు. **ముసుఁగుపాలుసేయు (-చేయు)** స.క్రి. విగతభర్తృకలను చేయు. తాళ్ల.సం. 11.3.112. **ముసుఁగుబండ** వి. దర్వాజా ఉత్తరాసి మీద పరిచేబండ. **ముసుఁగుబద్ద** వి. మడత రెక్కల తలుపులు కలిసేచోట బిగించిన జవబద్ద. **ముసుఁగుబొంద** వి. మట్టలూడని తాటి మొ. చిన్నచెట్టు. **ముసుఁగులో గుద్దులాట** వి. 1. రహస్యవాదులాట; 2. మొగమోటమి. **ముసుఁగువడు (-పడు)** రూ. ముసుఁగుపడు. అ.క్రి. 1. వ్యాపించు, కమ్ము. భార.ఆరణ్య. 6.14; 2. ఆచ్ఛాదితమగు, కప్పబడు. మను. 4.37. **ముసుఁగు వాఱు(-పాఱు)**[2] అ.క్రి. వ్యాపించు. కవిరా. 1101. **ముసుఁగువేయు** స.క్రి. కప్పు, ఆచ్ఛాదించు. సారంగ. 179.
**ముసుండి** వి. సమూహం. కు.సం. 6.37.
**ముసుపు** చూ. ముసుగు. వి. ముసుగు.

క. ముసుమ్బు, ముసుమ్బె తొడుగు, ముసుగు, మేలిముసుగు.
**ముసురం** రూ.మా. ముసురు[1]. వి. ఎడతెగని వాన (ఈ వాన కురిసేటప్పుడు ఆకాశం మేఘాలతో నిండి ఉంటుంది).
**ముసురు**[1] రూ. ముసర[1]. ముపార, ముసుకు[2], ముసురం, ముసువు[2], ముస్రు, మూసర. వి. 1. ఎడతెగని వాన, నిరంతర వర్షం; కు.సం. 6.13; 2. అన్నం.

పెం. ముంచుడ్ దినొమ్, ముంచుడ్దీన వర్షర్తువు; గ. ముడిసింద్ దిన్ వర్షర్తువు; గోం. ముసుర్, ముసుడ్ వర్షం; కొండ ముసుర్ నిరంతర వర్షం, మబ్బులు కమ్మి ఉండటం, మొసాప్ ముసాబు.

**ముసురుకుండ** వి. గంజి, పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడేబుంగ మూతి మట్టికుండ. **ముసురుకురియు** అ.క్రి. జడిపట్టివానకురియు, నిరంకు. 46. **ముసురుకొను** అ.క్రి. 1. కవియు, ఆవరించు. భార. కర్ణ. 2.274; 2. ఎడతెగక కురియు. జైమిని.భా. 6.87. **ముసురుక్రమ్ము** అ.క్రి. ఎడతెగకుండా వానకురియు. **ముసురుతేనె** వి. ఒకరకం తేనె. ప్రబంధ. 112. **ముసురుపట్టు** అ.క్రి. జడిపట్టు. **ముసురుమూతి** వి. కోపవికారం కల ముఖం. **ముసురుమూతితనము** వి. కోపిష్ఠితనం. **ముసురు-మూతివాఁడు** విశ. కోపవికారం గల మూతివాడు.
**ముసురు**[2] రూ.మా. ముసరు. స.క్రి. 1. వ్యాపించు; 2. గాలి బాగాలేనప్పుడు తూర్పార పోసే వాడికి మరొకడు ఎదురుగా నిలబడిచేటతో విసురు.

**ముసురుకవియు** రూ.చూ. ముసురుగవియు. అ.క్రి. వ్యాపించు. **ముసురుగవియు (-కవియు)** రూ. ముసు-రుకవియు. అ.క్రి. కవియు, వ్యాపించు, ముసురుకొను. భార. ఉద్యో. 2.226.

(6A)

**ముసువు**[1] రూ. ముసుకు[1], ముసుంగు. వి. కప్పడు, అవగుంఠనం కాశీ. 7.206.

క. ముచ్చక, ముచ్చికె, ముచ్చిగె, మూత. ముచ్చు-లికె. త. ముచ్చు (ముచ్చి-) కప్పు (క్రి.), మూయ్. (-వ్-, ర్-, ముయు) మోయు, నింపు; తొ. ముచ్-మూయు. నా. మస్- కప్పు; కొలా. ముస్స్ పైది. పర్జి. కప్పుకొను; పెంగొ, మండ, ముచవ్ పాతిపెట్టు, మాల్తొ. ముచె మూయు, ముస్గె కట్టుకట్టు, బ్రా. మస్ మూయుబడ్డది.

**ముసువు**[2] రూ.చూ. ముసురు[1]. వి. నిరంతర వర్షం, ఎడతెగని వాన.

**ముష్టి** రూ.చూ. ముసిండి. వి. ముసిడి, వృక్ష విశేషం. కలు.శ. 37.

**ముస్తయిదు** రూ.చూ. ముస్తీదు. వి. సజ్జీకృతం, సిద్ధం. ద్వ.హిం. శా.సంపు. 10. శా.సం. 762, క్రీ.శ. 1669.

**ముస్తాజరా** రూ.చూ. ముస్తాజరీ. వి. ఏకాధికారి, గుత్తగాడు, 2. హక్కుదారు.

**ముస్తాజరీ** రూ. ముష్తాజరి, ముష్తాజిరి, ముస్తాజరా. వి. గుత్తాధిపత్యం, గుత్తాధికారం.

ఉ.అర.పార. ముష్తాజరీ ఏకాధికారం, గుత్తాధిపత్యం.

హిం. ముత్తాజరీ ఏకాధికారం, గుత్తాధిపత్యం.

<ఉ. ముష్తాజరీ.

**ముస్తాజరు** వి. గుత్తగాడు, హక్కుదారు.

ఉ.అర.పార. ముష్తాజిర్ హక్కుదారు, ఏకాధికారంకల వ్యక్తి.

<ఉ. ముష్తాజిర్.

**ముస్తాదు** రూ.చూ. ముస్తీదు. విణ. సంసిద్ధం. రంగా. 2.198.

**ముస్తాబు** రూ.చూ. ముస్తీదు. విణ. 1. సంసిద్ధం. పద్మ.యు. 127; 2. దుస్తులు మొ. వేసుకోవటం.

**ముస్తాబుచేయు** అ.క్రి. అలంకరించుకొను.

**ముష్టి** రూ.చూ. ముసిండి. వి. లేత ఆకు పచ్చరంగు పూలు పూసే చెట్టు. (Stychnos huxvomica).

**ముస్తియ** రూ.చూ. ముస్తె. వి. 1. తుంగగడ్డి; 2. తుంగ.

**ముస్తీదు** రూ. ముస్తయిదు, ముస్తయిదు, ముస్తాదు, ముస్తాబు, ముస్తీపు, ముస్తీబు, ముస్తైదు, ముస్తేబు. విణ. సంసిద్ధం. ఉ.రా. 4.228. వి. నగలు, బట్టలు మొ. వాటిని ధరించటం.

హిం. ముస్తైద్ తత్పరం, సన్నద్ధం, జాగరూకం,

ఉ. ముస్తఇద్, ముసఇద్ద్ తత్పరం, సన్నద్ధం, తయారు, సావధానం; ముస్తిద్దీ తయారీ, జాగరూకత,

అర. ముస్తఇద్ సిద్ధమయిన, తయారయిన.

పార. ముస్తఇద్ద్ తయారయిన, సిద్ధమయిన, ముస్తఇద్దీ సంసిద్ధత.

మరా. ముస్తీద తయారు, సిద్ధం.

ముస్తైదీ సన్నద్ధత, తత్పరత.

<ఉ. ముస్తఇద్.

**ముస్తీపు** రూ.చూ. ముస్తీదు. విణ. 1. సంసిద్ధం. రాజవా.పు. 43; 2. అలంకారంకోసం ఉపయోగించే సామగ్రి; 3. చిన్నసంచి.

**ముస్తీబు** రూ.చూ. ముస్తీదు. విణ. సంసిద్ధం. చంద్రరే. 3.84.

**ముస్తె** రూ. ముస్తియ. వి. 1. తుంగగడ్డి. మను. 2.7; 2. తుంగ.

సం. ముస్తక-. ముస్తకా ఒక దినుసుగడ్డి; ముస్తా; అమాగ. మొత్థా సువాసన గడ్డిలో ఒక రకం. ప్రా. ముత్థా మొత్థా; మ. మొర్తె;

క. ముస్త, ముస్తక, ముస్తి, ముస్తె;

త. ముత్తక్కోచు, ముత్తై; మ. మత్త, తు. ముస్తె.

<సం. ముస్తా.

**ముస్తెలమేపరి** వి. పంది. కొమ్ముకాడు.

**ముస్తేబు** రూ.చూ. ముస్తీదు. వి. నగలు, బట్టలు మొ. వాటిని ధరించటం.

**ముస్తైదు** రూ.చూ. ముస్తీదు. విణ. సంసిద్ధం. శుక. 2.426. వి. నగలు మొ. వాటిని ధరించటం.

**ముస్రు** రూ.చూ. ముసురు[1] వి. ఎడతెరిపిలేకుండా పడే సన్నవాన.

**ముస్లిము** రూ. ముస్లీము. వి. 1. మహమ్మదీయుడు; 2 మహమ్మదీయమతానికి చెందిన వ్యక్తి.

హిం.ఉ.పార. ముస్లిమ్ మహమ్మదీయమతానికి చెంది-నవ్యక్తి.

త. ముస్లిమ్.

<ఉ. ముస్లిమ్.

**ముస్లీము** రూ.చూ. ముస్లిము. వి. మహమ్మదీయుడు.

**ముహరీ** రూ.చూ. మొహరు. వి. మొహరి అనే నాణెం.

**ముహూర్తం** వి. వివాహాదిశుభకార్యాలకి నిర్ణయించేకాలం.

సం. ముహూర్త-. పన్నెండు క్షణాల కాలం, రెండు గడియల కాలం.

<సం. ముహూర్త-. (అర్థవిపరి.).

**ముహూర్తపుకోక** వి. పెళ్ళిముహూర్తానికి పెళ్ళికూతురు కట్టుకొనే తెల్లచీర.

సం. ముహూర్త- జ్యోతిశ్శాస్త్రప్రకారం శుభకార్యంకోసం నిర్దేశించబడ్డ సమయం.

<సం. ముహూర్త- + - పు + కోక.

**ముహూర్తపుగుడ్డలు** రూ. మూర్తపుగుడ్డలు. వి.బ.వ. పెళ్ళిలగ్నానికి వధూవరులు కట్టుకొనే బట్టలు.

సం. ముహూర్త జ్యోతిశ్శాస్త్రప్రకారం శుభకార్యానికి నిర్దేశించబడ్డ సమయం.

<సం. ముహూర్త - + - పు + గుడ్డ + - లు.

**మూ**

**ముచ్చౌక** వి 3/4 రూపాయి. **ముప్వేలుఁగు** రూ. ముప్వేల్గు. **ముప్వేల్గు** రూ.చూ. ముప్వేలుఁగు. వి. **1.** సూర్యుడు; **2.** త్రేతాగ్నులు.

**మూకుతాడు** రూ.చూ. ముకుంద్రాడు. వి. ముక్కుతాడు.

**మూడు ఆరైనా ఆరు మూడైనా** చూ. మూఁడు[1] అవ్య. వ్యత్యస్తమైన పరిస్థితి, పూర్తిగా తలకిందులయిన.

**మూడుసుక్కలు** చూ. మూఁడు. వి. ముప్పావలా.

<మూఁడు[1] + చుక్క[1] + లు.

**మూరితి** వి. తాళ్ల.సం. 7.59.

**మూలదాము** వి. మూలస్థానం.

సం. మూలస్థాన-. మూలస్థానం; ప్రా. థాణ- స్థానం.

**మూవిల్లు** వి. వంటగది.

<మూల + ఇల్లు.

**మూసంబీలు** చూ. ముసంబీ. వి.బ.వ. బత్తాయిలు.

**మృగము** వి. జంతువు.

సం. మృగ-. జంతువు, లేడి.

<సం. మృగ-. (అర్థవిపరి.).

**మృగ్యం** వి. శూన్యం.

సం. మృగ్య-. వెదకదగినది.

<సం. మృగ్య- (అర్థవిపరి.).

**మెంగ** వి. ముగ్ధ. తాళ్ల.సం. 13.93.

**మెంగతనము** వి. ముగ్ధత్వం. తాళ్ల.సం.

**మెట్ట**

**మెట్టదుక్కి** రూ.చూ. మెట్టదుక్కు. **మెట్టదుక్కు** రూ. మెట్టదుక్కు. వి. మెట్ట లేదా పొడినేల దున్నటం.

**మెట్టవేదాంతము**

సం. మైత్ర్య-. స్నేహంగా, మైత్రిక-, మైత్రీ స్నేహం; పా.ప్రా. మైత్తీ, పా. మిత్తి ప్రా. మిత్తీ స్నేహం.

బౌద్ధమతంలోని ఒకరకమయిన వేదాంత విభాగానికి 'మెత్తవేదాంత' మంటారని కొందరి భావన. ఈ పదం తెలుగులోని మెట్టతో కలిసి పోయిందనటంలో సందేహం-లేదు.

**మెడసరి** రూ. మిరుగు[2], మిసర, మెరుగు[2], మెరుపుసాలు.

**మెండు** వి. **9.** కష్టం.

**మెత్త** వి. **13.** తలగడ.

**మెంతి** రూ. మెంతె.

**మెంతె** రూ.చూ. మెంతి. వి. **1.** సస్యవిశేషం; **2.** తాలింపులలో వేసుకొనే వస్తువిశేషం.

**మెరంగ** అవ్య. వలె.

**మెరుగు[1]** వి. **7.** నెయ్యి.

**మెరుగు[2]** రూ.చూ. మెడసరి.

**మెరుపుసాలు** రూ.చూ. మెడసరి.

**మేటి[1]**

**మేటిముద్ద** వి. పెద్దముద్ద, జాతరలో వరిఅన్నంతో చేసిన పెద్దముద్ద.

**మేడి[1]**

**మేడికాయబోనము** వి. **2.** మోసం, దగా; **3.** కుళ్ళు; **4.** కుట్ర. **మేడికాయలోకము** వి. ఉన్నదొకటిపైకి కనిపించేది మరొకటి. సం. లోక- ప్రపంచం, జగత్తు.

**మేపుగొను** చూ. మేయు.

**మేయు**

**మేపుగొను(-కొను)** స.క్రి. తిను, భుజించు.

**మేరవ** వి. **2.** మెరక.

**మేల్**

**మేల్మిద్దె** వి. గృహప్రవేశం.

**మైల**

**మైలపెట్టె** వి. మాసిన బట్టలు వేసుకొనే పెట్టె. **మైలెద్దు** వి. గోదుమ వన్నె ఎద్దు. <మైల + ఎద్దు.

**మైలుకప్పిర** చూ. మైల. వి. అంకాలమ్మ జాతరలో తయారుచేయబడే దిష్టికుండ.

**మైలెద్దు** చూ. మైల.

**మొకదాకిరి** చూ. మొకము.

**మొకము**

**మొకదాకిరి** వి. మొగమోటం. **మొకాన** అవ్య. **1.** తీరుగా; **2.** ముఖంలో.

**మొకవచ్చుము** వి. మొగం కడుగుకోవటం.

సం. ముఖప్రక్షాళన-. ముఖం కడుక్కోవటం.

<సం. ముఖప్రక్షాళన-.

**మొకర** చూ. మొకరము. వి. బండితోలేవాడు కూర్చుండే బండి ముందుభాగం.

**మొకాన** చూ. మొకము.

**మొక్కళము** వి. **2.** అతిశయం.

**మొఖాబిళ్ళ** రూ.చూ. ముకాబిలా. వి. ముఖాముఖి.

**మొగ[1]** వి. **5.** కూడలి.

**మొగ్గలము**

క. మొక్కళ ఆధిక్యం, అతిశయం, గుట్ట.

<క. మొక్కళ.

**మొగ్గాయిజమానా** వి. పాతకాలం. మొగలాయి సామ్రాజ్య-కాలంనుంచి ఈ పదబంధమేర్పడి ఉంటుంది.

**మొటింకాయ** వి. గోరుచిక్కుడు.

**మొండి**[1]

**మొండిఘటము** వి. మొండి మనిషి. సం. ఘట- శరీరం. <మొండి + సం. ఘట-.

**మొనాగో** వి. భర్త.

**ముఫర్దుల** వి. సంగ్రహం. బే.ప. 80.

ఉ. ముఫ్రద్ ఏకాకి, ఒంటరి.

<ఉ. ముఫ్రద్.

**మొయిను** క్రి. విణ. సమానంగా.

**మొయ్యలు** వి.బ.వ. చేపలు.

**మొరము** వి. **5**. గులకరాయి.

ఉ. మురమ్ ఒకరకమైన గులకరాతినేల.

<ఉ. మురమ్.

**మొరవ**[2] వి. **2**. ప్రవాహం.

**మొరాలు** వి.బ.వ. చేటలు.

**మొర్క** వి. చెవి.

**మొఱఁగు** వి. **3**. మాట. తాళ్ల.సం. 18.1.

**మొలకసద్దలు** చూ. మొలక. వి.బ.వ. నానబ్రాలు.

**మొలక్కూర (-కూర)** చూ. మొలక. వి. తోటకూర.

**మొలగు** అ.క్రి. వెలుగు.

**మొసలి**

**మొసలికన్నీరు** వి. **2**. దొంగఏడుపు; **3**. లోకవం-చన. **మొసలికన్నీళ్ళు** వి.బ.వ. **1**. దొంగఏడుపు; **2**. లోకవంచన; **3**. పైకి మాత్రం కనబరిచే జాలి.

**మోచు**

**మోపుగ** రూ.చూ. మోపుగా. క్రి.విణ. ఎక్కువగా. **మోపుగా** రూ. మోపుగ. క్రి.విణ. ఎక్కువగా.

**మోచేతిబెల్లము** చూ. మోచేయి.

**మోచేయి** వి. హస్తం ముందుభాగం, ముంజేయి.

**మోచేతిబెల్లము** వి. **1**. వెంటనేలభించనిది; **2**. మరోరకంగా అనుభవంలోకి వచ్చేది; **3**. ప్రయత్నంలో కొంత పోగొట్టుకోక తప్పనిది.

**మోపుగ** చూ. మోచు.

**మోపుగా** చూ. మోచు.

**మోర**[1]

**మోరకడ్డంగా** క్రి.విణ. మూర్ఖంగా. < మోర+ -కు + అడ్డము + అగు + అ[7].

**మోర**[3] వి. తాటికాయలో ముంజెకట్టడానికి ముందున్న ద్రవస్థితి.

**మోర్టర్** రూ. మోర్టరు, మోర్టారు.

ఇం. *Mortar* ఇటుకలు మొ. వాటిని అతకటానికి ఉపయోగించే ఒకరకం సున్నం.

<ఇం. Mortar.

**మోర్టరు** రూ.చూ. మోర్టర్. వి. కట్టడానికి పనికి వచ్చే ఇసుక, నీళ్ళు, సున్నం కలిపిన మిశ్రణ విశేషం.

**మోర్టారు** రూ.చూ. మోర్టార్. వి. కట్టడానికి పనికి వచ్చే ఇసుక, సున్నం కలిపిన మిశ్రణ విశేషం.

**మ్యూజియం** వి. వస్తుప్రదర్శనశాల.

ఇం. *Museum* శాస్త్రీయ చారిత్రిక కళా, సంబం-ధమైన ప్రాధాన్యంకల వస్తువులను భద్రపరిచే చోటు, విశిష్ట వస్తు ప్రదర్శనశాల.

<ఇం. Museum.

**మౌసంబీ** రూ. ముసంబీ వి. బత్తాయి.

హిం.ఉ. మౌసంబీ బత్తాయి.

<ఉ. మౌసంబీ.

**యచ్చము** రూ.చూ. వెచ్చము. వి దినుసు.

**యజ్ఞం** వి. పోట్లాట.

సం. యజ్ఞ-. క్రతువు, పంచయజ్ఞాలు, అగ్ని, విష్ణువు, శివుడు, ఆత్మ.

<సం. యజ్ఞ-. (అర్థవిపరి.).

**యంచ** వి. లోయలోనీరు.

**యడల్పోడ** రూ.చూ. వెడల్పోడ. వి గింజల నిల్వకువాడే మూతి వెడల్పుగా ఉండే పెద్ద మట్టిపాత్ర.

**యదారు** చూ. ఎద. వి. ఆలోచన.

**యుంపగొడ్డు** చూ. ఎనుముగొడ్డు[1] వి. గేదె.

**యుంబ్రహ్మ** రూ. ఎంబెన్న. వి. **4**. అజ్ఞాని

**యాకం** రూ.చూ. యాకము. క్రి. విణ. **1**. చాలా; **2**. బాగా; **3**. ఎక్కువగా.

**యాకము** రూ. యాకం.

సం. ఏక-. ఒకటి, ప్రథ. 10.

<సం. ఏక-.

**యాకువ** రూ.చూ. వేకువ. వి. ప్రభాతం, తెల్లవారుజాము.

**యాకువజాము** రూ.చూ. వేకువజాము. వి. తెల్లవారుజాము.

**యాగడి** రూ.చూ. వేంకటి. వి. **1**. గర్భం; **2**. గర్భిణి.

**యాట** రూ.చూ. ఏడి. వి గొర్రె, పొట్టేలు.

**యానం** వి. సముద్రం.

సం. యాన-. ప్రయాణం.

<సం. యాన-. (అర్థవిపరి.).

**యానము**

< (అర్థవిపరి.).

యూవాళ్ళు రూ.చూ. ఏనాళ్లు వి.బ.వ. 2. వివాహానంతరం పెళ్ళికూతురికి జరిగే మూడు రోజుల తంతు. ఈకాలంలో గృహప్రవేశం, సత్యనారాయణ వ్రతం మొ. కార్యక్రమాలు చేస్తారు.

బాల్య వివాహవట్టాన్ని అధిగమించటానికి ఫ్రెంచి భూభాగంలోని 'యానామ్' (తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ దగ్గర ఉన్న చిన్న పట్టణం.) వెళ్ళి తమ చిన్నపిల్లలకు పెళ్ళి కావించి 3 రోజులు ఉండి ఫ్రెంచి అధికార్లనుండి వివాహ ధ్రువపత్రాల్ని పొంది తిరిగి మన భూభాగం మీదకు వచ్చేవారు.

<యానామ్ + నాండు[1]. + నాండు +-లు అని జానపద వ్యుత్పత్తి.

<ఏను[2] + - లు అనేది సరైన వ్యుత్పత్తి.

యూప రూ.చూ. వేప. వి. వేపచెట్టు. దీని కలపను దూలాలుగా, దర్వాజా కమ్ములుగా, తలుపు చెక్కలుగా ఉపయోగిస్తారు.

యూరలు రూ.చూ. ఏరాలు. వి. సవతి.

యూర్లు రూ.చూ. ఏరాలు.

యుస్తీఫా రూ.చూ. ఇస్తీఫ.

యుస్తీఫా రూ.చూ. ఇస్తీఫ.

యూపానికిలాగు స.క్రి. బంధించి కష్టపెట్టు.

సం. యూప-. యజ్ఞ పశువును కట్టేకొయ్య

యెమికబీర వి. మందుల్లో ఉపయోగపడే చిన్నచెట్టు (Celtis Cinnamomea).

యెరసి రూ.చూ. ఆరిసి. వి. బియ్యం.

యెఱ్ర అదుగ చూ. ఎఱ్ఱ. వి. ఎఱ్రని గట్టికలప కలిగిన కొండల్లో పెరిగేచెట్టు.

యెఱ్రగొాయి చూ. ఎఱ్ఱ. వి. పశుగ్రాసంగాను, ఇంటికప్పులకు ఉపయోగపడే ఒకరకం గడ్డి.

యెఱ్రజువి చూ. ఎఱ్ఱ. వి. ఊడలు కలిగిన ఒక రకం చెట్టు (Ficus Retusa).

యెఱ్రబిక్కి చూ. ఎఱ్ఱ. వి. అడవుల్లో పెరిగే ముళ్ళుగల పెద్ద చెట్టు (Gardenia Turgida).

యేప రూ.చూ. వేప. వి. వేపచెట్టు, దీని కలపను దూలాలుగా, దర్వాజా కమ్ములుగా, తలుపు చెక్కలుగా ఉపయోగిస్తారు.

యేళి వి. కంప.

త. వేలి. కంప.

<త. వేలి.

యొక్క ప్రత్య. ఆం.భా.భూ. 83.

యొాసం వి. వ్యవసాయం.

సం. వ్యవసాయ-. కృషి.

<సం. వ్యవసాయ-.

రగోట వి. నల్లుప్పిచెట్టు, కర్నూలు బళ్ళారి ప్రాంతాల్లో పెరిగేచెట్టు (Cappanis Grandis).

రంగూనుమల్లె వి. కాడమల్లెచెట్టు (Quisquda's indica). 'రంగూన్' బర్మాదేశ రాజధానికి ఇతః పూర్వమున్న పేరు.

రచ్చ

రచ్చమాను వి. కారంగా ఉండే పళ్ళుకాసే పెద్ద చెట్టు (Zanthoxylum Rhetsa).

రడం వి. యుద్ధం.

సం. రణ-. యుద్ధం.

<సం. రణ-.

రణగువ్వ వి. 1. ఈతచెట్టు (eyes circinalis); 2. తోటల్లో పెంచబడే ఈతజాతికి చెందిన చెట్టు (eycas cercindlis).

సం. రణ-. యుద్ధం.

<సం. రణ-. + గువ్వ (మిశ్రస.).

రణబిల్లి రూ.చూ. రణబిళ్ళ. వి. ఇంధనంగా ఉపయోగపడే ఎఱ్రని కలప నిచ్చేచెట్టు (cipadena fruticosa).

రణబిళ్ళ రూ. రణబిల్లి. వి. వంటచెరకుగా ఉపయోగపడే చిన్న పొద లేక చెట్టు. (cipadena fruticosa).

సం. రణ-. యుద్ధం.

<సం. రణ- + బిల్ల[2] (మిశ్రస.).

రంటదెప్పరపు వేళ చూ. రంటు.

రంటి చూ. రంటు వి. కలయిక. తాళ్ల.సం. 17.63.

రంటు

రంటదెప్పరపువేళ వి. కలయికవేళ. తాళ్ల.సం. 17.221.

రండికీ మొండికీ చూ. రండు[2].

రండు[2] రూ.చూ. రెండు. విశ. రెండు, ద్విసంఖ్యావాచకం.

రండికీమొండికీ అవ్య. కష్టసుఖాలకు.

రతి[2] వి. 2. జాతరలో వేసే ముగ్గు, ఎల్లమ్మ ఆకారంలో ఉండే ముగ్గు. 1. ముగ్గు రాయి లేదా సుద్దపొడి, 2. బొగ్గుపొడి, 3. పసుపు, 4. ఇటుకపొడి; 5. ఆకు పచ్చరంగు పొడి; వీటితో రతిని వేస్తారు.

సం. రతి-. మన్మథుని భార్య, కోరిక.

<సం. రతి-. (అర్థవిపరి.).

రంది వి. 8. బాధ.

రబ్బరు (ficus elastica).

రమంధాళి రూ.చూ. రామందాడి. వి. 1 ఆకస్మికంగా జరిగిన తీవ్ర యుద్ధం; 2. తీవ్ర యుద్ధం.

రంప

రంపమారేదు వి. 1. తెల్లని సువాసనగల పూలు పూసే తీగలాంటి మొక్క (Combretum decandrum);

**2**. చిన్నపూలు, కాయలు కాసేచెట్టు (**Combretum ovalifolium**).

**రంపు** వి. **6**. ఒకటే ఏడుపు.

**రల్లు** రూ.చూ. రెల్లి[1]. వి. పశుగ్రాసంగాను, ఇంటి కప్పులకు ఉపయోగపడే గడ్డి (**Saccharum Spontaneum**).

**రవంధాళి** రూ.చూ. రామందాడి. వి. తీవ్రయుద్ధం.

**రవుతు**[2] రూ.చూ. రౌతు[2]. వి. రాయి.

**రసగడి** వి. ఇరవై అడుగుల ఎత్తుపెరిగి పచ్చగా ఉండే మెత్తని కలపనిచ్చే చెట్టు (**Solanum Verbasa Folium**).

సం. రస-. ద్రవం.

**రసి**

**రసియెక్కు** (-ఎక్కు[1]) అ.క్రి. చిగురించు. సం. రస-. ద్రవం, శృంగారాది రసం.

**రాక**[3] రూ.చూ. రాఖీ. వి. రక్షాబంధం.

**రాకాసి**

**రాకాసిమట్ట** వి. అందంగా ఉండి నారకోసం పెంచబడే మొక్క (**Agave americana**).

**రాక్షసిమాను** వి. ఎరుపుతో కూడిన బూడిద రంగు కలప కలిగిన అడవి చెట్టు (**Scolopia Crenata**).

సం. రాక్షసీ రాక్షసజాతిస్త్రీ.

<సం. రాక్షసీ + మ్రాను.

**రాఖీ** రూ. రాక[3]

**రాగి**[2]

**రాగులు** వి.బ.వ. ఒకరకం ఆహారధాన్యం.

**రాగి**[3] (**Ficus religiosa**).

**రాగులు** చూ. రాగి[2]

**రాచ**

**రాచఉసిరి** రూ.చూ. రాచయుసిరిక. వి. పుల్లగా ఉండే చిన్నకాయలు కాసేచెట్టు (**Phyllanthus distichus**). **రాచఉసిరిక** రూ.చూ. రాచయుసిరిక. వి. పుల్లగా ఉండే కాయలు కాసేచెట్టు (**Phyllanthus distichus**). **రాచజిల్లేడు** వి. దూదినిచ్చే ఒక చిన్నచెట్టు (**Calotropis gigantea**). **రాచనేరేడు** వి. ఒకరకం నేరేడు చెట్టు (**Eugenia Jambalana**). **రాచబొడ్డ** వి. పెద్ద ఆకులుగల చెట్టు (**Ficus Roxburghii**). **రాచమామిడి** (**Mangifera indica**) **రాచయుసిరిక** (-ఉసిరిక) రూ. రాచఉసిరిక. వి. పుల్లగా ఉండే కాయలుకాసేచెట్టు (**Phyllanthus distichus**).

**రాతికొక్కిత** చూ. రాయి. వి. పెద్దకొక్కితచెట్టు, చెక్కడపు పనులకుపయోగించే కలపనిచ్చేచెట్టు (**Gardenia Lalibolia**).

**రాతిదూలం** చూ. రాయి[1].

**రాందాళి** రూ.చూ. రామందాడి. వి తీవ్రయుద్ధం.

**రాబొందు** రూ. రాబందు, రాంబందు. వి. **1**. రాచపులుగు; **2**. జటాయువు.

సం. రామబన్ధు-. రాముని చుట్టం.

<సం. రామబన్ధు-

**రామతాడి** రూ.చూ. రామతాడు. వి. ఒక రకం తాడిచెట్టు.

**రామతాడు** రూ. రామతాడి (**Corypha etale**).

**రామతులసి** వి. మందుల్లో ఉపయోగపడే ఆకులు కలిగిన చిన్న చెట్టు (**Ocimum gratissimum**).

సం. రామ-. శ్రీరాముడు, తులసీ. తులసి.

<సం. రామ-+ సం. తులసీ. (అర్థవిపరి.).

**రామదాడి** రూ.చూ. రామందాడి. వి. తీవ్రయుద్ధం.

**రామందాడి** రూ. రవంధాళి, రవందాళి, రాందాళి, రామదాడి.

**రామఫలము** రూ. రామాఫలము. వి. **1**. తియ్యని పెద్దపళ్ళు కాసేచెట్టు (**Anona reticulate**); **2**. ఫలవిశేషం.

సం. రామ-. శ్రీరాముడు; ఫల- పండు.

<సం. రామ-+ సం. ఫల-. (అర్థవిపరి.).

**రామబన్ధు** వి. **1**. రాచపులుగు, కలకపక్షి; **2**. జటాయువు.

సం. రామబన్ధు-. రామునిచుట్టం.

<సం. రామబన్ధు-. (అర్థవిపరి.).

**రామములక**

**రామములక్కాయ** రూ. రాములక్కాయ. **రాములక్కాయ** రూ.చూ. రామములక్కాయ. వి. టొమోటో.

**రామసీతాఫలము** వి. **1**. తియ్యనిపళ్ళు కాసేచెట్టు (**Anon reticulate**); **2**. ఫలవిశేషం.

సం. రామ సీతా రాముడు సీత, ఫల- పండు.

<సం. రామసీతాఫల- (అర్థవిపరి.).

**రామాఫలము** రూ.చూ. రామఫలము. వి. **1**. తియ్యగా ఉండే పెద్దపళ్ళు కాసేచెట్టు; **2**. ఫలవిశేషం.

**రామాయణంలో పిడకలవేట** వి. అసందర్భ ప్రస్తావన, అసందర్భ ప్రసంగం.

గౌతమ బుద్ధుని పూర్వగాథల్ని ప్రసంగాల్ని వివరిస్తూ తదనుయాయులు మూడు పిటకాలను రచించారు. దశావతారాలలో బుద్ధుడు ఒక అవతారంగా కొందరు భావించగా మరి కొందరు బుద్ధుడు పూర్వ జన్మలో శ్రీరాముడే అని పేర్కొన్నారు. రామాయణ పఠన సమయంలో పిటక ప్రసంగం సందర్భసహితంకాదు అని తెలియజేస్తూ 'రామాయణంలో పిటకలవేట' కాలక్రమంగా 'రామాయణంలో పిడకల వేట'గా మారి ఉంటుంది.

**రాములక్కాయ** చూ. రామములక.

**రాంపండు** వి. తియ్యని పెద్ద పళ్ళు కాసే చెట్టు (**Anona reticulate**).

సం. రామ-. శ్రీరాముడు.

<సం. రామ- + పండు.

రాంబందు రూ.చూ. రాబొందు. వి. 1. రాచపులుగు; 2. జటాయువు.

రాఁపు వి. 2. రైల్వే క్రాసింగు.

రాయి[1]

రాతిదూలం వి. చతురస్రాకారంలో ఉన్న బండరాయి.

రాయి[2]

రాయిజాము వి. గృహాది నిర్మాణాలకు ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Eugeria alternifolia).

రావకాడ రూ.చూ. రేవుకాడ. వి. సముద్రతీరంలో పెరిగే ఎక్కువగా పూలుపూసే మొక్క (Suaeda nudiflora).

రావణ చూ. రేగడు. వి. అడవుల్లో పెరిగేచెట్టు (Dillenia pentagyna).

సం. రావణ-. లంకాధిపతి, మండోదరి భర్త.

<సం. రావణ. (అర్థవిపరి.).

రావణకాష్ఠము రూ. రావణాకాష్ఠము. వి. ఎడతెగని వివాదం లేదా యుద్ధం లేదా కుటుంబ కలహం.

రావణాసురుని పాడె ఇంకా మండుతూనే ఉంది అని జానపదోక్తి.

సం. రావణ-. రావణాసురుడు, లంకాధిపతి.

కాష్ఠ-. క్రర.

<సం. రావణకాష్ఠ- (అర్థవిపరి.).

రావణాకాష్ఠము రూ.చూ. రావణకాష్ఠము. వి. ఎడతెగని వివాదం లేదా యుద్ధం లేదా కుటుంబ కలహం.

రావణాసురునిమీసాలు వి.బ.వ. సముద్రతీరంలో పెరిగే ముళ్ళ మొక్క (Spinifex squarrores).

సం. రావణాసుర-. రావణుడనే రాక్షసుడు.

రావిడి వి. 1. అల్లరి, గోల; 2. పోరు.

రావుతుఁడు రూ. రవుతు[1]

రిజ్జె వి. పిన్ను.

రిందావనము వి. తులసి.

సం. బృందావన-. ఉద్యానవన విశేషం.

<సం. బృందావన-.

రిమ్మ వి. 3. కావ్యు.

రిళ్ళ వి. బొద్దింక.

రుకిమిణీ వి. రుక్మిణి, కృష్ణుని పట్టమహిషి. తాళ్ల.సం. 7.43.

సం. రుక్మిణీ కృష్ణుని భార్య.

<సం. రుక్మిణీ.

రుద్రకడప రూ. రుద్రగణప. వి. బండారుచెట్టు, వస్తువుల తయారీకి గృహాది నిర్మాణాలకు ఉపయోగించే కలపనిచ్చేచెట్టు (Adina Cordifolia).

సం. రుద్ర-. శివుడు.

<సం. రుద్ర- + కడప[2]. (మిశ్రస.).

రుద్రగణప రూ.చూ. రుద్రకడప. వి. బండారుచెట్టు, వస్తువుల తయారీకి, గృహాది నిర్మాణాల కుపయోగించే కలపనిచ్చేచెట్టు (Adina Cordifolia).

రుద్రాక్షపెండలము వి. కాయపెండలము (Dioscorea Crirpate).

సం. రుద్ర- శివుడు, రుద్రాక్ష-. ఒకరకమైన పూసలు.

<సం. రుద్రాక్ష- + పెండలము (మిశ్రస.).

రూక వి. 6. పావలా.

రెక్క వి. 10. చేయి ('రెక్కాడితేనే కాని డొక్కాడదు' అనే సామెతలోని రెక్కకు చెయ్యి అనే అర్థం. మాండలికంగా రెక్కకు చెయ్యి అనే అర్థం ఉంది).

రెట్టకాయలు చూ. రెట్ట[2]. వి.బ.వ. కుంకుడుకాయలు.

రెట్టమతము వి. 1. పెడసరం, పొగరు; 2. విరుద్ధాభిప్రాయం.

కన్నడంలో 'రెట్టమత' అనే జ్యోతిష గ్రంథముంది. తెలుగులో దీని అనువాద గ్రంథం రెట్టమత శాస్త్ర మనే పేరుతో ఉంది.

క. రెట్టమత ఒకానొక జ్యోతిషగ్రంథం.

<క. రెట్టమత.

రెట్టమతం మనుషులు వి.బ.వ. చెప్పినమాటకు ఎదురు చెప్పే వ్యక్తులు.

రెట్టమతం మనుషులు చూ. రెట్టమతము.

రెడ్డి

రెడ్డితనము వి. మునసబు పదవి.

రెంటికింజెడినరేవఁడు చూ. రెండు.

రెండు రూ. రండు[2]

రెంటికింజెడిన రేవఁడు వి. 1. రెండు పక్షాల చెడిపోయిన రేవువాడు (చాకలి). మను. 3.105; 2. ఉభయ భ్రష్టుడు.

చాకలి ఏటిలో గుడ్డలుదుకబోయి ఉదికిన బట్టలను వేరొక రాతిపై ఉంచి చూస్తుండగానే ప్రవాహవేగంలో ఇంకా ఉతక వలసిన బట్టలు కొట్టుకొని పోతుండగా వాటికై ఉదికిన బట్టలను అక్కడ వదిలి వెళ్ళగా ఉతకనిబట్టలు ఉతికిన బట్టలు ఉద్ధృత ప్రవాహవేగంలో కొట్టుకు పోయినట్లు పరంపరగా చెప్పుకొనే కథపై ఆధారపడి ఈ నానుడి తెలుగులో కలిగినట్లు వ్యాఖ్యాతలు. రెండు గుర్రాల మీద స్వారీ చూ. జోడు గుర్రాలమీద స్వారీ. వి. విరుద్ధాభిప్రాయాలు కలవారితో కలిసి ఉండటం. రెండు గుర్రాల స్వారీ చూ. జోడు గుర్రాలమీద స్వారీ. వి. విరుద్ధాభిప్రాయాలు కలవారితో కలిసి ఉండటం. రెండు నాలుకల మనిషి రూ. రెండు నాల్కలమనిషి. వి. మాట మార్చే మనిషి, ఆడినమాట మార్చి మరోరకంగా మాట్లాడే

వ్యక్తి. రెండు నాల్కల మనిషి రూ. చూ. రెండు నాలుకల మనిషి. వి. మాట మార్చే మనిషి, ఆడిన మాట మార్చి మరో రకంగా మాట్లాడే మనిషి. రెండుపడవల మీద కాళ్ళుపెట్టు అ.క్రి. విరుద్ధాభిప్రాయాలు కలవారితో కలిసి ఉండు. 'కాళ్ళుపెట్టు' అంటే ఎక్కు అని అర్థం. రెండు పడవలను ఒకేసారి ఎక్కటానికి సంకల్పించటం సరికాదు. దీన్నిబట్టి ఈ పలుకుబడి.

రెమ్మ రూ. రొబ్బ[2].

రెమ్మని వి. బర్రేని చెట్టు, తెల్లని గట్టికలప కలిగిన చిన్న చెట్టు (Ceapparis divaricate).

రెయ్యికాడ రూ.చూ. రేవుకాడ. వి. సముద్ర తీరంలో పెరిగే ఎక్కువ పూలుపూసే చెట్టు (Suaeda nudiflora)

రెయ్యిపప్పు వి. ఒక రకం ఎర్రని రంగునిచ్చే పూలు పూసే చెట్టు (Wood fordia floribuna).

రెయ్యిమాను వి.ఒక రకం ఎర్రని రంగు నిచ్చే పూలు పూసేచెట్టు (Wood fordia floribunda).

రెల రూ.చూ. రెల్ల[1]. వి. కొమ్మ.

రెల్ల[1] రూ. రల్లు, రెల, రెల్లు, రేల[2], రేళ. వి. **3.** వృక్షం లేదా పొద ఉపశాఖల నడుమ నుంచి పుట్టే సన్నని కాడల వంటి కొమ్మ లేదా నేల వైపు వాలిన సన్నపాటి కొమ్మ.

రెల్లావు చూ. రెల్లు. వి. వివిధ వర్ణాలు కల ఆవు.

రేక[3] రూ.చూ. రేకు, వి. పువ్వులో చిన్నరేకు.

రేకు రూ. రేక[3].

రేగడ

రేగడదూల వి. దళసరిగా ఉండే దురద కలిగించే ఆకులు గలిగిన తీగ (Tragia involucrata).

రేఁగు[2] వి. ఇంధనంగా ఉపయోగపడే కలప కలిగి తినే పళ్ళు కాసే చెట్టు (Zizyphus jujuba).

రేఁగురాకుతీగె వి. కొండల్లో పెరిగే ఒక రకం తీగ (Aspidopterys Roxburghiana). రేఁగొట్టి వి. రేగురాకుతీగె, కొండల్లో పెరిగే ఒక రకం తీగ (Aspidopterys Roxburghiana).

రేఁగొట్టి చూ. రేఁగు[2].

రేచకి వి. కరకచెట్టు, తోళ్ళు చదునుచేయటానికి ఉపయోగపడే కాయలు, గృహాది నిర్మాణాలకు ఉపయోగించే కలపను ఇచ్చేచెట్టు (Terminalia Chebula).

రేత వి. కొంకుడు కాయల్లాగ ఉపయోగపడే కాయలు కాసేచెట్టు (Sapindus Trifoliatus).

రేవంగి వి. అడవుల్లో పెరిగే ఒక రకం తీగ (Hugonia Mystax).

రేమ వి. ఇంధనంగా ఉపయోగపడే కలపకలిగి తినటానికి ఉపయోగపడే పళ్ళు కాసేచెట్టు (Zizyphus jujuba).

క. ఇలిచి, ఎగచి, ఎర, ఎలచి, ఎల్చి, ఎళచి, రేగు (<తె.) రేగుచెట్టు; త. ఇలంతై, ఇరతి, ఇరత్తి, ఇరంతై, ఇలంతై, *(Zizyphus Jujuba)*; మ. ఇలంత, లంత; కొలా. రేంగ. రెజ్జా; నా. రెజ్జా. రేంగ; పర్జి రేఁగ; గ. రేజ్, రేంగా, మాల్తొ. ఇల్కు).

<మూ.ద్రా. *ఇర్-.

రేపాల[2] వి. తెల్లపాలచెట్టు, చెక్కడపు పనులకు ఉపయోగించే తెల్లని కలపనిచ్చేచెట్టు (Wrightia Tinctoria).

రేల[2] రూ.చూ. రెల్ల[1]. వి. చిన్నకొమ్మ.

రేలంగి చూ. రేల[1]. వ్యవసాయ పరికరాలకుపయోగించే కలపనిచ్చే ఒక రకం చెట్టు (Cassia Fistula).

రేళ రూ.చూ. రెల్ల[1]. వి కొమ్మ ఉపశాఖ.

రేవటిదూలగొండి చూ. రేవడి.

రేవడి వి. **2.** రావణచెట్టు, అడవుల్లో పెరిగే చెట్టు (Dillenia Pentagyna).

రేవటిదూలగొండి వి. దళసరిగా ఉండి దురద కలిగించే ఆకులు కలిగిన తీగ (Tragia involucrata).

రేవలచిన్ని వి. పడమటి కనుమల్లో పెరిగే, మందుల్లో ఉపయోగపడే చెట్టు (Garcinia Morella).

రేవు[2]

రేవుకాడ రూ. రావకాడ, రెయ్యికాడ. వి. సముద్రతీరంలో పెరిగే మొక్క (Suaeda nudiflora).

రైగడ్డి వి. బళ్ళారి, రాయదుర్గం, నీలగిరి మొ. చోట్ల కొండల్లో పెరిగే గడ్డి (Anthraxon Lanceolotus).

రైస్తురాలు వి సమర్త.

సం. రజస్ ఋతుధర్మం.

<సం. రజస్ + ఆలు[2].

రైతు

రైతుపాల వి. అడవిపాలతీగ, తెల్లనిపూలు పూసేతీగ (Cryptolepig Buchanani).

రొట్నల్ వి. వంతెన.

రొడ్డ వి. **6.** తోటల్లో పెంచబడి అందమైన తెల్లని పూలుపూసే మొక్క (Elegenia bracteata).

రొంటాలకువెళ్ళు చూ. రొండు[3]. అ.క్రి. బహిర్భూమికి వెళ్ళు.

సం. వేళా సమయం.

రొబ్బ[2] రూ.చూ. రెమ్మ. వి. రెబ్బ.

రోఁకటిపాట చూ. రోకలి.

రోఁకలి.

రోఁకటిపాట వి. **1.** రోకలితో దంచేటప్పుడు శ్రమను మరచిపోవటానికి పాడే బాణీలో అంతగా మార్పులేని పాట; **2.** చెప్పిందే చెప్పడం.

రోపు

రోపెక్కు వి. కోపంతో కూడిన ఆయాసం.

రోపెక్కు చూ. రోపు.

రౌతు[2] రూ. రవుతు[2].

లకోటా

లకోటాప్రశ్న వి. ముఖ్యమైన ప్రశ్న.

లక్క[1]

లక్కగేదె వి. **1.**వట్టిపోయినగేదె; **2.** ఉపయోగశూన్యమైనది. లక్కపాపిడి వి. అందమైన తెల్లని పూలుపూసే అడవి చెట్టు (Pavetta indica glabre).

లగించు[2] అ.క్రి. దూకు, లంఘించు.

సం. లంఘన-. దూకటం, లంఘ్ దూకు.

<సం. లంఘ + - ఇంచు[3].

లగ్గము రూ. లగ్గాము.

లగ్గసరి వి. వివాహసమయం. లగ్గసరులు రూ. లగ్గసర్లు. వి.బ.వ. వివాహముహూర్తవేళలు. లగ్గసర్లు రూ.చూ. లగ్గసరులు. వి.బ.వ. వివాహ ముహూర్తవేళలు.

లగ్గసరి చూ. లగ్గము.

లగ్గసరులు చూ. లగ్గము.

లగ్గసర్లు చూ. లగ్గము.

లగ్గాము రూ.చూ. లగ్గము. వి. పెళ్ళి.

లగ్నముహూర్తము వి. వివాహానికి నిర్ణయించిన ముహూర్తం.

సం. లగ్న- తగులుకొన్నది, ఆసక్తం, కలిపికొన్నది, లజ్జితం, సిగ్గు పడినది, ముహూర్త-. రెండు గడియల కాలం.

<సం. లగ్నముహూర్త-. (అర్థవిపరి.).

లంకణము రూ. లంఖణం.

లంకె

లంకెబిందెలు వి.బ.వ. కలిపికట్టిన ధన కనకాదులున్న రెండు బిందెలు.

లంఖణం రూ.చూ. లంకణము. వి. జ్వరం వచ్చినప్పుడు ఏమీ తినకుండా ఉండటం.

లంగ్[3] వి. దిక్కులేని వ్యక్తి.

హిం.ఉ. నంగా నగ్నమయిన.

<ఉ. నంగా.

లంగూడిగాడు వి. అర్థజ్ఞానం లేకుండా చదివేవాడు.

"ఇ ఈ ఎ ఏలంగూడివ చజలు తాలవ్యంబులు" (బాలవ్యాకరణము సంజ్ఞాపరిచ్ఛేదము 8వ సూత్రం) అనే సూత్రాన్ని చదివేటప్పుడు ఏవిధంగా విడగొట్టి చదవాలో తెలియని వాడొకడు 'లంగూడి' అని చదివి దాని అర్థాన్ని తెలియక గురువుగారిని 'లంగూడి' అనే పదానికి అర్థం ఏమిటని అడిగాడట. గ్రంథంలోని భాగాలను సరిగా విడదీసి చదవటం రానివాణ్ణి 'లంగూడిగాడు' అంటారు.

లంజ

లంజపవరము వి. కొండల్లోని చెట్లమీద పెరిగే తీగ.

లట్టెనిక రూ.చూ. లట్టెనిగ. వి. అప్పడాల కర్ర, రొట్టెలు మొ. వాటిని లట్టించే సాధనం.

లట్టెనిగ రూ. లట్టెనిక.

లట్టెబాపు(-వాపు) వి. లావుపాటి మనిషి.

లట్టెబాయి వి. లావుపాటి స్త్రీ.

లడాయి

లడాయి కొట్టము వి. పడమటి కనుమల్లోనూ, పడమటి తీరంలోనూ పెరిగే తీగలాంటి మొక్క (Vitis repens).

లండాచోరీ చూ. లండు. వి. అసహ్యం, కృత్రిమమయిన పని.

లత్త[2] వి. గవ్వ.

లద్దగడ్డి వి. మంచి పశుగ్రాసంగా ఉపయోగపడే గడ్డి (Panicum repens).

లప్ప రూ. అప్ప[2].

లఫంగా రూ.చూ. లఫంగు. వి. అప్రయోజకుడు.

లఫంగు రూ. లఫంగా.

లబ్జుగా క్రి.విశ. చక్కగా.

ఉ.పార. లబ్జ్ చక్కదనం.

<ఉ. లబ్జ్.

లవ్ క్రి.విశ. చాలా, ఎక్కువగా.

లవ్[2] రూ. లౌ[2]. వి. **1.** ప్రేమ; **2.** శూన్యం, సున్న.

ఇం. *Love* ప్రేమ.

<ఇం. Love.

లాకి[2] రూ.చూ. లాకీ[2]. వి. తొందర.

లాకిలాకి క్రి.విశ. మిక్కిలి, తొందరగా.

లాకీ[2] రూ. లాకి[2]. వి. తొందర.

లాంచి రూ.చూ. లాంచీ. వి. యంత్రంతో నడపబడే పెద్ద పడవ.

లాంచీ రూ. లాంచి.

ఇం. *Launch* సైనికుడు నడిపే పెద్దబోటు, యంత్రం సాయంతో నడచే పెద్దబోటు.

లావు[1] రూ. లవ్[1], లౌ[1]. వి. **8.** ఇష్టం; **9.** బిచ్చం. విశ. చాలా.

లావుచెరకు వి. లావుగా ఉండే చెరకు, చెరకులో ఒక రకం (Saccharum Officinarum).

లాసుకొను చూ. లాయు. స.క్రి. సమీపించు.

లింగచీమ్మ వి. సూమింత చెట్టు. తుపాకు మందు తయారీలో బొగ్గు ఉపయోగపడే చెట్టు (Sesbania aegyptiaca).

లిప్‌స్టిక్ రూ. లిప్‌స్టిక్కు. వి. పెదాలపై రాసుకొనే ఎరుపు లేదా గులాబి లేదా బ్రౌన్ రంగులో ఉండే లేపన విశేషం.

ఇం. *Lipstick* పెదాలకు వేసుకొనే సుగంధ లేపన-విశేషం.

<ఇం. Lipstick.

లిప్‌స్టిక్కు రూ.చూ. లిప్‌స్టిక్. వి. పెదాలపై రాసుకొనే ఎరుపు లేదా గులాబి లేదా బ్రౌన్ రంగులో ఉండే లేపన విశేషం.

లుక్ రూ. లుక్కు[2]. వి. చూపు, దృష్టి.

ఇం. *Look* చూపు, దృష్టి.

<ఇం. Look.

లుకి రూ.చూ. లుక్కి[2]. వి. బళ్ళు మొ. తయారు చెయుటానికి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Vitex Leucoxylon).

లుక్కి[2] రూ. లుకి, లొక్కి. వి. 1. బళ్ళు మొ. తయారుచేయుటానికి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Vitex Leucoxylon); 2. వావిలి చెట్టు. మందుల్లో ఉపయోగపడే చిన్నచెట్టు, (Vitex nugunclo).

లుక్కు[2] రూ.చూ. లుక్. వి. చూపు, దృష్టి.

లుంగ వి. 6. లంగ.

లుల్లుడి వి. తూర్పు, పడమటి కనుమల్లో పెరిగే ఒక రకం తీగ (Gnetum Scandens).

లూలితి వి. తూర్పు, పడమటి కనుమల్లో పెరిగే ఒక రకం తీగ (Gnetum Scandens).

లెక్క వి. 10. డబ్బు.

లెవడాలు చూ. లెప్పము[1]. వి.బ.వ. నువ్వుల జీళ్ళు.

లేకి వి. 4. వరివెన్ను.

లేఖ వి. ఉత్తరం.

సం. లేఖా రేఖ, గీత, చార, పంక్తి, గుర్తు, పోలిక, కొప్పు, ఆకృతి.

<సం. లేఖా (అర్థవిపరి.).

లేవిడి వి. 2. అల్లరిగా తిరిగి చెడిపోవటం.

లైబ్రరి రూ. లైబ్రరీ. వి. గ్రంథాలయం.

ఇం. *Library* గ్రంథాలయం.

<ఇం. Library.

లైబ్రరీ రూ. చూ. లైబ్రరి. వి. గ్రంథాలయం.

లైబ్రి రూ. లైబ్రీ. వి. గ్రంథాలయం.

ఇం. *Libry* గ్రంథాలయం. ఈపదం ఆంగ్లంలో అంగీ-కరించబడింది.

<ఇం. Libry.

లైబ్రీ రూ.చూ. లైబ్రి. వి. గ్రంథాలయం.

లొక్కి రూ.చూ లుక్కి[2]. వి. బళ్ళు మొ. తయారుచేయుటానికి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Vitex leucoxylon).

లొద్దుగ వి. ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Symplocos racemosa).

లొల్లరి మాను వి. ఇవర మామిడిచెట్టు. అందంగా ఉండే ఒకరకం చెట్టు (Garinia Xanthocheymus).

లో[2]

లోహంటము 'లోహటము'గా సవరించుకొని పఠించాలి.

లోకలోడి వి. పైమాట. తాళ్ల.సం. 17.68.

సం. లోక-. ప్రపంచం, జగత్తు. లోకానికి ఓడి అంటే జనం ప్రభావానికి లోబడి అని అర్థం.

లోట రూ. లోటాయి.

లోటాయి రూ. చూ. లోట. వి. చిన్నపాత్ర.

లోడి 'శాడి' గా సవరించుకొని పఠించాలి.

లోణి 'శాణి'గా సవరించుకొని పఠించాలి.

లోను[2] వి. అప్పు.

ఇం. *Loan* అప్పు, ఎరువు.

<ఇం. Loan.

లోలగ రూ. లోలగు, లోలుగ.

లోలగు రూ. చూ. లోలగ, వి. లేత ఎరుపు రంగు గల కలపనిచ్చే అందమైన చెట్టు (Ptedrospermum Suberifolium).

లోలుగ రూ. చూ. లోలగ. వి. తడచెట్టు, చిన్న ఆకులు కలిగి అందంగా ఉండేచెట్టు (Pterospermum Hyneanum).

లోలుగతీగ వి. ఊదారంగు పూలుపూసే అడవి తీగ (Vitis tomentosa).

లౌ[1] రూ.చూ. లావు[5]. విఠ. చాలా.

లౌ[2] రూ.చూ. లవ్[2]. వి. 1. ప్రేమ; 2. శూన్యం, సున్న.

లౌక్యుడు వి. వంచకుడు.

సం. లౌక్య-. లోకజ్ఞత కలవాడు.

<సం. లౌక్య-. (అర్థవిపరి.).

లౌటి వి. కంచు.

ల్యాబ్ రూ. ల్యాబు. వి. పరిశోధన శాల.

ఇం. *Lab, Laboratory* శాస్త్రీయ పరిశోధనలకు ఉపయోగించే గది లేదా భవనం.

<ఇం. Lab.

ల్యాబు రూ.చూ. ల్యాబ్. వి. పరిశోధనశాల.

వక్క[1]

వక్కలువేయు స.క్రి. విసిరివేయు.

వంకి[3] రూ. ఒంకెం.

వచనము వి. గద్యరచనా ప్రక్రియ.

సం. వచన-. మాట్లాడినది, భాషితం, వాక్యం, మాట, పలుకు, చెప్పటం, సిద్ధాంతం అవృత్తి చేయటం.

<సం. వచన- (అర్థవిపరి.).

**వటం** చూ. వ(టువ. వి. అందం.

**వడ్ల**

**వడ్లవాళ్ళు** రూ. ఒడ్డోళ్లు.

**వదినె** రూ. వయిని, వాయి[4]

**వద్ది** రూ.చూ. ఓది.

**వద్లాడు** చూ. వర్లు. అ(క్రి. తల్లడిల్లు.

**వంపు** రూ. అంపు[3].

**వయిని** రూ.చూ. వదినె. వి. వదిన.

**వరక**

**వరకపోవు** అ(క్రి. ఎండలో శుష్కించు.

**వరసాపిని** చూ. వరస. వి. వంశపారంపర్యం.

**వరి**[2] రూ. ఒరి[2], ఒ(రె[1], వ్రరి.

**వరికూటి** వి. వరికూడు, బియ్యంతో వండిన అన్నం. **వరివాము** వి. వరి ఎండుగడ్డిని కట్టలుగాకట్టి ఎత్తుగా పొడుగుగా వేసిన కుప్ప. **వరివాములు** రూ. వ్రరివాములు. వి.బ.వ. గడ్డివాములు, దీర్ఘచతుర(స్రాకారంగాను పైన ముక్కోణపు విధంగాను పొడవుగాను ఉండే గడ్డికుప్పలు. **వరివెం(టు** వి. ఎండుగడ్డితో చేసిన తాడు, వరివాములపై వరి వెం(టులను బిగించి వాటి చివర్లకు రాళ్ళను కడతారు.

**వ్రరి** రూ.చూ. వరి[2]. వి. శాలిసస్యం.

**వ్రరివాములు** రూ.చూ. వరివాములు వి.బ.వ. గడ్డివాములు, దీర్ఘచతుర(స్రాకారంగాను పైన ముక్కోణపు విధంగాను పొడవుగాను ఉండే గడ్డికుప్పలు.

**వఱద** రూ. ఒ(రె[2].

**వల**[1] వి. **7.** దోమతెర.

**వలను**

**వలపక్షము** వి. పక్షపాతబుద్ధి, ఒకవైపు న్యాయవిరుద్ధంగా అభిమానం చూపటం. <వలను + సం. పక్ష-.

**వలపక్షము** చూ. వలను.

**వలి**

**వల్పిరి** రూ. ఎలిపిరి.

**వల్లకాటిరామనాథం** చూ. వల్లకాడు.

**వల్లకాడు**

**వల్లకాటిరామనాథం** వి. పేరు చెప్పటానికి ఇష్టం లేనప్పుడు ఉపయోగించే పలుకుబడి.

**వల్లియ** రూ. ఒల్లియ[2], ఒల్లె.

**వహి** రూ. వై[2].

**వాక**[2]

**వాకాయపళ్ళు** వి.బ.వ. డొంకల్లో దొరికే చిన్నపళ్ళు. <వాక[2] + కాయ + పండు[1] + లు.

**వాకాయుపళ్ళు** చూ. వాక[2].

**వాక్కిరి** వి. వాంతి.

**వాంగు** రూ. అగు[2], ఒగు[2].

**వాటు**[1]

**వాటుగొర్రు** రూ. ఆటగొట్టు.

**వాడ**[1] రూ. ఆడ[3].

**వాడప్పం** చూ. వా[4]. వి. బియ్యంరొట్టె.

**వాదట్టు** రూ. ఒదటి, ఓదటి.

**వాను** రూ. వోను.

**వాము**[3]

**వాముపూస** వి. కారప్పూస.

**వామె** రూ.చూ. ఆమె. సర్వ. అస్త్రీ.

**వాయి**[4] రూ.చూ. వదినె. వి. వదిన.

**వాయిద్యం** వి. వాద్యం.

సం. వాద్య-. పాటలు మొ. వాటిని పాడటానికి ఉపయోగించే పనిముట్టు.

<సం. వాద్య-.

**వారపాక** రూ. వారపాకు.

**వారపాకు** రూ.చూ. వారపాక. వి. ఇంటిముందుకాని ఇంటివెనుకకాని గోడకు వాల్చి వేసిన తాటాకుపాక.

**వారాగోరం** (క్రి.విణ. ఎడతెరపి లేకుండా.

సం వార-. మారు, పర్యాయం, ఘోర-. భయంకరమయిన, తీవ్రమయిన.

<సం. వార - + సం. ఘోర -+- ము.

**వార్తీ** వి. అలవాటు.

**వికసిల్లు** అ(క్రి. ఆనందించు. మార్క. 8.26.

సం. వికాస-. వికాసం పొందు, ఒప్పు, (ప్రకాశించు.

<సం. వికాస-. (అర్థవిపరి.).

**విచ్చబేడ** చూ. విచ్చు.

**విచ్చు**

**విచ్చబేడ** వి. రెండణాలు విలువకల నాణెం. **విచ్చిపోవు** రూ. ఇచ్చిపోవు. **విచ్చుకుపోవు** రూ. ఇచ్చుకపోవు.

**విడం** రూ.చూ. విడెము. వి. తాంబూలం.

**విడిముంత** రూ. ఇడిముంత.

**విడు**

**విడదీసుదు** రూ. ఇడదీసుదు. **విడఁబడు** రూ. ఇడబుదు.

**విడుచు**

**విడుపుకాయితం** వి. విడాకుల కాయితం.

**విడుపుకాయితం** చూ. విడుచు.

**విడెము** రూ. విడం.

**విత్తవము**

**విత్తవంకుండ** రూ. ఇత్తనం కుండ.

**వినాకమయ్యపండుగ** రూ. ఇనాకమయ్యపండుగ, ఇనాకమ-య్యపండుగు.

**వినాయకచవితి** రూ. ఇనాయకసవితి.

**వినియోగము** వి. ఆశ్రితుడు, పరివారం. ప్రబంధ. 78.

సం. వినియోగ-. విడదీయుటం, వేరుచేయుటం, ఉప-యోగం, ప్రయోజనం, విఘ్నం, ఒప్పగించవిది, ఉద్యోగం.

<సం. వినియోగ- (అర్థవిపరి.).

**విన్యాసం** వి. నేర్పు.

సం. విన్యాస- ఒప్పగించటం, ఉంచటం, ఏర్పాటు, కూర్పు, రచన, సమూహం.

<సం. విన్యాస-. (అర్థవిపరి.).

**విప్పు** రూ. ఇప్పు.

**విప్లవము** వి. తిరుగుబాటు.

సం. విప్లవ-. నీటిలో కొట్టికొని పోవటం, వ్యతిరేకం, కలత, దొమ్మి, యుద్ధం, రాష్ట్రోపద్రవం, నాశనం, ఉల్లం ఘించటం, కష్టం, ఉపద్రవం, రహస్యాన్ని వెల్లడించుటం, కేకలతో శత్రువును భయపెట్టటం.

<సం. విప్లవ-. (అర్థవిపరి.).

**విభుఁడు** వి. భర్త.

సం. విభు-. బలవంతుడు, ఘనుడు, శ్రేష్ఠుడు, సమర్థుడు, స్థిరుడు, జితేంద్రియుడు, ఆద్యంతరహితుడు.

<సం. విభు-. (అర్థవిపరి.).

**వియ్యము**

**వియ్యంకుఁడు** రూ. ఇయ్యపుడు. **వియ్యంపొత్తు** రూ. ఇయ్యంపొత్తు.

**విరగుద్దు** రూ. ఇరగుద్దు.

**విరదీయు** రూ. ఇరదీయు.

**విరుచు** రూ. ఇరుచు.

**విరుపు**

**విరుపుచివ్వ** రూ. ఇరుపుసివ.

**విర్లబడు** రూ. ఇర్లబడు.

**విర్లుకుంచె** రూ. ఇర్లుకుంచె.

**విఱుపు** రూ. ఇరుపు.

**విలావరిగా** క్రి.విణ. వివరంగా.

హిం. విలావర్.

<హిం. విలావర్ + అగు + -అ[7].

**విల్లు** రూ. ఇల్లు[2].

విల్లంబు రూ. ఇల్లంబు.

**వివాహము** వి. పెళ్ళి ఐన తర్వాత పెళ్ళికూతురును పెళ్ళికొడుకు ఎత్తుకొని కొంతదూరం తీసుకువెళ్ళే రాయల సీమలోని ఆచార విశేషం.

సం. వివాహ-. పెళ్ళి, పరిణయం.

<సం. వివాహ-. (అర్థవిపరి.).

**విష్ణుకాంత**

**విష్ణుకాంతరంగు** రూ. ఇష్ణుకాంతరంగు.

**విసరు**

విసరికొట్టు రూ. ఇసురుకొట్టు. విసరుఱాయి రూ. ఇసురురాయి.

**విసినెకర్ర**

విసినెకర్రచీరె రూ. ఇసనకర్ర సీరె.

**విసురు**

విసిరివపడుగు రూ. ఇసిర్నిపడుగు. **విసురుచేట** రూ. ఇసురుచేట. **విసురుతడిక** రూ. ఇసురుతడిక, ఇసుర్తడిక.

**విహరించు** స.క్రి. (అగ్నులతోకలిపి) వేర్పరచు లేదా విభజించు. భార.ఆది. 1.129.

సం. విహృ విలాసంగా తిరుగు, తొలగించు, పడేటట్లు చేయు, క్రీడించు.

<సం. విహృ + - ఇంచు[3].

**వీడు**[1] రూ. ఈడు[2].

**వీది** రూ. ఈది, ఈడు[3].

**వీధి**

**వీధిరేవు** రూ. ఈదిరేవు. **వీధులు** రూ. ఈదులు.

**వీపు** రూ. బీపు.

**వీరము**

**వీరకత్తియ** రూ. ఈరకత్తి, ఈరకత్తె. **వీరకాఁడు** రూ. ఈరకాఁడు.

**వీరతాడు** వి. జనపనారతో పేనిన కొరడా. దీనిని పసుపు కుంకుమలతో పూజించి పూజారి ఇంటిలో ఒక చెక్కపెట్టెలో ఉంచుతారు.

సం. వీర-. శూరుడు, ధీరుడు.

<సం. వీర- + తాడు (మిశ్రస.).

**వీరతాళ్ళపెట్టె** వి. వీరతాళ్ళుంచే పెట్టె: పూజారి ఇంటిలో ఒక ప్రత్యేకమైన గదిలో ఉన్న ఈపెట్టెను పసుపు కుంకుమలతో పూజిస్తారు. అంటు, ముట్టు ఉన్నవారు ఈగది చాయలకు కూడా వెళ్ళకూడదు.

వీరతాళ్ళపెట్టె చూ. వీరతాడు.

**వీరముట్టులు** రూ. ఈరముట్టులు, ఈరముస్టులు, వీరము-ష్టులు.

**వీరముష్టులు** రూ.చూ. వీరముట్టులు.

**వీర్లకుండలు** రూ. ఈర్లకుండలు.

**వీసము**

**వీసంబుడ్డి** రూ. ఈసంబుడ్డి.

**వుడ్డగచ్చకాయలు** చూ. ఉడ్డ. వి.బ.వ. గచ్చకాయలతో ఆడే ఆట. తాళ్ల. సం. 8.179.

**వుతక** వి. ఉత్తరాసికొయ్య.

**వుపద్రవము** రూ.చూ. ఉపద్రవము. వి. ఆపద.

**వూరు** రూ.చూ. ఉరు[1]. వి. గ్రామం, పట్టణం, ఊరు అనే పదానికి వ్యావహారికరూపం.

**వృత్తి** 'వ్రిత్తి' గా సవరించుకొని పఠించాలి.

**వృశ్చిక సంక్రాంతి** 'వ్రిత్తిక సంక్రాంతి'గా సవరించుకొని పఠించాలి.

**వెచ్చము** రూ. యచ్చము.

**వెడతులు** రూ. ఎల్తర, ఎల్తురు, ఏడతర.

**వెడల్పు** రూ. ఎలద్పు, ఎలుపు, ఎలెద్పు, వెలుపు[1].

**వెడల్పోడ** రూ. యడల్పోడ.

**వెండి**[1]

**వెండిగొడుగులు** వి.బ.వ. మొక్కుబడులున్నవారు 3 లేదా 11 తులాల వెండితో చిన్న చిన్న గొడుగులను గ్రామదేవతల పేరుమీద చేయిస్తారు. వీటిని వెండి గొడుగులంటారు.

**వెదురు**

**వెదురుకర్ర** రూ. ఎదురకర్ర. **వెదురు బద్ద** రూ. ఎదటిబద్ద. **వెదురులాక** రూ. ఎదటిలాక.

**వెనకపట్టె** రూ. ఎనికిపట్టి.

**వెనకయచవితి** రూ. ఎంకయసవితి.

**వెనక**

**వెనకయ్యపీట** రూ. ఎంకయపీట, ఎంకాయపీట, ఎనుకయ్యపీట, ఎన్కయపీట.

**వెన్ను**[1] రూ. ఎన్ను[4].

**వెన్నుకర్ర** రూ. ఎనకర్ర, ఎనగర్ర, ఎన్నుకర్ర, వి. ఇంటి నడికొప్పును మోసే కర్ర. **వెన్నుగాడి** రూ. ఎనగాడి, ఎనుగాడి, ఎన్నుగాడి. **వెన్నుచలవ** వి. పిల్లలు లేనివారు ఇంకొకరి సంతానాన్ని పెంచుకోవటం. ఈ విధమైన పెంపకం వల్ల తమకు సంతానం కలుగుతుందని సంతానహీనుల విశ్వాసం. **వెన్నుపట్టె** రూ. ఎన్నుపట్టి, ఎన్నుపట్టె.

**వెంబడి** చూ. వెంబడు. అవ్య్రు.

**వెంబడిలేనిసేద్యం** వి. నిష్ఫల ప్రయాస, వృథాశ్రమ. తోడులేని సేద్యం ఫలప్రదంకాదని పెద్దల భావన.

**వెయి** రూ. బెయ్.

**వెలమ**[3] రూ. ఎలమ.

**వెలి**[1]

**వెలంచు** రూ. ఎంచు.

**వెలిగించు** రూ. బెలిగించు.

**వెలితి** రూ. ఎల్తి, ఎల్తు.

**వెలుగు** రూ. ఎలుగు[2].

**వెలుగువేయు** రూ. ఎలుగుచేయు..

**వెలుపు**[2] చూ. వెలుచు[1].

**వెల్గ** రూ. ఎలగ.

**వెల్లబాటు** చూ. వెళ్ళు.

**వెళ్లు**

**వెళ్లబాటు** రూ. ఎలబారు. అ.క్రి. బయల్దేరు. <వెళ్ళు+-అ[7] + పాటు[3].

**వేకము** వి. సంతాపకరం.

మ. వెక్క. వేడి, వేక బొబ్బ.

**వేగు**[1]

**వేకువ** రూ. ఏకువ, యాకువ. **వేకువజాము** రూ. ఎగ్గిదాము, ఏకువజాము, యాకువజాము.

**వేగిరము** రూ. ఏగిరం.

**వేగిరపడు** రూ. ఏగిరపడు.

**వేకటి** రూ. యాగడి. విణ. బరువైన.

**వేట** చూ. ఏడి.

**వేదించు** స.క్రి. **2**. విసిగించు.

**వేప** రూ. ఈప, ఏప, యూప, యేప.

**వేపచీర** వి. చిక్కగా వేపమండలను ఒక నులకతాడుకు కట్టి బట్టలకు బదులుగా జాతరలో పొలికూడును చల్లే సమయంలో పురుషుడు ధరించే వస్త్ర విశేషం. 'చీర' పదం వస్త్రమనే సామాన్యార్థంలో (విస్తృతార్థంలో) జానపదులు వ్యవహరించటం విశేషం.

**వేరింటికాపురం** చూ. వేరు[2].

**వేరు**[1]

**వేరుసెనగ** రూ. ఏరిశెనగ, ఏరుసెనగ, ఏర్సనగ.

**వేరు**[2]

**వేరింటికాపురం** వి. అన్నదమ్ములు విడిపోయి వేరు-వేరుగా కాపురం ఉండటం.

**వేలు**[2]

**వేలుపట్టు** రూ. ఏలుపట్టు. **వేళ్ళకుపుస్తకం అంటుకుపోవు** అ.క్రి. ఎప్పుడు చూసినా పుస్తకం చేతిలో ఉంచుకొను.

**వేళ్ళకు పుస్తకం అంటుకుపోవు** చూ. వేలు[2].

**వై**[2] రూ. చూ వహి. వి. పుస్తకం.

**వైజ్ఞానికుడు** వి. విజ్ఞానశాస్త్రం బాగా తెల్సినవాడు.
సం. వైజ్ఞానిక-. నేర్పరి, నిపుణుడు.
<సం. వైజ్ఞానిక-. (అర్థవిపరి.).

**వైదికుఁడు** వి. బ్రాహ్మణుల్లో ఒకశాఖకుచెందిన వ్యక్తి.
సం. వైదిక-. వేదాధ్యయనాధ్యాపనాల్లో నియుక్తుడైన బ్రాహ్మణుడు.
<సం. వైదిక-. (అర్థవిపరి.).

**వైపు** రూ. ఎంపు, ఏపు.

**వైరి** వి. సంతోషం.

**వొగిసివాడు** విణ. వయసువాడు.
సం. వయస్ వయస్సు.
<సం. వయస్+వాఁడు.

**వోఘాయిత్తం** రూ.చూ. ఓఘాయిత్తం. వి. అమంగళం.
**వోఘాయిత్తం మాటలు** వి.బ.వ. అశుభపు మాటలు.

**వోది** రూ. వోదె. వి. పైరునుకోసి చేనుమీద వేసే చిన్నకుప్ప.

**వోదె** రూ.చూ. వోది. వి. పైరునుకోసి చేనుమీద వేసేచిన్నకుప్ప.

**వోను** రూ.చూ. వాను. స.క్రి. సారెమీద కుండలు మొ. వాటిని చేయు.

**వ్రిధా** వి. వ్యర్థం. తాళ్ళ.సం. 5.138.
సం. వృథా వ్యర్థం.
<సం. వృథా.

**శకుని** వి. మాయలు, మంత్రాలు చేస్తూ కుటిలమైన ఆలోచనలు చేసే వ్యక్తి.
సం. శకుని-. దుర్యోధనుని మేనమామ.
<సం. శకుని- (అర్థవిపరి.).

**శకుంతల** 'శకుంతల పచ్చ రూ. సెకుంతల పచ్చ' అని పఠించాలి. శకుంతల కింది 'శకుంతల చీర' ఉపారోపాన్ని ప్రధానారోపంగా సవరించుకోవాలి.

**శంకరగిరి మాన్యాలు** వి.బ.వ. దుర్గమ ప్రదేశాలు.
భద్రాచలం మన్యాల్లో నరసంచారానికి నోచుకోకుండా ఉండే దుర్గమ ప్రదేశాలు. కాబట్టి ఈ పలుకుబడి.

**శంకలు** వి.బ.వ. విరోచనాలు.
సం. శంకా అనుమానం, భయం, సందేహం, ఆశ, భ్రాంతి.
<సం. శంకా+-లు- (అర్థవిపరి.).

**శనిగ్రహం** వి. నిరంతరం పీడించే వ్యక్తి.
సం. శనిగ్రహ-. సూర్యుడికి ఛాయద్వారా పుట్టినవాడు, నవగ్రహాలలో ఒకడు.
<సం. శనిగ్రహ-. (అర్థవిపరి.).

**శరబము** వి. **1**. అడిదపుమెకం; **2**. గుండ్రంగా పెద్దకడుపున్న మృగం.
సం. శరభ- సింహం కంటె బలమైన మృగం.
<సం. శరభ-.

**శలవు** వి. **2**. అనుమతి.

**శాంతవము** రూ.చూ. జాణతనము. వి. గడుసు తనం.

**శాబాదురాయి**
**శాబాదురాళ్ళు** వి.బ.వ. నాపరాళ్ళు.

**శాబాదురాళ్ళు** చూ. శాబాదురాయి.

**శాస్త్రం** వి. **2**. జ్యోతిషం.

**శింగార** రూ.చూ. సింగారము. వి. శృంగారం. తాళ్ల.సం. 14.22.

**శింగిడి** రూ.చూ. సింగిణి. వి. ఇంద్రధనుస్సు.

**శిర్సుకడవ** వి. జాతర్లలో దున్నపోతును నరకడానికి ముందు దాని తల మీద నీళ్ళు పోయడానికి వాడే మట్టి పాత్ర.
సం. శిరస్ తల.
<సం. శిరస్ + కడవ.

**శిలుము** రూ.చూ. చిలుము[1]. వి. తుప్పు.

**శివనేత్రాలు** వి.బ.వ. మూడు రూపాయలు.
సం. శివనేత్ర-. శివుని కళ్ళు. (శివునికి మూడు కళ్ళు).
<సం. శివనేత్ర -+- ము+-లు. (అర్థవిపరి.).

**శివము** రూ. సిగం[2], సిరము.

**శివాలంటూ** రూ.చూ. శివాంట.

**శివాంట** రూ. శివా అంటూ. అవ్య. **1**. మొట్టమొదట; **2**. ప్రారంభిస్తూ; వి. మొదటిరోజు.
ఏదైనా పనిని మొదలు పెట్టేటప్పుడు శివుని స్మరించటం చాలామందికి అలవాటు.
సం. శివ-. పరమేశ్వరుడు.
<సం. శివ- + అను + -తు + -ఉన్.

**శీరిక** రూ.చూ. చీరిక. వి. పంపకంలో వచ్చిన తాటిచెట్లు.

**శీటుకురాకు** వి. మాంసం కూర.

**శుగ్గి** వి. పంట.

**శుద్ధబుద్ధావతారం** వి. మాటామంతీ లేని సౌమ్య వ్యక్తి.
సం. శుద్ధ-. పవిత్రమైన; సం. బుద్ధావతార- గౌతమ-బుద్ధుడు, సిద్ధార్థుడు.
<సం. శుద్ధబుద్ధావతార-. (అర్థవిపరి.).

**శుభ్రం** విణ. **1**. శుచి; **2**. మొత్తం, పూర్తిగా.
సం. శుభ్ర-. ప్రకాశించేది, తెల్లనిది, మంచి గంధం, వెండి.
<సం. శుభ్ర-. (అర్థవిపరి.).

**శుశ్రూష** వి. పరిచర్య.
సం. శుశ్రూషా వినవలెననే కోరిక.
<సం. శుశ్రూషా (అర్థవిపరి.).

**శేరు**[1] వి. **4**. కుంచంలో నాలుగోవంతు (గోదావరి జిల్లాలు).

**శ్రద్ధ** వి. ఆసక్తి.

సం. శ్రద్ధా నమ్మకం, విశ్వాసం, పట్టుదల.

<సం. శ్రద్ధా (అర్థవిపరి.).

**శ్రద్ధాంజలి** వి. చనిపోయిన వారికి సమర్పించే దోసిలి లేదా నివాళి.

సం. శ్రద్ధా + అంజలి-. శ్రద్ధతో ఘటించే కర్మ విశేషం;

సం. శ్రాద్ధ-. విశ్వాసం గలది, నమ్మకంగలది.

<సం. శ్రద్ధాంజలి- (అర్థవిపరి.).

**శ్రింగార** వి. శృంగారం.

<సం. శృంగార-. అలంకారం, సింగారం, శృంగార-రసం.

<సం. శృంగార-.

**శ్రీమతి** వి. **1**. వివాహిత స్త్రీ; **2**. భార్య.

సం. శ్రీమతీ ఐశ్వర్యవంతురాలు.

<సం. శ్రీమతీ (అర్థవిపరి.).

**శ్రీవాక్కు** వి. నాలుక.

సం. శ్రీవాక్ శుభమైన మాట.

<సం. శ్రీవాక్ (అర్థవిపరి.).

**శ్రీవారు** విణ. బ.వ. భర్త.

సం. శ్రీ సంపద, లక్ష్మి.

<సం. శ్రీ + వారు[1].

**షరాయి** రూ. సెరాయి. వి. పైజమా.

**షికారు** వి. పీర్ల పండుగలో మహమ్మదీయులు వాడే దీప ప్రమిదె.

**షీడు** రూ.చూ. సీడు. వి. **1**. లడిలో పదోవంతు నూలు; **2**. లడీలో అయిదో వంతు నూలు; **3**. 80 నెంబరు లడీలో ఇరవయ్యోవంతు నూలు; **4**. ఒక లడీనూలు; **5**. అనులు పడకుండా ఆసుపోసిన నూలు; **6**. పడుగులో సగంనూలు; **7**. పడుగులో కొంత భాగం నూలు; **8**. ఆసుపొయ్యటం ఉపవృత్తిగా గల రైతులు మొ. వారు అనులు లేకుండా పోసిన నూలు; **9**. ఆసు పోసిన నూలు, నేతలో నిలువుకు వాడే నూలు; **10**. పడుగులో విడదీసిన కొంతభాగం.

**షేరుమన్ను** వి. బంకమన్ను.

త. సేర్ బురద.

<త. సేర్ + మన్ను.

**షైనింగ్** రూ.చూ. షైనింగు. వి. ప్రకాశం, తళతళ.

**షైనింగ్‌పట్టు** అ.క్రి. పచ్చికూజాలకు ఎర్రరంగువేసిన తర్వాత మెరుగురాయితో నునుపు వచ్చేటట్లు బాగా రుద్దు.

<ఇం. Shining + పట్టు[2].

**షైనింగు** రూ. షైనింగ్. వి. ప్రకాశం, తళతళ.

ఇం. *Shining* ప్రకాశించటం, ప్రకాశం, కాంతి.

<ఇం. Shining.

**సంవ** వి. సంవత్సరం. E.I. సంపు. 1.1.

సం. సంవత్సర-. ఏడాదికాలం, 365 రోజుల కాలపరిమితి, వత్సరం.

<సం. సంవత్సర-.

**సంవచ్చర** వి. సంవత్సరం. IA. XI. 259. LL. 1202.

సం. సంవత్సర-. ఏడాదికాలం, 365 రోజుల కాలపరిమితి, వత్సరం.

<సం. సంవత్సర-.

**సంసారం** రూ.చూ. సంసారము. వి. కుటుంబం.

సం. సంసార-. పద్ధతి, మార్గం, ప్రపంచజీవయాత్ర, జనన మరణ ప్రవాహం, ప్రాపంచిక వ్యామోహం, ప్రపంచం.

**సంసారకలగుండుగండఁడు** చూ. సంసారము.

**సంసారము** రూ. సంసారం.

**సంసారకలగుండుగండఁడు** వి. సంసార లంపటం లేనివాడు. బసవ. 5.137.

**సంస్కారఁ** వి. పైకం.

సం. సంస్కార-. చక్కబరచటం, కర్మఫలం, మతసంబంధకార్యం, వండటం, శక్తి, సిద్ధపరచటం.

<సం. సంస్కార-. (అర్థవిపరి.).

**సకినము** తాళ్ల.సం. 17.217.

**సక్కు**[1] వి. **2**. అట్టు.

**సఖము** రూ.చూ. సగము. వి. సగం. నె.శా.దర్శి. 41. క్రీ.శ. 1137.

**సగచేయు** చూ. సగము.

**సగము** రూ. సఖము.

**సగచేయు** స.క్రి. తయారుచేయు. **సగపాలు** వి. **1**. అర్ధభాగం; **2**. సంగోరు, ఆసామి, సాగుచేసిన రైతుపంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి.

**సగవేయు** రూ. సగేయు.

**సగుదు** రూ.చూ. చవుడు. వి. ఉప్పనేల, మామూలుగా తెలుపు రంగుగల ఉప్పనేల బిరుసుగాఉండి నీరింకని నేల.

**సగేయు** రూ.చూ. సగవేయు. అ.క్రి. సుడిబండి చక్రాలకు కందెనవేసి తక్కిన భాగాలు కూడా సరిగా ఉన్నాయో లేదో చూచి సరిచేసి బండిని ఊరేగింపుకు సిద్ధంగా అలంకరించు.

**సంకటము** వి. **2**. ఒక తిట్టు.

**సంకటి**

**సంకటిముద్ద** వి. రాగులపిండితోకాని జొన్ననూకతో-కాని వండిన పదార్థం.

**సంకు**[1]

**సంకుతెగులు** వి. జొన్నసజ్జ మొ. పైర్లతెగులు. ఈ

తెగులువల్ల కంకి, ఆకులు, దంటు తెల్లబడిపోతాయి. సగం పంటే పండుతుంది.

సంకురాతి రూ.చూ. సంకురాతిరి. వి. సంక్రాంతి.

సంకురాతిరి రూ. సంకురాతి. వి. సంక్రాంతి.

సం. సంక్రాన్తి-. జనవరి 14వ తారీఖున సాధారణంగా వచ్చే తెలుగువారి పెద్దపండుగ.

<సం. సంక్రాన్తి-.

సంకెల

సంకెళ్ళసుడి వి. 1. బొండకొయ్య (సుడి) మోకాళ్ళ దిగువన ఉండే కేడిసుడి. ఇది ఉంటే యజమానికి సంకెళ్ళు పడతాయని నమ్మకం; 2. చెరుపు.

సంకెళ్ళసుడి చూ. సంకెల.

సంగ[2] వి. వదిన.

హిం. సంగ్ సంబంధం.

< హిం. సంగ్.

సంగడి[1]

సంగడిచుక్కలు వి.బ.వ. పూర్వోత్తరాభాద్రలు కావచ్చు దగ్గర దగ్గరగా ఉండే నాలుగు చుక్కలు. సంగడిబావి వి. రెండు మోటలుకట్టి తోలేబావి. సంగడిమోట వి. జంటమోట. ఒకే బావికి రెండు వైపులా రెండు మోటలు కట్టితోలే పద్ధతి.

సంగె వి. చెప్పులు.

సజ్జ[2] రూ. పొద్ద.

సజ్జు వి. 5. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి. బిగించిన నాలుగు పట్టెలకు కుచ్చుతాళ్ళు కట్టి కొయ్యలు బిగిస్తారు.

సంచీ వి. 2. ఒక రకం అంటురోగం. నోట్లోను, కాళ్ళగిట్టల్లోను పుళ్ళు ఏర్పడే రోగం. అమ్మవారని వ్యవహారం.

సంజాయిషీ రూ. సంజాయిష్.

సట్టి రూ.చూ. చట్టి. వి. 1. చిన్నకుండ; 2. సంక్రాంతి.

సడ[3] వి. ఒక రకం కంచె మొక్క.

సడెంకొట్టు స.క్రి. క్రర, వరి మొ. పైర్ల కట్టలు చేతులతో పట్టుకొని బల్లకేసికొట్టి గింజలురాల్చు.

సణగు

సణగులు వి.బ.వ. అనిష్టవచనాలు. తాళ్ల.సం. 17.553. క. సణె అసంతోషాన్ని లేదా కోపాన్ని కల్గించే భంగిమను చూపు.

సండర్స్ వి. మరుగుదొడ్డి.

హిం. సండాస్ పాయిఖానా, మరుగుదొడ్డి.

< హిం. సండాస్.

సండిగలు వి.బ.వ. వడియాలు.

క. సండిగె వడియం.

<క. సండిగె.

సంద్రం వి. 2. సర్పం, వంపుడు వాసం, పంగలుగా ఉన్న ఒసి కర్రలపై పొడుగ్గా వేసిన కర్ర.

సదష్టపడు అ.క్రి. స్థిమితపడు.

సదావృత్తి వి. 3. ఆయవారం, దినచర్య గడపటం.

సంతన వి. 5. బలగం. అ.క్రి. 1, 2 అర్థాల్ని పూర్తిగా తొలగించాలి.

సంతనభరము వి. సంతలోని వర్తక సంఘం. ద.హిం.శా. సంపు. 7. శా. సం. 134.

సంతనిపారువలు వి.బ.వ. గోడలు. నె.శా. 4.3. క్రీ.శ. 1628.

సంతన్‌కోర రూ.చూ. సంతన్‌కోరా. వి. పసుప్పచ్చ వన్నెలో ఉండే ఒక రకం ముడిపట్టు.

సంతన్‌కోరా రూ. సంతన్‌కోర. వి. పసుప్పచ్చ వన్నెలో ఉండే ఒక రకం ముడిపట్టు.

సంతానంపేటు వి. బాతు పిల్లల బొమ్మలు పడేట్టు అంచులోనేసిన డిజైను.

సం. సన్తాన- సంతతి.

<సం. సంతాన- + పేటు[3].

సంతాపం వి. విచారం.

సం. సంతాప-. వేడి, అధికతాపం, బాధ, తపస్సు, శరీరాన్ని శుష్కింపజేయుటం.

<సం. సంతాప-. (అర్థవిపరి.).

సంతార్ రూ.చూ. సాంత్రా. వి. కమలాఫలం.

సంత్రా రూ.చూ. సాంత్రా. వి. కమలాఫలం.

సంద

సందకాడ తాళ్ల.సం. 2.307. సందకాపు వి. సాయంకాలం పొలం కాపలా.

సందకల్బుగోడ వి. దూలంమట్టం వరకు లేచిన గోడ.

సందాకబళం చూ. సంద. వి. సంధ్యాకబళం, మధుకర వృత్తి.

సంది వి. 9. కాళీ, రాళ్ల వరసలకు మధ్య ఉన్నస్థలం, 10. గోడ కట్టేటప్పుడు రాళ్ళ మధ్య వచ్చేకాళీ; 11. గాడి, గానుగరాతి చక్రం తిరిగే సన్నటి గుండ్రటి కాలవ.

సందిటపట్టు చూ. సంది. స.క్రి. సారె మీద వున్న పెద్దవాటను కిందికిదించు.

సందు[2] 19. పడుగులో రెండు అనుల మధ్యభాగం; 20. పన్నెదండెలకు బిగించిన పుల్లల మధ్య వెలితి; 21. అంచులో రెండు రకాల డిజైన్లలో నేసిన భాగాలకు మధ్య మామూలుగా నేసిన భాగం; 22. కమ్మినేతతో తలచిట్టికు, పెద్దపెట్టెకు మధ్య మామూలుగా నేసిన భాగం; 23. కమ్మి చివరి బద్దెకు తల చిట్టికు మధ్యభాగం.

సందుఎత్తు వి. పడుగులో రెండు అనుల మధ్యభాగం.

సందుఏరు వి. పడుగులో రెండు అనుల మధ్యభాగం.

సందుకచ్చె వి. పడుగులో రెండు అనుల మధ్యభాగం.

**సందుకట్టు (భూమి)** వి. 3. మసరనేల, రేగడి, ఇసక కలిసిననేల. **సందుకడ్డీ** వి. అడ్డగెనె, మొగరాల మీది దూలంకింద పరచే అడ్డవాసం. **సందుకాల్వ** వి. మళ్ళకు నీరు సరఫరా చేసే కాల్వ. **సందుకుంచి** రూ.మా. సందుకుంచె. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందుసందుకూ కుంచె ఆపుతూదువ్వటం. **సందుకుంచె** రూ. సందుకుంచి. వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరు బదునులో ఉండగా సందుసందుకూ కుంచె ఆపుతూ దువ్వటం. **సందుకుంచెఈడ్చు** స.క్రి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందుసందుకూ కుంచె ఆపుతూ దువ్వు. **సందుకంచెతీయు** స.క్రి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుపదునులో ఉండగా సందుసందుకూ కుంచె ఆపుతూ దువ్వు. **సందుకుంచెవేయు** స.క్రి. సరిచేసేటప్పుడు పడుగు ఆరు బదునులో ఉండగా సందుసందుకూ కుంచె ఆపుతూదువ్వు. **సందుగోడ** వి. కడగోడ, ఇంటిపక్కగోడ. **సందునేత** వి. చీరకొంగులో రెండు పట్టెల నడిమినేత. **సందుపలక** వి. 1. బండి పరంలో పోలు కిరుపక్కలా ఉండే చెక్క; 2. రీపరు పట్టె, ఇంటి కప్పు వేయటంలో వాడే పల్చని చెక్క. దంతుల మధ్య బిగించేది. **సందుపోగు** వి. పడుగులో కింది పోగులకూ పై పోగులకూ మధ్య వచ్చిన అనిలేని దారం. **సందుపోటీ** వి. సందు కెదురుగా ఇల్లుండటమనే తప్పు. సందుకు ఎదురుగా కిటికీగాని దర్వాజాగాని పెడితే ఈ తప్పుపోతుంది. **సందురేవులు** వి.బ.వ. ఆముగోడ పక్కల నుంచి కొమ్ము రేవుల వెంబడి అటొకటి ఇటొకటి సందులు వచ్చేలాగ కట్టిన రేవులు. **సందులాక** వి. పడుగులో రెండు కచ్చుల మధ్యలో దూర్చే అడ్డబద్ద. **సందులిల్లు** వి. భాగాలుగా కట్టిన ఇల్లు. <సందు$^2$ + -లు + ఇల్లు. **సందులు** వి.బ.వ. ఆముపడుగులో కుండల పేర్పు మధ్య కట్టెకంప వేయడానికి వదలిన సాళ్లు. **సందులుకొట్టు** స.క్రి. ఉన్నిపడుగు సరిచేసేటప్పుడు అనుల మధ్య పోగులు అంటుకు పోకుండా తిప్పు. **సందులెత్తు** అ.క్రి. 1. పడుగులో రెండు కచ్చుల మధ్య పోగులు అంటుకు పోకుండా లాకలతో విడదీసి దువ్వు; 2. పడుగులో అని పోగులు లాకలతో విడదీయు. <సందు$^2$ + - లు + ఎత్తు$^1$. **సందులేయు** అ.క్రి. సరిచేసేటప్పుడు అనులెత్తు. <సందు$^2$ + - లు + వేయు$^1$. **సందువాకిలి** వి. దొడ్డివాకిలి, ఇంటివెనుక ఉన్న ద్వారం.

**సందుక** రూ.మా. చందుగు$^2$. వి. పెట్టె.

**సందుకు** రూ.మా. చందుగు$^2$.

**సందుగ** రూ.మా. చందుగు$^2$. వి. పెట్టె.

**సందుగు** రూ.మా. చందుగు$^2$.

**సందుచుక్క** రూ.మా. సందెచుక్క. వి. సంధ్యాకాలంలో కన్పించే నక్షత్రం.

**సందూకా** రూ.మా. చందుగు$^2$. వి. 1. చిన్నపెట్టె; 2. బోషాణం; 3. మేజాఅర.

**సందె**

**సందెకాడచుక్క** వి. సందుచుక్క. మూల చుక్క బృహస్పతి పేరుతో ఉండే చుక్క. ఒక్కొక్కప్పుడు సూర్యుడు అస్తమించిన తర్వాత పడమట కనపడుతుంది. **సందెచుక్క** రూ. సందుచుక్క. వి. సంధ్యాకాలంలో కన్పించే నక్షత్రం.

**సందెడపట్టు** స.క్రి. సారెమీద ఉన్న పెద్ద వాటను కిందికిదించు.

**సందెవ** వి. చుట్టుగోడ, ఇంటికి చుట్టూ కట్టినగోడ.

**సంద్ర** రూ.మా. చంద్ర. వి. 2. ముళ్ళుగల ఒక రకం ఎడారి చెట్టు, ఖదిరం (Mimosa Sundra, Roxb).

**సంధ్యాబొగిడి** వి. నిండుబుగిడి కింద మరొక అర్ధబుగిడి పడేట్లు నేసిన డిజైను.

సం. సంధ్యా సంధ్యా సమయం, సూర్యుని భార్య.

<సం. సంధ్యా + బొగిడి (మిశ్రస.).

**సన్న$^2$**

**సన్నమొగ్గలు** వి.బ.వ. మల్లెపూలు.

**సన్యాసి** వి. ఎందుకూ పనికిరానివాడు, అప్రయోజకుడు.

సం. సన్న్యాసిన్ ఉంచేవ్యక్తి, లౌకిక విషయాలను వదిలిన యతి, సన్యాసాశ్రమ స్వీకారం చేసినవాడు.

<సం. సన్న్యాసిన్ (అర్థవిపరి.).

**సప్పట$^2$** వి. 1. ఇంటి కింద పరిచేబండ; రి 2. వరండా.

**సబకు** 'సజ్జకట్టు'గా పఠించాలి.

**సబ్జా$^1$**

**సబ్జాబండ** వి. కప్పుబండ, ఇంటికప్పుకు వాడేరాయి.

**సభికుఁడు** వి. సభాసదుడు. భార.విరా. 2.176.

సం. సభిక-. జూదమాడించేవాడు, న్యాయవాది.

<సం. సభిక- (అర్థవిపరి.).

**సమర్థవంతం** వి. సామర్థ్యంతో కూడినట్టిది.

సంస్కృత 'మతుప్' ప్రత్యయానికి కలవాడు లేదా కలది అని అర్థం. పదాంతంలోని ఇకార ఉకారాల తర్వాత 'మంత' గాను అకారాంతాల తర్వాత 'వంత' గాను ఈమతుప్ ప్రత్యయం ఉంటుంది. నామవాచకాల తర్వాత మాత్రమే ఈ ప్రత్యయం చేరుతుంది. సమర్థ విశేషణ రూపం. కాబట్టి సమర్థవంతం సంస్కృత వ్యాకరణ విరుద్ధరూపం. ఇది తెలుగు వారి కల్పన.

**సమర్థవంతుడు** చూ. సమర్థవంతం. వి. సామర్థ్యంతో కూడిన వాడు.

నామవాచక శబ్దాల తర్వాత మాత్రమే ఈ మతుప్ ప్రత్యయం చేరుతుంది. సమర్థ విశేషణ రూపం. కాబట్టి 'సమర్థవంతుడు' శబ్దరూపం సంస్కృత వ్యాకరణ విరుద్ధం. ఇది తెలుగువారి కల్పన. సంస్కృత వ్యాకరణ పద్ధతి ప్రకారం సామర్థ్యవంతుడు/సమర్థతావంతుడు/ సమర్థత్వా

వంతుడు శబ్దరూపాలు సాధువులు.

**సమర్థవంతురాలు** చూ. సమర్థవంతం. వి. సామర్థ్యంతో కూడిన స్త్రీ.

నామవాచక శబ్దాల తర్వాత మాత్రమే ఈ మతుప్ ప్రత్యయం చేరుతుంది. సమర్థవిశేషణ రూపం. కాబట్టి 'సమర్థవంతురాలు' శబ్దరూపం సంస్కృత వ్యాకరణ విరుద్ధం. ఇది తెలుగు వారి కల్పన. సంస్కృత వ్యాకరణ పద్ధతి ప్రకారం సామర్థ్యవంతురాలు/సమర్థతావంతురాలు/సమర్థత్వవంతురాలు అనే శబ్దరూపాలు సాధువులు.

**సమాచారం** వి. **1**. వార్త; **2**. వృత్తాంతం.

సం. సమాచార-. చక్కని ఆచారం, శ్రేష్ఠమైన నడవడిక, ప్రవర్తన, వృత్తాంతం.

<సం. సమాచార-. (అర్థవిపరి.).

**సమాదిగాడు** వి. నజ్జుగాడు.

సం. సమాధి-. మనోలయం, ఏకాగ్రచిత్తత, ఏకాగ్రత.

<సం. సమాధి - + - కాఁడు.

**సమాధి** వి. చనిపోయిన వారి స్మృతి చిహ్నంగా కట్టిన కట్టడం.

సం. సమాధి-. మనోలయం, విలయం, ఏకాగ్రత, ఏకాగ్రచిత్తత.

<సం. సమాధి-. (అర్థవిపరి.).

**సమురుపాతలోడు** విణ. జడిపాతలోడు. గ్రామానికి సంవత్సరంలో జరిగే మంచి చెడ్డల్ని గురించి చెప్పేవాడు. చమురు (నూనె) అంటి ఉన్న బట్టలు ధరించేవాడు.

**సమైక్యత** వి. మిక్కిలి ఐక్యత.

సమేకభావం 'సమైక్యం/సమేకతా/సమేకత్వం' అనే శబ్దరూపాలు సంస్కృత వ్యాకరణ ప్రకారం ఏర్పడతాయి. 'సమైక్య' అనే తద్ధిత రూపంపై మరో తద్ధిత ప్రత్యయాన్ని చేర్చి 'సమైక్యతా' రూపాన్ని కల్పించటం తెలుగువారి కల్పన. 'ఐక్యత' కూడా తెలుగువారి కల్పన.

**సంపతికుంటు** వి. సంపదవల్ల నిర్లక్ష్యంగా వ్యవహరించటం.

**సంపతికురుపు** వి. **1**. సంపదవల్ల నిర్లక్ష్యంగా వ్యవహరించటం; **2**. సంపదవల్ల తెలిసిన వారిని కూడా గుర్తించనట్లు ప్రవర్తించటం.

**సంపాదకుడు** వి. ఎడిటర్, సంకలన కర్త.

సం. సంపాదక-. నెరవేర్చేవాడు, గడించేవాడు.

<సం. సంపాదక-. (అర్థవిపరి.).

**సమ్మంద** రూ.చూ. సమ్మంధము. వి. సంబంధించినది. తాళ్ల.సం. 18.354.

**సయోధ్య** చూ. సయొద్ద. వి. స్నేహం.

**సరంజాం** వి. **3**. ఏర్పాట్లు.

**సరళి** వి. **2**. విధం; **3**. విధానం.

సం. స్వరావళి-. సంగీత శాస్త్రంలోని స్వరాల పంక్తి.

**సరసము**

**సరసములాడు** స.క్రి. పరిహాసోక్తులు పలుకు. < సరసము + - లు + ఆడు.

**సరిపిండిబండ** 'సరిపిడిబండ' గా పఠించాలి.

**సరుగుడు**[3] వి. **2**. నారు కట్టలను పొలానికి చేర్చే సాధనం.

**సర్వంజగన్నాథం** వి. **1**. కులమత భేదం లేకుండా అంతా కలిసి మెలసి ఉండే స్థితి, కలగాపులగం, ఎంగిలి మంగలం; **2**. అపరిశుభ్రతను తెలిపేటప్పటి పలుకుబడి.

సం. సర్వమ్ జగన్నాథ-. అంతా జగన్నాథ మయం. పూరీ జగన్నాథుని ప్రసాదం వర్ణవివక్షలేకుండా అందరికీ పంచబడుతుంది. కాబట్టి తెలుగులో అర్థవిపరిణామం కలిగి ఉంటుంది.

<సం. సర్వంజగన్నాథ-. (అర్థవిపరి.).

**సర్వమంగళము** వి. **2**. సర్వనాశనం.

**సల** వి. **4**. వెదురుబద్దలతో వేసిన వల.

**సలాకు** వి. **9**. అట్లకాడ.

**సలిగె** వి. **2**. పరిచయాధిక్యం. తాళ్ల.సం. 5.329; **3**. అహంభావ పూరిత వాక్కు. తాళ్ల.సం. 17.553.

క. సలిగె పరిచయాధిక్యం.

<క. సలిగె.

**సలిపిరిబండ** రూ.చూ. సలిపిడిబంద.

రూ.చూ. సరిపిడిబండగా పఠించాలి.

**సలిబిండి** రూ.చూ. చలిమిడి[2]. వి. బెల్లం, బియ్యంపిండి, నీరు కలిపి చేసే భక్ష్య విశేషం.

**సల్లగల్లు** వి. స...

<చల్ల[2] + కల్లు[1].

**సల్లంది** రూ.చూ. చల్లండి. వి. సద్ది అన్నం.

**సల్లాడ** రూ.చూ. చల్లడము. వి. లాగు, నిక్కరు.

**సల్లు**[1] వి. తాలు, లోపల బియ్యం లేకుండా ఉన్న వడ్లను సల్లు అంటారు.

**సల్లుకొను** అ.క్రి. తప్పుకొను. **సల్లువిడుచు** స.క్రి. వదులుగా విడుచు.

**సల్లించు** చూ. సల్లు.

**సల్లు**

**సల్లించు** స.క్రి. వదులుచేయు. <సల్లు + -ఇంచు[3].

**సవకలిచ్చు** రూ.చూ. చౌకళించు. అ.క్రి. **1**. దుముకు; **2**. పైకి హఠాత్తుగా ఎగురు.

**సవా**

**సవాలక్ష** వి. **1**. లక్షంబావు; **2**. అనేకం, అసంఖ్యాకం. <సం. లక్షా 100 వేలు.

**సవుకులు** వి.బ.వ. రాటలు.

**సవ్యం** వి. అనుకూలం.

సం. సవ్య-. ఎడమ, కుడి, ప్రతికూలం.

<సం. సవ్య-. (అర్థవిపరి.).

సహి[స]ంగతి

సం. సహ్రసార-. సహ[స]ారం అనే పేరుగల చక్రం గతి- గమనం.

<సం. [స]హ[స]ారగతి-.

సాక్షాత్కారము వి. దైవ దర్శనం.

సం. సాక్షాత్కార-. ప్రత్యక్షం కావటం. జ్ఞానం, ఇంద్రియ గోచరం కావటం.

<సం. సాక్షాత్కార-. (అర్థవిపరి.).

సాక్షాత్కరించు అ.క్రి. దైవం ప్రత్యక్షమగు.

సం. సాక్షాత్కృ కళ్ళముందుంచు, కనిపింపచేయు.

<సం. సాక్షాత్కృ +- ఇంచు[3]. (అర్థవిపరి.).

సాగు[1]

సాగఁదోలు అ.క్రి. ఏరువాక సాగు.

సాగుఁబడి[2] వి. 2. ఏరువాక.

సాంగ వి. జల్లు.

సం. సాంగ- అవయవాలతో కూడినది, షడంగాలతో కూడినది, పూర్ణమయినది.

సాంగ్యము రూ. సాంజ్ఞం.

సాంజ్ఞం రూ.చూ. సాంగ్యము. వి. 1. ఆచారం; 2. నియమం.

సాచ్చురంబుకొలువు వి. పంచాయితీ చేసే స్థలం.

సాండిగలు వి.బ.వ. వడియాలు.

సాదకం వి. కూరానారా వంటకాలు.

సం. సాధక-. సాధించేది.

<సం. సాధక-.

సాదు[4] చూ. సాఁదు. వి. మూత్రం.

సాని[1]

సానిమేళం వి. మేజువాణి.

సాం[త]ర రూ.చూ. సాం[త]ా. వి. కమలాఫలం.

సాం[త]ా రూ. సం[త]ా, సాం[త]. వి. కమల, నారింజ భేదం. మామూలు నారింజ కన్నా పండు చిన్నది తొక్కవదులు, నునుపు, రంగు, ఎరుపు, పసుపు, కండ ఎరుపు, తీపి (tangerine) (citrus reticulata).

సాపరా చూ. చప్పరము వి. తాటి ఆకుల పందిరి.

సాబంతి విశ. 1. (భోజనాది) సహపంక్తి; 2. ఒకే వరసలోనిది.

సం. సహ- కూడా; పంక్తి- వరస.

<సం. సహ-+బంతి[2].

సాంబార వి. కొత్తిమెర.

సారపోతు వి. దున్నపోతు.

సం. సార-. సారంకల, బలంకల.

<సం. సార -+ పోతు[2]. (మి[శ]స.)

సారవ[2] వి. 2. పొలాల్లో నీరు పారటానికి కట్టిన పిల్లకాలవ.

సారి[2]

సారేకం వి. ఆట పట్టించుటం. సం. ఏక- ఒకటి, <సారి[2] +సం. ఏక-[2].

సారి[4] రూ. సారీ. వి. విచారం.

ఇం. *Sorry* దుఃఖం, విచారం.

<ఇం. Sorry.

సారీ రూ.చూ. సారి[4]. వి. విచారం.

సారేకం చూ. సారి[2].

సారేదార్ వి. అటవీశాఖాధికారి.

సాల[గ]ామం వి. నీరుల్లి.

సం. సాల[గ]ామ-. విష్ణుమూర్తి చిహ్నిత శివా విశేషం, బృందాశాపం వల్ల విష్ణుమూర్తి శివా రూపాన్ని పొందాడు.

<సం. సాల[గ]ామ-. (అర్థవిపరి.).

సాలు[3] వి. 3. ముగ్గురు మనుషులు పొలంలో ఒకేసారిదున్నే పద్ధతి.

సాలుముద్దలు వి.బ.వ. అమ్మవారికెదురుగా పెట్టే ఐదు కుంభం ముద్దలు.

సింహస్వప్నము వి. అధికభయం.

సం. సింహస్వప్న-. సింహానికి సంబంధించిన కల. ఏనుగుకు సింహం కలలోకి వస్తే చస్తుందని ఒక భావన.

<సం. సింహస్వప్న-. (అర్థవిపరి.).

సిగ

సిగమారు వి. 2. దళసరి వారును సన్నటి కుచ్చులుగా కత్తిరించి కొమ్ములకు కట్టే ఆభరణ విశేషం.

సిగం[2] రూ.చూ. శివము. వి. పూనకం.

సిగాలు రూ.చూ. సివాలు. వి.బ.వ. పూనకాలు.

సిగాలు చూ. సిగం[2].

సింగఁడు

సింగఁడు బూరడు వి. విజృంభించేవాడు.

సం. శృంగ-. కొమ్ము.

సింగారము రూ. శింగార.

సింగిణీ రూ. శింగిడి.

సింగినాదము

సింగినాదము జీలకఱ్ఱ వి. ఏమీ విశేషం లేదు అనే భావాన్ని తెలిపేటప్పటి పదబంధం. వ్యు. సుగంధ ద్రవ్యాలను బిడారు వర్తకులు ఊళ్ళ సమీపానికి తీసుకొని వచ్చి గుడా-రాలను దింపి తమ రాకను సింగినాదము (<శృంగనాదం = కొమ్ముధ్వని) తో సూచించేవారు. అప్పుడు గ్రామ, పట్టణ, నగర ప్రజలు వస్తువినిమయ మొనర్చుకొనేవారు. శృంగ-

నాదం వినపడిందంటే జీలకర్ర వంటి వస్తువులు సమీపానికి వచ్చాయన్నమాట. తర్వాత బిడారు వర్తకం తగ్గిపోయింది. సింగినాదం లేకుండానే కోయలు మొ. వారు పూసలు దువ్వెనలు మొ. వాటిని అమ్ముతున్నారు. సింగినాదం వాడుక నుంచి పోయింది. జీలకర్ర కిరాణా కొట్లలో దొరుకుతుంది. నేడు సింగినాదమూ లేదూ జీలకర్రాలేదు.

**సిట్టి** రూ.చూ. చిటి. వి. పోలలో నాలుగోభాగం, దాదాపుగా వంద గ్రాములు.

**సిడి**[1]

**సిడిపోతు** వి. **1.** గ్రామదేవతకు బలి ఇవ్వటానికి బాగా పెంచబడే గొర్రె లేదా మేక; **2.** తెగతిని బలిసే పోమరి.

**సియ్యలు** వి.బ.వ. మాంసం ముక్కలు.

**సిరిబండి** చూ. సిరి. సిడిమాను, జాతర్లలో కట్టే ఒక రకం బండి.

**సిర్ర** చూ. చిఱ్ఱు. వి. కోపం.

**సిలకట్టు** వి. **1.** కచ్చ; **2.** పంచెకట్టు.

**సిలుం** రూ.చూ. చిలుము[1]. వి. తప్పు.

**సిల్ల**[2] వి. సమాధి.

సం. శిలా రాయి.

**సిల్లపెంకు** రూ. చూ. చిల్లపెంచు. వి. పగిలిన కుండ మొ. వాటి పెంకు.

**సివము** రూ.చూ. శివము. వి. ఊరేగింపు మొ. సందర్భాలలో దేవత పూనటం, పూనకం.

**సివాలు** రూ. సిగాలు. వి.బ.వ. పూనకాలు.

**సివాలు** చూ. సివము.

**సివ్వు** స.క్రి. చెక్కు.

**సిష్టి** వి. సృష్టి. తాళ్ల.సం. 5.258.

సం. సృష్టి-. సృజన.

<సం. సృష్టి-.

**సీకరించు** అ.క్రి. కమ్ముకొను.

సం. స్వీకృ అంగీకరించు, గ్రహించు.

<సం. స్వీకృ +- ఇంచు[3]. (అర్థవిపరి.).

**సీతాపలుకపండ్లు** వి.బ.వ. సీతాఫలాలు.

సం. సీతా రామపత్ని, జానకి.

**సీతుంగాలము** వి. శీతాకాలం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1342.

సం. శీతకాల-. చల్లగా ఉండే కాలం.

<సం. శీతకాల-.

**సీలిగుంట** చూ. సీల. వి. అల్లరిపిల్ల.

**సుకియించు** తాళ్ల.సం. 9.164.

**సుగీలు** వి.బ.వ. బూరెలు.

**సుగ్గి** రూ. సుగ్గీ.

**సుగ్గీ** రూ.చూ. సుగ్గి. వి. పంటకోతల కాలం.

**సుట్టిల్లు** రూ.చూ. చుట్టిల్లు. వి. వలయాకారంగా మట్టిగోడకట్టి ఒక తలుపును మాత్రమే పెట్టి మీద వాసాలు ఎండుబోదను ఉపయోగించి తయారు చేసే ఇల్లు.

**సుడిబండి** చూ. సుడి. వి. సిడిమాను, జాతర్లలో కట్టే ఒక రకం బండి.

**సుడిమాను** చూ. సుడి. వి. సిడిమాను, జాతర్లలో కట్టే ఒక రకం బండి.

**సుండలు** వి.బ.వ. గుగ్గిళ్ళు.

త. సుండల్ గుగ్గిళ్ళు.

<త. సుండల్.

**సుతి** వి. **5.** దాదాపు 12 అంగుళాల పొడవు 5 అంగుళాల వెడల్పు కలిగిన పీపాలాంటి వాద్యవిశేషం.

<పా. సుతి.

**సున్నపుఁగాయ** చూ. సున్నము.

**సున్నము**

**సున్నపుఁగాయ (-కాయ)** రూ. సున్నపుఁగాయి.

**సున్నపుఁగాయి** రూ.చూ. సున్నపుఁగాయ. వి. స్త్రీలు చిల్లర దాచుకొనే చిన్న డబ్బావంటి ఆకారం కలది.

**సుపారి** రూ. సుపారీ. వి. **2.** పొగాకుతో వక్కను కలిపిన మాదకద్రవ్య విశేషం.

**సుపారీ** రూ.చూ. సుపారి. వి. **1.** వక్క; **2.** పొగాకుతో వక్కను కలిపిన మాదకద్రవ్య విశేషం.

**సుమ్మ**[2] వి. నీరు మోయటానికి స్త్రీలు లేదా పురుషులు బిందెల కింద తలపైన పెట్టుకొనే గుడ్డచుట్టు.

**సురీటి** వి. పొలాలలో నీరు చల్లటానికి వాడే సాధన విశేషం.

**సుల్ల**[2] వి. అనృతం, అబద్ధం.

క. సుళ్ళు- అబద్ధం, అసత్యం, మృష.

<క. సుళ్ళు.

**సుసరము** విశ. **2.** శీఘ్రం.

క. సుసర కష్టం లేకుండా సులభంగా పోవు.

**సుసరాన** క్రి.విశ.ద్రు. వెంటనే, శీఘ్రంగా. తాళ్ల.సం. 18.211.

**సుసరాన** చూ. సుసరము.

**సూత** అవ్య. కూడా.

సం. సహిత-. కూడినది.

<సం. సహిత-.

**సూపర్** విశ. **1.** శ్రేష్ఠం; **2.** బాగైన.

ఇం. *Superb*. శ్రేష్ఠం.

<ఇం. Superb.

**సూపర్‌టేస్టు** వి. అత్యంత మధురం, ఎక్కువ రుచి.

ఇం. *Super taste* అత్యంత మధురం.

<ఇం. Super taste.

సూపర్‌స్టార్ వి. గొప్ప సినీ నటుడు లేదా నటి.

ఇం. *Super Star* సర్వోన్నతనటుడు లేదా నటి, గొప్ప నక్షత్రం.

<ఇం. Super Star.

సూపర్ హిట్ రూ. సూపర్‌హిట్టు. వి. ఘనవిజయం.

ఇం. *Super Hit.* ఎక్కువ విజయం.

<ఇం. Super Hit.

సూపర్‌హిట్టు రూ.చూ. సూపర్‌హిట్. వి. ఘనవిజయం.

సూరియుండు వి. సూర్యుడు. తాళ్ల.సం. 7.5.

సం. సూర్య-. సూర్యుడు.

<సం. సూర్య-.

సూర్యకాంతంపూవు వి. పొద్దు తిరుగుడు పువ్వు.

సం. సూర్యకాంత-. వృక్షక విశేషం.

<సం. సూర్యకాంత- + - ము + పూవు.

సూర్లు[2] వి.బ.వ. తూర్లు, పార్లు.

సూలధ చూ. సూలము.

సూళ్ళు వి.బ.వ. వస్త్ర విశేషాలు.

సృజన వి. చేసిన కర్మ.

సం. సృజన-. సృష్టి.

<సం. సృజన- (అర్థవిపరి.).

సెకలు వి.బ.వ. కళలు.

సెకుంతల పచ్చ రూ.చూ. శకుంతల పచ్చ. వి. **1.** ఒక రకం లేత ఆకు పచ్చరంగు; **2.** రామపచ్చలో లేత రంగు; **3.** తెలుపులో పసుపచ్చ; **4.** పచ్చలో నలుపు, తెలుపు కలిపిన వన్నె; **5.** ముదురు పచ్చలో నలుపు వాయ.

సెగటగొడ్డు చూ. సెగటు, సెగ. వి. పొగరైన పశువు.

సెరవ వి. బిందె.

సం. శరావ-. మూకుడు, పళ్ళెం, మట్టిపాత్ర; ప్రా. సరావ-. పళ్ళెం; పా. సరావ-.

<ప్రా. సరావ-.

సెరవకుండ 'సెరవ'కు ఉపారోపం.

సెరాయి రూ.చూ. షరాయి. వి. పైజమా.

సెలసు

సెలవిల్లు తాళ్ల.సం. 9.11.

సెల్లా వి. **6.** మొండెము.

సేంతమూకుదు 'సేనెదోస' తర్వాత పఠించాలి.

సేంతొట్టి 'సేనెదోస' తర్వాత పఠించాలి.

సేపు[2] వి. యాపిల్‌పండు.

హిం. సేబ్ ఫలవిశేషం.

<హిం. సేబ్.

సేర రూ.మా. చేర[1]. వి. **1.** పుడిసిలి; **2.** రేక, చేద, నీళ్ళుతోనే సాధన విశేషం.

సైకము క్రి.విఐ. **1.** అందంగా; **2.** మంచిగా.

సైకిలిస్టు వి. సైకిలు తొక్కే వ్యక్తి.

ఇం. *Cyclist* సైకిలు తొక్కే వ్యక్తి.

<ఇం. Cyclist.

సైకిల్ మోటర్ వి. ఆటోరిక్షా.

ఇం. *Bycycle* సైకిల్, *Motor.*

<ఇం. Bycycle motor.

సైక్కెరం వి. సౌకర్యం.

సం. సౌకర్య- వెసులుబాటు, సౌలభ్యం.

<సం. సౌకర్య-.

సైంధవుదు వి. పనులకు అడ్డుతగిలే అల్పవ్యక్తి.

సం. సైంధవ-. ధృతరాష్ట్రుని అల్లుడు, సింధుదేశాధిపతి.

<సం. సైంధవ-. (అర్థవిపరి.).

సొద్ద రూ.మా. సజ్జ[2]. వి. ధాన్య విశేషం.

సొర

సొరకాయకోంత వి. **1.** లేనిదాన్ని చెప్పటం; **2.** గొప్పలు చెప్పటం.

సొలెం వి. మెరవణి, ఊరేగింపు.

సొల్లు వి. అనవసరమయిన వాగుడు; విఐ. ఖాళీ, వట్టి.

సోగాయి వి. చొక్కా.

హిం. సోర్గా. చొక్కా.

<హిం. సోర్గా.

సోచ్చులు వి.బ.వ. వస్తువులు.

సోడా

సోడాబాయి వి. చెడ్డ అలవాట్లకు లోనైనవాడు. హిం.ఉ. భాఈ సోదరుడు.

సోద[1] వి. **4.** ఆకలి.

సోప్[1] వి. గోళీకాయలాటలో అడ్డంగా ఉన్న రాతిని కొట్టటానికి వాడేశబ్దం.

సోప్[2] వి. సబ్బు.

ఇం. *Soap* సబ్బు.

<ఇం. Soap.

సోరు[2] వి. అన్నం.

త. చోర్/సోర్ అన్నం.

<త. సోర్.

సోల

సోలెదు వి. సేరులో నాలుగోవంతు. <సోల + - ఎడు.

పోలగీడు చూ. పోలము.

పోలము

పోలగీడు వి. పారవశ్యం పొందేవాడు. తాళ్ల.సం. 15.14.

పోలాలు వి.బ.వ. పచ్చికందులు.

పోలెడు చూ. పోల.

పోవతి వి. స్నేహం.

పౌర వి. 2. నాలుగు పోగుల దారం.

స్తంబం వి. 8. దీపం.

స్పృహ వి. స్పర్శాది జ్ఞానం, తెలివి.

సం. స్పృహా- ఇచ్ఛ, కోరిక, అసూయ, జ్ఞప్తి.

<సం. స్పృహా- (అర్థవిపరి.).

స్మగ్లరు వి. చట్టవిరుద్ధంగా సరుకుల్ని ఎగుమతి దిగుమతి చేసే వ్యక్తి.

ఇం. *Smuggler* చట్టవిరుద్ధంగా సరుకుల్ని ఎగుమతి లేదా దిగుమతి లేదా ఈ రెంటిని చేసే వ్యక్తి.

<ఇం. Smuggler.

స్మగ్లింగు వి. చట్టవిరుద్ధంగా సరకుల్ని ఎగుమతి లేక దిగుమతి చేయటం.

ఇం. *Smuggling* చట్టవిరుద్ధంగా సరకుల్ని ఎగుమతి లేదా దిగుమతి లేదా ఎగుమతి దిగుమతుల్ని చేయటం.

<ఇం. Smuggling.

స్మోకరు వి. సిగరెట్టు మొ. వాటి పొగను పీల్చే వ్యక్తి.

ఇం. *Smoker* సిగరెట్టు మొ. వాటి పొగను పీల్చే వ్యక్తి.

<ఇం. Smoker.

స్మోకింగు వి. చుట్ట, బీడీ, సిగరెట్టు మొ. వాటి పొగను పీల్చటం.

ఇం. *Smoking* సిగరెట్టు మొ. వాటి పొగను పీల్చటం.

<ఇం. Smoking.

స్లీపరు వి. నిద్రపోవటానికి ఏర్పాటు చేయబడ్డ రైల్వేబోగీ.

ఇం. *Sleeper Coach* నిద్రించటానికి వీలుగా రైల్వే-వారు ఏర్పాటు చేసిన బోగీ.

<ఇం. Sleeper Coach.

స్వయంపాకం వి. (స్వయంగా) వండుకోటానికిచ్చే బియ్యం, పప్పు, కూరలు మొ.వి.

సం. స్వయంపాక-. సొంతవంట.

<సం. స్వయంపాక-. (అర్థవిపరి.).

స్వస్తి వి. ముగింపు. భాగ. 8.545.

సం. స్వస్తి శుభం.

<సం. స్వస్తి (అర్థవిపరి.).

స్వాహా అ.క్రి. అపహరించు, భుక్తం చేసికొను.

సం. స్వాహా యజ్ఞయాగాదుల్లో 'స్వాహా' అంటూ మంత్రపూర్వకంగా దేవతలకి అక్షింతలు, నెయ్యి, దర్భలు మొ. సమర్పించు.

<సం. స్వాహా- (అర్థవిపరి.).

స్వీటు వి. తియ్యని తినుబండారం. విశ. తియ్యని, మధురమైన.

ఇం. *Sweet* తియ్యని, సువాసనకల, సుకరమైన, సులభమైన, తాజా, మధుర పదార్థం.

<ఇం. Sweet.

స్వీపరు వి. నేలను తుడిచి పరిశుభ్రపరిచే వ్యక్తి.

ఇం. *Sweeper* తుడిచే వ్యక్తి.

<ఇం. Sweeper.

హంసగానము వి. 1. దీర్ఘనిద్ర; 2. పనిచెడిపోవటం.

సం. హంసగాన-. హంస యొక్క పాట. హంస చనిపోయేటప్పుడు మాత్రమే పాట పాడుతుందని జనశ్రుతి.

<సం. హంసగాన-. (అర్థవిపరి.).

హంసంచు రూ. అంసంచు. వి. హంస ఆకారంలో పడేటట్లు నేసిన అంచు.

సం. హంస- అంచ.

<సం. హంస -+ అంచు[3].

హంసపాదు వి. 7. అడ్డంకి.

పల్లకీలను మోసేవారు మధ్యలో నిలిపి భుజం మార్చు-పోవటానికి అనువుగా కొయ్యతో చేసిన హంస పాదాకృతి నున్న 4, 5 అడుగుల ఎత్తుకల కర్ర.

హకీకత్తు రూ. అకిఖతు, అకీకత్, అకీకతు.

హంజూబిలీ

ఇం. *jubilee* ఉత్సవం, ఏభై సంవత్సరాలకు ఏదైనా ముఖ్య సంఘటనను పురస్కరించుకొని చేసుకొనే పండుగ.

<హాన్ + ఇం. Jubilee.

హటము వి. కొవ్వు.

సం. హఠ- బలాత్కారం, మొండితనం.

<సం. హఠ-.

హఠాత్తు

సం. హఠ-. అణచివేత, బలాత్కారం, హఠాత్-బలా-త్కారంగా, ఆకస్మికంగా, ఇతరుల అభీష్టానికి విరుద్ధంగా.

<సం. హఠాత్ (అర్థవిపరి.).

హనీ వి. 1. తేనె; 2. ప్రియురాలు.

ఇం. *Honey* తేనె.

<ఇం. Honey.

హనీమూన్ వి. వివాహానంతరం దంపతులు వెళ్ళే విలాస యాత్ర.

ఇం. *Honey moon* వివాహానంతరం దంపతులు సాధారణంగా సెలవులో ఉండి సంతోషంగా గడిపే తొలి వారాలు.

<ఇం. Honey moon.

హమాలీ వి. బరువు మోసే కూలి.

అర. హమ్మాల్ కూలి, బరువుమోసేవాడు,

హిం.ఉ. హమాల్

<ఉ. హమాల్.

హంబక్ ఊ. హంబగ్, వి. మోసం.

ఇం. *Humbug* మోసం, మోసగాడు, ఇతరుని పేరు పెట్టుకొని వాని వలెనటించే వ్యక్తి.

<ఇం. Humbug.

హంబగ్ రూ.చూ. హంబక్. వి. మోసం.

హరాము రూ. అరాము. వి. **1.** దొంగ; **2.** నిషేధం.

హిం.ఉ. హరామ్ నిషేధ విషయం, నిషిద్ధ కర్మ, చెడ్డ.

<ఉ. హరామ్.

హరిబీఁకె

సం. హరి-. 'యమానిలేన్ద్రచన్ద్రార్క, విష్ణుసింహాంశు-వాజిషు, శుకాహికపిభేకేషు హరిర్నాకపిలేత్రిషు' (అమరకోశః 3- నానార్థవర్గః 175). హరిశబ్దానికి గుఱ్ఱమనే అర్థం ఉంది.

<సం. హరి + పీఁకె.

హరిబువ్వము

సం. హరి-. ఈ పదానికి విష్ణువనే ప్రసిద్ధార్థం 'బువ్వము' అంటే ఆహారమని అర్థం. ఇది విష్ణుపంక్తి వంటిది కావచ్చు.

<సం. హరి-+బువ్వము.

హరుషంబు వి. సంతోషం. తాళ్ల.సం. 12.159.

సం. హర్ష-. ఆనందం, సంతోషం.

<సం. హర్ష-.

హర్కారా వి. రి 2. వార్తాహరుడు, జాబులు తెచ్చేవాడు.

హవాలా రూ. అవాలా.

హవుజుఖానా రూ.చూ. ఔదుఖానా. వి. **1.** స్నానాల తొట్టి; **2.** నీటితొట్టి.

హవుదుఖానా రూ.చూ. ఔదుఖానా. వి. **1.** స్నానాలతొట్టి; **2.** నీటితొట్టి.

హస్తమి$^2$ రూ.చూ. అస్టం. వి. సెప్టెంబరు రెండో భాగంలో వచ్చే కార్తె.

హాకరు వి. వీథుల వెంట రైల్వే స్టేషన్‌లలోను బస్ స్టాపులలోను తిరిగి అమ్ముకొనే వ్యక్తి.

ఇం. *Hawker* వీథుల వెంట తిరిగి అమ్మేవాడు.

<ఇం. Hawker.

హాటు వి. కారం కల తినుబండారం. విణ. వేడి, ఉష్ణమైన,

ఇం. *Hot* వేడి, ఉష్ణమయిన, కామంకల, తీవ్రమైన, హింసా పూరితమైన, ప్రమాదకరమైన.

<ఇం. Hot.

హాతి వి. తెల్లకాగితం.

హార్మనీ వి. సంగీత సాధన విశేషం.

ఇం. *harmony* సంగీతంలో సరియైన సరళితో సమ-న్వయ పూర్వకంగా ఉండే స్వరాలు.

<ఇం. Harmony.

హార్మోనియం వి. సంగీత సాధన విశేషం.

ఇం. *Harmonium*. సంగీతంలోని సమస్వరత.

<ఇం. Harmonium.

హార్మోనిష్టు వి. హార్మనీ నిపుణుడు.

ఇం. *harmonist* సంగీతాన్ని సమస్వరత నిపుణంగా కలిగేటట్లుగా సాధనచేసిన వ్యక్తి.

<ఇం. harmonist.

హికమత్తు వి. తత్త్వజ్ఞానం.

హిం.ఉ. హిక్‌మత్ తత్త్వజ్ఞానం, కళా కౌశలం, యుక్తి, వైద్య వృత్తి.

<ఉ. హిక్ మత్.

హిజ్డా రూ.చూ. హిజ్రా. వి. నపుంసకుడు, షండుడు.

హిజ్రా రూ. హిజ్డా. వి. నపుంసకుడు, కొజ్జా.

హిం.ఉ. ని హిజ్‌రా షండుడు, నపుంసకుడు, కొజ్జా.

<ఉ. హిజ్‌రా.

హిట్ రూ. హిట్టు. వి. విజయం.

ఇం. *Hit* విజయం, అదృష్టలేశం.

<ఇం. Hit.

హిట్టు రూ.చు. హిట్. వి. విజయం.

హిమ్మతు రూ. ఇమ్మతు.

హిస్పా రూ. ఇస్పా.

హిస్పాదారు రూ.చూ. ఇస్పాదార్.

హిస్సేపు రూ. చూ. ఏసోబు. వి. ఏసోబు, క్రీ.పూ. 6వ శతాబ్దికి చెందిన గ్రీకు కల్పిత కథానికా సంకలనకర్త.

హీరా వి. వజ్రం.

హిం.ఉ. హీరా వజ్రం.

<ఉ. హీరా.

హీరో వి. నాయకుడు.

ఇం. *Hero* విశిష్ట ధైర్యసాహసాలు కలవాడు, శిష్ట గుణగణాలు కలవాడు, నవలలు నాటకాలు మొ. వాటిలో నాయకుడు.

<ఇం. Hero.

హీరోయిను వి. నాయకురాలు.

ఇం. *Heroine* విశిష్ట ధైర్య సాహసాలు కల స్త్రీ, నవలలు, నాటకాలు మొ. వాటిలో నాయకురాలు.

<ఇం. Heroine.

**హుండి 4.** వరకట్నం.

**హుందా**

హిం.ఉ. ఉహ్‌దా, ఓహ్‌దా, హుద్దా ఉన్నత స్థితి, దర్జా, పదవి.

<ఉ. హుద్దా.

**హూనము**

సం. ఊన-. హీనం, తక్కువైంది, కొరవడినది.

<సం. ఊన-.

**హేంకీ** వి. జేబురుమాలు, చేతిగుడ్డ.

ఇం. *Hand-kerchief* చేతిగుడ్డ, ముక్కు తుడుచుకొనే చిన్న చతురస్రంగుడ్డ.

<ఇం. Handkerchief.

**హేంగర్** వి. బట్టలు మొ. వాటిని వేలాడతీయటానికి ఉపయోగపడే వస్తు విశేషం.

ఇం. *Hanger* వేలాడేది, దేనినైనా వేలాడతీయటానికి ఉపయోగపడేది.

<ఇం. Hanger.

**హేటు** వి. టోపి.

<ఇం. Hat.

**హేండిల్**

**హేండిల్‌చేయు** స.క్రి. నిర్వహించు.

**హేమాహేమీలు** రూ. హేమాహేములు. వి.బ.వ. **3.** మోసగాళ్ళు.

"అతనుడు, అధికుడు, అధికృత్యుడు, ఉదాత్తుడు, ఉదారుడు, కైవల్యుడు, ఘనుడు" అనే ఏడుగుర్ని హేమాహేమీలు అని కొందరు తెలిపారు.

సం. హేమా, హేమ-. ఈ ఇద్దరూ కవలలనీ సమర్థులనీ కొందరు తెలుపుతున్నారు. ఈ కవలలగురించి పురాణాలలో పరిశీలించాలి.

<సం. హేమాహేమ-. (అర్థవిపరి.).

**హేమాహేములు** రూ.చూ. హేమాహేమీలు. విణ. వి.బ.వ.**2.** వీరులు; **3.** మోసగాళ్లు.

**హైజాక్** వి. విమానాన్ని దొంగిలించి దారి మళ్ళించు.

<ఇం. Hijack దొంగిలించు, వాహనాన్ని దాని సరుకుతో సహా దొంగిలించు.

<ఇం. Hijack.

**హైజాక్‌చేయు** అ.క్రి. విమానాన్ని దొంగిలించిదారి మళ్ళించు.

**హైవే** వి. ప్రధాన మార్గం, ముఖ్యమైన రహదారి.

ఇం. *High way* ముఖ్యమార్గం.

<ఇం. High way.

**హొమ్ము** రూ.చూ. ఒమ్ము[1]

**హోదా**

హిం.ఉ. ఉహ్‌దా, ఓహ్‌దా, హుద్దా ఉన్నత స్థితి, దర్జా, పదవి.

<ఉ. ఓహ్‌దా.

**హౌదుఖానా** రూ. చూ. ఔదుఖానా. వి. **1.** స్నానాలతొట్టి; **2.** నీటితొట్టి.